# విస్మృత యాత్రికుడు

( నవల )



*

రచన :

రాహుల్ సాంకృత్యాయన్

అనువాదం :

ఆలూరి భుజంగరావు

*

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రంబిల్డింగ్స్, విజయవాడ-520004



ప్రచురణ నెం. 853

ప్రథమ ముద్రణ : మార్చి 1965

ద్వితీయ ముద్రణ : మార్చి 1977

ప్రతులు : 2000



వెల : రు. 12-00

ముద్రణ :

స్వతంత్ర ఆర్టు ప్రింటర్స్

విజయవాడ-4

# ముందుమాట

చరిత్ర విద్యార్థినీ, ద్రిమ్మరినీకూడా ఐన కారణంగా "విస్మృత యాత్రికుడు" వంటి యితిహాస ప్రధానమైన రచనవైపు నా మనసు పోవడం సహజమే. ఇలా చేయడంవల్ల నేను ఒక చరిత్రకారుని, పర్యాటకుని బాధ్యతలను మాత్రమే పూర్తిగా నిర్వహించగలిగానని విన్నవించుకుంటున్నాను. అందుకే కేవలం నవలా ప్రేమికులైన పాఠకులకు యిందులో ఎంతో కొంత లోపాన్ని ఎత్తి చూపడానికి అవకాశం లభించవచ్చు. అటువంటి పాఠకులకు, నాకు దృక్పథాలలో నున్న అంతరం ఇక్కడ గమనార్హమైనది. ఐతే సంభావ్యములైన అటువంటి దోషాల నెన్నిటినో నేనుకూడా అంగీకరించడానికి సిద్ధంగానే వున్నాను. కాని, తొలగించడానికి మాత్రం అశక్తుణ్ణి.

అవి తొలగించాలంటే వాటితోపాటు కొన్ని సత్యాలనుకూడా తొలగించడం తప్పని సరవుతుంది. అటువంటి ధైర్యం నాకు లేదు. గత కాలపు సమాజాన్ని వాస్తవిక రూపంలో, నిజాయితీతో చిత్రించడం నా ప్రప్రథమ కర్తవ్యంగా భావిస్తున్నాను. చరిత్రాత్మక నవలను తత్కాలీన దేశకాల పాత్రములకు, చరిత్రకు, భౌగోళిక సత్యాలకు విరుద్ధమైన అసంగతాలతో నింపడం క్షమార్హం కాని నేరమనే నా దృఢాభిప్రాయం. "విస్మృత యాత్ర" లోనే నా నియమాన్ని ఎంతవరకు పాటించానో, దాని కెంత ప్రాధాన్యత నిచ్చానో సహృదయులైన పాఠకులు యిట్టే గ్రహించగలరు.

నరేంద్రుడు కల్పిత వ్యక్తికాదు. ఆయన మన దేశంలోనే (ఇప్పుడు పాకిస్తాన్‌లో) ఉద్యానభూమిలో క్రీ. శ. 518లో జన్మించాడు.

నరేంద్రుడు ప్రవ్రజ్యం స్వీకరించినతరువాత భారత్, సింహళ, బ్రిమ్మరుల, చైనా, మధ్యాశియా దేశాలలో పర్యటించాడు. చివరకు నూతన సియాక్, పురాతన ఖాద్ ఆన్ మహానగరంలో యశఃకాయుడైనాడు. నరేంద్రుని గురించి చైనా సాహిత్యంలోవున్న వివరణను నేను మొదటి అధ్యాయాలలో వ్రాశాను. ఈ విషయం నేను డా॥ పి. చావూగారి ద్వారా సేకరించాను. అందుకు వారి కెంతో కృతజ్ఞుణ్ణి.

నరేంద్రుడు ఉద్యానభూమిలో క్షత్రియపరివారానికి చెందినవాడు. ఆయన 17 సంవత్సరాల ప్రాయంలోనే "భిక్షు దీక్ష"ను స్వీకరించాడు. 21 వ ఏట బౌద్ధ సంఘం ఆయనకు "ఉపసంపద"ను కూడా యిచ్చింది. భిక్షువు కాకముందే బుద్ధధాతు నిక్షిప్తములైన ప్రదేశాలను చూడాలనే ఆకాంక్ష నరేంద్రుని కుండేది. బౌద్ధమత సంబంధముగల అనేక ప్రదేశాలను ఆయన సందర్శించాడు. దక్షిణాన సింహళము, ఉత్తరాన హిమాలయాలు దాటి చాలా దూరం వరకూ పర్యటించాడు. "శీలాన్ని మౌనంగా అభ్యసించడంవల్ల, ఆర్యఫలం (మార్గం, నిర్వాణం) సిద్ధిస్తాయని, లేని పక్షంలో నీ యాత్ర అంతా వ్యర్థమే"ననీ తనకొక స్థవిరు డొకమాటు సలహా యిచ్చాడు కాని నరేంద్రు డందు కంగీకరించలేదు.

సింహళం నుండి తిరిగి వచ్చాక, ఆయన కొంత కాలం ఉద్యానం లోనే వుండిపోయాడు। అక్కడి ఆహారం అగ్నికాహుతైన పిమ్మట బహుశా సహాయార్థమే కావచ్చు-ఐదుగురు భిక్షువులతో హిమాలయాలకు వుత్తరంగా ప్రయాణించాడు. హిమాలయాల నధిరోహించాక, అక్కడ రెండు మార్గా లెదురయ్యాయి. ఒకటి మానవులది. వేరొకటి దానవులది. అక్కడే మిత్రుడొకడు దారితప్పి, దానవుల మార్గాన్ని అనుసరించాడని తెలిసికొని, నరేంద్రు డటువైపు పరుగెత్తాడు. కాని లాభం లేకపోయింది. అప్పటికే దురదృష్టవశాత్తు మిత్రుడు దానవుల చేతుల్లో మరణించాడు నరేంద్రుడు మాత్రం విద్యా ప్రభావంవల్ల బ్రతికి బయటపడ్డాడు. కని మార్గ మధ్యంలో దొంగల ముఠాకు చిక్కాడు. అదే విద్యా ప్రభావం యిక్కడ కూడా పని చేసింది. నరేంద్రుడు నిరపాయంగా యివతలకు వచ్చాడు. అటు తరువాత ఉత్తరంగా గమనం సాగించి, ఆవారుల

(ద్రిమ్మరుల) దేశం చేరుకున్నాడు. తోర్కుల విప్లవం లేవదీసినందువల్ల పశ్చిమానికి మళ్ళి, ఉద్యానం చేరుకొనే అవకాశం లేకపోయింది. అందుకే ఉత్తరంగా పోయి "సీ-హాయి" (నీలిసముద్రం) తీరానికి చేరుకున్నాడు. తోర్కుల దేశానికి "సీ-హాయి"కి మధ్య దూరం 700 "లీలు" (రెండు వేలమైళ్ళు) కంటే అధికం. ఐతే ఆ ప్రాంతమంతా చాలా అశాంతిగా వున్నట్లు నరేంద్రుడు గమనించాడు. అందుకే తన గమనం మళ్ళించి చైనాలో ఉత్తర ఛీ వంశపు రాజధాని (క్రీ. శ. 550-556) హోనా (ఏహ్) వెళ్ళాడు.

అక్కడ సమ్రాట్టు వేన్ ఘయేన్ (550-556) ఆయనకు సాదరంగా స్వాగత మిచ్చాడు. సుప్రసిద్ధమైన ధియేన్ పింగ్ విహారంలో ఆయనకు మంచి వసతి నేర్పాటు చేశాడు. చక్కటి భోజన సదుపాయం కలుగ చేశాడు. రాజప్రాసాదంలోని పురాతన సంస్కృత గ్రంథాల ప్రతులను ఆయనకు అప్పగించి, చీనా భాషలో నిష్ణాతులైన బౌద్ధ పండితులను సహాయమిచ్చి అనువాద కార్యక్రమానికి యితోధిక సహాయసహకారాలను కలిగించాడు. నరేంద్రుడు తనకు అవకాశం లభించినప్పుడల్లా తాను మొదట అభ్యసించిన మంత్రాలను (బౌద్ధ ధర్మశ్లోకాలు) వల్లిస్తుండేవాడు.

చీనా వచ్చిన కొద్ది కాలానికే సమ్రాట్టు నరేంద్రుణ్ణి బౌద్ధసంఘానికి ఉపనాయకుణ్ణి జేశాడు. ఆ తరువాత ఆ సంఘానికి నరేంద్రుడే నాయకుడయ్యాడు. తనకుపదవి వల్ల లభించే ఆదాయంలో ఎక్కువ భాగాన్నతడు బీదసాదల కొరకు, బౌద్ధ భిక్షువుల సహాయం నిమిత్తం, జంతువులకు గడ్డి, గాదం ఏర్పాటు చేయడానికి వెచ్చించే వాడు. సమిష్టి ఉపయోగార్థమై నరేంద్రుడు ఎన్నో బావులను త్రవ్వించాడు. వాటిలోంచి తాను స్వయంగా నీరు తోడిపోసి తృషితుల పిపాసను తీర్చేవాడు. రుజాగ్రస్తులైన స్త్రీ పురుషుల సహాయార్థమై నరేంద్రుడొక చికిత్సాలయాన్ని కూడా ఏర్పాటు చేశాడు. "జిన్ జుక్" లో పశ్చిమ పర్వతాగ్రంపైన మూడు విహారాలను కట్టించాడు. నరేంద్రుడు తరచు తోర్కుల నివాసాలకు వెళ్ళి, కనీసం నెలకొకమారైనా మాంసాహారాన్ని విసర్జించమని, ఆహారార్థమై మేకల్ని చంపవద్దని బోధించేవాడు. ఒకసారి నరేంద్రుడు అస్వస్థుడైనప్పుడు,

సమ్రాట్టు–సామ్రాజ్ఞి స్వయంగా అతని యోగక్షేమాలు తెలుసుకోడానికి ఆరామానికొచ్చారు అక్కడ ఇప్పటి వరకు ఎవరికీ ఇటువంటి మాన్యత లభించలేదు.

క్రీ.శ. ఉత్తరార్ధంలో "చా" వంశాన్ని "ఉత్తర చావూ" వంశం (557-81) నామరూపాలు లేకుండా నాశనం చేసింది. క్రీ. శ. 572 లో "చావూ" మతానుయాయి ఐన సమ్రాట్ "వూకనె" పరిపాలకుడై, బౌద్ధ మతాన్ని, బౌద్ధ విహారాలను నేలమట్టం చేయాలని సంకల్పించాడు. అటువంటి విపత్కరస్థితిలో నరేంద్రుడు మారువేషం ధరించి చరించవలసి వచ్చింది. లోపల భిక్షు చీవరం వున్నా, పైకిమాత్రం గృహస్థు వేషంతో ప్రాణాలు అరచేతుల్లో వుంచుకొని తిరిగాడు నరేంద్రుడు. ఏదో విధంగా జీవించి ఉండటానికి ఎనలేని యిక్కట్లననుభవించాడు. 587 లో నూతన రాజవంశ స్థాపన జరిగి "బేన్ తోన్" అధికారానికి వచ్చాడు.

నూతన రాజ వంశ ఆరంభంలోనే బేన్ తోన్ బౌద్ధ సూత్రాల అనువాదం కొరకు నరేంద్రుణ్ణి ఆహ్వానించాడు. విదేశ భిక్షువులకు స్వాగతికునిగా వుండ వలసిందిగా కూడా ఆయనను అర్థించాడు, నరేంద్రుడీ నిమంత్రణను సహర్షంగా అంగీకరించాడు. తన కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించాడు.

నరేంద్రుడు 80 ఆహ్నికాలను, (ప్రతి అహ్నికకు 700 శ్లోకాలుంటాయి) 16 గ్రంథాలను అనువదించాడు. యాభైకు మించి దేశాలను చూడడానికి ఒక లక్ష పదిహేను వేల "లీలు" (యాభై వేల మైళ్ళు) యాత్రలు చేయడానికి 40 సంవత్సరాలు వెచ్చించి - 589 లో తనువు చాలించాడు.

డా॥ పి. చావూ వ్రాసిన ఈ వాక్యాలవల్ల నరేంద్రుడి వ్యక్తిత్వం కొంత వరకు మనకు వ్యక్తమౌతుంది.

"అన్ని లోపాలు వున్నప్పటికీ మన మహా యాత్రికుణ్ణి ఈ గ్రంథం ద్వారా మనం సంస్మరించుకోకలిగితే నా శ్రమఅంతా ఫలించినట్లే భావిస్తాను."

"విస్మృత యాత్రికుడు" లోని చాలా భాగాలు ఢిల్లీనుండి వెలువడే "సాప్తాహిక", "హిందూస్తాన్" పత్రికలలో ధారావాహికంగా వెలువడ్డాయి. అవి చదివిన మిత్రులు అనేక మంది ఆసక్తిదాయకమైన ఉత్తరాలు వ్రాశారు. తమ తమ సందేహాలు వెలిబుచ్చారు. నేను వ్రాసిన 'సింహ సేనాపతి' చదివి పీఠికలో వ్రాసిన "యిటుకలను" దర్శించడానికి చాల మంది మిత్రులు పాట్నా మ్యూజియంకు పరుగెత్తారు కూడాను. నిజంగా అదంతా యథాతథంగా యిటుకల మీద వ్రాయబడి వుంటే అప్పుడది నవల అవదు. ఇటుకల దర్శనార్థమై వచ్చిన మిత్రులు, అది ఒక చరిత్రాత్మకమైన నవల అనీ, తత్కాలీన దేశకాల పాత్రల పరిధి నుండి వెలికి రాలేదని గ్రహించివుండవలసింది. అలాగే "విస్మృతయాత్రికుడు" ని గురించి కూడా అనేకమంది ప్రయత్నించారు. నా చారిత్రక రచనలన్నీ నవలలే. చరిత్రలుగానీ, జీవిత చరిత్రలుగానీ కావు.

ఋగ్వేద కాలీన ఆర్యులకు సంబంధించిన ఒక నవలను "సుదాసు" పేరుతో వ్రాయడానికి యిప్పుడు సన్నాహాలు చేస్తున్నాను. నేటికి మూడు సహస్రాబ్దాలకు ముందుగల సమాజానికి ఈనాటి సమాజానికి మధ్యగల భేదం సామాన్యమైనది కాదు. కొన్ని కొన్ని విషయాలలో ఆ సమాజం ఎంత భయంకరంగా వుంటుందంటే, యిప్పటివారు కొందరు దాన్ని వినడానికికూడా సమ్మతించరు. నా "ఓల్గానుండి గంగ" వంగానువాదాన్ని సమీక్షిస్తూ ఒక విమర్శకుడు "దాన్ని వెంటనే నిషేధించవలసింది" గా ప్రభుత్వానికి సలహా యిచ్చాడు. ఇటువంటి దుష్ప్రేరణలను భయపడి తన కర్తవ్యం నుండి విముఖుడవటం ఏ రచయితకు కూడా శోభస్కరంకాదు. ఐనా కేవలం కల్పనను ఆధారంగా తీసుకుని 'సుదాసు' మన సంస్కృతిని అవమాన పరచిందని ఎవరూ అనకుండా వుండడానికిగాను, నేను ప్రస్తుతం ఋగ్వేదం ఆధారంగా అనేక పత్రికలకు అనేకానేకంగా వ్యాసాలు వ్రాస్తున్నాను. అవన్నీ మూలాధారాలతో సహ గ్రంథ రూపంలో వస్తాయి. అప్పుడు నిజాయితీగల విమర్శకులకు విషయం స్పష్టం అవుతుంది.

"విస్మృత యాత్రికుడు" 1953 లో పూర్తి చేశాను. "సుదాసు" ముగించడానికి మూడు సంవత్సరాలు పడ్తుంది. దీన్నిబట్టి నాకు నవలా

రచన అనే దొక వ్యాసాంగం కాదని, అభిరుచి మాత్రమేనని స్పష్టమవుతుంది. గ్రంథ రచనలో నా కెంతో అభిరుచివున్నా, అవి వెలుగులోకి రావడం ఎంతో దుర్లభమైపోతోంది.

హిందీలో యిప్పటి వరకు వెలువడిన అంశాలమీద గ్రంథాలు వ్రాయాలని నా సంకల్పం. ఒక పర్యటకునిగా హిమాచలంతో నాకుగల సంబంధం చాలా ఘనిష్టమైనది. నగాధిరాజుకు పరమభక్తుణ్ణి నేను. మన విద్యావేత్తలంతా ఆ నగాధిరాజును గురించి తెలుసుకోవాలి. అది మన కర్తవ్యం.

ఈ విషయమైన వివరాలు తెలుపడానికి నేను హిమాలయాన్ని గురించి వ్రాయడం ప్రారంభించాను. భూటాన్ సరిహద్దులనుండి జమ్ము సీమ వరకు వ్రాశాను కూడ. ఆ గ్రంథాలలో "డార్జిలింగ్ పరిచయ్", "గఢ్వాల్"వెలువడినవి. "గఢ్వాల్" చదివిన వాళ్ళకు నేను ఆ గ్రంథంలో హిమాచలంలోప్రతిఅంగాన్ని ఏ విధంగా చిత్రించడానికి ప్రయత్నించానో వేరే చెప్పవలసిన అవసరం లేదు.

"నేపాల్", "గఢ్వాల్" కన్నా బృహత్తరమైన గ్రంథం. (1200 పేజీలు) చాలా శ్రమకోర్చి, కష్టపడి వ్రాశాను. ఇంగ్లీషులో కూడా దానికి దీటురాగల గ్రంథం లేదనడం అతిశయోక్తి కాదు. అయితేనేం, గ్రంథాలు ముగిసి మూడు సంవత్సరాలయినా 900 పేజీలు మాత్రమే ముద్రించబడి, యిప్పుడది పురుగులకు, పిపీలికాలకు, మూషికాలకు గురౌతోంది. "కుమాఁవూఁ" స్థితికూడా అలాగే వుంది. "జౌన్‌సార్-దెహరాడూన్"ను యిప్పటి కెవరూ అడుగనే లేదు. "యమునా తటం నుండి చీనాబ్ తటం వరకు", "హిమాచల ప్రదేశ్"గ్రంథాలు వంద ఫారాలు అనే మాట వినే ప్రచురణ కర్తలు చెవులు మూసుకుంటున్నారు. ఇంకా "జమ్మూ-కాశ్మీర్", "భూటన్ పూర్వోత్తర్" రెండు గ్రంథాల్ని వ్రాసి, హిమాలయాన్ని పాఠకుల ముందుంచాలని నా కెంతో కోరిక వుండేది. ఇప్పటికీ, నే నా సంకల్పాన్ని త్యజించలేదు. కాని ఇంతా వ్రాసి పురుగులకు తినిపించడమంటే భయమేస్తోంది.

హిమాలయానికి సంబంధించినవే కాక, మనదేశపు కావ్యవీధులను సంగ్రహ రూపంలో రచించాలని నాకెంతో ఆసక్తి. ఆ దృష్టితోనే "హిందీ కావ్యధార" వ్రాసి ఎనిమిదవ శతాబ్దం నుండి పన్నెండవ శతాబ్దం వరకూగల అపభ్రంశ భాషా కవుల సుందర కృతులను, కళాత్మకంగా చిత్రించాను. దక్షిణ కావ్యధార పూర్తిచేసి ఐదు సంవత్సరాలైనా, యిప్పటికి ఒక్క ఫారం ప్రూఫ్ మాత్రమే నావద్ద కొచ్చింది.దాని ప్రెస్ కాపీ పురుగులకు ఆహారం కాకుండా వుండగలుగుతుందో లేదో చెప్పడం కష్టం.

"సంస్కృత్ కావ్యధార" యిప్పుడే ముగించాను. ఋగ్వేద కాలం నుండి అంతిమ కాలం వరకుగల 50 మంది కవుల సూక్తాలను కాల క్రమంగా ఉదహరించాను. గ్రంథంలో కుడివైపు మూలం, ఎడమ వైపు హిందీ అనువాదం వున్నాయి ఇది ఎనిమిది తొమ్మిది వందల పేజీల గ్రంథం.

ఇంత కృషి ఎవరికి భోజ్యం కానున్నదో తెలియదు.ఏది ఏమైనా యిలాగే "పాళీ కావ్యధార", "ప్రాకృత కావ్యధార" రెంటినీ సంకలనం చేయాలనే నా సంకల్పం.

రెండు సంవత్సరాలు రష్యాలో పర్యటించి, అవసరమైన అధ్యయనం గావించి విశేష సామాగ్రిని సేకరించి వ్రాసిన "మధ్య ఆసియా కీ ఇతిహాస్" మూడు సంవత్సరాలనుంచీ ప్రెస్‌లోనే వుంటూంది. రచయితా స్తబ్దుడే, ప్రకాశకుడు మరీ స్తబ్ధు. ప్రెస్ నడకనుబట్టి 250 ఫారాల ఆ ఉద్గ్రంథం ఎప్పుడు వెలుగుచూస్తుందోచెప్పలేం. పబ్లిషర్ చెప్పే మాటల్ని విశ్వసిస్తే వచ్చే సంవత్సరం అది తప్పక వెలికిరావాలి.

పై ఉదాహరణలను బట్టి, రచయిత తన గ్రంథాలు వెలుగు నోచుకొనేట్టు చేయానికి ఎన్ని యిబ్బందులు పడాలో స్పష్టమవుతుంది. అయితే నవలలు మాత్రమే చూచుకుంటే నా రచనలకు అటువంత యిబ్బ ది లేదు. "విస్మృత యాత్రికుడు" వ్రాసిన మూడు సంవత్సరాలకు ముద్రణకు వచ్చిం దంటే అది ప్రకాశకుల లోపంవల్లకాదు. దీని ప్రెస్

కాపీ యిచ్చి వుంటే ఈ పాటికి మరాఠీ అనువాదం కూడా అప్పటి కప్పుడే ప్రచురింపబడి వుండేది.

"కితాబ్ మహల్" యజమాని శ్రీ శ్రీనివాస అగర్వాల్ "విస్మృతి యాత్రికుడు", నా యితర గ్రంథాలను ప్రచురించినందుకు వారి కెంతో కృతజ్ఞుణ్ణి.

పుస్తకం నేను చెప్తూండగా విశేష తత్పరతతో టైపు చేసిన మిత్రులు శ్రీ మంగళ్‌దేవ్ పరియార్‌కు కూడా నేను కృతజ్ఞుణ్ణి.

మసూరి,
12-11-'55

రాహుల్ సాంకృత్యాయన్

# 1 వ అధ్యాయం

# బాల్యం

*(క్రీ. శ. 518-527)*

"బోలోర్" నుండి ఉద్యాన ప్రదేశానికి వెళ్ళాలంటే, పర్వత లోయల్నీ, అఖాతాలనూ ఎన్నింటినో దాటాలి. ఈ అఖాతాలపై వంతెన లుండవు. ఇనుప గొలుసుల సాయంతో వీటిని దాటాలి. అది అతి ప్రమాదకరమైన పని. ఇనుప గొలుసును నోటితో పట్టుకొని క్రింద అఖాతంలోకి వేళ్ళాడుతూ యాత్రికులు వీటిని దాటుతారు. క్రిందికి దృష్టిని పోనిస్తే ప్రవాహం దృష్టికి అనంత లోతులో వుంటుంది. యాత్రికుడు గొలుసును వదిలాడా, కొన్ని వేల అడుగుల అథఃపాతాళంలోకి పోయి పడతాడు. కనుకనే గాలి తీవ్రంగా వీచే సమయాల్లో ఈ అఖాతాల్ని దాటటానికి ఎవరూ సాహసించరు. ఈ ఉద్యాన భూమికి ఉత్తర దిశన పామీరు పర్వత శ్రేణు లున్నాయి. దక్షిణాన భారతదేశం వుంది. ఇక్కడి వాతావరణం చాలా సుఖకరంగా వుంటుంది. ఈ ఉద్యానభూమి కొన్ని వందల క్రోసుల విస్తృతిని కలిగివుంది. ఇక్కడి భూములు చాలా సారవంతమైనవి. కనుకనే అత్యధిక జనసంఖ్యతో అలరారుతోంది ఈ దేశం. ఈ దేశపు రాజ శాకాహారి, ప్రత్యేకమైన తిథుల్లో నిష్ఠతో ఉపవాసం వుంటాడు. ఆనాడు మృదంగం, శంఖం, వీణ, వేణువు — మొదలుగాగల వాద్యాలు మ్రోగుతుండగా రాజు, బుద్ధ భగవానుణ్ణి పూజిస్తాడు. అపరాహ్ణానంతరం అతడు తన రాచకార్యాలను చూచుకుంటాడు. ఈ దేశంలో అసలు మృత్యుదండనే లేదు. ఎవడైనా నరహత్యకు పాల్పడితే, రాజు అతడికి మృత్యుదండన విధించడు. కొంత ఆహారాన్నిచ్చి నిర్జన పర్వతాల్లోకి పంపించి వేస్తా డతణ్ణి. అదే హంతకుడికి విధించే

శిక్ష... ఇక్కడి ప్రజలు నదీజలాన్ని, చిన్న చిన్న కాలువల ద్వారా తమ భూములకు మళ్ళుపుకుంటారు. ఇలా నదీ జలాలను భూములకు పెట్టుకోవడం వలన ఇక్కడి భూములకు సారవంతమైన ఒండ్రుమట్టి సమృద్ధిగా లభిస్తుంది. ఈ దేశంలో కాయకూరలు అత్యధికంగా కాస్తాయి. వృక్షాలూ, లతలూ సర్వకాలాలలోనూ ఫల-పుష్పాదుల్తో నిండి కనుల పండువుగా వుంటాయి. బౌద్ధ ఆశ్రమణులూ (విద్యార్థులు), గృహస్థులూ రంగు రంగుల పూవుల్తో బుద్ధ భగవానుణ్ణి పూజిస్తూంటారు".

పై పంక్తుల్ని నా జన్మ భూమయిన ఉద్యాన ప్రదేశాన్ని గురించి, సుంగ్-యు అన్ అనే చీనా యాత్రికుడు క్రీ. శ. 518 లో వ్రాశాడు. నా పుట్టుకకూడా అదే సంవత్సరంలో జరిగింది. అప్పటికి ఇరవై సంవత్సరాల క్రితం ఫా-శీన్ (ఫా-హియాన్) అనే చీనా యాత్రికుడు నా జన్మభూమి అయిన ఉద్యానాన్ని దర్శించడానికి వచ్చాడుట. అనేక సంవత్సరాల తరువాత నేనూ చీనాదేశం వెళ్ళాను. చీనా ప్రజలు నిజమైన యాత్రల్ని గురించి వినడానికీ, చదవడానికీ అత్యధికమైన ఆసక్తిని కనబరుస్తారు. నిజమైన యాత్రలను గురించి చదవాలన్న ఆసక్తి నిజంగా ప్రశంసాత్మకమైనది. అలాటివి చదవడం వలన మానవుడి బుద్ధి వికసిస్తుంది. మనుష్యుడు జ్ఞాని అవుతాడు. నా దేశ ప్రజలు కూడా కథాశ్రవణంలో ఎంతో ఆసక్తిని కనబరుస్తారు. అయితే అక్కడి ప్రజలకు యథార్థ గాథలకంటే, కల్పిత కథలు వినడంలో ఎక్కువగా ఆనందం లభిస్తూ వుంటుంది.

నా మాతృదేశం (భారతదేశం) లోనూ ఎంతోమంది మహా యాత్రికులు ఉద్భవించారు. అనేకమార్లు భూ ప్రదక్షిణం చేసిన మహానుభావులు కూడా నా జన్మభూమిలో పుట్టారు. ఇప్పుడు (క్రీ. శ. 588 లో) ఒక్క చీనాదేశంలోనే నా దేశపు బౌద్ధభిక్షువులు వేలసంఖ్యలో వున్నారు. మహా పండితులైన బౌద్ధ భిక్షవులు, బౌద్ధమత ప్రచారం కొరకు అనేకమార్గాల గుండా అనేకమైన కష్టాలను సహించి ఇక్కడికి వచ్చారు. నా దేశంలోని బౌద్ధసంఘాలు ప్రతిసంవత్సరం వందలసంఖ్యలో మతప్రచారకుల్ని అన్య దేశాలకు పంపుతున్నాయి. అయితే, అన్యదేశాలకువెళ్ళే ఈమత ప్రచారకులకు తాము వెళ్ళవల్సిన దేశాన్ని గురించిన వివరాల్ని తెల్సుకోవడం ఒక

ముఖ్య సమస్యగా తయారవుతుంది. ఏమార్గాలనుండి వెడితే తాము వెళ్ళ దలచుకున్న దేశాల్ని చేరుతారో, మార్గమధ్యంలో ఎలాంటి కష్టాలనూ, ప్రమాదాలనూ ఎదుర్కొనవలసివస్తుందో తెలియదు. వాటిని గురించి, అంతకు క్రితం ఆయాదేశాల్లో పర్యటించి వచ్చిన బౌద్ధభిక్షువుల ముఖతా వినవలసిందేగాని మరి వేరుమార్గం లేదు. ధర్మ ప్రచారకులైన నా దేశపు మహాయాత్రికులు తమ అనుభవాలను గ్రంథస్థంచేసివున్నట్లయితే ఎంత బావుండేదో? నాదేశపు మతప్రచారకులు అనేక సంవత్సరాలపాటు ధర్మప్రచారాన్ని గావించి వార్థక్యాన్ని తమ సంఘారామాల్లో గడిపి అక్కడే నిర్యాణాన్ని పొందుతారు. అలాటి మహాప్రచారకుల ధాతువుల్తో, శ్రద్ధాళువులు స్తూపాల్ని నిర్మిస్తారు. తరువాతి తరాలలోని యువక భిక్షువులు ఈ స్తూపాలనుండే ప్రోత్సాహితులై ధర్మ ప్రచారానికి అన్యదేశాలు వెళ్తూంటారు. నేను చైత్యగిరి (సాంచి) లోనూ, ఇతర పవిత్ర స్థానాల్లోనూ మహాప్రచారకులైన సత్పురుషుల స్తూపాలనుచూశాను. మా సంఘారామాలు సదా భిక్షువుల్ని విదేశీయాత్రలకు ప్రోత్సహిస్తుంటాయి. నేను జీవితమంతా యాత్రల్ని సల్పుతూ అనేక దేశాలనుచూశానంటే అది మా సంఘారామాల్లో లభించిన ప్రోత్సాహ ఫలితమే అనాలి.

నిజమైన యాత్రానుభవాల్నిగ్రంథస్థం చేయడంపట్ల భారతీయులు చాలా అనాసక్తిని కనబరుస్తూవుంటారు. నేనూ నా దేశీయుల్ని ఈ విషయంలో అనుకరించి వున్నట్లయితే ఈ నా యాత్రానుభవాలు లిపిబద్ధము చేయబడేవికావు. కాని చీనీ సోదరులను చూశాక నాకూ నా యాత్రానుభవాల్ని గ్రంథస్థం చేయాలన్న ఉత్సుకత కలిగింది. ఏనాటికయినా నా దేశీయులు ఈ గ్రంథాన్ని పొంది దీనినుండి కొంత ప్రయోజనాన్ని పొందగలుగుతారని ఆశిస్తున్నాను.

నేను ఉద్యానభూమిలో పుట్టానని ముందే జెప్పాను. ఎవరి జన్మభూమి వారికిస్వర్గ సమానమైందిగా వుంటుంది. కనుక ఒక దేశం సుందరమైనదనిగాని, మరో దేశం సౌందర్య రహితమైనదనిగాని అనడం గొప్ప మూర్ఖత్వం. అయినప్పటికిఉద్యానం నిజంగాస్వర్గోద్యానం లాంటిది. మా దేశానికి ఉత్తరదిశన పంక్తిబద్ధమై నిలబడివున్న ఎత్తయిన హిమశిఖరాలు ఎంత అందంగా వుంటాయో చెప్పలేను. స్తూపాకారంలోవున్న ఆ

కర్పూర శ్వేత హిమ శిఖరాలను ఎన్నో సంవత్సరాల క్రితం బాల్యంలో చూశాను. ఇప్పుడు డెబ్బది ఏండ్ల వాణ్ణయ్యాను. అపూర్వ సౌందర్యంతో విలసిల్లుతూ నా మనః పటలంపై అంకితమైవున్న ఆ హిమ శిఖరాలను తలచుకుంటే-అంతర్ముఖుడనై కనుగొంటే అద్వితీయమైన, దివ్యమైన సౌందర్యంతో దర్శనమిస్తా యాశిఖరాలు.

ఈదీర్ఘ జీవితంలో నే నెన్నోదేశాలు తిరిగాను. ఎన్నోపర్వతాల్ని ఎక్కాను. యీ ప్రపంచం ఎంత విచిత్రమైందో! సింహళ ద్వీపంలో సంవత్సరం మొత్తంలో రెండేఋతువు లుంటాయి. గ్రీష్మఋతువు, వర్ష ఋతువు. అసలక్కడ చలికాలంలేదు కానీ సింహళద్వీపంలోని శ్రీపాద పర్వతం ఇందుకు అపవాదం. ఆ పర్వతంమీద మాత్రం హేమంతం దర్శనమిస్తుంది. పర్వతాగ్రాలకు పోయినకొలదీ చలి అధికమౌతుందన్న విషయాన్ని మొదటగా అక్కడే తెల్సుకున్నాను. నా జన్మభూమి అయిన ఉద్యానం అంత శీతలంగా వుండడానికి కారణం ఆదేశం ఎత్తయిన పర్వతాలపైన వుండడమేనని కూడా తెల్సుకున్నాను. ఉద్యానం అత్యధికమైన శీతలదేశం. వేసవి కాలంలోనూ ఉన్నివస్త్రాల్ని ధరిస్తూఉంటాముమేము. సింహళంలోని బౌద్ధ భిక్షువులు కుడిభుజాన్ని, తలనూ అనాచ్ఛాదితంగా వుంచుకుంటారు. అసలు వాళ్ళు తమ *చీవరాల్ని కుడిభుజం బయటికి వుండేట్టే తయారు చేసుకుంటారు. అలాగే ధరిస్తారు. కానీ మా ఉద్యాన భూమిలో అలా కుడిభుజాన్ని, తలనూ అనాచ్ఛాదితంగా విడవడమంటే కావాలని మృత్యువును ఆహ్వానించడమే అవుతుంది.

బౌద్ధ భిక్షువులు ఆత్మహత్యను చాలాగర్హనీయ దృష్టితో చూస్తారు. జీవితరక్షణకు నూతనమైన వైద్య విధానాలను ఆవిష్కరించారు. అనేక రకాలైన మందులను తయారుచేసి రోగగ్రస్తులైన ప్రజల్ని మృత్యువు నుండి కాపాడుతూ వుంటారు. కనుకనే మేము-ఉద్యానవాసులం-బౌద్ధ భిక్షువులను భేషజ్య గురువులనికూడా పిలుస్తుంటాము.

ప్రతి బౌద్ధ భిక్షువు విధిగా వైద్యశాస్త్రాన్ని అభ్యసిస్తాడు; రోగులకు సేవచేస్తాడు. కాబట్టి అతి క్రూరమైన వన్యజాతి ప్రజల్లోకూడా బౌద్ధ

---

* చీవరం : అంగీ

భిక్షువులు నిరపాయంగా వెళ్ళిపోతారు. అక్కడా వారికి ఉచిత గౌరవం లభిస్తూంటుంది. నేను వైద్యశాస్త్రాన్ని ప్రత్యేకమైన శ్రద్ధతో ఏమీ అభ్య సించలేదు. అనాయాచితంగా లభించిన కొద్దిపాటి వైద్యశాస్త్ర పరి చయంతో సుదీర్ఘములైన నాయాత్రల్లో రోగాలమండి నన్ను నేనుకాపాడు కోవటమే కాకుండా బాధాద్రష్టులూ, దురదృష్టవంతులూ అయిన అనేక మంది రోగులకు కూడా సహాయం చేశాను.

ఉద్యానం అతి ఉన్నతమూ, అతిదుర్గమమూ అయిన పర్వతాల్లో వుంది. కనుకనే అది—ఉద్యాన ప్రదేశం—అంత శీతలంగా వుంది అను కునే వాణ్ణి. కానీ ఉత్తర దేశాల్లో పర్యటించేటప్పుడు శీత సముద్రపు —బైకాల్ సరస్సు—వొడ్డున మాదేశంలో ఎన్నడూ కనీ వినీ ఎరుగనంత చలిని అనుభవించాను. ఈప్రపంచం చాలా విచిత్రమైంది. పర్యటకుడు —యాత్రికుడు—యీ ప్రపంచంలో విచిత్ర విచిత్రాలను స్వయంగా చూడ గలడు.

నా ఉద్యానభూమి సదా జ్ఞాపకమొస్తూ వుంటుంది. నా ఈ జీవి తాన్ని ప్రసాదించిన ఆ ఉద్యానభూమిలోనే నా అస్తికలను నిక్షిప్తం చేయ గలిగితే ఎంత బాగుండు ననుకుంటాను. ఇది ఒక రకంగా మాతృభూమి మీద పక్షపాతమే అవుతుంది. "తత్‌కుతోత్ర లభ్యం" అన్న బుద్ధ ప్రవచనా న్ననుసరించి నాలాటి బౌద్ధ భిక్షువుకు మాతృభూమీ పరభూమీ అన్న వ్యత్యాసం వుండరాదు. కానీ మాతృభూమియొక్క మధుర స్మర ణలను ఎలా మరువ గలను ?

ఉద్యానభూమిని 'సువాస్తు' అనికూడా అంటారు. ఇప్పటికీ ఆ దేశంలో సువాస్తు-స్వాత్ అన్న పేరుకల నది ఒకటుంది. అక్కడి నదుల్లోని నీరు నీరులాకాక పాలలా వుంటుంది. సుందరమైన గృహాల కారణంగా నా మాతృభూమిని సువాస్తు అనేవారు. అలాగే మధురమైన ఫలోద్యానాల కారణంగా "ఉద్యానభూమి" అనికూడా అంటారు। కపిషా (కాబూల్) ద్రాక్షలు జంబూ ద్వీపమంతట్లోనూ గొప్ప ప్రసిద్ధిని పొందాయి. కానీ ఉద్యాన ప్రదేశపు ద్రాక్షలకంటె కపిషా ద్రాక్షలు ఎక్కువ స్వాదిష్టంగా వుంటాయని నే ననుకోను. అయితే మా ద్రాక్షలు అన్య ప్రాంతాలకు పోవాలంటే అతిదుర్గమమైన పర్వతాలను దాటాలి।

అందువల్లే జంబూద్వీపంలో ఉద్యాన ద్రాక్షలకంటే కపిషా ద్రాక్షలే ఎక్కువ ప్రసిద్ధిని పొందాయి.ఉద్యాన దేశపు అంజీర పండ్లుకూడా మహా మధురంగా ఉంటాయి.

మధ్యప్రాంతపు భిక్షువులు మా దేశపు చలినిగురించి వినినప్పుడు చాలా భయభ్రాంతు లయ్యేవారు.ఏకంగా మా దేశాన్ని తుషారం-తుఖార్, తోఖార్-అనేవారు కూడా. కానీ, అక్కడి నదులను గురించి, ఫలోద్యా నాల్ని గురించి చెప్పినప్పుడు,ఆ దేశాన్ని చూడాలని ఉత్సాహ పడేవారు. మా దేశపు వాతావరణాన్ని, ప్రకృతిని గురించి అన్యదేశీయులకు చెప్పి, అర్థమయ్యేటట్లు చేయడం కొంచెం కష్టమే అవుతుంది. ఉద్యానంలోని ప్రజలకు గానీ, ఈ ఛాంగ్-ఆన్ మహానగరంలోని ప్రజలకు గానీ, గ్రీష్మంలో, వారణాసిలో కాసే ఎండల్ని గురించి చెప్తే అర్థమవు తుందా? మహారాజు లెలాగయితే ఋతువు ల్ననుసరించి తమ నివాసాల్ని మారుస్తుంటారో, మేము అలాగే మూడు ఋతువుల్లోనూ మా గ్రామాల్ని మూడు ప్రదేశాలకు మారుస్తాము. హేమంతంలో మా నివా సాన్ని నదీ తీరాలకు గానీ, మంచు విస్తారంగా కురువని వనప్రాంతాలకు గానీ మారుస్తాము. హేమంతం, శిశిరం గడిచి వసంత ఋతువు వచ్చాక మా పొలాల్లో గడ్డకట్టుకున్న మంచు విడివడుతుంది. ఆకులు రాల్చేసి మోళ్ళయిన చెట్లు తిరిగి చిగురుస్తాయి. అప్పుడు మా నివాసాల్ని పర్వ తాల పైకి మార్చేస్తాము. పర్వతాల పైన, చాలా ఎత్తున పెద్ద పెద్ద పసిరిక మైదానా లుంటాయి. ఈ మైదానాల్లోని నివాసమంటే నా కెంతో ఇష్టం! ఈ పర్వత మైదానాల్లో మంచు చాలా వెనక, క్రింది భూముల్లో వర్షాలు ప్రారంభించాక కరుగుతుంది. పర్వతాలపైన మైదానాలు ప్రారంభ మవడానికి ముందే పెద్ద పెద్ద వృక్షాలు అంత మవుతాయి. ఇక కేవలం పచ్చిగడ్డి మాత్రం దూరాలవరకూ వ్యాపించి కనుపిస్తూంటుంది. ఆ పచ్చగడ్డి ఎంత పొడవుగా వుంటుందో! దాన్లో మేస్తూంటే గొర్రెలూ, మేకలే కాకుండా ఆవులుకూడా కనుపించవు. ఆ గడ్డి ఎంత బలవర్ధకమో చెప్పలేను. ఆ పచ్చగడ్డిని మేసే గొర్రెలు చాలా లావుగా, బలిసి, మాంసంతో పిండి వుంటాయంటారు. దాన్ని మేయడంవల్ల గొర్రెలు

అత్యంతంగా బలుస్తాయనీ,వాటి మాంసం చర్మంలో ఇమడక, చర్మాన్ని చీల్చుకుని బయటికి వస్తుందన్న-అత్యుక్తులు చెప్పుకోవడం కూడాకద్దు.

ఉద్యాన భూమిలోని, గలగలాప్రవహించే జీవనదులు, సారవంతమైన భూములూ, రమణీయమైన పర్వతాలూ - ఆదేశాన్ని శోభాన్వితగా చేస్తున్నాయి. అయితే, అక్కడి దేవదారు వృక్షాలుకూడా మహా అందంగా వుంటాయి! బోధిసత్వుడికి బుద్ధత్వాన్ని ప్రసాదించిన బోధి-రావి-వృక్షమంటే మా కెంతో గౌరవం. పవిత్రమయిన ఆ వృక్షాన్ని దర్శించిన క్షణాన భక్తి ప్రపూరిత హృదయులమై తలలు వంచేస్తాము. బోధి వృక్షాన్ని పూజించి ఎన్ని ఏండ్లు గడిచాయో? ఆ వృక్షం జంబూద్వీపం (భారత వర్షం),సింహళ ద్వీపంలాంటి ఉష్ణ ప్రధాన దేశాల్లో మాత్రమే పెరుగుతుంది. శీతల దేశవాసులు బోధివృక్షాలను తమ దేశాల్లో పెంచడానికి ఎంతో ప్రయత్నించి కూడా విఫలులయ్యారు. గత్యంతరం లేక బోధివృక్షాలను పోలిన ఇతర వృక్షాలనే పూజిస్తుంటారు శీతలవాసులు! బోధివృక్షమంటే నా కెంతో భక్తీ, గౌరవమూను! మృదువైన పచ్చని బోధి పత్రాలు చిరుగాలికి కదుల్తూవుంటే చూడ ముచ్చటగా, కనుల పండువుగా వుంటుంది. కాని, ఉద్యాన భూమిలోని దేవదారు, బోధి వృక్షానికే విధంగానూ తీసిపోదని చెప్పడానికి, నేనే మాత్రమూ సంకోచించను! దేవదారు నిజంగా దేవతల దారే! (వృక్షమే!) ఉద్యాన భూమిలోని దేవదార్ల ముందు ఇక్కడి దేవదార్లు; మహా సంపత్శాలి అయిన కుబేరుడి ముందు నిరుపేదల్లాగ కనుపిస్తాయి. ఎత్తయిన శిఖరాల్లా; పొడవుగావుండి,పర్వతాగ్రాల్ని తమ పచ్చదనంతో నింపివేసిన దేవదార్లు ఎంత మనోహరంగా వుంటాయో చెప్పలేను. ఆ వృక్షాలక్రింద రాలిన ఎండుటాకులు సువాసనలు గుబాళిస్తూ, కృష్ణాజినంలా మహా మృదువుగా సుఖకరంగా వుంటాయి. మేము దేవదారు చెక్కతోనే గృహాలను నిర్మించుకుంటాము. గోడలను కట్టుకోవడంలోనూ, రాతికంటేదేవదారు చెక్కనే అధికంగా వాడతాము. నేను నా బాల్యాన్ని ఎండిన దేవదారు నుండి వెలువడే కమ్మని సువాసనలో గడిపాను. ఇక్కడ, ఈ ఛాంగ్ ఆన్‌లో కూడా దేవదారు చెక్కతోనే చిన్నకుటీరాన్ని నిర్మించుకున్నాను.

అయినా, ఆ సువాసన ఏది? నా జ్ఞాపకాలూ, బాల్యస్మృతులూ నన్ను మోసంచేయడం లేదుకద!

నా మాతృదేశంమీద నాకేమీ అనవసరమయిన పక్షపాతం లేదు. అతిశయోక్తులు దొర్లకుండా వుండడానికి కూడా సాధ్యమయినంత జాగ్రత్త తీసుకుంటున్నాను. కానీ, నా దేశపు సుగుణాలు నన్నునిరంతరం హర్షోన్మత్తుణ్ణి, విహ్వలుణ్ణి చేస్తున్నాయి. వివిధ విషయాల్లోనూ, ప్రతి జాతి ఒక ప్రత్యేకమైన దృష్టికోణాన్నికలిగివుంటుంది. జాతికి జాతికిమధ్య ఆచార వ్యవహారాల్లోనూ, వస్తువుల విలువల్లోనూ ఎంతో వ్యత్యాసం ఉంటుంది. నా మాతృభూమిలో దూరాన్ని క్రోసుల్లోనూ, యోజనా ల్లోనూ తెల్పుతూంటారు. కానీ, ఈ చీనా దేశంలో దూరాన్ని 'లీ' లో తెల్పుతారు. ఒక క్రోసు నాలుగు 'లీ' లకు సమానం. ఉద్యాన భూమిలో గౌరవర్ణం, స్వర్ణకేశాలు, నల్లని కండ్లూ సౌందర్యానికి ప్రతీకలుగా భావింపబడుతాయి. కానీ, ఈ చైనీయులు అలాటి ఆకారాన్ని కోతి ఆకారమంటారు. ఉన్నతమైన పెద్ద ముక్కులు మనకు అందమయినవిగా వుంటాయి. వీళ్ళు అలాంటి ముక్కుల్ని 'మొద్దు ముక్కు' లంటారు. భోజనం విషయంలోనూ జాతికి జాతికిమధ్య రుచి వ్యత్యాసాలుంటాయి. గంధశాలి బియ్యపుఅన్నం చాలా రుచిగా వుంటుందని నేనూ వొప్పు కుంటాను. కానీ, గోధుమ రొట్టెలంత ఇష్టంగా గంధశాలి బియ్యపు అన్నాన్ని నేను తినలేను. మేము ఉప్పువేసి వుడికించిన మాంసాన్ని తింటాము.మగధ దేశస్థులువేయించిన చేపలను చాలా ఇష్టంగాతింటారు. సంగీతంవిషయంలోనూ ప్రతిజాతి ప్రత్యేకమైన అభిప్రాయాల్ని కలిగి వుంటుంది. మేము (భారతీయులం) తంత్ర వాయిద్యాల్ని ఎక్కువ ఆసక్తితో వింటాము. వాటి సుస్వరాలు కర్ణపేయంగా వుంటాయి మాకు. కాని,వీరు, అలాంటి వాయిద్యాలను చాలాతుచ్ఛమైనవిగా భావిస్తుంటారు.

ఉద్యాన నివాసులు చాలా అందంగా వుంటారు. చీనీ యాత్రికులు మాకు, మధ్యప్రాంత (మధ్యప్రదేశం బీహారు) ప్రజలకు వున్న వ్యత్యా సాన్ని గమనించలేదు. ఉద్యానవాసుల వేషభూషల్లోనూ, మధ్యప్రాంత వాసుల వేషభూషల్లోనూ బాగా వ్యత్యాసం వుంది. మధ్యప్రాంతంలో గౌరవర్ణంగా భావించే శరీరపు రంగును మేము నలుపనే అనేస్తాము.

అక్కడ (మధ్య ప్రాంతంలో) గర్భిణీ స్త్రీలు ఆకు కూరల్ని తింటే నల్లని సంతానం కలుగుతుందన్న పిచ్చినమ్మకం ఒకటి వుంది : గర్భిణీ స్త్రీ ఉసిరికాయ పచ్చడి తింటే పుట్టే సంతానం నల్లగా వుంటుం దన్న నమ్మకం ఇప్పటికీ ఆంధ్రదేశ స్త్రీలల్లో వుంది. కాని ఈ నమ్మకాన్ని గురించి మొదటగా విన్నప్పుడు నాకు చాలా నవ్వు వచ్చింది ఆకు కూరలు దొరికే రోజుల్లో,ఉద్యాన భూమిలోని గర్భిణీస్త్రీలు, ఆకుకూరల్ని బాగా తింటారు. అయినా ఉద్యానభూమిలో నల్లనివాళ్ళుగానీ, చామన చాయ శరీరవర్ణం కలవారుగానీ. దివిటీవేసి వెతికినా దొరకరు : రూపం, తల్లిదండ్రులనుండి సంతానానికి లభిస్తుందని నేననుకుంటు న్నాను. చీనా ప్రజల్లోనూ, తురుష్కుల్లోనూ నల్లని శరీరపు రంగు కలవారు అసలు వుండనే వుండరు. వాళ్ళ ముక్కులు అణగి, దౌడల ఎముకలు పైకిలేచి, కండ్లు వంపులు తిరిగి అర్ధస్ఫుటితంగానూ వుం టాయి. మాకు గడ్డాలూ, మీసాలూ దట్టంగా మొలుస్తాయి. కానీ, వీరికి నామమాత్రంగా మాత్రమే గడ్డాలూ మీసాలూ మొలుస్తాయి. జాతికీ జాతికీ మధ్యన వున్న రంగు రూపుల్లోని ఈ వ్యత్యాసాలు వంశ పారం పర్యంగానూ, తల్లిదండ్రులవలనా ప్రాప్తించినవి కాక మరేమిటి ? దేశాటన మానవుల్లోని అనేకమైన మూఢ నమ్మకాలనూ, భ్రాంతులను దూరం చేస్తుంది. కనుకనే కూపస్థమండూకతను అజ్ఞానానికి పర్యాయ వాచిగా భావిస్తుంటారు.

నా తల్లిదండ్రులు ఉద్యాన దేశపు అధిక శీతల ప్రాంతంలోని ఓ గ్రామంలో వుండేవారు. ఆ ప్రాంతపు పెద్ద నదులైన 'కునార్, సువాస్తు'ల ఉద్గమం మా గ్రామానికి చాలా దగ్గర్లో వుంది. ఈ నదుల పుట్టుక స్థానంలోని హిమాచ్ఛాదిత పర్వత శిఖరాలను మేము చాలా దగ్గర నుండి చూస్తూండేవారం : మా గ్రామానికి ఒక వైపునుండి సువాస్తునది ప్రవహించేది. నదీ ప్రవాహం రాళ్ళమీద గలగల శబ్దం చేసుకుంటూ గంభీరగతిలో సాగిపోతూండేది. రాళ్ళమీద ప్రవహించే నీరు తెల్లగా పాలను మరిపిస్తూండేది. చిన్నతనంలో నిజంగా పాలనే భ్రమపడేవారం. కానీ, చేతిలోకితీసుకోగానే నీరని గ్రహించేవారం: మా వూరికిక్రిందుగా ఒక చిన్న నీటిగుంట వుంది. వేసంగుల్లో మే మా గుంటవద్దకు స్నానా

నికి వెళ్ళేవాళ్ళం। ఆ గుంటలో నీరు ఆకుపచ్చా, నీలమూ కలిసిన రంగులో వుండేది. మా వూరికిపైన ఒక కొండవుంది. ఆ కొండ నిండా దేవదారు చెట్లే। చలికాలం వచ్చిందంటే, మేము ఇంటికి తాళంవేసి, పశువుల్ని తోలుకుని క్రిందికి దిగిపోయేవాళ్ళం. అలా గ్రామాన్ని విడిచి వెళ్ళిపోతూన్నందుకు నేను ఎంతో బాధపడేవాణ్ణి. ఒక్కో చలికాలాన్ని మా తాతగారి గ్రామంలోనూ గడుపుతూ వుండేవాళ్ళం. అక్కడ చలి కాలంలో, దాదాపు మూడు వారల మందంగా మంచు కురుస్తుండేది. భూమి యావత్తు మంచులో కప్పబడి పోయేది. కుర్రవాళ్ళం మంచులో అనేక రకాలయిన ఆట లాడుకునేవాళ్ళం. ఒకమాటు మా అమ్మను యిలా అడిగాను : "చలికాలములో మనమూ మన వూళ్ళోనే వుండిపో వచ్చుగా?"

అమ్మ ఇలా అన్నది : "మన గ్రామంలో యిక్కడకంటె కూడా ఎక్కువ మంచు పడుతుంది. అప్పుడప్పుడు మంచు తుఫానులు కూడా వస్తుంటాయి. ఆ తుఫాను దెబ్బకు తట్టుకోలేక ఎక్కడి ఇండ్లు అక్కడ కూలిపోతూంటాయి. అంతే కాకుండా, చలికాలం అంతా మనగ్రామంలో పశుగ్రాసం అసలు దొరకనే దొరకదు.మనం కొద్దిగొప్పా పశుగ్రాసాన్ని ప్రోగుచేసి పెట్టుకున్నా అది ఒకటి రెండు నెలలకంటె ఎక్కువ కాలం రాదు. ఆ తరువాత పశువులు మేతలేక చనిపోవాల్సి వస్తుంది. యిన్ని కారణాలు వుండడంవలననే మనం చలికాలంలో మన గ్రామాన్నివదిలి పర్వతప్రాంత భూముల్లోని, వెచ్చని ప్రదేశాలకు దిగుతూంటాము।"

అప్పుడు బాల్య జీవితానికి సహజమైన చిత్రమైన ఊహల్ని ఊహించేవాణ్ణి ; "ఎంత భీషణ హిమపాతంలోనూ దేవదారు ఆకులు దెబ్బతినవు? పచ్చగానే వుంటాయికనుక, ఆ ఆకుల్నే పశువులు మేస్తే ఇక పశుగ్రాసపు సమస్యే వుండదుగా? చలికాలంలోకూడా మేమూ మా గ్రామంలోనే వుండవచ్చు। హాయిగా, మంచులో ఎన్నో ఆటలు ఆడుకో వచ్చు।" అని అనుకునేవాణ్ణి.

నా తండ్రికి అన్నదమ్ములు నలుగురు. నలుగుర్లోకి నా తండ్రే చిన్నవాడు. మా తాతను నే నసలు చూడనేలేదు. అవ్వ (అమ్మమ్మ)ని మాత్రం బాగా ఎరుగుదును. అవ్వ తల వెంట్రుకలు మంచులా తెల్లగా

శ్రీ ప్తివంతంగా వుండేవి. నేను పుట్టేనాటికి ఆమెకు డెబ్బయి ఏండ్లు నిండా యిట। ఆమె చనిపోయిన సంవత్సరమే నేను ప్రథమంగా ఇల్లు విడిచి దేశాటనకు బయల్దేరాను అంత వృద్ధురాలయినా ముఖాన ఒక్క ముడత వుండేదికాదు అవ్వకు. సాధారణ స్త్రీలకంటే బాగా పొడవుగా, బలంగా, ఆరోగ్యంగా వుండేది మా అవ్వ. ఆమె నాకు రకరకాలైన కథల్ని చెప్తూండేది.

నా పెద్దతండ్రులు ముగ్గుర్లోనూ యిద్దరు బౌద్ధ భిక్షువు లైనారు. మూడవ పెదతండ్రి వివాహమాడాడు. కానీ, పురుష సంతానం కలగ లేదు. యిద్దరు ఆడపిల్లలు మాత్రం కలిగారాయనకు. ఇక మా కుటుంబ మంతటికీ పురుష సంతానం నేనే కావడం వలన మొత్తం కుటుంబమే నన్ను అమిత గారాబంగా చూసేది. నా తరువాత యిద్దరు మొగపిల్లలు కలిగారు మా అమ్మకు. నా తమ్ముళ్ళ పుట్టుక వలననే నేను బౌద్ధభిక్షువును కాగలిగాను. వాళ్ళు పుట్టక పోయినట్లయితే నా కసలు భిక్షుకత్వంలభించేదే కాదేమో। తలిదండ్రుల అనుమతి లేకుండా ఎవరికి భిక్షుత్వాన్ని ప్రసా దించవద్దని బుద్ధుడు సంఘాలకు గట్టి ఆదేశాన్నిచ్చాడు. నా తరువాత పురుషసంతానం లేకపోయినట్లయితే నా తలిదండ్రులు నేను భిక్షువును కావడానికి ఎటూ అనుమతించేవారు కాదు. మూడవపురుష సంతానాన్ని కన్న తరువాత ప్రసవ వేదనకు తాళలేక నాతల్లి ప్రాణాలను వదిలింది. తల్లిపోయేనాటికి నేను పదేళ్ళవాణ్ణి. ఎప్పుడూ తల్లిబెంగతో దుఃఖిస్తూండే వాణ్ణి. మా అవ్వ నా దుఃఖాన్ని అణచడానికి శతవిధాలా ప్రయత్ని స్తుండేది. మా అమ్మ పోగానే మా నాయన రెండవ పెండ్లి చేసుకున్నాడు. ఆమె మాపట్ల సవతితల్లిలా కాక సొంతతల్లిలా వ్యవహరించేది. అందుకు కారణము ఆమె మా అమ్మకు చెల్లెలు కావడమే అయి వుండవచ్చును.

ఉద్యాన భూమిలోని ప్రజలందరూ బౌద్ధ మతానుయాయులు. మా దేశానికి తూర్పున కాశ్మీర దేశము, దక్షిణాన గాంధార దేశము, పశ్చి మాన కపిశా, కాంభోజ దేశాలున్నాయి; పై దేశాల్లోనూ బౌద్ధమతమే ప్రధాన మతం. అయితే ఆ దేశాల్లో వైదిక మతస్థులు కూడా అధిక సంఖ్యలో వున్నారు. తథాగతుని–బుద్ధుని–యొక్క ఉజ్వలమయిన రూపానికి, పవిత్రమయిన వారి ఉపదేశాలకు తగినది. మా ఉద్యాన

భూమేనని నేను భావించేవాణ్ణి. కనుకనే ఉద్యాన భూమిలోని స్త్రీ పురుష బాల వృద్ధులందరూ బుద్ధ భక్తు లయ్యా రనుకునేవాణ్ణి.

ఉపాధ్యాయులు బ్రాహ్మణుల్ని గురించి, ఇతర వైదిక మతానుయాయులను గురించి చెప్తుండేవారు. వారి ఆచార వ్యవహారాల్ని గురించిన గ్రంథాలను చదివిస్తుండేవారు. కానీ, మహేశ్వరుడెవడు? విష్ణువెవడు? వాళ్ళెలా వుంటారో ఊహించడం కష్టంగా వుండేది. మా ఉద్యానంలో వైదిక మతానుయాయుల దేవాలయాలు కానీ, వారి మతగ్రంథాలు గాని ఉండేవి కావు.

ఉద్యాన భూమిలో కొద్దిమంది బ్రాహ్మణులూ వున్నారు. అయితే. వారూ బౌద్ధుల్లో కలిసి పోయి తథాగతుణ్ణే పూజిస్తుండేవారు. కాకపోతే బ్రాహ్మణులన్న దృష్టితో వారిపట్ల కొంచెం అధికంగా గౌరవాన్ని ప్రదర్శిస్తుండేవాళ్ళం! మా దేశవాసుల్లోని అధిక సంఖ్యాకులు క్షత్రియులు. నల్లని శరీర వర్ణాన్ని కలిగిన శూద్రులు మా నదీతీరస్థ గ్రామాలకు తమ వస్తువులను అమ్ముకోడానికి వస్తుండేవారు. మా పర్వతాగ్ర గ్రామాల్లోకి కేవలం వేసంగుల్లో మాత్రం వస్తుంటారు. వాళ్ళు వీరిని శిల్పకారులనే వారు. వీరే మాకు బాణాల్ని, కత్తుల్ని తెచ్చి అమ్ముతుండేవారు. పార, పలుగూ, గొడ్డలి. మొదలయిన వ్యవసాయ సామగ్రినికూడా తెచ్చి అమ్ముతూండేవారు, ఈ శిల్పకారులే వెండిబంగారు నగలను, రాగి ఇనుప పాత్రలను తెచ్చి అమ్మేవారు. మా పాత్రల్లో ఎక్కువభాగం చెక్కవే వుంటాయి.

ఈ విధంగా మా ఉద్యాన భూమిలో మూడు జాతుల ప్రజలు వుంటుండేవారు. వైశ్యుల్ని గ్రంథాల్లో మాత్రం చూస్తుండేవాళ్ళం. బ్రాహ్మణ, క్షత్రియ-రెండు జాతులూ వ్యాపారం చేస్తుండేవి. బ్రాహ్మణుల్లోనూ, క్షత్రియుల్లోనూ రంగు -రూపుల్లో. వేష - భాషల్లో ఎలాటి వ్యత్యాసమూ వుండేదికాదు. మా పరివారం క్షత్రియ పరివారం. మా దేశంలోని చాలామంది క్షత్రియులు తాము శాక్యవంశీయుల మని చెప్పుకుంటారు. తద్వారా అధిక గౌరవాన్ని పొందడానికి ప్రయత్నిస్తుంటారు. శాక్యవంశీయులంటే, శాక్యముని వంశస్థులుకాదు. తుషార దేశాన్నుండి వచ్చిన శక వంశస్థులు. ఈ శకులే జంబూద్వీపాన్ని, కాంభోజ దేశాన్ని

ఇతర అనేక దేశాల్ని చాలా కాలంపాటు పరిపాలించారు. కనిష్కుడు ఈ శకవంశానికి చెందిన వాడే! ఇతడు కట్టించిన గొప్ప సంఘారామాలను, చైత్యాలనూ ఎన్నింటినో చూశాను. ఇక నిప్పుడు శకుల ప్రాధాన్యతకూడా అడుగంటింది. శకులస్థానాన్ని ఏఢాలు ఆక్రమించారు — (వీరినే ఎంతాలనీ అంటారు).

ఏఢా ప్రజల క్రూరత్వానికి సంపంధించిన ఎన్నో కథల్ని అవ్వ చెప్పగా విన్నాను. కాని. ఇప్పుడు వాళ్ళల్లోని క్రూరత్వం చాలా వరకు తగ్గిపోయింది. ఈ ఏఢాలుకూడా మా ఉద్యాన వాసుల్లాగానే వుంటారు. కొంత మందయితే మా కంటేకూడా ఎర్రగా వుంటారు. ఏఢాలు చాలా పరాక్రమ వంతులు. ఉద్యాన వాసులంకూడా పరాక్రమంలో ఎవరికీ తీసిపోము. మరి ఇంత పరాక్రమవంతుల మైనప్పటికి, కొన్నాళ్ళు శకులకు అధీనులమై, మరికొన్నాళ్ళు ఏఢాలకు దాసులమై ఎందువల్ల వుండవలసి వచ్చిందో? మా సఖ్యాబలం చాలా అల్పం.అందువల్లే దాస్యశృంఖలాల్లో బంధింపబడ్డా మనుకుంటున్నాను.మా అవ్వ ఏఢామహా రాజు తోరమాణుణ్ణి చాలా పొగుడుతూండేది. ధర్మప్రభువైన కనిష్కుడి అపరావతార మే'తోరమాణు'డంటూ వుండేది.కానీ అతడి కొడుకు మిహిరక్కులుణ్ణి'(క్రీ.శ.508—47 చెడ తిట్టేది. నేను మిహిరకులుని శాసనకాలంలోనే పుట్టాను. అతడు చనిపోయాక (క్రీ. శ. 547) మూడేళ్ళకు నా మాతృ భూమి అయిన ఉద్యానం నుండి శాశ్వతంగా శలవు తీసుకున్నాను. మిహిరకులుడు రాజ్యానికి వచ్చిన ప్రథమ దశలో అతడు యువ్వనంలో వుండగా అత్యాచారాలను, క్రూరకర్మలనూ చేశాడేమో, నేనతణ్ణి కాశ్మీరులో స్వయంగా చూశాను. అతడి రాజ్యంలో మేము వుంటూనే వున్నాము. నిజం చెప్పాలంటే అతడిలో కానీ, అతడి పరిపాలనలో కాని నేనే విధమైన క్రూరత్వాన్ని చూడలేదు. ఉద్యానవాసులుకూడా మిహిరకులుడి సైన్యంలో సైనికులుగా వున్నారు. ఇతర ప్రదేశాలకు పోయినప్పుడు అయా ప్రాంతం ప్రజలు మమ్మల్ని — ఉద్యానవాసుల్ని — ఏఢాలనీ, హూణులనీ అనేవారు. ఈ చీనాదేశం వచ్చేవరకూ ఏఢాలూ, హూణులూ ఒకే జాతి వారని నేనూ నమ్మేవాణ్ణి. కానీ ఇక్కడికి వచ్చాక హూణులు తురుష్కులకు పూర్వీకులనీ, ఆకారంలో చైనీయుల్ని పోలి వుంటారనీ

తెలుసుకున్నాను. ఈ హూణులు ఒకప్పుడు చైనీయులకు ప్రబల శత్రువులు. వీరి ఆక్రమణలను నిరోధించడానికే వేలమైళ్ళ పొడవుగల బ్రహ్మాండమైన చైనా అడ్డుగోడ కట్టబడ్డది. ఇక ఏథాలు శకవంశ సంబంధీకులు. ఒకప్పుడు హూణులు శకుల దేశాన్ని ఆక్రమించి వారిని తమ మాతృభూమి నుండి తరిమేశారు. అయినా ఏకొద్దిమంది శకులో, హూణుల్లో మిగిలి పోయారు. హూణుల్లో మిగిలిపోయిన ఈ శకులు అనేక విషయాల్లో హూణుల్ని అనుకరించారు. శత్రువుపట్ల దయావిహీనంగా అతిక్రూరంగా వ్యవహరించడంలో ఈశకులు తమ విజేతల్ని కూడా మించిపోయారు. కనుకనే అన్యదేశీయులు శకుల్ని హూణులుగానే భావించి, హూణు లనేశారు. ఉద్యానం, కాశ్మీరం, గాంధారం, కపిషా దేశాల్లో ఎంతో మంది ఏథా సైనికుల్ని, సరదారుల్ని చూశాను. స్వయంగా మిహిరకులుణ్ణి కూడా చూశాను. వాళ్ళ రూపురంగులూ ఆకారాలూ హూణులకుగానీ లేక తద్వంశజులైన అవారులకూ తురుష్కులకుగానీ సంబంధించిలేవు. మిహిరకులుడి ముక్కు మా ముక్కుల్లాగానే ఉన్నతమై కొనదేలివుంది. మీసాలూ గడ్డాలుకూడా మాలాగానే వత్తుగా వున్నాయతడికి! అతడి తండ్రి 'విజితావని అవనిపతి శ్రీ తోరమాణు'డి నాణాలమీద బొమ్మను చూసినట్లయితే, అతడు హూణువంశానికి చెందినవాడు కాదనీ, శకజాతికి ఉపశాఖ అయిన ఏథాజాతివాడనీ స్పష్టంగా తెలిసిపోతుంది. కిదారుడు ఈ ఏథాజాతివాడే; గొప్ప పరాక్రమవంతుడు. అతడే కుషాణుని పరిపాలనను అంతమొందించాడు. మధ్య ప్రాంతంలోని చాలాభాగాన్ని ఆక్రమించాడు.

దుర్గమ పర్వతాల్లో నివసించే మాఉద్యానవాసులకు మిహిరకులుడెవడో, తోరమాణుడెవడో, లేక ప్రపంచంలో ఏ యే రాజులు ఏ యే దేశాల్ని పరిపాలిస్తున్నారో మొదలైన విషయాలు బొత్తిగా తెలియవు. మాకు ఉద్యానమే మహాప్రపంచం... దాన్ని పరిపాలించే రాజే మహాచక్రవర్తి. మేము ఉద్యాన దేశపు రాజధానికి ప్రతి సంవత్సరమూ బుద్ధ జయంత్యుత్సవాన్ని చూడడానికి వెళ్ళే వాళ్ళం! మా ఉద్యానదేశపు రాజు,రాణిచాలా భక్తి శ్రద్ధలతో బుద్ధభగవానుని పూజించే వారా రోజు. భిక్షు సంఘానికి ఘనంగా ఆహారాన్ని,వస్త్రాలను దానం చేసేవారు. ఓ

సంవత్సరం మారాజు ప్రక్కనే ఉచితాసనంమీద కూర్చునివున్న రాజ ప్రతినిధి నొకణ్ణి చూశాను. మా రాజు మిహిరకులుడికి అధీనుడని, అతడి ప్రతినిధి మా రాజు దర్బారులో వుంటాడని అప్పుడే తెల్సుకున్నాను. మిహిరకులుడు తన రాజధాని అయిన కాశ్మీరంలో వుంటాడు. అతడి రాజప్రతినిధి ఆజ్ఞలను మా రాజు తు. చ. తప్పకుండా పాటిస్తాడుట! మిహిరకులుడి నాణాలు మా రాజ్యంలోనూ చెల్లుబాటవుతాయి.

బాల్యజీవిత పుస్మృతులు మహామధురంగా సుందరంగావుంటాయి. ఆ జీవితాన్ని గురించి ఆలోచిస్తూవుంటే నాలుగేళ్ళ వయస్సులో జరిగిన సంఘటనల మధురస్మృతులు మానసపటలం పై ముద్రితమౌతాయి. అప్పుడు నాకో చెల్లి పుట్టింది. చెల్లెలు అమ్మ ఒడిలో వుండడాన్ని చూసి ఎంతఈర్ష్యపడేవాణ్ణో! అంతచిన్నవయస్సులోనూ అమ్మఒడిలోకూర్చునే హక్కు కేవలం నాకే వుందని నా భావన. హృదయంలో అంత ఈర్ష్య వున్నప్పటికీ మా చెల్లి నా కంటికి ఎంతబాగుండేదో, ఎంత ముద్దొస్తూం దేదో చెప్పలేను. ఒక మాటు మా అమ్మ "చెల్లి నువ్వాడుకోవడానికి వచ్చింది" అని చెప్పింది. అప్పటినుండి చెల్లెలంటే ఎంతో ప్రేమచూపించే వాణ్ణి. ఒకసారి చెల్లెల్ని ఎత్తుకోవడానికి ఎంతో ప్రయత్నించి కూడా ఎత్తుకోలేక పోయాను. ప్రక్కనే నిలబడి వున్న అమ్మ, అవ్వ నా అస ఫలతను చూసి పకాపకా నవ్వారు. అదే నా జీవితపు అతి ప్రాచీనమైన మధురస్మృతి. తరువాత రెండేళ్ళకే నా చెల్లి చనిపోయింది. చెల్లిపోయిన రోజు నేనూ ఎంతగానో దుఃఖించాను.

ఇంకా కూడా అనేక స్మృతులు గిలిగింతలు పెడుతూంటాయి. ఆ చిన్న వయస్సులో రాత్రి చీకట్లనుచూసి ఎంత భయపడేవాణ్ణో! దేవతల కథలన్నా, అప్సరసల కథలన్నా చెవులు కోసుకొనే వాణ్ణి. భూత ప్రేతాల్ని గురించి, దయ్యాలను—దైవానికి అపభ్రంశం : దయ్యం— గురించి పెద్దలు చెప్తుండగా వినేవారం. ప్రొద్దుక్రుంగితే భూత ప్రేతాది భయంకర ప్రాణులు ప్రతి చెట్టు క్రిందా, ప్రతి ఇంటి నీడనా వుంటా యని భావించేవాణ్ణి. దయ్యాలు భూతాలు చెడ్డవనీ, దేవతలూ, అప్సర సలు మంచివారనీ మా భావన. దయ్యాలను చూడాలన్న ప్రయత్నం నేనెన్నడూ చేయలేదు. అంత ధైర్యమూ నాలో లేదు. కానీ దేవత

లను చూడాలన్న కోర్కె నాలో బలంగా వుండేది. అప్సరసలు అమ్మ లాగానో, లేక మా అవ్వ లాగానో వుంటారని నా విశ్వాసం. అందు వల్ల అప్సరసలంటే నాకే విధమైన భయమూ వుండేది కాదు. తెల్లని మంచు దూది పింజల్లా ఆకాశాన్నుండి భూమికి దిగుతూండేది. పౌర్ణమి నాటి నిండు చంద్రుడు ఉదయించేవాడు. మంచు చంద్రుణ్ణి కప్పివేయ గలిగినా, అతడి కాంతిని నిరోధించ గలిగేది కాదు. స్వచ్ఛమైన బంగారు రంగు చంద్రకాంతి, సర్వత్రా పరచుకున్న తెల్లని మంచుపై మెరుస్తూం డేది. అలాంటి రాత్రి దేవతలను చూడాలన్న నాలోని ఆకాంక్ష ప్రబల మయ్యేది. మా యింటి గవాక్షంముందు కూర్చుని, దేవదారు వనానికీ మాయింటికీ మధ్యనున్న, మంచుతో నిండిన మైదానంలోకి చూస్తుండే వాణ్ణి. అలాంటి రాత్రే అప్సరసలు దూదిలాంటి తెల్లని మంచు వాహ నంతో ఆకాశాన్నుండి భువికి దిగుతారనీ, నాట్యం చేస్తారనీ విన్నాను. అప్సరసలు చేసే నాట్యాన్ని చూడడానికి ఎన్నో రాత్రులు మేల్కొని గవాక్షం దగ్గర కూర్చుని మైదానంలోకి చూస్తూ గడిపేశాను. అమ్మా, నాన్న కోప్పడతారన్న భయం లేకపోతే దేవదారు వనంలో కూడా వెళ్ళిపోయే వాణ్ణి దేవతలను చూడడానికి. గవాక్షం దగ్గర కూర్చుని చూడగా, చూడగా, మంచుమీద ఏవో అస్పష్టమైన ఆకారాలు కనబడు తుండేవి అప్పుడప్పుడు. తెల్లవారి పరుగెత్తుకుంటూ మంచు మైదానం లోకి వెళ్ళే వాణ్ణి కాలి గుర్తులు చూడడానికి. అప్సరసలు నిజంగా వచ్చి నట్లయితే, వారి కాలి గుర్తులు తెల్లవారి మంచుమీద కనబడతాయని నా విశ్వాసం. అప్సరసల కాలిగుర్తులకోసరం చాలాదూరం వెతుకుతూ వెళ్ళేవాణ్ణి. సామాన్యంగా నేను నిరాశపడాల్సి వస్తూండేది. ఒక్కో మాటు ఏవైనా గుర్తులు కనిపించినా, పెద్దవాళ్ళు వాటిని తోడేలు గుర్తు లనో, ఎలుగుబంటి గుర్తులనో అనేసేవారు.

నాకు తొమ్మిదో సంవత్సరం వచ్చేవరకూ నాజ్ఞానమూ, వస్తు పరిచయము బహుపరిమితంగా వుండేవి. ఉద్యానవాసులం ఋతువుల్ని అనుసరించినివాసాల్ని మారుస్తుంటామని చెప్పాను. మూడుఋతువుల్లోనూ మా కుటుంబం గ్రామప్రజల్తోపాటు మూడు ప్రదేశాలకు మారుతుంది. నేనూ మూడుచోట్లకు తిరిగివస్తుండేవాణ్ణి.చలికాలంలో పర్వతాలపై నున్న

మా నివాసాల్ని వదలి క్రిందికిదిగి, సువాస్తుతీరాన్ని చేరుకునేవాళ్ళం. ఒక చలికాలం మాతాతగారి (తల్లి తండ్రి) గ్రామంలో గడిపామని చెప్పాను. ఆ గ్రామం చలికాలపుదృశ్యాలు నన్నెంతో ఆకర్షించాయి. ప్రతిచలికాలం మా తాతగారి గ్రామంలోనే గడపాలనుకునే వాణ్ణి. కానీ అదెలాసంభవం? పర్వతాల్నిదిగి క్రిందికి వెళ్ళేటప్పుడు దారిలో ఉద్యాన ప్రదేశపురాజధాని ఉద్యానపురిలో నుండి వెళ్ళే వాళ్ళం. అప్పట్లో నేను చూచిన మహా పట్నం అదొక్కటే. అప్పటికి నేను, పురుషపురం, తక్షశిలా, కన్యాకుబ్జం, పాటలీపుత్రం, ఈ పట్టణాలలో యే ఒక్కదాన్నీ చూడలేదు. ఈ ఛాంగ్-ఆన్ మహాపట్నం నా వూహల దరిదాపుల్లోనైనా లేదని వేరే చెప్పనవసరం లేదనుకుంటాను. ఉద్యానపురిలోదుకాణాల్నికూడా చూసే వాణ్ని. దుకాణాల్లో బొమ్మలో, మిఠాయిలో కొనుక్కోవడం కూడా కద్దు. మా గ్రామాల్లోబెల్లంగానీ, చక్కెరగానీ వుండదు. తేనెనేతీపిక్రిందవాడుకు నేవాళ్ళం. తేనెటీగలు మా కొరకు తీపిని తయారు చేస్తాయన్న భావనే నాలోవుంది. ఉద్యాన పురిలోకొన్న మిఠాయి తేనెటీగలు తయారుచేసింది కాదనీ, చెట్లుతయారు చేశాయనీ, విన్నప్పుడుమహాఆశ్చర్యాన్నిపొందాను. అంతకంటే కూడా ఆశ్చర్యాన్నీ అపనమ్మకాన్నీ కలిగించిన విషయం, బౌద్ధభిక్షు వొకతను ధరించిన వస్త్రాన్ని చూపి "దీని వున్ని గొర్రెలనుండి కాదు, చెట్లనుండి లభించిం" దని చెప్పాడు. వస్త్రాలకు కావల్సిన ఉన్ని లేక నూలు చెట్లనుండి లభిస్తుందని అదే నేను ప్రథమంగా వినడం. తరువాత జీవితంలో ప్రత్తిమొక్కల్ని నా కండ్లతో చూసేవరకు పై విషయాన్ని అనుమానిస్తూనే వున్నాను. ఆరోజుల్లో బాల్యావస్థకు సహజమైన కల్పనల్లో మునిగి ఇలా అనుకునేవాణ్ణి: "మిఠాయిలూ, వస్త్రాలూ, మొలిచినట్టుగానే మాంసం మాత్రం చెట్లమీద ఎందుకు మొలవకూడదు? అలా మాంసం చెట్లమీద మొలిస్తే ఎంత బాగుణ్ణు?"

ఐతే, గోధుమ, వరి, మొదలైన ఆహార ధాన్యాలన్నీ ఒక రకంగా చెట్లమీద మొలిచే మాంసాలేనని అప్పటికి నాకు తెలియదు. మా దేశంలో కృషికర్మ ప్రచారంలో వుంది. పండ్లతోటల్ని పెంచడమూ, మాకుతెల్సు. అయినా మా ప్రధాన వృత్తి పశుపాలనే. మేము రొట్టెలను తినేవారం, ద్రాక్ష మొదలైన పండ్లను ఎండబెట్టుకుని సంవత్సరం పొడు

గునా వాడుకునే వాళ్ళం. అయినప్పటికీ మా ప్రధానమైన ఆహారం మాంసమే. మాంసమంత అధికంగా ధాన్యాన్ని వాడము మేము. మధ్య ప్రదేశం, సింహళ ద్వీపాల్ని యాత్రచేసి వచ్చాక మా భోజనం మాంస ప్రధానమైనదని అనుకున్నాను. కానీ ఉద్యాన వనానికి ఉత్తర దిశన వున్న దేశాల్లో పర్యటించేటప్పుడు కొన్నాళ్ళు తిరుగుబోతుజాతి(మంగోల్ జాతికి సంబంధించిన తురుష్కులు, ఆ వారులు) ప్రజల్లో వుండడం జరిగింది. అసలైన మాంస ప్రధానమైన ఆహారం ఎలా వుంటుందో అప్పుడు తెలుసుకున్నాను.

అప్పటికి మా ఉద్యాన భూమిలో మహాయాన బౌద్ధం అంతగా ప్రచారంలోనికి రాలేదు. అక్కడ అందరూ హీనయాన బౌద్ధులే? మాతృ భూమిని వదలి ఇతర ప్రపంచంలోకి వెళ్ళాక మహాయానాన్ని గురించి తెలుసుకున్నాను. చాలా సంవత్సరాల తరువాతగానీ నేను మహాయానాన్ని స్వీకరించటం జరగలేదు.'ఎన్నటికైనా ఉద్యాన ప్రజలు మహాయానాన్ని అవలంబించగలరా?' అనుకుంటూంటాను.

హీనయానం మాంసాహారాన్ని హింసక్రింద పరిగణించదు, మహాయానం ఆహారం నిమిత్తమైనా హింసను సహించదు. పూర్తి అహింసను అవలంబించ మంటుంది. ఐతే అలాటి పూర్తి అహింసవలన దేశ కాలాల ననుసరించి బౌద్ధ మతానుయాయులు చాలా ఇక్కట్లలో పడతారు. నేను అప్పుడప్పుడు తురుష్కుల డేరాల్లోకి వెళ్ళి, వాళ్ళకు కొద్ది రోజులపాటు మాంసం మానండని చెప్తుండేవాడిని. బోధిసత్వుడు ఒక అల్ప ప్రాణి కొరకైనా సరే. తన సర్వస్వాన్ని తుదకు ప్రాణాలను కూడా అర్పించడానికి సంసిద్ధుడయేవాడు. అలాంటిబుద్ధడియానాన్ని(మహాయానాన్ని) అవలంబించిన నేను హింసను ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ, సమర్థించడం ఎలా ? అయినప్పటికీ అహింసలోనూ మధ్యేమార్గాన్ననుసరించే వారేఅధికంగావుంటారని నాకు తెలుసు. ఇప్పటికి నేను ముప్పై ఏళ్ళగా మాంసాన్ని ముట్టలేదు. కానీ, ఉద్యాన భూమిలోని నాదేశ సోదరులు వెనకటిలాగానే ఇప్పటికీ నిరాక్షేపణీయంగా మాంసాన్ని తింటూ వుంటారు. మాంసాహారాన్ని విడవడ మంటే ఘోరమైన ఆహర కొరతను కొనితెచ్చుకోవడమే అవుతుంది వారికి.

చిన్నతనంలోని ఊహలు చాలా చిత్రంగా వుండేవి. ఎప్పుడూ విచిత్రమైన కల్పనల్లో మునిగి వుండేవాణ్ణి. అప్సరసల్ని చూడాలన్న ఆకాంక్ష సదా హృదయంలో తెర్లుతూ వుండేది. ఎదురుగా కన్పిస్తున్న హిమాచ్ఛాదిత పర్వత శిఖర పంక్తుల్లో మహా పురుషులుంటారని చెప్పు కునే వారు. ఆ మహా పురుషుల్ని చూడడానికి ఎన్నో మార్లు హిమాలయా ల్లోకి వెళ్ళివచ్చాను. ఒక అప్సరసగానీ, ఒక్క మహాపురుషుడుగానీ కను పించలేదు. ప్రతిసారీ నిరాశే నన్ను వరించింది. అయినా నాలోని అప్స రసల మీద విశ్వాసం తగ్గలేదు.అప్సరసలు వున్నారని బుద్ధుడే చెప్పాడు. ఇంకా చాలా మంది కూడా అప్సరసలున్నారని ఒప్పుకున్నారు. ఒకవేళ, నిజంగానే అప్సరస లుండవచ్చు. కానీ, బుద్ధయానాన్ని-మహాయానాన్ని అవలంబించాక అప్సరసల్ని చూడాలన్న వాంఛ నాలోనుండి తొలగి పోయింది. అప్పటినుండే దుఃఖసంతప్త ప్రాణులకు,బాధాద్రష్టులకు ఎలా సేవ చేయడమా అని నిరంతరం యోచిస్తుండేవాణ్ణి. బుద్ధభగవానుడు జాతక కథలద్వారా జీవితంయొక్క సర్వోత్కృష్ట లక్ష్యం, "ఈ జీవి తం ద్వారా మరొక ప్రాణికి ఉపకారం గలగడమే" నని స్పష్టంచేశాడు. నా చర్మంతో ఇతర మానవులకు పాదరక్షలు తయారు చేయడంలోనే ఈ శరీరపు సార్థకత ఇమిడి వున్నదని నేను భావిస్తున్నాను. చనిపో యాక,నా శరీరాన్ని దహనం చేయవలదనీ ఆకలిగొన్న పశుపక్ష్యాదులకు ఆహార మయ్యేటట్లు ఏకాంత ప్రదేశంలో విడవవల్సిందనీ చెప్తున్నాను. ఈ ఒక్క జన్మలోనే కాదు. నాకు లభించే అనంత జన్మల్లోనూ ప్రపంచ ప్రాణులకు సేవచేస్తూ, దుఃఖోపశమనానికి, దుఃఖ నివారణకూ ప్రయ త్నిస్తూండాలని కోరుతున్నాను.



## 2వ అధ్యాయం

# పశుపాలన

ఉద్యానం బౌద్ధదేశం. ఏడెనిమిదేళ్ళ వయస్సులో, బాలబాలికల్ని బౌద్ధమతాధ్యయనం నిమిత్తం సంఘాల్లో వదిలేస్తారు. మా దేశంలో ప్రతి పరివారం నుండి ఒక వ్యక్తిని విధిగా సంఘంలో చేర్చడం ఆచారం. మా పిల్లలకు సంఘారామాలు తమ సొంత ఇండ్లలాగానే వుంటాయి. ప్రతి గ్రామంలోనూ బుద్ధమందిరం వుంటుంది. నాలుగయిదు వూళ్ళకు కలిసి ఒక సంఘారామం వుంటుంది. ప్రతి ఇంటినుండి ఒక వ్యక్తి బౌద్ధ భిక్షు వవుతున్నాడంటే, సంఘారామంలో మనబంధు వెవడో ఒకడుండడం సహజం.మా పెదతండ్రి ఒకాయన భిక్షువయ్యాడు. ఆయన అప్పుడప్పుడు భిక్షకొరకు మా యింటికి వస్తూండేవాడు. సంఘనియమాల దృష్ట్యా బౌద్ధ భిక్షువులు బంధుత్వపుమమకారాల్లో కట్టుపడరాదు. కనుక మా పెదతండ్రి ఎన్నడూ నన్ను ఎత్తుకోలేదు. నా మీద మమకారాన్ని బాహాటంగా ప్రదర్శించలేదు. కానీ, వారి మాటల్లో, ప్రవర్తనలో పుత్ర వాత్సల్యం ద్యోతకమయ్యేది. తలిదండ్రుల ప్రేమాదరాల్లో, ఎలాంటి ఆనందం లభించేదో అలాటి ఆనందమే నా పెదతండ్రి మాటల్లోనూ లభించేది. నా పెదతండ్రి పేరు భదంత జినవర్మ.నాకు ఊహ తెలిశాక భదంత జినవర్మ మా ఇంటికి భిక్షకురావడాన్ని చూశాను. మొదట అందరు బౌద్ధ భిక్షువుల్లా, ఇతడూ ఒకసాధారణ బౌద్ధభిక్షువనుకున్నాను.కానీ వారు నాకు పెదతండ్రి అవుతారని తరువాత చెప్పారు. పెదతండ్రి భిక్షకు వచ్చినపుడు వారికి తల్లీ,తండ్రి, ఇంట్లోని ఇతర జనులు-రెండు మోకాళ్ళ మీదా కూర్చుని, రెండు చేతులను, తలకు ఆన్చి నమస్కరించేవారు (దీనినే పంచ ప్రతిష్ఠత మంటారు). మా గ్రామంలోని నా యీడు కుర్రవాళ్ళు ఒక రిద్దరు తలలు గొరిగించుకుని, కాషాయాంబరాల్ని ధరించి, సంఘంలోకి

వెళ్ళారు. శ్రమణు లయ్యారు. వాళ్ళను చూశాక శ్రమణుణ్ణవుదామని నేనూ ఎంతో ఉబలాట పడుతూండేవాణ్ణి. కానీ, అప్పటికి నా తమ్ముళ్ళు పుట్ట లేదు. కుటుంబ మంతటికీ నే నొక్కణ్ణే మొగపిల్లవాణ్ణి కావడంవలన, నన్ను సంఘానికి ఇచ్చివేయడానికి, మా తలితండ్రులు ఒప్పుకొనలేదు. ఐతే, తమ ఏకైక పురుష సంతానాన్ని సంఘానికి ఇచ్చివేసిన త్యాగ శీలురు మా దేశంలో లేకపోలేదు. అసలా ఇచ్చివేయడం గొప్ప పుణ్య కార్యమని మా భావన. కొన్ని సంవత్సరాల తరువాత మా అమ్మకు ద్వితీయ పురుష సంతానం కలిగింది. ఇక నప్పటినుండి సంఘంలోకి వెళ్ళాలన్న ఆశ నాలో అధిక మవసాగింది. సంఘంలోకి వెళ్ళిన నా తోటి పిల్లలు అప్పుడే కొంచెం చదువులో పడ్డారు. ఆ చిన్నవయస్సులో చదువుమీదకంటే ఆటలమీద అధికంగాఇష్టముండడం సహజం. అయితే, సంఘంలోని మా వూరి పిల్లల్ని కలుసుకోవచ్చునన్న ఆశతో పెదనాన్న వద్దకు వెళతానని అప్పుడప్పుడూ మొండికి వేసేవాణ్ణి. స్వయంగా మా పెదనాన్న-జినవర్మను-అడిగేవాణ్ణి. వారిలా అనేవారు: "కొంచెం ఆగు: నిన్నూ సంఘంలోనికి తప్పకుండా చేర్చుకుంటాము". ఐతే, చాలా సంవత్సరాల అనంతరంగానీ నన్ను సంఘంలోకి చేర్చుకోవడం జరగ లేదు.

మా జాతి తోర్క (తురుష్క) జాతిలా తిరుగుబోతు జాతికాదు. మా నివాసాలు వారి నివాసాల్లా గుడ్డ గుడారాలు కావు. మా యిండ్లు ఉద్యానపురిలోని ఇండ్లల్లా విశాలమయినవి,సుందరమయినవి కాకపోవచ్చు. కానీ అవీ యిండ్లే. గ్రామాల్లోని మా యిండ్ల నిర్మాణంలో మట్టిగాని, రాయిగాని, అంతగా పట్టదు. సర్వకాలాల్లోనూ సువాసలను గుబాళించే ఎండిన దేవదారు చెక్కతో ఇండ్లు కట్టుకుంటాము. గోడల్ని ఇంటి కప్పుల్ని, ఒకటేమిటి? పూర్తి ఇంటినే చెక్కతో నిర్మించేస్తాము. దేవదారు చెక్క పలకల్ని పరిచి ఇంటి కప్పుల్ని నిర్మిస్తాము. చెక్క పలకల సందుల్లోనుండి వర్షపు నీరు ఇంట్లోకి కారకుండా వుండటానికి, చెక్క పలకల క్రింద భూర్జ పత్రాల్ని వొత్తుగా పరుస్తాము. మాకు సులభంగా విస్తారంగా దొరికే వస్తువు చెక్క. కొంచెం చలి మిక్కుటమైందా కొయ్య మొద్దులకు నిప్పంటించి చలి కాగుతుంటాము. మాయిళ్ళ

స్థిరనివాసాలే అయినా, వాటిని మేముచాలావరకు తిరుగుబోతుల గుడారాల్లా వాడుకునే వాళ్ళం. గుడారాల్లోలాగానే పాత సామాగ్రిని, వస్త్రాలనూ, చర్మాలను, ఒక మూలకు పోగుపెట్టుకోవడం మా అలవాటు. కాకపోతే, తోర్కు గుడారాలకు మా ఇండ్లకూ వ్యత్యాసం ఆ గుడారాలకంటే మా యిండ్లు పెద్దవి. రెండంతస్థుల్లో వుంటాయి. మా ఇండ్ల ముందు కొంత ఖాళీ ప్రదేశం వుంటుంది. అందులో మా పశువుల్ని కట్టేసుకుంటాము రాత్రంతా అవి అక్కడే ఎరువులు పెడుతుంటాయి. పశువుల పేడను మా చేలల్లోకి ఎరువుగా ఉపయోగించేవాళ్ళం. పేడను వంట చెరుకుగాకూడా ఉపయోగించుకొనవచ్చునని చాలాకాలం తర్వాత తెలుసుకున్నాం.

ఒక్కొక్కడూ సంవత్సరంలో, మూడు నాలుగు ప్రదేశాల్లోకి నివాసాన్ని మారుస్తుంటే, ఇక నా జీవితం తిరుగుబోతు జీవితం కాక ఏమవుతుంది.

సంవత్సరంలో మేము నాలుగు గ్రామాలకు మా నివాసాలను మారుస్తూవుంటాము. ఈనాల్గింటిలో మేము సంవత్సరంలో ఎక్కువకాలం నివసించే గ్రామం ఒకటుంది. ఆ గ్రామంలోని యిండ్లు అన్ని గ్రామాల లోని ఇండ్ల కంటే చాలా బాగుంటాయి, మా పంట భూములు కూడా అక్కడే ఎక్కువగా వున్నాయి. ప్రతి గ్రామం లోనూ కొద్దో గొప్పో భూము లుంటాయి మాకు. గోధుమలు, యవలు–మొదలగు ధాన్యాన్ని పండిస్తూంటాము. బియ్యాన్ని మేము ఖీర్ (పాయసం) వండుకోటానికి మాత్రమే ఉపయోగించుకునే వాళ్ళం. మాకు బియ్యం గాంధార దేశం నుండి వస్తుండేవి. గాంధార దేశం నుండి వస్తాయి కనుకనే గంధశాలి బియ్యంఅనిఅంటారు గావును అనుకునే వాడి ని చిన్న తనంలో. మా నాలుగవ గ్రామం పూర్తిగా గుడారాల గ్రామం. అక్కడి జీవితం అన్యగ్రామాల్లోని జీవితానికి భిన్నంగానూ, విచిత్రంగానూ వుంటుంది. వర్షాలు ప్రారంభించాక మేమీ నాలుగవ గ్రామానికి వెళతాము. మా నదీతీరస్థగ్రామంలో నాలుగయిదు బారల మందంలో మంచు పడుతుం దని చెప్పాను. అదే మంచు రెండవ మూడవ గ్రామాలకు పోయేసరికి పది బారల మందంలోకి పోతుంది. మా నాలుగవ గ్రామమయిన గుడా రాల గ్రామంలో ఇక ఈమంచుయొక్క విపరీతాన్ని చెప్పనేలేము. మేము

వేసవి కాలం గడిచి, వర్షాలు ప్రారంభించాక ఈ నాలుగవ గ్రామానికి వెళతాము. అప్పటికి అక్కడక్కడ మంచు కనపడుతూ వుంటుంది అక్కడ. మా ఇతర మూడు గ్రామాల పరిసరాల్లోని పర్వతాలు ఘనమైన అడవుల్తో నిండివుంటాయి. ఆ అడవుల్లోనే ఎక్కడయినా కొంచెం సమ తల భూమి కనిపిస్తే, దున్ని సేద్యం చేసుకుంటూ వుంటాము. కానీ. మా గుడారాల గ్రామ పరిసరాల్లో, అసలు చెట్టూ-చేమ కంటికి కని పించవు. అంత ఎత్తున, పెద్ద పెద్ద వృక్షజాతు లసలు మొలవ్వు. మా నాలుగు గ్రామాల పరిసరాల్లోని వనస్పతిలోనూ, వృక్షాల్లోనూ కూడా పరస్పరం ఎంతో వ్యత్యాసం వుంది. మే మాదృశ్యాల్ని బాల్యంనుండి చూస్తుండడం వలన మా కండ్లు పరిసరాల్లోని పరస్పర వ్యత్యాసాల్ని గమనించలేవు. మా చలికాలపు నివాసాల్లో సాధారణంగా మంచుపడదు. అక్కడ చెట్లు చేమలూ పచ్చగా కళకళలాడు తుంటాయి. పచ్చగడ్డి ఏపుగా పెరిగి వుంటుంది. పశుగ్రాసం సమృద్ధిగా లభిస్తుంది గనుకనే పశువుల్ని మేపుకుంటూ చలికాలాన్ని అక్కడ గడుపుతాము. మా ముఖ్య గ్రామంలో దేవదారు వృక్షాలు అధికం. అవి ఎంత హిమపాతంలోను పూర్తిగా ఆకుల్ని రాల్చేసి మోళ్ళయి పోవు, అంటే సంవత్సరం పొడు గునా కొద్ది కొద్దిగా ఆకుల్ని రాలుస్తూనే వుంటాయి దేవదార్లు. మా మూడవ గ్రామంలోనూ దేవదార్లు, సూదిలా కొనదేలిన ఆకులు గల అన్యవృక్షాలూ అధికంగావుంటాయి.ఆగ్రామంలోనూ పైన తెల్లనిచర్మం -పొరలు-కల భూర్జ-భోజ-వృక్షాలుంటాయి. దేవదారు చెక్కతో ఇండ్లు కట్టుకుంటామని చెప్పాను. కాని, భూర్జ వృక్షం మా నిత్యజీవితంతో అనేక విధాల ఉపయోగపడుతూ వుంటుంది. భూర్జ వృక్షపు, పైచర్మం బెరడుతో దొన్నెలు తయారుచేసు కుంటాము. ఆ దొన్నెల్లో పాలు, పెరుగు, వెన్న, ఇతర పదార్థాలను పెట్టుకుంటూ వుంటాము. వ్రాతకోత లకు కూడా ఈ భూర్జచర్మాన్నే వాడుతుంటాము. మా పుస్తకాలన్నీ ఈ భూర్జచర్మంమీదే వ్రాసి వుంటాయి నేను పాటలీ పుత్రపు (పాట్నా) అశోకారామంలో కొన్నాళ్ళున్నాను. అప్పుడు, అక్కడి భిక్షువుల అజ్ఞా నానికి ఎంతో నవ్వుకునే వాడిని. వాళ్ళు భూర్జ చర్మాన్ని, భూర్జపత్రం (ఆకు) అనుకునేవారు. అనుకోవడమే కాదు అనేవారు కూడాను. భూర్జ

పత్రం కాదనీ, భూర్జచర్మమని నేనెంతో చెప్పేవాణ్ణి. అయినా వినేవారు కాదు. పైగా వాదనకు దిగేవారు. "భూర్జ పత్రం కాకపోతే మరి దీనికా పేరెందుకు వచ్చింది ?" అనేవారు. కానీ నేనెలా వొప్పుకోగలను ? బాల్యంలో స్వయంగా చాకుతో, అంగుళం మందం గల భూర్జచర్మాన్ని (బెరడును) కోసి దానిని సన్నని పొరలుగా చీలుస్తుండేవాణ్ణి. అక్కడి పిల్లలకు అదో గొప్పసరదా అయిన ఆట కూడాను. నేనా భిక్షువుల్తో ఇలా అన్నాను: "భూర్జపత్రమన్న పేరు మేము పెట్టిందికాదు. ఉష్ణ దేశీయులు పెట్టింది. వారి దేశాలు ఉష్ణ ప్రధానమయినవి కావడంవలన, ఇక్కడిలా హిమపాత ముండదు కనుకనూ, ఆ దేశాల్లో భూర్జ వృక్షాలు మొలవ్వు. వాళ్ళు తాళపత్రాలపైన వ్రాసుకుంటూ వుంటారు. తాళ పత్రానికి పోల్చి దీన్ని భూర్జ పత్రమనేవారు,"

మా ఉద్యానవాసుల జీవితం—అందునా ఉద్యానదేశపు పర్వతాగ్రాలపై నివసించే ప్రజల జీవితం - ఒకరకంగా తిరుగుబోతు జీవితమేనని స్పష్టమైంది. కాని తుర్క, ఆవారుల జీవితాలే నూటికి నూరుపాళ్ళు తిరుగుబోతు జీవితాలని, మా జీవితం పూర్తి తిరుగుబోతు జీవితం కాదనీ నే ననుకుంటున్నాను. పూర్తి తిరుగుబోతు జీవితమంటే నాకెంతో ఇష్టం. మా చలికాలపు నివాసాలనుండి వర్షాకాలపు నివాసాలకు (పర్వతాగ్రప్రదేశాల్లోని పసిరిక మైదానాలు) వెళ్ళడానికి పదిహేను రోజులు పడుతుంది. ఈ పదిహేను రోజుల ప్రయాణంలోనూ, పర్వతం పై భాగాలకు వెళ్ళినకొలది చలి అధిక మవడాన్ని స్పష్టంగా గమనిస్తాము. చలి పెరిగిన కొలది చెట్లలోనూ, వనస్పతిలోనూ భేదం రావడం సహజం. వర్షాకాలంలో మా క్రింది గ్రామాల్లోనూ పశువులమేత సమృద్ధిగా లభిస్తుంది. అయితే, అనాదికాలంనుండి, మా పూర్వీకులు పర్వతాగ్రాలపైనే పశుచారణ చేస్తూ వచ్చారు. అదొక ఆచారంగా తయారయింది. ఈ పర్వతాగ్రాల్ని చేరడానికి రెండు మూడు క్రోసులముందే, పెద్ద పెద్ద వృక్షజాతు లన్నీ పొట్టివయి పోవడం ప్రారంభిస్తాయి. పూర్తిగా పైకి పోయేసరికి ఈ పెద్ద వృక్షాలన్నీ, పసిరిక కొరకు తమ స్థానాన్ని రిక్తం చేసి అంతమౌతాయి. క్రిందనుండి చూచేవారికి రాళ్ళు రప్పల్తో నిండిన ఈ పర్వతాలపైన క్రోసుల విస్తీర్ణంకల పసిరిక మైదానా లుంటాయన్న

విశ్వాసమే కలగదు. అక్కడ ఒక్క పసిరికే కాదు, అక్కడక్కడ అడవి గోధుమ మొక్కలు పెద్ద అరణ్యంలా వ్యాపించి వుండడం కూడా కద్దు! ఈ అడవి గోధుమల ఆకులూ, కాండము, మామూలు గోధుమ మొక్కల కున్నట్లుగానే వుంటాయి. కానీ, గింజలు మాత్రం చిన్నవిగా పల్చగా వుంటాయి. ఈ పర్వతాగ్ర ప్రదేశాల్లో అతి దుర్లభమైన వస్తువు కట్టెలు. కట్టెలకోసం మేము నాలుగైదు క్రోసులు క్రిందికి దిగుతుంటాము. ఈ పసిరిక మైదానాల్లో ఎక్కడా హద్దులుగానీ, గుర్తులు గానీ వుండవు. అయినప్పటికీ ఏ గ్రామపు గోచారభూమి ఎంతవరకో మా అందరికీ తెల్సు. మా గ్రామాల్లో ఐతే, ప్రతి కుటుంబము తన నివాసంతో పాటు, తన భూమిని కూడా ప్రత్యేకంగా వుంచుకుంటుంది. కానీ, ఈ పర్వతాగ్ర ప్రదేశాల్లో, నివాసమూ, భూమి, భోజనము అన్నీ ఉమ్మడిగానే వుంటాయి. కాకపోతే, వర్షాకాల మంతటిలోనూ, పశువుల నుండి లభించే వెన్నను మాత్రం ఏ కుటుంబానిది ఆ కుటుంబం జాగ్రత్తగా దాచుకుంటుంది. క్రిందిగ్రామాలనుండి మాకు ప్రతిపదిహేను రోజులకు పిండి.ఉప్పు మొదలైన ఆహారపదార్థాలువస్తుంటాయి.అప్పుడే నిలవజేసిన వెన్ననూ, మాంసాన్ని, చర్మాల్ని గ్రామాలకు పంపించి వేస్తుంటాము. ఇక్కడ నాలుగు నెల్లూ గడిపి తిరిగి క్రింది గ్రామాలకు వెళ్ళాక గొర్రెల ఉన్నిని కత్తిరించుకునేవారం. ఈ మైదానపు నివాసాల్లో మా పశువులకు మేత సమృద్ధిగా లభిస్తుంది. మాకు పాలూ, పెరుగూ, వెన్నా మాంసమూ-సమృద్ధిగా లభిస్తాయి. నేనీ చీనాదేశం వచ్చాక మాంసాహారాన్ని వదిలివేశాను. ఉద్యానభూమిలో హీనయానమే ఎందుకంత ప్రబలంగా వ్యాపించిందో ఇక్కడికి వచ్చాక అర్థమైంది. ఉద్యానవాసులు మాంసాహారాన్ని విడువలేరు. మాంసాన్ని విడవడమంటే, సులభంగా, అనాయాసంగా దొరికే ఆహారాన్ని వదులుకోవడమే అవుతుంది. ఇప్పుడు మాంసభక్షణలోని క్రూరత్వాన్ని తల్చుకుంటే శరీరం రోమాంచితమౌతుంది. కానీ, అప్పుడు ఉద్యానభూమిలో వుండగా అప్పుడే పుట్టిన గొర్రెపిల్లల్ని నిప్పుల్లో కాల్చి, దాని మాంసాన్ని పిల్లలం ఎంత ఇష్టంగా తినేవారమో! అప్పుడే పుట్టిన గొర్రె చర్మము, ఉన్ని మహామృదువుగా వుంటాయి. కృష్ణాజినంలా-మృదువుగా మెరుస్తుంటాయి!

చర్మంకొరకే వాటిని పుట్టగానే చంపేస్తుంటాము! ఇకనా గొ్రెపిల్లల మాంసం మహా రుచిగావుంటుంది.దానిరుచి కారణంగా అతిథి వచ్చాడంటే అప్పుడే పుట్టిన గొ్రె మాంసాన్ని కాల్చి పెట్టి మహాఆనంద పడతాడు గృహస్థు. బౌద్ధ భిక్షువులు, హీనయానులే అయినప్పటికీ-మాంసభక్షణ నిషిద్ధం కాకపోయినప్పటికీ-ప్రత్యేకం తన కొరకు చంపిన జంతువు మాంసాన్ని తినరాదు. అంటే, ఫలాని భిక్షువు కొరకు అని ప్రత్యేకం చంపితే తినరు. పశుపాలురు తమ కోసరం చంపుకున్న లేత గొ్రెపిల్ల మాంసం అనాయాచితంగా లభిస్తే బౌద్ధ భిక్షువుకూడా మహా ఇష్టంగా తినేస్తాడు.

ఈ పర్వత మైదానాల్లోని జీవితమంటే నాకెంతో ఇష్టం! మొట్ట మొదటి వర్షావాసాన్ని అక్కడ గడిపిననాటి నుండి, ఈనాటి వరకూ, ఆ మైదానాల జీవితంమీద నాలోని ఆకర్షణా, ఆసక్తి ఏ మాత్రమూ తగ్గ లేదు. ఇప్పటికీ ఆ జీవితాన్ని స్మరణకు తెచ్చుకుంటే చెప్పరాని ఈర్ష్య జనిస్తుంది. ఈనాటికీ ఆ మైదానాలు నా చిన్నతనంలో లాగానే సంద డితో నిండి వుంటాయి. నా చిన్నతనంలోనే కాదు. నా తాత తండ్రుల బాల్యంలో కూడా ఆ మైదానా లలాగే సందడితో నిండి వుండేవి. అక్కడ ఉదయాన్నే పశువుల్ని విప్పడము, తిరిగి సాయంత్రం పశువుల్ని కట్టి వేయడం ఏమీ వుండదు. పశువులే తమకుతామె రాత్రిపూట విశ్రాంతికి డేరాల్లోకి వచ్చేస్తాయి. ఉదయాన్నే పాడిగోవుల్ని పితుక్కుంటాము. పితకవల్సిన పశువుల సంతానాన్ని సాయంకాలమే విడిగా కట్టివేస్తాము. ప్రొద్దున్నే ఉడికించిన మాంసాన్ని, పిండిని తింటాము. ఉదయపు భోజన మయ్యాక పశువుల్ని కాయడానికి బీళ్ళల్లోకి వెళ్ళేవాళ్ళం. మా పశు వులు, మాకంటే ముందే వెళ్ళి బహుదూరాల వరకూ వ్యాపించివున్న పసిరిక మైదానాల్లో మేస్తూండేవి. మా క్రింది గ్రామాల్లోలాగానే ఇక్కడా మా పశువులు నిత్యం ఎన్నో రకాలైన శత్రువుల్ని ఎదుర్కొనవలసి వుంటుంది. మంచు పులి, సింహం, చిరుతపులి-మా పశువుల్ని ఎత్తుకు పోతూ వుంటాయి. మా పశువులు ఒంటరిగా చిక్కినప్పుడే పై క్రూర జంతువులు వాటికి హాని కలిగించగలిగేవి. నాలుగయిదు పశువులు కలిసి సమూహంగా వున్నాయంటే, ఇకనవి – పులినేమిటి, సింహాన్నికూడా

సునాయాసంగా ఎదిరించి వేస్తాయి. సింహమూ, పులీలాటి గొప్ప మృగాలు కదాచిత్తుగాగాని మైదానాల్లోకిరావు. అవి మా క్రింది గ్రామాల పరిసరారణ్యాల్లోనే వుంటాయి. వాటికీ చలి అంటే మానవులకులాగానే అమితభయం. మా గొర్రెలకు మేకలకు అతి భయంకరమైన శత్రువు తోడేలు. తోడేళ్ళనుండి ఏ విధంగాను తమను తాము రక్షించుకొనలేని నిరుపాయ జీవులవి. ఐతే, తోడేళ్ళను ఎదిరించడానికి మా కుక్కలు సదా సిద్ధంగా వుంటాయి. కుక్కల్ని మేము పశువుల క్రింద లెక్కకట్టము. వాటినీ, మనుష్య సమాజపు అంగాలుగా భావిస్తుంటాము. ఉదయాన్నే వాటికీ మాలాగానే భోజనాన్ని పెడతాము. భోజనమైనాక మా కంటే ముందే గొర్రెల మందలకు కాపలా కాయడానికి వెళ్ళిపోతాయి కుక్కలు! ఆకారంలో ఈ కుక్కలు తోడేళ్ళకంటేకూడా భయంకరంగా వుంటాయి. నల్లని వెంట్రుకలు, పసుపుపచ్చని కండ్లు-చాలా క్రూరంగా వుంటాయి! అపరిచితు డెవడైనా, ముందుగా జాగ్రత్త పడకుండా, ఒట్టిచేత్తో కుక్కల ఎదుటికి వచ్చాడా? ఇక నతడి గతి దుర్గతే! కుక్కలు ఎంతతెలివి కలవి? బహుశా మానవుడి తరువాత తెలివితేటల్లో కుక్కతో పోటీచేయ గల జంతువు మరొకటి లేదనే చెప్పాలి. తోడేలు చాలా తెలివైందని అంటారు. నక్క విషయం చెప్పనే అవసరం లేదు! అయితే ఈ రెండు జంతువులు కూడా బుద్ధిలో మా కుక్కల్ని మించుతాయని నే ననుకోను.

పశువుల్ని మేపుకుంటూ పగలంతా వాటితోపాటు తిరగడమంటే పిల్లలకు మహా ఆనందంగా వుంటుంది. మా గూడారాల్లో స్త్రీ పురుషుల కంటే, ఏడు సంవత్సరాలు దాటిన బాలబాలికల సంఖ్య అధికంగా వుంటుంది. వృద్ధులూ, గర్భిణీస్త్రీలూ, రోగగ్రస్తులయిన స్త్రీ పురుషులూ ఈ మైదానాల్లోకి రారు. క్రింది గ్రామాల్లోనే వుండిపోతారు. పనిపాట్లు చేయగల్గినవారు మాత్రమే అక్కడికి వస్తుంటారు. ఏడు సంవత్సరాలు దాటిన బాల బాలిక లెవరూ వర్షాకాలపు నివాసాలయిన ఈ మైదానాల్లోకి రాకుండా వుండరు. ఈ మైదానాల్లో, ఏడు పదిహేను సంవత్సరాల లోపు వయస్సు కలిగిన బాల బాలిక లందరూ ఒక జట్టుగా, కూటమిగా వుంటారు. నేను భిక్షువునయ్యాక సంఘారామాల్లోని సహభోజనం నా మనస్సు నెంతో ఆకర్షించింది. భిక్షుసంఘపు నియమా న్ననుసరించి

ప్రతిభిక్షువూ భిక్షద్వారా తాను తెచ్చిన ఆహారపదార్థాలను అన్య భిక్షువులు తీసుకువచ్చిన ఆహారపదార్థాలతో కలిపి సహ-పంక్తిలో భోంచేస్తాడు. సంఘంలో తయారుచేసిన ఆహారా న్నయినప్పటికీ భిక్షువులందరూ కలిసి సహపంక్తినే భోంచేస్తారుగానీ ఒంటరిగా తినరు. ఈసహపంక్తి భోజనాల పద్ధతిని బుద్ధభగవానుడు మా ఉద్యాన భూమియొక్క, మైదానాల జీవితంనుండే గ్రహించి వుంటాడని నే ననుకుంటున్నాను. బుద్ధ భగవానుడు తన అనేకజన్మల్లో, మా ఉద్యానభూమి లోనూ తప్పక జన్మించి వుంటాడని నా విశ్వాసం. ఇది నా ఒక్కడి విశ్వాసమేకాదు. ఉద్యానవాసి అయిన ప్రతివాడూ ఇలాంటి విశ్వాసాన్నే కలిగి వుంటాడు. మా విశ్వాసాల్ని ప్రగాఢం చేయడానికి నా మాతృభూమిలో అనేక నిదర్శనాలు కూడా వున్నాయి. బుద్ధుడు పావురం రూపాన్ని ధరించి మరో ప్రాణియొక్క క్షుద్బాధను తీర్చడానికి, తన శరీరాన్నే దానము చేసిన పవిత్ర స్థలం ఉద్యానభూమిలోనే వుంది. ఆ స్థలాన్ని నేను దర్శించాను కూడాను! ఈ ఉద్యానపు రాజధానికి అగ్నేయమూలగా ఎనిమిదిరోజుల ప్రయాణ దూరంలో తథాగతుడు తన శరీరాన్ని దానంచేసి పెద్దపులి ఆకలిని తీర్చిన పవిత్ర స్థలంవుంది. ఆ స్థలాన్ని దర్శించాను. తరువాత జీవితంలో ఇలాటి పవిత్రస్థలాలమీద నాలోని శ్రద్ధాసక్తులు, భక్తి సన్నగిల్లాయి. నా దేశాటనల్లో, ఇలాటి పవిత్రస్థానాలను అన్యదేశాల్లోనూ చూశాను. ఒకే సందర్భంలో పునీతమైనవని చెప్పబడే స్థలాలు అనేకం అనేక దేశాలలో చూశాక వాటి సత్యంమీద శంకకలగడంసహజం.

మధ్యాహ్న భోజనానికి గుడారాలకు తిరిగి రమ్మనిచెప్తారు పెద్దవాళ్ళు. కానీ, మే మెవ్వరము భోజనాలకు గుడారాలకు వెళ్ళము. మేము మా పశువుల్ని తోలుకుని, గుడారాలకు ఒకటి రెండు క్రోసుల దూరం వరకూ వెళ్తాము. భోజనంకోసం అంత దూరాన్నుండి రావడమూ, భోజనం చేసిన వెంటనే తిరిగి వెళ్ళడమూ కష్టం. పైగా, ఆటపాటల్లో సరదాగా గడిపే సమయం అది. ఆట పాటల్లో ఎంత లీనమై ఉంటామంటే, ఆహారాని కయినాసరే.గుడారాలకు వచ్చేసమయం వుండదు. మా వీపులకు తగిలించివున్న జోలెల్లో వేయించిన గోధుమలు, ఉడికించిన మాంసం, రొట్టెలూ ఉంటాయి. గొర్రె చర్మంతో తయారుచేసినసంచీల్లో

మజ్జిగో, పాలో తెచ్చుకుంటాము. ఎప్పుడు ఆకలయితే అప్పుడు ఒక చోట కూర్చుని భోంచేస్తాము. ఇక్కడ మా గ్రామపు పిల్లలమే కాకుండా అన్యగ్రామాల బాల బాలికలు కూడా మాతో కలుస్తుంటారు. ఆట పాట ల్లోనూ, భోజనాల్లోనూ తామూ పాల్గొంటూ వుంటారు. వయస్సు ననుస రించి ఒకటి రెండేళ్ళు అటూఇటూగా ఉన్న బాల బాలిక లందరూ ఒక జట్టుగా తయారవుతారు. ఒక్కొక్క ప్పుడు ఒకేవయస్సులోని బాలిక లందరూఒక జట్టుగా ప్రోగవుతారు.

పశువుల్ని మేము దగ్గిరనుండి మేపవల్సిన పనేమీలేదు. యేపుగా పెరిగిన పసిరికలో అవి తమ ఇష్టమొచ్చినంతసేపు మేస్తాయి. కావల్సి నంతసేపు విశ్రాంతి తీసుకుంటాయి. వాటి కాపలాకు ఎటూ మాకుక్కలు ఉండనే వున్నాయి. ఎప్పుడయినా ఏదయినా ప్రమాదం సంభవిస్తే మా కుక్కలు అరిచి మాకు తెలియజేస్తాయి. మేము మా ఆటపాటల్ని ఆపి పశువులవద్దకు పరుగెత్తుతాము. మాకు ఆటలేకాదు, వేట అన్నా చాలా యిష్టం. కుందేళ్ళను చుట్టుముట్టి, కుక్కల సాయంతో చంపుతాము. ఇక కొంతమంది ఎండు కట్టెలకొరకు పరుగెత్తుతారు. నిప్పు తయారుచేసు కోడానికి చకిముకిరాళ్ళు సిద్ధంగా వుంటాయి. నిప్పుమీద కాల్చిన కుందేలు మాంసాన్ని మహాయిష్టంగా తినేవాళ్ళం. వేటలో సఫలతను పొందిన రోజున ఇక మా ఆనందానికి మేర వుండదు. కరవాలాలను ధరించడం మాకు బాల్యంలోనే అలవాటైపోతుంది. కత్తిసాము, విలువిద్య, ఇలాటివి బాల్యంలో ఆటపాటల్తోపాటే నేర్చుకుంటాము. నేనేమంత చెప్పుకోదగిన గురిగాణ్ణి కాదు. కానీ, మా జట్టులోని కొంతమంది – వారిలో బాలురు, బాలికలు కూడా వున్నారు తిరుగులేని బాణాల్ని వేస్తారు. వారి బాణాలు విఫల మవడాన్ని నేను చూడలేదు. బాల బాలికలం దాగివుండి, రాళ్ళతో కూడా వేటాడుతాము. తోడేళ్ళను భయపెట్టడానికి, మా పశు వుల్ని నిరపాయంగా అవతలకి తీసుకుపోవడానికి అలా చాటున వుండి రాళ్ళు వేస్తాము.

పిల్లలు పెద్దవాళ్ళను అనుకరిస్తారు. మా గ్రామాల్లో సాయం సమ యాల్లో నిత్యకృత్యాలనుండి నివృత్తులయ్యాక, ఊళ్ళోని పెద్దలందరూ ఒకచోట కూడి, మద్యపానానికి తలపడతారు. మద్యపానం అయ్యాక

రకరకాలయిన వాయిద్యాలను వాయిస్తూ నృత్యగానాదులను ప్రారంభిస్తారు. అర్ధరాత్రివరకూ స్త్రీ పురుష లందరూ అలాగే గానపానాదుల్లో ఒళ్లుమరచి వుంటారు ఈ వినోద కార్యక్రమంలో ప్రవేశించడానికి పిల్లలమయిన మాకు అర్హత ఉండదు. మమ్మల్ని చేరనీయరు. అయితే పగలు పశువుల్ని కాసేప్పుడు మమ్మల్ని తమలో చేరనీయని పెద్దల తప్పిదానికి ప్రతిక్రియ చేస్తాము. పిల్లలం చాలా వుత్సాహంగా వేణువు నూదుతూ వుంటాము. పెద్దలకి వచ్చినన్ని పాటలు మాకు రాకపోయినా మాకు వచ్చిన కొద్ది పాటలతోనే ఓ చిన్న గాన గోష్ఠి, జరిపేవారం. పెద్దలలా రాగ-తాళాలు మాకు తెలియకపోయినా దూరాల వరకూ వినిపించే స్వరసాధనలో పిల్లలం వాళ్ళకేమాత్రమూ తీసిపోము. కానీ డోలులాంటి వాయిద్యసాధనా లేవీ లేకపోయినవే అన్న బాధ మా అందరిలోనూ వుండేది. ఆ బాధను నివారించుకోడానికి, కావాలంటే, ఏ కొద్దిపాటి డోలునో వెంట తెచ్చుకోగలం. కానీ, పశువుల్ని కాయడం మాని, తమ గాన సభల్ని మేము అనుకరిసున్నామని తెలిస్తే, పెద్దలు సహించగలరా? నిర్జన మైదానాల్లో డోలు శబ్దం చాలా దూరాల వరకు వినిపిస్తుంది. పెద్ద వాళ్ళు వినడమూ, చీవాట్లు పెట్టడమూ తథ్యం. ఈ గొడవంతా ఎందుకని వేణువు నూదడం, కట్టెదుంగలపైన తాళాలు వేయడంతో తృప్తి పడి వూరుకునే వాళ్ళం.

మా ఆట పాటలకు పెద్ద అడ్డంకి ఒకటుంది. మేము పశువుల వద్దకు వెళ్ళేటప్పుడు ప్రతి ఒక్కడికీ పావో, చటాకో ఉన్నినీ, ఒక తకిలీని ఇచ్చి పంపుతారు. సాయంత్రం తిరిగి వచ్చేప్పుడు ఆ ఉన్నిని నూలు వడికి తీసుకువెళ్ళాలి. రోజు చివాట్లు - తిట్లూ తినటానికి అలవాటుపడ్డ బాల బాలికలు ఈ నూలు వడకడాన్ని అంతగా లక్ష్యపెట్టుకోరు! కానీ నాలాటి అభిమానంకల పిల్లలు ప్రతిరోజూ నియమం తప్పకుండా తమవంతు వున్నిని వడికి నూలును సాయంత్రానికి వప్పగించేస్తారు. పశువులు పసిరికలో మేస్తుంటాయి. మా పశువులకు సమీపంలో యేదైనా ఎత్తయిన ప్రదేశాన్ని చూసుకుని గుంపుగా ప్రోగుపడి కూర్చుంటాము. మా చుట్టూ మా కుక్కలు కూర్చుని వుంటాయి. ఇక మా చేతులేమో ఉన్నిని వడుకుతుంటాయి. మా కంఠాలు శూన్య

కాశంలో స్వర మాధుర్యాన్ని నింపుతూ వుంటాయి. మా ఉద్యాన ప్రజల గొంతులు మహా వీనసొంపుగా వుంటాయి. అసలు పర్వత ప్రాంతాల ప్రజల కంఠాలు చాలా మధురంగా వుంటాయి అందులోనూ ఉద్యాన ప్రజలు తమసుస్వరాలగురించి గొప్ప ప్రసిద్ధి పొందారు. బాల్యం నుండి శ్వాస పీల్చినంత సహజంగా పాటలు పాడుతుంటాము మేము. తోటి పిల్లలందరి గొంతులకంటె నా గొంతు మధురంగా వుండేది. పైగా జ్ఞాపకశక్తి అధికం కావడంవల్ల ఎన్నో పాటలు నోటికి వచ్చును. పై రెండు కారణాలవల్లా మా జట్టులోని పిల్లలందరూ నన్నెంతో ఆదర భావంతో చూచేవారు. పాట పాడేప్పుడు ప్రతి చరణానికి చివర దీర్ఘంగా ఆలాపించేవారం, ఆ ఆలాపన చాలా దూరాలవరకూ ప్రతిధ్వనించేది. మా ఆలాపనలు తప్పకుండా మా పెద్దవాళ్ళకు వినిపించే వుంటాయి. అయినా వాళ్ళు ఎన్నడూ మమ్మల్ని కోప్పడడంగానీ, మా గాన సభలకు అభ్యంతరాన్ని చెప్పడంకానీ-చేయలేదు! అవునుమరి, బాల్యంలో వారూ మాలాగే గానసభల్ని నిర్వహించిన వారేగా! మా ఆలాపనలను వింటూవుంటే, వారికి తమ బాల్యం జ్ఞాపక మొచ్చేదిగావును! అందువల్లే, పశువుల్ని వాటిధర్మానికి వదిలి మేము ఆటపాటల్లో మునిగివున్నా పెద్దవాళ్ళు ఏమీ అనేవారు కాదు.

వర్షాకాలం కావడం వలన పశువుల్ని కాస్తుండగా కూడా అప్పుడప్పుడూ వర్షం వస్తూ వుంటుంది. మా డేరాల్లో కొన్ని గుడ్డ గుడారాలు కూడా వుంటాయి. మేకల వెంట్రుకలూ, గుర్రాల వెంట్రుకలుకలిపినేసిన వస్త్రాల్తో గుడారాల్ని వేసుకుంటాము. అయితే తోఖ్యార్కుల్లా పూర్తి గుడ్డ గుడారాల్లోనే మేము నివసించము. దగ్గరిలో గడ్డి, రెండు మూడు క్రోసుల్లో కర్రా-దొరుకుతాయి.కనక వాటితో గుడిసెల్ని వేసుకుంటాము. గడ్డి కర్ర దొరకని స్థితిలో మేమూ తోఖ్యార్కు- (తురుష్కు-)ల్లాగానే గుడ్డ గుడారాల్లో వుండవల్సి వచ్చేదేమో! మా నివాసాల్లో ఎక్కువ భాగం గుడిసెలుంటాయి. కొద్దిగా గుడారాలుకూడా వుంటాయి. ఈ పర్వతాగ్రాల పైన జలవర్షమే కాకుండా అప్పుడప్పుడూ హిమవర్షంకూడా కురుస్తుంది. మొదట కొంతసేపు ధారాపాతంగా జల వర్షం కురుస్తుంది. అనంతరం చలి మిక్కుటమై చర్మాన్ని ఛేదించుకుని వెళ్ళి ఎముకల్ని కొరక సాగు

తుంది. ఇక నప్పుడు నీటికి బదులు హిమం వర్షిస్తుందని మేమందరము తెల్సుకుంటాము, ఐతే, ఈపర్వతాగ్రాలపైన వర్షాకాలంలో పడినమంచు కొన్ని ఘడియల్లోనే కరిగిపోతుంది. దీనినిబట్టి చలికాలంలో ఇక్కడ ఎంత భయంకరంగా హిమపాతం జరుగుతుందో మే మూహించగలము. హిమ వర్షానికి ముందు మాగొర్రెలు సహజంగానే రాబోయే విపత్తును గ్రహిస్తాయి. ఆకాశాన్ని నల్లని కారుమేఘా లావరించడం చూసి ప్రొద్దు కృంగుతోందన్న భ్రమకలుగుతుంది వాటికి! అవి తమకుతామైదేరాలపై పు పరుగెత్తుతాయి, ఇలాంటి సమయంలోనే వన్యజంతువుల నుండి మాగొర్రె లకు ప్రమాదం సంభవిస్తూ వుంటుంది. మే మెంత జాగ్రత్తలో వున్నా ప్రతి సంవత్సరమూ ఎన్నో కొన్ని పశువుల్ని నష్టపోతూనే వుంటాము. వన్య జంతువుయొక్క ఆక్రమణలోచచ్చిన మా పశు కళేబరాన్ని ఆ జంతువునుండి లాక్కోవడానికి అరచి గోల చేస్తాము.

ధర్మ పరాయణులైన వృద్ధులు, వన్యజంతువుద్వారా చంపబడిన పశుమాంసాన్ని చాలా పవిత్రమైనదిగా భావిస్తుంటారు. తాము కావాలని హింస చేయకుండా లభించిన మాంసం కదామరి? తథాగతుడు అహింసను గురించి చాలా సూత్రాలు చెప్పాడు. మా వృద్ధులు నిత్యం ఆ సూత్రాలను పఠిస్తూంటారు. మా భిక్షువులుకూడా బుద్ధునియొక్క అహింసకు సంబం ధించిన సూత్రాలను తరచు గ్రామాల్లో ఉపన్యసిస్తూంటారు. కనుక మా వృద్ధుల్లో పై భావన కలగడం సహజం. అప్పుడప్పుడూ ఏ మంచుపులో మా పశువులమీద పడుతుంది. ఎద్దునో, ఆవునో, దూడనో చంపేస్తుంది. మేము దగ్గర్లోవుంటే సమయానికి చేరుకుంటాము. చచ్చిన పశువుయొక్క మాంసం చాలా భాగం మాకే దొరుకుతుంది. అంత మాంసాన్ని ఒకే పూటలో ఖర్చు చేయడం కష్టం అనుకుంటే ప్రక్కగ్రామాల్ని కూడా విందుకు ఆహ్వానిస్తాము. ఇక మద్యం – సారాయి – లేకుండా విందు జరగ డానికే వీల్లేదు. మా గ్రామాలకు పెద్ద పెద్ద తోలుసంచుల్లో, గోధుమ, యవలనుండి తీసిన పచ్చిసారాయి వస్తూంటుంది. త్యోర్కు ప్రజలు పరి చయంలోకి వచ్చేవరకూ గుర్రపు పాలతోకూడా సారాయిని తయారుచేస్తా రని నాకు తెలియదు. మా దేశంలో గుర్రాలూ అధికంగానే వున్నాయి. అయితే మా గుర్రాలు కాంభోజదేశపు గుర్రాలంత గొప్పవి కావు. పొట్టిగా

వుంటాయి. కానీ, ఓపికలోనూ, బలంలోనూ ఏ దేశపు గుర్రాలకూ తీసి పోవు. అసలు మా దేశంలాంటి పర్వతప్రాంతాలకు అలాటి పొట్టిగుర్రాలే ఉపయుక్తమైనవని నా భావన. మా గుర్రాలు ఎంత ఎత్తుపల్లాలమార్గాన్నయినా, ఎంత రాయీరప్పల్తో నిండిన మార్గాన్నయినా చకచకా నడిచి వెళ్ళిపోతూంటాయి. మేము చమరీ మృగాలను పెంచము. శీతసముద్ర ప్రాంతంలో మొదటగా చమరీ మృగాన్ని చూశాను. అంతవరకూ చమరీ మృగం అంటే నిజంగా మృగ—లేడి—జాతికి చెందినదిగావును అనుకునే వాడిని. కానీ చమరి మృగమనేది—లేడి—జాతికి చెందింది కాదు. మధ్యప్రాంతంలోని పాడిపశువయిన బర్రెలా వుంటుంది. చమరీ మృగం శరీర మంతట్లోనూ నిడుపాటి తెల్లని వెంట్రుక లుంటాయి. శీతసముద్ర ప్రాంతీయులు (బైకాల్ సరస్సు)—ఈ చమరీ మృగాన్ని పాడిపశువులా పెంచుతుంటారు. చమరికీ ఆవుకు సంయోగాన్ని జరుపుతారు. చమరి ఆవుయొక్క సంయోగంవల మరో క్రొత్తరకం పశువు జనించడాన్ని నేను స్వయంగా చూశాను. చమరీ మృగం 'ఆవు జాతికి సంబంధించినదని తెల్సుకున్నాను మనుష్యులయొక్క రూపురేఖల్లో మాత్రం ఎంత ఎన్ని - వ్యత్యాసాల్లేవు ? త్యోర్కుల శరీరపురంగూ, ముఖముద్రలూ అదోరకంగా వుంటాయి. మా ఉద్యానవాసుల రంగూ ఆకారమూ అదో ప్రత్యేకత. దక్షిణ జంబూ ద్వీపానికి వెడితే బొగ్గులాటి నల్లని స్త్రీ పురుషులు కనబడతారు - అదో ప్రత్యేకత.

మా మైదానాల జీవితంలో పశుచారణ, ఆమోద ప్రమోదాలు, గానసభలూ ఎటూ వున్నాయి. అయితే అవే సర్వస్వం మాత్రం కావు. అవి కాకుండాకూడా అక్కడి మా జీవితంలో ప్రాధాన్యత వహించే విషయాలు అనేకం వున్నాయి. తరచు బౌద్ధ భిక్షువులను మా పర్వతాలపై నున్న గ్రామాలకు ఆహ్వానిస్తుంటాము. ఒకొ్కక్కప్పుడు తమంత తామై కూడా భిక్షువులు మా గ్రామాలకు వస్తుంటారు. మా దేశీయులు ఎంత ఎత్తైన పర్వతాల నయినా సునాయాసంగా ఎక్కుతారు. ఉద్యానవాసి అయిన భిక్షువు పర్వతాల నధిరోహించడం ఏమంత కష్టమైన పని కాదు. పైగా భిక్షువులుకూడా బాల్యంలో ఈ మైదానంలోని జీవితాన్ని అనుభవించే వుంటారు. కానీ సహజంగానే పసిరిక మైదానాల్లోకి రావ

డానికి ఉత్సుకతను కనబరుస్తుంటారు. బౌద్ధభిక్షువు లొచ్చారంటే మా గ్రామాలు మహాసందడిగా వుంటాయి. ఇకఏదైనా సంఘారామపు మహాస్థవిరు ఐచ్చారంటే స్వాగతవాయిద్యాలు మార్మోగుతూంటాయి. గుడిశల్లోని స్త్రీ, పురుషులూ బాల బాలికలూ అందరూ ఎదురువెళ్ళి పంచ ప్రతిష్ఠత నమస్కారాన్ని (రెండూమోకాళ్ళనూ, రెండుచేతులనూతలనూ నేలకుఆనించి నమస్కరించడం)-గావిస్తారు. మహాస్థవిరుల ఆశీర్వాదాన్ని పొంది వారిని వాయిద్యాల తుముల ఘోషతో పాటలు పాడుకుంటూ గ్రామంలోకి తీసుకువస్తారు. ఒక్కొకప్పుడు స్థవిరుల కొరకు ప్రత్యేకం ఓ గుడిశను నిర్మిస్తూంటారు. అదే గుడిశలోకి నలుగురైదుగురు భిక్షువులు రావడమూ, ఆ గుడిసే ఓ చిన్న సంఘారామంలా మారడం జరుగుతూ వుంటుంది. వర్షాకాలపు చివరి రోజుల్లో గనుక వచ్చినట్లయితే రెండు మూడు రోజులకు మించి మా గుడారాల గ్రామంలో వుండరు భిక్షువులు. కానీ వర్షాకాలపు ప్రథమదశలో గనుక వచ్చారా ఇక వర్షాకాలమంతా అక్కడే వుండిపోతారు (బౌద్ధ భిక్షువు వర్షాకాలంలో చారికం (దేశాటన-చేయరాదు) అమావాస్య పౌర్ణమీ మొదలైన ప్రత్యేకతిథుల్లో పూజలు చేసేవారు. ఆ నాడు ఉపవాసం వుండేవారు. మాంసాన్ని ముట్టేవారుకాదు. కేవలం మధ్యాహ్న సమయంలో కొద్దిపాటి శాకాన్నిగానీ, ఇతర పదార్థాన్ని గానీ ఆహారం క్రింద స్వీకరించేవారు. సాయంకాలం అందరూ ధర్మోపన్యాసాన్ని వినడానికి ఒకచోట గుమిగూడేవారు. మా భదంతులవారు (స్వాములవారు) అతిశ్రావ్యంగా, అత్యాకర్షణీయంగా ధర్మోపన్యాసాన్నిచ్చేవారు.

ఒక సంవత్సరం మహాస్థవిర సంఘవర్ధనులువర్షావాసాన్నిగడపడానికి మా మైదానాల గ్రామానికి వచ్చారు. నలుగురైదుగురు భిక్షువులు, నలుగురైదుగురు శ్రమణులు (బాలభిక్షువులు) కూడా వున్నారు. వారా సంవత్సరం దాదాపు నూరుదాకా జాతక కథల్ని చెప్పారు. వారుకథచెప్పే పద్ధతి బహు శ్రావ్యంగా, సుబోధకంగా వుండేది. నాలాటి పది పన్నెండేళ్ళ కుర్రవాళ్ళుకూడా వారు చెప్పే కథల్ని చక్కగా అర్థం చేసుకునేవారు. ఈ కథల్లో ఎక్కువభాగం పశు పక్ష్యాదుల గురించినవే కావడం వలన పిల్లలకు వినాలన్న ఉత్సుకతను కలిగిస్తూంటాయి. అప్పుడు విన్న

కథల్లో కొన్ని ఎంతో హృద్యమంగా వుండి, హృదయంలో నాటుకు పోయాయి. వృద్ధుణ్ణయి, జ్ఞాపకశక్తి క్షీణిస్తున్నప్పటికీ – ఈ నాటికీ – సంఘవర్ధనులు చెప్పిన కొన్ని కథలు నాకు చాలా జ్ఞాపక మున్నాయి. విషయం దృష్ట్యా కథల్లో గొప్పతనం లేదనను. కానీ, సంఘవర్ధనులు కథలు చెప్పిన పద్ధతి మహా నైపుణ్యంగా వుంది. అందువల్లే ఆ కథలు ఇప్పటికీ నా స్మృపథంలో చెరక్కుండా వున్నాయి. వర్షావాసం సమాప్త మవడానికి వచ్చింది. ఆశ్వయుజ పౌర్ణమి ప్రవారణోత్సవం గొప్పగా జరిపాము. చుట్టువట్ల గ్రామాల్లోని స్త్రీ పురుషులు కూడా ఆనాడు ఉపదేశాన్ని వినడానికి వచ్చారు. ఆరోజు తథాగతుని జీవితాన్ని గురించి, సంఘవర్ధనులు చాలాసేపు ఉపన్యసించారు. వారి ఉపన్యాసంసమాప్త మయ్యేసరికి తెల్లవారు జామయింది. అంతవరకూ విన్న కథలు, ఉపన్యాసాలూ నాహృదయంలో గొప్పగా స్థానా న్నేర్పరచుకున్నాయి. ఈ అంతిమోపన్యాసాన్ని ఆసాంతం వినాలని నిశ్చయించుకున్నాను. మధ్యలో నిద్రవస్తుందేమోనని, పగలే బాగా నిద్రపోయాను. ఆ రాత్రి నేను చాలా శ్రద్ధాసక్తులతో, కన్ను రెప్పవేయకుండా కథను – ఉపన్యాసాన్ని – విన్నాను. మా అత్తా, మా నాన్న, మరికొందరు నాయీడు పిల్లలూ కథ ప్రారంభించిన కొద్దిసేపటికే కునికిపాట్లల్లో పడ్డారు. నేను మాత్రం రెప్ప వాల్చలేదు. మహాస్థవిర సంఘవర్ధనులు అనేకమార్లు జంబూద్వీపం అంతటాయాత్రసల్పివచ్చారు. జైత్రవనపుమహావిహారంలో అనేక సంవత్సరాలుండి అధ్యయనం చేశారు. వారిలాటి ఆకర్షణీయమైన, జ్ఞానవర్ధకమైన మధుర్యవాక్పటిమను చాలా కొద్దిమందిలో చూశాను. వారు తథాగతుని బాల్యజీవితానికి సంబంధించిన వర్ణనలను చేస్తూన్నప్పుడు ధ్వన్యాత్మకమైన శబ్దాలు ప్రాణాన్ని పోసుకుని సజీవమనుష్యాకృతిలో కళ్లెదుట నిలిచేవి. వారి వర్ణనల వలన బుద్ధుడు నిత్యం మాఆటపాటల్లో పాల్గొంటూ వుండే మిత్రుడిలా, సహచరుడిలా కనిపించేవాడు, కానీ, వారి ఉపన్యాసంలో ఎన్నో నిగూఢ విషయాలు ఇమిడివుండేవి, అవి నాకు అర్థమయ్యేవి కావు. అప్పట్లో నా జ్ఞానం బహుపరిమితం, మా ఉద్యాన భూమిద్వారా ప్రపంచాన్ని చూస్తుండేవాడిన్ని. మా ఉద్యానభూమిలోలా ప్రపంచమంతా పర్వతాలతోనిండి వుంటుందని, ప్రతిచోటా మాఉద్యానభూమిలోలాగానే

కొన్ని నెల్లు తప్పవిసరిగా మంచు పడుతూవుంటుందనీ అనుకునేవాడిని.
కానీ, మహాస్థవీరులు తథాగతుని జన్మభూమిలో పర్యటించారు. జైత్ర
వనంలో చాలా సంవత్సరా లుండటమే కాకుండా, బౌద్ధ మతానికి అతి
పవిత్ర స్థలాలుగా భావింపబడే ఎనిమిది స్థానాల్లోనూ-లుంబినీ, కుశీనారా,
వజ్రాసనం (బోధగయ), ఋషిపతనం(బెనారస్) ,సంకాస్య, రాజగృహ
వైశాలి - ఒక్కో- వర్షావాసాన్ని చేశారు.

బుద్ధుని జీవితానికి సంబంధించిన వస్తువులగురించి, స్థానాలగురించి
అప్పటికి నా కేమీ తెలియదు. నా కేకాదు, చాలామంది పెద్దవాళ్ళకూ-డా
తెలియదు. వాటిని గురించి తెలియకపోయినందువలన కథాగమనానికి,
ర క్తికి ఎలాంటి ఆటంకమూ కలిగేదికాదు.

ఆనాటి మహాస్థవిరుల ఉపన్యాసం నాహృదయంమీద శాశ్వతమైన
ముద్రను వేసింది. ఆనాటినుండే నా భావాల్లో మార్పువచ్చింది. నూతన
మైన స్ఫురణలు కలిగాయి. జీవితాన్ని మనసుఖం, మన సౌఖ్యం కోసం
ఖర్చు చేసుకోవడంలో ఎంత ఆనందం లభిస్తుందో, ఇతరులసుఖం, ఇత
రుల సౌక్యంకోసం ఖర్చుచేయడంలోనూ అంతే ఆనందం కలుగుతుం
దని తెల్సుకున్నాను. ప్రవారణోత్సవపు రాత్రి నా జీవితాన్నంతటినీ తీర్చి
దిద్దిన ఆదర్శోన్ముఖం చేయగలగొప్ప ప్రేరణ లభించింది. ఆనాటిరాత్రి
నా హృదయంలో నాటుకున్న బీజాలే, తరువాతి జీవితంలో అంకురించి,
మహావృక్షాలై, నా జీవితమంతటికీ సుఖదాయిని అయిన నీడ నిచ్చాయి.
అప్పుడు మహాస్థవిరులు ఎనభై ఏండ్ల వయస్సులో వున్నారు. నేను
పన్నెండేళ్ళ బాలుణ్ణి, ఇప్పుడు డెబ్బది ఏండ్ల వాణ్ణయ్యాను. మేమిద్దరం
కలిసి ఒకటిన్నర దశాబ్దకాలం ఈ ప్రపంచాన్ని చూశాము. ఈ ప్రపంచం
చాలా విశాలమైంది. ఈ ప్రపంచం దేశగతమైన మార్పులచే అనేక పరి
వర్తనల్ని చెందుతుంది. కాలగతమైన మార్పులుకూడా ఈ ప్రపంచాన్ని
గుర్తింపలేనంతగా మార్చేస్తాయి. గడచిన తరాలు కంటికి దూరమై.
నశించి క్రమేణా మన జ్ఞాపకాలనుండికూడా వైదొలగుతాయి. వాటి
స్థానాన్ని క్రొత్తతరాలు ఆక్రమిస్తుంటాయి. ప్రపంచంలో దుఃఖం వుంది.
అపారమైన దుఃఖం వుంది........ దుఃఖం ఉన్నదని తథాగతుడుకూడా
ఒప్పుకున్నాడు. అయితే, తథాగతుడు, రోగానికి వలెనే దుఃఖానికికూడా

ఏదో ఒక కారణం వుంటుందని ఒప్పుకున్నాడు. ఆ దుఃఖాన్నుండి విము క్తికి మార్గాన్నికూడా ప్రతిపాదించాడు తన ఉపదేశాలవల్ల, చరిత్రవలన ప్రజలను విముక్తి మార్గావలంబులుగా చేశాడు. తథాగతుడు దుఃఖనివార ణకు చూపిన మార్గం బహుజన హితం, బహుజన సుఖం। ఈ మార్గా న్ననుసరించిన మానవుడు జీవితాన్ని తన సుఖసౌఖ్యాలవరకే పరిమితం చేసుకొనరాదు. ప్రతి మానవుడు తన పొరుగువాడి సౌఖ్యం కొరకు, సుఖం కొరకు బ్రతకడం నేర్చుకుంటే, ఇక నీ ప్రపంచంలో దుఃఖానికి స్థానమెక్కడిది? నాలుగు వైపులా స్వార్థాంధకారం వ్యాపించి ఉంది. దాన్ని తొలగించడానికి బుద్ధుడు బోధిప్రదీపాన్ని వెలిగించాడు.

ఆ రాత్రి నా హృదయంలో నాటుకున్న బీజాలు చాలా రోజులు హృదయపు అంతరాంతరాల్లో అజ్ఞాతంగా పడివుండిపోయాయి. కొన్నాళ్ళ వరకు మహాస్థవిరుల ఉపదేశాలు, ఉపన్యాసాలూ జ్ఞప్తికి వస్తూవుండేవి. వారి పరిచయ భాగ్యానికి దూరమైనందుకు చాలాబాధపడేవాణ్ణి·కొన్నాళ్ళ పాటు అంత ఉత్సాహంగా ఆట పాటల్లోనూ పాల్గొనలేకపోయాను. కొద్ది రోజుల అనంతరం మామూలుగా నా ఆటపాటల్లో పాల్గొంటూ మనస్సు లోని బాధ నంతటినీ మర్చేపోయాను. మళ్ళీ అదే జీవితం, ఉదయాన్నే పశువుల్ని కాయడానికి వెళ్ళడం, ఆటలూ, పాటలూ, వేట...।అయితే, ఈ మధ్యకాలంలో, నా జీవితంలో ఒక పరివర్తనమాత్రం కలిగింది.వెన కటిలా ఇప్పుడు ఏ జంతువునూ వేటాడలేకపోతున్నాను। ఏ జంతు వుకూ అపకారం చేయలేకపోతున్నాను. వెనకటిలా నాచేతులు ఏజంతువు మీదా బాణాన్ని సంధానించవు. కేవలం దుర్గమ పర్వత శిఖరాల నధి రోహించడంలోనే వేటాడిన ఆనందాన్ని పొందుతున్నాను. నాలోవచ్చిన ఈ పరివర్తన నాతోటి మిత్రులకు కూడా తెల్సింది. "పెద్ద భిక్షువు బయల్దే రాడం"టూ పరిహాసం చేస్తూండేవారు. మొత్తానికి, ఆట పాటల్లో వెనక టంత ఉత్సాహంతోటే పాల్గొంటూండేవాణ్ణి। వెనకటిలాగానే మిత్రులు 'మరోపాట' 'మరోపాట' అంటూ బలవంతంచేసి నాచేత పాటలు పాడించుకునేవారు.

పసిరిక మైదానాల్లో, వర్షాకాలవు నాలుగయిదు నెల్లు మాత్రమే వుంటాము. కానీ, ఆ నాలుగయిదు నెల్లూ క్షణాల్లా గడిచిపోయినట్టుగా

వుండేది. వర్షాలు తగ్గుతూ తగ్గుతూ చివరకు ఆగిపోతాయి. వర్షాలు ఆగిన మాత్రాన పశుగ్రాసం తగ్గుతున్నదన్నమాటేమీ వుండదు. వత్తుగా మైదాన మంతట్లోనూ వ్యాపించివున్న పసిరికి రెణ్ణెల్లో, మూడు నెల్లో పశువులు మేస్తే అయిపోనూ పోదు। వర్షాకాలపు నాలుగయిదు నెల్లూ ఒకే స్థానంలో వుండి పశువుల్ని మేపుకున్నా పశుగ్రాసానికి ఏలాటి కొరతా రాదు. కానీ, ఎరువును అధికంగా ప్రోగు చేయాలనే ఉద్దేశంతో నెలకూ పదిహేను రోజులకూ మా గుడిశలనూ, గుడారాలను మరికొంత దూరం లోకి మారుస్తాము. మేము అక్కడ వున్నన్నాళ్ళూ కాలాన్నికూడా లెక్కించుకుంటూ వుంటాము. అక్కడికివెళ్ళిన మూణ్ణెళ్ళకు చలి వృద్ధవు తుంది. ఇకనప్పుడు, మైదానాల్లోని మా జీవితం చివరి ఘట్టంలో పడ్డదని తెల్సుకుంటాము. నాలుగవనెల చివరికల్లా, పసిరిక పసుపుపచ్చరంగుకు తిరుగుతుంది. మా హృదయ లతకూడా వాడి, ఎండి, పసుపు పచ్చనకు తిరుగుతుంది. క్రింది గ్రామాలకు పోవాల్సిన సమయ మాసన్నమైం దనుకునే వారం. మైదానాల్లో పిల్లలందరం ఏక కుటుంబీకులుగా,ఒకేచోట తింటూ, ఆడుకుంటూ, నిద్రిస్తూ వుంటాము. క్రింది గ్రామాలకు వెడితే ఈ ఏక కుటుంబం అనేకమైన చిన్ని చిన్ని కుటుంబాలుగా విభ జింపబడుతుంది. మా గ్రామం అతిశీతల ప్రదేశంలో వుండడం వలన. చలికాలంలో క్రింది ప్రదేశాల్లోగానీ, నదీతీరాలకుగానీ వెత్తుంటామని ముందే చెప్పాను. అందువలన, మంచులో ఆడుకునే ఎన్నో ఆటలు, ఆడడానికి వీలులేకుండా పోతుంది. వాటినుండి లభించే ఆనందానికి దూర మౌతాము. కనుకనే, చలికాలంలో మా అమ్మమ్మ (అమ్మకుఅమ్మ) గారి గ్రామానికి వెడదామని గోల చేస్తూండేవాణ్ణి. అంటే. నాకు మంచు, లేక హిమకాలం తప్ప అన్య ఋతువులూ, కాలాలూ నచ్చవని అర్థంకాదు.

మైదానపు జీవితం నాకు అత్యంత ప్రియమైంది. మైదానాల్లోకి వెళ్ళిన రెండవ మూడవ నెలలూ మహా ఆనందదాయకంగా వుంటాయి. ఆ రెణ్ణెల్లూ పర్వత మైదానాలు అతి దీర్ఘములైన పచ్చిగడ్డితో నిండి వుండడమేకాక రంగు రంగుల హూవుల్తో కళకళ్ళాడుతుంటాయి. పూవులు వేలరకాల్లో. వేల రంగుల్లో వికసించి నందనవనాన్ని మరిపిస్తుంటాయి. ఒకే పూవు అనేక రంగుల్లో వుంటుంది. దాన్ని 'సప్తవర్ణిక' అని

హేళనచేసే వాళ్ళం. నీలపు పూవులు కొన్ని...మరా నీలంలోనే అనేక రకాలు! కొన్ని స్వల్పనీలం...కొన్ని గాఢనీలం, అలాగే అనేక రకాలు! ఎర్రని పూవులుంటే వాటిలోనూ ఎన్నోరకాల ఎరుపులు! వాటి ఆకారాలు కూడా ఎన్నోరకాలుగా చూడముచ్చటగా వుంటాయి. పూవులేకాదు ఆకులుకూడా రకరకాలుగా వుంటాయి. కొన్ని పూవులు గొప్ప సువాస నను కలిగివుంటాయి. మరికొన్ని పూవులు చూడడానికి మహా అందంగా వుంటాయి. వాసన వుండవు! కొన్ని పూవులకైతే ఆకులుకూడా ఎంతో సువాసనగా వుంటాయి. ఆరెణ్ణెల్లూ బాల-బాలికలం పూవులతో అనేక మైన ఆటలు ఆడుకునేవాళ్ళం. ఒకళ్ళ తల వెంట్రుకలను మరొకళ్ళం పూవుల్తో అలంకరించేవాళ్ళం! ఉద్యానదేశం అతిశీతల ప్రదేశం కావడం వలన అక్కడి ప్రజలు రోజూ స్నానంచేయరు. అందుకని వారిని హేళన చేయడమో, లేక నిందించడమో, కాక అసహ్యించుకోవడమో తగదు. ఉద్యాన దేశాన్ని ఎన్నడూ వెళ్ళి చూడని మిత్రులూ, భిక్షువులూ వినికిడి వలన తెలిసిన ఆక్కడి మురికితనాన్ని గురించి ఏవగించుకుంటూ వుండేవారు. అలాటి వారికి నేనిలా సమాధానం ఇచ్చేవాణ్ణి "ఎముకల్ని కొరికే ఆ చలిలో, అప్పుడే కరిగిన మంచు నీటిలో స్నానం చేయాల్సి వస్తే, తమరు మా కంటే కూడా పదడుగులు వెనక వుంటారు!"

మైదానాల్లో, అప్పుడప్పుడు, వర్షంలో మేము తడవడం కూడా కద్దు! వర్షపు నీటివలన ముఖాలు కడిగినట్లయి అధికోజ్వల మవడాన్ని మేము చూస్తూనేవుంటాము. అంటే, స్నానంలోని ప్రయోజనమూ, ప్రత్యేకత మాకూ తెల్సు! కనుకనే, వర్షం కురిసేప్పుడు బాలబాలికలం మా వస్త్రాలను విడిచి, నీటిలోతడిపి స్నానం చేస్తాము. మేము నీటిలో నిలబడినప్పుడు వర్షపు నీటివలన మా శరీరం తడిసినకొలది, మా ఆనం దానికి మితేతికుండా వుంటుంది. ఎగురుతూ. గంతులువేస్తూ, పాటలు పాడుకుంటూ, ఒకళ్ళ శరీరంమీది మట్టిని మరొకళ్ళం తుడుస్తూ; స్నానం చేస్తాము. అప్పటి మా ఆనందం వర్ణనాతీతంగా వుంటుంది.

మా తల వెంట్రుకలు పసుప్పచ్చగా వుంటాయి. మాలో కొంత మంది వెంట్రుకలు ఎర్రగాకూడా(రాగిజుట్టు)వుంటాయి. మానవులందరి

తల వెంట్రుకలూ పసుపుపచ్చగా వుండవనీ, మానవుల్లో ఎక్కువభాగం నల్లని తల వెంట్రుకలు కలవారేననీ అప్పటికి నాకు తెలియదు.వర్షాకాలపు రెండవ నెల, మూడవ నెలా పసిరిక మైదానాలు, వివిధ, వికచ పుష్ప చయాల్తో, అపూర్వ సౌందర్యంతో, విలసిల్లుతూ మా ఆనందాన్ని పరాకాష్ఠకు చేరుస్తాయి. ఐతే, నాలుగవ నెలలోనే మహానందదాయకమైన ఆ స్వర్గభూమిని తప్పనిసరిగా విడిచిపెట్టవలసి వస్తుంది. ఇది మాకు దుఃఖదాయకమైన విషయం!ఐదవ నెల సగంపడేసరికి విధిగా మేమా మైదానలను విడవవలసే వస్తుంది;ఒక్కో సంవత్సరం అంతకంటె ముందుకూడా విడవడం కద్దు కారణం, ఋతుపరివర్తన వారం పది రోజులు వెనక ముందుగా జరుగుతూంటుంది. ముందు ఆవుల్ని-ఎద్దుల్ని క్రిందికి పంపుతారు. ఆ తరవాత గుర్రాలను, చిట్టచివరకు గొర్రెలనూ మేకలనూ క్రిందికి పంపుతారు. వాటితోపాటే గుడిశలనూ గుడారాలనూ ఖాళీచేసి, తట్టబుట్టా నెత్తికెత్తుకొని మా పెద్దవాళ్ళు కూడా క్రిందకు దిగుతారు. పిల్లలందరినీ ముందుగానే ఆవుల్తోపాటు క్రిందికి పంపించేస్తారు. అలా ముందే మమ్మల్ని క్రిందకు పంపవలదనీ, మేము చివరిదాకా పైనేవుండి, పెద్దవాళ్ళతోపాటు దిగుతామనీ ఏడ్చి గోలచేస్తాము. అయినా పెద్దవాళ్ళు మమ్మల్ని ముందుగానే క్రిందికి పంపించి వేస్తారు. స్త్రీలుకూడా మాతో పాటుముందే క్రిందికిదిగుతారు. నాలుగవ నెలలో వచ్చిన ఆహారంతోనే మిగిలిన సమయాన్నంతా గడిపివేయాల్సివుంటుంది. ఆ తరువాత క్రింది నుండి ఆహార పదార్థాలేవీ పైకిరావు. ఆవుల్ని పంపించివేశాక పైన నిలచివున్న పురుషులు, మేకల పాలే త్రాగాల్సివుంటుంది. వెన్న పరవా లేదు. సమృద్ధిగానే లభిస్తుంది; మాంసమూ లభిస్తుంది. ఇతర ఆహార పదార్థాలు చాలా పరిమితంగా వుంటాయి. పురుషులుకూడా క్రిందికి దిగి వచ్చేప్పుడు, కొద్ది గొప్ప మిగిలివున్న ఆహార పదార్థాలను వెంట తెచ్చుకోరు. అలా తెచ్చుకోవడం అభద్రతగా భావించబడుతుంది. అక్కడే ఒక పెద్ద గుంటతీసి, అందులో భూపత్రాన్ని పరచి- ఆ పత్రం పైన ఆ ర పదార్థాలుంచి పైన మరో భూర్జపత్రాన్నిపేసి మట్టి కప్పేస్తారు. మరుసటి సంవత్సరం వర్షాలు ప్రారంభించడానికి కొంచెం ముందు గనక వచ్చామంటే,ఆ ఆహార పదార్థం ఏ మాత్రమూ చెడకుండా వుంటుంది.

పై నుండి క్రిందికి దిగడంలో ఏ మాత్రం ఆలస్యమయినా, హిమం అక్షు
ణ్ణంగా కురవసాగిందా, ఇక మనుష్యులకు పశువులకు గొప్ప ప్రమాదం
సంభవించినట్లే:కనుకనే ప్రథమ హిమపాతానంతరం మేము మైదానాలను
వదలి గ్రామాలవైపు ప్రస్థానం సాగిస్తాము.ఒక్కోప్పుడు మేము క్రిందకు
దిగడానికీ, హిమపాతానికీ పోటీ పడుతుంది; పశువులకు, మానవులకు
ఏమాత్రమూ ప్రమాదంకలగకుండా క్రిందకి దిగిన సంవత్సరం గొప్ప
ఆనందోత్సవాన్ని జరుపుకుంటాము.

# 3 వ అధ్యాయం

# ప్రేమం

## ( క్రీ శ 534 - 35 )

పర్వత మైదానాల్లోని జీవితమంటే నాకు చాలా ఇష్టం. సాధారణంగా ప్రతి వర్షాకాలాన్నీ మైదానాల్లోనే గడుపుతూండేవాణ్ణి. నాది పూర్తి తిరుగుబోతు జీవితం. ఈ తిరుగుబోతు జీవితానికి, మైదానాల్లోని వర్షావాసం ఓ పాఠశాలలా పనిచేసింది అనుకుంటున్నాను. ఈ చీనా దేశానికి వచ్చాక, మార్గ మధ్యంలోనూ ఎన్నోవందలమంది యాత్రికులూ, పర్యటకులూ కలిశారు. వారందరూ దుర్గమమైన పర్వతాలగుండా, భయంకరమైన అరణ్యాలగుండా, ఎడార్లగుండా, ప్రళయ పవనాలతో కల్లోలితమౌతూన్న సముద్రాలగుండా వేల యోజనాలు యాత్రచేశారు. అయితే, నా జన్మస్థానమయిన ఉద్యానదేశపు పర్వత మైదానాల పరిచయం కలవారు వారిలో ఒక్కరూ లేరు. వారిలో చాలామంది పట్టణాల్లో పుట్టినవారే. వారి బాల్య జీవితంకూడా పట్టణ పరిసరాల్లోని ఏ సంఘారామాల్లోనో గడిచివుంటుంది. అయినా, వాళ్ళు అంతకష్టతరమైన యాత్రల్ని చేయగలిగారు! ఉద్యానవాసుల జీవితం బాల్యంనుండి ఎంతో పరిశ్రమతో కూడుకొనివుంటుంది. మాకు మొదటినుండీ వళ్ళుదాచుకోకుండా కఠినపరిశ్రమతో జీవితాన్ని గడపడం అలవాటు. కనుకనే మేము ఎలాటి కష్టాలనైనా ఓర్పుగా సహిస్తాము. వీపున బరువు మోయడం మాకు చిన్నతనం నుండి అభ్యాసమే! పెద్దవాళ మయినా, మణుగూ మణుగున్నర బరువును వీపుమీద వేసుకుని అతి దుర్గమైన పర్వతాల నధిరోహిస్తుంటాము. అం! మైదానాల్లాంటి అతిశీతలప్రదేశంలో మాత్రం త్వరగా అలసటచెందుతూంటాము. బరువును మోయగల మా సహజశక్తికూడా సన్నగిలిపోతుంది అలాటి

ప్రదేశంలో! "పర్వతాగ్రాలకు పోయినకొలదీ చలి ఎందుకు ఎక్కువ అవుతుంది? పదడుగులు నడిచేసరికి అలసట ఎందుకు వస్తుంది?" అని నేను అనేకమార్లు ఆలోచించాను. కొంతమందిని అడిగానుకూడాను. వాళ్ళిలా అన్నారు: "వర్షాకాలంలో పర్వతాలపైన ఎన్నోరకాలైన పూవులు వికసిస్తాయి. వాటిలో కొన్ని వాతావరణాన్ని విషతుల్యం చేస్తాయి. ఆ గాలి పీల్చడంవల్ల పదడుగులు నడిచేసరికి అలసట వచ్చేస్తుంది!"

కొంతమంది అక్కడి మట్టిలోనుండి విషవాయువు పైకి వస్తూ వుండవచ్చనికూడా అన్నారు. ఐతే, ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చినవారు ఉద్యాన దేశీయులుకారు. ఈ అభిప్రాయాన్ని తెల్పినవారి దేశాల్లోని పర్వతాలు, సస్యరహితంగా, బోడిగావుంటాయి! 11/712 / 11837

మైదానాల జీవితం, ఆ సందడి, ఆటపాటలూ - అన్నీ క్రమేణా ముందుకుసాగాయి. పసితనం బాల్యంలోకి, బాల్యం నవతారుణ్యంలోకి పరివర్తనచెందాయి. నా జీవితంలోనూ నవతారుణ్యత, సహజ పరివర్తనలు తీసుకువచ్చింది. చలికాలంలో క్రింది గ్రామాలకు వెళ్ళేవాళ్ళం. మా పెద తండ్రిగానీ, లేక మరో ఇతర భిక్షువుగానీ మా నివాసాల్లో కొన్నాళ్లు తప్పనిసరిగా వుండేవారు. మా పెద తండ్రి భిక్షు జినవర్మ నాకు అక్షరాభ్యాసంచేశారు. కొన్ని పుస్తకాలుకూడా చదివించారు. మైదానాల్లో ఒకటి రెండు ధర్మ గ్రంథాలు మినహా మరే యితర గ్రంథాలు లభించవు. క్రింది గ్రామాలలో, ధర్మగ్రంథాలేఅయినా, వివిధంగానూ, బహుళంగానూ లభిస్తాయి. చలికాలంలో మొదట అన్యమనస్కంతోనూ, తరువాత పూర్తి శ్రద్ధాసక్తులతోనూ గ్రంథాల్ని చదివేవాణ్ణి! పెదనాన్నకు నేను వారి శిష్యుణ్ణి భిక్షువును కావాలని ఎంతో కోర్కె. ప్రతిఇంటినుండిఒకరుభిక్షువవుతున్నారంటే వచ్చేతరంలోనూ వారినిఅనుకరించేవారు, అనుసరించేవారు తప్పకుండా వుంటారు. నాకూ, భిక్షువుల వేషభూషలను, జీవన పద్ధతులనూ చూస్తూంటే భిక్షువుని కావాలని కోర్కె జనిస్తూండేది. ముఖ్యంగా బుద్ధుడు కూడా తన జీవితకాలంలో ఇలాటి వేషంతోనే ఇలాగే తిరుగుతూ వుండేవాడుగావాల్ను అనుకున్నప్పుడు, ఆ వేషంమీద, ఆ జీవితం మీద అపారమైన మమకారమూ ఆసక్తి కలుగుతూ వుండేవి. సంఘ వర్ధనుల ఉపదేశాల్ని విన్న తరువాత కొన్నాళ్ళ వరకూ అనంతమైన భక్తి శ్రద్ధలతో

భిక్షువు జీవితంవైపు ఆకర్షింపబడ్డాను. కొద్ది రోజుల తరువాత ఆకర్షణలో 'ప్రబలత' తగ్గింది. అలా తగ్గడానికి ఒక కారణంకూడా వుంది. యవ్వనపు ప్రథమ పాదంలో కాలూన బోతున్నాను. ఆ వయస్సుకు సహజమైన మార్పులెన్నో జీవితంలో జరిగాయి. జీవితంలో ఈ నూతనమైన పరివర్తనలు 'భిక్షు జీవిత'మనే మహా ప్రవాహానికి కొద్దిరోజులు అడ్డు కట్టల్ని వేశాయి. ప్రతి దేశంలోను తమ పద్ధతులు, ఆచారాలు ప్రత్యేకంగా ఉంటాయి. సామాజికమైన నమ్మకాల కారణంగా, ఒక దేశంలో సహజంగా జరిగే పనే మరో దేశంలో నిషిద్ధక్రియగా యెంచబడుతుంది. వివిధ దేశాల్లోపర్యటిస్తూ నేనిలాటి విభిన్నతల్ని ఎన్నింటినో చూశాను. నేను వాటిని స్వయంగా చూడకుండా ఇతరుల నోటిమీదుగా వినడమే జరిగితే బహుశా విశ్వసించేవాణ్ణి కాదేమో. పారశీకులు స్వయంగా తమ తల్లినే వివాహమాడుతారు. అన్నాచెల్లెళ్ళ వివాహాలను శాస్త్ర సమ్మతమైన వివాహాలుగా భావించే దేశాలు వున్నాయి. తథాగతుని వంశీయులు శాక్యులు అన్నా-చెల్లెలు వివాహం చేసుకోగా కలిగినసంతానమని, నేను స్వయంగా ధర్మగ్రంథాలలో చదివాను. కుటుంబంలోని అన్నదమ్ములందరూ ఒక స్త్రీని వివాహమాడే విషయం భారతంలో మాత్రం గదవగలం. కానీ, ఇలాటి వివాహాలు సహజమైన ఆచారాలుగా పాటిస్తూ వుండే దేశాల్లోనే నేను పర్యటించాను. ఇలాటి వివిధ దేశాల్లోని ఆచారాల వ్యత్యాసాల్ని తెలుసుకున్న తరువాత. సామాజిక ఆచారాలపట్ల మానవుడు తనలోని దురాగ్రహాన్నీ, మొండిపట్టునూ విడనాడుతాడు.

ఉద్యాన జీవితం స్వేచ్ఛాయుతమైంది. స్త్రీ పురుషులు స్వేచ్ఛగా ప్రేమించుకుంటారక్కడ. మాకు అన్నపానాదులెంత ముఖ్యమో, నృత్యగానాదులుకూడా అంతేముఖ్యం. నేను బాగా పాడగలనని, నా కంఠం మధురంగా వుంటుందనీ మొదటే చెప్పాను. నృత్యమూ బాగానే చేయగలను కానీ నాలో వున్న పెద్ద లోపం, నేను మితభాషిని. సిగ్గూ, సంకోచ స్వభావాలు కలవాణ్ణి కావడంవలన ఎవరితోటే పెదవి విప్పి మాట్లాడేవాణ్ణికాను. ఈ అతి మౌనస్వభావాన్ని నేనుదోషంగాభావించడం లేదు. తథాగతుడు ఇలాటి మౌన స్వభావాన్ని చాలా మంచిదన్నాడు కూడాను. యవ్వనానికి, ప్రేమకుచాలా ఘనిష్టసంబంధంఉందివీటిఘనిష్టతను

సంకోచం, లజ్జ, మితభాషణ, మౌనస్వభావం-ఏవీ తగ్గించలేవు. నేనెంత మితభాషినయినా, ఆరోగ్యంలోనూ, సౌందర్యంలోనూ ఎవ్వరికీ తీసిపోను. బాగా ఎత్తయిన పర్వతాల నెక్కేవాణ్ణి...స్వయంగా వేటాడలేకపోయినా వేటగాళ్ళవెంట అడవుల్లో చాలాదూరం తిరిగి వస్తూండేవాణ్ణి. ఎంత కఠిన నృత్యాన్నయినా గంటలతరబడి, ఏమాత్రం అలవకుండా చేస్తూండేవాణ్ణి. అలా శ్రమించడం వలన నేమో, బలిష్ఠమైన శరీరంతో, పదిహేనేళ్ళ వయస్సుకే ఇరవై, ఇరవై రెండేళ్ళ నవయవ్వనుడిలా కనిపిస్తూండేవాణ్ణి. మాట్లాడటంలో నేను వెనకపడినా, పని చేయడంలో, ముఖ్యంగా ఇతర్లకు సహాయంచేయడంలో అధిక తత్పరుణ్ణయి ఉండేవాణ్ణి. నాయీడు బాలబాలికలకు నే నెన్నడూ నాయకుణ్ణి కాలేదు. కానీ అందరికీ ప్రియపాత్రుడిగా మాత్రం వుండేవాణ్ని. నే నెన్నడూ ఎవరితోటీ పోట్లాడి ఎరుగను.

నా సమ వయస్కులు కొంతమంది ఆరు, ఏడు సంవత్సరాల వయస్సులో శ్రమణులై సంఘారామాల్లోనే వుంటున్నారు. వాళ్లు అప్పుడప్పుడు తల్లిదండ్రుల్ని చూడడానికి గ్రామానికివచ్చేవాళ్లు. నేను వాళ్ళను కల్సుకుంటూండేవాణ్ణి. వాళ్ళలో ఇప్పుడు ఎంతో మార్పు వచ్చింది. వెనకటిలా కలసిమెలసి ఆటపాటల్లో పాల్గొనడం ఇప్పుడు జరగదు. వాళ్ళు వయస్సులో ఒకటి రెండు నెలలు నాకంటే చిన్నవాళ్ళు. అయినా నా తల్లిదండ్రి వాళ్ళు తమకంటెకూడా పెద్దవాళ్ళయినట్టు గౌరవాన్నిచ్చి పంచ ప్రతిష్ఠిత ప్రణామా న్నాచరించేవారు. నేను మా పెద్దవాళ్ళ ననుసరించి వాళ్ళకు నమస్కరించేవాణ్ణి. వాళ్ళు ఎనభై ఏండ్ల వృద్ధుల్లా ఒక చేతివి అని దీవించేవారు. తరువాత వాళ్ళ చదువును గురించి అడిగి తెల్సుకునేవాణ్ణి. వాళ్ళసమాధానాలు నన్నెంతగానో ఈర్ష్యాళువును చేసేవి. ఇంకా కూడా మనస్సుంచి, పాఠాల్ని వల్లించేవాణ్ని. నాకు జ్ఞాపకశక్తి వాళ్ళకంటే అత్యధికం. కనుకనే నేను ఇంట్లోవుండి చదువుకుంటున్నా సంఘారామాల్లోని నాయీడు బాలురకు ఏ మాత్రమూ తగ్గకూడదన్న పట్టుదలతో ఉండేవాణ్ణి. తగ్గలేదు కూడాను. అప్పటికే నేను సంఘారామంలో చేరాల్సింది. చాలా ఆలస్యమయింది; అప్పటికి నాకు ఇద్దరు తమ్ముళ్ళు పుట్టడమూ, అమ్మ చనిపోవడమూ కూడా జరిగాయి. పరిపాటి ననుసరించి, నేను భిక్షువునై, సంఘారామంలో చేరడం విష

యంలో, నా తండ్రికిగాని, పెదతండ్రి. పెదతల్లికిగానీ ఎలాటి అభ్యం తరమూ లేదు; పైగా వాళ్ళు నన్ను సంఘంలో చేర్చేసెయ్యాలనే అనుకుంటున్నారు. పెదతండ్రి భిక్షు జినవర్మకూడా ప్రతి సంవత్స రము నన్ను సంఘంలో సభ్యుణ్ణి చెయమని చెప్తూనే ఉండేవారు. "సంఘంలో చేరితే నరేంద్రుడు ఇంకా బాగా చదవగలడు." అనేవాడు జినవర్మ కానీ, నాలో ఉత్సాహం లేకపోవడాన్ని గమనించి అందరూ మౌనంగా ఉండేవారు. భిక్షువు నవడం నాకిష్టంలేదని కాదు. గృహస్థ జీవితం, భిక్షు జీవితం – ఈ రెండింటిలో దేన్నో ఒకదాన్ని నిర్ణయించు కోలేని స్థితిలో ఉన్నాను. నాకు నృత్యగీతాలంటే మహా ప్రేమ, మరి భిక్షువును కాగానే వీటిని శాశ్వతంగా వదిలివేయవలసి ఉంటుందాయె.

వర్షావాసపు మూడవ నెల. మేమంతా మైదానంలోని ఒక ప్రదే శానికి వెళ్ళాము. అక్కడి పరిసరం వికసించిన పూవుల్తో పుష్ప వాటి కను మరిపిస్తోంది. ...... ఇంతలో కుక్కలు మొరిగాయి, గొర్రెలు బెదిరి పరుగెత్త సాగాయి. అదే సమయంలో పద్నాలుగు పదిహేనేళ్ళ వయస్సుగల బాల బాలికలం చాలామంది సంగీత సభను జరుపుకుంటు న్నాము. ప్రేయసీ-ప్రియుల ప్రేమగీతాల్ని సంవాదంగా ఉభయులూ పాడుతూవుంటే చాలా బాగుంటాయి. ఇలాంటి జంటపాటలు పాడడంలో మా పిల్లల్లో నేను చాలా ప్రసిద్ధిని పొందాను. నేనూ, భద్రా ఏదో ప్రాచీన గీతాన్ని ప్రశ్నోత్తరాల రూపంలో ఒకరి తరువాత ఒకరం ఆలాపిస్తున్నాం. చాలామంది బాల బాలికలు మా చుట్టూ కూర్చుని వింటున్నారు. కుక్కల అరుపులూ, గొర్రెలు బెదిరి పరుగెత్తడాన్ని చూశాక తక్షణం పాటను ఆపి మేమందరం గొర్రెలవద్దకు పరుగెత్తాం ఆకాశాన్నంతటినీ కారుమేఘాలావరించాయి. మా గీతంకూడా కారు మేఘాలావరించిన ఒక సాయం సమయాన పర్వతశిఖరంపై కూర్చుని వున్న యువతీ – యువకుల ప్రేమకు సంబంధించింది. అలాంటి గీతాల్ని ఆలాపించేప్పుడు గీతంలోని వేదన గాయనీ గాయకుల హృదయాలను తప్పక ఆవహిస్తుంది. మేము పాడుతున్నంతసేపూ, నాయకీ నాయకుల భావాలే మా హృదయాల్లోనూ తరంగిత మౌతుండేవి. మేము, గొర్రెల వైపు పరుగెత్తగానే పెద్ద పెద్ద వర్షపు బిందువులు పడసాగాయి. కొద్ది

క్షణాల్లోనే వర్షం తీవ్రమై, వడగండ్లలోకి మారింది. మా శరీరాలమీద వున్న ఉన్ని చొక్కాలూ, తలమీద వున్న ఉన్ని టోపీలూ తమ రక్షణ క్రింద వున్న శరీరాంగాలను తప్పకుండా రక్షిస్తాయి. కానీ, ముఖము, ఇతర శరీరాంగాల రక్షణ ఎలా ? అప్పటికి వడగండ్లు ఏమంత పెద్దవి కాలేదు. కానీ ఏ క్షణాన పెద్ద వవుతాయో, ఎవరికి తెలుసు? మేకలూ గొర్రెలూ మానవులకంటె కూడా అంతర్ జ్ఞానం కలవి. కనుకనే పరిగెత్తుకుంటూ వెళ్ళి పసిరిక మైదానంలో అక్కడక్కడా పడివున్న పెద్ద బండల చాటున ఆశ్రయాన్ని పొందాయి. మేమూ గొర్రెలతో పాటే పరుగెత్తాము. భద్రా నేనూ మరికొన్ని గొర్రెలూ ఒక పెద్దబండ చాటున నక్కాము. మేము బండచాటుకు వెళ్ళిన వెంటనే వడగండ్లు పెద్ద వయ్యాయి. ఈ మైదానాల జీవితంలో, గొర్రెల విషయంలో తనా- పరా అన్న వ్యత్యాసాన్ని కలిగి వుండటం చాలా ప్రమాదకరమైన విషయం. మా వూరి గొర్రెలన్నీ ఒకమందలో వుంటాయి. పోతే, అప్పుడప్పుడూ ఇతర గ్రామాల గొర్రెలుకూడా మా మందలో కలుస్తుంటాయి. ఏ వూరి గొర్రెలు ఏవో తెల్సుకోవటానికి గొర్రెల నడుములమీద గుర్తులు వేస్తుంటాము. అతి భయంకరంగా వడగండ్లు పడుతున్నాయి. శిలాశ్రయం దొరికినందుకు చాలా సంతోషిస్తున్నాము. ఇతర మిత్రు లేమయ్యారు? గొర్రెలు, మేకలు ఏమయ్యాయి? అన్న ప్రశ్న ఇంకా మా హృదయాల్లో ఉదయించలేదు. మా వెంట వున్న గొర్రెలు ఒదుగుకొని ఆ బండ క్రిందవున్న మొత్తం అవకాశాన్ని ఆక్రమించుకున్నాయి. కొద్ది సేపటివరకూ సంశయంవలన వాటి చెవులు రిక్కించుకొని వున్నాయి. అనంతరం గొర్రెలన్నీ ప్రశాంత స్థితికి వచ్చాయి, ఆ గొర్రెల మధ్య మేమూ ఒదుగుకున్నాము. కొద్దిసేపు మాదృష్టి, మనస్సు వడగండ్లమీదే కేంద్రీకృత మయ్యాయి. అనంతరం భద్ర తన స్నేహితురాంద్రగురించి ప్రశ్నించింది. నేనామెకు ధైర్యానిస్తూ ఇలా అన్నాను : "ఒకేసారి పెద్ద పెద్ద వడగండ్లు పడలేదు. అదీకాక. ఇలాంటి శిలలు చాలా వున్నాయి. ఇక్కడ ఏదో ఒక శిలను ఆశ్రయించే వుంటారు."

భద్ర తన ఎనిమిదేండ్ల తమ్ముడ్నిగురించి చింతించ సాగింది. ఈ మైదానపు జీవితంలో, ఇల్లూ, బంధుత్వం వీటికంటే సమవయస్సు చాలా

ప్రధాన మయిందిగా వుంటుంది. అందువల్ల భద్ర తమ్ముడు తన మిత్ర మండలితో వెళ్ళాడు. భద్ర హృదయం లోని తమ్ముడిమీది చింతను బాప డానికి కొద్ది క్షణాలు పట్టాయి. వడగండ్ల వర్షం ఎంతకీ తగ్గేటట్టు లేదు. మా ముందున్న భూమంతా తెల్లని వడగండ్లతో మెరిసిపోతూంది. అయినా వర్షం వెలిసే సూచనలు కనిపించడం లేదు. నేనూ బహుశా భద్ర కూడా కొంతసేపు వర్షం తగ్గడం కొరకు ఎదురుచూశాం. ఎటూ తగ్గదని నిర్ణ యించుకున్న తరువాత ప్రశాంత మనస్కులమయ్యాము. గొర్రెలుకూడా కొద్దిసేపు వర్షం తగ్గడం కొరకు ఎదురుచూచి, తగ్గదని నిర్ణయించుకొని ప్రశాంతంగా నెమరువేయసాగాయి; వడగండ్ల వర్షం ఇంకా అలాగే కురుస్తోంది. గాలియొక్క తీవ్రాఘాతాలు మేము ఆశ్రయాన్ని పొందిన రాతికి వెనకభాగాన అదేపనిగా తాకుతున్నాయి. చాలా సేపటివరకూ మే మలగే మౌనంగా కూర్చుని వున్నాము, ఇంతలో ఎక్కడో పిడుగుపడ్డ భయంకర శబ్దం.... అంతకుముందే కండ్లను మిరుమిట్లు గొలిపే కాంతి ప్రసారం... భద్ర భయపడి నాలోకి ఇమిడిపోయింది. నేను భద్ర తలను నిమిరాను; ఆమె రెండు భుజాలమీదా నా రెండుచేతులనూ వుంచి ధైర్యా న్నిచ్చాను. ఆమె శరీర స్పర్శ నాలో విచిత్రానుభూతులను కలిగించింది గీతాలలోనూ, కథలలోనూ యువతీయువకులు ప్రేమించుకోవడాన్ని విన్నాను. కథల్లోనేకాకుండా యథార్థంగాకూడా యువతీ యువకులు ప్రేమించుకుంటారని తెలుసుకున్నాను. అయితే ప్రేమను గురించి వినడం లోనూ, స్వయంగా ప్రేమను అనుభవించడంలోనూ వ్యత్యాసం వుంది. మధువును గురించి విని రుచిని వూహించడం వేరు; స్వయంగా నాలుక మీద వేసుకుని దాని రుచిని ఆస్వాదించడం వేరు. నా హస్తస్పర్శతో భద్ర కొంత పేద తీరింది. భయం పోయింది. మే మిద్దరం అక్కడే శిల చాటున కూర్చున్నాము. స్పర్శసుఖం మా స్వరాలకు గతిని ప్రసాదిం చింది.

ఉద్యాన భూమిలో క్షత్రియులమని చెప్పుకునే జాతులు చాలా వున్నాయి. వాటిలో మాది ఖసజాతి. మాజాతి ప్రధానమైనదేకాక, ఉద్యాన దేశంలో మా జాతి క్షత్రియులే అత్యధికంగా ఉన్నారు, మా తరువాత శకు లను చెప్పుకోవచ్చు. మాదేశంలో ఏభాజాతి క్షత్రియులుకూడా వున్నారు.

వారిలో కొద్దిమంది సామంతుల్ని, రాజుల్ని మినహాయిస్తే మిగిలినవారం దరూ తిరుగుబోతులైన పశుపాలకులే. మిహిరకులిడి, తోరమాణుడి వంశీయులు కావడంవలన ఏథాజాతీయులు చాలా అభిమానాని ,గర్వాన్ని ప్రదర్శిస్తూండేవారు. వారి ఈ దురభిమానం కారణంగానే 'ఖస', 'శక' జాతులు ఏథా జాతితో ఘనిష్ఠ సంబంధాల్ని ఏర్పరచుకోలేక పోయాయి. భద్ర, శక జాతికి చెందింది. ఉద్యాన నివాసులందరూ బౌద్ధులు. భద్ర కుటుంబంకూడా బౌద్ధమతానికి చెందిందే. భద్ర తలిదండ్రులు తథాగతుని పూజిస్తూంటారు. ఖస, శక, ఈ రెండు జాతులకు చెందిన భిక్షువులు ఒకే సంఘారామంలో వుంటూండేవారు. ఈ రెండు జాతుల సంబంధాలూ చాలా ప్రగాఢమైనవి. మా దేశంలోని శక వంశస్థులందరూ తాము బుద్ధ భగవానుని (శాక్య) వంశీయులమని చెప్పుకుంటారని చెప్పాను. శకులు శాక్య వంశీయులు కావడం సత్యదూరమైనప్పటికీ, వారిని శాక్య ముని యొక్క వంశీయులుగానే భావించి అత్యధికంగా గౌరవిస్తాము మేము. కనిష్కుడు మరి ఇతర శకరాజులూ కట్టించిన విశాలమైన సంఘారా మాల్ని, చైత్యాల్ని దర్శించినప్పుడు, హృదయంలో పాదుకొనివున్న శకజాతిమీద గౌరవం మరీ ప్రగాఢమయ్యేది. ఖస, శక - ఈ రెండు జాతులూ ప్రత్యేకమైనవి. కానీ, ఇప్పుడీ రెండు జాతులూ ఒకటిగా మారి పోయాయి. ఈరెండుజాతుల్లోనూ ఇచ్చిపుచ్చుకోవడాలుకూడా వున్నాయి.

ఖస జాతికంటె శకజాతి ప్రజలు ఎక్కువ ఎర్రగా వుంటారు. వారి తల వెంట్రుకలు నల్లగా గాని ఎర్రగాగాని (రాగిజుట్టు) వుండవు. శక కన్యలు భద్ర లాగానే నీలాక్షులు, నల్లని కన్నులు కలవారు. బుద్ధుని యొక్క రూపాన్ని గురించి కొందరు చెప్పగా విన్నాను. అతడు అతసీ పుష్పాల్లాంటి కండ్లు కలవాడుట (నీలాక్షుడు). పై కారణాల వలన శకులు శాక్యవంశస్థులేనని నమ్మేవాడిని. బుద్ధుని అనంతరం కపిలవస్తు నుండి ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకుని అన్యదేశాలకు ప్రవాసం వెళ్ళిన శాక్యులే, ఉద్యానభూమిలో శకులుగా ప్రసిద్ధి చెందా రనుకునేవాడిని.

భద్ర గొప్ప సౌందర్యవతి. మైదానాల్లోకివచ్చే కొద్దిపాటిగ్రామాల స్త్రీలల్లోనే కాదు, మొత్తం ఉద్యానదేశంలోనే ఆమె అద్వితీయ సౌందర్య వతి. అప్పటికి భద్రకు పద్నాలుగేళ్లు. బాల్యావస్థకు ఉచితమైన అల్లరి

తనం, అమాయకత్వమే ఆమెలో ఎక్కువగా వుండేవి. భద్ర గొంతు నా గొంతు కంటెకూడా మధురంగా వుండేది. మేమిద్దరం జంటపాటలు చక్కగా పాడటం చూసి ఇతర బాల బాలికలు మాకు తెలియ కుండానే మా ఇద్దర్నీ ఒక జోడీగా నిశ్చయం చేశారు. మేమిద్దరమూ ఉన్నామంటే మమ్మల్నే పాటపాడమని బలవంతం చేసేవారు. ఎన్నో ఏండ్లుగా మేమిద్దరము జంటపాటలు పాడుతూ ఒకరి కొకరం బాగా పరిచయుల మైనాము. మేము పాడే పాటల్లోని భావాలను ప్రతిపాదించే శబ్దాలయొక్క కేవలం అర్థాలు మాత్రమే మాకు తెలుసును. పసితనంనుండి కూడా పర స్పరం కలసి మెలసి ఆట పాటల్తో కాలాన్ని గడుపుతూ వచ్చాము. కానీ ఇవ్వాళ మేమిద్దరమూ శిలాఫలకం చాటున ఆశ్రయాన్ని పొంది ఉండగా వడగండ్లు అదేపనిగా భూమిని 'మహాశ్వేత' గా చేస్తుండగా మాకూ, మా గొర్రెలకు ఆశ్రయాన్నిచ్చిన శిలను ఎత్తి ఎక్కడికో పారేయాలని గాలి నిరంతరం ప్రయాస పడుతూవుంటే అవ్యక్త, అనిర్వచనీయ, అతినూతన భావాలతో నా హృదయం ఝంఝూకలిత సముద్రంలా కల్లోలిత మవ సాగింది. "భద్రయొక్క ఆంగికస్పర్శ రోజూలా ఎందుకులేదు ఇవ్వాళ ? ఏమిటీ మార్పు ?" స్పర్శలోని మార్పుకు కారణాన్ని వెతుకుతున్నాను. మొదట ఈ మార్పు కేవలం నాలోనే జరిగింది అనుకున్నాను. భద్ర ముఖం ఎప్పుడూ చిరునవ్వులు చిందుతూనే వుంటుంది. ఆమె ఎర్రని కపోలాలు మరీ ఎరుపెక్కాయి కానీ, అప్పట్లో ఆమె కపోలాల గాఢా రుణిమలోని ప్రత్యేకతను అర్థం చేసుకోలేక పోయాను. హృదయంలోని కల్లోలాన్నీ, అశాంతినీ బాపుకోవడానికి ప్రయత్నిస్తూ, భద్ర తలమీది వర్షపు బిందువులను తుడవసాగాను. తిరిగీ అదేఅనుభూతి; అదేఉత్తేజం. చివరకు ఎలాగో హృదయపు ఆరాటాన్ని అణచుకున్నాను. మౌనం భరించరానిదిగా ఉంది. ఏదో ఒకటి మాట్లాడటం ముఖ్యం. "భద్రా ! ఏమిటిది ? నీ తలా, బుగ్గలూ ముట్టుకుంటే అదోలాఉంది ఇవ్వాళ ?" అనడిగాను నిరుద్దేశంగానే.

"నీకూ అలాగేఉందా, నరేంద్రా ? నా హృదయం ఎంత చంచ లంగా ఉందో చెప్పలేను. మనమెప్పుడూ ఏ నాయకీ నాయకుల గీతాలను

ఆలాపిస్తున్నామో, వాళ్ళే మనల్ని ఆవహించ లేదుకద ?" అన్నది భద్ర.

మనదేశంలో స్త్రీ-పురుషులకు దయ్యాలూ, దేవతలూ పడుతూండడం అతిసహజం. వైశ్రవణుడు (కుబేరుడు) అతడి భార్య హారీతి మాంత్రికులకు పూనుతూ ఉండడం, వారి ముఖతా అనేక విషయాల్ని చెప్పడం జరుగుతూంటుంది. అదే విధంగా మా పాటల్లోని నాయకులు మాకు పట్టడంలో ఆశ్చర్యం ఏముంది! మరి మాంత్రికులు కూడా తమ మంత్రాల (పాటల) ద్వారానేకదా, ఇష్టదైవాలను ఆవాహనం చేసేది ? కానీ దేవతలు వాళ్ళవంటిమీదికి వస్తారు. వాళ్ల వొళ్ళు పెరిగి పరిసరాన్ని, సర్వాన్ని మరచిపోతారు. మా హృదయాలు చంచలంగా ఉన్నా మాలో అలాటి మార్పులేమీ జరగలేదు.

మా హృదయ చాంచల్యాన్ని, ఉత్తేజాన్ని పరీక్షించు కోవడానికి ఒకరినొకరం అనేకమార్లు స్పర్శించుకున్నాము. ప్రతిసారీ మా ఉద్రేకం, ఉద్వేగం పెరుగుతూనే ఉన్నాయిగాని తరగలేదు. భద్రకంటె నా జ్ఞానం, నే చూసిన ప్రపంచం చాలా విస్తృతం. భద్రమైదానాలను, క్రింది గ్రామాలను తప్ప మరో ప్రదేశాన్ని చూడలేదు. ఆమె కనీసం ఉద్యానదేశపు రాజధాని నయినా చూడలేదు. నేనుమాత్రం ప్రతి సంవత్సరం రాజధానిలో గుండానే చలికాలపు నివాసానికి వెళ్తూండేవాణ్ణి. నేను అనేక సంఘారామాల్ని చూశాను. ఒకమారు పురుషపురం (పెషావర్), తక్షశిలమీదుగా కపిషా దేశానికి వెళ్ళి వచ్చాను. మా అమ్మ బ్రతికి వుండగా, ఆమె వెంటవెళ్ళి పై నగరాలనూ, దేశాలనూ చూచి వచ్చాను. అప్పటి నా వయస్సు తొమ్మిదేళ్ళు కావడంవలన, యాత్రలోని అనేక విషయాలను నేను అర్థం చేసుకోనలేక పోయాను... ఇప్పుడు బాగా మనస్సుంచి చదువుతున్నాను. వ్యాకరణం, శబ్దకోశం నాకు కంఠస్థమయ్యాయి. అశ్వఘోషుడి, మాతృచేటుడి కావ్యాలనే కాకుండా, కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్నికూడా చదివాను. నాకు బాహ్యజగత్తు గురించి మానసిక జగత్తును గురించి అనేక విషయాలు తెలుసు. ఇవన్నీ భద్రకు పూర్తిగా అపరిచితాలు. నేను భద్రతో ఇలా వ్యవహరించడం-సరసను కూర్చుని మాట్లాడడం, శారీరక స్పర్శ మొదలైనవి-పుస్తకాల్లో నేను చదివిన

విషయాలయొక్క ప్రయోగాత్మక రూపమనీ, ఇదే జీవితపు మధురానుభూతి అనీ తెలుసుకున్నాను.

నేను నా మానసిక స్థితిని విమర్శించుకోవడంలో ఎక్కువసేపు బుర్ర చెడగొట్టుకోలేదు. మాకు తెలియకుండానే మా ఇద్దరి బుగ్గలూ పెదవులూ ఏకమయ్యాయి. మాహృదయాల్లోని సంకోచమంతా పటాపంచలైంది. మా గీతాల్లోని నాయకీ నాయకుల్లాగానే మేమూ నిస్సంకోచంగా హృదయ మంతటితోటీ ప్రేమించుకున్నాము. మాలో మొగపిల్లలకుగానీ, ఆడపిల్లలకుగానీ ఇరవయ్యో సంవత్సరం దాటితేగానీ వివాహంచేయరు. అందువల్ల అప్పటివరకూ మా వివాహాన్ని గురించిన చర్చలేవీ బయల్దేర లేదు మా ఇండ్లల్లో. ఇంట్లో నా వివాహపు చర్చకు అసలు తావే లేదు. జినవర్మ నన్ను భిక్షువును చేయాలని చాలా తొందరపడుతున్నారు. నా తండ్రి కూడా సమ్మతించాడు. నేనూ భిక్షుసంఘంలో చేరాలని కోరుతూనే వున్నాను. ఇక చర్చకు ఆస్కార మెక్కడిది ?

ఆ సంవత్సరమే నన్ను శ్రమణుణ్ణి చేసేద్దామని మావాళ్ళఉద్దేశం. కానీ, భద్ర స్నేహానికి దూరమౌతానే అని నా బాధ. అంతకుముందు గనక అయితే, కలిసి పాటపాడడం నాట్యం చేయడానికి మాత్రమే దూర మౌతానని అనుకునేవాణ్ణి...ఇప్పుడు స్పర్శ సుఖానికీ, ఆలింగన సుఖానికి కూడా దూర మవుతాననుకోవడం సహజం!నేను అప్పుడప్పుడూ భద్రను కల్సుకొంటూ వుండేవాణ్ణి. ఆమెను స్పర్శించి, ఆమెతో మాట్లాడి తృప్తి పడుతుండేవాణ్ణి...మధ్య మధ్య నా భావాలు సంఘారామ జీవితాన్ననుస రించేవి.

* * *

భిక్షు జినవర్మ నన్నుసంఘంలో చేర్చే విషయంలో ఇంకా హతాశులు కాలేదు. ఈ సంవత్సరపు చలికాలాన్నంతా మా నివాసానికి దగ్గర్లో వున్న సంఘారామంలోనే గడిపేశారు. నన్ను చదివించడంలో వెనకటంత శ్రద్ధా చూపుతున్నారు. జినవర్మ చెప్పినంతవరకూ నేనూ శ్రద్ధగానే చదువుతున్నాను. ఇంకనూ అధికంగా అధ్యయనాన్ని సాగించేట్లయితే జినవర్మ చెప్పలేడు. మరో గురువును ఆశ్రయించవలసి వస్తుందన్న విషయాన్ని నేను అర్థంచేసుకున్నాను. కానీ, గృహస్థు అధికంగా

శాస్త్రాధ్యయనం చేయడం అవసరమని భావిస్తూంటారు వా దేశంలో. అందునా క్షత్రియ గృహస్థుకు శాస్త్రాధ్యయనం పూర్తి అవసరంగా భావింపబడుతుంది. భిక్షువు కావడానికి, నా అసమ్మతిని తెల్పడమో, లేక తిరస్కరించడమో—నే నెన్నడూ చేయలేదు. కాకపోతే రోజుల్ని గడుపు తున్నాను. వర్షాకాలంకొరకు ఎంతో ఉత్సుకతతో ఎదురుచూస్తుండేవాణ్ణి. ఇక వర్షాలు పడ్డాయంటే, మొట్టమొదటి గుంపుతోటే పర్వతాగ్రానికు వెళ్ళిపోయేవాణ్ణి. మేము వెళ్ళేసరికి మైదానాల్లో పూర్తిగా మంచు కరిగేది కాదు. సామాన్యంగా, క్రొత్తగా గుడిశల్ని నిర్మించుకునేవారు మాత్రమే అంతముందుగా మైదానాల్లోకి వెళతారు. భద్ర కుటుంబం ఒక నెల తరు వాతగానీ మైదానంలోకి రాదు. అయితే, క్రింది గ్రామంలో వుండి ఎదురు చూడడం కంటె, మైదానాల్లోకి వచ్చి ఎదురుచూడడం నయమని భావించి, ముందే మైదానాల్లోకి వచ్చేసేవాణ్ణి. వడగండ్ల వర్షం రోజున మా హృదయాల్లో నాటబడిన ప్రేమబీజాలు, ఇప్పుడు మొలకలెత్తి మహా వృక్షాలయ్యాయి. మా ప్రేమగాథ మా కుటుంబాల్లోనే కాక, మా గ్రామాల్లోకూడా తెలిసిపోయింది. ఇక ప్రేమించుకోవడం మా సమా జంలో అస్వాభావికంగానూ భావించబడదు, నిషిద్ధ క్రియగానూ ఎంచ బడదు. ప్రతి ఉద్యాన కుమారుడూ, ఉద్యాన కుమారి జీవితంలో తప్ప కుండా ఎవరో ఒకరిని స్వేచ్ఛగా ప్రేమించే వుంటారు. వివాహం నిర్ణ యంలో తలిదండ్రుల అభిప్రాయాల్ని కూడ గౌరవిస్తారు. కానీ స్వయం వరాలు (స్వేచ్ఛా వివాహాలు) అధికంగా జరుగుతుంటాయి. ఇప్పటికీ మేము జంట పాటల్ని పాడుతూ మా స్నేహితులకు వినోదాన్ని కలి గిస్తూనే వుంటాము. కానీ, ప్రణయసూత్రం సుదృఢమయ్యాక స్నేహి తుల ఎదుట, వెనకటిలా స్వేచ్ఛగా మాట్లాడుకోలేక పోతున్నాము. సిగ్గూ, సంకోచాలు ముప్పిరిగొంటున్నాయి. తరచు ఏకాంతంలో కల్సు కుంటూ వుండేవారం. పరస్పర ఆలోచనలను హృదయాలు విప్పి చెప్పుకునేవారం. భవిష్యత్తుకు సంబంధించిన అనేకమైన కమనీయ కల్పనలను సాగించేవారం. నా తండ్రి, నా పెదతండ్రి జినవర్మ - వీరి ద్దరూ నన్ను భిక్షువును చేయగోరుతున్నారన్న విషయం భద్రకు తెలి సును. ఇక నే నిప్పుడు శ్రమణుణ్ణికావడం జరగనిపని,ఎందువల్లనంటే,

ఇరవై ఏండు దాటాక పురుషుడు శ్రమణు డవకుండా నేరుగా భిక్షువు కావచ్చు. నేను ఇంటివద్దే చదివినా,—ఉత్తముడైన ఏ శ్రమణుడికి తగ్గిపో నంత శ్రద్ధతో విద్యాధ్యయనం చేశాను. అయినప్పటికీ, ఇక ఈ జీవి తంలో భిక్షువు నవడం జరగదని, ఈ జీవితం భద్రదేననీ నిశ్చయించు కున్నాను. అయినా భద్ర అప్పుడప్పుడూ ఆశంకిత అవుతూనేవుండేది.

నాకు పదిహేడవ సంవత్సరం నడుస్తోంది. ఆ సంవత్సరపు వర్షా కాలాన్ని గడపడానికి మైదానాల్లోకి వెళ్ళాము. నేను మైదానాల్లో గడిపే, చివరి వర్షావాసం అదేనని నే నెలా అనుకోగలను. ఒక రోజు మేము కట్టెలకొరకు నాలుగు క్రోసుల దూరంలో వున్న అడవికి వెళ్ళాము. ఉదయాన్నే బయల్దేరి వెళ్ళాము. సాయంకాలానికి తిరిగి వద్దామని మా వుద్దేశం. మాలో కొంతమందివద్ద. తమ కట్టెల్ని మోయడానికి గాడిదలూ, గుర్రాలు వున్నాయి. కొందరైతే, తమ వీపులమీదనే కట్టెల్ని మోసుకొని వెళ్తారు. గుర్రాలూ; గాడిదలు వున్నవాళ్ళు బాగాదూరం వెళ్ళి పెద్ద పెద్ద చెట్లనుండి కట్టెల్ని కొట్టుకుంటారు కట్టెల్ని వీపులమీద మోయవల్సిన వారు అంతదూరం పోకుండా దగ్గరలోవున్న చెట్లనుండి కట్టెల్ని కొట్టు కొని వెనక్కి తిరిగేవారు. మేము కొంతమందిమి గాడిదలూ, గుర్రాలూ వుండడంవలన చాలా దూరం వరకూ వెళ్ళాము. మా గుంపులో భద్రా, ఆమె తమ్ముడు కూడా వున్నారు కట్టెలు కొట్టుకుని, మోపులు కట్టు కున్నాక కొంతసేపు విశ్రాంతి తీసుకునిగాని ఇంటిముఖం పట్టము. మేమందరమూ విశ్రాంతికొరకు దేవదారు వృక్షాలక్రింద కూర్చున్నాము. నేనూ, భద్ర కొంచెం దూరంగా వున్న ఒక దేవదారుక్రింద కూర్చు న్నాము. అలా దూరంగా ప్రత్యేకంగా కూర్చుందామని భద్ర ముందే చెప్పింది. ఆమె ఏదో విషయం మాట్లాడడానికే అలా చెప్పిందను కున్నాను. కట్టెలు కొట్టడంలో బాగా శ్రమించవలసి వచ్చింది. ముఖం మీది చెమట ఇంకా ఆరలేదు. చొక్కా విప్పాను. లోపల బాడీ వుంది. కొద్ది సేపటివరకూ భద్ర మాంసలమైననాభుజాలవైపు. విశాలమైన వక్షం వైపు చూస్తూ వుండిపోయింది. నేనూ భద్ర ముఖంవంకా, సుందరమైన శరీరాంగాలవంకా చూస్తూ కూర్చున్నాను. మొదట భద్ర ముఖం విక సించిన తామరలా కనుపించింది. క్షణంలో వికాసం తగ్గి మేఘాలక్రింద

మరుగుపడిన చంద్రబింబంలా మసకబారింది. స్వచ్ఛ రక్తపూరితములై మెరుస్తూన్న కపోలాలు మలినమయ్యాయి. పెదవులమీద చిరునవ్వు మాయమైంది. నల్లని కనుపాపలు చిన్నవయ్యాయి. ఘోరమైన విషాదం ఆమె ముఖాన్నావహించింది. ఆమె ముఖంలో వ్యక్తమౌతున్న విషాదాన్ని గురించి ప్రశ్నించబోతున్నాను. ఇంతలో భద్రే–

"నువ్వు భిక్షు వవుతావటగా ?" అనడిగింది. ఆమె స్వరంలో ఎంతో దైన్యం, కరుణ ధ్వనించాయి.

భద్ర అలాంటి ప్రశ్న వేస్తుందని నే ననుకోలేదు. ఆమె ముఖం లోని మార్పులవలన ఏదో అప్రియమైన ఊహ ఆమె హృదయంలో పనిచేస్తున్నదని తెల్సుకున్నాను. అయితే, ఆ వూహ నా భిక్షుత్వానికి సంబంధించినదేనని నేను తలచలేదు. నరేంద్రుడు భిక్షువు అవుతాడన్న వార్త ప్రజల్లో, చాలా రోజులుగా ప్రచారంలో వుంది. కానీ. నేనా అభిప్రాయాన్ని వదిలివేసి సంవత్సరాలుగడిచాయి. భద్ర రెండు భుజాల మీదా చేతులు వేసి, నల్లని ఆ కండ్లల్లోకి చూస్తూ "ఎవరన్నారు ? అంతా అబద్ధం ! వెనక ఎప్పుడయినా భిక్షువుని కావాలని అనుకున్నా నేమో ! కాని. ఏనాడయితే, భద్ర హృదయానికి స్వామిని అయిందో, ఆనాటినుండి భిక్షువును కావాలన్న ఊహే నా హృదయాన్నుండి శాశ్వతంగా సెలవు పుచ్చుకున్నది !" అన్నాను.

భద్ర ముఖంలో తిరిగి మామూలుస్థితికి అవసరమైన పరివర్తనలు జరిగాయి. ఆమె ప్రకృతస్థఅయింది. తన విశ్వాసాన్ని దృఢతరం చేసుకునే ప్రయత్నంలో నా గుండెలకు తల ఆన్చి "నిన్ను పూర్తిగా విశ్వసిస్తున్నాను !" అన్నది.

"నీవు విశ్వసించాలి, భద్రా ! నాకు నేను స్వామివి కాను. నా జీవితాన్ని నీకు అర్పించేశాను. నీ హృదయంతో నా హృదయంలోని భావాలను తెలుసుకో !"

"నువ్వు భిక్షువు అవుతావని నేనూ అనుకోలేదు. కానీ, అందరూ నరేంద్రుడు వచ్చే సంవత్సరం భిక్షువు అవుతాడు. అతడి పెదతండ్రి అతణ్ణి సంఘారామంలోకి తీసుకుపోతాడు, అని చెప్పుకుంటున్నారు.

అలాటి మాటలు విన్న తరువాత నాలోనూ భయం కలగడం సహజం కదా!"

"భద్రా! మావాళ్ళందరూ నిన్ను మా ఇంటి కోడల్ని చేసుకోవడానికి తొందరపడుతున్నారు. మా నాన్నగారుకూడా నన్ను సంఘంలో చేర్చాలన్న తన అభిప్రాయాన్ని మార్చుకున్నారు. కాకపోతే, జినవర్మ మాత్రం నేను 'ఇన్నాళ్ళూ చదువుచెప్పి తయారుచేసిన నరేంద్రుడు భిక్షువు కాకపోయెనే' అని బాధపడుతున్నాడు. ఇప్పుడు జినవర్మ బాధపడడం మానుకున్నాడు. నాకు బదులు నా పెదతమ్ముణ్ణి భిక్షు సంఘంలో చేరుస్తా నంటున్నాడు!"

భద్ర ముఖం వికసించింది. మా సంభాషణలోని విషయం మారిపోయింది. మా భవిష్యత్ జీవితాన్ని గురించి యోచించసాగాము. వివాహము అయ్యాక మా కో ప్రత్యేకమైన ఇల్లు వుండాలి. "అప్పుడు మా నాయన వద్దే వుండవచ్చు. కానీ, ఆ యిల్లు చాలదు. పైగా సొంత అత్తా కోడళ్ళకే సరిపడిచావదు. ఇక సవతి అత్తా-సవతికోడలు .... ఊళ్ళో మాకో ప్రత్యేకమైనయిల్లు కట్టుకోవడమే బాగుంటుంది. మేము నిర్మించుకోబోయే గృహాన్నిగురించి ఆలోచిస్తూ "భద్రా! నేను కర్రల్ని చెక్కల్ని నరకడమే కాదు నేర్చుకుంది. వాటిమీద సుందరమైన పూవుల్ని, లతలను చెక్కగలను కూడాను!" అన్నాను.

"అయితే, మంచి కమ్మరి వవుతావన్నమాట? ఇంకేం, నేను కమ్మరి భార్యనవుతాను. ఇద్దరం ఉద్యాన రాజధానికి వెళ్ళి కమ్మరపని చేసుకొని బ్రతకవచ్చు."

రాజధానిమాట వినేసరికి ఎందువల్లనో నా హృదయంలో శంక ఉదయించింది. భద్ర అనన్య సుందరి. రాజధానికి వెళ్ళాక ఏ దుర్మార్గుడి దృష్టయినా భద్రమీద పడవచ్చును. మాట మారుస్తూ నే నిలా అన్నాను: "ఉద్యానపురి అంటే నాకు అంత ఇష్టంలేదు. అక్కడికి అడవులు బాగా దూరం. ఎండలు చాలా ఎక్కువ. పైగా అక్కడ వుంటే ప్రతి సంవత్సరం, మైదానాల్లోకి రావడానికి వీలుండదాయె."

నాలాగానే భద్రకూడా మైదానాల జీవితమంటే చాలా ఇష్టం. నామాటల్ని సవరిస్తూ, సమర్థిస్తూ "అవును నరేంద్రా! మైదానాల భూమి

దేవతల నివాసానికి దగ్గర్లో వుంది అవిగో, ఆ కనపడే తెల్లని హిమశిఖరాలే దేవతల నివాసాలు!"

"ఆదేవతల నివాసాల కారణంగానేనీవింత సుందరివి కాగలిగావు. గర్భిణీ స్త్రీలమీద ఆకాశాల్లో విహరించే దేవతల యొక్క నీడ పడితే, శిశువు మహా అందంగా పుడుతుందట!"

"అయితే మీ అమ్మమీదకూడా ఏ దేవత నీడో పడివుంటుంది." భద్ర చప్పున తన సంభాషణ ఆపేసింది. పసితనంలోనే చనిపోయిన నా తల్లిని గురించి ఎన్నోమార్లు భద్రకు చెప్పాను. మా అమ్మ సంభాషణ వచ్చిన ప్రతిసారీ నేను కళ్ళనీళ్ళు పెట్టుకోవడం కద్దు. భద్రకు నా కన్నీళ్లు జ్ఞాపక మొచ్చివుంటాయి. మనస్సును కొంచంగా చిన్నబుచ్చు కొన్నది. ఆమె ఖేదాన్ని బాపుతూ, "అవును భద్రా, నీవు చెప్పింది ముమ్మాటికి సత్యం. అయితే మా అమ్మమీద నీడను ప్రసరించిన దేవత, నిన్ను కడుపులో ఉండగా మీ అమ్మ మీద నీడను ప్రసరించిన దేవత అంత అందమైందికాదు. కనుకనే నీవు అంత అందగత్తెవయ్యావు?"

భద్ర మాటమార్చింది.

"స్వర్గానికి వెళ్ళాక కూడా మన పెద్దవాళ్ళు మనను గురించి మర్చిపోరటగా! ఇప్పుడు మీ అమ్మకూడ ఆకాశంలో ఎగురుతూనో, లేక ఆ హిమశిఖరాలమీద కూర్చునో-మన మాటల్ని వింటూ, మనల్ని చూస్తూ వుంటుంది. గావును? ఎంత ఆనందపడుతుందో?"

"అమ్మ బ్రతికి వుండగా నిన్ను కోడలుగా చూసుకోకపోయినా దివంగతురాలయ్యాక నీ మాటల్ని విని చాలా సంతోష పడుతుంది."

* * *

జీవితం ఒక్కొక్కప్పుడు అనుకోని విధంగా మలుపు తిరుగుతుంది. పర్వత మార్గాల్లో ప్రయాణించే మేము తరచు ఈ అనుకోని విధంగా తిరిగే మలుపుల్ని చూస్తుంటాము. మనం సూటిగా తూర్పు దిశకు పోతూ వుంటాము. అంతలోకే కొండదారి మలుపు తిరుగుతుంది. మన ప్రయాణపు దిశ తూర్పునుండి పశ్చిమానికి మారుతుంది. మార్గం మలుపుతిరిగినా గమ్యం వెనుకటిదే కనుక ఏ యే స్థానాలను అధిగమించి గమ్యాన్ని చేరాలో, ముందే ఒకనిర్ణయాన్ని చేసుకుని వుంటాము మనము. బాహ్య

ప్రపంచంలోని ఈ మలుపులు ఓ రకంగా నిదానంగానే వస్తా యనుకో వచ్చు. కానీ, అవే మలుపులు జీవితంలో ప్రవేశించేటప్పుడు తీవ్ర వేగాల్తో ప్రవేశిస్తాయి. ఇప్పుడిప్పుడే మేము దేవదారు చల్లని నీడలో కూర్చుని ఏవో పగటి కలల్ని కన్నాము. ఆ కలల తాలూకు సుఖాన్ని అనుభవించ డానికి దివంగతులనుకూడా భాగస్వాముల్ని చేశాము. నా పద్దెనిమిదో ఏట జినవర్మ నా నుండి పూర్తిగా నిరాశచెంది, నా పెద తమ్ముణ్ణి సంఘా రామంలో చేర్చాలని నిశ్చయించుకున్నాడు. కానీ, 50 ఏండ్ల వయస్సులోనే జినవర్మ తను చాలా వృద్ధుడయినట్లు భావించసాగాడు. మళ్ళీ మొదలెత్తు కుని తమ్ముణ్ణి విద్యావంతుణ్ణి చేయడం తన జీవితంలో జరిగే పనికాదని నిరాశచెందేవాడు. కాని, జినవర్మ నిరాశ ఆశగా మారింది. నా జీవిత ప్రవాహం పూర్తిగా ఎండిపోయింది. భూమి లోపలే ప్రవహించే అజ్ఞాత జలస్రోతస్సులా నా జీవితం అంతర్ముఖి అయ్యింది. అజ్ఞాత జలస్రోతస్సు ఎక్కడో బయటపడుతుంది. అప్పుడు దాని దిశ ఆశ్చర్యకరంగా మారి పోయి వుంటుంది.

భద్ర అనన్య సౌందర్యవతి. అలాటి అందకత్తెను నేను ఉద్యాన భూమిలోనే చూడలేదు. అయితే, ఆమె సౌందర్య ప్రసిద్ధి ఉద్యానభూమి లోనే కాక, సరిహద్దుల్ని కూడా దాటిందని నేననుకోలేదు. కాశ్మీరు లోని మిహిరకులుడి రాణివాసంలో సుందరీమణులకు కొదువేమిటి? దేశ దేశాంతరాలనుండి అందగత్తెలను తీసుకు వస్తుంటారు. అయినా వాళ్ళకు తృప్తి ఎక్కడిది? తోరమాణుడు మహా చక్రవర్తి. అతడి రాజ్యం బహు విస్తృతమైంది. మధ్య ప్రాంతపు చాలా భాగాలు అతడి రాజ్యంలోనే ఉన్నాయి. మహా పరాక్రమ శాలురైన గుప్తులను అతడెన్నోసార్లు ఓడిం చాడు. కానీ, అతడి కొడుకయిన మిహిరకులుడికి అదృష్ట దేవత సహా కారా న్నీయలేదు. నాకు తొమ్మిదో యేట, మిహిరకులుడు ఘోర పరా జయాన్ని పొందాడు. ప్రాణరక్షణార్థం కాశ్మీరుకు పోయాడు. ఇప్పు డతడి రాజ్యం వెనుకటంత విస్తృతంగా లేదు. అతడి రాజ్యంలోని అనేక భాగాలు అన్యరాజుల వశమయ్యాయి. అయినా అతడు చక్రవర్తే. రాజాధిరాజే. వృద్ధాప్యం .. ఘోర పరాజయం...దిగ్విజయానికి సంబం ధించిన అతడి ఊహలు గగన కుసుమాలయ్యాయి మిహిరకులుడు శత్రు

నిర్దేశనను పూర్తిగా విరమించుకుని కాముకత్వంలో మునిగి కూర్చున్నాడు. అతడి గుప్తచారులు శత్రురాజుల చర్యల్ని గమనించక, దేశంలోవున్న సౌందర్యవంతులైన స్త్రీలకోసం తిరుగుతున్నారు. ఎవడు ఎంత ఎక్కువగా సుందరీమణుల్ని రాజుకు ఒప్పగిస్తే, వాడంత అధికంగా బహూమానింపబడతాడు. ఉద్యాన భూమి సౌందర్యానికి గనిలాంటిది. మిహిరకులుడి దృష్టి ఈదేశంమీద పడడమనేది సహజం. ఉద్యానపురిలోని మిహిరకులుడి ప్రతినిధికి, సేనా నాయకుడికి-అందరికీ ఇదేపని. సౌందర్యాన్వేషకులు ఈ విధంగా బయల్దేరితే ఇక భద్ర సౌందర్యం గురించి బయటపడకుండా వుంటుందా ?

చలికాలం. భద్ర పరివారం మైదానాల్ని విడిచి తమ గ్రామానికి వెళ్ళిపోయింది. మేమూ మా హేమంత నివాసానికి వచ్చాము. అసలు విషయం, మరుసటి సంవత్సరం చలికాలం గడిచి తిరిగినేను మాగ్రామానికి వెళ్ళాకగానీ తెలియలేదు? ఉద్యానపురిలోని రాజ ప్రతినిధి భద్ర తండ్రిని తనవద్దకు పిలిపించాడు. స్పష్టంగాచెప్పాడు:" "రాజాధిరాజయిన మిహిరకులుడి కొరకు నీ కూతుర్ని ఇచ్చేసేయి।" భద్ర తండ్రికి అంతకంటే కావల్సిం దేముంటుంది? తన కూతురు రాణి అవుతుంది. ఆనందంలో మైమరచాడు. భద్ర ... ఏంచేయగలదు? ఏడ్చింది. తను రాజప్రాసాదంలోకి వెళ్ళనని మొండికి వేసింది. కానీ, పాప మామె తరపున మాట్లాడేవాడే లేడు. ఈ సంఘటనే వర్షాకాలంలో, మైదానంలో జరిగినట్లయితే నాగొంతులో ఊపిరివున్నవరకూ భద్రను పోనిచ్చేవాణ్ణి కాదు.

భద్ర మిహిరకులుడి రాణివాసంలోకి వెళ్ళిపోయింది. నేను ఎన్నో నెలల వరకూ పిచ్చివాడిలా అయిపోయాను. మిహిరకులుడి రాణివాసం నుండి భద్రను తీసుకురావడం ఏ విధంగానూ సంభవంకాదు. నా ప్రేమ నన్ను చాలా పిచ్చివాడిని చేసింది. జీవితం మహాభార మనిపించేది. ఆత్మహత్య పాపమని చదివాను. భిక్షుకులు చెప్పగా విని వున్నాను గనక.కాని లేకపోతే ఎన్నడో ఆత్మహత్య చేసుకునే వాడిని. రోజులు దొర్లినకొద్దీ దుఃఖంలోని ఆవేగం తగ్గుతూ వచ్చింది. నేను వెళ్ళదలుచుకున్న మార్గం పూర్తిగా మూతపడిపోయిందని తెల్సుకున్నాను. తిరిగి, ఆనాటి సంఘవర్ధనుల ఉపన్యాసాన్ని నా మనస్సు నెమరు వేసుకో సాగింది. చివరకు, కొన్ని నెల్లు గడిచాక, నా మానసిక స్థితి ఓ క్రమానికి వచ్చింది. నేను విడిచివచ్చిన ఆ వెనుకటి మార్గమేనాకుశరణ్యమని నిశ్చయించుకున్నాను.

# 4 వ అధ్యాయము

# భిక్షుం

## (క్రీ. శ. 536-540)

భద్రను బలవంతాన అంతఃపురంలోకి తీసుకు వెళ్ళారన్న వార్త వినగానే నా మనసు చంచలమై పోయింది. పట్టు తప్పింది. అయితే ఆ స్థితి నాజీవితపు విస్తృతాకాశంలో ఓ క్షణకాలం మెరసి అదృశ్యమయ్యే మెరపు లాంటిది. తరువాత ఎన్నడూ నా జ్ఞాపకాలు ఆమె హృదయంలోనూ తల ఎత్తలేదు; ఆమె జ్ఞాపకాలు నా హృదయంలోనూ తల ఎత్తలేదు. ఆమె విషయం అంతగట్టిగా చెప్పలేకపోయినా, నాగురించి మాత్రం నిక్కచ్చిగా చెప్పగలను. తరువాత జీవితంలో ఒక్క క్షణం కూడా నే నామెను స్మరించలేదు. కాశ్మీరు రాజధానికి వెళ్ళినప్పుడు కూడా నేనామెను గురించి ఏమీ తెలుసుకోలేక పోయాను. తెలుసుకోదలచలేదు కూడాను. ఆమెను అంతఃపురానికి తీసుకుని వెళ్ళిన మరుసటి వర్షావాసం కొరకు నేను మెదానాలకు వెళ్ళలేదు. మా నాన్న గారిని వెంటబెట్టుకొని, మా గ్రామానికి ఎదురుగావున్న మరో గ్రామానికి వెళ్ళి, అక్కడ నుండి కొంచెం క్రిందికిదిగి, సువాస్తు-నదీ-తీరాన్ని పట్టుకుని ఎగువకు వెళ్ళాము. మా గ్రామంలోనుండి చూస్తే తూర్పుగా తెల్లని హిమశిఖరాల పంక్తి కనిపిస్తుంది. ఆ పంక్తి వెనుకవైపునే భదంత జినవర్మ వుండే సంఘారామం. జినవర్మకు మేముముందుగాతెలియపరచలేదు. ఏసూచనా లేకుండా నేనలా ప్రవ్రజ్యాన్ని (సాధుత్వం) పుచ్చుకోడానికి రావడం, జినవర్మకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్నికూడా కలిగించాయి. మా ఉద్యానదేశంలో ఒక్క పర్వత మైదానాల్ని మినహాయిస్తే మిగిలిన సమస్త తీరాలూ, లోయలూ సస్యంతో నిండి అతిసుందరంగా వుంటాయి. కనుకనే ఆదేశానికి ఉద్యాన

దేశమని పేరొచ్చింది. అయితే, ప్రస్తుత సంఘారామమున్న ప్రదేశం మొత్తం ఉద్యాన దేశంలోకే అత్యంత సుందరమైంది. సువాస్తు-నది-యొక్క ఉద్గమస్థానం ఇక్కడికి ఒకరోజు ప్రయాణదూరంలోవుంటుంది. ఈ మధ్యలోనే మంచు కరిగి ప్రవహించే అనేక చిన్న చిన్న నదులూ, కాలువలువచ్చి సువాస్తులో కలుస్తాయి. కనుకనే సువాస్తుప్రవాహం ఇక్కడ -సంఘారామం వద్ద- అంత విస్తృతంగా లేకపోయినా వేగం మాత్రం మహా అధికం. ప్రవాహాన్ని ఇటునుండి అటు దాటడం చాలాకష్టం. ప్రవాహంలో రాళ్ళూ బండలూ అధికంగావున్నచోట వాటిసాయంతో దాటవచ్చు. ప్రవాహాన్ని ఆనుకునే ఒక ఎత్తైన విశాల సమతల ప్రదేశం వుంది. ఆ ప్రదేశాన్ని స్వయంగా దేవతలు సమతలం చేశారని చెప్పుకుంటారు. పసిరికమైదానాల్లో ఇలాంటి సమతల ప్రదేశాలు సహజంగానే వుంటూంటాయి. కానీ సువాస్తుయొక్క ఉద్గమ స్థానమైన ఇక్కడ ఇలాంటి సమతల ప్రదేశాలు చాలా అసంభవం! ఇక్కడ నది ఉత్తరాన్నుండి దక్షిణానికి ప్రవహిస్తుంది. నదీప్రవాహం ముందుకు పోయినకొలది రెండు తీరాలూ రెండు భిన్నదిశలకు మళ్ళుతాయి. పుట్టుక స్థలంలో నదిని తన ఒడిలో ఇముడ్చుకున్న, రెండువైపులా వున్న పర్వతశ్రేణులు ఇక్కడికి వచ్చేసరికి క్రోసుల దూరాలకు విడిపోతాయి. పర్వతాలు ఇలా విడిపోవడం వలన ఒక మేలు మాత్రం జరిగింది. పగటిపూట సూర్యరశ్మి చాలా ఎక్కువ సమయం ఈ లోయలోకి ప్రసరింపబడుతూ వుంటుంది. అందువలన, ఈ ప్రదేశం, అక్కడి ఇతర ప్రదేశాలకంటె సుఖకరంగా వుంటుంది. ఇక్కడివాళ్ళు ఈ ప్రదేశాన్ని "సుభూమి" అంటారు. నిజంగా ఈ ప్రదేశానికిది సార్థకనామధేయమే. ఇక్కడి సంఘారామాన్ని "సుభూమి సంఘారామ" మంటారు. మరి ప్రదేశాన్ననుసరించి సంఘారామానికా పేరువచ్చిందో లేక సంఘారామాన్ననుసరించే ప్రదేశానికా పేరు వచ్చిందో తెలియదు. ఇక్కడి విహారాన్ని నిర్మించింది హిమ ప్రదేశాల నివాసులకు ఆచార్యుడైన కాశ్యపుడని చెప్తారు. అయితే, ఇది ఎంతవరకు సత్యమో నేను చెప్పలేను! స్థవిరావళి విహార నాయకుల యొక్క క్రమంలో మాత్రం కాశ్యపునిపేరు మొట్టమొదట వస్తుంది. సంఘారామానికి ప్రక్కనే వున్న పర్వతం దేవదారు మొదలైన శైత్య

ప్రధానదేశాల వృక్షాలతో నిండివుంది. అటుతీరాన వున్న పర్వతంకూడా అనేక రకాలైన చెట్లతో నిండివుంది. అయితే, ఆ పర్వతం మీద ఇక్కడిలా సమతలభూమిలేదు. అటుతీరాన ఒక గ్రామంకూడా వుంది. గ్రామప్రజల్లో కొద్దిమంది రైతులు, మిగిలినవారంతా పశువుల కాపర్లు. అటునించి ఇటు నదిని దాటటానికి ఒక చెక్కవంతెన వుంది. ప్రతి సంవత్సరం హిమపాతంలో ఆవంతెన కొట్టుకుపోతూ వుటుంది. హిమం తగ్గాక మళ్ళీ వంతెనను నిర్మించుకుంటూ వుంటారు. చలికాలంలో అసలు వంతెన అవుసరమే వుండదు. నదిలో నీరు గడ్డగట్టుకుపోతుంది. పైన చాలా బారల ఎత్తున హిమంప్రోగు పడి గడకట్టుకుంటుంది. ఇక అంత విపరీతంగా మంచు పడ్డప్పుడు అటు తీరంలోకి గ్రామప్రజలు తమ పశువుల్ని తోలుకుని, క్రిందికి, మా గ్రామాలవైపు వెళ్ళిపోతారు. మా సంఘారామంలోని భిక్షువులుమాత్రం చలికాలంలోనూ అక్కడే వుంటారు. పైగా చలికాలంలో భిక్షువుల సంఖ్య పెరుగుతుంది కూడాను! మంచు అధికంగా కురవడంవల్ల విహారపు క్రింది కోష్ఠకాలు-(గదులు)- మంచుతో కప్పడిపోయినా, పైగదులు తెరిపిగా వుంటాయి. అందువలన చలి అంతగా బాధించదు. అయినప్పటికీ చలినుండి రక్షణకు పూర్తిగా ఏర్పాట్లున్నాయి అక్కడ. బాగా మొద్దుగా ఉన్న ఉన్ని చీవరాన్ని ధరిస్తూంటారు. అదికాక వెచ్చని చర్మాన్నికూడా కప్పుకుంటూ వుంటారు. కాళ్ళకు పాదరక్షలూ వుంటాయి.చర్మపు మేజోళ్ళనుకూడా ధరిస్తూంటారు. మధ్యప్రాంతంలోని భిక్షువులు ఎన్నడూ శిరస్త్రాణాన్ని ధరించరు.కానీ,మా ఉద్యానవాసపు భిక్షువులు,హీనయానులు, వినయపిటకంలోని నియమాలను తు.చ.తప్పకుండా పాటించేవారు అయివుండికూడా లేడి రోమాలతో తయారుచేసిన శిరస్త్రాణాన్ని ధరించిగానీ బయటికిరారు. ప్రతికక్ష్యలోనూ ఎండు కట్టెల్తో నిప్పుచేసుకునే ఏర్పాటు వుంటుంది. ఎండు కట్టెల్ని చలికాలం రాక ముందే ప్రోగుచేసి పెట్టుకుంటాము. చలికాలపు భోజనం నిమిత్తం ఎండు కూరల్ని ఎండు మాంసాన్ని దాచుకుంటాము. చలికాలం మొత్తం మేము దాచుకున్న ఆహార పదార్థాలతోనే ఆహార అవసరాల్ని గడుపుకొనవల్సి వుంటుంది. సంఘారామానికి ఉత్తరాన, దక్షిణాన ఉన్న ఖాళీ, సమతల భూమిలో ద్రాక్షతోట లున్నాయి. వర్షాకాలంలో ఆ తోటల్ని

చూసినవారు "సుభూమి"ని "ద్రాక్షవలయభూమి" అని కూడా పిలు స్తారు. ఇక్కడి బంగారు రంగుద్రాక్షలు మహా తియ్యగావుంటాయి. ఆకారంలోనూ, రంగులోనూ, రుచిలోనూ-ఇక్కడిద్రాక్షలు కపిషా (కా) ద్రాక్షలకు ఏమాత్రమూ తీసిపోవని ఘంటాపథంగా చెప్పవచ్చు. అశోక మహారాజు మహాస్థవిరులైన కాశ్యపాచార్యుల్ని, హిమ ప్రాంతనివాసుల్లో మత ప్రచారం చేయడానికి పంపించారు. అప్పుడే ఆచార్యులవారు సుభూమిలో ద్రాక్షను నాటారు. ఆ అనాది ద్రాక్షలత యొక్క సంతానమే ఇప్పటి ఉద్యానదేశపు సమస్త ద్రాక్షలు. విహారానికి పశ్చిమంగా వున్న పర్వతం అతి మనోహరంగా వుంటుంది. ఆ పర్వతం చాలా ఎత్తయినది. క్రింది వరుసల్లో అనేకమైన వన్యజాతి వృక్షా లున్నాయి. పైకిపోయినకొలది వృక్షాలు సన్నగిల్లి, పసిరిక మైదాన మేర్పడ్డది. ఆ మైదానానికి అవతల కొన్ని హిమశిఖరా లున్నాయి. అవి సర్వకాలాల్లోనూ మంచుతో కప్పబడి వుంటాయి. వాటిలో మూడు శిఖరాలు చూడడానికి మహా ఆకర్షణీయంగా వుంటాయి. వాటిని ప్రజలు త్రిరత్నాల-(బుద్ధం, ధర్మం, సంఘంకు) ప్రతీకలుగా, మరియూ స్వయం భూచైత్యాలుగా భావించి పూజిస్తుంటారు. ఎక్కువ శ్రద్ధా, భక్తులు కలవారు ఆ శిఖరాలవరకూ వెళ్ళికూడా వస్తుంటారు.

సుభూమి విహారం మహా అందమైంది. ఆ విహారం మీద వుండే ప్రత్యేకాభిమానం వలన నే నిలా అనడం లేదు. నేనీ డెబ్బై సంవత్సరాల జీవితంలోనూ అతిమనోహరమైన ప్రదేశాల్లోకల్ల అనేక విహారాలను చూశాను. కానీ, ఎక్కడా ఇలాటి ప్రకృతి సౌందర్యాన్ని చూడలేదు. ఇలాటి కమనీయ వాతావరణాన్నీ చూడలేదు. చలికాలంలో ఈ ప్రదేశం పూర్తి నిర్మానుష్యమూ, ప్రాణి రహితమూ అవుతుంది. సుభూమి విహారంలోని కొద్దిమంది భిక్షువులు తప్ప ఇంకే ప్రాణీ వుండ దీ ప్రదేశంలో. భిక్షువులు, సోదరభిక్షువుల యొక్క హాచ్య శబ్దాల్ని మాత్రమే వినగలరు. ప్రకృతి అనంత, గంభీర నిస్తబ్దతలో మునిగి వుంటుంది. అతి మార్దవమైన, వేడిమిలేని ఎండకాస్తూ వుంటుందిక్కడ. అలాటి ఎండకు మంచు ఏం కరుగుతుంది ? మేము అప్పుడప్పుడూ చలికాగడానికి సుదూరాల వరకూ వ్యాపించిన తెల్లని మంచుమీద

తిరుగుతూ కూర్చుంటూ వుంటాము. అధ్యయనాని కయితే బహు అను కూలమైన కాలమిది. నాలాంటి కష్టపడి చదివే విద్యార్థి ఇక్కడ చక్కగా తన పాఠాల్ని కంఠస్థం చేసుకోవచ్చు. ప్రకృతి తెరిపిగావున్న రోజుల్లో మేము దేవదారువనాన్ని, ఆకులురాల్చేసి మోడయి వున్న భూర్జ-వృక్షాలనూ దాటి, మైదానంలోకి వెళ్తుంటాము. మంచు మీదపడే సూర్యుని ప్రతిఫలనం కండ్లను మిరుమిట్లు గొలుపుతూవుంటుంది. ఆ ప్రతిఫలనం వలన అంధత్వం వస్తుందంటారు. ఆ ప్రతిఫలనం కండ్లకు తగలకుండా వుండడానికి మా శిరస్త్రాణాల్లోనుండి, కండ్ల మీదకు పడేట్టు వచ్చని దేవదారు ఆకుల్ని కట్టుకుంటాము. మా అధ్యయనంలేని రోజులన్నీ ఇలాంటి యాత్రల్లోనే గడిచిపోతాయి. తరుణులైన భిక్షువుల్ని, శ్రమణుల్ని ఇలాంటి యాత్రలకు ప్రోత్సహిస్తుంటారు.

మా సంఘారామంలో మూడువందల మంది భిక్షువులు వుంటూం టారు. చలికాలంలో వారిసంఖ్య నాలుగు వందల వరకూ పెరుగుతుంది. నా పెదతండ్రి అయిన జినవర్మ గొప్పవిద్వాంసుడు. ఇప్పుడు మహాస్థవిరులుగా సంఘ వర్ధనుల స్థానంలో, గుణవర్ధను లుంటున్నారు. వీరికీర్తి అన్ని దేశాల్లోకూడా ప్రాకింది. గుణవర్ధనులు కాంభోజ పురిలో పుట్టారు. విద్యాధ్యయనం కొరకు సంఘవర్ధనులవద్దకు వచ్చారు. అధ్యయనానంతరం మధ్య ప్రాంతపు పవిత్ర స్థలాలను దర్శించి వచ్చారు. కళింగ దేశంలోని దంత పురానికి వెళ్ళారు. బుద్ధుని దంత ధాతువును చూశారు. సింహళంలోని మహా విహారంలో కొద్ది సంవత్సరాలున్నారు. నిజం చెప్పాలంటే బుద్ధ మతంలోని వివిధ నికాయ-సంప్రదాయాలనూ, దర్శనాలనూ, ఇంతగా అధ్యయనం చేసిన పండితుడు మరేదేశంలోనూ లేడంటే అతిశయోక్తి కాదు. గుణవర్ధనులు అనేక సంవత్సరాలు సుదూరదేశాల్లో పర్యటించి చివరకు సుభూమి విహారంలోక వచ్చి వుండిపోయారు. అప్పుడప్పుడూ ఇలా అంటుంటారు: "సుభూమి విహారాన్ని నేనెంత విడవాలనుకున్నా, ఇది నన్ను వదిలేట్టు లేదు!"

గుణవర్ధనులు కోరే అన్ని విశేషాలు సుభూమి విహారంలో వున్నాయి. ఇచ్చట మంచి విద్యార్థులు దొరుకుతారు. వారికి చెప్పుకుంటూ తన విద్యను నిత్యనూతనంగా వుంచుకోవచ్చు. గుణవర్ధనులకు యోగా

భ్యాసంలోనూ అభిరుచి వుంది. సుభూమి విహారం అత్యంత ప్రశాంతంగా వుండి యోగాభ్యాసానికి తగివుటుంది. వారి జన్మస్థానమైన కాంభోజం అత్యంత శీతలదేశం. అలాంటి శీతలదేశంలో పుట్టారుగనుక సుభూమి విహారం మీద వారికి సహజానురక్తి వుండడం స్వాభావికం. మహాసవిర సంఘవర్ధనుల అనంతరం, భిక్షుసంఘం గుణవర్ధనులను మహాస్థవిరులుగా ఎన్నుకున్నది. సంఘవర్ధనులు కేవలం ఉద్యానపు భిక్షు సంఘానికి మాత్రమే నాయక మహాస్థవిరులు. కానీ గుణవర్ధనులు కాశ్మీర, గాంధార దేశపు భిక్షు సంఘాలకు కూడా పరమ పూజ్యులయిన మహాస్థవిరులు. గుణవర్ధనులు విద్యాసముద్రులు. ఎంతోమంది వారిని ముక్తపురుషులని కీర్తిస్తూంటారు. వారు శీలం, సమాధి, ప్రజ్ఞా-ఈ మూడింటి దృష్ట్యా కూడా సంపన్నులు. వారు ఎవరిమీదా ఎన్నడూ కోపగించుకోవడాన్ని నేను చూడలేదు. ఎప్పుడూ వారి ముఖంలో చిరునవ్వు తాండవిస్తూ వుంటుంది. గుణవర్ధనులు అరవై ఏండ్ల వారయ్యారు. కానీ, వారిని చూస్తే నలభై ఏండ్ల వారనుకుంటాము. సాయం సమయంలో, రెండు గంటల సేపు చంక్రమణం చేయడం వారి ముఖ్యనియమాల్లో ఒకటి. చంక్రమణాన్ని గురించి ఇలా అనేవారు: "నిత్యం నాగాపడకుండా చంక్రమణం చేయాలి. తథాగతుడు జైత్రవనంలోగానీ, మరి ఇతరచోట్ల ఎక్కడయినా వుండనీ తప్పకుండా చంక్రమణం చేస్తుంటారు. అసలు వారికోసం ప్రత్యేక చంక్రమణ స్థానా లుండేవి. శరీరం ఆరోగ్యంగా వుండాలంటే చంక్రమణం చేయడం చాలా ముఖ్యం. మనలక్ష్యాన్ని చేరడానికి, మన శరీరం ఆరోగ్యంగా వుండడమూ ముఖ్యమే!" మహాస్థవిరులు వర్షాకాలంలోనూ చంక్రమణాన్ని మానేవారుకాదు. వారు వర్షాకాలంలో మహా చైత్యపు కాష్ఠశాలయంలో చంక్రమణం చేస్తుంటారు.

సుభూమి విహారం చాలా పురాతనమైనది. కనీసం ఏడెనిమిదివందల సంవత్సరాలయి వుంటుంది. ఇతర విహారాలకూ, ఈ విహారానికీ నిర్మాణంలోనూ బాగా వ్యత్యాసం వుంది. మధ్యలో పాషాణ స్తూపముంది. స్తూపానికి చివర నాలుగు వైపులా మూడంతస్థుల కోష్ఠికాలున్నాయి. దీన్నే విహారపు అతిపురాతన భవనమంటారు. ఉద్యాన దేశంలో గృహనిర్మాణం చెక్కతోనే చేస్తారని చెప్పాను. ఈ విహారపు

అతి ప్రాచీనమైనదని చెప్పబడే భవనంకూడా చెక్కకిట్టెల్తో నిర్మించిందే. చెక్కతో కట్టిన విహారం ఎనిమిది వందల సంవత్సరాల పురాతనమైనదని ఒప్పుకోవడం కొంచెం బాధాకరంగానే ఉంటుంది. అయితే ఈ చెక్కకట్టడాన్ని మధ్య మధ్య సంస్కరిస్తూ ఉండి. ఉండవచ్చు. మహాస్థవిరులూ, ఇతర వయోవృద్ధులైన భిక్షువులూ, మాపెదతండ్రిగారైన జినవర్మ-మొదలైనవారు ఈ పురాతన భవనంలోనే ఉంటూంటారు. జినవర్మకు శిష్యుణ్ణయిన కారణంగా నేనూ ఈ ప్రాచీన భవనంలోనే ఉంటూండేవాణ్ణి. ఈ ప్రాచీన విహారానికి కొద్దిదూరంలో, ప్రాంగణం వద్ద మరి మూడు భవనాలున్నాయి. ప్రాచీన విహారంచుట్టూ, పచ్చని పచ్చిగడ్డి, ఫలోద్యానాలు కనుల పండువుగా వున్నాయి. ఈ విహారానికి వెళ్ళేమార్గాన్ని రాళ్ళతో నిర్మించారు. కనుక వర్షాకాలంలో కాలికి మట్టివు తుందన్న బాధ వుండదు.

భదన్త జినవర్మ, గుణవర్ధనులకు నా తెలివితేటల్ని గురించి అతిశయోక్తులు చెప్పారు. నేను శ్రవణుణ్ణయినప్పుడు మహాస్థవిర గుణవర్ధనులు ఒక్కడే వున్నారు. నేనీ సుభూమి విహారానికి వచ్చినప్పుడు క్రొత్తగా, అప్పుడే మంచు కురిసింది. మంచు కురవడం అదే ప్రథమం అవడంవలన, ఇంకా సర్వత్రా మంచు నిండలేదు. మహాచైత్యం ఇతర భవనాలమీదా అప్పటికింకా మంచు నిండలేదు. భిక్షుసంఘం, ఆసంఘానికి-భిక్షువులకు-భోజనాదికాలను చేసి పెట్టడానికి కొంతమంది దాసులూ మాత్రం విహారంలో వున్నారు. ఎదురుగా వున్న గ్రామం పూర్తిగా ఖాళీ అయింది. నే వెళ్ళిన రెండవరోజు ప్రవ్రజ్యం నిశ్చయమైంది. ప్రవ్రజ్యం స్వీకరించాక గడపవల్సిన క్రొత్తజీవితం తాలూకూ వూహలు నాలో ఉత్సాహన్ని, ఆనందాన్ని నింపుతున్నాయి. ప్రవ్రజ్య స్వీకారం రోజు ఉదయాన్నే ఒక భిక్షువు నా తలనూ, కనుబొమ్మలనూ నున్నగా గీరేశాడు. గడ్డం, మీసాలు ఇంకా రాలేదు, వాటి సానంలో స్వల్పమైన రేఖలు మాత్రం వున్నాయి. ఆరేఖలను కూడా గీరేశాడా భిక్షువు. మా అమ్మ బ్రతికి వుండగా నాకోసం స్వయంగా ఉన్ని నేసి ఒక దూష్యాన్ని (శాలువ) తయారుచేసింది. మా అమ్మ గొప్ప భక్తురాలు. ధర్మోపదేశాల్ని వినడానికి ఎప్పుడూ తహ తహ లాడుతూ వుంటుంది. తను

చదువుకోకపోయినా వినికిడి జ్ఞానం కలది. నన్ను కాషాయవస్త్రాల్లో మా అమ్మ చూడలేదు. కానీ, మా అమ్మ చేత్తోనేసి, కొడుకోసం ప్రేమతో తయారుచేసిన వస్త్రాన్ని ఇప్పటికీ ధరిస్తూనే వున్నాను. నేను విహారంలోకి వెళ్ళగానే, మా అమ్మ స్వయంగా తయారుచేసిన తెల్లని దూష్యాన్ని నలుగురు భిక్షువులు కలిసి ముక్కలు, ముక్కలుగా చింపేశారు. తరువాత ఏదో చెట్టు బెరడు ఎర్రని రంగులో ముంచి, అరలు అరలుగా ముక్కల్ని అతికించి కుట్టారు. నిడుపు తక్కువగా వుండి మోకాళ్ళను దాటుతూన్న అధు వస్త్రాన్నొకదాన్ని కట్టారు. దానిపైన కుడిభుజాన్ని నగ్నంగావుంచేట్టు తయారుచేసిన బాడీలాంటి కంచుకాన్నొకదాన్ని తొడిగారు. ఆ పైన పొడవాటి కాషాయ వస్త్రం, ఎడం భుజంపైన నాలుగు మడతలు వచ్చేట్టు వేశారు. నడుముకొక మరబందు (బెల్టు) బిగించారు. భిక్షాపాత్రను జినవర్మ మొదటే సిద్ధపరచివుంచారు. ఎనిమిది పరికరాలతో నేను మహాచైత్యపు ఆశ్రయంలోకి వెళ్ళాను. నాకు కుడివైపున మహాస్థవిరులు గుణవర్ధనులూ, ఎడంవైపున కొంచెం క్రిందుగా భదంత జినవర్మ కూర్చొని వున్నారు. నేను జినవర్మ ఎదుట పంచప్రతిష్ఠిత సమస్కారాన్ని చేసి గొంతుకుర్చున్నాను. ప్రవ్రజ్యను యాచించాను. వారు నాచేత బుద్ధ, ధర్మ, సంఘాలకు శరణాగతుణ్ణనిపించారు. తరువాత ప్రాణి హింస మొదలుగాగల పది నిషిద్ధ కర్మల నుండి విరతుణ్ణవడానికి దీక్ష పట్టించారు. అక్కడున్న భిక్షు మండలి, మా తండ్రి మరి ఇతర ఉపాసకులు కొందరు "సాధు, సాధు" అన్నారు. ఈ విధంగా నా క్రొత్త జీవితం ప్రారంభమైంది.

ఇకనిప్పుడు నేను బౌద్ధ శ్రమణుడయ్యాను. ఇంకా నాకు ఇరవై సంవత్సరాలు నిండలేదు. కనుక భిక్షువును కాలేకపోయాను. నా యీడు వాళ్ళు మా వూరి బాలురు కొంతమంది ఏడెనిమిదేళ్ళ వయస్సులోనే శ్రమణులయ్యారని చెప్పాను. వాళ్ళలో ఇద్దరు ఈ సుభూమి విహారంలోనే వుంటున్నారు. నాకంటె చాలా ముందే వాళ్ళు విద్యాధ్యయనం ప్రారంభించారు. పైగా, నిరంతరం విద్వాంసులైనభిక్షువులసమక్షంలోవుంటారు. కనుక విద్యాభ్యాసంలో ముందుపోయే అవకాశాలు వారికిచాలావున్నాయి. అయినా,శబ్దకోశం,వ్యాకరణం మొదలైనవాటిల్లో వాళ్ళనన్నేవిధంగానూ

అధిగమించలేదు. కానీ, సూత్రాల్లో వినయంలో (వినయపిటకం, బౌద్ధ దర్శన సూత్రాలూ) వారు నా కంటె చాలా ముందున్నారు. నాలో ఈర్ష్య జనించడం, పట్టుదల పెరగడం సహజం. ఏ విషయంలోనూ నా సమ వయస్కులకు తగ్గకుండా వుండాలని నిశ్చయించుకున్నాను.

శ్రమణుణ్ణయి బౌద్ధసంఘంలోకి వచ్చాక నిజంగా నేను క్రొత్త మనిషినయ్యాను. పరిసరం, సమాజం మారినప్పుడు మానవుడు తప్పని సరిగా మారతాడు. భదంత జినవర్మ గడిచిన పది సంవత్సరాలుగా నాకు విద్యను బోధిస్తూ వచ్చారు. వారి కృషివల్ల నేను నిరక్షరాస్యుడనయిన ఉద్యానవాసిగా కాక అక్షరాస్యుడి రూపంలో సుభూమి విహారంలోకి వచ్చాను. విద్యాసంబంధమైన నా జ్ఞానం చాలా తృప్తికరంగా వుంది. వెనుక, సంవత్సరంలో నాలుగయిదు నెలలు మాత్రమే నేను చదువు కుంటూండేవాణ్ణి. ఇప్పుడిక ఈ సంవత్సరంలోని పన్నెండు నెల్లూ విద్యా సాగరంలో మునకలు వేయడమే. బౌద్ధవిహారాల్లో వుండే భిక్షువు లందరూ సంవత్సరం పొడుగునా చదువుతూనే వుంటారనుకో నవసరం లేదు. "విద్యాధ్యయనం, అధ్యాపన ఎటూ జీవితమంతా వున్నవే. కనుక ఇప్పుడు పరుగెత్తి పాలుత్రాగడం ఎందుకు?" చాలామంది బౌద్ధభిక్షువులు పై భావనవలన విద్యకొరకు త్వరపడరు. విద్యాధ్యయనంలో బౌద్ధ శ్రమ ణుల కంటె, బ్రాహ్మణ బాలురు ఎంతో తత్పరులై వుంటారు. బ్రాహ్మణ బాలురకు యవ్వనం ప్రవేశించడంతోపాటు విద్యార్థి జీవితాన్ని ముగించి గృహస్థు అవాలని తెల్సు. ఎంత చదివినా ఇరవైఐదు సంవత్సరాల వరకే. ఆపైన గృహస్థాశ్రమం, దాని బాధ్యతలూ వుంటాయి. కనుకనే బ్రాహ్మణ విద్యార్థులు బౌద్ధ శ్రమణులకంటె విద్యపట్ల అంత తత్పరులై వుంటారు. ఐతే, సుభూమి విహారపు వాతావరణమే వేరు. విద్యపట్ల ఇంతటి ఆసక్తిని కాశ్మీరం, గాంధారం, మగధ, కోసల విహారాల్లో మాత్రమే చూడగలం. మాఅధ్యాపకులు పాండిత్యంలో ఒకరిని మించిన వారొకరు. చాలా గంభీరమైన ప్రవృత్తి కలవారు. విద్యార్థుల్లోనూ తమ ఉపాధ్యాయుల్ని అనుకరించాలన్న ప్రవృత్తి సహజంగా కలుగుతుంది. ఉపాధ్యాయుల ప్రవర్తనా, వ్యక్తిత్వము విద్యార్థులమీద బాగాప్రభావాన్ని వేస్తాయి. సుభూమి విహారంలో పరుగు పందెంలా విద్యావ్యాసంగం సాగి

పోతూంటుంది. ఆ పందెంలో పాల్గొని నెగ్గగలమన్న విశ్వాసం కల విద్యార్థులే అక్కడికి వస్తూంటారు సామాన్యంగా మావిహారంలోని విద్యార్థులు పూర్వాహ్ణంలోగానీ, ఉత్తరాహ్ణంలోగానీ-రోజుకు ఒక్కసారి మాత్రమే పాఠం చెప్పించుకునేవారు. మొదట నేనూ అలాగే చేసే వాడిని. కానీ, శ్రమణుణ్ణయిన కొద్దివారాలకే రెండుపూటలా పాఠం చెప్పించుకోసాగాను. సూత్రాన్నీ, వినయాన్నీ ఆరునెల్లు మాత్రమే చెప్పించుకున్నాను. తరువాత ప్రమాణ శాస్త్రాన్నీ,తర్క-శాస్త్రం గురించి విన్నాను. ప్రమాణశాస్త్రాన్ని అధ్యయనం చేయాలన్న ఇచ్ఛకలిగింది. మాగాంధార నివాసి అయిన వసుబంధు, వారి శిష్యుడు దక్షిణాపథ నివాసి అయిన దిజ్ఞాగుడు విరచించిన గ్రంథాలు మంచి ఖ్యాతి నార్జించాయి. దిజ్ఞాగుడి 'ప్రమాణసముచ్చయా'న్ని చదివించని విహారమంటూ దాదాపుగా ఉండ దనుకుంటాను. మా మహాస్థవిరులైన గుణవర్ధనులు ప్రమాణ శాస్త్రాన్ని ప్రత్యేక శ్రద్ధతో అభ్యసించారు. నా అభిప్రాయాన్ని తెల్సాక గుణవర్ధనులు స్వయంగా నన్ను ప్రమాణశాస్త్రం చదివించడానికి వొప్పుకున్నారు. ప్రమాణ సముచ్చయంలోని కొన్ని వందల కారికల్నీ - శ్లోకాలను-నేను కొద్ది వారాల్లోనే కంఠస్థం చేశాను. మహాస్థవిరులు చాలా చక్కని పద్ధతిలో చదివిస్తారు. మొదట్లోనే తన జ్ఞానాన్నంతా శిష్యుడి నెత్తికి చుదదామనుకోరు. శిష్యునియొక్క బుద్ధి సహజంగా స్వీకరించ గలిగినవరకే మొదట బోధిస్తారు. మాతృచేటుని అధ్యర్ధశతకం, విద్యార్థులకు తమ సొంత పుస్తకంలాంటిది. ఇందులోని నూటయాభై పద్యాల్లోనూ, మాతృచేటుడు బుద్ధ - స్తుతి ద్వారా బౌద్ధమత సిద్ధాంత సారాన్ని ఓడ్చిపెట్టాడు. దీన్ని త్రిపిటకాలకు సులభగ్రాహ్యమైన సారమే అనవచ్చు! మాతృచేటుడి ఈ సుందరకృతి అప్పటికి కొన్ని సంవత్సరాల క్రితమే కంఠస్థమైంది నాకు. కనుకనే ప్రమాణ శాస్త్రాధ్యయనం సుగమంగా సాగింది.

రెండేళ్ళు ఎంత త్వరగా గడిచాయో! మనిషి కార్యభారంలో మునిగి వున్నాడంటే సమయం ఎలా గడిచేదికూడా తెలియదు. నేనీ రెండు సంవత్సరాల్నీ అతి కార్యాసక్తితో, ఒకరకంగా తీవ్ర వేగంలో పరిగిడుతూ గడిపాననే చెప్పాలి. దిజ్ఞాగుడు మొదలుగాగల అనేక మంది విద్వాంసులు తమ 18, 20 ఏండ్ల వయస్సుకే అగాధమైన పాండి

త్యాన్ని సాంపాయించారని మా ఆచార్యులు చెప్పగా విన్నాను. అప్పుడు నామీద నాకే ఓ రకమైన విచారం కలిగింది. ఏడెనిమిదేళ్ళ వయస్సులో శ్రమణుణ్ణి కాకపోవడం వలన నేను చాలా నష్టపోయాననే అనుకుంటు న్నాను. ఇప్పుడు నా ఆదర్శం, సహపాఠుల్ని కల్సుకోవడమే కాదు. వసుబంధు, దిజ్నాగుడు మొదలైన ఆచార్యుల్లా అగాధ పాండిత్యాన్ని ఆర్జించాలి. ఇరవై ఏండ్ల వయస్సులోనే అలా ఆర్జించలేక పోయినందున నేను ఇప్పటికీ విచారపడుతూనే వుంటాను. పునాది గట్టిగా వున్నట్లయితే నాకు పుట్టుకతోనే లభించిన జ్ఞాపకశక్తి, బుద్ధికుశలత ఆధారంతో ఎంత యినా అభివృద్ధికి పోయేవాడిని. ఇప్పటికీ సమయం మించిపోలేదు. కానీ, సుభూమి విహారంలో గడిపిన, నాలుగు సంవత్సరాల అధ్యయనా నంతరం ఇక నేను ఎక్కడా, ఎన్నడూ. స్థిరంగా కొన్ని సంవత్సరాలు వుండి అధ్యయనం చేయడం జరగలేదు. అయినప్పటికీ, సుభూమి విహారంలోని ఇతర విద్యార్థులకంటే నేను బాగా పరిశ్రమించాననీ, అభి వృద్ధికి వచ్చాననే అనుకుంటున్నాను.

నేను ఇరవై ఏండ్ల వాణ్ణయ్యాను. అది వర్షఋతువులోని ప్రథమ మాసం. వసంత ఋతువులోను, గ్రీష్మంలోనూ యాత్రార్థం అన్య ప్రాంతాలకు వెళ్ళిన విహారపు భిక్షువులు, వర్షావాసాన్ని గడపడానికి తిరిగి విహారానికి వచ్చేస్తున్నారు. ఇతరదేశాల భిక్షువులుకూడా కొంతమంది వచ్చారు. నేనుముందే చెప్పినట్లు, సుభూమి విహారంలో, భిక్షువులు అధిక సంఖ్యలో వుండేది చలికాలం. చలికాలంలో ఇక్కడ, కాశ్మీరం. గాంధారం, కపిషా, కాంభోజం లాంటి ఇరుగు పొరుగు దేశాల భిక్షువులే కాక, సుదూరాన కల కాంస్య-చీనా మొదలుగాగల దేశాల భిక్షువులు కూడా వచ్చి వుంటుంటారు. వర్షాకాలంలో భిక్షువులు యాత్ర చేయరాదు. ఆ మూడు నెల్లూ, ఒకచోట కూడివుండి, సాంఘిక జీవితాన్ని గడుపుతూ శీలం, సమాధి, ప్రజ్ఞాబలం-వీటిని అభివృద్ధి పరచుకోమన్నారు. వర్షా కాలం యొక్క మొదటి నెలకు కొంత ప్రత్యేకత వుంది. భిక్షువు కాగోరేవారందరికీ సంఘం ఈ నెలలోనే భిక్షుత్వాన్ని ప్రసాదిస్తుంది. ఈ నెలలో సుభూమి, సువాస్తుయొక్క ఉభయతీరాలు విశిష్టమైన సౌంద ర్యంతో వెలిగిపోతూ వుంటాయి. చలికాలంలో ఈ ప్రదేశమంత

ట్లోనూ మంచు స్వైర విహారం చేస్తూవుంటుంది. కేవలం దేవదారు వృక్షాలను మాత్రం పచ్చదనంతో చూడగలం. కానీ ఇప్పుడు – వర్షా కాలంలో–రాళ్ళను ఒరుసుకుంటూ ప్రవహించే పాలవంటి సువాస్తునీటిని మినహాయిస్తే, మిగిలిన ప్రకృతంతా పచ్చదనంతో కళకళ్ళాడుతూ వుంటుంది.

తీరానికి అటువైపున వున్న గ్రామం తిరిగి మానవ సంచలనంతో నిండిపోయింది. ఆ గ్రామంలోని పశువులూ, కొందరు మనుష్యులూ పసిరిక మైదానాల్లోకి వెళ్ళారు. అయినా గ్రామం మానవ సంచలనంతో నిండుగా కళకళ్ళాడుతోంది. రాత్రిపూట్ల చాలా ప్రొద్దు పోయేవరకుగానీ, వాయిద్యాల సుస్వరాలు. సువాస్తుయొక్క గలగల శబ్దంతో కలిసి మంద్ర స్వరంలో వినిపిస్తూంటాయి. మా ఉద్యాన భూమిలో వర్షోప నాయిక ఆషాఢ పౌర్ణమికికూడా మహా ప్రవారణ (అశ్వయుజ పౌర్ణమి)కి ఉన్నంత విలువ, ప్రత్యేకతలు వున్నాయి; ఆనాటినుండే భిక్షూ సంఘపు వర్షావాసం ప్రారంభమౌతుంది ఎదుటి గ్రామంలోని ఉపాసికలు, ఉపాసకులే (గృహస్థ ధర్మాలను నిర్వహిస్తూ బౌద్ధ మతాన్ని అవలం బించిన స్త్రీ పురుషులు) కాకుండా, చాలా దూరాలవరకూ ఉన్న క్రింది గ్రామాల్లోని ప్రజలుకూడా ఆరోజున భిక్షువులకు సమర్పించడానికి ఆహారం, వస్త్రాలూ, మందులూ – పట్టుకు వస్తూంటారు.

శ్రావణ మాసం బహుళ పక్షం, పాడ్యమి వచ్చింది. ఆరోజున ఎంతోమంది శ్రమణులకు ఉపసంపదను ప్రసాదించి భిక్షువుల్ని చేశారు. నేనూ ఆరోజే భిక్షువు నయ్యాను. ఆ రోజు ఉదయాన్నే మా శరీరాల మీద కాషాయ వస్త్రాలను తొలగించారు. ఉద్యానదేశపు రాజకుమారుడు వేసుకోదగినటువంటి గొప్పదుస్తుల్ని తొడిగారు. ఈనాటికోసమని చాలా మృదువైన పట్టుచొక్కా నొకదాన్ని, పట్టులాగూ నొకదాన్నీ దాచి వుంచారు. వాటిని ధరించాను. తలకో బంగారు కిరీటాన్ని పెట్టారు. నడుముకో కరవాలాన్ని కట్టారు. తరువాత ఉద్యాన దేశంలోకి మహా శ్రేష్ఠమైనవని ప్రసిద్ధి చెందిన తెల్లని గుఱ్ఱాల్ని తెచ్చి, మమ్మల్నందర్నీ తలా ఒక గుఱ్ఱంమీదా కూర్చోబెట్టారు. అనంతరం ఊరేగింపు బయ ల్దేరాము. సుభూమిచుట్టూ ఒకమాటు ఊరేగి వచ్చాము. వేణు మృదంగం,

పటహా మొదలైన వాద్యాలు ఘోష పెడుతున్నాయి. అక్కడక్కడా ఊరేగింపు ఆగుతోంది. స్త్రీ పురుషులు గుంపులుగా కూడి, పాడి ఆడి తమ ఆనందాన్ని వెలిబుచ్చుతున్నారు. మధ్య మధ్య మామీద పూలవర్షం కురిపిస్తున్నారు. మొత్తం దృశ్యం, ఎవడో రాజకుమారుడు వివాహ మాడడానికి వెళ్తున్నట్లుగావుంది. గృహస్థ జీవితాన్ని శాశ్వతంగా వదిలివేసే సమయమది. ఆ జీవితంలోని మహదానందాన్ని సంపూర్తిగా అనుభవించడానికి ఒకమాటు అవకాశాన్ని కలిగించడమే ఈ ఊరేగింపులోని అర్థం। అన్ని దేశాల్లోనూ ఇలాంటి ఊరేగింపుల్ని జరుపుతూనే ఉంటారు. ప్రాచీన విహారం వద్ద నున్న మహా చైత్యం వద్దకు వెళ్ళాక మమ్మల్ని గుర్రాల మీద నుండి దింపేశారు. అంతకు ముందే మా నడుములకు వున్న కరవాలాల్ని తీసి పేశారు. తరువాత విహారంలోని ప్రత్యేక కోష్టకంలోకి తీసుకుపోయి మా పట్టు వస్త్రాల్ని తీసివేసి, ధరించడానికి కాషాయాంబరాల్ని ఇచ్చారు

ప్రాచీన విహారపు ప్రార్థనామందిరం చాలా పెద్దది. ఐదువందల మంది భిక్షువులు పంక్తిబద్ధులై కూర్చొనవచ్చు ఆ మందిరంలో. ఆ మందిరంలోకి మమ్మల్ని ఒక్కొక్కర్నీ వంతులవారీగా పంపించారు. మొదటగా వెళ్ళిందినేనే.ఎదురుగా పై వరుసన ధర్మాసన మొకటుంది.నేను వెళ్ళేప్పటికిఆ ఆసనంమీదమహాస్థవిరగుణవర్ధనులు కూర్చునివున్నారు.అక్కడ మూడు వరసల్లో, దాదాపు మూడువందల మంది భిక్షువులు తమ భిక్షుత్వపు వయస్సు ననుసరించి కూర్చుని వున్నారు.21 నుండి 100 సంవత్సరాల వయస్సు గల భిక్షువుల్ని చూడవచ్చు నక్కడ. అక్కడి భిక్షువుల క్రమం వయస్సు ననుసరించి వుండదు. ఉపసంపదను పొందిన సమయాన్ననుసరించి వుంటుంది. క్రిందినుండి పై వరకూ వయస్సు ననుసరించే భిక్షువుల్ని చూడలేము. ప్రార్థనా మందిరం అతి నిశ్శబ్దంగా ఉంది మందిరద్వారంలో అనేకమంది స్త్రీ పురుషులు మౌనంగా కూర్చునీ, నిలబడీ ఉన్నారు. అంత నిశ్శబ్దత కేవలం చలికాలంలో మాత్రం చూడగలం. ఇద్దరు భిక్షువులు నన్నులోపలకు తీసుకుపోయారు.అక్కడ ఏంచెయ్యాలో ముందే చెప్పివుంచారు. ధర్మాసనాసీనులైన గుణవర్ధనులకు పంచప్రతిష్ఠిత ప్రమాణ మాచరించాను. అనంతరం గొంతుకూర్చుని ఉపసంప

దను అర్థించాను: "ఇరవై సంవత్సరాలు నిండాయా? భిక్షువు నవడానికి తల్లిదండ్రి అనుమతిఁ చారా? వంశ పారంపర్యంగాగానీ, ఇతరవిధాలగానీ ప్రాప్తించిన మహారోగాలేమీ లేవుకదా?" మొదలైన ప్రశల్ని వేశారు. ఉపసంపదను ప్రసాదించేప్పుడు ఇతరదేశాల్లోనూ ఇలాటివే ప్రశ్నలు వేస్తారని తెలుసుకున్నాను. నాకు ఉపాధ్యాయులు మహాస్థవిర గుణవర్ధను లయ్యారు. ఆచార్యులు, భదంత జినవర్మ అయ్యారు. ఇప్పుడు నేను ఉపసంపన్నుడనయి భిక్షు సంఘంలో నేనూ ఒక అంగాన్నయ్యాను. సుభూమి విహారంలోని భిక్షువులు వినయ పిటకంలోని నియమాలను తు. చ. తప్పకుండా పాటిస్తారు. సంఘం, వ్యక్తియొక్క ఆచరణలు తథాగతుడు వినయ పిటకంలో వివరించినట్టుగానే వుంటాయి. ఇతర విహారాల్లో, "వెండి, బంగారాన్ని భిక్షువు తాకరాదు" అన్న నియమాన్ని చాలా ఉపేక్ష చేస్తారు. కానీ, సుభూమి విహారంలోని భిక్షువులు నిజంగానే వెండి బంగారాన్ని ముట్టరు. ప్రాచీన విహారంలోవున్న కొందరు భిక్షువులు క్రొత్త వస్త్రంతో తయారుచేసిన చీవరాన్ని ధరించరు. పాత గుడ్డల్తో తయారుచేసిన చీవరాన్ని మాత్రమే ధరిస్తుంటారు. సుభూమి విహారాన్ని నిర్మించిన మహాస్థవిర కాశ్యపాచార్యులుకూడా పాత గుడ్డల్తో తయారుచేసిన చీవరాన్నే ధరించేవారుట. కానీ. ఇది అంత సత్యంగా కనుపించలేదు. తథాగతుని ప్రధాన శిష్యుడయిన మహాకాశ్యపుడు, హిమప్రాంతీయుల ఆచార్యుడైన కాశ్యపాచార్యుడూ – వీరిద్దరూ ఒకరే అన్న మిథ్యాభావన వలన ఇలాటి భావన ఇక్కడ వుండడం జరిగిందనుకుంటున్నాను. బుద్ధుడు తన ప్రధాన శిష్యుడైన మహాకాశ్యపుణ్ణి క్రొత్తచీవరం ధరించి వుండగా చూశాడు ఒకమాటు. మహాకాశ్యపుడు గొప్ప అందగాడు. పైగా క్రొత్త చీవరం అతడి అందాన్ని ఇనుమడింప చేస్తోంది. తన శిష్యుడు ఇలాగే అందంగా ఆకర్షణీయంగా వుంటే తప్పకుండా లోలుప దృక్కులు అతడి మీదకు ప్రసరింపబడతాయని తెలుసుకున్నాడు. అప్పుడు బుద్ధ భగవానుడు కాశ్యపుణ్ణి తనవద్దకు పిలిచి "కాశ్యపా, ఈ నీ చీవరం మహా అందంగావుంది" అని అన్నాడు. భగవానునితో క్రొత్తగా పరిచయమైన రోజులవి. బుద్ధ భగవానులు తన చీవరాన్ని కోరుతున్నారనుకున్నాడు మహాకాశ్యపుడు. బుద్ధుడికి తన చీవరాన్ని

-ఊయడానికి సిద్ధమయ్యాడు అతడు. అప్పుడు భగవానుడిలా ప్రశ్నించాడు "మరి నువ్వేం ధరిస్తావు?"

మహాకాశ్యపుడు నమ్రంగా "తమరు ధరించిన చీవరాన్ని ఇచ్చినా చాలు!" అన్నాడు.

అప్పుడు బుద్ధభగవానుడు 'పాంశు కూలిక' చీవరాన్ని ధరించి వున్నారు. అంటే చెత్తప్రోగుల్లోని చినిగిన పీలికల్తో తయారుచేసుకున్న చీవరం! వేల ముక్కల్తో అసంబద్ధంగా అతుకు వేయబడివున్నా, పరంపరానుసారంగా వస్తూన్న పద్ధతి ననుసరించి తయారు చేయబడిన తన చీవరాన్ని గురించి ఇలా అన్నారు బుద్ధ భగవానులు : "కానీ, ఈ చీవరాన్నిధరించడం నువ్వనుకున్నంత సులభం కాదు!జీవితమంతా ఇలాంటి చీవరాన్ని ధరించగలిగితే తీసుకో!"

మహాకాశ్యపుడు అంగీకరించాడు. అప్పటినుండి జీవితమంతా పాంశుకూలకుడిగానే వుండిపోయాడు. పైగా జీవితాంతం బుద్ధుడు తన శరీరంమీదనుండి తీసిఇచ్చిన ఆ వొక్క చీవరాన్నే ధరించాడుట! ఇప్పటికీ ఆ చీవరాన్ని భద్రంగా తనవద్ద అట్టేపెట్టుకుని వజ్రాసనం (బోధగయ)లోని ఏదో పర్వతగుహలో మహాకాశ్యపు డున్నాడనీ భవిష్యత్తులో రాబోయే మైత్రేయ బుద్ధుడికి ఆచీవరాన్ని ఒసంగడానికి, వేచి వున్నాడనీ చెప్పుకుంటారు హిమప్రదేశీయులు. ఆచార్యుడుకూడా పాంశుకూలికుడని నే ననుకోవడంలేదు. ప్రాచీన విహారంలోని కొందరు భిక్షువులు ఈ పరంపరను అనుసరించడం వలననే ఇప్పటికీ పాంశుకూలికుడుగా వున్నాడు.

శ్రమణుణ్ణయ్యాక నా జీవితంలో మార్పు వచ్చింది. అసలు మనిషినే పూర్తిగా మారిపోయాను. కానీ, భిక్షువు నయ్యాక జీవితం చెప్పుకోదగినంతగా ఏమీ మారలేదు. కాకపోతే భిక్షువులతో, స్థవిరులతోపాటు సమానాసనంమీద కూర్చోవచ్చు. కలిసి భోజనం చేయవచ్చు నిప్పుడు. ప్రతి పదిహేను రోజులకు, ఉపవాసముండి. ప్రత్యేక ప్రార్థనలు జరుపుతారు. వాటిలో నేనూ పాల్గొనవచ్చును! క్రొత్త భిక్షువును కావడం వలన పంక్తిలో చివర కూర్చునేవాణ్ణి. సంఘం ఏదైనా అపరాధాన్ని గురించిగానీ, సాంఘిక సంపత్తిని గురించిగానీ, నిర్ణయం చేయదలచినప్పుడు,

అభిప్రాయాన్ని చెప్పే - ఓటు వేసే - హక్కు నాకూ వుంది. బుద్ధునిద్వారా స్థాపించబడి, వేయి సంవత్సరాలుగా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న పవిత్ర భిక్షు సంఘానికి నేనూ ఒక సభ్యుణ్ణయ్యానన్న భావన మాటి మాటికి కలుగుతూ వుండేది నాలో! ఆ దృష్టిలోనే నా విలువా బాధ్యతలు కూడా పెరిగాయి.

సుభూమీ విహారంలో నియమాల్ని చాలా కఠినంగా పాటిస్తుంటారు. అక్కడి నియమ పాలనకు తట్టుకోలేని భిక్షువులు ఆ విహారంలోకి రావడానికి సాహసించరు. ఆ రోజుల్లో నా మనస్సులో అనేకమైన భావనలు ఉదయిస్తూండేవి! నేనూ మహాకాశ్యపుడిలా పాంశకూలికుణ్ణి, పిండపాలికుణ్ణి (ఎవరి నిమంత్రణను స్వీకరించకుండా కేవలం భిక్షాన్నం మీదనే జీవితాన్ని గడిపేవాడు) కావా లనుకునేవాణ్ణి, డబ్బును ముట్టుకోరాదు అనుకునేవాణ్ణి! కానీ, అవిశ్రాంతంగా జీవితమంతా యాత్రల్ని చేసే నా లాంటివాడు అలాంటి నియమాలను పాటించ గలగడం అసంభవమని తరువాత జీవితంలో తెలుసుకున్నాను. అయితే, భిక్షువునయిన క్రొత్త రోజుల్లో మాత్రం పై నియమాలను పాటించడానికి ఎక్కువగా ప్రయత్నిస్తూండే వాణ్ణి. భిక్షువు నయ్యాక కూడా నా అధ్యయనం ఏ అడ్డంకి లేకుండానే సాగిపోయింది. తరువాత నాలుగు సంవత్సరాల వరకు ఉపాధ్యాయుల ఆశ్రయంలోనూ, ఆచార్యుల ఆశ్రయంలోనూ వుండడం నియమం! కానీ, నాకు 22 వ సంవత్సరం వచ్చేవరకు మాత్రమే విహారంలో వుండగలిగాను. తరువాత నా కాళ్ళను నేను ఆపలేకపోయాను. అప్పటికి విహారంలో అభ్యసించవలసిన విద్యలన్నీ పూర్తయ్యాయనను. అయితే, యువక పండితుల్లో నన్నూ ఒకడిగా లెక్కించేవారు. కొంతమంది శ్రమణులకు అధ్యాపకుణ్ణికూడా అయ్యాను. భిక్షువు నయ్యాక విహారంలో మరి రెండు సంవత్సరాలు వున్నాను. ఆ రెండు సంవత్సరాల్లోనూ అభిధర్మకోశాన్నీ, అభిధర్మ పిటకాన్ని (బౌద్ధ మత గ్రంథాల్ని పిటకా లంటారు) ప్రమాణ శాస్త్రాన్నీ, ప్రాంతీయ భాషల్ని అభ్యసించాను. వర్షఋతువులోనూ, హేమంత ఋతువులోనూ విహారంలోకి అన్య దేశీయ భిక్షువు లొస్తుంటారు. వారితో గంటల తరబడి మాట్లాడుతూండేవాణ్ణి. ఆ భిక్షువులు తమ దేశాన్ని గురించి

ఎన్నో విషయాల్ని చెప్తూంటారు. తుషార దేశపు భిక్షువు ఒకతను. తమ దేశం వెళ్ళవలెనంటే అతి దుర్గమమైన పర్వత పంక్తు లెన్నింటినో, ఒకదాని తర్వాత ఒకటిగా వరుసనే దాటవలసివుంటుందనీ మార్గ మధ్యంలో నెలల తరబడి మానవ దర్శనమే వుండదనీ చెప్పాడు. కూచా, కాంస్య దేశాల్లో పసరిక అసలు కనబడదనీ, పచ్చదనాన్ని చూడడానికి కండ్లు తహ తహ లాడుతుంటాయనీ చెప్పాడు. ఆ దేశాల్లో ఎటు చూచినా సువిస్తృతమైన ఇసుక మైదానాలే కనిపిస్తూంటాయనీ, ఆ ఎడార్లల్లో ప్రయాణంచేసే యాత్రికులకు నీటి సమస్య, ఆహార సమస్య అతి భయంకరంగా వుంటాయనీ చెప్పారు. పైగా దయ్యాల భయం, భూతాల భయం కూడా ఘోరంగా వుంటుందిట ఆ ఎడార్లల్లో! దక్షిణ దేశాల్లో యాత్రచేసివచ్చిన భిక్షువులు ఆ దేశాల్లోని దారుణమైన ఎండల్ని గురించి చెప్తూండేవారు. మొత్తానికి తథాగతుని జన్మభూమిని దర్శించాలని ప్రతి భిక్షువూ కోరుతుంటాడు. నా లోనూ ఆ కోర్కె బలవత్తరంగా వుండేది.

మహాస్థవిర గుణవర్ధనులు తరచుగా బుద్ధ భగవానుల జన్మస్థానాన్ని గురించి చెప్తూండేవారు. వీరూ తన గురువుగారి లాగానే పరోక్ష వస్తువును ప్రత్యక్ష వస్తువులా కళ్ళకు కట్టినట్లు వర్ణించడంలో సిద్ధహస్తులు. గుణవర్ధనులు తథాగతుని జన్మ భూమిలో వేసవి కాలంలోనూ వున్నారు. అక్కడి ఎండలను భరించలేక ఎంతో బాధ కూడా పడ్డారు. పగలంతా ఒకే కోష్టకం (గది)లో, తలుపులూ, కిటికీలూ అన్నీ మూసివేసుకుని పడి వుండేవారుట. వళ్ళంతా కురుపులే చాయట! ఈ బాధ లన్నింటిని నిర్లక్ష్యం చేస్తూ, "బుద్ధుని జన్మభూమి మహా సుందరంగా వుంటుంది. వేసవి నాలుగు నెల్లూ అక్కడ గడపడం కష్టమే! అయితే అది మన కష్ట సహిష్ణుతకు పరీక్ష అనుకోవాలి! అక్కడి హేమంతం మహా కమనీయంగా వుంటుంది. ఎండలూ ఎక్కువకాయవు. మన ఉద్యానంలా విపరీతంగా మంచూ కురవదు. అక్కడ వివిధ రకాలైన ఫలాలూ, ఆహారపదార్థాలూ దొరుకుతాయి. ప్రజలు చాలా భక్తి శ్రద్ధలూ, విద్యానురాగం కలవారు. ప్రతి గృహంలోను అతిథి సత్కారంలో ఎలాంటి కొదువా వుండదు. సంఘా

శామాల్లోకి ఏ దేశపు భిక్షువు వెళ్ళినా స్వగృహంలోలా స్వాగతం లభిస్తుంది. విద్య అనేది మన కాశ్మీర గాంధార దేశాల్లోనూ వుంది. గొప్ప పండితులు ఇక్కడా జన్మించారు! కాని, తథాగతుడు పరినిర్వాణ పర్యంతము విహరించిన, (తిరిగిన) ఆదేశపు విద్యను గురించి ఏం చెప్పను! అక్కడ విద్య అనే మహాసముద్రమే ఉరకలు వేస్తూ వుంటుంది! ఆ తీరాన్ని చేరకుండా, ఆసముద్రంలో మునకలు వేయకుండా, ఏవిజ్ఞాన పిపాసువుకయినా పిపాస శాంతిస్తుందా? అయితే, పూవు ఉన్నచోటనే ముళ్ళుకూడా ఉంటాయి?" అనేవారు.

మానవుడు ఏదైనా ఒక యాత్రకు బయల్దేరాడంటే అది ఎక్కడికి వెళ్ళి అంతమౌతుందో, అతడికేం తెలుస్తుంది? సుభూమి విహారంలో వున్న చివరి సంవత్సరం, బోధిసత్వుని జన్మభూమిని దర్శించాలని దృఢమైన నిశ్చయం చేసుకున్నాను. జాతక కథలు కూడా నాజీవితం మీద ఎంతో ప్రభావాన్ని వేశాయి. నేనుకూడా బోధిసత్వుని లాగానే నా జీవితాన్ని ఇతర ప్రాణుల దుఃఖహరణం కొరకు వినియోగించాలని నిర్ణయించుకున్నాను. రోగం అన్ని దుఃఖాల్లోకి గొప్పదీ, క్రూరమైంది కూడాను. రోగ పీడితుడైన మానవుడికి వాచా సహానుభూతిచాలదు. వైద్యోపచారాలుకావాలి. వినయపిటకంలోని భేషజ్యస్కంధాన్నిచదివాక, బుద్ధ భగవానులు మానసిక చికిత్సకులేకాదు, శరీర వైద్యానికి కూడా భిషక్కులేనని తెల్సుకున్నాను. మా విహారంలోని ప్రతిమా గృహంలో-మందిరంలో(భేషజ్యగురువు)(వైద్యుడు)-రూపంలోబుద్ధునిప్రతిమకూడా ఒకటుంది. ఓషధానికి గుర్తుగా పోచ ఒకటి ప్రతిమ చేతిలో ఉంచబడ్డది ఏ దేశంలోనైనా, భిక్షువు తప్పకుండా వైద్యశాస్త్రాన్నికూడా అభ్యసిస్తాడని విన్నాను. నిరంతరం యాత్రలు చేస్తూ వుండే భిక్షువుకు వైద్యశాస్త్రాధ్యయనం గొప్ప సహకారిఅవుతుంది. భాష, ఆచారవ్యవహారాలు తెలియని పూర్తి అపరిచిత దేశాల్లో కూడా వైద్యశాస్త్రాధ్యయనం భిక్షువుకు ఎంతో సహాయకారిగా వుంటుంది. వ్యాధితో బాధపడుతున్న రోగికి శుష్కమైన వాచా సహానుభూతికంటే, చికిత్సా శాస్త్రాధ్యయనం ద్వారా సంపాదించిన జ్ఞానంతో అధికంగా సేవ చేయగలుగుతాము. కనుకనే బౌద్ధ భిక్షువులు వైద్య గ్రంథాలను చదువుతారు. ఔషధాలను తయారు

చేయడంకూడా నేర్చుకుంటాను. నాకు చికిత్సకుడైన భిక్షువును కావాలని లేదు. అలాగని వినయపిటక లోని భేషజ్యస్కంధాన్ని మాత్రంవల్లించి వూరుకోవాలనీ లేదు. ఒక యాత్రార్థి అయిన భిక్షువుకు ఎంత వరకూ వైద్య శాస్త్ర పరిచయం అవుసరమో, అంతవరకూ అభ్యసించదలచాను. అయితే, నా యీ వైద్యశాస్త్రాధ్యయనాన్ని గురించి గుణవర్ధనులకుగానీ, జినవర్మకుగానీ తెలియ నీయలేదు. అధ్యయనానికి వినియోగించవలసిన సమయాన్ని వైద్య శాస్త్ర పరిచయం కొరకు వినియోగిస్తున్నందుకు వారేమైనా అభ్యంతరాన్ని చెప్తారేమోనని నా సంకోచం ! నేను చేసే పనులను గురువులకు తెలియకుండా దాచడంగానీ, వారి అనుమతి లేకుండా ఏ పనినైనా చేయడంగానీ, నా స్వభావంలోనే లేదు కానీ, చికిత్సాధ్యయనంలో నేనీ నియమాన్ని ఉల్లంఘించాను.

నేను సుభూమి విహారంలోకి వచ్చి నాలుగవ సంవత్సరం గడుస్తోంది. మూడవ సంవత్సరం సగం గడిచేసరికి యాత్రలు చేయాలన్న ఆతురత నాలో ఎక్కువయింది. నాలుగవ సంవత్సరం మధ్యకొచ్చేసరికి ఇక ఈ హేమంతమే ఈ విహారంలో గడిపే తుది హేమంతమని స్పష్టమయింది. చిట్టచివరి ఆరునెల్లూ మూల విహారంనుండి, రహస్యంగా సుభూమిలోని మరో విహారంలోకి వెళ్ళివస్తూండేవాణ్ణి. ఆ విహారంలో ఉద్యాన నివాసి అయిన వైద్య భిక్షువొకతను వుంటూండేవాడు. అతడితో ఇలా చెప్పాను: "వైద్యశాస్త్రాన్ని నియమంగా అభ్యసించడం నావల్ల అయ్యే పనికాదు. యాత్రార్థియైన భిక్షువుకు అవసరమెంతో అంతవరకే వైద్య శాస్త్రాన్ని అభ్యసించదలచాను. అదీ మా ఉపాధ్యాయులకు తెలియకుండా రహస్యంగా,"

వైద్యుడైన ఆ భిక్షువు కూడా అనేక దేశాల్ని తిరిగి వచ్చాడు. వృద్ధుడైన కారణంగా మాత్రమే ఇప్పుడు యాత్రల్ని విరమించి సుభూమి విహారంలో వుంటున్నాడు. నాలాంటి భిక్షువుకు వైద్యశాస్త్ర పరిచయం ఎంత వరకు అవసరమో అతనికి బాగా తెలుసు. సాధారణంగా మానవులకు సంభవిస్తూండే రోగాలు, వాటి నివారణకు ఉపాయాలూ చెప్పాడు. కొన్ని మందుల్ని తయారు చేసుకోవడం నేర్పాడు. ప్రతి దేశంలోనూ

ఒకే రకమైన వేర్లూ, మూలికలూ వుండవు. ఉద్యానదేశంలో లభించే కొన్ని మూలికల్ని గురించి చెప్పాడు; జంబూద్వీపం. కాంశ్య మొదలుగా గల తమ యాత్ర చేసి వచ్చిన దేశాల్లో లభించే ఔషధాల్ని-మూలికల్ని పరిచయం చేశాడు. చివరి సంవత్సరం రహస్యంగా నే నభ్యసించిన వైద్యశాస్త్రం, ఆ అభ్యాసంలో నేను పొందిన సఫలత నన్ను పూర్తిగా సంతుష్టుణ్ణి చేశాయి.

# 5 అధ్యాయము

# గాంధారం - కాశ్మీరం

(క్రీ శ 541-42)

ఇప్పుడు నేను ఇరవై మూడేళ్ళ వాణ్ణయ్యాను. నా జ్ఞానాన్ని అభివృద్ధి పరచుకోవడానికి ఉద్యానదేశంలో యోగ్యుడైన, తగిన గురువు లభించడనిగానీ, లేడనిగానీ నే ననను. అయితే మహా సరోవరం ఎంతో పెద్దదేనా కావచ్చు. మహా సముద్రానికి దీటు రాదుకదా ? మా ఉద్యాన దేశంలోని మహాపండితులందరూ విద్యాధ్యయనం కొరకు కొంతకాలం మధ్య దేశంలో వుండి వచ్చినవారే ! పైగా మా పొరుగు దేశాలయిన కపిషా,గాంధారం, కాశ్మీరంకూడా బుద్ధునియొక్క చరణధూళితో పవిత్రమైనాయట। (బుద్ధుడు కపిష్థా, గాంధార దేశాల్లోనూ పర్యటించాడని కింవదంతులు. కానీ, వినయ పిటకం, సూత్రాలు వీటిలో బుద్ధుడు మధ్య దేశాన్ని దాటి అన్యదేశాల్లో ఎక్కడా పర్యటించినట్లు ఒక్క వాక్యమైనా లేదు.) ఏది ఏమైనా మహా పండితులు వినయ - విశారదులకు, లాక్షణికులకు నిలయమైన గాంధారం - కాశ్మీరం మాకు మా స్వదేశాల్లాగానే వుంటాయి. పండిత నిలయాలైన దూర దేశాలుకూడా ఆకర్షణీయంగా వుంటాయి. నేను బాల్యంలో ఒక మాటు మా అమ్మవెంట గాంధార రాజధాని అయిన పురుషపురానికి వెళ్ళాను. కానీ అప్పుడు నా వయస్సు చాలా కొద్ది. జ్ఞానమూ అత్యంత పరిమితం. ఆ పునీత నగరాన్ని సరిగా దర్శించి ఆనందించలేక పోయాను. కనుకనే ఇప్పుడు మళ్ళీ పురుషపురాన్ని దర్శించా లనుకుంటున్నాను. గాంధార దేశానికి వెళ్ళేముందే కపిషా దేశానికిగూడా వెళ్ళి చూడాలనుకున్నాను. మేము అతి శీతలదేశ వాసులం, ఉషదేశాల్ని గురించిన వార్తలు వింటూ

వుంటే గుండెలు అదురుతుండేవి. అక్కడ నల్లని పాము లుంటాయనీ, వాటి స్పర్శ మాత్రాన్నే మానవులు చనిపోతారనీ విన్నాను. దోమలూ, తేళ్ళూ, ఇంకా అనేకరకాలైన మానవుల్ని హింసించే క్రిమి కీటకాలు వుంటాయనీ విన్నాను. వేసవికాలంలో ఆదేశాల్లో వుండి తిరిగి సజీవంగా రావడమనేది అసంభవమైన విషయమని గూడా విన్నాను. అయితే మా ఆచార్యులవారు అత్యంత ఉష్ణదేశాల్లో వుండి వచ్చారు. సజీవంగా నా కండ్లకు కనిపిస్తున్నారు. మరి నే నెందుకిలా బాధలకు వెరవడం? మృత్యువుకు జడవడం?

వసంతఋతువు. దీని తరువాత గ్రీష్మంవస్తుంది. మధ్య ప్రాంతానికి వెళ్ళదలచినట్లయితే చలికాలంలో బయలుదేరేవాళ్ళం! కానీ కపిషా పర్వతప్రాంతం, శీతలదేశం! కనుకనే వసంతఋతువులో ప్రస్థానాన్ని సాగించాము. కపిషా, మా ఉద్యాన దేశమంత శీతలదేశం కాకపోయినా, దాన్ని శీతలదేశమనే అనవచ్చు! విహారంనుండి బయల్దేరి ఒక పెద్ద పర్వత పంక్తినీ, రెండు చిన్నచిన్న పర్వతాల్ని దాటి 'కునార్' నదీ తీరానికి వచ్చాము. ఇదీ పెద్ద నదేను! ఈ నదీతీరం పసిరికతోనిండి సస్యశ్యామలంగా వుంది. యాత్రికులము చాలామందిమి వెళ్తూన్నాము. ఇంతమందితో కలిసి యాత్రచేయడం నాకు అంతగా నచ్చదు. యాత్రకు బయలుదేరామంటే వెంట నలుగురు లేక ఐదుగురికి మించి యాత్రికు లుండరాదు. ఆ నలుగురైదుగురయినా, భిక్షువులే అయివుండాలి. ఉపాసకులు కాకూడదు. ఉపాసకులందరికీ ఇల్లూ, వాకిలీ, పెళ్ళాం బిడ్డలూ వుంటారు. వాళ్ళకు అంతా తొందరే! చూడదలచుకున్న నాలుగు ప్రదేశాల్ని చకచకా చూచి ఇండ్లకు వెళ్ళిపోదామంటారు. మేమో, (భిక్షువులం) స్వతంత్రులం! ఏ బాదరబందీ లేదు. ఎక్కడయినా వుండాలనుకుంటే నాలుగయిదురోజు లుంటాము. నాలుగయిదు రోజులే ఏమిటి? నాలుగయిదు నెల్లయినా వుండిపోతాము! మేము ఉండడానికి పట్టణాలు పల్లెలే అవుసరంలేదు. అరణ్యాల్లోనూ, నిర్జన ప్రదేశాల్లోని పశులకాపర్ల పాకల్లోకూడా వుండిపోతాము. ఉద్యాన భూమిలో పుట్టడంవలన, కొండవాగులపట్లా, ఎల్లకాలాల్లోను పచ్చగావుండే దేవదారు మొదలైన వృక్షాలపట్లా, చెట్లతో నిండి, కళ

కళ్ళాడుతూవుండే పర్వత పంక్తులపట్ల - నా హృదయంలో అదోరకమైన అభిమానం, ఆకర్షణా జనించాయి.

మానవుని బాల్యకాలపు స్మృతులు మధురంగా ఉంటాయి. అతడి బాల్యనేత్రాలు ఏ వస్తువును అందమైనదనీ, కాంతియుక్తమైనదనీ నిర్ణయిస్తాయో,ఆ వస్తువులపట్ల అభిమానం,ఆకర్షణ జీవితపర్యంతం నిలిచి ఉంటుంది. జాగ్రదావస్థలోగానీ స్వప్నావస్థలోగానీ మానవుని ప్రాచీన స్మృతులు, అతడిని గతకాలపు మధురానుభూతులవైపుకే లాక్కుపోతుంటాయి. కునార్ నదీతీరం, ముఖ్యంగా పై భాగం మాకండ్లకు చాలా అందమైందిగా కనుపిస్తోంది. రెండు రోజుల ప్రయాణానంతరం నదీతీరాన కల పట్టణాన్నొకదాన్ని చేరాము. మేము సాధారణమైన గ్రామాన్నయినా - పది దుకాణాలూ, ఒక మంచి విహారం, ఒక మోస్తరు రాజూ వుంటే - పట్టణ మనేస్తాము.సరే, నేను కండ్లు తెరిచాక పెద్ద పట్టణం ఏదీ చూడకపోవడంవలన అదే నా కండ్లకు మహాపట్నంగా కనుపించింది.మా సహయాత్రికులు, ముఖ్యంగా, ఉపాసికలు ఆ పట్నాన్ని ఒకటే పొగడడం: ఉపాసికల్తో, ఉపాసకుల్తో కలసి యాత్ర చేయడంలో ఒక ప్రయోజనం మాత్రం తప్పకుండా సాధింపబడుతోంది? ఆహారం కొరకు వెతుక్కోనవసరం ఉండదు. సూర్యోదయంతోపాటు ఉపాసికలు అల్పాహారాన్ని- పేరుకు అల్పాహారమేగానీ, మాలాంటి వంటిపూట భోంచేసే భిక్షువులకది పూర్ణాహారం కిందే లెక్క - తయారుచేసి సిద్ధంగా ఉంచేవారు. అల్పాహారమయ్యాక మేము ప్రయాణం సాగించేవారం.నదీతీరాన్ననుసరించి క్రిందికి పోయినకొలదీ ఉష్ణం పెరుగుతూనే ఉంది. ఎంత పెరిగినా అది వసంతఋతువే కావడంవల్ల మేము సహజంగానే ఆ ఉష్ణాన్ని సహించగలుగుతున్నాము. అయినా మేము ఉదయం, సాయంకాలం మాత్రమే ప్రయాణం చేసేవాళ్ళం. కొంత దూరం వెళ్ళాక, నదికి ఎడం వైపున ఓ పెద్ద గ్రామం వచ్చింది. తరువాత 'కునార్' అనే గ్రామం వచ్చింది. ఈ గ్రామాన్నుండే నదికాపేరు వచ్చి ఉంటుంది. 'సువాస్తు' గూడా అంతే కదు! అదే నది పేరు. అదే ప్రదేశం పేరుకూడాను! తరువాత నగరహారం-జలాలాబాద్ - వెళ్ళేవరకు ఉష్ణం పెరుగుతూనే ఉంది. నగరహారం ఇంకా చాలా దూరం ఉండనగానే పర్వతాలన్నీ బోడివై

పోయాయి. ఏ పర్వతం మీద చెట్టూ చేమా అంటూలేదు. ఒక రకంగా వాటి శోభ హరించుకుపోయింది. చెట్టూ చేమా లేకుండాకూడా పర్వతాలు ఉంటాయని నే నంతవరకూ ఊహించనే లేదు. నే నిలా బోడి పర్వతాల్ని చూసి ఖిన్నుడనవుతూన్న సమయంలో నాతోటి భిక్షువులూ, ఇతర యాత్రికులూ, పట్టణంలోని విశాలమైన వీధులనూ, వివిధ రకాలైన వస్తువుల్తోటి అలంకరించిఉన్న అంగళ్ళనూ, బంగారపు పై కప్పులుకల విహారాలనూ, మందిరాలనూ చూసి ఆనందిస్తున్నారు. పర్వతాలు శ్రీరహితాలే అయినా, కాలువలద్వారా నీటి పారుదలకు ఏర్పాట్లను చేసుకుని, ప్రశంసాత్మకంగా సేద్యం చేస్తున్నారు అక్కడి ప్రజలు. పండ్ల తోటలుకూడా విరివిగా ఉన్నాయి. మేము అతి శీతల ప్రదేశ నివాసులం కాకపోయినట్లయితే, నగరహారం యొక్క వాతావరణం అతిసుఖకరమైనదని ఒప్పుకోక తప్పేదికాదు! అక్కడి ప్రజలు, చాలా సౌమ్యస్వభావం కలవారు. సౌమ్యం అంటే భీరుత్వం అనుకోకూడదు. అవసరమైతే ప్రాణాల నీయడాని కయినా వారు సిద్ధమే! విద్యా ప్రేమ అంటే ఏమిటో, కళా ప్రేమ అంటే ఏమిటో అక్కడే చూశాను, మొదటగా!

నగరహారం (జలాలాబాద్) 1,960 అడుగుల ఎత్తు. నగరహారం కూడా పురుషపురం లాగానే మాకు పవిత్ర తీర్థం! ఇక్కడి విహారం, చైత్యం, ప్రతిమా గృహం, పురుషపురంలో వాటిలా పెద్దవికావు. అయినా, బుద్ధుని పవిత్ర శరీరధాతువులెన్నో ఇక్కడ ఉన్నాయి. పురుషుల్లోకి ఉత్తముడైన బుద్ధభగవానుడు తన ఉపదేశాలద్వారా మానవుల్ని కృతార్థుల్నిచేస్తూ, దేశ దేశాలు పర్యటించేప్పుడు, కోట్లకొలది మానవులు,ఆ పురుషోత్తముణ్ణి దర్శించి,అతడి ఉపదేశాల్ని విని తరించి వుండవచ్చు ఆ ద్విపదోత్తముడు గతించి వేయి సంవత్సరాలు గడిచాయి. అయినా, మా కండ్లూ వారి దర్శనంకొరకు పరితపిస్తున్నాయి. మా ప్రాణాలూ వారి ఉపదేశామృతం కొరకు తహతహలాడుతున్నాయి. వారి సూత్రాల్ని పఠించి, వారి ఉపదేశాల్లోని సారాన్ని, ఆనందానుభూతినీ-కొంతవరకూ అనుభవించగలుగుతున్నాము. కానీ, ఇక్కడ, ఈ నగరహారంలో, ఆ దివ్యమూర్తి యొక్క గ్రీవా అస్థి - మెడ

ఎముక భద్రపరచబడివుంది. "మూడు అంగుళాల పొడుగూ,అంగుళం వర వెడల్పూ, కొద్దిపాటి పసుపు పచ్చని కాంతితో, మధుచ్ఛత్రం - (తేనెతుట్టి) - లాగుంది." ఒకప్పుడు బుద్ధుని శరీరంలో యిమిడివున్న పవిత్ర అస్తి ఇది. తరువాత బుద్ధభగవానుడు చీవరాన్ని భద్రపరచిన విహారంలోకి వెళ్ళాము. అక్కడ తథాగతుని పవిత్ర చీవరాన్ని దర్శించాము. భిక్షువులు క్రొత్త వస్త్రాలతో చీవరాలను తయారు చేసుకొనవలదనీ, చింకిపాతలతో తయారు చేసుకొనవసినదనీ చెప్పాడు బుద్ధుడు. భిక్షువు క్రొత్త వస్త్రాలనే ధరించడం ప్రారంభిస్తే, వీరి వస్త్రాల భారాన్నికూడా మోయవల్సినవా రవుతారు గృహస్థులు. గృహస్థులకు భిక్షువులవల్లబాధా, భారంహెచ్చకుండాఉండడానికి చింకిపాతల్ని ధరించమన్నాడు. చింకిపాతల్తో తయారుచేసిన చీవరాలకూ, క్రొత్త చీవరాలకూ వ్యత్యాసం తెలియకుండా వుండడానికి. వాటిని ఎర్ర రంగులో ముంచడమే కాకుండా, మగధలోని వరిమళ్ళను చూపి "భిక్షువుల చీవరాలు ఈ వరిమళ్ళలాగా ఉండా "లన్నాడు.క్రొత్త వస్త్రాల్నయినా చింపి,వరిమళ్ళలాగానే ముక్కలు ముక్కలు అతుకులువేసి కుడతారు చీవరాన్ని। విహారంలోకి బుద్ధుని యొక్క పవిత్ర చీవరానికి కూడా పన్నెండు అతుకు లున్నాయి. నాలుగు వైపులా అంచు కుట్టివుంది. చీవరంతో పాటు బుద్ధుని చేతికర్రనుకూడా చూశాను. ఒకప్పుడు ఆ దివ్యపురుషుని చేతుల్లోవుండి, వారికి నడవడంలో సాయపడుతూండేది. ఇప్పుడు విరాశిత అయి అక్కడ పడివుంది. ఇలాంటి పవిత్ర వస్తువులపై ప్రజల యొక్క శ్రద్ధాసక్తులు. భక్తి - అత్యధికంగానే ఉంటాయి. పైగా అత్యుక్తులుకూడా అధికప్రచారంలో ఉంటాయి.ఈచేతికర్ర విషయంలో కూడా చాలా అతిశయోక్తుల్ని చెప్తారు.సువర్ణఖచిత కాష్ఠఫలకంపైన పెట్టివుందా చేతికర్ర। సాధారణ సమయాల్లో వందమంది కలసికూడా ఈ కఱ్ఱను ఎత్తలేరని, ప్రత్యేకసమయాల్లో ఒక పసిబాలుడైనా సులువుగా ఎత్తగలుగు తాడనీ చెప్తారు. మరోవిహారంలో బుద్ధునిదంతాన్ని, కేశాల్ని చూశాము. ప్రతిరోజూ ఉదయం సాయంకాలం ఈ పవిత్ర ధాతువుల్ని బయటికి తీసి పూజిస్తూంటారు. అప్పుడే వీటిని యాత్రికులకు చూపుతారు. ఈ పవిత్ర ధాతువులపై ప్రజలకుగల భక్తిశ్రద్ధల్ని ఆధారంగా

తీసుకుని కొంతమంది మతవ్యాపారులు ప్రజల్ని మోసంకూడా చేస్తూం టారు. కనుక ఈ వస్తువుల్ని గురించి చెప్పే అతిశయోక్తుల్లో కొన్నింటి నైనా నాలాటి శ్రద్ధాళువు శంకించకమానడు. ముఖ్యంగా కేశాల్ని గురించిన సందేహం నాకూ కలిగింది.ఇన్ని సంవత్సరాల నా అధ్యయనం లోనూ బుద్ధభగవానుడు కేశఖండన చేయించుకున్నట్టు నేనెక్కడా చదవ లేదు. భిక్షుకవేషాన్ని ధరించేప్పుడు మాత్రమే తనకేశాలను తనకత్తితో కత్తిరించుకున్నారు. ఆ కత్తిరించుకున్న వెంట్రుకలను దేవేంద్రుడు దేవ లోకానికి తీసుకునివెళ్ళాడు. కుసీనారాలో బుద్ధుని శరీరానికి అగ్ని సంస్కారం జరిగాక, భస్మాన్ని, మిగిలిన అస్తికలను పంచుకున్నారు. ఆ పంచుకోవడంలో కేశాల ప్రశక్తేలేదు. కేశాలు అగ్నిలో భస్మమై పోయే వుంటాయి మరి కేశాల సంగతి? ఏమైనాకానీ, మూర్ఖులైన భక్తి మండలి చుట్టూ ఉన్నప్పుడు తర్కించడం, మెదడుకు పని కల్పించడం అవివేకం! అసంగతంకూడాను!

మేము నాలుగయిదు రోజులు నగరహారంలోనే ఉంటామని తెలిప సింది. చాలా సంతోషించాను. భిక్షువులం సాధారణంగా విహారాల్లోనే బస చేస్తూంటాము విహారా ల్లేకపోతే; అది వేరే విషయం! మావెంటఉన్న గృహస్థులనో, ఉపాశ్రయాలనో, అతిథి గృహాలనో చూడడం ఆచారం! నగరహారంలోని భిక్షువులు ఒకరిని మించిన పండితులు ఒకరు. అక్కడి పండితుల అగాధ పాండిత్యానికి ముగ్ధుణయి. అక్కడేఉండి విద్యాధ్య యనం చేస్తే బాగుణ్నని కూడా అనుకున్నాను. అయితే నగరహారం మా ఉద్యానంలోని భాగంలోనే ఉంటుంది. అనేక దేశాల్ని చూడాలన్న నా ఉత్సాహం నన్ను నగరహారంలో నిలువనీయలేదు! అప్పటివరకూ నేను సంపాదించిన జ్ఞానానికీ, నాలోని విద్యాభిరుచికి అక్కడి నాయకస్థవిరులు మహా సంతోషించారు. అక్కడే ఉండాలన్న భావనను వెలిబుచ్చినట్ల యితే నాయకస్థవిరులు నాకు స్వాగతాన్నీయడానికి సిద్ధంగా ఉన్నారు. రెండురోజులవరకు అక్కడే ఉండడమా, వెళ్ళడమాఅన్న సందిగ్ధంలో గడిపాను. అనంతరం, మధ్యప్రాంతంలోకాక, మరెక్కడా ఉండ రాదన్న నిర్ణయానికి వచ్చాను.

నగరహారానికి చుట్టుపట్లకూడా చాలా విహారా లున్నాయి. కొన్ని విహారాలు పర్వత గుహల్లోనూ ఉన్నాయి. ఇక్కడి గోప గుహను దర్శించడానికి ప్రజలు తండోపతండాలుగా వెళ్తూంటారు. నేనుఅక్కడికి వెళ్ళాను. తథాగతుడు మనుష్యలోకంలో విహరించేప్పుడు తన ఛాయను ఈ గుహలో వదిలి వెళ్ళాడుట. ఆ ఛాయను ఇప్పటికీ చూడవచ్చునట! ఈ గుహ నగరానికి దక్షిణంగా అర్థయోజన దూరంలో వుంది ఈగుహ ముఖం పడమర దిశకు ఉంది. గుహకుకొద్ది దూరంలో నిలబడి ధ్యాన పూర్వకంగా చూసేట్లయితే నిజంగానే స్వర్ణవర్ణఛ్ఛాయ దృష్టిగోచర మౌతుంది. మనం దగ్గరకు వెళ్ళినకొద్దీ ఛాయ మరీ స్పష్ట మౌతుంది. ఎంతోమంది నేర్పరులైన చిత్రకారులు ఆ ఛాయకు ప్రతిరూపాల్ని తీసు కోవడానికి ప్రయత్నించారుట ; కానీ సఫలతను పొందలేకపోయారని చెప్పారు.

బుద్ధుని చే తి క ర్ర భద్రపరచబడిన విహారం పట్టణానికి ఈశాన్యంగా ఒక యోజనం దూరంలో వుంది. చేతికర్ర చందనకాష్ఠంతో తయారు చేయబడింది. చందనాల్లోకి సర్వశ్రేష్ఠమైన గోశీర్ష చందన కాష్ఠం - గంధపు చెక్కతో చేయబడిన పెద్ద పెట్టెలో భద్రపరచబడి వుందా కర్ర ! చీవరం నగరానికి పశ్చిమ దిశనున్న విహారంలో ఉంది. ఈ చీవరంలో వున్న గొప్ప విశేషం ! దేశంలో వర్షాలులేక, కరువు కాటకాలు ఏర్పడ్డ సమయంలో, ఈ చీవరాన్ని పట్టణంలో ఊరేగి స్తే వర్షాలు కురుస్తాయిట ! అలాగని ప్రజల విశ్వాసం ! గోపగుహకు 400 గజాల దూరంలో బుద్ధుడు కేశఖండన, నఖ ఖండన - చేసుకున్న ప్రదేశం ఉంది. ఇక్కడే భవిష్యత్తుకు సంకేతంగా డెబ్భై, ఎనభై బారల ఎత్తుగల స్థూపాన్ని నిర్మించాడు. బుద్ధ భగవానునిచే నిర్మింప బడిన ఆ స్థూపం ఇప్పటికీ అక్కడ ఉంది. ఆ పరిసరంలో, చుట్టు పట్లా, వేలసంఖ్యలో చైత్యా లున్నాయి. వాటిలో ఎంతోమంది మహా పురుషుల ధాతువులు - ఎముకలు - భద్రపరచబడి వున్నాయి.

నాలుగు రోజుల్లో నగరహారం దాని చుట్టుపట్లవున్న పవిత్ర స్థానా లన్నింటిని చూసేశాము.

ఈశాన్య మూలగా ఒక యోజనం దూరం ప్రయాణం చేశాక అస్థి (ఎముక) అనే ఓ పెద్ద గ్రామ మొకటి తగిలింది. గ్రామం లేక చిన్న నగరం ఒక క్రోసు విస్తీర్ణాన్ని కలిగి, పర్వతపు పైభాగంలో ఉంది. పర్వతం బోడిదే అయినా, ఎన్నో కొలనులూ, ద్రాక్ష, అంజీర మొదలుగా గల పండ్ల తోటలు ఉండడంవల్ల పరిసరం రమణీయంగా ఉంది. పండ్లతోట లోపల రెండు అంతస్థుః భవనం ఒకటుంది. ఆ భవనంలో తథాగతుని ఉష్ణిష – అస్థి (మెదడు ఎముక) – పుర్రె, ఒక కన్ను, చేతి కర్ర, చీవరము భద్రపరచబడి ఉన్నాయి. ఈ భవనానికి ఉత్తరంగా ఒక అద్భుత పాషాణ స్థూపం ఉంది. ఆ స్థూపం వ్రేలితో కదిలిస్తే కదుల్తుంది!

## కపిషా(శా) – కాబుల్

నగర హారపు చుట్టుపట్ల ఉన్న పవిత్ర ప్రదేశాలను చూశాక, పశ్చిమంగా మా పస్థానాన్ని సాగించాము. నగరహారాన్ని దాటి కొద్ది దూరం వెళ్ళేసరికి కుభా–కాబుల్–నది వచ్చింది. ఆ నది కపిషానుండి వస్తున్నదని మాకు తెలుసు. ఆ నదీ తీరాన్ని అనుసరించి పశ్చిమంగా వెళితే కపిషా వెళ్ళామనీ తెలుసు; కాని నదీతీరా న్ననుసరించిప్రయాణించ డం అంత సుగమంగా ఉండదు. మా ప్రయాణాన్ని చిన్న చిన్న కొండల మీదుగానో లేక కొండల క్రిందుగానో సాగిస్తున్నాము. కొండ లన్నీ బోడిగానేవున్నాయి. గ్రామాల్లోమాత్రం అక్కడక్కడా పొలాలూ పచ్చదనమూ కనిపిస్తున్నాయి. పర్వతాలపైన మూజ – దుబ్బులూ, పొదలూ మాత్రం అధికంగా వున్నాయి. బహుశా ముంజవాక్ పర్వ తాలు ఇవేగావును అనుకున్నాను. ఒక పెద్ద పర్వత పంక్తిని దాటాక కొంచెం శీతల ప్రదేశంలోకి వచ్చాము. చివరకు మేము కపిషా రాజ ధానికి – బేగ్రాం – కోహ్‌దామన్–క చేరాము. కపిషా ద్రాక్షలు రుచి లోనూ, ఆకారంలోనూ అద్భుతమైన వంటారు. ఎండు ద్రాక్షల్ని చూశాను, తిన్నాను కూడాను. కానీ, తాజా ద్రాక్షల్ని చూడడం ఇదే ప్రథమం. మేము వెళ్ళిన సమయం ద్రాక్షపండ్ల సమయంకాదు. ద్రాక్ష తీగలు అప్పుడే ఆకుల్ని తొడుగుతున్నాయి. కానీ, కపిషా ప్రజలకు

ద్రాక్షపళ్ళను ఎండకుండా, చెడకుండా, సురక్షితంగా ఉంచే పద్ధతులు తెలుసు పండిన ద్రాక్షల్ని కోసి, మట్టి పిడతల్లో పెట్టి, మట్టితో షే సీలుచేసి భూమిలో పూడ్చిపెడతారు. సంవత్సరం తరువాత వాటిని తీసినా ఏమాత్రం చెడకుండా అప్పుడు చెట్టునకోసిన పండ్లలాగుంటాయి. బంగారురంగుతో తళతళా మెరుస్తూన్న పెద్ద పెద్ద ద్రాక్షలుచూడ డానికే కాక తినడానికి కూడా మహా రుచిగా ఉంటాయి.

ఈ కపిషా మహారాజే నగరాన్ని కూడా పరిపాలిస్తూంటాడు కపిషాకు ఉత్తరంగా హిమాచ్ఛాదిత పర్వతశ్రేణు లున్నాయి. ఆశ్రేణుల్ని దాటితే బాహ్లీక్-బలఖ్ - దేశానికి వెళ్ళవచ్చును. 'కపిషా' పేరుకు సంబంధించిన మీమాంసలో పడ్డాను. అసలు 'కపిషా' అన్న పేరు ఎందుకు వచ్చింది? 'కపి' - వానరం - యొక్క ఎరుపు పసుపు కలిసిన రంగుకు ఈభూమికి ఏమైనా సంబంధంవుందా? అనే ప్రశ్నలు నాబుర్రలో తిరుగుతున్నాయి. కపిషా వెళ్ళాక, అక్కడి ప్రజల పింగళ - ఎరుపు, బూడిద వర్ణము కల్సిన రంగు - వర్ణశరీరాల్ని, పింగళ కేశాల్ని చూసి, ఆ దేశానికి 'కపిషా' అన్న పేరు ఎందుకు వచ్చిందో అర్థమైంది. ఈ రంగు వలననే అక్కడి ప్రజలను 'కపి' అన్నారు. వాళ్ళు నివసించే భూమిని 'కపిషా' అన్నారు. కపిషా చాలా శీతల (మా గ్రామాలూ, విహారమంత కాకపోయినప్పటికీ) దేశం. దేశానికి మధ్యగుండా కుభానది ప్రవహిస్తూ వుంటుంది. చుట్టూ పర్వతాలు. రాజధాని ఏమంత పెద్దది కాదు. బహుశ ఒక అర్థయోజనం విస్తీర్ణాన్ని కలిగి వుంటుంది. ఇక్కడి గృహాలు చాలా సుందరంగా వున్నాయి. గృహ నిర్మాణంలో కలపను కూడా ఎక్కువగా వుపయోగించారు. చుట్టూ వున్న పర్వతాలు చెట్లూ, చేమలూ లేకుండా శూన్యంగా వున్నాయి. కపిషా ద్రాక్షలతల దేశం. ఇక్కడ గోధుమ, యవలు, మరి ఇతర అనేకరకాలైన ధాన్యాలూ పండు తాయి. కపిషా గుర్రాల కూడా మంచి ప్రసిద్ధిని పొందింది. ప్రజలు చాలా ఉద్దండుల్లా గుంటారు. కపిషా ప్రజలు, ఉత్తరంగా కానవస్తున్న హిమవత్పర్వత శ్రేణులకు అవతల నివసించే తుఖార్ జాతి ప్రజల్లా వుంటారు. వీళ్ళ దుస్తులూ ప్రత్యేకమే. లాగూలను ధరిస్తారు. తలదూర్చి తొడుక్కునే చొక్కాలను - గవిసెనలను ధరిస్తూంటారు. తలకు తల

గుడ్డల్ని ధరిస్తారు. కానీ, వీరి శాసకులైన ఏథాల దుస్తులు అదో రకం ప్రత్యేకత! ఏథాలాంటి వస్త్రధారణను, తరువాత నా యాత్రల్లో, కూచా- ఇరాన్- ప్రజల్లో చూశాను. ఏథాలు కూచా ప్రజలకు సన్నిహితులని తెలుసుకున్నాను. చలిదేశం కావడంవలన ఈ దేశ ప్రజలు ఉద్యాన వాసుల్లాగానే ఉన్ని వస్త్రాలను ధరిస్తుంటారు. ఈ దేశపు దుశ్శాలువలు ప్రపంచ ప్రసిద్ధిని గాంచాయి. ఈ దేశంలో వందల సంఖ్యలో విహారాలున్నాయి. ప్రతిగ్రామంలోనూ చక్కగా అలంకరించిన చైత్యాలున్నాయి. వీటిని చూస్తూ వుంటే బౌద్ధమతం ఈ దేశంలో ఎంతగా వ్యాప్తిలోకి వచ్చిందో, ఎంతటి ఉచ్ఛస్థితికి వచ్చిందో వూహించవచ్చును. అయితే, ఈ దేశంలో ఇతర మతాల ప్రజలు కూడా వున్నారు. శివాలయాలను కొన్నింటిని చూశాము.

కపిషా దేశపు రాజధాని - బేగ్రాం-ని ఇప్పటికీ ఓ చిన్నరాజు పరిపాలిస్తూన్నాడు. రాజధాని చుట్టూ చాలాదూరం వరకూ శిథిలాలు కనుపిస్తూంటాయి. శిథిలాలను చూస్తూ వుంటే ఒకప్పుడు ఈ పట్టణం చాలా విశాలమైనది గావును అనిపిస్తుంది. పైగా శిథిలాలయొక్క గోడలూ, అవీ ఇంకా మంచి స్థితిలోనే వున్నాయి. అంటే, ఈ పట్టణానికి ఈ దురవస్థ కొద్ది కాలం క్రితమే పట్టిందన్నమాట! ఏథాలు ఆ పట్టణాన్ని ధ్వంసం చేయడం అక్కడ వృద్ధులు ఇప్పటికీ చెప్తూంటారు. మిహిరకులుడి శాసనాన్ని ఇక్కడా పాటిస్తూంటారు. అయితే అతడి ప్రతాపం క్షీణించాక అతడి శాసనాలపట్ల ప్రజల భయము, లక్ష్యంకూడా తగ్గాయి! ఇక్కడా చాలా విహారాలున్నాయి. కనిష్కుడి అనేక రాజధానుల్లో ఈ కపిషా కూడా ఒకటి! ఇక్కడి రాజవిహారాన్ని బహుశా కనిష్కుడే ప్రారంభించాడేమో! కనిష్కుడు కేవలం మా దేశాన్నే కాదు పాలించింది. అతడి రాజ్యం 'సీతా' నదినుండి 'పీత'- పసుపురంగు - నది వరకూ వ్యాపించి వుండేదిట! ఒకమారు చీనాదేశపు రాజుకూ, కనిష్కుడికీ యుద్ధం సంఘటిల్లిందిట. ఆ యుద్ధంలో చీనాదేశపు రాజు ఓడిపోయి, పరిహారంగా తన కుమారుణ్ణి కనిష్కుడి ఆస్థానంలోకి పంపించాడుట. కనిష్కుడా రాజకుమారుణ్ణి చాలా గౌరవించి, అతడి కొరకు కపిషా, గాంధార, భారత దేశాల్లో మూడు భవనాలను కట్టించాడుట. చీనా రాజకుమారుడు వేసవిలో

కపిషాలో, శరదృతువులో గాంధారంలో, చలికాలంలో భారతదేశం–మధ్య దేశం–లో వుంటూండేవాడుట !

కనిష్కుడు ఈరాజకుమారుడి ఖర్చుకొరకు ఒకప్రదేశాన్నిచ్చాడు. ఆప్రదేశాన్ని ప్రజలిప్పటికి 'చీన భుక్తి–జిల్లా'–అంటుంటారు. ఈ చీనా రాజకుమారుడే కపిషాలోని రాజవిహారాన్ని కట్టించాడని చెప్తారు. అక్కడే కాదు, రాజకుమారుడు తనువుండే ప్రతిచోటా ఒక్కో విహారాన్ని కట్టించాడుట. కపిషా రాజవిహారంలోని భిత్తి చిత్రాల్లో కొన్ని చీనారాజకుమారుని పోలికను కలిగి వున్నాయి. ఇందువలనకూడా చీనా రాజకుమారుడే ఆ విహారాన్ని కట్టించాడని అనుకొనవచ్చు. రాజకుమారుడు తను కట్టించిన ప్రతి విహారానికి ఖర్చుల నిమిత్తం కొంత 'వృత్తిని' – మాన్యం – నిర్ణయించాడు. ఇప్పటికీ ఆ విహారాలకు ఆ రాజకుమారుని పేరు మీద 'వృత్తి' లభిస్తూంటుంది. వర్షోపనాయక మహాప్రవారణ–మొదలైనపర్వ దినాల్లో రాజకుమారుడి తరఫునుండి భిక్షు సంఘానికి ఇప్పటికీ దానదక్షిణలు లభిస్తూంటాయి. ఈ మొత్తం విషయాన్ని కపిషా రాజ విహారంలో భిక్షు వొకతడు చెప్పాడు. ఆ భిక్షువు కూడా ఇలా అన్నాడు: "ప్రార్థనా మందిరపు తూర్పు దర్వాజకు దక్షిణాన ఒకగొయ్యి త్రవ్వి చాలా ధనాన్ని ఆ రాజకుమారుడు పూడ్చి ఉంచాడుట. ఆ ధనాన్ని విహారంయొక్క శిథిల సంస్కారాలకు ఉపయోగించ వలసిందన్న ఆశయాన్నిచ్చే పత్రాన్నొక దాన్నికూడా అందులోనే దాచాడుట. కొన్ని శతాబ్దాల తరువాత సరిహద్దులోని రాజొకడు ఈ విషయాన్ని తెల్సుకుని ఆ ధనాన్ని అపహరించాలనే ఉద్దేశంతో గొయ్యిని త్రవ్వించాట. కానీ ఆ ధనాన్నొక దేవత కాపలా కాస్తూన్నది. కాపలా దేవతనెత్తిన ఒక చిలుక ఉంది ఆ చిలుక దురాశపరుడైన ఈ రాజునుచూచి, భయంకరంగా రెక్కల్ని విదిల్చేసరికి, భూమ్యాకాశాలుకూడా కంపించాయి. ఆ రాజూ, అతడి అనుచరులూ స్పృహతప్పి పడిపోయారు. స్పృహతెలిశాక, ఆ రాజు, అతడి అనుచరులూ "క్షమించమని" ప్రార్థిస్తూ అక్కడనుండీ వెళ్ళిపోయారట"

కపిశాదేశం, పారసీక, బాహ్లిక, జంబూద్వీపవ్యాపారులూ, యాత్రికులూ కలుసుకోవటానికి కూడలి స్థానంలాంటిది. రాజవిహారంలో అనేక దేశాల భిక్షువులు కలుస్తూంటారు. కథను వినేవాళ్లలో బుద్ధిలుడనే భిక్షు

వొకతనున్నాడు. అతడు నా కంటె నాలుగయిదు సంవత్సరాలు పెద్దవాడే; అయినా చూడ్డానికి చిన్నవాడిలా కనిపిస్తున్నాడు. అతడు పై కథను విన్నంతసేపూ చిరునవ్వునవ్వుతూనే ఉన్నాడు. చివరి కిలా అన్నాడు. "రాజునూ, అతడి సైనికుల్నీ తిరిగి ఎందుకు పోనిచ్చింది చీకి? చంపేస్తే పోనుగా?" బుద్ధిలుడి ముఖం ఆకర్షణీయంగా వుంది. కండ్లు విచిత్రంగా మెరుస్తున్నాయి. అతడి కండ్లనూ, ముఖాన్ని చూస్తుంటే గొప్ప ప్రతిభావంతుడనిపిస్తూంది. అతడి స్వరమూ, మాట్లాడేపద్ధతి కూడా చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి. రాజ విహారంలోనే ఒకరినొకరం పరిచయం చేసుకున్నాము. కపిషాలో ఉండగానే మా పరిచయం ప్రాణస్నేహంగా మారింది. నా జీవితంలో, ఎంతోమంది మిత్రులు కలిశారు, విడిపోయారు. కానీ బుద్ధిలుడితో సమం ఒక్కళ్ళూ కాలేకపోయారు. బుద్ధిలుడు ఎంత ఉదారుడు! ఎంత స్నేహశీలుడు! పేరుకు తగినట్టుగానే అతడికి బుద్ధి – తెలివితేటలు – పుట్టుకతోనే అత్యధికంగా లభించాయి. అతడి అధికమైన తర్కబుద్ధి ఒకప్పుడు నాకూ సహించేదికాదు. మా ఇద్దరికీ అనేక విషయాల్లో అభిప్రాయభేదా లుండేవి. అనేక విషయాల్లో అభిప్రాయ భేదాలున్నప్పటికీ ఇద్దరు పురుషులు ప్రాణస్నేహితులుగా ఉండవచ్చునని అంతకు ముందెవరైనా చెప్పినట్లయితే, బహుశా నేను ఒప్పుకునే వాణ్ణి కాదేమో. ఆ తరువాత మేమిద్దరం ఒకరిని విడిచి ఒకరం క్షణకాలం కూడా ఉండి ఎరుగం. కపిషాలో ఉన్నన్నాళ్ళూ మే మిద్దరమూ రాజ విహారంలోనేఉన్నాము. విహారానికి ఉత్తర దిశన కల పర్వతాల్లో కొన్ని గుహలున్నాయి. చీనారాజకుమారుడు ఈ గుహల్లోధ్యానించుకుంటూఉండే వాడని చెప్తాము ఇక్కడ ధనాన్ని దాచుటకు యక్షుణ్ణొకణ్ణి కాపలా ఉంచాడుట. ఇది విని బుద్ధిలు డిలా అన్నాడు: "బుద్ధుని యొక్క పరిగ్రహరహితులైన-ధనాన్నీ, సంపదలను స్వీకరింపగూడని-భిక్షువులు ధనంకోసరం ఎలా చస్తున్నారో చూశావా? వీళ్ళకు స్వప్నాల్లోనూ ధనమే కనిపిస్తుంది. ఈ వదంతులు కూడా ధనాన్ని గురించేనా?"

ఇంత కటువుగా విమర్శిస్తున్నందుకు నేను కొంత అభ్యంతరాన్ని చెప్పాను. అప్పుడిలా అన్నాడు: "నేను సింహళం నుండి తుషార దేశం

వరకూ తిరిగాను. ఎక్కడ చూసినా ఇదే కథ! ఇక్కడోరాజు ధనాన్ని దాచి దేవతల్ని కాపలా ఉంచాడంటే, అక్కడో శ్రేష్ఠి నిధిని దాచి రాక్షసుల్ని కాపలా ఉంచారంటారు. ఊర్లూ, స్థలాలు మాత్రమే మార్పు. విషయమంతా ఒకటే!"

బుద్ధిలుడి వయస్సును తెల్సుకొని, అతడి యాత్రల్ని గురించి వింటే ఆశ్చర్యమూ,కుతూహలమూ కలగకమానవు. నా కుతూహలానికి పరితృప్తిని కలిగిస్తూ ఇలా చెప్పాడు:"నా గురువుగారి పేరుధర్మలాభం. వారు నిరంతరమూ యాత్రల్నిచేస్తూనే వుండేవారు. ఎక్కడా ఆరునెల్లకు మించి వుండేవారుకాదు. చదువులో అఖండులు. మహాపండితులు. నా అదృష్టంవల్ల పన్నెండో ఏటనే వారితో తీర్థయాత్రలకు బయలుదేరాను. వారిని నీడలా విడవకుండా అంటిపెట్టుకుని వున్నాను. వారి నిరంతర యాత్రలవలన,నా విద్యాధ్యయనానికి ఏమాత్రమయినా అభ్యంతరం కలిగిందనుకున్నావా? ఎలాటి యాత్రల్లోవున్నా, నా గురువుగారు, నా విద్యాధ్యయనాన్ని గురించి పూర్తి శ్రద్ధ తీసుకుంటూ వుండేవారు.వారు విద్యానిధులు.విద్యా సముద్రులు. వారివద్ద కల సమస్త విద్యలనూ అభ్యసించడం నాశక్తికి మించిన పని! అయితే,వారి కృపాదృష్టివలననే ఈ రెండు ముక్కలనైనా నేర్చుకోగలిగాను!"

బుద్ధిలుడికి తన పాండిత్యాన్ని గురించి అణుమాత్రమైనా గర్వం లేదు. 'ఈరెండు ముక్కలనైనా నేర్చుకోగలిగాను'! అని చెప్పడంలోనే. అతడిలోని వినయం, విద్యా, నిగర్వం తెలిసిపోతాయి. అయితే. అతడన్న రెండు ముక్కల్లోని ఒక్కోముక్కనూ కొన్నిలక్షల శ్లోకాలకు సమంఅనుకుంటే అతడి విద్యను స్వల్పంగానైనా అంచనా వేయగలమేమో! బుద్ధిలుడితో కలిసి జీవితాన్ని గడిపిన కాలం ఏడు సంవత్సరాలు మాత్రమే! జీవితంలో నేను ఎంతోమంది గురువులవద్ద విద్యను అభ్యసించాను. అయినా, బుద్ధిలుడి వద్ద తెలుసుకున్నన్ని విషయాల్ని ఇంకెవ్వరి వద్దా తెల్సుకోలేదు కనుకనే నాకు నిజమైన విద్యాగురువు బుద్ధిలుడే అనుకుంటున్నాను. వొక విధంగా మా మిత్రత్వాన్ని ఇంకాకూడా పటిష్ఠం చేసుకోవడానికి మాత్రమే ఇతరుల వద్దకు వెళ్ళి కొన్ని విషయాలను అభ్యసిస్తూవుండేవాణ్ణి! కానీ, నేను చదవదలుచుకున్న అన్ని విషయాలను

చదివించే నేర్పూ, ఓర్పు బుద్ధిలుడికి ఉన్నాయి. అతడు విపరీతమైన యాత్రాసక్తికలవాడు. నిరంతరం తిరుగుతూండడం అతడికి అలవాటు. అయినా, ఏ విహారంలోనైనా, తను అంతవరకూ చదవని ఉత్తమమైన గ్రంథాల సంగ్రహాన్ని చూశాడా, వాటన్నింటినీ చదివిగాని అక్కడినుండి కదిలేవాడు కాదు. నెలలు గడిచిపోయినా సరే! తన విద్యనుగాని, తన బుద్ధికుశలతనుగానీ ప్రదర్శించి ఇతరులను చకితులను చేయాలనుకునే వాడు కాదు. గొప్ప తార్కికులమని గర్వపడే అనేకుల్ని చిటికలువేసిన మాత్రంగా అతడు ఓడించేయడాన్ని నేను చూశాను. అయితే, ప్రతిద్వంది పట్ల అమిత నమ్రతను, వినయాన్నీ ప్రదర్శించేవాడు. అతడితో వాదనలో ఓడిపోయిన పండితులెవరూకూడా అతడికి శత్రువులు కాలేదు. మిత్రు లయ్యారు.

కపిషాలో ఎక్కడికి వెళ్ళాలనుకున్నా మేమిద్దరమూ కలిసి వెళ్లు తుండేవాళ్ళం! వర్షావాసాన్ని కపిషాలో గడిపేద్దామని నిశ్చయించుకున్నాం. మా వెంట వచ్చిన ఉద్యానపు గృహస్థులు తిరిగివెళ్ళిపోయారు. భిక్షువులు కూడా చాలామంది అటూ ఇటూ చీలిపోయారు. వొక రోజున మేమిద్ద రము రాజకుమారుడి ధ్యానగుహకు పశ్చిమంగా వొక క్రోసు దూరంలో వున్న అవలోకితేశ్వరుడి ప్రతిమను చూడ్డానికి వెళ్ళాము. విగ్రహంచాలా అందంగా వుంది. రాజధానికి ఈశాన్యంగా 5, 6 క్రోసుల దూరంలో రాహుల్ - విహారంవుంది. పేరునిబట్టి ఈ విహారాన్ని బుద్ధుని-సిద్ధార్థుని-, కొడుకు రాహులుడు కట్టించాడు గావున అనుకోవడం సహజం. కానీ, రాహులుడనే అమాత్యుడొకడు కట్టించాడా విహారాన్ని. రాజధానికి 8 క్రోసుల దూరంలో, దక్షిణంగా 'స్ఫీతఫలం' అనే నగరమొకటి వుంది. ఈ ప్రపంచమంతా, భూకంపాల్లాంటి మహాప్రళయాల్లో ధ్వంసమయే ప్పుడు ఈ "స్ఫీతఫలం" వొకటి మాత్రం, ఏ ప్రళయానికీ లొంగకుండా, చెక్కుచెదరకుండా వుంటుందని అక్కడి ప్రజల విశ్వాసం. ఈనగరానికి 5, 6 క్రోసుల దూరంలో దక్షిణంగా వొక పెద్దపర్వతంవుంది. దానిపేరు అరుణ. ఆ పర్వతంలో అలవిమాలిన సొరంగాలున్నాయి. ఆపర్వతాన్ని గురించి ఒక కథ చెప్తారు. అది ప్రతి సంవత్సరం 'శునాసీర' అనే మరో పర్వతాన్ని చూస్తూ కొన్నివందల బారల ఎత్తు పెరుగుతుందిట. మళ్ళీ

వెంటనే తగ్గిపోయి మామూలు స్థితికి వచ్చేస్తుందిట. అక్కడున్న ఒక భిక్షువు ఇలా చెప్పాడు : "ఒకసారి శునాసీర (శునాదేవత)అటుగుండా వెళ్తూ అరుణ పర్వతంమీద కాసేపు విశ్రమిద్దామనుకుంది. కానీ, అరుణ పర్వతంమీది దేవతకు, శునాదేవతకు స్థానమిస్తే తనకే ఎసరు తెస్తుందేమోనని భయం కలిగింది ఇంకేం, శునాదేవత నిలవడానికి వీలు లేకుండా ఆ పర్వతాన్ని ఒకే తీరాన కదిలించివేసింది ఆ దేవత.

"అప్పుడు శునాదేవత ఇలా అంది. "నేనిక్కడ విశ్రమించడానికి వీలులేకుండా చేద్దామనేకదా, పర్వతాన్నిలా కదిలిస్తున్నావు? నీవే గనక నా కేమాత్రమైనా ఆతిథ్యాన్ని ఇచ్చివున్నట్లయితే, నీకు అపారమైన ధనరాసులను ఒసంగేదాన్నికదా; ఇకనేనిప్పుడు చౌకూటదేశంలోని 'శునాశిల' అనే పర్వతంమీదకు వెళ్తాను. అక్కడి రాజూ మంత్రీ ప్రతి సంవత్సరమూ వచ్చి నన్ను పూజించి వెళ్తుంటారు. ఆ సమయంలో నీవూ వచ్చి నన్ను దర్శించుకొని వెళ్తూవుండు.

"కనుకనే అరుణ పర్వతం ప్రతి సంవత్సరం శునాదేవత పూజ సమయానికి దేవతను చూడడానికి శరీరాన్ని పెంచుకుంటుందనీ, అనంతరం మామూలు స్థితికి వస్తుందనీ చెప్తారు.

బుద్ధిలుడు ఇలాంటి కథల్ని చాలా ఇష్టంగా వింటాడు. చూసే వాళ్ళు అతడికీ కథలంటే మహా ఇష్టగావును అనుకోవలసిందే; మధ్య మధ్య కథలో తాను లీనమైపోతున్నట్లు, కథ చెప్పే భిక్షువు స్వరంలో తన స్వరం కలిపేవాడు. నిజానికి ఇలాంటికథలంటే అతడికి అణుమాత్రమైనా విశ్వాసం వుండేదికాదు. ఇలా అనేవాడు: "కొండలున్నాయ్.... అంతే; ఆ కొండల్లో దేవతలూలేరు. వాటికి పెరిగేశక్తీ, తరిగేశక్తి లేదు. సాధారణ ప్రజలకు ఇలాంటి కథలంటే ఇష్టం. కనుకనే, ప్రతివాడు ఇలాంటి కథలను కల్పించేవాడే అయ్యాడు. నిస్వార్థులమని చెప్పుకునే మన భిక్షువులుకూడా, ఈకథల్ని వినిపించి అమాయకులైన గృహస్థులనుండి ధనాన్ని గుంజుతారు." ఈ కథల విషయంలో బుద్ధిలుడు, బౌద్ధ భిక్షువులనూ, పూజారులనూ నిందిస్తుండేవాడు. కపిషా దేశానికి నైఋతీ మూలగా హిమవత్పర్వతాలు కనిపిస్తుంటాయి. ఈ పర్వతాలే

మా ఉద్యాన భూమికి ఉత్తర దిశగా కనిపిస్తుంటాయి. తథాగతుని జన్మ భూమైన కపిలవస్తు నగరానికి ఉత్తర దిశగా కనిపించే హిమవత్పర్వతాలూ ఇవే. కపిషా నగరానికి ఉత్తరంగా ఓ పెద్ద సరోవరం వుంది. ఆ సరోవరంలో వొక నాగరాజు వున్నాట్ట: అతడు కనిష్కుడి కాలంలో చాలా ఉపద్రవము చేశాట్ట; మొదట ఆ సరోవరంలో వున్న నాగరాజు చాలా మంచివాడు. అసలు ఏమయిందంటే, వెనక వొక భిక్షువు వద్ద వొక శ్రమణుడు ఉండేవాడు. అతడు చాలా కోపిష్టి. ఒక రోజున అతడు తను నాగరాజు కావాలను అను కున్నాడు. వెంటనే ఆ జన్మను ముగించి, నాగయోనిలో జన్మించిచాడు అతడు ఈ సరోవరంలోనే జన్మించాడు. అతడి కోపస్వభావం ఈజన్మలోనూ, అతణ్ణనుసరించేవుంది. పాత నాగరాజుకు, ఈ కొత్తనాగరాజుకూ సరిపడింది కాదు. పాత నాగరాజును చంపి తనే ఈ సరోవరానికి రాజయ్యాడు. ఈ నాగరాజు ఎప్పుడూ ఏదో వొక అల్లరిచేస్తూవుండేవాడు. కనిష్కుడి సమయంలోనూ పెద్దగా ఉపద్రవాన్నిచేశాడు. సరోవరంలోని నీరంతా కొండ క్రిందవున్న విహారంలోకి పోయేట్టుచేశాడు. ఆ ప్రవాహ వేగంలో చెట్లూ చేమలూ అన్నీ కొట్టుకుపోయాయి. విహారపు గోడలు కూడా పడిపోయాయి. అప్పుడు కనిష్కుడికి పట్టరాని ఆగ్రహంకలిగింది. అసలా సరోవరాన్ని పూడ్చించేయడానికే. సంసిద్ధుడయ్యాడు. కొన్ని లక్షలమంది కూలీలను నియమించాడు పూడ్చటానికి. అప్పటికి నాగరాజుకు బుర్ర తిరిగింది. వెంటనే ముసలి బ్రాహ్మణుడి వేషం వేసుకుని కనిష్కుడి వద్దకు వచ్చి ఇంక నేనెన్నడూ అలా చేయనని బ్రతిమాలాడు నాగరాజు. కనిష్కుడు నాగరాజుచేత ప్రతిజ్ఞ చేయించాడు. తరువాత విహారాన్ని తిరిగి కట్టించి వొక పెద్ద స్తూపాన్నికూడా తయారు చేయించాడు. విహారంలోని భిక్షువులకు ఇలా చెప్పాడు: "ఒక మనిషి ఎప్పుడూ సరోవరం వైపు చూస్తూ వుండండి. సరోవరం మీదుగా నల్లని మేఘాలు లేవడం కనబడిందా వెంటనేవిహారంలో ఘంటమ్రోగించండి." ఈనాటికీ సరోవరంమీదుగా నల్లని మేఘాలు వస్తూ కనిపించాయా వెంటనే విహారంలో గంటమ్రోగిస్తారు. ఆ గంటారావాన్ని విని నాగరాజు తను కనిష్కుడి వద్ద చేసిన ప్రతిజ్ఞను జ్ఞప్తికితెచ్చుకుంటాడు. మేఘాలను వెనక్కిపిలుచుకుంటాడు.

రాజధానికి పశ్చిమోత్తరంగా వొకనది వుంది. ఆ నదియొక్క దక్షిణపుటొడ్డున వొక ప్రాచీన రాజవిహారం వుంది. వొక రోజున ఆ విహారాన్ని చూడటానికి వెళ్ళాము. అందులో బుద్ధుని పసితపు దంతము భద్రపరచబడివుంది, ఆవిహారానికి ఈశాన్య దిశగా మరో ప్రాచీన విహారమువుంది.అందులో బుద్ధునిమెదడు ఎముక,తలవెంట్రుకలూ భద్రపరచబడివున్నాయి. వెంట్రుకల్లో ఒకటి, రెండంగుళాల పొడవు వుంది. వంగ పండురంగులోవుంది.అక్కడికి వాయువ్య దిశగా రాణీ విహారమని మరో విహారముంది. రాణి విహారపు శిఖరం అరవై బారల పొడవుంటుంది. ఆ శిఖరానికి రాగిరేకు తాపడంచేసి పైన బంగారు నీరు పోశారు. అందులోనూ బుద్ధుని అస్థిధాతువు లున్నాయంటారు. బుద్దిలుడు ఎక్కడికి వెళ్ళాలన్నా నాకంటే ముందే ఉత్సాహంగా బయలు దేరేవాడు. పైగా ఇలా అనేవాడు:"బుద్ధుడు నిర్వాణాన్ని పొంది వేయి సంవత్సరాలే గడిచాయి. మరో వెయ్యో,వెయ్యిన్నర సంవత్సరాలో గడిస్తే,ఇక చూచుకో; ప్రపంచంలోవున్న స్తూపాలన్నింటిలో ఎన్ని అస్థిదాతువులూ, ఎన్ని కేశాలూ పుట్టుకొస్తాయో ; వాటన్నింటినీ ప్రోగుచేసి పెట్టడానికి మధ్య దేశంకూడా చాలదేమో !"

రాజధానికి వాయువ్యమూలగా పీలుసార్ పర్వతం వుంది. పర్వతాలు ఏనుగుల్లాంటివో (పీలు) మరి ఇతర రకాలైన ఆకారాల్లో ఏర్పడి వుంటాయి. ప్రజలుఆ ఆకారాల ననుసరించి పర్వతాల కవే పేర్లు పెట్టేస్తారు. ఈ పర్వతపు దేవత ఏనుగు ఆకారంలో వుంది. ఒకసారి ఈ పీలూదేవత బుద్ధుణ్ణి తన పర్వతానికి రమ్మని అహ్వానించింది : బుద్ధుడు తన పన్నెండు వందలమంది భిక్షువుల్తోటీ ఈ పర్వతం వద్దకు వచ్చాడు. పీలూదేవత బుద్ధుడికి ఘనంగా స్వాగతాన్నిచ్చింది. పర్వతంమీది వొక శిలాఫలకంపై, బుద్ధుణ్ణి, అతడి శిష్యుల్ని ఆశీనుల్నిచేసి ఆతిథ్యాన్నిచ్చిందిట దేవత: బుద్ధుడు ఆతిథ్యాన్ని పొందిన ఆ శిలాఫలకం మీదనే ఆ తరువాత అశోక మహారాజు 60 బారల ఎత్తుగల స్తూపానొకదాన్ని నిర్మించాడు. ఈ స్తూపంలోనూ, బుద్ధ దాతువుం దంటారు. ఈ స్తూపానికి కొద్ది దూరంలో ఉత్తరంగా నాగ నిర్ఝరముంది. ఈ నిర్ఝరములోనే, బుద్ధుడు తన పన్నెండు వందల మంది శిష్యులతోనూ,

కలిసి ముఖం కడుక్కున్నాడని, అనంతరం దేవతయొక్క ఆతిథ్యాన్ని స్వీకరించాడనీ చెప్తారు. పండ్లు తోముకున్న పుల్లలను అక్కడే పారవేశారు. అవే పెద్ద వృక్షాలయ్యాయి. ఆ వృక్షాలే చుట్టు పట్లవున్న మహారణ్యంగా మారాయిట!

వర్షాకాలం అంత్యాని కొచ్చింది. మహా ప్రవారణోత్సవానికి, ఒక్క రాజధానిలోనేగాక-కపిషాదేశం మొత్తంలోనే గొప్పగా ఏర్పాట్లు జరిగాయి. భిక్షువులకు దానధర్మాలు కూడా ఘనంగానే ముట్టాయి.

వివిధ ప్రదేశాలనుండి భక్తులు నృత్యం చేసుకుంటూ, పాటలు పాడుకుంటూ వచ్చి రాజవిహారంలో ప్రోగుపడ్డారు. మధ్యాహ్న సమయానికి రక రకాల రుచికరమైన పదార్థాలతో భిక్షువులకు తృప్తికరంగా భోజనం పెట్టారు. అది పంటలు పండి, ధాన్యాలు ఇండ్లకు వచ్చే సమయం. ద్రాక్ష, అంజీర మొదలైన ఫలాలుకూడా అప్పుడే పండుతాయి. మధురమైన ద్రాక్షగుత్తులు విహార మంతట్లోను నిండుతున్నాయి. ఇక్కడ గ్రామాల్లోనూ, పట్టణాల్లోను ద్రాక్షగుత్తులను ఇండ్ల గోడలకు తగిలించి వుంచుతారు, ఎండకు ఎండటానికి! కపిషా దేశపు ఎండు ద్రాక్షలు సుదూర దేశాల్లోకూడా బాగా అమ్ముడుపోతుంటాయి. ఎండని ద్రాక్షల్ని దూరదేశాలకు పంపించే అవకాశంలేదు. వుంటే అవీ బాగా అమ్ముడు పోయేవే!

ప్రవారణోత్సవం అవగానే, అక్కడనుండి బయల్దేరి గాంధార దేశంమీదుగా కాశ్మీరం వెళదామని నిశ్చయించుకున్నాము.

*　　　*　　　*

బుద్ధియిడి మిత్రత్వం నాకు మహోపకారాన్ని చేసింది. పర్వత ప్రదేశాల్లో నివసించే మేము నిజంగానే 'కూపస్థమండూకం'లాంటివాళ్ళం. ఎండలకు జడిసి, మా పర్వతాల్ని విడిచి, క్రింది మైదానాలకు ఎన్నడూ రాము. ఈ మహా ప్రపంచంలో, కొండలేకాక సమతల ప్రదేశాలుకూడా వున్నాయనీ, అక్కడా మానవులు నివసిస్తుంటారనీ తెలియని స్త్రీ-పురుషు లెంతోమంది మా దేశంలో వున్నారు. సుదూర దేశాలకు యాత్ర చేయాలన్న ఉత్సాహము, వివిధ దేశాల్ని చూడాలని కోరిక నాకు ఉన్నాయి. అయితే. చిన్నతనం నుండి వింటూన్న విషయాలూ, వాటి తాలూకు

భయము నా హృదయంలో గూడు కట్టుకున్నాయి. నాలో సంకోచాన్ని, సంశయాన్ని కలిగిస్తూ నా కాళ్ళకు బంధాల్ని ఏర్పరిచాయి. నిజంగా నిప్పులు చెరిగే వేడి గాల్పుల్లో వుండాల్సి వస్తుందా? పాములూ, తేళ్ళు, మొదలైన విష పురుగుల్లో నుండి వెళ్ళాల్సి వస్తుందా? చావంటే నాకేమీ భయంలేదు. కానీ, కొద్దికొద్దిగా. క్షణక్షణమూ చావడం నాకిష్టంలేదు. పైగా ఏదోవిధంగా సమాప్తం చేసుకోడానికి, జీవితం అంత అల్పమైందని గానీ, తుచ్ఛమైందనిగానీ నేననుకోవడంలేదు. బుద్ధిలుడు ఉజ్జయినీ నివాసి. మధ్యదేశాన్ని - ఉత్తరప్రదేశ్, బీహార్ గురించి బుద్ధిలుడుకంటే తెలిసినవాళ్ళూ, చెప్పగలవాళ్ళూ, ఎవరుంటారు? తన గురువుగారివెంట వుండి మధ్యదేశంలోని ప్రతి పట్టాణానికి వెళ్ళాడు. ప్రతి విహారాన్ని, చూశాడు బుద్ధిలుడు. మొదట నా యాత్ర అంధకారంలో తవుళ్ళాటలా గుంది. ఇప్పుడు బుద్ధిలుడు పరిచయమయ్యాక పగటి ప్రకాశవంతమైన, స్వచ్ఛకాంతిలో ప్రయాణం చేస్తున్నంత హాయిగా వుంది నా యాత్ర. మేము కపిషానుండి, ప్రక్క దేశమైన గాంధారం వెళ్ళాలని నిశ్చయించుకున్నాము. వర్షావాసపు మూడు నెల్లూ మా భవిష్యత్ యాత్రలకు సంబంధించిన ఆలోచనల్తోనే గడిపాము. ఇనాళ్ళల్లోనూ ఒకరి స్వభావం ఒకరికి బాగా పరిచయమైంది. శాశ్వతమైన మిత్రత్వపుబంధంలో బంధింపబడిపోయాము. బుద్ధిలుడు అనేక విషయాలలో ప్రగాఢమైన పాండిత్యం కలవాడని మొదటే చెప్పాను. అతడిముందు నన్ను నేను చాలా అల్పుడిగా, తుచ్ఛుడిగా భావిస్తుండేవాణ్ణి! అయితే, తన పాండిత్యాన్ని ప్రదర్శించి, నాలో ఇలాటి తక్కువతనపు భావాన్ని కలిగించడానికి అతడెన్నడూ ప్రయత్నించలేదు.

కపిషానుండి వెనక్కు తిరిగి మళ్ళీ నగరహారాని కొచ్చాము. అక్కడినుండి తూర్పుకు మళ్ళాము. దాదాపు ఇరవై యోజనాల దూరం పర్వతాలమీద ప్రయాణం చేశాము. అనంతరం గాంధార దేశపు భూమిలో ప్రవేశించాము. గంధార దేశపు రాజధాని పురుషపురం (పెషావర్) ఉద్యాన వాసులకు క్రొత్తదీ, అపరిచితమైందీ కాదు. వజ్రాసనం (బుద్ధగయ) జైతవనంలాంటి తీర్థ ప్రదేశాలు మాకు చాలాదూరంలో వున్నాయి. కనుక అలాంటి తీర్థాలను సేవించడం అందరివలన కాదు.

కానీ, పురుషపురం మాకు అత్యంత సమీపంలో వున్న అతి పునీతమైన తీర్థస్థానం. సాధ్యమైనంతవరకు ప్రతి ఉద్యానవాసి పురుషపురాన్ని దర్శించటానికి ప్రయత్నిస్తూంటాడు. పురుషపురం ఇప్పుడు చాలా చిన్నగా మాత్రం వుంది. కానీ ఒకప్పుడా పట్టణంలో శతసహస్ర పరివారాలు వుండేవట! దూరాల వరకూ వ్యాపించివున్న శిథిలాలు, మొండిగోడలూ, పాటిదిబ్బలూ ఆ నగరపు పూర్వ ఔన్నత్యాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. ఈ శిథిల పురుషపురమే ఒకనాటి కనిష్కుడి రాజధాని! బౌద్ధమతాన్ని ఆదరించి, అభివృద్ధికి తెచ్చిన మహారాజుల్లో అశోకుడి తరువాత కనిష్కుణ్ణే చెప్పుకోవాలి. ఇతడు కట్టించిన విహారాలూ, చైత్యాలూ ఇప్పటికీ వున్నాయి. పురుషపురం సమతల ప్రదేశంలో వుంది. చుట్టూ దూరంగా పర్వతాలు కనిపిస్తుంటాయి. మేమొక పర్వత కనుమను దాటి ఈ పురుషపురంలోకి ప్రవేశించాము. కనుమ పొడుగునా అక్కడక్కడా సైనిక శిబిరాలనూ, దుర్గాలనూ చూశాము. ఈ ఇరుకైన పర్వత కనుమలు శత్రువుల్ని ఆపడానికి చక్కగా వుపకరిస్తాయి. అయితే. ఇరుకు కనుమల వలన! బలమైన దుర్గాలవలన ఏ దేశమైనా తనను తాను రక్షించుకోగలదా? అన్నదే సమస్య. పురుషపురానికి చుట్టుపట్ల వున్న భూమి చాలా సారవంతమైనది. పూండ్లూ, పూవులూ సమృద్ధిగా లభిస్తాయి, బెల్లపు చెరకు సమృద్ధిగా పండుతుంది, చక్కెరకు పురుషపురం ప్రత్యేక ప్రసిద్ధి పొందింది.

మా ఉద్యానవాసులకు పురుషపురమంటె ప్రత్యేకమైన శ్రద్ధాభక్తులుంటాయి, ఈ పురుషపురంలోనే అనేకమంది మహాపండితులూ, మహాపురుషులూ జన్మించారు. ఆర్య అసంగ్ ఈ పురుషపురంలోనే పుట్టారు. వారి సోదరుడైన ఆచార్య వసుబంధు బాల్యం ఈనగరంలోనే గడిచింది. ధర్మదాత, మనోరథ, పార్శ్వ-మొదలైన మహాధార్మికులను, ధర్మనాయకులనూ కన్న గౌరవం ఈ నగరానికే దక్కింది. బుద్ధిలుడు గుడ్డిగా ఎవరిపట్లా శ్రద్ధను వ్యక్తపరచడు. అయినప్పటికీ, ఇలాటి ప్రాచీన స్థానాలనూ, విహారాలనూ చూడడానికి తప్పనిసరిగా వెళ్తూవుంటాడు. తన హృదయంలోని భక్తినీ వ్యక్తపరుస్తాడు. అయితే మహాపురుషుల జన్మస్థానాలనూ, వారి పితృ గృహాలనూ చూడ్డానికి వెళ్ళేప్పుడు, అతడి

హృదయంలోని శ్రద్ధాసక్తులు పరిపూర్ణత కొస్తాయి. దిఙ్నాగుడు, అతడి గురువైన వసుబంధు అంటే బుద్ధిలుడికి ఎంత గౌరవమో, ఎంత అభిమానమో చెప్పలేను.దిఙ్నాగుడి ప్రమాణ శాస్త్రాన్ని అధ్యయనం చేసేప్పుడు బుద్ధిలుడిలో వారిమీద శ్రద్ధ జనించింది. అసంగ్. వసుబంధు, విరచి-వీరు ముగ్గురు సహోదరులు. ఈ మహాపండితులు పన్మించిన గృహాన్ని చూడానికి వెళ్ళాము, గృహం పూర్తిగా శిథిలమైపోయివుంది. దగ్గరిలో ఉన్న బ్రాహ్మణ పరివారాలు కొన్ని పై ముగ్గురు అచార్యులూ తమ కుటుంబంలోనే జన్మించారనీ గర్వంగా చెప్పుకున్నారు, గృహాల్లాగనే కొన్ని విహారాలూ, చైత్యాలు కూడా శిథిలమైనాయి. వాటిలో ఉండే భిక్షువుల సంఖ్య తగ్గిపోయింది. శిథిలాలను ఉద్ధరించడానికి విహారాల ఆర్థిక ఆదాయం బాగా ఉండాలి! అక్కడి విహారాల ఆదాయాలు కూడా నశించాయి. కనుక పవిత్ర ప్రదేశాల జీర్ణోద్ధరణ అసంభవమే అవుతున్నది! కనిష్కుడి సమయంలో ఈ విహారాలు ఎంత ఉచ్ఛస్థితిలో ఉండేవో!!

రాజధానికి ఒకటిన్నర క్రోసుదూరంలో ఈశాన్యంగా ఒక బోధి-రావి-వృక్షం ఉంది. ఆ వృక్షం పొడవు అరవై బార లుంటుంది. బాగా విశాలంగా ఉండి. పచ్చని ఆకుల్తో దట్టమైన నీడతో కళకళ్ళాడుతూన్న ఆ రావిచెట్టును చూస్తే, ఈ వృక్షం రాజధానితోపాటు దుర్దశపాలు కాకుండా బ్రతికి బయటపడ్డ దనిపించింది. కానీ ఆ బోధివృక్షం క్రింద వున్న బుద్ధ విగ్రహాల సంగతివేరు. అవీ కొంతవరకూ నగరపు దుర్దశను పంచుకున్నాయి. వృక్షానికి నాలుగువైపులా, ధ్యానమగ్నాకృతిలో వున్న నాలుగు బుద్ధ ప్రతిమ లున్నాయి. ఈ వృక్షం బుద్ధుడికి శీతలచ్ఛాయ నొసగిందని చెప్తారు. ఈ వృక్షం క్రిందనే దక్షిణాభిముఖుడై కూర్చుని బుద్ధుడు ఆనందంతో ఇలా అన్నారుట: "నా నిర్వాణానంతరం, నాలుగు వందల సంవత్సరాలకు కనిష్కుడు రాజవుతాడు. ఇక్కడికి దక్షిణంగా కొద్ది దూరంలో, నా అస్థి-ధాతువులతో ఒక స్థూపాన్ని నిర్మిస్తాడు." అని చెప్పాడుట.

బుద్ధిలుడు ఇదంతా అసత్యం అన్నాడు.బుద్ధుడు మధ్యదేశాన్నిదాటి ఇక్కడి కసలు రానేలేదు. ఆకాశంనుండి వూడిపడ్డాడేమో, మరి నాకు

తెలియదు అన్నాడు. వృక్షానికి దక్షిణంగా కనిష్కుడు నిర్మించిన గొప్ప స్తూపం వుంది. కనిష్కుడు మొత్తం జంబూద్వీపానికంతటికీ చక్రవర్తి. ఆతడు శక వంశీయుడు. శకవంశం కొత్తగా భారతదేశానికి వచ్చింది. శకులు బల, పరాక్రమాల్లో ఎంతటి గొప్పవారయినా, చదువు సంధ్యల్లో అప్పటి జంబూద్వీప వాసులకు సాటిరారు. కనిష్కుడి పాషాణ ప్రతిమల నెన్నింటినో చూశాను. నా చిన్నతంలో ఉద్యానం లోను, ఇతర అనేక ప్రదేశాల్లోనూ శకులు వుంటూ వుండేవారు. కానీ ఇప్పుడు శకులు అన్య జంబూద్వీప వాసుల్లో ఒక్కరై పోయారు. బుద్ధిలుడు స్వయంగా ఉజ్జయినీ శక వంశీకుడు. ఇలా అనేవాడు : "మా శరీర వర్ణం, ఇతర బ్రాహ్మణ-క్షత్రియులకంటె, ఎక్కువ ఎర్రగా వుంటుంది. అంతకుమించి మాకూ వారికీ ఎలాటి వ్యత్యాసమూ లేదు. మా సామంత వంశాలన్నీ పూర్తి క్షత్రియ వంశాలే అయ్యాయి. కనిష్కుడి విగ్రహాలకు మోకాళ్ళ వరకూ వుండే పాదరక్ష లున్నాయి, అలాటి పాదరక్షలను 'సీతా' నదీతీరంలోనూ, అటు తరువాత త్యోర్కు, అదార మొదలైన తిరుగుబోతు జాతుల్లోనూ చూశాను. కనిష్కుడి శిరస్త్రాణం, దుస్తులు కూడా పై దేశాలకు, జాతులకు సంబంధించినవే!"

కనిష్కుడు మొదట బౌద్ధమతానికి వ్యతిరేకి. ఒకసారి అతడు ఈ అడవిలోకి వేటాడను వచ్చాడు. ఒక కుందేలును వెంబడించాడు. కొంత దూరం వెళ్ళాక కుందేలు మాయమైంది. అడవిలో పొదల మాటున ఒక కుర్రవాడు రెండు బారల పొడుగల స్తూపాన్నొకదాన్ని పెట్టు కూర్చున్నాడు. రాజు స్తూపాన్ని గురించి కుర్రవాణ్ణడిగాడు. అప్పుడు కుర్రవాడు బుద్ధుడు ఆనందుడితో అన్న మాటల్ని చెప్పి, ఆ మహారాజువు నీవే నన్నాడుట.

నేను కనిష్కుడిచే నిర్మింపబడిన మహాస్తూపానికి ప్రదక్షిణం చేస్తూ పై కథను విన్నాను. పశుల కాపరి అయిన ఆ పసిబాలుడి రెండు బారల స్తూపమే కొన్ని వందలబారల ఎత్తు గల అనేక అంతస్తుల మహాస్తూపమై అద్భుతమైన చిత్రకళతో విరాజిల్లుతోంది. పశులకాపరియొక్క రెండు బారల స్తూపానికి చుట్టూ తనో నూతన స్తూపాన్ని నిర్మించి దాన్ని మరుగు పరచాలని చూశాడుట కనిష్కుడు. కానీ, కనిష్కుడు తన

స్తూపాన్ని ఎంత పెంచినా, పశులకాపరి స్తూపం ఇంకా రెండుబారలు పైకి పెరుగుతోనే ఉంది. చివరకు కనిష్కుడు తన స్తూపాన్ని పెంచడం ఆపేశాడు. కనిష్కుని స్తూపం ఐదువందల బారల వి స్తీర్ణంలో, రెండువందల యాభై బారల ఎత్తులో, నాలుగు అంతస్తుల్లో-ఆగిపోయింది. అప్పటికీ ఈ స్తూపంపైన ఈశాన్యంగా మరో చిన్న స్తూపం కనుపిస్తూనే వుంది. అప్పుడిక కనిష్కుడికి పట్టరానిఆగ్రహం కలిగింది.కుర్రవాడి స్తూపాన్ని కప్పేయా లన్న అభిప్రాయాన్ని మార్చుకుని విడిగా తనో క్రొత్త స్తూపాన్ని నిర్మించాడు* ఈ క్రొత్త స్తూపంపైన బంగారునీరు తీసిన రాగి ఛత్రాలను 15 నింటిని అమర్చాడు. స్తూపంలో బుద్ధుని పవిత్ర ధాతువుల్ని కూడా ఉంచాడు. ఈ మహాస్తూపానికి తూర్పున రాతి మెట్లు వున్నాయి. ఈ మెట్లకు దక్షిణంగా మూడు బారల పొడవుగల రెండు రాతి స్తూపాలున్నాయి. ఇవి మహాస్తూపానికి నమూనాలు. ఇక్కడే బోధిసత్వుడి ప్రతిమలు రెండున్నాయి. రెండు ప్రతిమలూ బోధి వృక్షంక్రింద వజ్రాసనాన్ని వేసుకుర్చున్న ముద్రలో వున్నాయి. ఒక ప్రతిమ మూడుబారల పొడ వుంది. మరోటి నాలుగు బారల పొడ వుంది. మహా స్తూపానికి దక్షిణంగా పదిబారల ఎత్తు కల బోధిసత్వుడి ప్రతిమ మరోటుంది. ఇది కాక మరో నూరు వరకూ చిన్న చిన్న ప్రతిమలు చుట్టుపట్ల పడి వున్నాయి. ఈ మహాస్తూపానికి సంబంధించిన విషయాలను చిత్ర విచిత్రాలుగా, కథలూ, గాథలుగా చెప్పుకుంటారు. అర్ధరాత్రి సమయానికి గంధర్వులు సుస్వరాలతో ఈ స్తూపాన్ని స్తుతిస్తుంటారనీ, వారి స్తుతి గీతాలను స్పష్టంగా వినవచ్చుననీ చెప్తుంటారు. దేవతలు మహాస్తూపానికి ప్రదక్షిణలు చేస్తూ కనుపిస్తారని కూడా చెప్పుకుంటారు. ఈ మహాస్తూపం ఏడుమాట్లు కాలిపోతుందనీ, ఏడవమాటు కాలడంతో బాటు బౌద్ధమతం ప్రపంచాన్నుండి శాశ్వతంగా సెలవు పుచ్చుకుంటుందని ఒక వదంతి। ఈ విషయాన్ని గురించే బుద్ధిలు డిలా అన్నాడు: "ఈ లెక్క ప్రకారం చూస్తే, ఇంకో మూడు నాలుగు వందల సంవత్సరాలు మాత్రమే బౌద్ధమతం ఈ ప్రపంచంలో మనగలుగుతుం దనిపిస్తుంది.

---

* కనిష్క చైత్యం. ఇప్పటి 'హజార్ ఖత్రి కార్వీ సరాయ్' వద్ద ఉండేది.

ఐతే నేను ఇంకో విషయం చెప్తున్నాను. మూడు నాలుగు వందల సంవత్సరాల తరువాత నాశనమయ్యేది మూర్ఖులూ, స్వార్థపరులు సృష్టించిన ఈ నకిలీ బౌద్ధమతమే. బుద్ధునియొక్క మూలసూత్రాలకు ఎన్నటికీ చలన ముండదు. తథాగతుడు మానవులకు అనాత్మవాదాన్ని - ఆత్మ లేదనే వాదం - ప్రతిత్య సముత్పాద వాదాన్ని (కార్యకారణ సంబంధాన్ని తెల్పే వాదం), సర్వానిత్య వాదాన్ని (పరిణామ వాదాన్ని) ప్రసాదించాడు. పై వాదాలయొక్క దృష్టికోణం మానవుల్లోనుండి ఎన్నటికీ నశించదు."

మహా స్తూపానికి పశ్చిమంగా కనిష్కుడు విహారా న్నొకదాన్ని కట్టించాడు. అనేక అంతస్థుల్ని కలిగిన ఆ విహారం ఇప్పుడు పూర్తి భగ్నావస్థలో ఉంది. ఆ భగ్న విహారంలోనే ఇప్పటికీ ఎంతోమంది హీనయానపు భిక్షువు లుంటున్నారు. ఈ మహా విహారాన్ని కట్టించేప్పుడు కనిష్కుడు తనగురువైన భదంత పార్శ్వభిక్షువుకు మూడవఅంతసులో నివాసాన్ని ఏర్పరిచాడట. ఇప్పుడా పార్శ్వభిక్షువుయొక్క నివాసం పూర్తిగా పడిపోయింది. శిథిలమైన పార్శ్వభిక్షువుయొక్క నివాసానికి తూర్పుగా పురాతన గృహం ఒకటుంది. ఆచార్య వసుబంధు ఆ ఇంట్లోనే "అభిధర్మకోశా"న్ని రచించాడు. ఈ ఇంటిగోడల మీద కొన్ని ప్రత్యేకమైన గుర్తు లున్నాయి. ఆ గుర్తుల ద్వారా ప్రజలు బుద్ధుని ఉపదేశాలకు శుద్ధమైన సంక్షిప్తరూపంఅనదగిన 'అభిధర్మకోశ'పు సృష్టి ఆ యింట్లోనే జరిగిందని తెల్సుకుంటారు. వసుబంధు గృహానికి యాభై అడుగుల దూరంలో మరో రెండంతస్థుల భవనంవుంది. ఆ భవనంలో మనోరథుడుండేవాడు. మనోరథుడు తన గ్రంథా లన్నింటినీ ఆ భవనంలోనే రచించాడు. మనోరథుడు ఆచార్య వసుబంధుకు గురువు. గుప్తరాజులు మనోరథుడిపట్ల భక్తిభావాన్ని ప్రదర్శిస్తుండేవారు. కనుకనే మనోరథుడి శిష్యుడైన వసుబంధుకు గుప్తుల రాజధానిలో గొప్ప గౌరవ ప్రతిష్ఠలు లభించాయి. కనిష్క విహారంలో బుద్ధుని భిక్షాపాత్ర ఉండేది. మిహిరకులుడు రాజయ్యాక బౌద్ధమతంమీద ధ్వజ మెత్తాడు.ఎన్నో బౌద్ధ విహారాలను ధ్వంసం చేశాడు. కనిష్క విహారంలోని బుద్ధుని భిక్షాపాత్రను ముక్కలగొట్టించేశాడు. అయితే భక్తులు భిన్నపాత్రను తిరిగి అతికించు

కున్నారు. మిహిరకులుడు మళ్ళీ ఆ పాత్రకు ఏదైనా అపచారం చేస్తాడేమో నన్న భయంతో దాన్ని బాహ్లిక- బలఖ్-దేశానికి పంపించివేశారు.

కనిష్కుడు విశాలమైన ఈ మహా స్తూప చైత్య - నిర్మాణంలో అందమైన, శిల్పకళా సమన్వితమైన కాష్ఠ ఫలకాలను ప్రచురంగా ఉపయోగించాడు. స్తూపం పైకి ఎక్కడానికి మెట్లున్నాయి. మెట్లపైన చెక్కకూర్పు తీసిన కప్పు వుంది. ఈ చైత్యం–స్తూపం–పదమూడు అంతస్థుల్లో ఉంది. దీని ఇనుప స్తంభం 56 బారల పొడవుంది. ఇనుప స్తంభానికి వృత్తాకారపు బంగారు ఛత్రాలు 15 వున్నాయి. ఇనుప స్తంభంతో కూడా మొత్తం స్తూపం యొక్క ఎత్తు 500 బారలు. మూడుమార్లు స్తూపంమీద పిడుగు పడ్డది. ఐతే శిథిలమైన ప్రదేశాన్ని వెంటనే సంస్కరించడం జరిగింది. 15 బంగారు ఛత్రాలకు చుట్టూ చిన్ని చిన్ని ఘంట లున్నాయి. ఈ ఘంటలు ప్రాతఃకాలంలో మంద పవనపు మృదు వీచికకు కదులుతూ ప్రకృతిలో మధుర ధ్వనుల్ని కవ్విస్తుంటాయి.

మహా స్తూపానికి దక్షిణంగా 50 అడుగుల్లో 18 బారల ఎత్తుగల సుందరమైన పాషాణ చైత్యం ఒకటుంది.

* పుష్కలావతి :- కనిష్కుని మహా స్తూపానికి రెండు యోజనాల దూరంలో 'కుంభా' నదికి ఆవలి వైపున ఈ పట్టణ ముంది. ఈ పట్టణం పురుషపురం కంటెకూడా పురాతన మైంది. గాంధార దేశంలోని అనేక ప్రసిద్ధ నగరాలకు వలెనే ఈ నగరమూ శిథిలావస్థలో, దయనీయ స్థితిలో వుంది. పశ్చిమ నగర ద్వారానికి వెలుపల ఓ పెద్ద శివాలయం ఉంది. అందులో శివుని ముఖముద్ర కల లింగం ప్రతిష్ఠించబడి వుంది. పట్టణానికి తూర్పువైపున అశోకుడు కట్టించిన 'ధర్మరాజక' చైత్యం వుంది. ఈ చైత్యంలోనే వసుమిత్రుడు "అభిధర్మ ప్రకరణ వాదా"న్ని రచించాడు. పట్టణానికి ఒక క్రోసు దూరంలో శిథిలావస్థలో ఉన్న

---

* ఇప్పటి హస్తనగరం - అష్టనగరం - పెషావరుకు ఉత్తరంగా 18 మైళ్ళ దూరంలో స్వాత్ - పంచకోశ్ నదులు కలిసి పోతాయి. ఈ రెండు నదుల యొక్క మిశ్రిత ప్రవాహాన్ని లండీనది అంటారు. లండీనది కాబుల్ నదులయొక్క సంగమ స్థానంలో ఈ పట్టణం వుంది.

బౌద్ధ విహారం ఒకటుంది. అందులో కొంతమంది హీనయాన భిక్షువు లున్నారు. ఈ శిథిల విహారంలోనే ఆచార్య ధర్మత్రాత్ తన అభి ధర్మా నికి సంబంధించిన గ్రంథాల్ని రచించాడు. దీని ప్రక్కనే 60 బారల ఎత్తుగల అశోక స్తూపం వుంది. ఈ స్థూపంలో చెక్కినవీ, రాతివీ అతి సుందరమైన ప్రతిమలు ఎన్నో వున్నాయి. రాళ్ళపైన చెక్కిన పూవులూ, లతలూ అత్యంత మనోహరంగా వున్నాయి. బుద్ధ భగవానుడు ఇక్కడే వేయిమార్లు రాజకుమారుడిగా జన్మించి, వేయిమార్లూ తన కండ్లను అన్యు లకు దానం ఇచ్చేశాడుట ! ఇంకా కూడా తథాగతుని జీవితానికి సంబం ధించిన అనేకమైన చారిత్రక స్థలాలు ఇక్కడ ఉన్నాయంటారు. కొంచెం ముందుకుపోతే పాషాణ స్తూపమొక టుంది. ఈ పాషాణ స్తూపానికి ఆరు క్రోసుల దూరంలో వాయవ్య మూలగా మరో స్తూపం వుంది ఇక్కడే బుద్ధభగవానుడు హారీతి – దొంగ – అనబడే యక్షిణిని ఓడించి వశ పరుచుకున్నాడు. ఇప్పటికీ అక్కడి ప్రజలు హారీతిని పూజిస్తూంటారు. హారీతి అసలు మగధ దేశపు రాజధాని నగరానికి యక్షిణి. తరువాత గాంధార దేశపు యక్షుణ్ని వివాహమాడి గాంధార దేశానికి వచ్చేసింది. మొదట ఈ యక్షిణి పేరు 'నందా'ట ! గాంధార దేశానికి వచ్చాక పసి పిల్లలను దొంగిలించుకుని తీసుకుపోయి తినడం ప్రారంభించింది. కను కనే ప్రజలు 'నందా' పేరును మార్చి, హారీతి (దొంగ) అని పేరు పెట్టారు. ఒకమాటు బుద్ధుడికి హారీతి పసిపిల్లల్ని తింటుందని తెలిసింది. తన భిక్షాపాత్రలో స్వయంగా హారీతి సంతాన్నానే వుంచి, హారీతి ముందు పెట్టాడు. సహజంగా భిక్షాపాత్రలోని శిశువును తినడానికి చేయి చాపింది హారీతి ! తీరాచూస్తే, ఆ శిశువు తన శిశువే ! ఇంకెలా తిన గలదు ? అప్పుడు బుద్ధుడు "నీ శిశువు మీద నీకెంత ప్రేమఉందో, ఇతర శిశువుల తల్లుల కూడా తమ బిడ్డలమీద అంతప్రేమ ఉంటుం" దని చెప్పాడు. ఆ క్షణానే హారీతి ఇక ఎన్నటికీ పిల్లలను తిననని ప్రతిజ్ఞ చేసింది. అప్పటినుండి పిల్లలను భక్షించే హారీతి రక్షించేదిగా మారిపోయింది.

జాతక కథల్లోని అనేక స్థలాలను గాంధార దేశంలో చూడగలం : "కనిష్కుడికి ముందుకూడా, అతి పురాతన కాలంనుండి గాంధార

దేశం బౌద్ధ మతానికి బలమైన కేంద్రంగా వుంది. కనుకనే జాతక కథల్లోని అనేక స్థలాలను గాంధార దేశంలో చూపడానికి ప్రయత్నాలు జరిగాయి" అంటాడు బుద్ధిలుడు. హారీతి చైత్యానికి రెండు యోజనాల దూరంలో బుద్ధుడు బౌద్ధ శమణుడై, తలిదండ్రులకు సేవచేస్తూ, మృగ మనే భ్రమలో, స్థానిక మహారాజు బాణానికి ఎర అయి ప్రాణా లర్పించిన ప్రదేశంవుంది. దశరథుడుకూడా ఇలాగే అంధులయిన తలిదండ్రులను సేవించుకుంటూన్న శ్రవణ కుమారుణ్ణి వధించాడు. అయితే, ఆ శ్రవణ కుమారుడు చనిపోవడంతో కథ సమాప్త మౌతుంది. కానీ, ఈ శ్రమణుడు ఇంద్రుడి కృపవలన తిరిగి సజీవుడౌతాడు. *

శ్యామ స్తూపానికి ఎనిమిది యోజనాల దూరంలో ఆగ్నేయ మూలగా 'ఉరసా' అనే చిన్న పట్టణం వుంది. పట్టణానికి ఉత్తరంగా ఒక స్తూపం వుంది. ఇక్కడే తథాగతుడు సుదాన్ వైశ్వంతర రాజకుమారుడిగా జన్మించాడు. ఈ స్తూపాన్ని ఆనుకునే వున్న విహారంలో చాలా మంది హీనయానపు భిక్షువులుంటున్నారు. ఈశ్వరాచార్యుడు ఈ విహారంలోనే తన శాస్త్రాలన్నింటినీ రచించాడు. నగరపు దక్షిణ ద్వారానికి వెలుపల అశోక స్తంభం ఉంది. ఇక్కడే ఒక బ్రాహ్మణుడు, హీనయాన బౌద్ధుడైన వైశ్వంతరుణ్ణడిగి అతడి పుత్రుణ్ణీ, పుత్రికను దానం పుచ్చుకుని, అన్యులకు అమ్మివేశాడట. వైశ్వంతరుడు తన సంతానాన్ని దానం చేసిన దంతాలోక పర్వతంమీద అశోకుడొక స్తూపాన్ని నిర్మించాడు. ఈ స్తూప ప్రదేశంలోనే బ్రాహ్మణుడు రాజకుమారుణ్ణీ, రాజకుమారినీ అతి నిర్దయతో హింసించాడుట. ఇక్కడే వాళ్ళ శరీరాల నుంచి రక్తం కాలువలు కట్టి ప్రవహించిందిట. కనుకనే నేటికీ దంతాలోక పర్వతం మీది వనస్పతి ఎర్రగా రక్త వర్ణంలో వుంటుంది. స్తూపానికి ప్రక్కనే ఒక గుహ వుంది. ఆ గుహలోనే వైశ్వంతరుడు, అతడి రాణి ధ్యాన మగ్నులై ఉండేవారుట. దగ్గర్లో ఋష్యశృంగుడి ఆశ్రమం ఉంది. ఒక గణిక ఈ ఋష్యశృంగుణ్ణి మోహించి. అతడి భుజాలపైనెక్కి విజయ గర్వంతో నగర ప్రవేశం చేసిందిట.

---

* ఈ కథ వైశ్వంతర జాతకంలో వుంది.

నేను పాణిని వ్యాకరణాన్ని చదివాను.నాకంటె కూడా అధికంగా బుద్ధిలుడు పాణిని వ్యాకరణంపై అధికారాన్నికలిగి వున్నాడు. అక్కడికి కేవలం తొమ్మిదిక్రోసుల దూరంలో, పాణిని జన్మస్థానమైన శాలాతురం వుందని చెప్పాడు బుద్ధిలుడు. పాణిని జన్మస్థానాన్ని చూడాలన్న నాలోని వాంఛను ఏవిధంగానూ చంపుకోలేక పోయాను.అక్కడికి రెండు యోజనాల దూరంలో ఈశాన్యమూలగా ఓపెద్ద పర్వతం వుంది. ఆ పర్వతం పైన ఒక పెద్ద 'గౌరి' ఆలయం వుంది. కపిషా, గాంధార, కాశ్మీర దేశాల్లో పాశుపత ధర్మాన్ననుసరించేవారు చాలామంది వున్నారు.శైవ మతానుయాయులు ఈ గౌరి ఆలయాన్ని చాలా పవిత్రమైనదిగా భావిస్తూ వుంటారు. శివభక్తులైన బైరాగుల మఠంకూడా ఒక టుంది యిక్కడే. గౌరి దేవాలయానికి ఆగ్నేయంగా ఆరు యోజనాల దూరం వెళ్ళాక ఉద్భాండ (ఓహింద్) నగరం వచ్చింది. ఈ ఉద్భాండ నగరానికి దక్షిణంగా సింధునది ప్రవహిస్తూంది.గాంధార దేశపు పట్టణా లన్నింటిలోకీ ఈ పట్టణం ఒక్కటే కొంచెం కళకళ్ళాడుతూ వుంది.బహుశః ఈపట్టణం సింధునదీ తటాన వుండడం వల్లనే, వచ్చే పోయే సార్థవాహుల్తో, వ్యాపారుల్తో కళకళ్ళాడుతోంది అనుకున్నాను.

ఉద్భాండ నగరానికి ఒక యోజనం దూరంలో, వాయవ్య దిశగా శాలాతురం వుంది అప్పట్లో పాణిని వ్యాకరణం మాకు కల్పవృక్షంలాగే వుండేది.ఎంతో భక్తిభావనతో పాణిని జన్మించిన ప్రదేశాన్ని దర్శించాం. తిరిగి ఉద్భాండ నగరానికి వచ్చి, సింధునదిని దాటాము. నగరం దగ్గర సింధునది వెడల్పు ఒక క్రోసువరకూ వుంటుంది. నీళ్ళు చాలా స్వచ్ఛంగా ఉంటాయి. నదిని దాటి, ఆరు రోజుల ప్రయాణానంతరం తక్షశిలను చేరాము. తక్షశిల గాంధార దేశంలోని నగరమే। పురుషపురం, తక్షశిల ఈ రెండు ప్రాచీన నగరాలూ ఇప్పటికీ మిహిరకులుడి పాలనలోనే వున్నాయి. ఏథాల ఆక్రమణకు ముందు, ఈ నగరం ఎంతో సమృద్ధంగా, ధనధాన్యాలతో తులతూగుతూ వుండేది. ఏథాల దోపిడీకి లోనయ్యాక, తిరిగి ఈ పట్టణం కోలుకోనేలేదు. తన వెనుకటి స్థితికి చేరలేకపోయింది।

తక్షశిలలో అశోకుడు, కనిష్కుడు నిర్మించిన చైత్యా లున్నాయి. అశోక చైత్యం నగరానికి క్రోసు, క్రోసున్నర దూరంలో వుంది. ఈ

చైత్యంయొక్క మాహాత్మ్యాన్ని గురించి ఎన్నో కథలు చెప్తూంటారు. ఈ చైత్యంవున్న ప్రదేశంలోనే బుద్ధుడు తన తలను కోసి-తక్షచేసి- వేయి జన్మలవరకూ దానం చేశాడుట! కనుకనే ఆ ప్రదేశాన్ని తక్షశిరా, లేక తక్షశిలా అంటారు. అశోకుడు, కనిష్కుడు కట్టించిన ఎన్నో విహారాలు కూడా వున్నాయక్కడ! అశోకవిహారం బాగా శిథిలమైపోయింది. ఇతర విహారాలుకూడా చాలావరకు శిథిలమైపోయాయి. వాటిలో కొద్దిమంది భిక్షువులు మాత్రం ఉంటున్నారు. తాంత్రికాచార్యుడు కుమారలాత్ ఇక్కడే తన గ్రంథాల్ని రచించాడు. నగరానికి ఆగ్నేయదిశగా, దక్షిణగిరికి పశ్చిమంగా అశోకుడు నిర్మించిన 60 బారల ఎత్తుకల స్తూపం వుంది. అశోకుడి కొడుకు కుణాలుడు సవతి తల్లి కుట్రను తెలుసుకోలేక, తన రెండు కండ్లనూ ఇక్కడే పెరికించుకున్నాడు. అశోకుని అనంతరం కుణాలుడు జంబూద్వీపానికి చక్రవర్తి కావడం సవతి తల్లికి ఇష్టం లేదు. ఆమె ఎలాగో రాజముద్రను అపహరించి, కుణాలుడి కండ్లు పెరికివేయవలసిందన్న ఆజ్ఞాపత్రాన్ని పంపించింది. ఈ ఆజ్ఞను వినగానే కుణాలుడు ఎట్టి అభ్యంతరాన్నీ చెప్పకుండా తన కండ్లను ఇచ్చేశాడు! ఇప్పటికీ అంధులు ఈ స్తూపం వద్దకు వచ్చి, తమకు తిరిగి దృష్టిని ప్రసాదించమని వేడుకుంటూ వుంటారు. అశోకుడు గతించాడు, కుణాలుడుకూడా గతించాడు. ఆ వంశ వైభవమే ఎన్నడో కాలంలో లీనమైపోయింది. కానీ, ఈనాటికీ శ్రద్ధాళులైన భక్తులు తండోప తండాలుగా వచ్చి ఈస్తూపాన్ని దర్శించి వెళ్తూవుంటారు. మహాపురుషుడైన ఘోషుడివరంవలన కుణాలుడికి తిరిగి కండ్లు వచ్చాయని చెప్పుకుంటారు. ఒకప్పుడు తక్షశిల మహోచ్ఛస్థితిలో వుండేది. ఇక్కడి మహావిద్యాలయంలో విద్య నభ్యసించడానికి, సుదూర దేశాలయిన కాశీ, కోసల, మగధ, విదేహాలనుండికూడా విద్యార్థులు వస్తూండేవారు. కానీ, ఈనాడు తక్షశిల ఎంత హీనస్థితిలో వుందో! తక్షశిలను చూశాక ఈ ప్రపంచమంతా సారరహితమైన దనిపించింది. నా మిత్రుడు ఇలా అన్నాడు: "పాత ప్రపంచం నాశనమవడం, క్రొత్త ప్రపంచాన్ని సృష్టించడానికే! మనం నాశనమయ్యే వస్తువునుచూసి విచారపడకూడదు. దాని స్థానంలో ఉత్పన్నమయ్యే క్రొత్త వస్తువును చూసి ఆనందించాలి. ఆకురాలు కాలం లేకపోతే, మహా సౌందర్యయుతమైన

వసంత ఋతువునెలా చూడగలవు? పాతతరం నశించకపోతే, క్రొత్త తరంలోని వసుబంధు, దిఙ్నాగులు మనకెలా లభిస్తారు?"

* * *

## కాశ్మీరం

తక్షశిలనుండి మైదానాలగుండా తూర్పుకు ప్రయాణాన్ని సాగించితే, శాకలా - స్యాల్‌కోట్ - మీదుగా మధ్య దేశానికి వెళ వచ్చును. కానీ, కాశ్మీర దేశాన్ని చూసుకుని మధ్య దేశానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాము. ఇందువలన గ్రీష్మఋతువును చల్లని, సుఖకరమైన కాశ్మీర దేశంలో గడపడం జరుగుతుంది. మేము తక్షశిలనుండి ఈశాన్యదిశగా ప్రయాణంచేసి, కొన్ని పర్వతపంక్తుల్ని దాటాక, కాశ్మీరభూమిలో ప్రవేశించాము. కాశ్మీర భూమి చాలా రమణీయంగా వుంది. చుట్టూ ఎత్తయిన పర్వతాలూ, పండ్లతోటలూ, పూలతోటలూ, కనులపండువుగా ఉన్నాయి. కుంకుమపూవు, గుర్రాలూ, రకరకాలైన ఏర్లూ, మూలికలూ ఇక్కడ లభిస్తాయి. వస్త్రధారణ ఉద్యానవాసుల్ని పోలివుంటుంది. అయితే, అంతటి శౌర్యపరాక్రమాలు వీరిలో కనుపించవు. కాశ్మీరు ప్రజల్లో విద్యా ప్రేమ అత్యధికం! బౌద్ధులూ, శైవులూ- ఉభయ మతాలవారూ ఉన్నారిక్కడ. మిహిరకులుడు చాలా క్రూరుడంటారు. కానీ, మొత్తం కాశ్మీర భూమిలో వందకుపైన విహారాలూ, వేల సంఖ్యలో భిక్షువులూ ఉండడాన్నిచూస్తే మిహిరకులుడు నలుగురూ అనుకున్నంతటి క్రూరుడు కాదనిపిస్తుంది. ఒక వేళ యవ్వనంలో అలా క్రూరత్వాన్ని చేశాడేమో,ఇప్పుడీ వృద్ధాప్యంలో మాత్రం శైవ - బౌద్ధమతాల్ని రెండింటినీ సమాన ఆదరంతో చూస్తున్నాడు. ప్రజలు స్వేచ్ఛా పూర్వకంగా ఇష్ట ధర్మాన్ని అనుసరిస్తున్నారు. మిహిరకులుడి రాజధానిలో కాలుపెట్టగానే నాహృదయంలో సన్నని కలక బయలుదేరింది. నాప్రేయసి భద్ర ఇంకా అతడి అంతఃపురంలోనేవుండి వుంటుంది. బుద్ధిలుడు మా ప్రేమగాథను ఎంతోసానుభూతితో విన్నాడు. అంతఃపురంలోకి వెళ్ళి భద్రను చూడడానికి ప్రయత్నించడం వలన మాన్పుకు వచ్చిన హృదయ వ్రణం తిరిగి సెలవేయడం తప్ప మరో

ప్రయోజనం ఉండదన్న నా భావనను బుద్ధిలుడు బలపరిచాడు. కనుకనే భద్రను కలుసుకోవడానికి నే నెలాటి ప్రయత్నమూ చేయలేదు.

కాశ్మీర దేశం శాస్త్రులకూ, విద్వాంసులకూ పుట్టినిల్లు. అక్కడి పవిత్ర ప్రదేశాల నెన్నింటినో చూశాము.

కాశ్మీర దేశంలో మొదటగా కనిష్కపుత్రుడుకట్టించిన హువిష్క విహారాన్ని చూశాము. ఒకప్పుడీ విహారంలో చాలామంది భిక్షువులుంటుండే వారుట! ఇప్పుడుమాత్రం బహుకొద్దిమంది భిక్షువులుంటున్నారు. హువిష్క విహారంలో రెండేరెండు రోజులువున్నాము ... స్థల పురాణం ప్రకారం వెనుక కాశ్మీరు భూమంతా ఓ పెద్ద సరోవరంగా ఉండేది. ఆ సరోవరంలో ఒక నాగరాజు ఉండేవాడు. మధ్యాంతిక స్థవిరుడు ఆ నాగరాజును ఓడించి ఆ సరోవరాన్ని ప్రజలకు వాసయోగ్యమైన భూమిగా మార్చాడని చెప్తారు. బుద్ధిలు డిలా అన్నాడు: "కాశ్మీర భూమికి చుట్టూ ఎత్తయిన పర్వతాలున్నాయి. నీటిపారుదల సౌకర్యాలు ఇప్పటంత ప్రచురంగా లేకపోవచ్చు వెనుక! అలాటి స్థితిలో ఈ కాశ్మీరభూమంతా వెనుక ఓ పెద్ద సరోవరంగా వుండేదన్నా ఆశ్చర్యపడనవసరం ఉండదు. కానీ, మహాపురుషులకూ, మహాస్థవిరులకూ సరోవరాన్నిఇంకించటం, కొండల్ని పిండి చేయడమే జీవితాదర్శం అనుకోవడం పొరపాటు! మధ్యాంతిక స్థవిరుడు అశోక మహారాజు కాలపువాడు. అశోకుని గురువైన మౌద్గల్యపుత్రుడు తిష్యుడు-ఉపగుప్తుడు-బౌద్ధ ధర్మ ప్రచారం కొరకు వివిధ దేశాలకూ మత ప్రచారకుల్ని పంపించాడు. అప్పుడే ఈ మధ్యాంతిక స్థవిరుణ్ణి, అతడి శిష్యులతోపాటు హిమాలయప్రాంతానికి బౌద్ధమతప్రచారార్థం పంపించటం జరిగింది. మొదటగా కాశ్మీరు భూమికి బౌద్ధమత సందేశాన్ని వినిపించిన గౌరవమూ, కీర్తీ మధ్యాంతిక స్థవిరుడికే లభించింది. కాశ్మీరు ప్రజలకు ప్రథమ ఆచార్యుడు మాధ్యాంతిక స్థవిరుడేను! కనుక యిక్కడిప్రజలు తమ ప్రథమ ఆచార్యుడిపట్ల కృతజ్ఞతను ప్రదర్శించడం సహజం! ఇలాంటి కథలకు ఆ సహజ కృతజ్ఞతే కారణం. మధ్యాంతిక స్థవిరుడు నాటిన చిన్న మొక్క పెరిగి, వేర్లుతన్ని, మహావృక్షమై, కాశ్మీరం లాంటి విద్యా కేంద్రంగా దర్శన మిస్తోంది ఇప్పుడు."

కాశ్మీర దేశంలో ఒకమాటు అశోకుడు మహాపరిషత్తు నొకదాన్ని ఏర్పాటు చేశాడు. ఆ పరిషత్తు బుద్ధునిసూత్రాల్ని ప్రోగుచేసి వాటికి స్పష్టమైన నిర్దుష్టమైన అర్థాల్ని, భావాల్ని ప్రకటించింది. అశోకుడిసమయంలో బుద్ధుని ఉపదేశాలకు ప్రజల్లో పరస్పర విరుద్ధమైన భావాలు ప్రచారంలోకి సాగాయి. ఇలాంటి విరుద్ధ భావాల్ని నిర్మూలించడానికి అశోకుడు తన గురువైన మౌద్గల్యాపుత్రుడు శిష్యుడి సమ్మతితో మహాపరిషత్తు నేర్పాటు చేశాడు. కనిష్కుడి సమయంలోనూ ఇలాగే బుద్ధునిఉపదేశాలకు అర్థాలు భేదించాయి. కనిష్కుడుకూడా తన గురువైన పార్శ్వుడి సమ్మతితో ఒక మహాపరిషత్తును ఏర్పాటుచేశాడు. కనిష్కుడి పిలుపునందుకుని పూర్వ పశ్చిమ దేశాలనుండి అనేకమంది మహాపండితులు ఆ పరిషత్తులో పాల్గొనడానికి విచ్చేశారు. మొదట పరిషత్తును గాంధార దేశంలోనే జరుపుదా మనుకున్నాడు కనిష్కుడు. అయితే గాంధార దేశంలో ఎండలూ అధికమే. వర్షాలూ అధికమే, చివరకు కాశ్మీర దేశంలోనే పరిషత్తును జరప నిశ్చయించుకున్నాడు. అంతమంది పండితుల్లో నుండి 499 మంది భిక్షువుల్ని మాత్రం పరిషత్తుకు సభ్యులుగా ఎన్నుకున్నారు. ఈ నాలుగు వందల తొంభై తొమ్మిది మందీ మూడు వేదాల్లోనూ, ఆరు శాస్త్రాల్లోనూ నిష్ణాతులైన పండితులు. అప్పటికి భదంత వసుమిత్రులు ఈ పరిషత్తు సభ్యుల్లో చేరలేదు. సాధారణ భిక్షువుల్లా విహారంలో ప్రవేశించారుట! కాని, అనంతరం వసుమిత్రులేన్నే ఈ పరిషత్తుకు మహాస్థవిరుల్ని చేయడం జరిగింది.

ఇదే సందర్భాన్ని పురస్కరించుకుని బుద్ధిలు డిలా అన్నాడు: "బుద్ధుడు నిర్వాణాన్ని పొందిన మొదటి సంవత్సరంలో, ఆయుష్మాన్ మహాకాశ్యపుడి అధినాయకత్వంతో మహాపరిషత్తు నొకదాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. ఆ పరిషత్తులోకి ఆనందుడు కూడా సాధారణ భిక్షువులాగానే ప్రవేశించి, అనంతరం పరిషత్ సభ్యుడయ్యాడుట!"

అప్పుడు ఆనందుడికి జరిగిన పనే కనిష్కుడి సమయంలో వసుమిత్రుడిపట్ల జరిగింది. ఏదిఏమైనా కనిష్కుడు ఏర్పరచిన మహా పరిషత్తుకు వసుమిత్రుడు నాయక స్థవిరుడు. పరిషత్తు కార్యక్రమం అనేక మాసాలపాటు జరిగింది. బుద్ధుని సూత్రాల్ని, వినయాన్ని, అభిధర్మాన్ని

మూడు పిటకాలను సంగ్రహ పరిచారు. మూడు పిటకాల తత్వాలనూ వివరిస్తూ ఒక్కొక్క పిటకానికి శతసహస్ర శ్లోకాల్లో ఒక్కో విభాషను నిర్మించారు. పరిషత్తు సమాప్తమయ్యాక కనిష్కుడు త్రిపిటకాలనూ, విభాషల్లోనివాటి వివరాలనూ తామ్రపత్రాలమీద వ్రాయించి, పాషాణ పేటికల్లో భద్రపరచి, ఒక స్తూపంలో వుంచాడని చెప్పుకుంటారు. "అతామ్ర పత్రాలపై వ్రాసిన త్రిపిటకాలూ, వాటి వివరా లనదగిన విభాషలూ ఇప్పుడు లభిస్తే ఎంతబాగుండు!" అనుకునేవాణ్ణి. అయితే, ఆ పత్రాలను ఏ స్తూపంలో వుంచాడో తెలుసుకోవడం మాత్రం ఎలా సంభవం? అలా తామ్ర పత్రాలు స్తూపంలో భద్రపరచడం అసంభవమైన విషయంగానీ, అసహజమైన విషయంగానీ కాదు. అయినా బుద్ధిలుడికి ఈ విషయం మీద అంతగా విశ్వాసం లేదు. పరిషత్తు ముగిశాక కనిష్కుడు కాశ్మీర దేశాన్నంతటినీ భిక్షు సంఘానికి దానం చేసేశాడనికూడా చెప్పుకుంటారు. బుద్ధిలుడి మాటలు క్రమంగా నాలో పనిచేయసాగాయి. పైగా; ప్రతిచోటా అస్థిధాతు, దంతధాతు, కేశధాతు. పాత్రధాతు, చీవరధాతు-నిక్షిప్తాలయిన స్తూపాలను చూస్తూండడం వలన వాటి సత్యతమీద నా హృదయంలోనూ శంక పొడమసాగింది. అయినప్పటికీ, దర్శనీయమైన పవిత్ర స్థానాలను చూడడంలో అశ్రద్ధ చేసేవాణ్ణి కాదు. కానీ కాశ్మీర దేశంలో దంతధాతు నిక్షిప్తమైన స్తూపా నొకదాన్ని చూశాను. అప్పుడే నా హృదయంలోని అవిశ్వాసం పరిపూర్ణతకు చేరింది. ఈ దంత - విహారానికి దక్షిణంగా రెండు క్రోసుల దూరంలో అవలోకితేశ్వరుడి ప్రతిమ ఒకటుంది. ప్రతిమ చాలా అందంగా వుంది. ఆ ప్రతిమనుగురించి కూడా అత్యద్భుతమైన విషయాలు ఎన్నో ప్రచారంలో వున్నాయి. ఈ ప్రతిమకు ఒక యోజనం దూరంలో, ఆగ్నేయ దిశగా. అతిసుందరమైన, పురాతన, శిథిల విహారం ఒకటుంది, ఈ విహారంలో రెండతస్తుల భవనం ఒకటుంది. ఆ భవనంలో వుంటూ ఆచార్య సంఘభద్రులు అభిధర్మానికి సంబంధించిన "అభిధర్మన్యాయానుసార శాస్త్రం" అనే గ్రంథాన్ని రచించారు. ఈ గ్రంథాన్ని వసుబంధుయొక్క "అభిధర్మ కోశా"నికి విమర్శక గ్రంథం అనవచ్చును. "అభిధర్మకోశం"లో విభాషల మూల సిద్ధాంతాలకు వ్యతిరేకమైన సిద్ధాంతాలు అనేకచోట్ల కనుపిస్తాయి.

"అభిధర్మన్యాయానుసారశాస్త్రం"లో పైవ్యతిరేక సిద్ధాంతాలు సుదీర్ఘంగా విమర్శించి, ఖండించడం జరిగింది. విహార పరిసరాల్లో చిన్నవీ పెద్దవీ అనేక స్తూపాలున్నాయి.వాటిలో అక్కడి స్థవిరులవీ పండితులవీ ధాతువులు - ఎముకలు - నిక్షిప్తం చేయబడినాయి. దంతవిహారానికి దాదాపు ఒకటిన్నర క్రోసుల దూరంలో (రెండు మైళ్ళల్లో) ఈశాన్య దిశగా ఒక చిన్న విహారం వుంది. ఆ చిన్న విహారంలోనే ఆచార్య స్కంధిలుడు "విభాష ప్రకరణ పా(వా)దం" - అభిధర్మావతార శాస్త్రం - అనే గ్రంథాన్ని రచించాడు.

రాజధానికి వాయవ్యదిశగా, ఎనిమిది యోజనాల దూరంలో వణిశ్వన విహారం వుంది. ఈ విహారంలోనే ఆచార్య పూర్ణుడు విభాషలకు వ్యాఖ్యల్ని వ్రాశాడు. రాజధానికి 5, లేక 6 యోజనాల దూరంలో, పశ్చిమంగా మహానది ఒకటుంది. ఆ నదికి ఉత్తరంగా వున్న పర్వతానికి దక్షిణ పార్శ్వంలో మహాసాంఘికుల విహారం ఒకటుంది. ఈ విహారంలోనే మహా సాంఘికాచార్యుడైన బోధిలుడు తన గ్రంథాల్ని రచించాడు.

గాంధార దేశంలాగానే కాశ్మీరంలోను ఎంతో మంచి మహాపండితులు జన్మించారు. అతి రమణీయమైన కాశ్మీరభూమిలో అనేకమైన విహారాలూ, స్తూపాలూ వెలిశాయి. విభాషలకూ, విభాషా సిద్ధాంతాలకూ పట్టుకొమ్మ కావడంవలన సుదూర దేశాలనుండి కూడా "విద్యార్థులు" అధ్యయనార్థం కాశ్మీరానికి వస్తూండేవారు. కానీ, నేడు, అలాంటి కాశ్మీరంలోని స్తూపాలూ, విహారాలూ ఎంతటి హీనదశలో వున్నాయి। ఎన్నో విహారాలు శిథిలమై పడిపోయాయి. ఎన్నో పరిత్యక్తావస్థలో వున్నాయి. కొన్ని విహారాలైతే గడ్డి గాదం మొలిచి పూర్తిగా మరుగునే పడిపోయాయి। ఇంత శిథిలతకు కారణం ఏమిటి? "అనిత్యావత సంస్కారాః"- ప్రతిదీ తయారౌతుంది. నశిస్తుంది-అని బుద్ధుడు ఏనాడో ప్రవచించాడు. బుద్ధభగవానుని పైసూక్తి ప్రతిదానిపట్లా, నూటికి నూరుపాళ్ళూ ఘటితమౌతున్నది. కనుక విహారాలూ, స్తూపాలూ శిథిలమవడాన్ని చూసి, కేవలం మిహిరకులుడే కారణ మనుకోవడం అవివేకమే అవుతుంది। ప్రజలకు స్తూపాలమీదా, విహారాలమీదా అపారమైన శ్రద్ధాసక్తులే

వున్నట్లయితే శిధిలమైన వాటిని మరమ్మత్తు చేయించుకునేవారు కాదా? వైభాసికులను హీనయాను లంటాము. మేము మహాయానులము. ఒక్క-సింహళాన్ని మినహాయిస్తే, మిగిలిన అన్నిదేశాల్లోనూ మహాయానమే అధిక జనామోదాన్ని పొందుతోంది. మహాయానం, హీనయాన పదునెనిమిది నికాయాలను - సంప్రదాయాలను-తనలో అంతర్లీనం చేసుకుంటుందా అనిపిస్తుంది. మహాయాన సిద్ధాంతమంటే నా కెంతో ఇష్టం! ఐతే, హీనయానపు వినయపిటకమన్నా, హీనయానులు నిష్ఠతో వినయ సూత్రాల్ని పాటించడం, వారి సహజ, సరళ వేషధారణ, అతి ప్రాచీనమైన ఆచారాలూ నన్నెంతగానో ఆకర్షిస్తాయి. మరికొంత కాలానికి హీనయానం నామావశేష మవుతుందేమో అనిపించి మనస్సెంతగానో బాధపడేది. కానీ, పాతది జీర్ణమవకా తప్పదు. రాబోయే క్రొత్తదానికి తన స్థానాన్నిచ్చి తాను నిష్క్రమించకా తప్పదు. మతాల విషయం కూడా అంతే! పాత మతం లుప్తమవుతుంది. దాని స్థానాన్ని క్రొత్త మతం ఆక్రమిస్తుంది. అశేషంగా కనుపిస్తున్న శూన్య, శిథిల విహారాలనూ, చైత్యాలనూ చూశాక "నిజంగానే బుద్ధమతం వేయి సంవత్సరాల తరువాత శాశ్వతంగా లుప్తమైపోతుందా?" అన్న ప్రశ్న నాలోనూ ఉదయించింది. నేను ఆస్తికుణ్ణి, బుద్ధిలు డిలా బౌద్ధిక (బుద్ధి ప్రధానమైన, హేతువాది) వాదిని కాను. బౌద్ధ ధర్మానికి సంబంధించిన ప్రాచీన పవిత్ర స్థలాలను భగ్నావస్థలో చూసిన క్షణాన కన్నీటిని బొటబొటా కార్చేసే వాణ్ణి!

అలాంటప్పుడు బుద్ధిలు డిలా అనేవాడు; "వెనుకటి తరాల రక్తమాంసాలు, ముందు తరాలకు లభించా లనుకోవడం పొరబాటు! అయితే, పూర్వ తరాలు ఆర్జించిన జ్ఞానంలో కొంతలో కొంత అయినా భవిష్యత్తరాలకు తప్పక లభిస్తుంది. ఈ జ్ఞాన రేఖే భవిష్యత్తరాల వారికి మార్గదర్శక మవుతుంది!"

నేను శ్రద్ధకు - ఆస్తికతకు - ప్రాధాన్యత నిస్తాను. బుద్ధిలుడు బుద్ధికి - అంటే ప్రజ్ఞకు ప్రాధాన్యత నిస్తాడు. అతడు ప్రజ్ఞ శాశ్వతమైందంటాడు. నేను శ్రద్ధకు అమరత్వాన్ని కల్పించాలంటాను.

# పుణచ

ఆశ్వయుజ పౌర్ణమి తరువాత మేము కాశ్మీర దేశంనుండి ప్రస్థానాన్ని సాగించాము. వర్షాకాలం ప్రయాణాలు చేయడం బాధాకరంగా వుంటుంది. పర్వత మార్గాలూ, మైదాన మార్గాలూ – రెండూ కష్టకరంగానే వుంటాయి వర్షాకాలంలో! అధిక వర్షాలవల్ల మార్గాలకు గండ్లు పడుతుంటాయి. వంతెనలు విరిగిపోతుంటాయి. అప్పుడప్పుడూ పర్వత శిఖరాలు విరిగి పడతాయోయేనన్న భయమూ కలుగుతుంటుంది. కనుకనే భిక్షువులు వర్షాకాలంలో యాత్రలు చేయరాదన్న నియమాన్నేర్పరచాడు బుద్ధుడు. ఈ నియమం వలన బుద్ధుని హృదయంలోని దయార్ద్రిత స్పష్టమౌతుంది. కాశ్మీర భూమి నాలుగు వైపులనుండి ఎత్తయిన పర్వతాలలో వలయించబడివుంది. కేవలము అక్కడి మహానది ననుసరించి మాత్రమే ముందుకు పోగలము. మేము నదీతీరాన్ననుసరించి కొంత దూరంపోయాక, కొన్ని పర్వత పంక్తుల్ని దాటి ఒక రమణీయ ప్రదేశాన్ని చేరాము. ఈ ప్రదేశం కాశ్మీరమంత సుందరమైంది కాకపోయినా, కాశ్మీర దేశంలో పండే పండ్లన్నీ ఇక్కడా పండుతాయి. వరికూడా బాగా పండుతుంది. ఇండ్ల ముందు అరటి తోటలూ, అంజీర పండ్ల తోటలూ వున్నాయి. కాశ్మీరం కంటే ఉష్ణప్రదేశం ఇది. కనుకనే మామిడి పండ్లుకూడా లభిస్తాయి. ఇక్కడి ప్రజలు ఎక్కువగా నూలు వస్త్రాల్ని ధరిస్తుంటారు. బౌద్ధ ధర్మం ఇక్కడ బాగా ప్రచారంలో వుంది. సంఘారామాలు అనేకం వున్నాయి. కొన్ని శిధిలమయ్యాయి. ప్రజలు సాహసికులు, సరళ స్వభావులు.

పుణచలో కొంతకాలం గడపడం మా అభిమతం కాదు. పైగా, అక్కడ మమ్మల్ని ఆకర్షించగల తీర్థస్థలాలూ లేవు. మధ్య దేశానికి వెళ్ళాలన్న ఆతురత మాలో ఎక్కువైంది.

పుణచనుండి మరికొంత క్రిందకు వచ్చి, రాజపుర్ణి చేరాము. ఇదీ కొండ ప్రదేశమే! ఈ రాజౌరీని దాటాక పర్వతాలూ సమాప్తమయ్యాయి. నూతన ప్రపంచంలో ప్రథమంగా కాలు పెట్టాను:- సమతలమైన భూమి, దూరాల వరకూ వ్యాపించివున్న పంటచేలు, లేక అడ

వులు! ప్రజల వేష భాషల్లోనూ, ఆచార వ్యవహారాల్లో కూడా చాలా వ్యత్యాసం కనిపిస్తోంది. కపిషానుండి రాజపురి వరకూ వున్న ప్రజలు పర్వత ప్రాంత నివాసులు. వారి స్వభావాల్లోనూ సారూప్యం కని పిస్తుంది. వారందరూ సరళ స్వభావులు. కొంతవరకూ కర్కశ స్వభావం కూడా కనిపిస్తూంటుంది వారిలో. కొట్లాటలకు, రక్తపాతానికి కాలుదువ్వుతూ వుంటారు. చదువు సంధ్యల్లో వెనకబడివున్నా, కృత్రిమ ప్రవర్తన ఆ ప్రజల్లో కనిపించదు. అమాయకులైన పర్వత ప్రాంతీయులు నాగరికతలో వెనకబడివున్నా. మాట నిక్కచ్చితనంలో ఎవరికీ తీసిపోరు. ఇక అతిథి సేవాపరాయణతలో పర్వతప్రాంత ప్రజల్ని చెప్పే పరొకర్ని చెప్పాలి!

# 6 వ అధ్యాయం

# కన్యాకుబ్జం

(క్రీ శ. 542-43)

రాజపురిని దాటాక పర్వతాల్ని దిగి ఆగ్నేయదిశగా ప్రయాణం సాగించాము. రెండు రోజుల ప్రయాణానంతరం చంద్రభాగ నదిని సమీపించాము. నదిని దాటి మరికొంతదూరం వెళ్లాక శాకలా_స్యాల్‌కోట-వచ్చింది. శాకలా మిహిరకులుడి రాజధానుల్లో ఒకటి. ఈ నగరంలో మిహిరకులుడు శరదృతువును గడుపుతూవుంటాడు. వెనుక మిహిరకులుడి రాజ్యం, యమునా నదినుండి నర్మదా తీరంవరకూ విస్తరించి వుండేది. ఆ రోజుల్లో శాకలా గొప్ప సమృద్ధిని సాధించింది. కానీ, పరాజయాన్ని పొందాక, ఎలాగో ప్రాణాల్ని రక్షించుకుని కాశ్మీరానికి పారిపోయాడు మిహిరకులుడు! అప్పటినుండి కాశ్మీరదేశంలోనే వుంటున్నాడు. శాకలాలో వుండగా ఒకమాటు భిక్షువుల ప్రవర్తనకు కోపించి. బౌద్ధధర్మాన్ని నాశనం చేసేయాలని నిశ్చయించుకున్నాడు మిహిరకులుడు. ఎన్నో విహారాలనూ, స్తూపాలనూ ధ్వంసం చేశాడు. అనేకమంది బౌద్ధ భిక్షువుల్ని అతి నిర్దయుడై సంహరించాడు. బౌద్ధమతంమీదా. భిక్షువుల మీదా మిహిరకులుడికి కలిగిన ఈ కోపానికి కారణం కేవలం భిక్షువుల ప్రవర్తనలోని లోపమే అని నేననుకోవడంలేదు. మిహిరకులుడు తన తండ్రి అయిన కోరమాణుడి వలెనే దిగ్విజయాలను సాగించాలన్న తలంపుతో మధ్యదేశం మీదికి దండు వెడలాడు. నరసింహ బాలాదిత్యుడితో యుద్ధం సంఘటిల్లింది మొదట మిహిరకులుడు కొంతవరకూ విజయాన్ని పొందాడు. కానీ, చివరకు ఓడిపోయి బాలాదిత్యుడికి బందీ అయ్యాడు మిహిరకులుడు. బాలాదిత్యుడి తల్లికి మిహిరకులుడిమీద

దయ కలిగింది. అతణ్ణి ఖైదునుండి విడిపించి వేసింది. అలా విడిపించ డమే అతడింత అత్యాచారి కావడానికి కారణమైంది. బాలాదిత్యుడికీ తనకూ జరిగిన యుద్ధంలో మధ్యదేశంలోని బౌద్ధులు గొప్పగా శౌర్యాన్ని ప్రదర్శించి, పోరాడారు. కపిషా, గాంధార, కాశ్మీర దేశాల్లోని ప్రజలు మధ్యదేశంమీద ఎప్పుడూ భక్తిభావాన్ని ప్రదర్శిస్తూవుంటారు. యుద్ధ సమయంలో వారి సహానుభూతి అంతా బాలాదిత్యుడివైపే వుండ డాన్ని గమనించాడు మిహిరకులుడు. దీంతో, అతడి హృదయంలో బౌద్ధులమీద అపారమైన ద్వేషం పెల్లుబికింది. తన రాజ్యంలోని భిక్షు వుల్నికూడా ఘోరంగా ద్వేషించి, సంహరించాడు. మిహిరకులుడు ఓడి పోయి, తిరిగి రాజధానికి- శాకలాకు-వచ్చేసరికి అతడి తమ్ముడు సింహా సనాన్ని అధిష్ఠించాడు. అన్న బందీ అయిన వార్త వినగానే తమ్ముడు సింహాసనాన్ని జాగ్రత్త చేసుకున్నాడు. తమ్ముడితో పోరాడి సింహాస నాన్ని తిరిగి పొందే యోచనను మాని, కాశ్మీర దేశంలో తల దాచుకోవడానికి వెళ్ళాడు మిహిరకులుడు. కాశ్మీరాన్ని పాలిస్తున్న సామంత రాజు తన ప్రభువైన మిహిరకులుడికి గొప్పగా స్వాగతా న్నిచ్చి ఆదరించాడు. ఐతే, కృతఘ్నుడైన మిహిరకులుడు ఆ సామంత రాజును చంపి, కాశ్మీరానికి తానే రాజునని ప్రకటించుకున్నాడు. ఇక భిక్షువులను అనేక చిత్రహింసల పాల్చేశాడు. 1600 స్తూపాలనూ,సంఘా రామాలనూ పడగొట్టించాడని చెప్తారు. నేను దేశాన్ని వీడడానికి ముందే- 547 క్రీ. శ. - మిహిరకులుడు చచ్చి నరక నివాసి అయ్యాడు.

శాకలా నగరాన్ని చూస్తూ, అక్కడి ప్రాచీన చరిత్రను గురించిన అనేక విషయాల్ని తెల్సుకున్నాను. కొద్ది సంవత్సరాల క్రితం చివరి (16వ) సంఘ స్థవిరులైన సింహాణ్ణి చంపించివేశాడు మిహిరకులుడు. శాకలానగరం ఒకప్పుడు యవనరాజైన మిళిందుడి (మినాండర్) రాజ ధాని. మిళిందుడు మిహిరకులుడికంటె చాలా శక్తివంతుడైన మహారాజు. అతడు యవనుడైనప్పటికీ బౌద్ధ ధర్మంపట్ల గొప్ప భక్తిభావాని కలిగి వుండేవాడు, కనుకనే ప్రజలు ఇతణ్ణి అశోక, కనిష్కుల కోవలోకి చేరుస్తూ ధర్మరాజు-ధర్మప్రభువు- అనేవారు. అర్హత - ముక్తపురుషు డైన-నాగసేనుడు మిళిందుడికి బౌద్ధ ధర్మసూత్రాల్ని బోధించాడు.

ఆ బోధనలే "మిళిందప్రశ్న" అనే గ్రంథరూపంలో ప్రసిద్ధినిపొందాయి. బుద్ధిలుడి సహాయంతో కొద్దిరోజుల క్రితమే, కాశ్మీరదేశంలో వుండగా, "మిళిందప్రశ్న"ను పఠించాను.

యవనుల ఆ వైభవోపేత రాజధానినే, ఇప్పుడునేను. నా కండ్లతో చూస్తున్నాను. ఇప్పటికీ శాకలాలో ఒక సంఘారామం వుంది. ఈసంఘారామంలోనే వసుబంధు తన "పరమార్థ సత్యశాస్త్రా"న్ని రచించాడు. నాగసేనుడుకూడా ఈ సంఘరామంలోనే వుండేవాడు. భద్రకల్పపు నలుగురు బుద్ధులూ ఈ సంఘారామంలోనుండే ధర్మోపదేశాల్ని ఇచ్చారు. వారి ప్రద చిహ్నాలు ఇంకా ఇక్కడ వున్నాయి!

పర్వతాల్ని దిగిన తరువాత మా ప్రయాణం బహుకష్టసాధ్యమయింది. మార్గమధ్యంలో మహారణ్యాలు ఎన్నో వున్నాయి. వాటిలో సింహ-వ్యాఘ్రాలే కాక, మానవ శత్రువులు-దొంగలు-కూడా అధికంగా వుంటారు. వందా రెండు వందలమంది సాయుధులైన భటులతో వ్యాపారులు ఈ అరణ్యాల్లో ప్రయాణంచేస్తూ వుంటారు. ఇతరులుకూడా అలాంటి సాయుధులైన వ్యాపారుల మతా సాయంతో ఈ అరణ్యాల్లో ప్రయాణం చేయవలసిందేగాని వంటరిగా చెయలేరు. ఈ అరణ్యాలు చాలా పెద్దవి. కొన్ని రోజులపాటు ప్రయాణం చేస్తేగానీ, వీటిని దాటలేరు. ఒక్కో-అరణ్యాన్నీ దాటినప్పుడల్లా, వ్యాపారులూ, యాత్రికులూ తాము మృత్యుముఖంనుండి బయటపడట్లు భావించేవారు. వ్యాపారులూ, యాత్రికులూ కేవలం పట్టణాలలో మాత్రమే సురక్షితంగా వుండగలిగేవారు. అయితే మాఅదృష్టమో ఏమో! అంత ప్రయాణంలోనూ అటు పులులూ సింహలూ కనుపించలేదు; ఇటు దొంగలూ-తోడు మోతులూ కనుపించలేదు! శాకలా నుంచి మరికొంత ముందుకువచ్చి చీనభుక్తి-జిల్లా-ని చేరాము 'చీనభుక్తి' అన్నపేరు నాకు చాలా విచిత్రమనిపించింది. ఇక్కడి ప్రజలు సంపన్నులు. పంటలు బాగా పండుతాయి. ప్రజలు విద్యాభిమానులు, కళాభిమానులు! బౌద్ధమతానుయాయులూ, శైవులూ - ఉభయ మతావలంబులూ వున్నారిక్కడ! ఈ ప్రదేశానికి 'చీనభుక్తి' అన్న పేరు రావడానికి కారణం ముందే చెప్పాను. కనిష్కుడు చీనాదేశపు రాజకుమారుణ్ణి పట్టుకువచ్చాడు. తన సద్దకు తెచ్చుకున్నాక బాగా గౌరవించాడా రాజ

కుమారుణ్ణి. అతడి ఖర్చులకొరకుఒక*భుక్తిని-జిల్లాను-ఇచ్చేశాడు. కనుకనే ఈప్రదేశానికి 'చీనభుక్తి' అని పేరొచ్చింది. శరదృతువులో చీనా రాజ కుమారు డిక్కడే గడుపుతాడు. ఇతడు తన మాతృదేశంనుండి తెప్పించి ఎన్నో పండ్ల చెట్లనూ, పూవుల మొక్కలనూ ఇక్కడ నాటించాడు. అందువలననే ఇక్కడిప్రజలు సీమరేగిని, ఇప్పటికీ చీనా రాజకుమారు డనిఅంటూంటారు. చీనాదేశపు పేరును ఇక్కడేగాక వెనకకూడా చాలా మార్లువిన్నాను. నా మాతృ భూమయిన ఉద్యానంలోకి అప్పుడప్పుడూ చీనీ భిక్షువులుకూడా వస్తుండేవారు. నేనూ వాళ్ళను చూస్తుండేవాణ్ణి. అయితే, ఒక ప్రదేశానికే చీనాపేరు స్థిరమైపోవడాన్ని ఇక్కడే మొదట విన్నాను. ఇలా ఆలోచించాను: "చీనా రాజకుమారుడే ఎన్నో కష్టాల కోర్చి యిక్కడ వుండగలిగినప్పుడు, ఇకయాయవారమే జీవితాదర్శంగా గల నాలాంటి భిక్షువు విదేశయాత్రలకు జడవడం ఏమిటి ?"

"ఏమో నేనూ ఏనాటికైనా చీనాదేశం వెళ్ళవచ్చునేమో!" అని కూడా అనుకున్నాను. అయితే అప్పటికా వూహ పగటి కలే!

చీన భుక్తియొక్క ముఖ్యపట్టణానికి ఆగ్నేయ దిశగా యిరవై యోజనాల దూరంలో తమసావన సంఘారామం వుంది. ఇది అతి ప్రసిద్ధ మైన ప్రాచీన విహారం. ఇక్కడ మహాపండితులూ వినయధురంధరులు అయిన హీనయానపు భిక్షువులు చాలామంది వుంటున్నారు. బుద్ధుడు నిర్వా ణాన్ని పొందిన మూడు వందల సంవత్సరాలకు కాత్యాయనీ పుత్రుడు- పాణిని – తన శాస్త్రాన్ని – వ్యాకరణాన్ని – ఇక్కడే రచించాడు. ఇక్కడి కొండల్లో అశోకుడు అరవై బారల స్తూపాన్నొకదాన్ని నిర్మించాడు.

తమసావనానికి ఆరు యోజనాల దూరంలో వాయవ్య దిశగా జలంధర దేశముంది. ఇది ఉష్ణదేశం. ధనధాన్య సమృద్ధమైనది. ఇక్కడ సంఘారామాల సంఖ్యా, భిక్షువుల సంఖ్యా కూడా ఎక్కువే. ఇక్కడి భిక్షువుల్లో హీనయానులూ వున్నారు; మహాయానులూ వున్నారు! శైవ మతానుయాయులుకూడా వున్నారిక్కడ! జలంధర నగరంలో మూడు మందిరాలున్నాయి. వాటిలో వందల సంఖ్యలో భిక్షువులున్నారు. అసలీ ప్రదేశానికి జలంధర అన్న పేరు ఎందువల్ల కలిగింది? కాశ్మీర దేశా

నికి, కేదార ఖండానికీ మధ్యనవున్న హిమాలయ ప్రాంత భూమిని జలంధర దేశం అంటారు. శతద్రు విపాశ, ఇరావతి, చంద్రభాగా మొదలైన మహానదులు ఈ భూమిలో నేపుట్టాయి. కనుక "యథా నామం తథా గుణం" అన్న లోకోక్తి ననుసరించి ఆ ప్రాంతానికి 'జలంధర' అన్న పేరు వచ్చింది. క్రింది మైదాన ప్రదేశంకూడా ఒకప్పుడు జలంధర రాజు పాలనలోవుండి వుండవచ్చును. కనుకనే ఈ ప్రాంతానికి జలంధర దేశమన్న పేరొచ్చింది.

జలంధరనుండి ఆగ్నేయ దిశగా ప్రయాణంచేసి యమునాతీరాన్ని సమీపించాము. ఇక ఇప్పుడు మేము మధ్య దేశంలోని శృఘ్న నగరాన్ని చేరాము ఈనగరం యమునా నదియొక్క పశ్చిమ తీరాన వుంది. అయితే ఈ శృఘ్నయొక్క రాజ్యం తూర్పున గంగాతీరం వరకూ వ్యాపించి వుంది. నగరానికి ఉత్తరంగా పర్వతా లున్నాయి. శృఘ్నలో శైవ మతస్తులే కాక అన్యధర్మావలంబులుకూడా అధికంగానే వున్నారు. ఇక్కడ బౌద్ధ విహారాలు చాలా కొద్దిగా మాత్రమే ఉన్నాయి. భిక్షువులు కూడా అల్పసంఖ్యలో వున్నారు. భిక్షువులందరూ హీనయానులు. విద్యా విశారదులు. బౌద్ధ ధర్మాన్ని గురించి, దర్శనాన్ని-తత్వాన్ని-గురించి గొప్ప పాండిత్యాన్ని గడించిన విద్యాసాగరు లున్నా రిక్కడ. వీరి వద్ద అధ్యయనం చేయడానికి దూర దేశాలనుండి కూడా "విద్యార్థులు" వస్తూ వుంటారు. రాజధానికి ఆగ్నేయంగా, తూర్పు నగర ద్వారానికి వెలుపల యమునా తీరాన అశోకుడు నిర్మించిన స్తూపం ఒకటుంది. బుద్ధుడు ఇక్కడికివచ్చి ఉపదేశా లిచ్చాడుట. అశోక స్తూపానికి చుట్టుపట్ల ఇంకా చాలా స్తూపాలున్నాయి. వాటిలో అగ్రశ్రావక, సారిపుత్ర, మౌద్గల్యాయనుల అస్థిధాతువులు నిక్షిప్తాలైఉన్నాయి. శృఘ్నకుమువ్పైరెండు యోజనాల దూరంలో గంగానది ప్రవహిస్తుంది. ఇక్కడే గంగ పర్వతాల్ని విడిచి మైదానానికి దిగింది. గంగలో స్నానంచేసి తమ పాపాలను ప్రక్షాళితం చేసుకోదలచిన భక్తులు ఇక్కడికి వచ్చి గంగా స్నానం చేస్తుంటారు. కొంత మంది భక్తులైతే తమ అనేక జన్మాల పాపాలను పరిహరించుకోవడానికి గంగలో మునిగి ప్రాణత్యాగం కూడా చేస్తుంటారు. అలా ప్రాణత్యాగంచేసే అదృష్టంలభించని దురదృష్టవంతుల అస్థికలను

ఇక్కడ గంగలో కలుపుతుంటారు కూడాను! మాయాపురి-కనఖల్-గా ప్రసిద్ధిచెందిన ఈ ప్రాంతంపై శైవమతప్రభావం అత్యధికంగావుంది.

శతద్రు నదిని దాటాక మధ్య దేశంపట్ల నా హృదయంలో శ్రద్ధ జాగృతమైంది. నేను మధ్యదేశపు పుణ్యభూమిలో నడుస్తున్నాను. ఈ దేశంలో తథాగతుడు పర్యటిస్తూ వుండేవాడు. వారి చరణ రేణువులు ఇక్కడి ధూళిలో ఇంకా ఉండివుంటాయి. గంగా యమునల మధ్య దేశమైన కురు భూమిలోనే బుద్ధ భగవానుడు అనేకమైన ధర్మోపదేశాల్ని ఇచ్చాడు. "ప్రతీత్య సముత్పాదం", "మహానిధానం" మొదలైన బౌద్ధ దర్శన సూత్రాలు ఇక్కడే ఆవిర్భవించాయి. కురు భూమికి తథాగతుని జన్మభూమి చాలాదూరం. ఇక్కడినుండి - కురుభూమినుండి - శ్రావస్తి వైశాలి, రాజగృహం, వారణాసి మొదలైన పట్టణాలకువెళ్ళాలంటె నెలల తరబడి ప్రయాణం చేయాల్సివుంటుంది. తథాగతుని జన్మస్థానానికి కురుభూమి ఇంతదూరంలోవున్నప్పటికీ, అతడు గంభీరమైనధర్మోపదేశాలను ఇచ్చింది ఈ కురుభూమిలోనే. కనుకనే, ఈ భూమికి ఇంతటి ప్రాముఖ్యత వచ్చింది. బుద్ధిలుడు హీనయాన, మహాయానాల్ని - రెండింటి సిద్ధాంతాల్ని తరచిచూశాడు వినయపిటకాన్ని బాగా అధ్యయనం చేశాడు. అతడిలా అనేవాడు; "వెనకటి ఆచార్యులు వినయ సూత్రాల్ని వ్యాఖ్యానిస్తూ ఇలావ్రాశారు: "కురుభూమి చాలా రమణీయమైంది. వాతావరణం అత్యంతానుకూలంగా వుంటుంది. కనుకనే. అక్కడిప్రజలు మహామేధావులూ, విద్యాప్రియులూ అయ్యారు. అక్కడి స్త్రీలుకూడా నీలాటిరేవు దగ్గర గంభీరమైన తాత్త్విక విషయాల్ని, ధార్మిక విషయాల్ని చర్చిస్తూంటారు!" ఆ ఆచార్యులు మరికూడా ఇలా వ్రాశారు "ఏకురుదేశంలో బుద్ధ భగవానులు తన అనాత్మవాదపు గంభీర దర్శనాన్ని ఉపదేశించారో, ఆ కురుదేశంలోనే కొద్ది శతాబ్దాల క్రితం ప్రవాహణుడూ, యాజ్ఞవల్క్యుడు ఆత్మవాదాన్ని వుపదేశించారు. ఏ కురుభూమిలో ఆత్మవాదం-ఉపనిషత్ తత్వజ్ఞానం - పుటి పెరిగిందో ఆ భూమిలోనే బుద్ధ భగవానుల అనాత్మవాదం సింహగర్జన చేసింది."

మా జ్ఞానం చాలా పరిమితం! మేము సాధారణంగా మా శాస్త్రాలను మాత్రమే పఠిస్తూవుంటాము. బౌద్ధ పరంపరల్ని గురించి, ఆచారా

లను గురించి మాత్రమే మాకు తెలుసును. బౌద్ధపరంపరల్లోనూ కేవలం మహాయాన, హీనయాన పరంపరలే మాకు తెల్సు. కానీ బుద్ధిలుడిజ్ఞానం చాలా విస్తృతమైంది. బ్రాహ్మణకులంలో జన్మించడం వలన బ్రాహ్మణ-శాస్త్రాల్ని గురించి, పరంపరానుగతమైన ఆచారాలను గురించి అతడికి బాగా తెల్సును. హీనయానపు అనేకమైన నికాయాల్ని - సాంప్రదాయాల్ని - గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. వాటి శాస్త్రగ్రంథాల్ని శ్రద్ధతో పఠించాడు. అయినప్పటికీ ప్రతివిషయాన్నీ అవిశ్వాసపుదృష్టితో చూస్తుంటాడు. మనలోని అనేకమైన పవిత్రభావాలనూ, విశ్వాసాలనూ మూఢనమ్మకాలనూ నవ్వేస్తాడు. అయితే, ఇతర మానవులపట్ల బుద్ధిలుడి ప్రవర్తన అతి నమ్రమంగానూ, సహృదయతతోకూడి వుంటుంది. అతడు ప్రజల ననుసరించమని చెప్పే మార్గాన్ని గురించి, నేను పూర్తి నిరాశను వ్యక్తపరిచేవాణ్ణి. అయితే, బుద్ధిలుడు నిరాశావాదికాదు, ఆశావాది. ఇలా అనేవాడు; "సత్యయుగం వెనక ఎన్నడో గడచిపోయిందనుకోవడం పొరబాటు : ఇకముందు రాబోయేదే సత్యకాలం. ప్రజల్లో విజ్ఞానం పెరుగుతోంది విజ్ఞానపు దివ్యకాంతిలో అజ్ఞానమనే అంధకారం అస్తిత్వాన్ని కోల్పోతోంది. అజ్ఞానాంధకారం దూరమైనకొద్దీ ప్రజాహితానికి మార్గం ప్రశస్తమౌతుంది!" బుద్ధిలుడికి చరిత్రాధ్యయనంపట్ల ఆసక్తి మెండు. అలాంటి మిత్రుడి మిత్రత్వంలో కొన్ని సంవత్సరాలు గడపగలిగినందుకు నే నెంతో గర్విస్తున్నాను. ఈ జీవితం ధన్యమైందనే భావిస్తున్నాను.

శృఘ్న రాజధాని యమునా నదికి కుడివైపున వున్నప్పటికీ, దాన్ని కురుభూమిలోని అంతర్ భాగంగానే భావిస్తుంటారు. గంగానదికి అవతల పాంచాలదేశం వుంది. బౌద్ధ దర్శన సూత్రాల్లో పాంచాలదేశాన్ని గురించి చదివాము. బుద్ధిలుడు ఆ దేశాల్ని గురించి ఇంకాకూడా అనేక విషయాల్ని తెలియజేశాడు. 'కురు. పాంచాల' అన్నవి జంటపదాలు. కనుక ఈరెండు జనపదాలకు సంబంధించిన ప్రజలూ. వెనక ఒకేజాతికి చెందినవారైనా అయివుండాలి, లేక సమీప నివాసులైనా అయివుండాలి! ఈ రెండు దేశాల మధ్యా తంచు యుద్ధాలుకూడా జరుగుతూందేవి. 'పాంచాల' అన్న పేరును గురించికూడా ఒక కథ వుంది. భూమ్యశ్వ మహారాజు

ఐదుగురుకుమారులకు తన రాజ్యాన్ని సమానంగా పంచేశాట్ట. ఐదుగురు పుత్రులకు ఆలయమైంది గనుక 'పాంచాల' అన్న పేరొచ్చిందా దేశానికి. అందరికంటె పెద్ద కొడుకుయొక్క ప్రపౌత్రుడు దివోదాసు. అతడి పుత్రుడు సుదాసు. ఈమహారాజులకాలంలోనే, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు. భరద్వాజుడు - మొదలుగాగల మహాఋషులు వేదాల్లోని అతిప్రాచీన మంత్రాల్ని రచించారు [చెప్పారు]. సుదాసు పదిమంది రాజులను జయించి తన రాజ్యసీమల్ని విస్తృతం చేసుకున్నాడు ఒకప్పుడు కురు పాంచాల దేశాలు, జంబూ ద్వీపమంతట్లోకి అద్వితీయమైనవిగా భావింప బడుతూండేవి. ఇప్పటికీ పాంచాల దేశం సమృద్ధయిన పంటలతో సస్య శ్యామలంగా వుంది. నగరలూ, గ్రామాలూ కనులపండువుగా ఉన్నాయి. అయితే, వెనకటిలా ప్రతాపవంతులైన రాజులు ఇప్పుడీ దేశంలో ఉద్భ వించడం లేదు. మధ్య దేశపు తూర్పు భాగమైన 'మగధ' ఒక రకంగా ప్రతాపవంతులైన రాజులకూ, రాజవంశాలకూ ఆటపట్టయింది. నంద, మౌర్య, శుంగ, గుప్త-మొదలైన రాజ వంశాలన్నీ మగధ దేశంలోనే పుట్టి, పెరిగి, అభివృద్ధికి వచ్చాయి. ఇప్పుడిప్పుడే పాంచాల దేశం వెను కటి ప్రాభవాన్ని పొందుతోంది. లక్ష్మి సరస్వతుల కేంద్రమౌతున్నది. పాంచాల దేశపు రాజధాని కన్యాకుబ్జం (కనోజ్) త్వరితగతిని అభివృద్ధి చెందుతోంది.

బుద్ధిలుడిలా అన్నాడు : "వెనుక పాంచాల దేశం హిమాలయ పర్వతాల్నుండి దక్షిణంగా, యమునానది యొక్క ఉభయతీరాల వరకూ వ్యాపించి వుండేది. కానీ, పాండవుల గురువైన ద్రోణాచార్యుడు, పాంచాలదేశపు రాజైనద్రుపదుణ్ణి ఓడించి, ఉత్తరపాంచాల దేశాన్ని లాగు కొన్నాడు. ఇక కేవలం దక్షిణ పాంచాల దేశం మాత్రమే ద్రుపదుడి అధీనంలో వుంది. ఆనాటి నుండి పాంచాల దేశం ఉత్తర దక్షిణాలుగా విభజింపబడ్డది. ఉత్తర పాంచాలదేశానికి 'అహిచ్ఛత్రం' 'దక్షిణ పాం చాల దేశానికి 'కాంపిల్య' రాజధాను లయ్యాయి. ఇప్పుడు 'కాంపిల్య' యొక్క మహత్వంకూడా క్షీణించింది. కన్యాకుబ్జం గొప్ప ప్రసిద్ధికి వచ్చింది. ఒక్క దక్షిణ - ఉత్తర పాంచాల దేశాలకే కాకుండా సమస్త మధ్య దేశానికే రాజధా నయింది కన్యాకుబ్జం. మౌఖరి వంశస్థుడైన

ఈశ్వరవర్మ కన్యాకుబ్జాన్ని పరిపాలిస్తున్నా డిప్పుడు. కురు, పాంచాల, కోసల, కాశీ, వజ్జి, విదేహ, వత్స, చేది. వ్రజ – మొదలైన దేశాలు ఈశ్వరవర్మ అధీనంలో వున్నాయి.

గంగానదిని దాటి పాంచాల దేశపు ఉత్తర భాగంలో – రుహేల్ ఖండ్ – సస్యశ్యామలమైన భూమిలో ప్రయాణం చేస్తున్నాము. ఖనఖల్‌కు దక్షిణ దిశగా వెళ్తున్నాము. భూమి సమతలంగా వుంది. చలికాలం. యవలు, గోధుమలు, పంట కొచ్చాయి. చల్లని గాలికి పంటలు తూగుతున్నాయి. భూమి ఆకుపచ్చని సముద్రంలా గుంది. అహిచ్ఛత్రంలో ఒక చిన్నరాజు వున్నాడు. ఇతడుకన్యాకుబ్జ మహారాజుకుఅధీనుడు. అహిచ్ఛత్రం వెనుకటివైభవాన్నిపూర్తిగాకోల్పోయింది. జీవన్మృతుడిలా గుంది. ఇక్కడ బౌద్ధ శైవమతాల ననుసరించేవారున్నారు. సమ్మితీయ నికాయపు సంఘారామా లెన్నో వున్నాయి. దాదాపు వేయిమందిదాకా భిక్షువు లున్నారు. శివాలయాలూ చాలా వున్నాయి. శైవ మతస్థులైన బైరాగు లెంతోమంది వున్నారా ఆలయాల్లో! నగరానికి వెలుపల నాగ సరోవరం వుంది. దాని ఒడ్డున అశోకుడు కట్టించిన స్తూపం వుంది. అక్కడి నాగరాజుకు బుద్ధుడు ఏడు రోజులు నూతన ధర్మాన్ని ఉపదేశించాడని అంటారు. అక్కడికి దగ్గర్లో భద్రకల్పపు నలుగురు బుద్ధుల జ్ఞాపకార్థం కట్టించిన స్తూపాలు నాలుగున్నాయి. శక – క్షత్రపుడైన ఫరగులుడు కట్టించిన విహారమూ ఒకటుంది. ఫరగుల విహారంలోని ఒక పాషాణ ప్రతిమపై "భిక్షు స్వధర్మ ఘోషస్య ఫరగుల విహారో అహిచ్ఛత్రాయా" అని చెక్కివుంది. దాన్ని చదివి బుద్ధిలుడిలా అన్నాడు: "బుద్ధుడు భిక్షువుల్ని అపరిగ్రహులు కమ్మన్నాడు. తథాగతుని ఆదేశం ప్రకారం భిక్షువులు వెండి బంగారాల్ని, ఇతర వస్తువుల్ని స్వీకరించ రాదు. తమ నిత్యావసరాలకు పనికివచ్చే ఎనిమిది వస్తువులు తప్ప భిక్షువులు ఇతర ఎలాటి సంపత్తినీ తమ ఆధీనంలో వుంచుకోకూడదు. కానీ, ధర్మఘోషుడు తథాగతుని ఆదేశాన్ని, ఉపదేశాన్ని గంగలో కలిపి, ఫరగుల విహారంలోని తన కుటీరాన్ని వెండి బంగారాల్తో అలంకరించుకున్నాడు!"

మేము ఫరగుల విహారంలోనే దిగాం. ఇక్కడి భిక్షువుల్లో విద్యాభి మానం అధికం! మా స్నేహితుడికి ఘనమైన ఆదరాభిమానాలు లభిం చాయి. మేము మహాయానులము. అక్కడి భిక్షువులు హీనయానులు. వసుబంధు, దిఙ్నాగుల ప్రమాణ శాస్త్ర గ్రంథాలు, ప్రజల హృదయా ల్లోని సంకుచిత భావాలను నశింపచేశాయి. లేకపోయినట్లయితే, భిక్షువుల సంకుచిత దృష్టికి మేము బాగా గురికావలసి వచ్చేది! ఫరగుల విహారం లోని ప్రాచీన స్తూపాలూ, ప్రతిమాగృహాలూ, విగ్రహాలూ ఎర్ర రాతితో చేసి వున్నాయి. ఆధునికమైన కొన్ని విగ్రహాలూ అవీ మాత్రం నల్ల రాతితో చెక్కి-వున్నాయి. బుద్ధిలు డిలా అన్నాడు : "శక క్షత్రపుల రాజ ధాని అయిన మధురకు చుట్టుపట్లవున్న పర్వతాల్లో ఎర్రరాయి సమృ ద్ధిగా వుంది. కనుకనే క్షత్రపులు కట్టించిన విహారాలూ, చెక్కించిన ప్రతి మలూ-అన్నీ ఎర్రరాతివే. తరువాత గుప్తరాజుల పరిపాలన వచ్చింది. పాటలీపుత్రం, అయోధ్య, గుప్తరాజుల రాజధానులు. వీరి కాలంలో గంగానదికి దక్షిణంగా వున్న వింధ్య పర్వతాల్లోని నల్లరాయి శిల్పాలకు అధికంగా ఉపయోగపడ్డది. ప్రాచీన పట్టణాల్ని, విహారాల్ని, స్తూపాలను శిథిలావస్థలో, హీనస్థితిలో చూసినప్పుడు నేనెంతో ఆత్మ వేదనను పొందేవాణ్ణి! అలాంటప్పుడు బుద్ధిలు డిలా అనేవాడు : శిథిలతనూ, వినా శాన్నీ చూసి చింతిలరాదు. నాశం లేకపోతే ఉత్పత్తిఎలా జరుగుతుంది? సంహారం లేకపోతే సృజనం ఎక్కడిది ?"

ఒకొక్కమాటు కోపంతో "నువ్వొట్టి సంహారవాది" వనేవాణ్ణి.

అతడు నవ్వి "సంహారవాదం, క్షణికవాదం, సర్వానిత్యవాదం— ఇవన్నీ ఒకే వాదపు వివిధ నామాలు! బౌద్ధులైన కారణంగా మీరూ ఈ వాదాల్ని తిరస్కరించలేరు ! కానీ, ఒక్క సంహారవాదాన్ని (ఈ విశ్వం క్షణక్షణం నాశనమౌతూన్నది; అవుతుంది అనేవాదం)మాత్రమే స్వీకరిస్తే మానవుడు నిరాశావాది అవుతాడు. తథాగతుడు ఈ ప్రపం చంలో దుఃఖం వుందని వప్పుకున్నాడు. కానీ, అతడు దుఃఖవాది కాదు. దుఃఖం అతడి ఆదర్శం కాదు. దుఃఖంనుండి బయటపడే మార్గమే తన లక్ష్యమని బుద్ధుడు చెప్పుకున్నాడు. అలాగే సంహారం మన

లక్ష్యం కాకూడదు. సంహారానంతరం జరిగే నూతనోత్పత్తి మన లక్ష్యం!" అనేవాడు.

అహిచ్ఛత్రంలో వుండగా మేము అనేకమార్లు శైవ మఠాలకూడా వెళ్ళాము. బుద్ధిలుడికి కీర్తికాంక్ష ఎంతమాత్రమూ లేదు. అతడి ప్రవర్తనలో, మాటల్లో కీర్తికాముకత ఇసుమంత అయినా కనుపించేది కాదు. కానీ, అతడు పోయిన ప్రతిచోటా ఘన గౌరవాన్ని పొందేవాడు. కీర్తికాంత అతణ్ణి తప్పక వరించేది. చిన్న వయస్సునూ, అపారమైన విద్యనూ, మధుర వాక్పటిమనూ చూసి శైవమతస్థులుకూడా బుద్ధిలుణ్ణి ఎంతో గౌరవించేవారు. శైవమతావలంబి అయిన బైరాగి, బౌద్ధ మతావలంబియైన భిక్షువు-వీరిద్దరూ జీవితమంతా, తీర్థయాత్రల్లో, పర్యటిస్తూ గడుపుతారు. వీరిద్దరూ పరస్పరం విభిన్న మతాల్ని అనుసరించేవారే అయినా 'యాత్రికులు'గా కొంత బాంధవ్యాన్ని, భ్రాతృత్వాన్ని కలిగి వుంటారు. కనుక మత సంబంధమైన భేదం వీరిలో భేదాన్ని కలిగించలేదు! బైరాగులు తెల్లని విభూతిని శరీరాలకు పూసుకుని జడల్ని పెంచుకొని వ్రతనిష్ఠలో మునిగివుంటారు. వర్ణాశ్రమ ధర్మాల్ని వప్పుకుంటారు గనుక వీరికి ఉచ్చకులాల్లోనూ మంచి గౌరవం లభిస్తూంటుంది. సహజమైన తమ సంకుచిత దృష్టి కారణంగా మమ్మల్ని వీరు హీనజాతివారుగా భావించి, చిన్నచూపు చూడవచ్చును. కానీ, అలాచూడరు. మేము గొప్ప పండితులమనీ, ప్రమాణ శాస్త్రం, యుక్తి మా కనుసన్నలలో మెలుగుతూ వుంటాయనీ వీరికి తెలుసు! కదాచితుగా, ఒక్కొ బైరాగి బుద్ధిలుడితో వాదించడానికి సిద్ధమవడం కూడా కద్దు! అయితే, అలాంటి బైరాగుల్ని బుద్ధిలుడు చిటికలు వేసిన మాత్రంగా ఓడించేసేవాడు. అతడు ఎన్నడూ తన విజయాన్ని గురించి గర్వపడలేదు. జ్ఞానాన్ని ప్రదర్శించడం అతడికి బొత్తిగా గిట్టని విషయం. మానవులలోని మంచిగుణాలను గ్రహించడమే అతడి ఆదర్శం. ఎప్పుడూ ఇతర్ల దోషాల్ని లెక్కించేవాడు హృదయాన్ని కుంచించుకుంటూ వుంటాడు. శాస్త్రం చదవడంవల్ల మానవుడు తెలివితేటల్ని ఆర్జించుకుంటాడు. దేశాలు తిరగడంవలన అజ్ఞానం నశిస్తుంది. మానవుడు జ్ఞాని అవుతాడు. ప్రపంచంలో ఏ మూల ఏం జరుగుతుందో తెలుసుకోగలుగు

తాడు. కనుక శాస్త్రాధ్యయనం, దేశాటనా చేయడం ప్రతివారూ చాలా ముఖ్యమైన విషయాలుగా భావించాలి !" అని అంటూండేవాడు బుద్ధిలుడు.

ఫరగులుడు శకవంశస్థుడు. అహిచ్ఛత్రంలోని బౌద్ధ విహారాన్ని అతడే కట్టించాడు. పురాతనమైన ప్రతిపవిత్ర స్థలంలోనూ శకులు కట్టించిన విహారాలు తప్పనిసరిగా వుంటాయి. ఈదేశంలోకి ముందుయవనులు వచ్చారు. తరువాత శకులువచ్చారు. అప్పుడు వీరికి కేవలం బౌద్ధ ధర్మములో మాత్రమే సమానత్వం కనుపించింది. కనుకనే యవనులూ, శకులూ లక్షలసంఖ్యలో బౌద్ధులయ్యారు. బ్రాహ్మణులు యవనుల శకుల ప్రభుత్వంముందు తలలయితే వంచారుగానీ, మత రీత్యా వారికి సమానత్వాన్ని ప్రసాదించలేదు. తథాగతుడు వర్ణవ్యవస్థనూ జాతికుల వ్యత్యాసాలనూ తిరస్కరించాడు. మానవులందరూ సమానులని ఉద్ఘోషించాడు. కనుక బౌద్ధవిహారాల్లో యవనులకు, శకులకు ఆదరణా, ఆత్మీయతా లభించాయి. శకులు ఈదేశంలో ఒక్క ఫరగుల విహారాన్నేకాదు ఇంకా అనేక విహారాలను నిర్మించారు. యవనులూ, శకులూ జాతిదృష్ట్యా బ్రాహ్మణ, క్షత్రియులకంటె తక్కువవారు కావచ్చును. కానీ, వారి చేతుల్లో ప్రభుత్వమువుంది. ప్రభువులు తల్చుకుంటే జరగనిది, అసాధ్యమైంది ఏముంటుంది? కాలక్రమంలో యవనులూ, శకులూ ఉచ్చ వర్ణాలకు చెందిన బ్రాహ్మణ క్షత్రియ కన్యల్ని వివాహమాడారు. ఇక నిప్పుడీ దేశంలో యవనులూ, శకులూ ఉన్నట్టేలేదు. అందరూ క్షత్రియులుగా, బ్రాహ్మణులుగా మారిపోయారు. శకులు సూర్యోపాసకులు. సూర్యుణ్ణి పూజిస్తారు. ఇప్పుడు స్వయంగా శకులే సూర్యులై పూజల్ని పొందుతున్నారు. వీళ్ళ సూర్యుడూ వీళ్ళలాగానే మోకాళ్ళవరకూ వుండే పొడుగాటి చెప్పుల్తో దేవాలయాల్లో దర్శనమిస్తూ వుంటాడు. శకులు తమ మంచు భూముల్ని వదలి భారతదేశానికి వచ్చినక్రొత్తల్లో ఇలాంటి పొడుగు చెప్పుల్నే ధరించేవారు. భారతదేశానికి వచ్చిన తరువాతకూడా, ఇక్కడి ఉష్ణవాతావరణం అనుకూలించక పోయినప్పటికీ ఎన్నో తరాలపాటు వారీపొడుగాటి చెప్పుల్నే ధరించారు. కానీ, ఇప్పుడీ పాదరక్షలను చూడాలంటే తుఖార్, కాంభోజ దేశాలకువెళ్ళాలి. భారతీయుల దేవతలెవరూ పాద

రక్షల్ని ధరించరు. ఇప్పటి శక బ్రాహ్మణులు పాదరక్షల్ని ధరించి దేవాలయాల్లోకి వెళ్ళడాన్ని చాలా తప్పుగా భావిస్తారు. కానీ, వీరి పూర్వీకులు మొదటగా ఈదేశానికి వచ్చినప్పుడు చెప్పుల్ని వేసుకునే దేవాలయాల్లోకి వెళ్ళేవారు. తమ మాతృదేశంలోని విపరీతమైన మంచులో. చలిలో చెప్పుల్తో దేవాలయాల్లోకి వెళ్ళడం తప్పుగా భావించేవారుకాటి ఆదే ఆచారాన్ని భారతదేశంలోనూ పాటించారు. కనుకనేఅప్ప టి వీరి దేవుడు (సూర్యుడు) పాదరక్షల్ని ధరించివున్నాడు. దేశకాలాం ననుసరించి, మానవుడు తన ఆచారాలనూ, పద్ధతులనూ మార్చుకుంటూ వుంటాడు. యవనులూ, శకులూ. యేధాలూ (శ్వేతహూణులు) చాలా ఎర్రగా వుంటారు. ఈ ఐదారు వందల సంవత్సరాల సుదీర్ఘ కాలంలోనూ వారి రూపాలూ చాలావరకు మారిపోయాయి. రూపాల్లోను, ఆచార వ్యవహారాల్లోనూ 'భారతీయత' అధికంగా కనిపిస్తోందిప్పుడు.

బుద్ధిలుడు "మేము శక-బ్రాహ్మణులం. శక-క్షత్రపులకు, మహాక్షత్రపులకు మధురవలెనే ఉజ్జయినికూడా అనేక సంవత్సరాలపాటు రాజధాని అయింది. మధుర, ఉజ్జయినీలలోని బ్రాహ్మణులు మొదటగా అక్కడి శకులకు బ్రాహ్మణత్వాన్నీ, క్షత్రియత్వాన్నీ ప్రసాదించారు, అప్పటి వర్ణాంతరులైన శకులే ఇప్పుడు ఉత్తమ బ్రాహ్మణులుగా, క్షత్రియులుగా భావింపబడుతూన్నారు. వెనక శకుల్లో వర్ణాంతర భేధాల్లేవు. దేవుడికి పూజలు చేయడానికీ, శత్రువుతో యుద్ధం చేయడానికీ, వ్యవసాయాధి కృషి కర్మల్ని చేయడానికీ అందరూ అర్హులే! యుద్ధ సమయాల్లో అందరూ ఆయుధాల్ని ధరించేవారు. శాంతిసమయాల్లో పశుపాలనో, వ్యవసాయమో చేస్తూండేవారు. అయితే, సాధారణ శకప్రజలకూ, సామంతులకూ వ్యత్యాసం ఆనాడూ వుండేది. నిజం చెప్పాలంటే, శక సామంతులూ, శక మహారాజులే బ్రాహ్మణ, క్షత్రియులుగా మారింది. సాధారణులు ఎటూ మారకుండా అలాగే వుండిపోయారు. కాలక్రమంలో రైతు లయ్యారు. ఇప్పటి కపిషా దేశంలోని, ఏధాల్లా, ఉద్యానవాసుల్లా శకులుకూడా వెనుక తిరుగుబోతు జీవితాన్ని గడిపేవారు అధిక సంఖ్యాకులైన శకులు తమ పశువుల్ని, గుర్రాల్ని మేపుకుంటూ తిరుగుతుండేవారు. వారంతా ఇప్పుడు రైతులుగా, వైశ్యులుగా మారిపోయారు. రాజ్యశక్తి, ధనము నశించాక

చాలామంది శకులు శూద్రులుగా కూడా పరిగణింప బడుతూన్నారు. రైతులుగా, శూద్రులుగా, వైశ్యులుగా మారిన శకుల్లో ఇప్పటికీ బౌద్ధ మతం ప్రచారంలోవుంది. ఉన్నత వర్గాలకు చెందిన శకులు బౌద్ధమతాన్ని వదిలి బ్రాహ్మణు లయ్యారు. బౌద్ధమతం మానవులందరూ సమాను లంటుంది. ఒకరిని ఉచ్చవర్ణుల్ని, మరొకర్ని నీచవర్ణుల్ని చేయడం బౌద్ధ మతంలో జరగదు. అందువల్లే ఉన్నత వర్గాలకు చెందిన శకులు బ్రాహ్మ ణులుగా. క్షత్రియులుగా మారిపోయారు. అంత ఎందుకు? మా వంశం బ్రాహ్మణ మతాన్ని స్వీకరించి, బ్రాహ్మణ వంశంగా ప్రసిద్ధిని చెందింది. బహుళంగా గౌరవాన్ని పొందుతూంది. మరి మా వంశం బౌద్ధమతాన్నే అనుసరిస్తున్నట్లయితే ఈ గౌరవమూ, ఈ ప్రత్యేకతా లభించేవా? ఇప్పటి రాజులూ, మహారాజుల్లోని అధిక సంఖ్యాకులు ఆ వెనుకటి శకుల సంతా నమే. ఇది ఒక రకంగా విపర్యయమే అవుతుంది. మానవులందరూ సమానులేనని ప్రచారం చేసినవారే, వర్ణాశ్రమ ధర్మాల్ని పోషిస్తూ మాన వుల్లో విభేధాల్ని కల్పిస్తూన్నారు!" అన్నాడు.

అహిచ్ఛత్రంలో మేము చాలా రోజులున్నాము. ఆభూమీ అక్కడి ప్రజలూ మాకెంతో నచ్చారు. గృహస్థులేకాక బైరాగులుకూడా మాపట్ల చాలా సభ్యతగా వ్యవహరించారు. వాళ్ళల్లో విద్యాప్రేమ అపారంగా వుంది. అక్కడినుండి బయల్దేరి, గంగను దాటి పశ్చిమంగా కొద్దిదూరం వెళ్ళి, దక్షిణ పాంచాల దేశాన్ని చేరాము. వెనక దక్షిణ పాంచాల దేశా నికి కాపిల్య నగరం రాజధాని. ఇప్పుడా నగరం ఓ చిన్న గ్రామంగా మాత్రం వుంది. గ్రామానికి చుట్టుపట్ల గత వైభవాన్ని తెలియచేసే శిథి లాలు చాలా దూరంవరకూ వ్యాపించి వున్నాయి. బుద్ధుడు ఈ నగరానికి వచ్చాడుట. అప్పుడీ నగరాన్నికింబిలా అనేవారు. అక్కడినుండి సంకా స్యకు వెళ్ళాము. ఇదీ ఒకప్పుడు గొప్ప పట్టణమే! అహిచ్ఛత్రం, సంకాస్య, కాంపిల్య మొదలైన నగరాల వైభవాన్ని దోచుకుని కన్యాకుబ్జం అభివృద్ధి కొచ్చింది. సంకాస్య ఒక చిన్న నదీతీరంలో వుంది. ఈనది కన్యాకుబ్జం వద్ద గంగను కలుస్తుంది. ఈ నదిలో వర్షాకాలంలో నీరు అధి కంగా వుంటుంది. అప్పుడు పెద్ద పెద్ద నావలుకూడా ప్రయాణం చేస్తూం టాయి. అన్యకాలాల్లో నీరు తగ్గుతుంది. పెద్ద నావలు ప్రయాణించలేవు.

కన్యాకుబ్జ నగరం గంగానది వడ్డున వుంది. గంగలో సర్వకాల సర్వావస్థ లోనూ నావలు తిరుగుతూ వుంటాయి. వ్యాపారం ముమ్మరంగా జరుగుతూ వుంటుంది. ఒకప్పుడు కాంపిల్య నగరంకూడా ఇప్పటి కన్యాకుబ్జంలాగానే వ్యాపారానికి కేంద్రంగా వుండేది. సంకాస్య బౌద్ధుల పవిత్ర తీర్థాల్లో ఒకటి. బుద్ధుడు తన తల్లి అయిన మాయాదేవికి ఉపదేశం ఇవ్వడానికి స్వర్గానికి వెళ్ళి ఒక వర్షాకాలాన్ని అక్కడే గడిపాడు. బుద్ధుడు స్వర్గా న్నుండి తిరిగి వచ్చేప్పుడు బ్రహ్మ, ఇంద్రుడూ చెరో ప్రక్కనా వుండి ఛత్ర చామరాల్ని పట్టారుట అతడికి. అతడు స్వర్గాన్నుండి నేరుగా ఈ సంకాస్యకే వచ్చాడుట బుద్ధిలుడు ఈ మొత్తం కథను అబద్ధమనే వాడు. అయితే, తన అభిప్రాయాన్ని నలుగురికీ చెప్పి అక్కడున్న భిక్షు వులలో తనపట్ల ద్వేషాన్ని పెంచుకోవడం అతడి అభిమతం కాదు. ఇక్కడా సమ్మతీయ నికాయపు భిక్షువులే అధికంగా వున్నారు. శివాల యాలూ, బైరాగుల మఠాలుకూడా అధికంగా వున్నాయి. పట్టణంలోని ప్రధాన విహారం చాలా అందంగా వుంది. బుద్ధభగవానుడు స్వర్గాన్నుండి దిగివచ్చిన మూడుమెట్లుకూడా ఇక్కడ వున్నాయి. "స్వర్గలోకాన్ని ఆర్య భట్టు తీవ్రంగా ఖండించాడు" అన్నాడు బుద్ధిలుడు. అశోకుడు వృషభా రూఢుడై స్వర్గాన్నుంచి దిగుతున్న శిలాస్థంభం వుందిక్కడ। అశోకుని సమయంలోనూ దేవతలు మహాపురుషులూ స్వర్గాన్నుండీ దిగుతారని నమ్మేవారుగావును.

## కన్యాకుబ్జం

సంకాస్యమండి నదీతీరాన్ననుసరించి కన్యాకుబ్జాన్ని చేరాము. ఉత్తర, దక్షిణ పాంచాల దేశాలు రెండూ ధనధాన్య సంపన్నమైనవి. మొత్తం మార్గంలో ఎక్కడా ఊసరభూమిగాని, అరణ్యాలుగానీ కను పించలేదు, పంట భూముల్తో, సుందరమైన, గ్రామాల్తో దేశం కళకళ్ళాడు తోంది. గ్రామాల దాపున మామిడి తోటలున్నాయి. దూరాలవరకూ పంట భూములున్నాయి. యవలూ, గోధుమలూ. పంటకొచ్చాయి. రాజధానిలో ప్రజలు చాలా ఎక్కువగా తోటల్ని పెంచుకున్నారు. రాజుకూ, రాజ కుమారులకూ, రాణీలకు, ప్రత్యేక ఉద్యానవనా లున్నాయి. చిన్న చిన్న

కాలువల ద్వారా ఈ ఉద్యానవనాలకు నీటిపారుదల చేస్తున్నారు. సాధార ణంగా రాజధానులు లక్ష్మీ నివాసాలుగా వుంటాయి. అయితే శత్రురాజులు దండెత్తివచ్చినపుడు, అధికంగా నష్టపోయేవీ, క్రూరమైన మృత్యులీలను భరించవలసినవీ ఈ రాజధానులే. కన్యాకుబ్జం, గంగానదికి పశ్చిమతీరాన గల ఉత్తమ నగరాల్లో ఒకటిగా వెనకే ప్రసిద్ధిని చెందింది. అయితే మౌఖరీలు పరిపాలన కొచ్చాకనే ఈ నగరానికి రాజధాని అయ్యే అదృష్టము పట్టింది. మౌఖరులు పాటలీపుత్రాన్ని, అయోధ్యనూ వదలి కన్యాకుబ్జాన్నే ఎందువల్ల రాజధాని చేసుకున్నారు ? వారణాసి, కౌశాంబిలాంటి ప్రాచీన నగరాలు ఎన్నో వున్నాయికదా ? వాటిలో ఒకదాన్ని ఎందుకు రాజధాని చేసుకోరాదు ? ఇదే విషయమై బుద్ధిలుణ్ణి అడిగాను. "మధ్యదేశానికి ప్రచండ శత్రువులైన శకులూ, యవనులూ, ఇతరులూ ఈ దేశానికి పశ్చిమాన వుంటారు; వీరిని ఎదిరించే ఏర్పాట్లు రాజ్యపు పశ్చిమ భాగాల్లోనే జరగడం ముఖ్యం. వారణాసిలోనో, కౌశాంబిలో వుండి వీరిని ఎదిరించడం అసంభవం. గంగానదియొక్క పశ్చిమ తీరాన గల కన్యాకుబ్జం, శత్రువుని ఎదుర్కొడానికి సైనిక స్థావరంగా పని చేస్తుంది, అసలు కన్యాకుబ్జం సైనిక సావర రూపంలోనే అభివృద్ధికి వచ్చింది, మధ్యదేశంమీద ప్రస్తుతము యేధాలు దాడి చేస్తున్నారు. స్థానేశ్వరపు మహారాజు వారిని ఎదిరిస్తున్నాడు. కన్యాకుబ్జంలోనే మౌఖరీల వంశం ప్రారంభమయింది. పశ్చిమంనుండి వచ్చే శత్రువుల్ని ఎదుర్కొనే వుద్దేశంతోనే వారీ నగరాన్ని రాజధాని చేసుకుని దేశాన్ని పరిపాలిస్తున్నారు !" అన్నాడు బుద్ధిలుడు.

"ఐతే ఈ దేశానికి శత్రువులు పశ్చిమంనుండి వస్తారు గనుక కన్యాకుబ్జం రాజధాని అయిందంటావు. మరిక తూర్పునగల పట్టణాలకు రాజధాని అయ్యే సౌభాగ్యం లభించదుకద? గంగలాంటి మహానదిఒడ్డున వున్న ఈ కన్యాకుబ్జమే ఎప్పుడూ రాజధానిగా వుంటుందేమో ?"

"అలా జరగదు. ఎల్లప్పుడూ ఒకే పట్టణం రాజధానిగా వుంటుందనుకోవడం పొరపాటు ! ఏ విషయంలోనైనా ఎప్పుడూ ఏ ఒక్కరిదో పై చేయిగా ఉండడమనేది ప్రకృతి నియమాలకే విరుద్ధం. కన్యాకుబ్జం వ్యాపార దృష్ట్యా, సైనిక దృష్ట్యా అనుకూలమైన ప్రదేశంలో వుందని

మాత్రం చెప్పగలం. రాజధాని కేవలం ధనధాన్యాలకు నిలయమే కాదుగా? ప్రచండ సైనిక శక్తికి ఆలవాలమై వుంటుంది కూడాను. కనుకనే ఈనాడు కన్యాకుబ్జం వైపు కన్నెత్తి చూడడానికి ఏ శత్రురాజుకూ దమ్ములు చాలవు. శత్రువుకు పక్కలో బల్లెంలా వుండి, అనుక్షణమూ యుద్ధానికి సిద్ధంగా వుండాలంటే ప్రధాన యుద్ధక్షేత్రానికి దగ్గరలో రాజధాని వుండటం అవసరం. ఇప్పట్లో మధ్యదేశానికి ప్రధాన యుద్ధక్షేత్రం స్థానేశ్వరము. దాని చుట్టూవున్న ప్రదేశాలు, నదులు ప్రయాణాలకూ, వ్యాపారానికి సుగమ మార్గాలైనన్నాళ్లూ కన్యాకుబ్జం తప్పకుండా మధ్యదేశానికి రాజధానిగా వుంటుంది" అన్నాడు బుద్ధిలుడు.

వెనుక ఒకమాటు గుప్తరాజులు, హరివర్మను తమ పశ్చిమ స్కంధావారానికి నాయకుణ్ణిచేసి, కన్యాకుబ్జానికి పంపించారు. ఈ కన్యాకుబ్జమే ఒకనాటికి రాజధానిగా మారుతుందని ఆనాటి గుప్తరాజులు వూహించలేకపోయారు. బలవంతులైన సామంతులూ, సేనానాయకులు అదనుచూసి, రాజుల్ని గద్దెదింపి, తామే రాజులై సింహాసనాల్ని ఎక్కడం సహజమైన విషయం! సామంతులూ, మహారాజాధిరాజ పరమ భట్టారకులూ ఒకే వర్గానికి చెందినవారు. కనుకే, వారిలో పరస్పరం ఇచ్చి పుచ్చుకోవడాలు కూడా జరుగుతుంటాయి. హరివర్మ కొడుకు ఆదిత్యవర్మ. ఇతడి రాణీ గుప్తవంశపు ఆడబడుచు. ఈమె కుమారుడు ఈశ్వరవర్మ గుప్తవంశానికి దౌహిత్రుడు. మాలవ రాజయిన యశోవర్మ మిహిరకులుణ్ణి ఓడించాడు. యశోవర్మకు తోడునీడగా నిలచి, సహకారానిచ్చాడీ ఈశ్వరవర్మ! ఇతడు హూణుల పరాజయానికి తోడ్పడ్డనాటినుండీ కన్యాకుబ్జపు భాగ్యరేఖ బయటపడ్డది. మగధలోని కుమారగుప్తుడు ఈశ్వరవర్మ తన సామంతుడని అంటూండేవాడు. అయితే, నోటితో అన్న మాత్రంచేత ఎవరూ ఎవరికీ సామంతులు కారుగా? సామంతుడయిందీ కాందీ, నిర్ణయించేది కరవాలం! యశోవర్మ అనంతరం ఈశ్వరవర్మ శక్తి సామర్థ్యాలు ఇంకా అభివృద్ధి అయ్యాయి. ఒకమాటు ఈశ్వరవర్మకూ, కుమారగుప్తుడికి యుద్ధం సంఘటిల్లింది. కన్యాకుబ్జపు చరిత్ర అతిప్రాచీనమైనది. అయితే దాని వైభవం

మాత్రం మౌఖరీ సేనాపతి అయిన హరివర్మ కాలంనుండే ప్రారంభ మయింది.

పట్టణం తీవ్రగతిని అభివృద్ధి చెందుతోంది. గంగాతీరాన క్రోసుల దూరం వరకు నగరం వ్యాప్తిచెందింది. పట్టణానికి చుట్టూ నగర ప్రాకారం వుంది. ఎన్నో భవనాలూ, సౌధాలూ వున్నాయి. ఇంకా క్రొత్తవాటిని నిర్మిస్తున్నారు. నూతనంగా నిర్మింపబడుతున్న భవనాలు పట్టణం క్రొత్తగా అభివృద్ధికి వస్తోందని తెల్పుతున్నాయి. క్రొత్తగా నిర్మిత మౌతూన్న పట్టణంలోని వెనుకటి ఉద్యానాలూ, కోటలూ రాజు లకూ, సామంతులకూ నివాసాలుగా మారుతున్నాయి. క్రొత్తపట్టణానికి బయట మళ్ళీ క్రొత్తగా తోటల్ని పెంచుతున్నారు. ఈ తోటల్లోని అంద మైన చిన్న ఇండ్లు స్వచ్ఛ సరోవరాలూ చూడ ముచ్చటగా వుంటాయి. మేము పర్వత ప్రాంత నివాసులము. సహజ ప్రకృతి సౌందర్యాన్ని చూడటానికి అలవాటు పడ్డాము. మైదాన ప్రదేశాల నివాసులూ ప్రకృతి సౌందర్యావలోకనంలో ఆసక్తిని కలిగివుంటారు। అయితే పర్వత ప్రాంతీయులు అనుక్షణమూ చూస్తూండే సహజ సౌందర్యం మైదాన వాసులకు దుర్లభమవుతుంది. వారు ప్రకృతి మాతను కృత్రిమాలంకా రాల్తో నింపి తమ సౌందర్య పిపాసను చల్లార్చుకుంటారు. దేవా లయాలూ, విహారాలుకూడా పట్టణ సౌందర్యాన్ని ఇనుమడింపచేస్తాయి. కనుకనే, కన్యాకుబ్జ మహానగరంలో దేవాలయాల సంఖ్య, విహారాల సంఖ్య నానాటికి పెరిగిపోతూంది. ఇక్కడ జైనమఠాలూ శివాలయాలూ అనేకం వున్నాయి. హీనయాన, మహాయాన బౌద్ధ విహారాలుకూడా అధి కంగానే వున్నాయి. ఇక భిక్షువులు వేల సంఖ్యలో వున్నారు. కన్యాకుబ్జ పట్టణ పుట్టుకను గురించి బౌద్ధ భిక్షువులు ఓ కథను చెప్పారు.

"పూర్వం పాంచాల రాజైన బ్రహ్మదత్తుడి వద్దకు ఒక ఋషి వచ్చాడు. రాజు, ఋషిని సంతోషపరచడానికి తన కన్యలందరినీ అతడికి ఇచ్చేశాడు. కురూపి అయిన ఋషిని పెండ్లాడడానికి రాజకన్యలందరూ తిరస్కరించారు. ఒక్క చిట్టచివరి కన్యమాత్రం, తండ్రికి ఎక్కడ అరిష్టం జరుగుతుందోనన్న భయంతో, వివాహానికి అంగీకరించింది. రాజకన్యలు తనను వివాహమాడ నిరాకరించారని తెలియగానే ఋషి

వాళ్ళను శపించాడు. రాజకన్యలు కుబ్జలయ్యారు. కుబ్జలయిన కన్యలకు సంబంధించింది కావడంవల్ల నగరం కన్యాకుబ్జమయింది."

పై కథనే బ్రాహ్మణులు మరోరకంగా చెప్తారు. "కన్యాకుబ్జపు ప్రాచీన నామం 'మహోదయం.' 'మహోదయా'న్ని పాలించే కుసీనాభుడి నూర్గురు కన్యలూ ఋషి శాపం వలన కుబ్జలయ్యారు. కనుకనే 'మహోదయం' కన్యాకుబ్జమయింది!" అంటారు బ్రాహ్మణులు.

వినయ పిటకంలోని ప్రసంగాన్ని చదివి "బుద్ధుని కాలంలోనూ ఈ నగరం పేరు కన్యాకుబ్జమే" నన్నాడు బుద్ధిలుడు.

పట్టణానికి వాయవ్య దిశగా అశోక స్తూపంవుంది. ఇక్కడే తథాగతుడు ధర్మోపదేశా లిచ్చాడని అంటారు. ఒక చిన్న స్తూపంలో బుద్ధుని కేశ నఖ ధాతువులు భద్రపరచబడ్డా యిక్కడ. కన్యాకుబ్జం అతి ప్రాచీన పట్టణం. అయినప్పటికీ, రాజధానయి ఇంకా ఒక శతాబ్దమయినా కాలేదు. నగరం ఇప్పుడు నిండు వైభవాన్ని అనుభవిస్తున్నది. నేను, కపిషా, కాశ్మీర దేశాల్లోని పట్టణాల నెన్నింటినో చూశాను. భారత దేశంలోని పాటలీపుత్రం, ఉజ్జయినీలాంటి గొప్ప పట్టణాలనూ చూశాను. పై నగరాల్లోని ఆకాశాన్నంటే హర్మ్యాలనూ, విశాలమైన రాజవీధులనూ చూశాను. రాజాంతఃపురాల్లోని వైభవం కనులకు మిరుమిట్లు గొలుపుతూండేది. నగరోపరాంతంలోని ఉద్యాన - భవనాలు స్వర్గఖండాల్లా గుండేవి. ఉన్నతవర్గాల ప్రజల శాలీనత, స్వచ్ఛత, సాహిత్యప్రేమ, కళల్లో వారికివున్న అభినివేశం, ధర్మ పరాయణత నిజంగా కొనియాడదగినవి! నే వెళ్ళిన ప్రతి నగరంలోనూ పై విషయాలనే పరికిస్తూండేవాణ్ణి. దీపం క్రింద క్రీనీడ వుంటుందన్న విషయం అప్పట్లో నాకు తెలియదు. బుద్ధిలుడు అదోతరహా మనిషి! అతడి మిత్రత్వం నా కండ్లను తెరిచింది చిత్రం యొక్క రెండవ వైపును చూడగల జ్ఞానాన్ని ప్రసాదించింది. బుద్ధిలుడు హేతువాది. బుద్ధికి గ్రాహ్యం కాని ఏ విషయాన్నీ అతడు విశ్వసించడు; అయినప్పటికీ అతడి హృదయం కరుణాపూరితం! అతడి శాంత, గంభీర, సుందర వదనాన్ని చూస్తే ఎలాంటి అపరిచితులకూ మిత్రభావం కలుగుతుంది. ఎంత అపరిచిత ప్రదేశంలోనైనా అధి

కంగా భిక్ష లభిస్తుంది. తనకు ఆ పూటకు అవుసరమైన ఆహారం తీసుకుని, మిగిలిన భిక్షతో అన్నార్తుల ఆకలిని తీర్చేవాడు. ఆకలిగొన్న పసిబాలురను చూసి సహించేవాడు కాదు. తను పస్తువులుండి అయినా వాళ్ళకు తన ఆహారాన్ని పెట్టేవాడు. అతడిలా అనేవాడు:"ప్రపంచంలో అపారదుఃఖం వుందన్నమాట నిజం! ఈ సత్యాన్ని బుద్ధుడూ ఒప్పుకున్నాడు. అయితే, ఈ దుఃఖం అకారణమైందీ, సహజసిద్ధమైందీ కాదు. ప్రపంచంలోని ఈ దుఃఖానికి అసహజములైన (మానవ కల్పితములైన) ఏవో కొన్ని కారణాలు వున్నాయి. పైగా ఈ ప్రపంచంలో నిత్యమయింది, శాశ్వతమయింది – ఏ ఒక్కటీ లేదు. చరాచర వస్తుజాలమంతా నిత్యం పరివర్తన చెందుతోంది. కనుక దుఃఖ కారణాలు కూడా పరివర్తన చెందడం సహజం! వాటిని నిరోధించడం సంభవం! బుద్ధుడు తన ధర్మం "బహుజన హితం కొరకు, బహుజన సుఖం కొరకు" ప్రయత్నిస్తుందని చెప్పాడు. కాని, ఈనాడు మన కండ్ల ఎదుట ఏం జరుగుతోంది? మనం చూస్తున్నదేమిటి ? నూటికి 75 మంది మానవులు దుఃఖంలో మునిగిఉన్నారు. వారినా దుఃఖసముద్రం నుండి తరింపచేయడం మన ప్రథమ కర్తవ్యం! కొద్దిమంది మానవులు అపారమైన సుఖసౌఖ్యాల్లో తేలియాడుతున్నారు. అలా సౌఖ్యాల్ని అనుభవించటం తమ పూర్వజన్మ సుకృతమని వారంటున్నారు. పదిమంది పూర్వజన్మ సుకృతాల్ని సార్థకపరుచుకోవడానికి 90 మంది పశువుల్లా చాకిరీ చేయడం ముఖ్యమైతే, ఆ 90 మందిలోనూ 20 మంది పశువులకంటె అధములైన బానిసలయితే, అలా కావడమే సనాతన ధర్మమయితే, ఈ ప్రపంచం నిత్యం మారుతూంటుందనే బుద్ధుని ప్రవచనం అబద్ధమౌతుంది; దుఃఖ నివారణకు మార్గాలున్నాయనే బుద్ధుని సూత్రం అసత్యమౌతుంది! బుద్ధుడు మానవులకే కాకుండా, దుఃఖంలోఉన్న పశుపక్ష్యాదులకుకూడా సేవచేయమన్నాడు. జాతక కథల్లో ఎక్కడ చూచినా దర్శనమిచ్చే ఆదర్శం ఇదేగా? అలాంటప్పుడు దుఃఖితులైన మానవులకు సేవచేయడం. వారి నా దుఃఖంనుండి ఉద్ధరించడము మన పరమ ధర్మంకాదా ?"

నా దృష్టిని రాజప్రాసాదాలనుండి, భవ్యహర్మ్యాలనుండిమరల్చి, పడిపోయిన. కప్పులేని పూరిగుడిసెల వైపుకు త్రిప్పిన శ్రేయం బుద్ధి. లుడికే దక్కుతుంది. ఇప్పుడు నాదృష్టి అందంగా అలంకరించుకున్న గులాబీముఖాల వైపుకుపోదు; అన్నవస్త్రాలు లేక, కృశించి, అకాలంలో వృద్ధులైన దరిద్ర మానవులమీదకు పోతుంది. నాలోని దోషా లేమిటో నాకుతెలుసు. నేను పూర్తి నిస్వార్థుణ్నికాదు. నేను స్వీకరించిన ధార్మిక వ్రతా లన్నింటినీ సక్రమంగా ఆచరించనూ లేదు. అయితే, దుఃఖంలో, బాధల్లోఉన్న మానవుల్నిచూసి చాలా బాధపడతాను ! వాళ్ళ దుఃఖాన్ని అణుమాత్రమైనా తగ్గించడానికి నాలోని ప్రత్యణువూ తహ తహలాడుతుంది, బుద్ధయానాన్ని అధిష్ఠించనప్పటికీ నాకండ్లకు సర్వత్రా అంధకారమే, విషాదమే కనుపించేది! దుఃఖాలను నిర్జించి బహుజనులు (సాధారణప్రజలు) సుఖాల నెలాపొందగలరు? ఆకలితో అలమటిస్తున్న ఈ నిర్బలహస్తాలే మహాహర్మ్యాలను నిర్మించాయి. కన్యాకుబ్జపు రాజ ప్రాసాదంలో దేవేంద్రశక్రుడి మహావైభవాన్ని కండ్లారా చూచాను. ఆ మహా విభవానికంతటికీ కర్తలు నూటికి తొంభై మందిగాఉన్న ఈ దరి ద్రులే, బహుజనమే! గ్రామాల్లో,సాధారణంగా,ప్రాసాదాలకు ప్రక్కనే గోతులుండడాన్ని జూస్తుంటాము. ఆ భవనాల నిర్మాణానికే ఈ గోతులు తవ్వాల్సి వస్తుంది. అలా ఉండరాదు. విభవం,సుఖం, ఆరోగ్యం – ఇవి ఏ కొద్దిమందికో చెందరాదు. మానవులందరికీ చెందాలి.

తథాగతుడు ఈ ప్రపంచంలోని ఏ ఒక్కటీ శాశ్వతమైంది కాదని చెప్పాడు. అన్నీ అశాశ్వతమైనవే! క్షణికాలే! మానవుడికి జ్ఞానము వుంది. వీర్యం వుంది. పరాక్రమం వుంది. వీటి ద్వారా భవిష్యత్తునే మార్చవచ్చు. తథాగతుడలా మార్చాడు. ఈ ప్రపంచమనే మహోగ్ర దుఃఖసాగరంలో "శాంతి", "త్యాగ"మనే ద్వీపాలను స్థాపించాడు. మాన వుడు వ్యక్తిగత స్వార్థాన్ని వదలి. మరికొంచెం ముందుకుపోయి ఆలో చించినట్లయితే సామూహిక సుఖంలోనే తనసుఖమూ యిమిడి ఉందని తప్పక తెల్సుకుంటాడు. బోధిసత్వుడు ఆకలిగొన్న పులికి తనశరీరాన్ని అర్పించాలని నిశ్చయించుకున్నాడు. పులి తన కరాళ గళాన్ని తెరచి బుద్ధుని వైపు లంఘించింది. అప్పుడు బుద్ధుడు భయపడలేదు. దుఃఖపడ

లేదు. పరమానందాన్నీ, పరమ సుఖాన్నీ పొందాడు. ఈ మహాత్యాగాన్నే మహదానందాన్నే పారమిత (పరాకాష్ఠ)అన్నారు. బుద్ధుడు ఈ ప్రపంచంలోని దుఃఖాన్ని నాశం చేయవచ్చన్నాడు. మార్గాన్నికూడా చెప్పాడు. బుద్ధుడు చెప్పిన మార్గాన్ననుసరించి, యీ ప్రపంచంలోని దుఃఖాన్ని నాశంచేసే మహాపురుషుడు తప్పక ఉద్భవిస్తాడు. ఈ ప్రపంచం సుఖమయమయ్యే సమయం,మానవులందరూ సమానులూ, మహోన్నతులూ అయి, దివ్యమైన జీవితాల్ని గడిపే సమయం తప్పక వస్తుంది. మా ఉద్యాన భూమిలోనూ వ్యత్యాసముంది. ధనికులకూ, బీదలకూ మధ్య, కులీనులకూ, అంత్యజులకూ మధ్య యిక్కడున్నంత ఘోరవ్యత్యాసం మాత్రం మా ఉద్యాన భూమిలో లేదు. బ్రాహ్మణులూ, క్షత్రియులూ, రాజులూ, పురోహితులూ, తామీ పృథ్వీకే స్వాములమని చెప్పుకుంటున్నారు. దివ్యభోగాల ననుభవిస్తున్నారు. కానీ శూద్రులూ, ఛండాలులూ మనుష్యులమని చెప్పుకోవడానికికూడా వీల్లేదు. తథాగతుడు ఈ వ్యత్యాసాన్ని తిరస్కరిస్తూ "పుట్టుకతోటి, జాతివలన ఎవరూ గొప్ప వారూ, కులీనులూ కాలేరు. తమ శీల,సదాచారాలవల్లనే మానవులు గొప్ప వారవుతారు!" అన్నాడు.

యీ విషయాల్ని గురించి తరచుగా మేమిద్దరమూ చర్చిస్తుండేవాళ్ళం! ఒక్కోప్పుడు జాతి, కుల వ్యత్యాసాల పోషకులైన బ్రాహ్మణులతోటి ఈ విషయాల్ని గురించి తర్కించేవాళ్ళం? బ్రాహ్మణులు, హెచ్చు,తగ్గుల వ్యత్యాసాలు ప్రకృతి సహజాలనేవారు. కనుకనే,ఉన్నత కులాలకు చెందినవారు ఎర్రగా వుంటారు. నీచ కులాలవారు నల్లగా వుంటారు అనేవారు. కాని, వారి వాదన అంత సబబైందికాదు. జంబూ ద్వీపంలోని ఉన్నత కులాలకు చెందినవారు ఎర్రగా వుండేమాట నిజమే. అయితే, వారిలో నల్లనివారూ లేకపోలేదు. పైపెచ్చు, నీచకులజుల్లోనూ, పశువుల్లా అమ్ముడుపోయే దాసదాసీల్లోనూ ఎర్రనివాళ్ళు ఎంతోమంది వున్నారు. చాలా దూరదేశాల్నుంచి, ఎర్రని దాసుల్ని (బానిసల్ని) ఎక్కువ ధర పెట్టి కొనుక్కొచ్చి భారతదేశంలో అమ్మడాన్ని చూస్తూనే వున్నాము. మరి ప్రపంచంలో ఉద్యానంలాంటి దేశాలుకూడా చాలా ఉన్నాయిగా? ఆ దేశాల్లోని ఉత్తమకులజులూ, నీచ కులజులూ అందరూ

ఎర్రగానే వుంటారు, నేను అవారులనూ, తురుష్కులనూ చూశాను. వారిలో సహజంగా రంగు భేదాలు ఏమీ లేవు. ఈ చీనా దేశంలోనూ, దాసులూ- యజమానులూ, పేదలూ, ధనికులు అనే భేదా లున్నాయి. అయితే, రంగు భేదాలూ, ఆకృతి భేదాలూ లేవు. జంబూ ద్వీపంలోని బానిసలు, నల్లగానో, చామనఛాయగానో' ఉంటారన్నది నిజం! అలాగని, నల్లని వారందరూ దాసులో, శూద్రులో, ఛండాలురో అనడం సమంజసం కాదు.

తథాగతుని చరణధూళి స్పర్శతో పునీతాలైన పవిత్రస్థలాల నెన్నింటినో చూశాను. ఆయా స్థలాల్లోని పవిత్ర ధాతువు న్నీ నిజమైనవే నని నేను నమ్మడంలేదు. అయినా, ఆ ప్రదేశాలనూ, ఆ ధాతువులనూ చూస్తూన్నపుడు భావావేశంలో మైమరచేవాణ్ణి. "బుద్ధుడు ఇక్కడికి వచ్చాడు. ఇక్కడ తిరిగాడు. ఇక్కడి ప్రజలను ఆది, మధ్య, పర్యవసాన కళ్యాణాల్ని గురించి ఉపదేశించాడు" అనే ఊహల్తో పులకిత హృదయుణ్ణయ్యేవాణ్ణి! "ఎంతమంది వారి ఉపదేశాల్ని విని, తమ స్వార్థాన్ని తగ్గించుకుని ఇతర్లకు మార్గదర్శకులయ్యారో?" అని అనుకునే వాణ్ణి. అలా అనుకున్నప్పుడు, ఒక్క క్షణకాలం, నా చుట్టుపట్లఉన్న బాధాకరమైన పరిస్థితుల్ని మర్చిపోయేవాణ్ణి! జన్మభూమిని - ఉద్యానాన్ని వదిలాక నేను చూసిన వైభవోపేతమైన మహానగరం కన్యాకుబ్జమే. ఈ నగరాన్ని చూశాకనే నాలో ఇలాంటి క్రొత్తరకం భావాలు కలిగాయి.

# 7వ అధ్యాయము

# మగధ

(క్రీ. శ. 544-45)

మేమిద్దరమూ కన్యాకుబ్జం నుండి బయల్దేరాము. వేసంగుల్లో
మధ్యాహ్నానంతరం ఎండ తగ్గాక ప్రయాణం సాగించేవాళ్ళం. తిరిగి
ప్రొద్దు క్రుంగక ముందే ఏదో ఒక విహారాన్ని చేరుకునేవాళ్ళం. కాశ్మీరం
కపిషా, తక్షశిల, సంకాస్యస్త్రుఘ్ను మొదలైన పట్టణాల్లో, వివిధ దేశాలకు
చెందిన భిక్షువుల్ని అనేకుల్ని కలుసుకున్నాం; వాళ్ళ సాయంతో మార్గ
మధ్యంలో అవసరమైన ప్రతిచిన్న విషయానికి వివరాలను వ్రాసుకో
వచ్చు. కానీ, మేము అలా వ్రాసితెచ్చుకోలేదు. ఎక్కడికక్కడ రాబోయే
మజిలీని గురించిమాత్రం వివరాలుతెల్సుకుంటూ వుండేవాళ్ళం. కాంపిల్య,
సంకాస్య, ఆలవికా_మొదలైన పట్టణాలుకూడ పాంచాల దేశంలోవే.
వీటిని చూసుకుంటూ కౌశాంబి వెళ్ళాలని మా ఉద్దేశం. కన్యాకుబ్జాన్ని
విడిచాక మా మొదటి మజిలీ ఆలవికా. బుద్ధిలు డిలాచెప్పాడు: "ఇక్కడ
ఆలవకుడనే యక్షుడు వుండేవాడు అతడు పాంచాల చండుడని ప్రసిద్ధి;
మహా ముక్కోపి! ఓమాటు బుద్ధుడిమీదకూడా తన కోపాన్ని చూపుదా
మనుకున్నాడు. అయితే అతడి ఆటలు బుద్ధుడి ముందు సాగలేదు. లొంగి
పోయాడు!"

కాశ్మీరాన్ని దాటాక మేము సమతల భూమిలో ప్రయాణం చేస్తు
న్నాము. స్త్రుఘ్న, ఖణగల్ వరకు హిమాలయ పర్వతాలు కనబడు
తూండేవి. ఇప్పుడవి కనబడడం లేదు. దారిలో అక్కడక్కడా గ్రామాలు
తగుల్తున్నాయి. మామిడి, ఇతర పండ్ల చెట్లూ కనుపిస్తున్నాయి. క్రీడో
ద్యానాల్లో నారింజ, సీమరేగి, అంగూర్ మొదలైన చిరపరిచితమైన

పండ్ల చెట్లు వున్నాయి; అయితే వీటిలో అరుచిఏది ? విహారాల్లోని ఉద్యాన వనాలు, పండ్లచెట్లతో అందంగా చూడముచ్చటగా వుంటాయి. వేసవి కాలంలో పెద్దపెద్ద వృక్షాలూ, కూరల మళ్ళూకాక ఇతర పచ్చదనా లేవీ కనుపించవు. ప్రకృతిలో ! మార్గమధ్యంలో అడవులూ తగులుతున్నాయి. ఈ అడవుల్లో సింహం, పులీ, ఏనుగులాంటి క్రూర జంతువులేవు. అయినా వీటిలో ఒంటరిగా ప్రవేశించడం క్షేమం కాదు. యాత్రికులు సార్థవాహాల్లో కలిసి ఈ అడవుల్ని దాటుతుంటారు.

మేమింత వరకు స్థలమార్గాన్నే ప్రయాణం చేశాము. జలయాత్రానందాన్ని కూడా పొందాలని అనుకున్నాం. ఆలవికనుండి యమునానది మీద జలయాత్ర చేయాలని నిశ్చయించుకున్నాము. సాధారణంగా మధ్యదేశ ప్రజలు భిక్షువుల పట్ల భక్తిశ్రద్ధల్ని అధికంగా కనబరుస్తూంటారు. స్థల జల మార్గాల్లో ప్రయాణాలుచేసేసార్థవాహాలు సాధు పురుషుల సేవకు సదా తత్పరులై వుంటారు. ఆలవికను దాటాక మేము ఆగ్నేయ దిశగా ప్రయాణం చేస్తున్నాము. గంగా యమునల మధ్య భూమి చాలా మనోహరంగా వుంది. ఈ రెండు నదులకు పవిత్ర నదులని, వీటి నీరును పుణ్య తోయాలనీ ఇక్కడి ప్రజ లంటుంటారు. వీరికి తమ దేశాన్ని గురించిన అభిమానం చాలా అధికం ! తమ మాతృభూమిని గురించి అభిమాన పడడం మానవ సహజం ! అంతెందుకు. ఎప్పుడూ గ్రామాన్ని విడని బయటి ప్రపంచాన్ని చూడని వ్యక్తికి తన గ్రామంమీద అభిమానం అధికంగా వుంటుంది. అలాగే, తన గ్రామపు పరిసరాల్తోనూ, ప్రాంతంతోనూ పరిచయమున్న వ్యక్తికిప్రాంతీయాభిమానంవుంటుంది. దూరదేశాల్లో వున్నప్పుడు, తన గ్రామం, తన జనపదం, తనప్రాంతం- వీటి మధురమైన ఆకర్షణ మానవుల్ని ముగ్ధుల్నిచేస్తుంది. మేము గంగా యమునల మధ్య ప్రదేశంలో (అంతర్వేది) పర్యటిస్తూన్నప్పుడు ఎన్నో మార్లు ఉద్యాన భూమి జ్ఞప్తికివచ్చింది. "ఎత్తయిన పర్వతాలు, సూటిగా ఆకాశంలోకిపొడుచుకు పోయిన ఆకుపచ్చని దేవదార్లూ, గలగలా ప్రవహించే నదులూ ఎంత అందంగా వుండేవో !" అనుకునేవాణ్ణి. కానీ, మధ్యదేశంలోని ప్రజలు విశాలమైన, శాంతంగా ప్రవహించే నదుల్ని చూసి గర్వ పడటం, ఆనందపడడం సహజం. మధ్యదేశపు ఎండల్ని

నేను సహించలేకపోవచ్చు. కానీ, అక్కడి ప్రజల కవి సహజమేగా. జ్యేష్ఠ, ఆషాఢ మాసాల్లో ఎండల్ని భరించడం అసంభవంగా వుండేది. ఆ రెండు నెల్లూ ఎటూ పర్యటించేవాణ్ణి కాదు. వడదెబ్బ తగిలి చని పోతానేమోనని భయపడుతుండేవాణ్ణి. ఇప్పుడు. సుదూరాన చీనాదేశంలో వుండి ఈ వాక్యాల్ని వ్రాస్తున్న సమయాన సమస్త భారత దేశమూ ఎంతో ప్రేమపాత్రమైన దనిపిస్తోంది. అప్పుడప్పుడూ నా బాల్య యవ్వన జీవితాల్ని గడపిన ప్రదేశాల్ని మరోమారు చూద్దామన్న కోర్కె బల వత్తర మౌతుంది. కానీ ఇక నా ప్రదేశాల్ని చూడగలగడం స్వప్నం లోనే సంభవం. వాస్తవిక జీవితంలో అసంభవం. వయస్సొ, మళ్ళింది, కాళ్ళల్లో ఆ వెనుకటి శక్తిలేదు. సాహసోత్సాహాలు కూడా నశించాయి. అన్నిటినీ మించి, మనిషి జీవించిన కొలదీ, అతడు చూపిన ప్రదేశాలు అధికమౌతూనే వుంటాయి. తిరిగి చూడదల్చుకుంటే వాటిలో దేన్ని చూసేట్లు ? దేన్ని వదిలేట్లు ? మానవుడి జ్ఞాపకాలు ఎంత మధురంగా వుంటాయి ? ఎంత అమూల్యమైనవి ! కానీ, వాటిని నీటి బుడగల్లాంటి క్షణభంగురమైన పాత్రల్లో భద్రపరుస్తాం కదా ! ఈ ప్రపంచాన్ని వీడుతూన్న ప్రతి శరీరంతోపాటు ఇలాటి మధురస్మృతులు ఎన్ని మట్టిలో కలుస్తున్నాయో! చీనీ ప్రజలు లిపి బద్ధం చేయబడిన ఇలాటి స్మృతులకు చాలా విలువిస్తారు. నా పుట్టుకకు ఇరవై సంవత్సరాలక్రితం ఫాహియాన్ భారతదేశ యాత్రను ముగించి, తన యాత్రానుభవాల్ని గ్రంథస్థంచేశాడు. అతడి అనుభవాల్ని చదివాకనే నాలోనూ నాయాత్రను భవాల్ని వ్రాయాలన్న ఊహ కలిగింది. ఇప్పటికే ప్రజలు ఫాహి యాన్ని మర్చిపోతున్నారు. కానీ, గ్రంథస్థమైన అతడి అనుభవాలు అతడికి అమరత్వాన్ని ప్రసాదిస్తాయి.

మే మొక వారం రోజులకు యమునా తటాన్ని చేరుకున్నాము. భిక్షువులు స్థలమార్గంలో గుర్రాలను, బండ్లనూ, పాలకీలనూ – మరే ఇతర వాహనాలనూ ఉపయోగించరాదు. ఒకవేళ ఉపయోగించుకోవ డానికి అనుజ్ఞ లభించినప్పటికీ నే నుపయోగించను. కాలి నడకన, వివిధ దృశ్యాలనూ, ప్రశాంతంగా, తన్మయతగా చూస్తూ ప్రయాణం చేయడంలో వుండే ఆనందం వాహనంలో ప్రయాణంచేస్తే ఏం లభి

స్తుంది ? మార్గమధ్యంలోని దృశ్యాల్ని ఏకాంత తన్మయతతో చూడా లన్న కుతూహలంవల్లనే మేమీ వారంరోజులూ కాలినడకన ప్రయాణం. చేశాము ఇద్దరు యాత్రికులు ఒకే రకమైన అభిరుచుల్ని భావాలనూ కలిగి. వుండి, యాత్ర విషయంలోనూ ఒకేరకమైన అభిప్రాయాలు కల వారైతే, వారు గొప్పగా యాత్రానందాన్ని అనుభవిస్తారు. మే మిద్దరమూ అలాంటి భావైక్యత కల మిత్రులమే. స్రుఘ్ననుండి యమునలో నావ నెక్కి ప్రయాణం చేయవచ్చు! కానీ అలాచేసి ఉన్నట్లయితే ఎన్నో ముఖ్యమైన ప్రదేశాల్ని చూడలేకపోయేవాళ్ళం.

మేము చంద్రపురం వద్ద నావ నెక్కాము. చంద్రపురం ఒక మంచి రేవు పట్టణం. వ్యాపారుల నావ లెన్నో వస్తూంటా యక్కడికి.

చంద్రపురంలోనూ ఒక విహారం వుంది. అక్కడి భిక్షువులు "గౌతమబుద్ధుడే కాదు, భద్రకల్పపు నలుగురు బౌద్ధులుకూడా ఇక్కడికి వచ్చారు!" అంటూ వారి రాకకు సంబంధించిన గుర్తుల్ని కొన్నింటిని చూపించారు. మా యాత్రలో మొదటి నుండి ఇలాంటివి వింటూనే వున్నాము. పైగా బుద్ధిలుడు ప్రక్కన వుండి, ప్రతి విషయాన్నీ విమర్శించి, సత్యాసత్యాల్ని నిర్ణయిస్తున్నాడు. నే నా భిక్షువుల మాటల్ని విశ్వసించలేదు.

అక్కడి భిక్షువులు మాకు ఘనంగా స్వాగతా న్నిచ్చారు. బుద్ధిలుడు ఎక్కడికి పోయినా క్షణంలో పరిచయుల్ని ఏర్పరచుకుంటాడు. రోజులు గడిచిన కొద్దీ అతడి పరిచయం గాఢ మిత్రత్వంగా మారిపోతుంది. మృదుభాషి అయిన మానవుడు ప్రతిహృదయంలోనూ తనకు స్థానాన్ని ఏర్పరచు కుంటాడు. బుద్ధిలుడు ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూనేవుంటాడు. కోపమంటే ఏమిటో అస లతడికి తెలియనే తెలియదు! అతడు నన్ను చదివించాడు. అయితే, తనోగురువూ, నేనో శిష్యుణ్ణీ అన్నభావనను ఎన్నడూ కనబరచలేదు. ఒక సమవయస్కుడైన మిత్రుడిలా ప్రవర్తించేవాడు నాతో ! అతడెప్పుడూ ఆదర్శాల నుపదేశించలేదు. అతడి ప్రవర్తనే ఎదుటివారికి మార్గదర్శకంగా వుంటుంది. అతడి ప్రవర్తనను చూసి నే ననేక విషయలు తెల్సుకున్నాను.

చంద్రపురంలోని భిక్షువులు మా నౌకా యాత్ర ప్రశాంతంగా, సుఖకరంగా వుండాలని కోరుతున్నారు. యాత్రలో మాకు అన్ని సౌకర్యాలూ కల్పించగల సార్థవాహుడికోసం వెతుకుతున్నారు. కౌశాంబీ అంతట్లోకీ సుఫలశ్రేష్ఠి చాలా ప్రసిద్ధుడు. అతడి నావలు తూర్పు సముద్రం నుండి, గంగా, యమునా, సరస్వతీ, రావి, మహీ-నదుల ఉద్గమ స్థానాలవరకు వెళ్తుంటాయి. అతని ప్రతినిధులు ప్రతి పెద్ద పట్టణం లోనూ వున్నారు. అప్పుడు సుఫలశ్రేష్ఠి పట్టణంలోనే ఉన్నాడు. సహజంగానే అతడు బౌద్ధ భిక్షువుల్ని ఆదరిస్తూంటాడు. వారిపట్ల అధిక భక్తి ప్రపత్తుల్ని కనబరుస్తుంటాడు. చంద్రపుర విహార స్థవిరుడు (మహంతు) శ్రేష్ఠికి మా గురించి గొప్పగా చెప్పేశాడు. సుఫలశ్రేష్ఠి ఘోషితశ్రేష్ఠి వంశజుడు. అతడికా గర్వం వుంది. ఘోషితశ్రేష్ఠి బుద్ధుడికి అనేక మార్లు స్వయంగా అతిథ్యా న్నిచ్చాడు. ఘోషితారామాన్ని కట్టించి భిక్షు సంఘాని కిచ్చేశాడు. స్థవిరులద్వారా మా గురించి వినగానే సుఫలశ్రేష్ఠి మమ్మ తమ ఇంటికి భిక్షకు ఆహ్వానించాడు. తన నావలోనే తనతోపాటు ప్రయాణం చేయమన్నాడు. శ్రేష్ఠితోపాటు ఒక వారం రోజులు నౌకాయాత్ర చేశాము. ఈ యాత్ర సుఖకరమైనదేకాక, జ్ఞాన వర్ధకమైంది కూడాను! సాధువులూ, భిక్షువులూ తమ జీవితమంతా యాత్రలు చేస్తూనే వుంటారు. అయితే, శ్రేష్ఠులు కూడా తమ వ్యాపారాభివృద్ధికోసం నిరంతరం యాత్రలు చేస్తూంటారు. ప్రతిశ్రేష్ఠివద్ద అనేక మంది ఉద్యోగు లుంటారు. వ్యాపారానికి సంబంధించిన సామాన్య విషయాల్ని ఉద్యోగులే చూసుకుంటారు. కానీ, తన వ్యాపారం సాగే దేశాల్లోని మహారాజుల్ని, రాజుల్ని, సామంతుల్ని శ్రేష్ఠి వ్యక్తిగతంగా కలుసుకోవడం, కానుక లర్పించడం చాలా ముఖ్యమైన విషయం! మౌఖరీ వంశస్థుడైన ఈశ్వరవర్మ రాజ్యం వారణాసి నుండి, స్రుఘ్నవరకూ వ్యాపించి వుంది. ఈశ్వరవర్మకు సుఫలశ్రేష్ఠి వ్యక్తిగత పరిచయు డవటమేకాక బంధువుకూడాను! అయినా తన వ్యాపారం నిర్విఘ్నంగా సాగాలంటే మహారాజుల బంధుత్వమే చాలదు; ప్రదేశ పతుల్ని, కుమారామాత్యుల్ని సంతోషపరచడమూ చాలా ముఖ్యం! కనుక శ్రేష్ఠి ప్రతి సంవత్సరమూ ఏదో ఒక ప్రాంతాన్ని యాత్రచేసి వస్తుంటాడు.

మగధ, అవంతి రాజ్యాల్తోటీ అతడికి వ్యాపార సంబంధా లున్నాయి. అక్కడికీ వెళ్తూంటాడు.

సూర్యోదయానికి ముందే మా నావ యమునాతటాన్ని వదిలింది. వాలుగాలి ప్రవాహాన్ని అనుసరించి ప్రయాణం చేసున్నాము. పడమటి గాలి హోరు మంటోంది. హూరుగాలికి తెరచాపల సాయంతో నావ మహావేగంగా వెళ్ళిపోతోంది. తెడ్లు వేయడం అనవసరమే అయినా, మరికొంత వేగంగాపోవాలనేఉద్దేశ్యంతో, నావికులు తెడ్లువేస్తున్నారు. వేసవి కాలం మధ్యాహ్న సమయాల్లో ఎండల్ని భరించడం బాధగానే వుంది. సుఫలశ్రేష్ఠి ప్రయాణం చేసే నావ అన్నిసౌకర్యాలతోటి రాజప్రాసాదాల్ని మరిపిస్తోంది. మేము అదే నావలో ప్రయాణం చేస్తున్నాము. మధ్యాహ్నమప్పుడు కిటికీలకూ దర్వాజాలకూ వట్టివేళ్ళ చాపలను కట్టి నీళ్ళ చల్లేవారు మేము ప్రయాణం చేస్తూన్న నావ సరుకుల్ని మోసే మామూలు రకం కాదు. విలాస యాత్రలకూ ఉపయోగించేది. దీనిలోని ప్రతి చిన్న వస్తువూ కళాత్మక పద్ధతిలో అమర్చి వుంది. శ్రేష్ఠికి యాభై ఏళ్ళుంటాయి. అతడి భార్య అతడికంటె ఐదారు సంవత్సరాలు చిన్నది. ఇంటి బాధ్యతల్ని పెద్ద కొడుక్కు వదలి భార్యాభర్త లిద్దరూ ఈ యాత్రకు బయల్దేరారు. శ్రేష్ఠి భార్య తన సమయాన్ని ఎక్కువగా వ్రతనిష్ఠల్లోనూ, పూజార్చనల్లోనూ గడుపుతూంటుంది. ప్రసిద్ధమైన ప్రతి బౌద్ధ క్షేత్రాన్నీ దర్శిస్తుంది. భిక్షువులకు దాన దక్షిణల్నిస్తూంటుంది. మానావతోపాటు మరి నాలుగు నావలు కూడా వస్తున్నాయి. వాటిలో సాయుధులైన భటులూ, పరిచారకులూ ఉన్నారు. అవును మరి. విభవంకలచోట భయాందోళనలు తప్పకుండా ఉంటాయి. మౌఖరీ ఈశ్వరవర్మ పరిపాలన దృఢంగానూ కట్టుదిట్టంగానూ వుంది. అతడి రాజ్యంలో ఏవిధమైన అశాంతి, అలజడులూ లేవు. అయినప్పటికీ దొంగలూ, తోడు మోతులూ పూర్తిగా నశించారని చెప్ప లేము. సమస్త సంపదలూ, సుఖాలూ ఏ కొద్ది మంది మానవులో అనుభవిస్తూ, కులుకుతూ, వుండే సమాజంలో దొంగలూ, తోడుమోతులూ లేకుండా ఎందుకుంటారు? అదీకాక, వ్యాపారులైన సార్థవాహులకు కొన్ని ప్రత్యేకఆచారాలుంటాయి. వాటినియుద్ధసమయాల్లోనేగానీశాంతిసమయాల్లో

గానివిధిగాపాటిస్తూంటారు. స్థల జలసార్థవాహులందరూ మార్గమధ్యంలో తమకుసంభవించగలసమస్త అవాంతరాలనూ ఎదుర్కొవడానికి పూర్తిగా సన్నద్ధులై యాత్రకు బయలుదేరుతారు. దొంగల భయం వలన వ్యాపారపు నావలు ఒంటరిగా ఎన్నడూ ప్రయాణం చేయవు. ఇరవై, ముప్పైనావలు కల్సి ఓ జట్టుగా బయలుదేరుతాయి. వీటిలో కొంతమంది సాయుధ భటులు కూడా వుంటారు. సుఫల శ్రేష్ఠి నావ వెంట యాభైమంది దాకా యుద్ధ వీరు లున్నారు. అయినప్పటికీ దొంగల భయం మెండుగా వున్న ప్రదేశాల్లో రాత్రిళ్ళు ప్రయాణం చేయటంలేదు.

వర్షాకాలంలో నదీ ప్రవాహాలు ఉధృత రూపాన్ని దాలుస్తాయి. ఒక్కోమారు భయంకర రూపాన్ని దాల్చడం కూడా కద్దు. ప్రవాహ వేగానికి తట్టుకోలేక ఒడ్డునగల చెట్లుకూడా ప్రవాహం వెంటకొట్టుకొని వచ్చేస్తుంటాయి. అలాంటి సమయాల్లో నావలు చాలా జాగ్రత్తగా వెళ్ళాలి. వర్షాకాలంలో నౌకా యాత్రనుగురించి శ్రేష్ఠి ఇలా అన్నాడు: "వర్షాకాలంలో నదులు భయంకర రూపాన్ని దాల్చేమాట నిజం. ఆ సమయంలో నౌకా యాత్ర ప్రమాదంతో కూడిందనీ ఒప్పుకుంటాను. అయితే, అసలు మానవ జీవితానికి ప్రమాద మనేది లేంది ఎప్పుడు? ఎక్కడ? ఈ ప్రపంచంలో మహా నదుల సంఖ్యకంటె క్షుద్రనదుల సంఖ్య అధికం వర్షాకాలంలో క్షుద్రాతి క్షుద్ర్యది కూడా పొంగి పొరలుతూంటుంది. ఈ క్షుద్రనదుల సాయంతో మా పణ్యావస్తువుల్ని సుదూర దేశాలకూడా పంపగలం. చలికాలంలోనూ, వేసవి కాలంలోనూ కేవలం మహానదుల్లో మాత్రమే మా నావలు ప్రయాణం చేయగలవు. ఇక, కాకపోతే, ఎడ్లబండ్లమీద మా సరుకుల్ని దూర ప్రదేశాలకూడా పంపవచ్చు! అయితే, అలా పంపడం వలన సమయమూ ఎక్కువ తీసుకుంటుంది, ఖర్చులూకూడా అధిక మవుతాయి. కనుక, జల మార్గాన జరిగే మా మొత్తం వ్యాపారాన్ని వర్షాకాలంలోనే జరుపుతాము.

అనవసరమైనచోట్ల శ్రేష్ఠి తన నావలను ఆపడు. చంద్రపురానికీ, కౌశాంబికి మధ్య నావలు ఆగే ప్రదేశాలుకూడా అట్టేలేవు. అయినా,

శ్రేష్ఠి ప్రతిరోజూ సాయంసమయంలో నావలను కొద్దిఘడియలు లంగరు వేయించేవాడు. శ్రేష్ఠి పరిచయులూ, ఉద్యోగులూ ప్రతిచోటా ఉన్నారు. ముందు వెళ్ళే నావలు శ్రేష్ఠిరాకను ఉద్యోగులకు తెలియపరుస్తుంటాయి. వాళ్ల ముందుగానే తమ యజమాని సేవలకు తత్పరులై వుంటారు. మధ్యాహ్నపు ఎండలనుండి రక్షణను పొందడానికి, నౌకాయాత్రికులకు సుఖద శీతల వృక్షచ్ఛాయలు లభించవు. తాముకృత్రిమంగా నిర్మించుకున్నఛాయల క్రింద పడివుండి ఎలాగో మధ్యాహ్న సమయాల్ని గడిపేస్తుంటారు. భోజనానంతరం మధ్యాహ్న సమయంలో విశ్రాంతి తీసుకుంటాము. శ్రేష్ఠి తన రెండు ప్రత్యేక గదుల్లోనూ, ఒకటిమాకిచ్చేశాడు. ఒక్కోరోజు మధ్యాహ్న సమయాన్ని సంభాషణల్తో గడిపేవాళ్ళం. విశ్రాంతి తీసుకోవడమయ్యాక, శ్రేష్ఠి, శ్రేష్ఠి భార్య మావద్దకువచ్చి మా ఉపదేశాన్ని వినేవారు. ప్రశ్నల ద్వారా తమ సంశయాలను బాపుకునే వారు. శ్రేష్ఠి పత్నికి బుద్ధుని జీవితాన్ని గురించి తెల్సుకోవడమూ, బుద్ధసూక్తుల్ని వినడమూ చాలా ఇష్టం. సూత్ర పఠనానికి ఆమె ప్రత్యేకంగా సమయాన్ని కూడా ఏర్పాటు చేసుకుంది. మధ్యాహ్నపు ఫలహారానంతరం కొంతసేపు సూత్ర పఠనము జరిగేది. శ్రేష్ఠి పత్ని తను స్వయంగా కూడా సూత్రాల్ని, జాతకాల్ని పఠిస్తూంటుంది. ఈయాత్రలో కొన్నాళ్ళు అశ్వఘోషుడి బుద్ధ చరిత పఠనం జరిగింది. బుద్ధ చరితాన్ని బుద్ధిలుడు మహా ఆకర్షణీయమైన పద్ధతిలో చదివి అర్థాన్ని చెప్పేవాడు. శ్రేష్ఠి పత్ని ప్రతి నిత్యం బుద్ధ చరితాన్ని వినడానికి వచ్చేది. నేనూ బుద్ధ చరితాన్ని ఎన్నోమార్లు పారాయణ చేశాను. కవి చమత్కారమో ఏమోగాని, ప్రతిసారీ ఆ మహాగ్రంథం నామీద తనప్రభావాన్ని వేసింది. బుద్ధిలుడు కథ చదివే పద్ధతేవేరు. ముందు మధుర స్వరంలోసంస్కృత మూలాన్ని చదివేవాడు. తరువాత కండ్లకట్టేటట్లు ప్రాకృతంలో అర్థాన్ని చెప్పేవాడు.

బుద్ధుని కాలంనాటి ఆచార వ్యవహారాలకు, ఇప్పటి వాటికీ ఎంతో వ్యత్యాసం కనిపిస్తోంది. కాలం, ఆచారాల్లో, సంప్రదాయాల్లో కల్పించే మార్పును ప్రస్తావించి 'ఈ యమునా నది, తన ఉద్గమ స్థానంలో, మీ మహాస్తులాంటిదే! చాలా చిన్నది. గలగలమని గంతులు వేస్తూ ప్రవ

హిస్తుంది. కానీ, మైదానానికి దిగిన కొద్దీ ఈ నదిలో ఎన్నో ఇతర నదులువచ్చి కలుస్తున్నాయి. దీని ఆకారం, రూపం మారిపోతున్నాయి. ఆచారాలు, సంప్రదాయాల విషయం కూడా ఇంతే. కాలం గడిచినకొలదీ పాత, క్రొత్త ఆచారాలూ, సంప్రదాయాలూ కలసి నూతనమైన రూపాల్ని ధరిస్తుంటాయి. సింహళంలోని మహావిహార సంప్రదాయానికి, కాశ్మీర, గాంధార దేశాల్లోని హీనయాన సంప్రదాయానికీ - రెండూ హీనయాన సంప్రదాయాలే అయినా - ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది। ఈ రెండింటినీ మహాయానంతో పోలిస్తే పరివర్తన కొట్టవచ్చినట్లు కనుపిస్తుంది. బౌద్ధమతంలోని విభిన్నసంప్రదాయాల్లోనూ కొంతఏకత్వం, సారూప్యం కూడా కనుపిస్తుంది. ఆ సారూప్యమే, ఏకత్వమే బౌద్ధ ధర్మంయొక్క ప్రారంభదశలోని అసలు రూపం. మిగిలినదంతా పరివర్తన" అన్నాడు బుద్ధిలుడు.

బుద్ధిలుడు స్థవిరవాద, సర్వాస్తివాద, మహాసాంఘిక, సమ్మతీయ-మొదలుగా గల బౌద్ధమతాంతశ్శాఖల పిటకా లన్నింటినీ చదివాడు. ఇక మహాయానం విషయం చెప్పనే అక్కరలేదు. ఏవిషయంలోనూ మొండి పట్టుపట్టడు. మతసంబంధమైనప్రతివిషయంలోనూ తటస్థంగా ఉంటాడు. అన్య మతావలంబులపట్లకూడా సానుభూతిని ప్రదర్శిస్తుంటాడు. కనుకే, అతడు ప్రతిచోటా గౌరవాన్ని పొందగలుగుతున్నాడు. బుద్ధిలుడికి, శిల్ప, చిత్రకళల్లోనూ మంచి ప్రవేశం వుంది. అయితే, అతడికి అన్నిటికంటే ఇష్టమైనవిషయం ప్రమాణశాస్త్రం। దిఙ్నాగుడికి అనన్యభక్తుడు. "గ్రంథాలను, పారంపర్యంగా వస్తున్న ఆచారాలనూ గుడ్డిగా అనుసరించడం తగదు. మానవ మేధ సత్యమని నిర్ణయించిన విషయాల్నే విశ్వసించాలి. అలాంటివాటినే అనుసరించాలి" అనేవాడు బుద్ధిలుడు.

బుద్ధ చరితాన్ని పఠించేప్పుడు అలౌకికమైన సంఘటనల్నిగానీ, అసంభవమైన కథల్నిగానీ చెప్పేవాడు కాదు బుద్ధిలుడు. అందువలన బుద్ధుణ్ణి అతి మానవుడుగా, అతడి తలచుట్టూ ప్రభా మండలం వెలిగిపోతూన్నట్టు మనం భావించలేము. అయితే, బుద్ధిలుడు కథ చదివే పద్ధతిలో బుద్ధుని వ్యక్తిత్వానికి ఎలాంటి అల్పత్వమూ ఆపాదింపబడేదికాదు. అతడిలోని (బుద్ధుడిలోని) పురుషోత్తమత విశ్వరూపాన్ని ధరించి, దర్శన

మిచ్చేది. బుద్ధిలుడు కథ చెప్పే ఈ క్రొత్త పద్ధతి - అలౌకిక మహిమల్ని మినహాయించడం-విచిత్రంగా వుండేది. ఈ పద్ధతిలోనూ హృదయాల్ని ఆకట్టగల గొప్ప ఆకర్షణ వుంది. కథలో కపిలవస్తు, వైశాలి మొదలైన ప్రదేశాలను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు, తన పర్యటనానుభవాలను కూడా వాడుకునేవాడు. అక్కడి రాజు లేని గణరాజ్యాల్ని గురించి చెప్పేవాడు. బుద్ధుని కాలంలోని తమ పూర్వీకుల వేషభూషలకూ, భాషకూ, అభిరుచులకూ, ఇప్పటి తమ కట్టూ బొట్టూ, భాషా, అభిరుచులకూ గల వ్యత్యాసాన్ని బుద్ధిలుడు చెప్పగా విని శ్రేష్ఠి, అతడి భార్య చాలా ఆశ్చర్యాన్ని పొందారు. బుద్ధిలుడు *విదిశా స్తూప ప్రతిమల ప్రతిరూపాలను మట్టితో చేసి చూపించాడు. భరహూత, శ్రీశైలాల్లోని అతి ప్రాచీనమైన స్తూప ప్రతిమల్ని మట్టితో చేసి చూపించాడు. అతడు క్షణంలో మట్టిలో కోరిన రూపాల్ని సృష్టించగలడు.

నౌకా యాత్ర ఒక వారం రోజులు చేశాము. శ్రేష్ఠి, అతడి భార్య-వారిద్దరి బలవంతం వలన కౌశాంబిలోని ఘోషితారామంలో రెండు వారాలున్నాము. కౌశాంబి ప్రాచీన, ప్రసిద్ధ పట్టణాల్లో ఒకటి. బుద్ధుని జీవిత కాలంలో ఈ పట్టణం మహోచ్ఛస్థితిలో వుంది. ఇప్పుడు దాదాపుగా శిథిలమైపోయింది నగరం! ఈ పట్టణపు సౌభాగ్యాన్ని ప్రయాగ, కన్యాకుబ్జం, పాటలీపుత్రం దోచుకున్నాయి. ఇప్పటికీ యమునా తీరంలో — జలమార్గంలో—ఉంది గనుక, ఈ మాత్రం పచ్చదనమైనా కన్పిస్తోంది నగరంలో. లేకపోతే ఏనాడో ఎండుబారిపోయేది! అనేక కథలకు నాయకుడైన వత్సరాజు ఉదయనుడి రాజధాని ఈ కౌశాంబియే! నగరమే శిథిలావస్థలోవుండగా ఇక నగరంలోని సంఘారామాలూ, విహారాలు శిథిలతరావస్థలో వుండడంలో ఆశ్చర్యం ఏముంది! ఉదయనుడి అంతఃపురం పోల్చపీలుకాని స్థితిలో వుంది. కాలంయొక్క కరాళదంష్ట్రిలు ఆ అంతఃపురాన్ని ఎంతగా ధ్వంసం చేశాయో చెప్పలేను! నలభై బారల ఎత్తుగల ఒక బౌద్ధ మందిరం వుంది. అందు శ్రీగంధపు చెక్కతో చేసిన బుద్ధ ప్రతిమ వుంది. ఆ ప్రతిమను ఉదయనుడు చెక్కించాడుట. శిల్పులు

---

*విదిశా = సాంచి.

స్వయంగా బుద్ధుణ్ణే ఎదట వుంచుకుని ఆ ప్రతిమను చెక్కారని స్థానికులు చెప్పారు. ఈ విషయాన్ని బుద్ధిలుడు విశ్వసించలేదు. సాంచీలోనూ, ఇతర ప్రాచీన చైత్యంలోనూ బుద్ధ ప్రతిమలులేవు. ప్రాచీన చైత్యాల్లో బుద్ధుని పీఠాన్నో లేక చరణాల్నో "పూజిస్తూండడం ఆచారం! కనుక వత్సరాజు ఉదయనుడేకానీ, మరే రాజేకానీ. బుద్ధుని జీవితంలో అతడి ప్రతిమను చెక్కించాడనేది అసత్యం. భక్తుల్ని వంచించడానికి ఎవడో ఈ కథను కల్పించాడు!" అన్నాడు బుద్ధిలుడు.

పట్టణానికి ఆగ్నేయ దిశగా ఘోషిత శ్రేష్ఠి గృహముంది. అక్కడో శిథిల బుద్ధమందిరంలో తథాగతుని నఖ కేశ ధాతువులున్నాయంటారు. ఘోషితారామం పట్టణానికి వెలుపలవుంది. ఆరామానికి దగ్గర్లోనే 150 బారల ఎత్తుగల అశోక స్తూపం వుంది. బుద్ధుడు ఈ ఆరామంలో కొంత కాలం ఉన్నాడని చెప్తారు. ఇక్కడా ఒక స్తూపంలో నఖ కేశ ధాతువులు నిక్షిప్తా లయివున్నాయి. ఘోషితారామానికి ఆగ్నేయదిశగా ఇటుకల్తో కట్టిన రెండంతస్తుల భవనం ఒకటుంది. ఆ భవనంలో, వసుబంధు నివసించిన గది ఇప్పటికీ వుంది. ఆ గదిలో వుంటూనే వసుబంధు "విజ్ఞప్తి మాత్రతాసిద్ధి" అనే గ్రంథాన్ని రచించాడు. ఘోషితారామానికి తూర్పున ఒక మామిడితోట వుంది. ఆ తోటలో ఒకగృహం వుంది. ఆర్య అసంగ్ ఆ గృహంలో వుండేవాడు. అక్కడే "యోగాచార భూమి" అనే మహా గ్రంథాన్ని రచించాడు. పట్టణానికి ఒక క్రోసు దూరాన, వాయవ్య దిశన, ఒక చిన్న కొండవుంది. దాన్లో ఒక గుహ వుంది. బుద్ధుడు అప్పుడప్పుడూ వచ్చి, ఆ గుహలో కొద్ది రోజులు నివాసంచేస్తూ వుండేవాడుట. ఆ గుహకు ప్రక్కన దేవకృత - శ్వభ్రం (సహజగుడం) వుంది. హిమాలయ పర్వతాలకూ గంగా, యమునలకు మధ్య ఈ చిన్న పర్వతం మాత్రమే తగులుతుంది. కౌశాంబీలో వివిధ మతాలకు సంబంధించిన దేవాలయాలూ వుండేవి. మఠాలూ, సంఘారామాలూ అత్యధికంగా వుండేవి. వాటిలో సాధువులూ, భిక్షువులూ ఎందరోవుండేవారు. చెట్టు పడిపోయాక పక్షులు ఎగిరిపోయినట్టు, పట్టణం శిథిల మవడంతో ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు.

కౌశాంబి పట్టణం, చుట్టుపట్లవున్న ప్రాచీన ప్రదేశాలూ దాదాపుగా శిథిలమైపోయాయనే చెప్పవచ్చు। శ్రేష్టి చాలా వుదారుడు. ఎంతో వ్యయ ప్రయాసలకు ఓర్చి, సంఘారామాల్ని పోషిస్తూ వున్నాడు. శిథిలమైన వాటిని బాగుచేయిస్తున్నాడు। అయితే, ఒక శ్రేష్టి ఎంతవరకు పోషించ గలడు? ఎంతవరకని బాగుచేయించ గలడు? పైగా, అత డోరకంగా కౌశాంబీని విడిచి. కన్యాకుబ్జంలో స్థిరపడ్డాడు।

కౌశాంబీకి ఏడు యోజనాల (38 మై.) దూరంలో ప్రయాగ వుంది. ప్రయాగ కూడా జలమార్గాన్నే వెళ్ళవచ్చు. కానీ మేము కావాలని స్థలమార్గాన వెళ్ళ నిశ్చయించుకున్నాము. దారిలో మహారణ్యం ఒకటుంది. కౌశాంబీ ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు ఈ మహారణ్య మంతట్లో గ్రామా లుండేవి. కానీ, కౌశాంబి శిథిల మవగానే గ్రామాలూ నాశన మయ్యాయి. ఒకప్పుడు గ్రామాల్తో, మానవ సంచలనంతో కళకళ్ళాడు తూన్న ఈ ప్రదేశం ఇప్పుడు సింహ - వ్యాఘ్రాదులకు నిలయమైన మహారణ్యంగా మారిపోయింది. ఈ భూమిమీద జరిగే పరివర్తనలు ఎంత విచిత్రమైనవో? గ్రామాలూ, పట్టణాలూ చూస్తుండగానే మహారణ్యాలుగా మారిపోతాయి. మహారణ్యాలు జన సందోహంతో క్రిక్కిరిసిన. అందమైన పట్టణాలుగా మారిపోతుంటాయి. వాల్మీకి, రామాయణంలో ప్రయాగ అరణ్యంతో చుట్టబడిన ఓ చిన్న పల్లెగా వర్ణించాడు. ప్రయాగకు కొద్ది దూరంలో గంగా, యమునలకు అవతల వున్న ప్రతిష్ఠానం (ఝూన్సి) అప్పటికీ ఇప్పటికీ ప్రసిద్ధమైన పట్నంగానే ఉంది క్రమంగా ప్రయాగ అభివృద్ధికొస్తోంది. భవిష్యత్తులో ఈ పట్టణం (ప్రయాగ) గొప్ప ప్రసిద్ధిని పొందుతుందని పిస్తోంది. ఇక్కడ గంగా - యమున సంగమంలో స్నానం చేయడానికి వేల సంఖ్యలో స్త్రీపురుషు లొస్తున్నారు. ప్రయాగలో రెండు మూడు బౌద్ధారామా లున్నాయి. బ్రాహ్మణుల దేవాలయాలూ చాలా ఉన్నాయి. సంగమానికి కొద్ది దూరంలో, ఒక దేవాలయం ముందు వటవృక్షం ఒక టుంది. ఆ వృక్షాన్ని చాలా పవిత్రమైందిగా భావిస్తారు. పూజిస్తారు. కొంతమంది ఆ వటవృక్షంమీద నుండి దూకి ప్రాణత్యాగం కూడా చేసుకుంటారు. అలా ప్రాణత్యాగం చేసుకోవడం వలన పాపాలన్నీ ప్రక్షాళితమైపోతాయని. తమను తీసుకు

పోవడానికి స్వర్గంనుంచి విమానం వస్తుందనీ వారి అభిప్రాయం। అలా చనిపోయిన మానవుల ఎముకలు ఆ చెట్టు క్రింద ప్రోగు పడివున్నాయి. గంగా-యమునల సంగమంలో దూకి చనిపోవడమూ మహా పుణ్య కార్యంగా భావిస్తారు. బుద్ధిలుడు కోపంతో ఇలా అన్నాడు: "ఎంత మూర్ఖత్వం! మానవుడు ఆత్మ హత్యను పుణ్య మనుకుంటున్నాడు. మానవుల్ని ఇలా మూర్ఖుల్ని చేసే మతా న్నేమనాలి?"

పట్టణానికి నైరుతి దిశగా అశోక స్తూపం ఉంది. అక్కడో చిన్న చైత్యంలో తథాగతుని నఖ కేశ ధాతువు లున్నా యంటారు. ఈ చైత్యం వద్దకల ప్రాచీన సంఘారామంలో ఆచార్య నాగార్జునుడి శిష్యుడు ఆర్యదేవు డుండేవాడు. యిక్కడే అతడు "చతుశ్శతక శాస్త్రా"న్ని రచించాడు.

ఇక నిప్పుడు మేము వారణాసికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాము. బుద్ధభగవానుని జీవితానికి సంబంధించిన నాలుగు ప్రధాన, పవిత్ర స్థలాల్లోనూ వారణాసి ఒకటి। ఒక విశాలమైన రాజమార్గాన తూర్పు దిశకు ప్రయాణం చేస్తున్నాము. మార్గానికి రెండు వైపులా మామిడిచెట్లు ఉన్నాయి. కొంకె ముదిరి పండడానికి సిద్ధంగా ఉన్న మామిడికాయలు, వర్షాకాలపు ఆగమనాన్ని తెలియచేస్తున్నాయి. వర్షావాసపు మూణ్ణెల్లనూ జేత వనంలో గడపాలనుకున్నాము. కనుక ఇప్పుడు ఉదయం, సాయంత్రం రెండు పూట్లా ప్రయాణం చేస్తున్నాము. కనీసం రోజుకు మూడు యోజనా లయినా నడుస్తున్నాము. వారణాసి కూడా పురాతన పెద్ద పట్టణాల్లో ఒకటి। ఒక నగరం బాగుపడ్డ దంటే, మరో నగరం నాశన మయిందనే లెక్క। వారణాసి రాజధాని కాకపోయినా, కౌశాంబీ కంటె మంచి స్థితిలోవుంది. ఈ పట్టణం ఓ మంచి వ్యాపార కేంద్రంగా ప్రసిద్ధి చెందింది. బౌద్ధ, జైన, బ్రాహ్మణ మతాలకు అతి పవిత్రమైన కూడలి ఈ పట్టణం। కనుకనే ఇప్పటివరకూ దుర్గతిపాలు కాకుండా వుంది. పట్టణంలో శివాలయాలు అనేకం వున్నాయి. వాటిలో వొక ఆలయాన్ని అతి పవిత్రమైందిగా భావిస్తారు. వారణాసిలోని శిల్పులు సుందరమైన వస్తువుల్ని తయారు చేస్తుంటారు. అక్కడ తయారైన వస్త్రాలు భారతదేశం అంతట్లోనూ ప్రసిద్ధిని చెందాయి. ఇలాంటి అనేక

ప్రత్యేకతలు వుండబట్టే, వారణాసి తన వైభవాన్ని కాపాడుకో గలిగింది.

వారణాసి నుండి బయల్దేరి ధర్మచక్ర ప్రవర్తన విహారానికి వెళ్ళాము. ఇక్కడే ఋషిపతన మృగదావముంది. ఈ ఋషిపతనంలోనే బుద్ధుడు ప్రప్రథమంగా తన ఆది, మధ్య పర్యవసాన కళ్యాణాల్ని గురించి ఉపన్యసించాడు. తథాగతుడు బుద్ధుడయ్యాక తన ప్రథమ వర్షావాసాన్ని ఇక్కడే గడిపాడు. ఇక్కడే ప్రథమంగా ఐదుగురు భిక్షువులకు నూతన మతదీక్ష నొసంగాడు. ఆ ఐదుగురు భిక్షువుల్లోనే భిక్షుసంఘం ప్రారంభమయింది. ఐదుగురు భిక్షువులు దీక్షపొందిన స్థలంలో అశోకుడు ఓ స్తూపాన్ని నిర్మించాడు. అక్కడే బుద్ధభగవానుల కొరకు గంధపు చెక్కతో కుటీరా న్నొకదాన్ని కట్టించాడు. ఈ కుటీరం వద్ద శిలా స్తంభా న్నొకదాన్ని పాతించాడు. అశోకుడు ఈ శిలా స్థంభాన్ని పాతించి ఒక వేయి సంవత్సరాలు గడిచాయేమో! అప్పుడే ప్రజలీ స్థంభంమీది లిపిని చదవలేక పోతున్నారు. ఋషిపతనంలో సంఘారామాలు అత్యధికంగా వున్నాయి. దీన్ని సంఘారామాల పట్టణమని కూడా అంటారు. బౌద్ధమతానికి, అతి ప్రధానమైన, అతి పవిత్రమైన ఈ ఋషి పతనాన్ని చూడడానికి ద్వీప ద్వీపాంతరాల్లోని బౌద్ధ భిక్షువులు పరితపిస్తూంటారు.

ఎర్రరాతి శిల్పాలు ఇక్కడి ఇతర శిల్పాల కంటే ప్రాచీనమైనవి. వాటిని కనిష్కుడు చెక్కించాడు. "శిల్పులు ఇప్పుడూ శిల్పాలను మలుస్తున్నారు. నన్నడిగితే, శిల్పకళ వెనుకటికంటే ఇప్పుడు గొప్పగా అభివృద్ధిని సాధించిం దంటాను" అన్నాడు బుద్ధిలుడు.

వారణాసి నుండి బయల్దేరి ఏడెనిమిది రోజుల ప్రయాణా నంతరం అయోధ్యను చేరుకున్నాము. దారిలో క్రూరమృగాల్తో నిండిన అడవుల్ని దాటాము. వొకటి రెండు చిన్ని చిన్ని నదుల్ని కూడా దాటాము. దీని అసలు పేరు సాకేతపురం. వాల్మీకి మహర్షి తన రామాయణంలో దీన్నే "అయోధ్య" అన్నాడు. ఇ దేమంత గొప్ప ప్రసిద్ధమైన పట్టణం కాదు. కాకపోతే చుట్టూ ఉన్న శిథిలాలను చూస్తే "వొకప్పుడీ పట్టణం ఇంతకంటే మంచి స్థితిలో వుండవచ్చు!" అనిమాత్రం అనుకుంటాము.

అశ్వఘోషుడి జన్మభూమి ఈ సాకేతపురమే. అతడికి జన్మభూమి అన్నా, జనని అన్నా గొప్ప అభిమానం. అందువల్లే తనను గురించి చెప్పుకోవలసి వచ్చినప్పుడు "సాంకేతక ఆర్య సువర్ణాక్షి పుత్రు"ణ్ణని చెప్పుకునేవాడు తథాగతుని సమయంలో ఈ పట్టణం కొంత ఉచ్ఛ స్థితిలోనే వుందని చెప్పవచ్చు. కోశల దేశానికి అప్పటి రాజధాని శ్రావస్తి! సాకేతపురం రాజధాని కాకపోయినప్పటికీ, విశాఖుని తండ్రి అరున శ్రేష్ఠి శ్రావస్తిని వదలి సాకేతపురంలోనే నివసించాడు. ఈ సందర్భం అప్పటి సాకేతపురం యొక్క ఔన్నత్యాన్ని చాటి చెప్తున్నది.

అయోధ్యకు శ్రావస్తి ఏడు యోజనాల దూరంలో వుంది. ఆషాఢ పౌర్ణమి నాటికి శ్రావస్తిని చేరుకోవాలని నిశ్చయించుకున్నాము.

మామిడికాయలు పంటకొచ్చాయి. సరయూ నదిని దాటి, ఉత్తర దిశకు మళ్ళి, శ్రావస్తివైపు వెళ్ళిపోతున్నాము. మార్గంలో పల్లెలు గ్రామాలు తగుల్తున్నాయి. వాటిలో ఎటూ మామిడితోట లుంటాయి. బుద్ధు డికి మామిడి పండ్లంటే ప్రత్యేకమైన అభిమానం గాని ఆసక్తిగానీ ఏమీ లేదు. అతడు ప్రతి గ్రీష్మంలో సాధారణంగా తింటూన్న పండ్లే అవి. కానీ, నేను మామిడి పండ్లను తినడం క్రొత్త. మా కీ మధుర ఫలాలు లభించవు. భిక్షువులు మధ్యాహ్న భోజ నానంతరం ఇకమరి భోజనంచేయ రాదు. పండ్ల రసాన్ని పుచ్చుకోవచ్చు. నేను సాయం సమయాల్లో మామిడి పండ్ల రసాన్ని చాలా ఇష్టంగా స్వీకరించేవాణ్ణి. సాకేతపురాన్నుండి శ్రావ స్తికి వెళ్ళే మార్గం ఎప్పుడూ జనాకీర్ణంగా వుంటుంది. వ్యాపారులు ఎడ్ల బండ్లలో తమ సరుకుల్ని తీసుకుపోతూ వుంటారు. కాలి నడకన చాలా మంది వెళ్తూంటారు. కౌశాంబీ లాగానే శ్రావస్తిగూడా తన మహత్వాన్ని గోల్పోయింది. రాజమార్గాన నడుస్తూ 'ఇంగువ కట్టిన గుడ్డలా' ఈ పట్ట ణంలో వెనుకటి గొప్పతనం ఏ నాలుగానో మిగిలే వుంటుంది బహుశ కౌశాంబీకంటే ఈ పట్టణాన్ని ఉత్తమస్థితిలో చూడవచ్చు' అనుకున్నాము.

కానీ, మేము అనుకున్న విధంగా ఆపట్టణం లేదు. అంత విశాల పట్టణంలోనూ చాలా కొద్ది భాగం మాత్రమే సురక్షితంగా వుంది. దాదాపు మూడు వంతుల పట్టణం శిథిలాల్లో మరుగు పడిపోయింది. పూర్వారామం, జేతవనం లాంటి పవిత్రమైన, అతి ప్రధానమైన విహారాలుకూడా శిథిలావస్థ

లోనే వున్నాయి. పట్టణం బైట చాలా దూరం వరకూ భగ్నావశేషాలైన సంఘారామాలు వ్యాపించి వున్నాయి. నగర ప్రాకారం పూర్తిగా ధ్వంసమయింది. తూర్పు దక్షిణ ద్వారాలు నామమాత్రంగా మిగిలి ఉన్నాయి. దక్షిణ ద్వారానికి బయట, కొద్దిదూరంలో జేతవన విహారం ఉంది. పూర్వ ద్వారానికి అవతల విశాఖుడు కట్టించిన పూర్వారామం ఉంది. నగర ప్రాకారానికి లోపల రాజకారామం, రాజప్రాసాదాలు, అనాథ పిండకుడివీ, విశాఖుడి భవ్య భవనాలూ ఉండేవి- అవన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. ఆయా ప్రదేశాల్లో వాటిచిహ్నాలుమాత్రం మిగిలి ఉన్నాయి. మేము జేతవన విహారంలోనే దిగాము.బుద్ధుని కాలంలో దీన్ని జేతవన రమ్యం అనేవారు. తథాగతుడు బుద్ధత్వాన్ని పొందాక తన 46 సంవత్సరాల జీవితంలోనూ 20 సంవత్సరాల్ని ఈ జేతవన రమ్యంలోనే గడిపాడు. ఇక్కడే అనేక ధార్మిక ఉపన్యాసాల్నిచాడు బుద్ధుడు నివసించిన గంధకుటీరం ఇంకా అలాగే ఉంది. స్నానపు గదికూడా అలాగే ఉంది. శ్రావస్తిలోని బౌద్ధ గృహస్థులూ, భిక్షువులూ రోజూ సాయం సమయాల్లో బుద్ధుని ప్రవచనాల్ని వినడానికి ఒకచోట ప్రోగవుతూ ఉండేవారు. ఆ పవిత్ర స్థలాన్నీ చూశాము. జేతవనములో తిరుగుతూ ఉంటే బుద్ధుని జీవితానికి సంబంధించిన ఎన్నో సంఘటనలు జ్ఞప్తి కొచ్చేవి. జేతవనంలోని ప్రధానమైన పవిత్ర స్థలాల నెన్నింటినో చూశాము; జంతా గృహం మా హృదయాల మీద గొప్పగా ప్రభావాన్నేసింది. తిష్యుడనే భిక్షు వొకడు రోగగ్రస్తుడయ్యాడు. తోటి భిక్షువులందరూ అతణ్ణి అతడి ఖర్మానికి వదిలేశారు. రోగగ్రస్తుడైన ఆ భిక్షువుకు బుద్ధుడు ఈ జంతా గృహంలోనే సపర్యలు చేశాడు. స్వయంగా రోజూ అతడిని స్నానం చేయించేవాడుట. బుద్ధుడీ విధంగా తన ఆదరణ ద్వారా దుఃఖంలో ఉన్న తోటి మానవులకు సేవ చేయడమే ఉత్తమ ధర్మమని చాటి చెప్పాడు.

జేతవనంలో సమ్మితీయ సంప్రదాయపు భిక్షువుల సంఖ్య అధికం. అయితే, బుద్ధుడీ జేతవనాన్ని వివిధ ప్రాంతాలనుండి వచ్చిపోయే భిక్షువుల కొరకు నిర్మించాడు. అందువల్లనే ఇక్కడ ఏ సంప్రదాయానికి చెందిన భిక్షువుల కయినా అరమరికలు లేని ఆతిథ్యం లభిస్తుంది. అనాథ పిండకుడైన (అన్నదాత) సుదత్తశ్రేష్ఠి వద్ద లక్ష్మి ఎక్కువరోజు లుండ

లేదు కానీ. అతడీ జేతవనాన్ని, బుద్ధుని కొరకు కార్షాపణాల్తో కొలచి కొని ఇచ్చాడు. ఈజేతవనం అతడి కీర్తిని, త్యాగాన్నీ లోకానికి చాటింది. జేతవనంలోని అనేక విహారాలు శిథిలమయ్యాయి. కొన్నాళ్ళకు అసలీ జేతవనమే అరణ్యగర్భంలో మరుగు పడిపోవచ్చును. అయినప్పటికీ ఈజేతవనపు స్మృతులు ప్రజల హృదయాల నుండి ఎన్నటికీ చెరగవు. అమరత్వాన్ని పొందిన బుద్ధునితో చిర సంబంధాన్ని కలిగి ఉండడం వలన ఈ జేత వనమూ అమరత్వాన్ని పొందింది. పూర్వద్వారం వద్ద అశోకుడు స్థాపించిన రెండు శిలా స్తంభా లున్నాయి. వాటిలో ఎడమవైపు నున్న స్తంభంలో ధర్మ చక్రము, ఎద్దు ఆకారము చెక్కివున్నాయి. జేతవనంలో ఈశాన్య దిశన, బుద్ధుడు రోగగ్రస్తుడైన భిక్షువును స్నానం చేయించిన ప్రదేశంలోనూ ఒక స్తూపం వుంది.

జేతవనంలో ఆ యేడు రెండువందలమంది దాకా భిక్షువులు వర్షావాసాన్ని గడుపుతున్నారు. పూర్వారామంలో యాభై మంది భిక్షువులున్నారు. ఒకప్పుడు వర్షావాసాన్ని గడపడానికి ఈ జేతవనానికి వేల సంఖ్యలో భిక్షువులు వస్తూండేవారు. అప్పుడీ శిథిలమైన, పడిపోయిన విహారాలన్నీ భిక్షువుల్తో నిండి, ఎంత సందడిగా వుండేవో? అప్పుడీ జేతవనంలో వుండే భిక్షువులకు, మాకు అర్థమైనంత తేలికగా బుద్ధుని అనిత్యవాదం అరమయ్యేది కాదనుకుంటాను. అనిత్యవాదాన్ని ప్రత్యక్షంలో చూసి, అర్థంచేసు కుంటున్నామీనాడు. ఏనాడో బుద్ధుడు ఈ జేతవనంలోనే ప్రవచించిన సూత్రాలను పఠిస్తూ అవిశ్రాంతంగా కన్నీరు కారుస్తున్నామీనాడు. మేము, ఇప్పుడీ శ్రావస్తిలో సుదత్తుడు, విశాఖుడులాంటి మహాధనికుల్లేరు. అయినా చుట్టుపట్ల గ్రామాల్లోని ప్రజలు శ్రావస్తిపట్ల, జేతవనం పట్ల పూజ్య భావాన్ని కలిగిస్తూవున్నారు. ఈ పవిత్ర స్థలాలమీద భక్తిశ్రద్ధల్ని కనబరుస్తున్నారు. వినమ్రులై, ఇక్కడి భిక్షువుల అవసరాల్ని తీరుస్తున్నారు శ్రావణ. భాద్రపద మాసాల వరకూ ఇక్కడికి కావిళ్ళతో మామిడి పండ్లొస్తుంటాయి. ఇక్కడి భిక్షువులు. మామిడి పండ్లకు మే మిచ్చినంత విలువ నీయరు. మా దేశంలో మామిడి పండ్లు దుర్లభమైన వస్తువు. మామిడి పండును గురించి గ్రంథాల్లో మాత్రం చదువుతాము మేము. ఆకాశం స్వచ్ఛంగా, మేఘరహితంగా ఉండే

ఇక్కడి నుండి హిమాలయపర్వత శిఖరాలను చూడవచ్చును. కొంత దూరం వరకూ నల్లని పర్వతాలూ, వాటివెనుక తెల్లని హిమవత్పర్వత శ్రేణులూ ఈ సుశ్వేత హిమవత్పర్వతశ్రేణులే నా మాతృభూమి అయిన ఉద్యానంలోకి జొచ్చుకు పోయాయి. అప్పుడప్పుడూ వెనక్కి వెళ్ళిపోయి హిమాలయాలలో విహరించా లన్న కోర్కె కలుగుతూ ఉంటుంది. కానీ, మేమిద్దరం ఇలా పవిత్ర స్థలాలను చూచుకుంటూ తామ్రపర్ణి(సింహళం)కి వెళ్లాలని సంకల్పించుకున్నాము.

* * *

వర్షాకాలం వెళ్ళిపోయింది. మహాప్రవార ణోత్సవం వచ్చింది. ఆనాడు జేతవన శిథిలాల్లో తిరిగి ఉత్సాహం పొంగి పొరలింది. గ్రామీణులు భిక్షువులకొరకు రకరకాలైన ఆహారపదార్థాలను తెచ్చి ఇచ్చారు. కొంతమంది తాము స్వయంగా చీవరాలను తయారుచేసుకుతెచ్చి భిక్షువులకిచ్చారు. ఇక్కడ మాకు కపిలవస్తు, లుంబినీలకు వెళ్లే మిత్రులతో పరిచయమైంది. జేతవనంనుండి బయలుదేరి అచిరవతి (రాప్తీ నది)ని దాటాము. కార్తీకమాసం, మార్గానికి రెండువైపులా పంటచేలు వరికోతకు వచ్చి తల లూపుతున్నాయి. వర్షాలు వెనుకబట్టి ఎక్కువ రోజులు కాలేదు. చేలల్లో ఇంకా నీరు కనిపిస్తోంది. జలశయాలు నిండి వున్నాయి. కౌశాంబి, శ్రావస్తి చాలా హీనదశలో వుండడాన్ని చూశాము. యమునా, గంగా నదుల మధ్య భూమిలోనూ ఎన్నో శిథిల గ్రామాలను చూశాము; సాకేత పురానికీ, వారణాసికీ, మధ్య కూడా పాడుపడిన ఊళ్ళు, శిథిల గ్రామాలే కనుపించాయి. కానీ, ఈ ప్రదేశాలు అలాలేవు పాడీపంటా సమృద్ధిగ కనుపిస్తోందిక్కడ। యుద్ధాలు దేశాల్ని, గ్రామాల్ని అలాగే సర్వనాశనం చేసేస్తాయి. ముఖ్యంగా విదేశీయుడూ, ప్రజలపై సహానుభూతిలేనివాడూ దేశముపై ఆక్రమణ చేస్తే జరిగే పరిణామమే అంత। శ్వేతహూణుల గుర్రాల కాలి గిట్టల ప్రభావ మిది. మార్గ మధ్యంలోవి ప్రతి పంట పొలాన్నీ, ప్రతి గ్రామాన్నీ నాశనం చేసేశాయి. తోరమాణుడూ, అతని కొడుకు మిహిరకులుడూ శ్రావస్తినిదాటి ముందుకు రాలేదు. కనుకనే ఇక్కడి ప్రజలు బ్రతికిపోయారు; గ్రామాలు సురక్షితంగా వున్నాయి.

యుద్ధం మహామారిలాంటిది. అది కన్నువిప్పి ఎటుచూస్తే, అటు స్మశాన మవక తప్పదు. ఒకసారి నాశన మయినగ్రామం తిరిగి నిర్మింప బడాలంటే చాలాకాలం పడుతుంది. పక్షులకు లాగానే మానవుడూ అన్య ప్రదేశాల్లో దివాసాన్నేర్పరచుకున్నాడా, ఇక స్వస్థలం మీది మమత, మోహం అతడి హృదయంనుండి తొలగిపోతుంది. ఇక్కడి పచ్చని పొలాలను, నిండైన గ్రామాలనూ చూసి మేమెంతో ఆనంద పడ్డాము. ఇక్కడి గ్రామాల్లో అధిక భాగం అన్యప్రాంతాలనుండి వలస వచ్చిన ప్రజలు నిర్మించుకున్నవి. యుద్ధకారణంగా, రైతులూ, శిల్పులూ, పండితులూ దేశం నలుమూలలకూ విరజిమ్మ బడ్డారు. యుద్ధ మేఘాలు తొలిగాక తాము వీడివచ్చిన ప్రదేశాల్లోని జేతవనాన్నీ, పూర్వారామాన్నీ పునర్నిర్మించడం వీరివలన కాలేదు. కానీ, తాము క్రొత్తగా కట్టుకున్న గ్రామాల్లో చిన్న చిన్న నూతన విహారాలను నిర్మించు కున్నారు. కపిలవస్తు వచ్చేలోపు మార్గ మధ్యంలో అనేక గ్రామాలు తగిలాయి. వాటిలో రెండు మూడు గ్రామాలు మాత్రం కొంచెం పెద్దవి. మిగిలిన గ్రామాలన్నీ చిన్ని చిన్ని పూరిగుడిసెల సమూహాలు. పూరిండ్లమీద సొర, గుమ్మడి తీగెలు పాకివున్నాయి. కార్తీక మాసంలో పంటలు ఇండ్లకొస్తాయి. ప్రతి ఇల్లూ ధన ధాన్యాల్తో కళకళ్లాడు తుంటుంది. రెండునెల్ల పంట వడ్లూ, బియ్యమూ చూడడానికి అంతగా బాగుండవు. అన్నం చాలా తియ్యగా వుంటుంది. చిన్ని చిన్ని క్రీడోద్యానాలు ప్రతి గ్రామంలోనూ ఉన్నాయి. చేపలు బాగా దొరికే రోజులు. నేనప్పటికింకా మాంసాన్ని నిషేధించలేదు. గృహస్థులు మమ్మలను భోజనానికి ఆహ్వానించినప్పుడు మత్స్యమాంసాదుల్ని వండి పెడుతూండేవారు. భిక్షాటనలోనూ మాకు మాంసం లభిస్తూండేది. కార్తీక మార్గశిర మాసాల్లో చలిజ్వరాలు మహా తీవ్రంగా వ్యాపిస్తాయి. ఒక్కో సంవత్సరం చలిజ్వరాలు ముమ్మరంగా వ్యాపించడం వలన ప్రజల నిత్యవృత్తులు కూడా కుంటుపడుతుంటాయి. అయితే, ఈ సంవత్సరం మా అదృష్టమో ఏమో చలిజ్వరాలు అంత ముమ్మరంగా లేవు. రాత్రిళ్ళు దోమల బాధ చెప్ప శక్యంకాదు. ఒక్కో రోజు రాత్రి నిద్రమానుకుని అలా కూర్చోవలసిందే । దోమల బాధను నివారించుకోవడానికి మా వద్ద దోమతెరలు లేవు. ధనికులే దోమ

తెరల్ని ఉపయోగించు కుంటూ వుంటారు. బీదల కవి గగన కుసు-
మాలు. ఈ ప్రాంతంలో క్రొత్త వూర్లు ఎన్ని వెలసినా విశాలమైన అర
ణ్యాలకు ఎలాటి హానీ సంభవించలేదు. మేము తూర్పుకు పోయిన
కొలది అరణ్యాలూ అధిక మవసాగాయి.

మేము మొత్తం ఐదుగురం ప్రయాణం చేస్తున్నాము. మావెంట
సురతుడనే మగధభిక్షు వొకడు, మరి ఇద్దరు సింహళ భిక్షువులు వస్తు
న్నారు. సింహళ భిక్షువుల్లో సవిర సునందులు వయోవృద్ధులు. విస్తృత
మైన అనుభవ జ్ఞానం కలవారు. వారు 70 సంవత్సరాల వయస్సులో
శ్రద్ధా ప్రేరితులై ఈ సుదీర్ఘమైన పాదయాత్రను ప్రారంభించారు.
స్థవిరసునందులు మంచి ఆరోగ్యంగా వున్నారు. అయినా డెబ్బది యేండ్ల
వయస్సులో ఈ యాత్రను ప్రారంభించడం గొప్పసాహసమే అన
వలసి వస్తుంది. మేము వారి విశ్రాంతికి అవుసరమైన జాగ్రత్తలన్నీ
తీసుకుంటూ కేవలం అపరాహానంతరం ఒక యోజనందూరం ప్రయాణం
చేస్తున్నాము. మధ్యాహ్నపు విశ్రాంతి సమయాన్ని ఎన్నడూ వృథాపుచ్చే
వాళ్ళంకాదు. సునందులు ధర్మోపదేశాల్ని ఇస్తూండేవారు. జాతక కథల్ని
చెప్తూండే వారు.

రెండవ రోజున ప్రసేన జిత్తుడి కోసల రాజ్యానికి, శాక్యుల
రాజ్యానికి మధ్య సరిహద్దుగా పరిగణింపబడుతూన్న నదిని సమీపిం
చాము. చిన్న చిన్న నదుల్లోనూ నీరు వుండే రోజులవి. అయినా యీ
నదిని దాటటానికి మేమే మంతకష్టపడలేదు. నదినిదాటి శాక్యుల ప్రాచీన
భూమిలో కాలు పెట్టాము. కొద్దిదూరం వెళ్ళాక ఒక వటవృక్షం కనిపిం
చింది. సునందులు గద్గదస్వరంతో "బుద్ధభగవానులు ఒకనాడీ వటవృక్షం
కింద కూర్చుని వున్నారు. వృక్షం దట్టమైందికాదు. ఆకుల సందునుండి ఎండ
పొడ తథాగతుని శరీరం మిదపడుతోంది. ఇంతలో శాక్యుల మనుమడైన
కోసలరాజు విరూఢకుడు సైన్యంతో సహా అక్కడికి వచ్చాడు. అతడు
దాసీ పుత్రుడు. శాక్యు లతడిని అవమాన పరిచారు. ప్రతీకారాన్ని చేయ
డానికే శాక్యుల మీదకు దండు వెడలాడు. చెట్టుక్రింద ఎండపొడలో
వున్న బుద్ధుణ్ణి చూసి "భన్తే (స్వామీ!) ఇంత ఎండలో ఆ పలుచని
వృక్షం క్రింద ఎందుకూర్చున్నారు? ఇటు వచ్చి ఈ ఘటమైన

వట వృక్షంక్రింద కూర్చోండి ? అంటూ పరిసరంలోని మరొక దట్టమైన వట వృక్షాన్ని చూపించాడు విరూఢకుడు.

"నీవు చెప్పింది సత్యమే, మహారాజా! కానీ బంధుజనుల ఛాయ కూడా చాలా చల్లగా వుంటుంది సుమా!" అన్నాడు తథాగతుడు

విరూఢకుడు బుద్ధుని అభిప్రాయాన్ని తెల్సుకున్నాడు. అప్పటికి వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. అయితే, తరువాత శాక్యులను సంహరించి, తనను అవమానించినందుకు ప్రతికారాన్ని చేశాడు" అన్నారు సునందులు.

ఈ వట వృక్షం ఆనాడు బుద్ధభగవానులకు ఛాయను ప్రసాదించిన దేనని సునందుల నమ్మకం! ఈ వట వృక్షానికి వందసంవత్సరాలకు మించి వయసుండదని నేనూ, బుద్ధిలుడూ అనుకున్నాము. అయినప్పటికీ సునందుల వారి భక్తి, విశ్వాసాలను మనస్ఫూర్తిగా గౌరవించాము. శాక్యులను గురించి, విరూఢకుణ్ణి గురించి బుద్ధిలుడూ, స్థవిరులూ నాకెన్నో విషయాల్ని చెప్పారు. శాక్యులది గణతంత్ర ప్రభుత్వంట. వారి గణసంస్థ రాజ్యానికి సంబంధించిన సమస్త విషయాల్లోనూ, శాసనాలనూ, నిర్ణయాలనూ చేస్తూవుంటుంది. గణసంస్థ వుండే భవనాన్ని సంస్థాగారం అంటారు. ఒక మాటు కోసల దేశపు యువరాజైన విరూఢకుడు శాక్యుల గణసంస్థకు వచ్చాడు. అతడికీ సంస్థాగారంలోనే విడిది నిచ్చారు. పైకి శాక్యు లందరూ విరూఢకుడిని గౌరవిస్తూన్నారు. కానీ, మనసులో ప్రతి శాక్యుడూ ఇతణ్ణి ఘోరంగా ద్వేషిస్తున్నాడు మహానామ శాక్యుని దాసీ పుత్రికి పుత్రుడు విరూఢకుడు కొద్దిరోజుల తరువాత విరూఢకుడు తన పరివారంతో తన రాజ్యానికి వెళ్ళిపోయాడు. అతడు కూర్చున్న ఆసనాన్ని కడుగుతూ "దాసీ పుత్రుడు అపవిత్రం చేశాడు దీన్ని! తిరిగి పవిత్రం చేయడానికి ఎంత శ్రమించవలసి వస్తోందో !" అన్నదో దాసి. సరీగా అదే సమయాన తన బల్లేన్ని మర్చేపోయిన విరూఢకుని సైనికుడొకడు, తిరిగి తీసుకు వెళ్ళడానికి సంస్థాగారంలోకి వచ్చాడు. దాసి అన్నమాటల్ని విని పోయి తమ యువరాజుకు చెప్పారు. విప్పంటుకుంది. బుద్ధుడు దాసుడూ, ఆర్యుడూ, శూద్రుడూ, బ్రాహ్మణుడూ అనే వ్యత్యాసం లేని ఓ క్రొత్త మానవ జాతిని నిర్మించదలచాడు.

బుద్ధ మతాదర్శమే అది. బుద్ధుడు తన ఉపదేశాల్లో ఈ ఆదర్శాన్ని
ప్రకటించాడు. నాలుగు వైపుల నుండి వచ్చిన నదులు సముద్రంలో కలిసి
ఏకాకారాన్ని పొందినట్టు, బుద్ధమతాన్ని అవలంబించిన వివిధ దేశాల
ప్రజలూ, వివిధ జాతుల ప్రజలూ ఒకటై పోతారు. కాబట్టే చీనా,
కాంభోజ, గాంధార మొదలుగాగల అనేక దేశాల బౌద్ధులు, అనేక జాతు
లకు చెందిన బౌద్ధులు ఎప్పుడైన ఒక సంఘారామంలో కలవడం జరి
గితే గొప్ప ఆత్మీయతను అనుభూతికి తెచ్చుకుంటారు. అనిరుద్ధుడూ,
ఆనందుడూ మొదలైన శాక్య పుత్రులు బుద్ధసంఘంలోకి వచ్చి, బుద్ధ
ధర్మాన్ని ఎంతో అభివృద్ధికి తీసుకుపోయారు. వీరిద్దరూ ఆ భిక్షువు లయ్యే
ప్పుడు ముందుగా నాపితుడనే మంగలికి భిక్షు దీక్ష నిప్పించారు. అనం
తరం తాము దీక్షితు లయ్యారు. ఈ విధంగా సంఘంలో నాపితుడు
జ్యేష్ఠుడయ్యాడు. అనిరుద్ధుడూ, ఆనందుడు మొదలైన శాక్యపుత్రులు,
తమ జాతియాభిమానాన్ని, దురభిమానాన్ని విడిచి, నాపితుడికి నమస్క-
రించవల్సిన వారయ్యారు. కానీ, ఈ దురభిమాన రహితమైన సమా
నత్వపు భావన శాక్యులందరిలోనూ కలగడం ఎలా?

శాక్యభూమిలో వున్నప్పుడు నేనూ, బుద్ధిలుడూ తరచు ఇలాంటి
విషయాలను గురించే చర్చించుకుంటూ వుండేవాళ్ళం. రాజరికంలో
మానవుడికీ మానవుడికీ మధ్య విభేదాలూ, అసమానత వుండడం సహజం.
రాజతంత్రపు అభివృద్ధి ననుసరించి మానవుల్లోని వ్యత్యాసాలుకూడా
తీవ్రమౌతుంటాయి. మధ్యదేశంలో ఉచ్చనీచజాతి ప్రజల శరీర వర్ణా
ల్లోనూ వ్యత్యాసం వుంటుంది. కానీ, నేను తిరిగిన అనేక దేశాల్లో
మానవుల స్థితుల ననుసరించి భేదాలుండడాన్ని మాత్రమే చూశాను. శరీర
వర్ణంలో ఎలాటి భేదమూ వుండదు. చీనీప్రజల్లోనూ, తోఖర్ల లోనూ, అంతెం
దుకూ? మా ఉద్యాన భూమిలోనూ, స్థితుల ననుసరించ ప్రజల్లో వ్యత్యా
సాలూ, భేదాలూ వుంటాయేగానీ, శరీరపు రంగు ననుసరించి వుండవు.
తోఖర్లల్లోనూ, శకుల్లోనూ, శ్వేతహూణుల్లోనూ ఒక విధమైన సమా
నత్వం కనిపిస్తుంది. శ్వేతహూణ మహారాజయిన మిహిరకులుడు కాశ్మీర,
గాంధారులకు దేవాధిదేవుడే కావచ్చు. గర్వాన్నీ అధికారాన్నీ ప్రదర్శించ
వచ్చు. కానీ, తన సజాతీయులైన శ్వేతహూణుల్లో మాత్రం విధిగా

సోదరత్వాన్ని ప్రదర్శిస్తాడు. మరి మౌఖరుల పరమ భట్టారకుడైన ఈశ్వరవర్మ తన సజాతీయుల ముందు సోదరత్వాన్ని ప్రదర్శించ గలడా?

శాక్యగణంలోనూ కొద్ది గొప్పల వ్యత్యాసాలున్నాయి. దాసుల్నీ దాసీలనూ పశువుల్లా కొంటూ అమ్ముతుంటారు. శాక్యులకు జాతీయ దురభిమానంకూడా ఎక్కువే! ఈ దురభిమానం కారణంగానే కోసల రాజయిన ప్రసేన జిత్తుకికి తమ కన్యనీయడానికి శాక్యులు వప్పుకోలేదు. చివరకు మహానామ శాక్యుడు తన దాసీకి కలిగిన వర్షాభక్షత్రియాను ప్రసేనజిత్తుడి కిచ్చి వివాహం చేశాడు. ఈ దాసీ కన్యకు కలిగినవాడే విరూఢకుడు. ఇలాంటి కొన్ని లోపా లున్నప్పటికీ శాక్యభూమిలోని శాక్యులందరూ సమానులనీ, సోదరుతుల్యులనీ వారి భావము. శాక్యుల్లో వైభవం దృష్ట్యా అసమానత వుండవచ్చు. కానీ శాసనాధికారాల్లో అందరూ సమానులే. గణరాజ్యమన్న పదాన్ని మొదటగా ఇక్కడే విన్నాను. బౌద్ధ భిక్షువులకూ శాక్యభూమికీ అవినాభావ సంబంధముంది. బౌద్ధ భిక్షువుల్ని శాక్యపుత్రీయులనీ అంటారు. బౌద్ధ సంఘాల్లో ప్రతి పనీ, వ్యక్తుల ఆజ్ఞల ననుసరించి కాక, సంఘ సమ్మతితో జరుగుతూ వుంటుంది. బౌద్ధ సంఘాలమీద గణతంత్ర ప్రభావము, గణసంస్థ ప్రభావము స్పష్టంగా కనుపిస్తుంది. బుద్ధుడు గణతంత్ర రాజ్యంలో పుట్టాడు. బాల్యంలో గణరాజ్య పద్ధతుల్ని తెల్సుకున్నాడు. పెద్దవాడయ్యాక మగధ, కోసల, వత్స మొదలైన రాచరిక రాజ్యాల్లోకి వెళ్ళాడు. ఆ రాజ్యాలూ, రాజులూ, బుద్ధుణ్ణి దేవుడిలా పూజించారు. అయినా, అతడికి రాచరిక పద్ధతులూ, ఆచారాలూ నచ్చలేదు. రాచరిక వ్యవస్థ కంటే గణతంత్ర వ్యవస్థే ఉత్తమమైనదనీ భావించాడు. కనుకనే గణ తంత్రంలోని ముఖ్య విషయాలన్నింటినీ తన భిక్షు సంఘాల్లో ప్రవేశ పెట్టాడు. సంఘ సమావేశం, మతస్వీకారం (ఓటు వేయడం), మత శలాక వితరణం, యద్భూయసిక (అధిక సంఖ్య)కు ప్రాధాన్యత నిచ్చి, వారి నిర్ణయాన్ని అంగీకరించడం – మొదలైన విషయాలన్నింటినీ గణ తంత్రంనుండి సంఘాలు స్వీకరించాయి. గణరాజ్యాల్లోకూడా లేని వ్యక్తి గత ఆస్తి తొలూకు సామాన్య నియమాన్ని బుద్ధుడు తనసంఘాల్లో ప్రవేశ

పెట్టాడు. సహజంగా భిక్షువుల శరీరాలమీద వుండే ఎనిమిది వస్తువులు మాత్రమే వ్యక్తిగత సంపత్తిగా భావించబడతాయి. ఇల్లూ, తోట–ఇతర సమస్త స్థావర జంగమ సంపత్తి అంతా సంఘగతమైందిగా భావించబడు తుంది. ఈనాడు సంఘాల్లో, ఆస్తి తాలూకు నియమాలు వినయపిటకంలో చెప్పినంత నిర్దుష్టంగా పాటించబడడంలేదు. అయినప్పటికీ ఎంతో కొంత మేరకు, వ్యక్తిగత, సంఘగత, ఆస్తి తాలూకు నియమాల్ని సంఘాలు పాటిస్తూనే వున్నాయి: మేము అయిదుగురం భిక్షువులం తలా ఒకదేశానికి చెందిన వాళ్ళం: శాక్యభూమిలో పర్యటిస్తూ గొప్ప ఆత్మీయులమూ, బంధువులమూ అయ్యాము:

శాక్యభూమిలో తథాగతుని వంశీయుల్ని కల్సుకుందామని చాలా ప్రయత్నించాము. కానీ, ఒక్క శాక్యవంశ పరివారమూ కనుపించ లేదు. నిజంగానే విరూఢకుడు శాక్యులను సర్వనాశనం చేసినట్టున్నాడు. ఒకరిద్దరు శాక్య భిక్షువుల్ని మాత్రం చూశాము. విహూఢకుడి కత్తికి ఎరకాకుండా బ్రతికిపోయిన శాక్యులు ఉత్తరదిశన గల హిమవత్పర్వతాల్లోకి పారిపోయారుట: శాక్యభూమిలో అడవు లెక్కువ. ఆ అడవుల్లో కిరాతకులు నివసిస్తూంటారు. వీరి ముఖ్యవృత్తులు వేట. పశుపాలన: వీరికి గడ్డాలూ, మీసాలూ మొలవ్వు. చట్టిముక్కులూ, ఉబికిన కను రెప్పలూ, వంకర కను బొమ్మలూ కల వీరి ఆకారాన్ని చూస్తే మొదట చాలా విచిత్ర మనిపించేది. కానీ, తరువాత జీవితంలో తురుష్కుల్ని, అవారుల్ని, చీనీ ప్రజల్ని చూశాను. వారి ఆకారాలూ ఇలాగే ఉంటాయి. కిరాతకులు ఇప్పటికీ వన్యజీవితాన్ని వదల్లేదు. బౌద్ధ ధర్మం వాళ్ళల్లో అంతగా వ్యాప్తిని చెందలేదు.

శ్రావస్తికి 12 యోజనాల దూరంలో క్రకఛంద బుద్ధుడు పుట్టిన ప్రదేశం ఉంది. ఇతడు గౌతమ బుద్ధుడు కంటె ముందువాడు. ఈ ప్రదేశంలో అశోకుని శిలాస్తంభము, స్తూపమూ ఉన్నాయి. ఇక్కడికి ఒక యోజనం దూరంలో గోనాగమ బుద్ధుడు జన్మించిన ప్రదేశంఉంది-మరు సటి రోజు కపిలవస్తును చేరుకున్నాము. అక్కడ ఏం చూశాము? శ్రావస్తి, కౌశాంబీలలో ప్రజలంటూ ఉన్నారు. ఇండ్లు ఉన్నాయి. భవనాలూ ఉన్నాయి. కానీ, కపిలవస్తులోని ఈ శిథిలాల్లో ఏముంది? శుద్ధో

ధనుడి రాజప్రాసాదం ఎక్కడో ఎలా తెల్సుకోవడం? ప్రజలక్కడ సిద్ధార్థుడివీ మాయాదేవీ విగ్రహాల్ని స్థాపించారు. కొన్ని మొండిగోడల్ని చూపి 'ఇక్కడ సిద్ధార్థుడి గ్రీష్మ - ప్రాసాదం ఉండే'దన్నారు. మరో చోటు చూపి 'ఇక్కడ హేమంత ప్రాసాదం ఉండే'దన్నారు. సిద్ధార్థుడు రోగిని చూసిన ప్రదేశాన్ని.విలువిద్య నభ్యసించిన ప్రదేశాన్ని చూశాం. సిద్ధార్థుడు బుద్ధుడయ్యాక మొదటగా తండ్రికి దర్శనమిచ్చిన ప్రదేశాన్ని చూశాము. శాక్య రాజకుమారులు మంగలికి భిక్షుదీక్ష నిప్పించిన ప్రదేశాన్ని, విరూఢకుడు శాక్యుల్ని సంహరించిన ప్రదేశాన్నికూడాచూశాము.

అన్నింటినీ చూశాము, బాగానేవుంది. కానీ, అసలక్కడ కపిల వస్తు నగరం లేదేం ? పాడుపడిన మట్టిదిబ్బలూ, పడిపోయిన మొండి గోడలు మాత్రం వున్నాయి ! అంతటి అలౌకిక మహాపురుషుడు జన్మించిన నగరానికి ఈనాడీ స్థితి పట్టిందా ?

కపిలవస్తునుండి బయల్దేరి మర్నాడు లుంబినికి వెళ్ళాము. ఇక్కడ అశోక మహారాజు ఒక శిలా స్తంభాన్ని పాతించి, దానిమీద "శాక్యముని బుద్ధుడు ఇక్కడ జన్మించాడు !" అన్నవాక్యాన్ని చెక్కించాడు. మాయాదేవి నెలలు నిండాక పురిటికి కపిలవస్తు నుండి తనతండ్రి నగరమైన "కోలియ"కు వెళ్తూన్నది. మార్గమధ్యంలో లుంబినీ వనం వద్దకు వచ్చేసరికి ప్రసవవేదన అధికమైంది. లుంబినీ వనంలోనే ప్రసవించింది. ప్రపంచాన్నుండి దుఃఖాన్ని, అంధకారాన్ని తొలగించాలని సంకల్పించుకున్న మహాపురుషుడు ఇక్కడే జన్మించాడు. ఆనాడు వైశాఖ పౌర్ణమి: లుంబినీ వనం పచ్చని ఆకుల్తో, పలురకాలైన పూవుల్తో కళ కళ్ళాడులోంది. వనంలోని పుష్కరిణి నిర్మలమైన స్వచ్ఛమైన జలంతో నిండివుంది. ఇప్పుడూ లుంబినీ వనంలో ఓ పుష్కరిణీ వుంది. పుష్కరిణికి ఉత్తరంగా సాలవృక్ష శాఖ నొకదాన్ని పట్టుకొని వున్న మాయాదేవి ప్రతిమ ఒకటుంది. అక్కడే బుద్ధుడు జన్మించాడుట. ప్రక్కనే ఒక బావివుంది. ఆ బావిలోని నీళ్ళతోనే సద్యోజాత శిశువును స్నానం చేయించారుట. మేమూ ఆ బావిలోని నీళ్ళతోటి, పవిత్ర పుష్కరిణీ జలంతోటి ఆచమనం చేసి మా జన్మల్ని తరింప చేసుకున్నాము.

ఈనాడు కపిలవస్తు నిర్మానుష్యమైన ఘోరారణ్యంగా మారి పోయింది. కపిలవస్తు నుండి లుంబినికి వచ్చే మార్గంలో ఏనుగులు, సింహాలు కూడా వున్నాయి. చాలా జాగ్రత్తగా ప్రయాణం చేయవల్సి వుంటుంది.

ఈ పవిత్ర స్థలాలను చూస్తూన్నంతసేపూ సునందులవారు కన్నీరు కారుస్తూనే వున్నారు. బుద్ధభగవానుడు లుంబినిలో, మృత్యుశయ్య నుండి ఆనందుడికి చెప్పిన తుదివాక్యాల్ని సునందులవారు గద్గదస్వరంతో ఉచ్చరించారు :-

"ఆనంద్ ! శ్రద్ధాళులైన కులపుత్రులకు ఈ నాలుగు ప్రదేశాలూ చూడతగినవి. వైరాగ్యప్రదమైనవి !"

"ఏ నాలుగు ?"

"బుద్ధుడు పుట్టిన స్థలం (లుంబిని) ఒకటి, బుద్ధత్వాన్ని పొందిన స్థలం (బోధగయ) రెండు, ధర్మచక్రాన్ని ప్రవర్తిల్లచేసిన స్థలం (సారనాథ్) మూడు, బుద్ధుడు నిర్వాణాన్ని పొందిన స్థలం (కుసీనారా) నాలుగు ఈ నాలుగూ దర్శనీయాలైన ప్రదేశాలు. ఆనంద్ ! భవిషత్తులో బౌద్ధ భిక్షువులూ, గృహస్థులూ ఈ ప్రదేశాల్ని చూడ్డానికివస్తారు. ఇక్కడ బుద్ధుడు జన్మించాడు . ఇక్కడ బుద్ధత్వాన్ని పొందాడు ... ఇక్కడ ధర్మచక్రాన్ని ప్రవర్తిల్ల చేశాడు .... ఇక్కడ నిర్వాణాన్ని .. "

లుంబిని నుండి ఘోరారణ్యాల గుండా దక్షిణ దిశకు ప్రయాణం చేస్తున్నాము. ఈ అరణ్యాల్లోనే రామగ్రామస్తూపం కనిపించింది. ఈ స్తూపంలో తథాగతుని అస్థిధాతువుల్లోని ఎనిమిదవ వంతును నిక్షిప్తం చేశారు. అశోకుడు మిగిలిన ఏడుస్తూపాల్లోని ధాతువుల్ని తెప్పించి, తన రాజ్యంలోని ప్రసిద్ధస్థలాల్లోనూ, నగరాల్లోనూ క్రొత్తస్తూపాల్ని నిర్మించి, వాటిలో ఈ అస్థి ధాతువుల్ని భద్రపరిచాడు ! అయితే రామగ్రామ స్తూపాన్ని మాత్రం ముట్టుకోలేదంటారు. రామగ్రామం ఒకప్పుడు స్థానిక గణరాజ్యానికి రాజధాని. ఇప్పుడు మహారణ్యంగా మారి పోయింది !

## కుసీనగరం:

లుంబిని నుండి 15 రోజులు నడిచి, బుద్ధుడు నిర్వాణాన్ని పొందిన స్థలం (కుసీ నగరం) చేరాము. నేను అనేక సంప్రదాయాల మహా పరినిర్వాణ సూత్రాల్ని చదివాను. నాకంటే కూడా అధికంగా ఇతర సంప్రదాయాల (నికాయాల) మహా పరినిర్వాణ సూత్రాలను బుద్ధిలడు చదివాడు. సునందులవారు తమ నికాయపు మహాపరినిర్వాణ సూత్రాన్ని మా కొరకు పఠించారిక్కడ. తథాగతుని జీవనలీల ఇక్కడే సమాప్తమయింది. బుద్ధుడు తుదిశ్వాసల్ని విడిచిన పవిత్ర భూమిని చూసి మా హృదయాలు ఉద్విగ్నమయ్యాయి. శోకాకులమయ్యాయి। బుద్ధుని జీవితకాలంలో ఈ కుసీనగరం ఒక ప్రసిద్ధ పట్టణం. మల్లుల గణరాజ్యానికి రాజధానిగా వుండేది. తథాగతునికి అంత్యక్రియలు జరిపే సౌభాగ్యం మల్లగణానికే దక్కింది. ఈ కుసీ నగరాంతంలో కల రెండు సాల వృక్షాల మధ్య సింహశయ్యపై బుద్ధుడు శరీరాన్ని వీడాడు. ఇక్కడే భగవానుడు సుభద్రుణ్ణి తన అంతిమ శిష్యుడిగా పరిగ్రహించాడు. కుసీనగరం ధ్వంసమయింది. కొద్ది ఇండ్లు మాత్రం వున్నాయి. బుద్ధుడు నిర్వాణాన్ని పొందిన సాల వృక్షాల స్థానంలో పరినిర్వాణ స్తూపంవుంది. ఆ స్తూప పరిసరాల్లో విభిన్న సంప్రదాయాల బౌద్ధులూ తమ విహారాలను కట్టించుకున్నారు. వాటిలో ఆ యా సంప్రదాయాలకు చెందిన భిక్షువులుంటున్నారు. బుద్ధుని దహన క్రియలు జరిగిన ప్రదేశాన్ని (ముకుటబంధనం) కూడా మేము చూశాము.

కుసీనగరం నుండి వైశాలికి బయలుదేరాము. ఇక్కడికి 22 యోజనాల దూరంలో ఆగ్నేయ దిశగా వైశాలి పట్టణం వుంది. రెండు రోజుల ప్రయాణానంతరం మధ్యదేశంలోని మహానదుల్లో ఒకటైన మహీ నదిని దాటాము. ఇక్కడి భూమీ, గ్రామాలూ, లుంబినీ, కుసీనారా ప్రాంతాల్లోవలెనే వున్నాయి. ఈ ప్రాంతంలోనూ వరివంట ఎక్కువ. చేలల్లో పంటకు వచ్చిన వరి కంకులు తలలూపుతున్నాయి. వర్షాలు అధికమైతే పంటలు దెబ్బతిని రైతులు కరువు కాటకాలకు గురి అవుతారు. ఈ సంవత్సరం వర్షాలు తగు మాత్రంగా కురిశాయి. పంటలు బాగా పండాయి.

రైతులు ఆనందంగా వున్నారు. మేము ఐదుగురం కలిసే యాత్ర చేస్తున్నాము. మధ్యదేశాన్ని చూస్తుంటే స్థవిర సునందులకు తన మాతృభూమయిన సింహళం జ్ఞప్తికొస్తోంది. మగధ, కోసల దేశాల భాషకూ సునందుల వారు మాట్లాడే సింహళ భాషకూ చాలా వ్యత్యాసం వుంది. అయితే, ఇక్కడి ప్రజలు నా ఉద్యాన భాషకంటే, సునందుల వారి సింహళ భాషనే బాగా అర్థం చేసుకోగలుగుతున్నారు. శాక్య భూమిలోకి వచ్చి ప్రాచీన గణతంత్ర రాజ్యాన్ని గురించి విన్నాక నాలో భావతరంగాలు ఉవ్వెత్తున లేచాయి. ఎవరినీ దుఃఖంలో చూడలేను. ఏ జీవికయినా కొద్దిపాటి దుఃఖం కలిగితే నా హృదయం పరితపించిపోతుంది. ఆపుకున్నా ఆగని పరివేదన కన్నీరై ప్రవహిస్తుంది. ఇంతటి పరదుఃఖకాతరత ఒకరకమైన బలహీనతే అవుతుంది. వయస్సు గడిచిన కొలది నాలోని బలహీనత మరీ అభివృద్ధయింది. నా శక్తి కొలది దుఃఖితులకు, దరిద్రులకూ, బాధా సర్పద్రష్టులకూ సేవచేస్తుండేవాణ్ణి. ఒక్క మానవుడు, అందునా సాధన రహితుడు ప్రపంచంలోని అనంత దుఃఖాల్లో వేగిపోయే తోటి మానవులకు ఏ విధంగా ఉపశమనాన్ని కలిగించగలడు? తథాగతుడు ఈ ప్రపంచంలో దుఃఖం వుందన్నాడు. దుఃఖానికి కారణాన్ని చెప్పాడు. దుఃఖ వినాశాన్ని చెప్పాడు. దుఃఖవినాశమార్గాన్ని కూడా నిర్దేశించాడు. తెలివిగల మానవుడు బుద్ధుడు చెప్పినమార్గాన్ని నడిచి జీవితలాభాన్ని పొందుతాడు. అలా పొందినవారు, పొందుతూన్న వారు కూడా వున్నారు. ఎంత అయినా, ప్రపంచంలో దుఃఖం అపారంగా ఉండి, సముద్రంలా ఉరకలు వేస్తోంది. ఒకమానవుడు అంజలితో చిమ్మి ఎన్నాళ్టికి సముద్రాన్ని ఇంకించగలడు? బుద్ధభగవానుడి ఆశయం కూడా ఎవడికి వాడు అంజలితో చిమ్మి దుఃఖ సముద్రాన్ని ఇంకించడం అయివుండదని నే ననుకుంటున్నాను. బాధలు తగ్గి సాధారణ ప్రజలు సుఖపడాలని వారి భావన అయివుంటుంది. కనుకనే, బహుజన హితం కొరకూ, బహుజన సుఖం కొరకూ తన నూతనధర్మాన్ని ప్రచారం చేశాడు బుద్ధుడు. తన శిష్యులకూ, అదే లక్ష్యాన్నిబోధించాడు.

ఇంతవరకూ రాచరికపు రాజ్యాల్ని చూశాను. వాటి గురించి విన్నాను. ఇప్పుడు గణరాజ్యాల్ని గురించి వింటున్నాను. గణరాజ్యం

ప్రజల రాజ్యం. ప్రజలు పరిపాలించే రాజ్యం. ఇప్పుడు మేము చూస్తున్న ఈ ప్రదేశంలో వేయి సంవత్సరాల క్రితం గణరాజ్య ముండేదట. రాచరిక రాజ్యాల్లో రాజొక్కడు దేశాన్ని పరిపాలిస్తూ వుంటాడు. అతడు తనా, తన పరివారపు సుఖాన్ని, స్వార్థాన్నీ చూసుకున్నాకనే ఇతర్ల సుఖాన్ని గురించి ఆలోచిస్తాడు. గణరాజ్యాల్లో అలా వుండదనీ, సాధారణ ప్రజల సుఖమే ఆదర్శంగా వుంటుందనీ అనుకుంటున్నాను. కోసల, మగధదేశాల సరిహద్దుల్లో ఆ రోజుల్లో ఎన్నో గణరాజ్యా లుండేవిట. "మల్లగణాలు తొమ్మిది, లిచ్ఛవి గణాలు తొమ్మిది, మొత్తం పదునెనిమిది" అన్నాడు బుద్ధుడు. మేము దాటి వచ్చిన మహీనది మల్లగణాలకు,లిచ్ఛవిగణాలకు సరిహద్దుగా పరిగణింపబడు తూండేది. వైశాలి శక్తిలోనూ సమృద్ధిలోనూ వీటన్నిటికీ తలమానికం లాంటిది.

బుద్ధుడు వెనక్కి తిరిగి తుదిసారి వైశాలినగరానికి నమస్కరిస్తూ ఆనందుడితో ఇలా అన్నాడు: "ఆనంద్, వైశాలి చాలా రమణీయంగా ఉంది. ఉదయన చైత్యం, గోమతక చైత్యం, సప్తామ్రక చైత్యం, బహుపుత్రక చైత్యం, సారందద చైత్యం—ఇవన్నీ బహురమణీయంగా వున్నాయి."

పై చెప్పిన చైత్యాలన్నీ నగరద్వారానికి వెలుపల నాలుగు దిక్కులా వున్నాయి.

బుద్ధుడు అంబాపాలి ఆతిథ్యాన్ని స్వీకరించాడు. బుద్ధుణ్ణి చూడటానికి లిచ్ఛవులు అంబాపాలి వనానికి వచ్చారు. అప్పుడు తన భిక్షువుల్తో ఇలా అన్నాడు బుద్ధుడు: "లిచ్ఛవుల పరిషత్తును చూడండి. దీన్నే త్రాయత్రింశ దేవతల పరిషత్తుగా భావించండి."

వైశాలి ఒకప్పుడు రమణీయమైన పట్టణమే. కానీ, ఇప్పుడు శిథిలాలు మాత్రం మిగిలివున్నాయి. లిచ్ఛవులు తమ రాజకీయ వ్యవహారాలను చర్చించుకునే ఆ ప్రసిద్ధ సంసాగారం ఇప్పుడేది? వెతికినా కనుపించదు? తథాగతుడు వైశాలి గణరాజ్యపు న్యాయాన్ని ఎంతగానో ప్రశంసించేవాడు. వైశాలి గణరాజ్యపు న్యాయం జగద్వంద్యం। అపరాధిని న్యాయాధీశుడు విచారించి, అపరాధి అపరాధం చేయకపోతే విడిచి పెడతాడు. అపరాధం చేసినట్లయితే తను దండనను విధించకుండా

ఉచ్ఛ న్యాయాధీశుని వద్దకు పంపుతాడు. అతడూ విచారించి అపరాధం ఋజువు కాకపోతే వదిలి వేస్తాడు. ఋజువైతే సూత్రధారుడి వద్దకు పంపుతాడు. అతడు అష్టకులికుని వద్దకు పంపుతాడు. అతడు సేనాపతి వద్దకూ, సేనాపతి ఉపరాజువద్దకూ, ఉపరాజు గణపతి వద్దకు పంపుతాడు. గణపతికూడా విచారిస్తాడు. నేరం ఋజువు కాకపోతే వదిలివేస్తాడు. ఋజువైనా, తన ఇష్టప్రకారం శిక్ష విధించడు. శిక్షాస్మృతిని చూసి ఏ శిక్షను విధించాలో దాన్నే విధిస్తాడు. న్యాయ విచారణ కొరకు వైశాలి ప్రజలుఎంతగా పరిశోధించేవారో ? మరికి తథాగతుడు ఎందుకు కీర్తించడు వాళ్ళని ?

బుద్ధుడు వైశాలి గణరాజ్యాన్ని ఆదర్శంగా పెట్టుకుని భిక్షు సంఘాన్ని నిర్మించాడు. వైశాలీ నగరానికి వుత్తరంగా, వనమధ్యంలో కూటాగారశాల వుంది, అక్కడికి బుద్ధుడు అనేకమార్లు వచ్చి వున్నాడు. బుద్ధుడు తన జీవితపు అంతిమ సంవత్సరాన్ని ఈ కూటాగారశాలల్లోనే గడిపాడు. ఇక్కడ అశోకుడు శిలా స్తంభాన్ని స్థాపించాడు. వైశాలికి నాలుగు వైపులా నాలుగు చైత్యాలూ ఒక ఉద్యానపుష్కరణీ వున్నాయి. తూర్పున ఉదయన చైతన్యం, దక్షిణాన గౌతమక చైత్యం, పశ్చిమాన సప్తామ్రక చైత్యం. ఉత్తరమున బహుపుత్రక చైత్యం వుంది. ఈ చైత్యాలు ఇప్పటికీ వున్నాయి. అయితే శిథిలావస్థలో వున్నాయి. ఇవే కాక కోరమట్టక, చాపాల చైత్యాలుకూడా వుండేవి. పశ్చిమ ద్వారం వద్దకల చాపాల చైత్యంలోనే బుద్ధుడు ఆనందుడితో ఇలా అన్నాడు : "ఇంకొక్క మూణ్ణెల్లకు ఈ జీవితం సమాప్తమౌతుంది." ముఖ్య చైత్యాలన్నీ ఇప్పుడు శివాలయాలుగా మారిపోయాయి. బౌద్ధులు మొదట విగ్రహాల నారాధించేవారు కారు. స్తూప, పదచిహ్నా, పీట, బోధి వృక్షా అను బుద్ధుని జీవితానికి ప్రతీకలుగా భావించి పూజిస్తూండేవారు. ఇప్పుడు బుద్ధ ప్రతిమల్ని పూజిస్తూన్నారు. ఒకప్పుడు బ్రాహ్మణులు యజ్ఞయాగాది క్రతువుల ద్వారా భగవంతుని సంప్రీతుని చేసుకునేవారు. ఇప్పుడు వారూ శివలింగాన్ని, దేవతా విగ్రహాల్ని పూజిస్తున్నారు. వైశాలికి చుట్టుపట్ల వున్న చైత్యాలన్నీ శివాలయాలుగా మారాయి వాటిలో శివుడి, గౌరి విగ్రహాలకు బదులు, లింగాన్ని పూజిస్తున్నారు. లింగపూజ గొప్ప

ఆశ్చర్యకరమైన విషయాల్లో ఒకటి! శైవుల్లో లింగ పూజలకు ప్రాధాన్యత హెచ్చుతూన్నది. ఈ లింగాల్లో కొన్నింటికి ప్రళయ, శాంత భావాల్తోవున్న మహేశ్వరుడి ముఖాన్ని చెక్కుతారు. కొన్ని లింగాలు వొక వైపున మూడు రేఖలు కలిగి స్పష్టంగా లింగ ఆకారాన్ని కలిగి వుంటాయి.

నిజంగానే వైశాలి రమణీయ నగరం! అక్కడి ప్రజలు సుఖజీవనులు. కానీ, పరస్పర ద్వేషాల కారణంగా వైశాలి తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి, మగధరాజు అజాతశత్రుడికి అధీనమయింది. కాక పోయినా, చిన్న చిన్న రాజ్యాలను ఉదరస్థం చేసుకుని పొట్టలు పెంచుకున్న మహా సామ్రాజ్యాల మధ్యన ఒక చిన్న గణరాజ్యం ఎన్నాళ్ళు మనగలుగుతుంది? రాచరిక రాజ్యాలూ, చిన్న రాజ్యాల్ని అధీనం చేసుకుని, తమ సరిహద్దుల్ని, బలాన్ని పెంచుకుంటాయి. మరి గణరాజ్యాలలా చేయడానికి వీలుకాదు. ఇవి కేవలం తమ వంశానికి చెందిన భూముల వరకే వుంటాయి. అన్యరాజ్యాల్ని, ప్రదేశాల్ని కాజేయాలని చూడవు! అజాత శత్రువు తరువాత మగధ సింహాసనాన్నధిష్టించిన చంద్రగుప్తుడు, అశోకుడు, కపిషాతో సహా సమస్త జంబూ ద్వీపానికే చక్రవర్తులయ్యారు. వీరు తమ శత్రువులపైకి ఎంతటి జన సమూహాన్ని పంపగలరో వూహించవచ్చు! వైశాలి గణరాజ్యం. గణరాజ్యాల్లో, తమ స్వాతంత్ర్య పరిరక్షణ కొరకు స్త్రీ. బాల, వృద్ధులందరూ కత్తిబట్టి కదనరంగానికి ఉరకడం సహజం! అయినా వారి మొత్తం సంఖ్య కొన్ని వేలను మించదు. మగధరాజు కొన్ని లక్షల సైన్యాన్ని వీరిమీదకు పంపగలడు! పరస్పర ద్వేషాలతో మలినం కాకపోయినట్లయితే వైశాలి మరికొద్ది తరాలుతనస్వాతంత్ర్యాన్నికాపాడుకోగలిగేదేమో! అజాత శత్రుడూ,అతడి వంశీయుల వరకూఎలాగో స్వాతంత్ర్యాన్ని నిల బెట్టుకున్నా నందవంశపు కాలంలో వైశాలి ఏవిధంగానూ తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోలేదు! ఈ కటుసత్యం నన్ను నిరాశలో, విషాదంలో ముంచివేసింది రాజరిక రాజ్యాల స్థానంలో గణరాజ్యాలు నెలకొని, సాధారణ ప్రజలసుఖజీవను లవాలనే నా కోరిక కొనసాగడం అసంభవమని తెలుసుకున్నాను. గణరాజ్యాలకు రాణీలా భాసిల్లిన వైశాలి

తాలూకు స్ఫురణ నా మనస్సును ఎప్పుడూ ఆనందపరుస్తూంటుంది. అయితే, సాధారణ ప్రజల భవితవ్యం అంధకార సదృశమేనా! వారికిక వెలుగంటూ లభించదా? ఈ ప్రశ్నలకు ఎవరు సమాధానం ఇస్తారు? ఒక్క మానవులేకాదు. ఈ సృష్టిలోని ప్రతి ప్రాణీ అంధకారాన్ని నిర్జించి, సుఖాన్నీ, వెలుగునూ పొందాలని నా కోర్కె!

వైశాలిలో, లిచ్ఛవుల వంశీయులను చూశాను. వారిలో ఆ వెనుకటి ధైర్య సాహసాలు ఇంకా వున్నాయి. అయితే వారిప్పుడు సాధారణ రైతులుగానో, మౌఖరుల సైనికులుగానో కాలం గడుపుతున్నారు. కోసలరాజు అత్యాచారాలకు భయపడి మల్ల-శాక్యులు హిమాలయ పర్వతాల్లోకి పారిపోయినట్లు, లిచ్ఛవులుకూడా నేపాల్ దేశానికి వెళ్ళి, అక్కడ రాజ్యాల్ని స్థాపించారు. నేపాల్ దేశంలోని లిచ్ఛవులరాజ్యాన్ని గురించి ఇలా అన్నాడు బుద్ధిలుడు: "వీరక్కడ గణరాజ్యాన్ని స్థాపించలేదు. ఏకచ్ఛత్ర. నిరంకుశ రాచరిక రాజ్యాన్ని స్థాపించారు."

వైశాలి నుండి బయల్దేరి మూడు రోజులు ప్రయాణంచేసి గంగా తీరాన్ని చేరాము.

అక్కడ ఐదునదులు కలుస్తాయంటారు. వాటిలో మహీ, గంగా, శోణ, ఈ మూడే పెద్దవి. మిగిలిన రెండూ చాలాచిన్న నదులు! గంగకు అటువైపున మగధ దేశముంది ఇటు వ్రజదేశముంది. నావలో గంగను దాటుతుండగా ఆనందుడి మృత్యుకథ జ్ఞాపకమొచ్చింది. ఆనందుడీ గంగా ప్రవాహంలో పడి చనిపోయాడు. అతడి శరీరం మాదంటే మాదని మాగధీయులూ, వ్రజయులూ పోట్లాడుకున్నారు. గంగకు కుడివైపున పాటలీపుత్ర నగరముంది. బుద్ధుని జీవితకాలంలో ఇది పాటలిగ్రామం గానే వుంది. అప్పుడప్పుడే అభివృద్ధి కొస్తోంది, క్రమంగా మహా నగరమైంది. సమస్త జంబూద్వీపానికీ అధిపతులైన చంద్రగుప్తుడు, అశోకుడు ఈ పాటలీపుత్ర మహానగరంనుండే పరిపాలించారు. గుప్త నృపతులకూ ఈ పాటలీపుత్ర మహానగరమే రాజధాని! ఆ వెనుకటి రాజలక్ష్మి ఇప్పుడు ఎన్నోభాగాలుగా విభక్తమైంది. పాటలీపుత్ర వైభవంగూడా కన్యాకుబ్జం మొదలైన పట్టణాలకు తరలించబడింది. మౌర్య ప్రాసాదా

ంకు గల విశాల స్తంభాలను చూసినప్పుడు "నిజంగానే వీటిని అసురులు తయారు చేశారేమో!" అనిపిస్తుంది.

మగధ భూమి ఎంతో పవిత్రమైంది. సిద్ధార్థుడు బుద్ధత్వాన్ని పొందిన వజ్రాసనం (బోధగయ) ఈ భూమిలోనే వుంది. బుద్ధుడు అనేక ధర్మోపదేశాలిచ్చిన రాజగృహమూ ఇక్కడే వుంది. తథాగతుని చరణ రజస్పర్శతో పునీతమైన గృధ్రకూట, నలందా కూడా మగధ దేశంలోనే వున్నాయి. మేము పూరక యాత్ర చేసి వెళ్ళడమేకాకుండా, నలందాలో కొన్నాళ్ళుండి, ఓ గొప్పపండితుని చరణసాన్నిధ్యంలో విద్యాధ్యయనం చేయాలనీ అనుకున్నాము. చంద్రగోమి, చంద్రకీర్తి లాంటి మహాపండితుల చరణ కమలాల ముందు కూర్చుని విద్యను అభ్యసించే అదృష్టం అందరికీ లభిస్తుందా?

# 8 వ అధ్యాయము

# సింహళంలో

(క్రీ. శ. 547)

నేనూ, బుద్ధిలుడూ పుట్టుకతోనే తిరుగుబోతులం! ఎప్పుడూ దేశాలు తిరుగుతూ వుంటేగాని మా మనస్సులకు ఆనందంగా వుండదు. భిక్షువునయ్యాక సుభూమి విహారంలో నాలుగేండ్లు వున్నానంటే, అప్పటికింకా దేశాటనలోని ఆనందం నా అనుభవంలోకి రాకపోవడం వలననే అనుకుంటున్నాను. దేశాలు తిరగడం కూడా ఓ రకం వ్యసనమే అనాలి! ఈ వ్యసనం పట్టిందా జన్మాంతరం వరకూ విడువదు. ఒకమాటు దేశ సంచారంలోని ఆనందాన్ని రుచిచూశాక, నలందాలో మూడేండ్లు ఒకే చోట ఎలా వుండగలిగామనేది నిజంగా ఆశ్చర్య పడవల్సిన విషయం. అయితే, నాలో విద్యావ్యసనం కూడా తగు పాళ్ళల్లో వుంది. కనుకే నలందాలో మూడేండ్లు వుండగలిగాను. మేము నలందాలోవున్న మూడు సంవత్సరాల్లోనూ అసంగుని "యోగాచార దర్శనాన్ని" దిఙ్నాగుని ప్రమాణశాస్త్రాన్నీ పఠించాము. విద్యాధ్యయనానికి ఇంతటి సదవకాశం తరువాత జీవితంలో మరెక్కడా, ఎన్నడూ లభించలేదు.

రాజగృహం, నలందా, ప్రజాసనం వరకూ సునందుల వారూ, మేము కలిసే యాత్రచేశాము. తరువాత వారు తమ దేశానికి వెళ్ళిపోయారు. నలందాలో మా విద్యాధ్యయనం ముగిశాక తప్పక సింహళం రావల్సిందన్నారు. వారు పిల్చారనే కాకుండా, సముద్రమధ్యంలో వున్న సింహళ ద్వీపాన్ని చూడాలన్న ఆకాంక్ష కూడా మాలో వుంది. నలందాలో విద్యాధ్యయనం ముగిశాక సింహళం వెళ్ళాలనుకున్నాము. సింహళ

ద్వీపం చాలా దూరంలో వుంది. వందల యోజనాల దూరం ప్రయా
ణించాలి. జలమార్గాన అయితే, ఈ యాత్ర కొంత త్వరగానూ ముగు
స్తుంది; సుఖకరంగానూ వుంటుంది. కానీ, మేము స్థల, జల - ఉభయ
మార్గాలా ప్రయాణం చేయాలనుకున్నాము. తామ్రలిప్తి తూర్పు సముద్ర
తీరంలో ఓ ప్రసిద్ధమైన రేవు పట్టణం ! ఇక్కడ వివిధ దేశాల సార్థ
వాహుల్నీ, వారి నౌకల్నీ చూశాము. రకరకాలైన ప్రజల్ని చూశాము.
చీనా దేశపు బేహారులెంతోమంది కనుపించారిక్కడ. యవ, సువర్ణ,
కాంభోజ మొదలైన తూర్పు ద్వీపాల ప్రజలే కాక. యవన, రోము
లాంటి పశ్చిమ దేశాల ప్రజలు కూడా కనుపించారు. దేశ సంచారానికి
అలవాటుపడ్డమనుష్యుడు దూరాన్ని కష్టాల్నిలెక్క పెట్టడు. మేము మొదటే
సింహళం వెళ్ళాలని నిశ్చయించుకున్నాము. లేకపోతే, తామ్రలిప్తినుండి
యవద్వీపానికి వెళ్ళి, అక్కడి నుండి చీనాదేశం వెళ్ళేవారం. మేము
స్థలమార్గాన ధాన్యకటకాన్నీ, శ్రీపర్వతాన్నీ చూసుకుంటూ సింహళం
చేరాలనుకున్నాము. దస్యుల బాధ స్థలజల మార్గాలలో సమానంగానే
వుంటుంది. పోతే, స్థలమార్గంలో క్రూర జంతువుల బాధ ఒకటి అధికం!
తామ్రలిప్తి నుండి ఆంధ్రదేశపు ధాన్యకటక నగరానికి వెళ్ళే ఓడలు
కొన్ని సిద్ధంగా వున్నాయి. వాటిలో శ్రీపర్వతపు (శ్రీశైలం)భిక్షువులూ,
బౌద్ధ గృహస్థులూ కొంతమంది వున్నారు. మేమూ ఆ ఓడలోనే ప్రయాణ
మయ్యాము. అయితే, కళింగదేశాన్ని చూడనందుకు విచారపడ్డాము.

వర్షాకాలాన్ని నలందలోనే గడిపేశాము. తామ్రలిప్తికి వెళ్ళే
సరికి చలి ముదిరింది. పర్వతాలపైకి పోయినకొద్దీ చలి పెరగడం,
పర్వతాల్ని దిగినకొద్దీ చలి తగ్గడం మాతృదేశంలోనే తెలుసుకున్నాను.
కానీ, ఈ యాత్రలో ప్రథమంగా మరో క్రొత్త విషయాన్ని తెలుసు
కున్నాను. దక్షిణానికి పోయినకొద్దీ చలి తగ్గుతూవుంటుంది. ఉత్తరానికి
వచ్చినకొద్దీచలి హెచ్చుతూంటుంది.మేము వుండుండి చలికాలంలో ఆంధ్ర
దేశం వెళ్ళాము. అక్కడ నామమాత్రపు చలే వుంది. ఇక సింహళ
ద్వీపంలో చలి అంటే ఏమిటో తెలియనే తెలియదు ! తురుష్కుల
భూమియొక్క ఉత్తరపు సరిహద్దు (ఔటర్ మంగోలియా)ల్లో వేసవిలో
వేసే చలి, నలందాలో చలి కాలంలోనూ వుండదు! ధాన్యకటకం ఆంధ్ర

దేశపు మహానగరాల్లో ఒకటి. రాజధానుల మార్పువల్ల మహానగరాలన్నీ మట్టిదిబ్బలుగా మారడాన్ని మధ్య దేశంలో చూశాను. ఇక్ష్వాకులు పరిపాలించే రోజుల్లో ధాన్యకటకం ఒక ప్రసిద్ధ నగరం: చాలా అభివృద్ధిలో వుండేది. కృష్ణానదిగుండా పెద్ద పెద్ద ఓడలు ఈ పట్టణానికి వస్తూండేవి. ధాన్యకటకం ఒక రాజధానే కాదు; ధనాఢ్యులైన శ్రేష్ఠులకు నిలయంకూడా. విశాలమైన ఆంధ్ర సామ్రాజ్యానికి రాజధానిగావున్న ఈ మహానగరం ఇప్పుడు కడు హీనస్థితిలో వుంది. ఈ పట్టణపు వైభవాన్ని పల్లవుల రాజధానయిన కాంచీపురం దోచుకుంది. మౌఖరులు గుప్తుల సామంతులు. చివరకు గుప్త సామ్రాజ్యాన్నే హస్తగతం చేసుకున్నారు. కన్యాకుబ్జం పాటలీపుత్రాన్ని తలదన్నింది. ఇక్ష్వాకులపట్ల, ధాన్యకటకంపట్ల సరిగా ఇలాగే జరిగింది. పల్లవులు ఇక్ష్వాకుల సామంతులు. చివరకు ఇక్ష్వాకుల రాజ్యాన్నే హరించారు. ధాన్యకటకాన్ని కాంచీపురం దోచేసింది. ధాన్యకటకంలోని, శ్రీపర్వతంలోని – గొప్ప చైత్యాలను చూసినప్పుడు వాటి గత వైభవం స్ఫురిస్తుంది: పాలరాతిలో, మానవులు పశుపక్ష్యాదులూ, లతాగుచ్ఛాలూ ఎంత సుందరంగా చెక్కబడ్డాయో! నేను శిల్పినీకాదు, చిత్రకారుణ్ణీకాదు. కానీ, ఈ దేశ సంచారంలో కపిషా, గాంధార చిత్ర, శిల్పకళల్ని చూశాను. ఇప్పుడీ ధాన్యకటకంలోనూ, శ్రీశైలంలోనూ కపిషా, గాంధార శిల్పాన్నే చూస్తున్నాను. అయితే, శిల్పులూ, చిత్రకారులూ, ఈ శిల్పాల్లోనూ, చిత్రాల్లోనూ తమ సమస్త నైపుణ్యాన్ని ధారపోశారు. ఓరకంగా, ఇక్కడ కళను వెదజల్లారనే చెప్పవచ్చు! ఇక్కడి శిల్పుల పోగరలు, కోమలమూ, గంభీరమూ అయిన భావాలను అతి సహజంగా ప్రకటించాయి: శిల్పం, చిత్రం – ఈ రెండూ పోటీపడి ఉన్నత ప్రమాణాల నందుకున్నా యిక్కడ.

ధాన్యకటకం నుండి శ్రీ శైలం వెళ్ళాము. కొద్ది దూరం కృష్ణానదిలో జలయాత్ర చేశాము. తరువాత మహారణ్యాల్ని, పర్వతాల్ని అధిగమిస్తూ, అధిరోహిస్తూ శ్రీశైలం చేరుకున్నాము. బౌద్ధులకు ఈ శ్రీశైలం బహు పుణ్యతీర్థం: ఆర్యనాగార్జును డిక్కడ చాలా సంవత్సరాలున్నాడు. అతడికిముందు కూడా ఈ ప్రదేశంలో బౌద్ధ భిక్షువు లుంటూండేవారని చెప్పవచ్చు. ఉత్తర దేశంలోనూ, ధ్వంసమయిన విహారాలనూ,

స్తూపాలనూ ఎన్నింటినో చూశాము. ఈ దక్షిణ దేశంలో శిథిలవిహారాలు సంఖ్య మరీ అధికం, అసలీ విహారాలూ, స్తూపాలూ ఎందుకిలా శిథిలమౌతున్నాయి? రాజులూ, మహారాజులూ, తమ కీర్తిని స్థాపించుకోవడానికి నూతనమైన విహారాలను కట్టించడం ఒక కారణం! బ్రతికివున్న ప్రజలకంటే చచ్చిపోయినవారి సంఖ్యే అధికంగా వుంటుంది. గతించిన మానవులందరి కీర్తినీ క్షుణ్ణంగా వుంచడం బ్రతికివున్నవారివల్ల ఎంత ప్రయత్నించినా కాదు. సంఘారామాల విషయంలోనూ ఇదే న్యాయం చెల్లుబాటు అవుతుంది. ఇది రెండో కారణం. మూడో కారణంకూడా వుంది. సామంతుల మీదా, ధనిక శ్రేష్ఠులమీదా దినదినమూ బ్రాహ్మణుల ప్రభావం అధికమౌతున్నది సామంతులూ, ధనిక శ్రేష్ఠులూ శైవమతం వైపు ఎందువలన ఇంతగా ఆకర్షింపబడుతున్నారు? బ్రాహ్మణులు శైవమతావలంబించడంలో కొంత అర్థముంది. వాళ్ళు పురోహితులౌతారు. తద్వారా ధనోపార్జనకు మార్గమేర్పడుతుంది. మరి వీళ్ళెందుకు శైవమతాన్నవలంబిస్తున్నట్లు? నేనూ, బుద్ధిలుడూ ఈ సమస్యను గూర్చి చాలా తీవ్రంగా చర్చించుకునే వాళ్ళం.

"సమాజంలోని హెచ్చు తగ్గుల్నీ, వర్ణవ్యవస్థను పోషించేవారు ఈ సామంతులూ, శ్రేష్ఠులే! యవనులూ, శకులూ ఈ దేశానికి వచ్చి, రాజ్యాల్ని స్థాపించారు. అప్పుడీ యవనులనూ, శకులనూ బ్రాహ్మణులు మ్లేచ్ఛులనేవారు. అంటరానివారుగా భావించేవారు. కానీ, తథాగతుడు ఇలాంటి వర్ణవ్యవస్థను అంగీకరించడు. బుద్ధుని దృష్టికి ఆర్యుడు, మ్లేచ్ఛుడు, బ్రాహ్మణుడు, శూద్రుడు అందరూ సమానులే! అప్పట్లో ఈ దేశానికి క్రొత్తగా వచ్చిన యవనులూ, శకులూ బౌద్ధ ధర్మాన్ననుసరించడమే లాభదాయకం అనుకున్నారు. మరి బ్రాహ్మణ మతాన్ననుసరిస్తే, బ్రాహ్మణులు వీరిని మ్లేచ్ఛులు, నీచులుగానే పరిగణిస్తారుకదా? అయితే బ్రాహ్మణులు కాలక్రమంలో తాముపడ్డ పొరపాటును తెలుసుకున్నారు. యవనుల్ని, శకుల్ని క్షత్రియులనేశారు. బౌద్ధమతం ఉచ్ఛనీచాలను నిర్మూలించగలదు. ఎవరికైనా ఉచ్ఛత్వాన్ని, లేక నీచత్వాన్ని ఆపాదించడం ఈ మతం వలనకాదు. కానీ, బ్రాహ్మణ మతం, ఉచ్ఛనీచాలను కాపాడుతూ, నీచులుగా చూడబడే, రాజ్యాధికారులైన విదేశీయులను

*న్నత జాతికి మార్చగలదు. కనుకనే సామంతులూ, శ్రేష్ఠులూ అలా బ్రాహ్మణుల చరణాలకు ప్రణామాలాచరిస్తున్నారు" అన్నాడు బుద్ధిలుడు.

వెనక్కి తిరిగి ధాన్యకటకానికి వచ్చాము. మళ్ళీ దక్షిణంగా సముద్రయాత్ర ప్రారంభించాము. కొద్ది రోజుల్లో పల్లవుల రాజధానయిన కాంచీపురాన్ని చేరాము. దక్షిణ దేశంలో పల్లవ రాజవంశం మహాశక్తి వంతమయింది. కాంచీపురం ఒక్క రాజధానేకాక, స్థల-జల వ్యాపారులకు గొప్పకూడలి. లక్ష్మీపుత్రులైన బేహారులెందరో ఆ పట్టణంలోవున్నారు. కాంచీపురంలోని సార్థవాహులు ద్వీప ద్వీపాంతరాలకు వెళ్ళి వ్యాపారము చేస్తుంటారు. పల్లవరాజు శైవమతావలంబి, క్రొత్త క్రొత్త శివాలయాలూ, శైవమఠాలూ తయారౌతూన్నాయి. ఇక్కడ జైనులూ, బౌద్ధులూ అల్ప సంఖ్యలో వున్నారు. బౌద్ధ విహారాలూ, జైన దేవాలయాలూ కడు బీదస్థితిలో వున్నాయి. దిఙ్నాగుడి జన్మభూమయిన కాంచీపురంలో ప్రమాణశాస్త్ర నిష్ణాతులైన బౌద్ధ పండితుల్ని కలుసుకుందామనుకున్నాము. కానీ, మా ఆశ నిరాశే అయింది. కావేరీ పట్టణంలో గొప్ప బౌద్ధ పండితు లున్నారని తెల్సింది. సముద్ర మార్గాన కావేరీ పట్టణం వెళ్ళాము. తూర్పు సముద్ర తీరాల్లోని గొప్ప రేవు పట్టణాల్లో ఇదొకటి ; గొప్ప వ్యాపారకేంద్రం, తామ్రలిప్తిలాగానే ఇక్కడా ద్వీప ద్వీపాంతరాల వ్యాపారం జరుగుతూ వుంటుంది. ఇక్కడి విహారాలూ మంచి స్థితిలోవున్నాయి. భిక్షువులు "మహావిహారనికాయా" నికి చెందినవారు. వీరి దృష్టి ఎప్పుడూ తమ నికాయపు పిటకాలనూ, అట్టకథలనూ చదవడంమీదే కేంద్రీకరించుకుని వుంటుంది. అన్య నికాయాల భిక్షువులకంటే వీరు వినయ – నియమాల్ని ఎక్కువ శ్రద్ధతో పాటిస్తూంటారు. ప్రాచీన పరంపరల్లో ఎలాటి ప్రక్షిప్తాన్ని సహించరు. మహావిహార సంప్రదాయ గ్రంథాల్ని నే నంతగా చదవలేదు. బుద్ధిలుడు ఈ సంప్రదాయాన్ని వడపోశాడు. "ప్రక్షిప్తమంటూ జరగని మతమూ వుండదు, సంప్రదాయమూ వుండదు ; ఇతర నికాయల భిక్షువుల్లా వీరూ తమ పిటకాలను శతాబ్దాల తరబడి కంఠస్థం చేస్తూవచ్చారు. అలాంటి స్థితిలో ప్రాచీన విషయాలు కొన్ని జారిపోవడమూ, నూతన విషయాలు కొన్ని ప్రక్షిప్తం కావడమూ సహజం. ముఖ్యం. లాభ,

లోభాల దృష్ట్యా అలా జరగడానికి నూటికి నూరుపాళ్లూ అవకాశం వుంది।" అన్నాడు బుద్ధిలుడు.

దక్షిణ దేశ యాత్ర చేశాక, ప్రమాణశాస్త్రానికి పట్టుకొమ్మ ఉత్తరదేశమే కాబోతున్నదని తెలుసుకున్నాను. ఈశాస్త్రానికి బీజారోపణ చేసినవాడు గాంధారదేశపు వసుబంధు. దీన్ని పెంచి, పెద్దచేసి అభివృద్ధికి తెచ్చినవాడు దిఙ్నాగుడు। అతడీ తమిళ దేశీయుడే। ఇక్కడి నుండి సింహళం వెళ్ళాలని మా వుద్దేశం. సింహళ భిక్షువులు నిష్ఠాగరిష్ఠులు. వారంటే మాకెంతో శ్రద్ధా, భక్తీను. అయితే, ఇప్పుడు మేము మత సంబంధమైన జ్ఞానాన్ని ఆర్జించటానికి సింహళం వెళ్ళడంలేదు. కేవలం మాలోని తిరుగుబోతు ప్రవృత్తిని తృప్తి పరచుకోవడానికి వెళ్తున్నాము.

కావేరీ పట్టణం నుండి ఓడలో సింహళానికి బయల్దేరాము. మొదట సింహళంలోని జంబుకేశ్వర పట్టణంలో దిగాము. అక్కడినుండి ఒకవారం రోజుల్లో రాజధానయిన అనూరాధపురాన్ని చేరుకున్నాము. రాజధానిలో పెద్ద విహారాలు మూడున్నాయి. చిన్నవి చాలావున్నాయి. మేము అభయ గిరి విహారంలో దిగాము. ఇక్కడి విహారాలన్నింటిలోకి "మహా విహారం" అతి పవిత్రమయింది. అశోకుని కుమారుడు స్థవి ర మహేం ద్రుడు ఈ విహారాన్ని కట్టించాడని చెప్తారు. భారతదేశం దృష్ట్యా ఇది నిండు చలికాలం. కానీ, ఈ సింహళ ద్వీపంలో చలి అన్నమాటే లేదు. చలికి దుప్పట్లు కప్పుకోవడమన్నది ఇక్కడి ప్రజలకు తెలియదు. కాక పోతే, కొందరు ఈగలకూ, దోమలకూ వెరచి దుప్పట్లు కప్పుకుంటారు. సింహళరాజు ధాతుసేనుడు మహావిహార భక్తుడే అయినా, అభయగిరి పట్లకూడా భక్తీ, శ్రద్ధలను కనబరుస్తూంటాడు. ఇక్కడి స్తూపాలు చిన్న చిన్న పర్వతాలంత వుంటాయి. పర్వదినాల్లో వీటిని చాలా గొప్పగా అలంకరిస్తారు. వీటి అలంకరణకు ధారాళంగా డబ్బు ఖర్చు పెడతారు. అనూరాధపురంలో యవన (గ్రీసు), మిశ్ర (ఈజిప్టు), యవ ద్వీపం (జావా) మొదలైన దేశాల ప్రజలు కనబడతారు. కొన్ని దేశాల ప్రజలకు ప్రత్యేకమైన నగరాలు, పేటలు కూడా వున్నాయి.

వేసవికాల మొచ్చింది. మధ్యదేశం కంటే ఇక్కడ ఎండలు
ఏమంత అధికంగా లేవు. అయినా, శీతలదేశ నివాసి నవడం వలన
నా కా ఎండలే బాధాకర మనిపించాయి.

యవద్వీపాన్ని చూడాలన్న కోర్కె మమ్మల్ని వివశుల్ని
చేస్తోంది. అయినా, మేము తుషార దేశం మీదుగా ఉత్తర దేశాల్లో
పర్యటించా లనుకున్నాము. వేసవికాలం అంత్యాని కొచ్చింది. వర్షా
వాసాన్ని ఇక్కడే గడిపి వెళ్ళిపోదా మనుకున్నాము. రాజధానికి దక్షి
ణంగా వున్న పర్వతాలు కొంత శీతలంగా వుంటాయనితెల్సింది. ఇలాంటి
ఉష్ణదేశాల్లో శీతల ప్రదేశా లుండడం కొంత ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది,
మేమా శీతల పర్వత ప్రదేశాల్ని చూడాలనుకున్నాము. అయితే, ఆ
పర్వత ప్రాంతంలో గ్రామాలు, పల్లెలూ అంతగాలేవు. చెదురుగా,
అక్కడక్కడా విహారా లున్నాయని మాత్రం తెల్సింది. ఎలా అయితే
అలా అవుతుందని ఆ శీతల ప్రదేశాన్ని చూడ్డానికి బయల్దేరాము. రెండు
రోజుల ప్రయాణానంతరం పర్వత ప్రదేశాన్ని సమీపించాము. ఇక్కడి
నుండి మార్గం ఘోరారణ్యాలగుండా వెళ్ళిపోయింది. ఒకోమాటు
రెండుమూడు యోజనాలు ప్రయాణం చేస్తేగాని పల్లెలు తగలడం లేదు.
ఈ పర్వతారణ్యాల్లో వనవాసులైన బోయ లుంటారనీ, వాళ్ళు చాలా
క్రూరులనీ రాజధానిలోనే విన్నాము. ఈ బోయల భయంతో అసలీ
మార్గాలలో ఎవరూ ప్రయాణం చేయరు. ఒకవేళ చేయాల్సి వచ్చినా,
పాతిక, ముప్పై మంది జట్టుగా కలిసి, సాయుధులై, జాగ్రత్తగా
ప్రయాణం చేస్తారు. మేమూ ఓ మంచి జట్టుగానే బయల్దేరాము.
మార్గంలో తగిలే పల్లెలు పాడి పంటా కలిగి నిండుగా వున్నాయి. అంత
వరకూ బోయ లెవరూ మాకు కనపడలేదు. వాళ్ళని గురించి ఎన్నో
క్రూరమైన, రోమాంచితమైన కథల్ని విన్నాము. కథల్ని వినీ వినీ ఓ
రకంగా బోయల విషయంలో ఉదాసీనుల మయ్యాము. పైకి పోతున్న
కొలదీ వేడిమి తగ్గి చల్లదనం హెచ్చుతోంది. అప్పటికి పదిరోజుల
నుండి ప్రయాణం చేస్తున్నాము. పర్వతాల మధ్యన ఓ పెద్ద సరోవరం
కనిపించింది. దాని ప్రక్కనే ఒక చిన్న పల్లె; పల్లెలోని మూడు
వంతుల ప్రజలు రైతులు. మిగిలిన ఒక వంతు వన్య పదార్థాల నమ్మే

వ్యాపారులు. ఈ మొత్తం యాత్రలోనూ, పల్లెలకూ దూరంగా, ఏకాంతంగా వున్న విహారాన్ని చూడలేదు. వనవాసి అయిన భిక్షు వెవడూ వంటరిగానూ కనపడలేదు. ఈ పల్లెల్లో బోయల భయం చాల ఎక్కువ. భిక్షువులు కూడా వంటరిగా ఎక్కడికి వెళ్ళరు. సరోవరానికి ప్రక్కనే ఓ చిన్న అందమైన సంఘారామం వుంది. చుట్టూ ఉన్న పర్వతాలూ చెట్లూ - చేమల్తో పచ్చగా కళకళ్ళాడు తున్నాయి. ఈ అరణ్యాల్లో పులులూ, సింహాలూ వుండవు. ఏనుగులు మాత్రం వుంటాయి. సముద్ర మధ్యంలో ఇలాంటి మనోహర ద్వీపం ఎంత విచిత్రం! ఇక్కడ ఆకాశాన్నంటే దేవదార్లుగానీ, హిమ శిఖరాలు గానీ లేవు. అయినా, ఈద్వీపంలోని ప్రకృతి సౌందర్యం నన్నెంతగానో ఆకర్షించింది. నా ఎదురుగా వున్న సరోవర సౌందర్యానికి నే నెంతో ముగ్ధు ణ్ణయ్యాను. ఇలాంటి సుందరమైన ప్రకృతి దృశ్యాలంటే బుద్ధిలుడికి ఎంతో ఇష్టం! మదించిన ఏనుగుల్ని గురించీ, క్రూరులైన బోయల్ని గురించీ స్థానిక పల్లెల ప్రజలు ఎంతో చెప్పేవారు. అయినా, మేము లక్ష్యపెట్టే వాళ్ళంకాదు. సానిక భిక్షువు లెవరినన్నా వెంట పెట్టుకుని, ఉదయం మధ్యాహ్నం-ఎప్పుడు పడితే అప్పుడు, చుట్టుపట్ల ప్రదేశాలకు వెళ్ళి చూసి వస్తుండేవాళ్ళం. సింహళంలోని భిక్షువులందరూ "మహావిహార" నికాయానికి చెందినవారు. వారి దృష్టిలో మా భిక్షుత్వం ప్రామాణికమైంది కాదు. మహాయానపు వైపుల్య పిటకాన్ని అసలువారు ఒప్పుకోరు. అది ఇటీవలివారు వ్రాసిందనీ, దొంగ పిటకమనీ అంటారు. అయినా, బుద్ధిలుడి అపారమైన విద్య, కలుపుగోలుతనమూ కారణంగా ఎలాంటివారూ ఇట్టే మిత్రులై పోతారు. అనూరాధపురానికి వచ్చిన కొద్దిరోజుల్లోనే, మహావిహారంలోని కొంతమంది విద్యాగరిష్ఠులైన భిక్షువులు పరిచయులయ్యారు. వారి సాయంతో ఈ వన్యప్రాంత భిక్షువుల పరిచయాన్ని పొందాము.

పూర్వాహ్ణం. ఇరవై నాలుగు ఘడియల నిరాహార వ్రతాన్ని ముగించి, సూర్యోదయంతోపాటు తృప్తిగా భోజనంచేశాము. ఇవ్వాళ మరికొంత ఎక్కువ దూరం తిరిగి రావాలని మా ఉద్దేశం. మేము ఐదుగురు భిక్షువులం, దారి చూపడానికి ఒక బౌద్ధ గృహస్థూ బయల్దేరాము.

తిరిగి వచ్చేసరికి మధ్యాహ్నమవచ్చు. మధ్యాహ్నానంతరం భిక్షువులు ఆహారాన్ని స్వీకరించరాదు; కనుక మా ఆరుగురికి కావల్సిన ఆహార పదార్థాలను వెంట పెట్టుకుని బయల్దేరాము. మేము నైరుతీదిశకు ఘోరమైన అరణ్యంగుండా వెళ్తున్నాము. మా వెంట ఉన్న గృహస్థూ, ఒక భిక్షువూ వెనుక ఒకమాటు ఈ ప్రదేశాలకు వచ్చారుట. వారి మార్గదర్శకత్వంలో ముందుకు వెళ్ళిపోతున్నాము. రెండుజాములయింది. భోజనసమయమయింది. ఒకచిన్ననది ఒడ్డున, వృక్షచ్ఛాయలో మేమంతా కూర్చున్నాం. మేము విడిసరోవరానికి నదిరెండు యోజనాలదూరంలో వుంది. దారిలో చాలా చోట్లపర్వతాల్ని ఎక్కడం జరిగింది. ఒక్కచోట అతికఠినమైనపర్వతారోహణం చేయవల్సి వచ్చింది. సింహళ భిక్షువులు పర్వతాల్ని ఎక్కదిగడంలో చాలా అలసిపోయారు, నాకీ పర్వతారోహణ ఒక లెక్కలోది కాదు ఉద్యానంలో, ఇంతకంటె కఠినమైన పర్వతారోహణం చేశాము. కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్నాక భోజనాలు చేశాము. నా మాతృదేశమైన ఉద్యానదేశపు విషయాన్ని చెప్తున్నాను. అందరూ చాల ఉత్సుకతతో వింటున్నారు. మధ్య మధ్య బుద్ధిలుడు తన ఛలోక్తుల్తో అందరినీ నవ్విస్తున్నాడు. అందరమూ ఆనందంలో మైమరచి ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నాము. గృహస్థు మా మాటల్లో పాల్గొనడం లేదు. అతడి ముఖంలో ఆందోళన, అశాంతులూ కనిపిస్తున్నాయి. ఒకటి రెండుసార్లు ఆ ప్రదేశాన్ని గురించిన, తన హృదయంలోని శంకను బయటపెట్టాడుకూడాను. మేమున్న ప్రదేశం నిజంగా శంకించదగిందే. సింహళదేశంలోని మానవపదస్పర్శ నెరుగని మహారణ్యమది. అక్కడ గ్రామాలుగానీ, పల్లెలుగానీ లేవు. ఆ భూమి మానవాభ్యుదయానికి మూల కారణమైన హలస్పర్శ నెరుగదు; కాకపోతే అక్కడక్కడా వన్యజంతువులు లఘు దీర్ఘ శంకలు తీర్చుకున్న చిహ్నాలూ, చెట్ల కొమ్మలమీద కదాచిత్తుగా కోతులూ కనుపిస్తాయి.

గృహస్థు చాలా జాగ్రత్తగా వున్నాడు. యేకొద్ది శబ్దమైన ఉలిక్కిపడుతున్నాడు. అతడివద్ద గొడ్డలి ఉంది. విల్లు, అంబులు వున్నాయి. భిక్షువులం ఆయుధధారణ చేయరాదు. కనుక మావద్దఎలాంటి ఆయుధాలు లేవు. బాగా అలసిపోయాము. పైగా కడుపు నిండా భోంచేశాము. నిద్ర

మూసుకువచ్చింది. నడుములు వాల్చాము. క్షణంలో అందరం గాఢ నిద్రాముద్రితుల మయ్యాము. బహుశా మేము ఎక్కువసేపు నిద్రపోయి వుండము. బ్రహ్మాండమైన కేకలూ, అరుపులూ మా కర్ణపుటాల్ని భేదించాయి. నిద్ర మేల్కొన్నాను. ఇరవై మంది దాకా బోయలు మమ్మల్ని చుట్టుముట్టి వున్నారు. వారి శరీరాలు నగ్నంగా వున్నాయి. పొట్టి మనుష్యులు, శరీరాలు నేరేడుపండు రంగులో బలిష్టంగా వున్నాయి. భుజాలపై బాణాలు వ్రేలాడుతున్నాయి. వీపున తూణీరాలు, చేతుల్లో తీక్షమైన ఖడ్గాలు వున్నాయి. మా అందరిలోకి గృహస్థు స్థితి దయనీయంగా వుంది. అతడి ముఖంలో మృత్యుచ్ఛాయలు గోచరిస్తున్నాయి. మా స్థితి అతడికంటె కొంచెం నయం. బోయలు ఒకేతీరున అరుస్తున్నారు. మధ్యమధ్య ఒకటి, అరమాటలు మాట్లాడుకున్నా, వారిభాష మాకు రాదుగనుక, అర్థం కావటం లేదు. కాకపోతేవారి చేష్టల్నిబట్టి, మేము మృత్యుముఖంలో వున్నామని తెలుసుకున్నాము. బోయల దేశంలోకి వచ్చాము. అది ఘోర అపరాధం. శిక్ష అనుభవించక తప్పదు.

వాళ్ళు, మాకు ఎక్కువసేపు మాట్లాడుకోవడానికిగానీ, ఆలోచించుకోవడానికిగాని అవకాశాన్నీయలేదు. గృహస్థు దగ్గరున్న ఆయుధాల్ని లాక్కొని మమ్మల్నందరినీ ఒకవైపుగా నడవమని సంజ్ఞచేశారు. మమ్మల్ని నలుముఖాలుగా చుట్టవేసుకుని నైరుతీదిశకు తరలించుకు వెళ్ళారు. అడుగడుక్కూ అరణ్యం మరీ దట్టమై ఘోర రూపాన్ని దాలుస్తోంది. నా ముందు నడుస్తున్న ఇద్దరు బోయలశరీరాల్ని మాత్రం నేను చూడగలుగుతున్నాను. వీళ్ళశరీరాలు ఇతర బోయల శరీరాల్లా నగ్నంగా వున్నాయి. వీరిద్దరిలో ఒకడు బోయలందరిలోకి బలంగా వున్నాడు. అతడి తల వెంట్రుకలు, పూవుల్తో, ఆకుల్తో, పక్షి ఈకల్తో అలంకరించి వున్నాయి. ఈ అలంకరణ అతడికో ప్రత్యేకతను ఆపాదిస్తోంది. బహుశా అతడా అరణ్యంలోని బోయలకు రాజుగావును. ప్రక్కనున్న రెండవ యువకుడికి అతడికి వున్న సంబంధం ఏమిటో మాకు తెలియదు. అయితే ఆ యువకుడి శరీరం చాలా సుందరంగా, బలంగా వుంది. ఎవడో నేర్పరి అయిన శిల్పి తన కళా చాతుర్యా

న్నంతా వెచ్చించి నల్లరాతిలో శిల్పాన్ని మలిచాడా అనేట్లుంది అతడి శరీరం। రంగు విషయంలో "ఏది బాగుంటుంది? ఏది ఓగుగా వుంటుంది" అని నిర్ణయించడానికి వీలుండదు. ఏ జాతి రంగు ఆ జాతికి బాగుంటుంది. మా ఐదుగురిలోను బుద్ధిలుడు కొంచెం పసిమి తగ్గుతాడు. అయినా, అతణ్ణి మా దేశంలో నల్లనివాడే అనేస్తారు. సింహళ భిక్షువుల్లో ఇద్దరు గోధుమ వర్ణంలో వుంటారు. మిగిలిన ఒక భిక్షువూ, గృహస్థూ బోయల రంగులో కల్సిపోతారు. పట్టుబడ్డప్పు డీ బోయలు నా వైపు సంజ్ఞచేస్తూ ఏమేమిటో మాట్లాడుకున్నారు. అప్పట్లో వారి స్వరాల్ని సంజ్ఞల్ని బట్టి – నా పచ్చని శరీరాన్ని గురించి, నల్లని కండ్లను గురించి మాట్లాడు కుంటున్నా రనుకున్నాను। ఈ వర్ణ ప్రత్యేకత ఉపకారంలో ఘోరమైన అపకారం చేస్తుందని నే నూహించలేదు.

సూర్యుడు అస్తమించుతున్నాడు. మేమో పెద్దకొండవాగు ఒడ్డుకు చేరుకున్నాము. అక్కడో కొండ గుహముందు పాతికముప్పైమంది బోయలు నిలబడి వున్నారు. వాళ్ళలో ఎక్కువమంది స్త్రీలు, బాలురు – ఒకరిద్దరు వృద్ధులుకూడా వున్నారు. వృద్ధులకూ తలవెంట్రుకలు నల్లగానే వున్నాయి. కేవలం శరీరాన్ని, ముఖంమీద ముడతల్నిబట్టి మాత్రమే వయస్సును తెల్సుకోగలం. దారి పొడుగునా బోయలు అరుస్తూ, కేకలు పెడుతూనే వున్నారు. గుహదగ్గరకు వచ్చాక మరీపెద్దగా, గోలగా అరవసాగారు. గుహదగ్గర వున్నవాళ్ళుకూడా ఆగంతకులకు తుముల ధ్వనితో ఘనంగా స్వాగతాన్ని పలికారు. అంతటి ఘనస్వాగతానికి కారణం మమ్మల్ని పట్టుకురావడం కాదు. వేటాడి కుందేళ్ళనూ, లేళ్ళనూ తెచ్చినందుకు. బోయలు ఒక తోలుతిత్తినిండా తేనెకూడా సంపాయించుకు వచ్చారు, గుహలోకి తీసుకుపోయి మాకాళ్ళూ చేతుల్ని తాళ్ళతో కట్టేశారు. ఐదుగురు సాయుధులైన బోయలు మాకు కాపలా వున్నారు.

ఇప్పుడు మేము సహజ మానవుల్లో వున్నాము. వాళ్ళు మాట్లాడే భాషలో ఒక్కశబ్దమూ మాకు తెలియడంలేదు. వాళ్ళ సంజ్ఞలుకూడా మా కంతగా అర్థంకావడంలేదు. గ్రామ నాగరిక జీవితాలకు సంబంధించిన అనేక విషయాలు అన్నిజాతుల్లోనూ ఒకరకంగా వుంటాయి. కనుకే మా

స్థితిని కొద్దిగా వూహించగలిగాము. మా జీవితాలకు అంత్యసమయం సమీపించిందని మేము అనుకున్నాము. బుద్ధిలు డీలా అన్నాడు: "ఈ ప్రపంచానికి మనకూ ఇక కొద్దిక్షణాల సంబంధం మాత్రమే వుంది। రోజుల తరబడి మనలనిలా వుంచరు."

"నిజమే మన నిక ప్రాణాలతో విడువరు" అన్నాడు గృహస్థు.

ఈ బోయలు సింహళ దేశపు నాగరికులనుండి ఆయుధాలను మాత్రం ఆశిస్తారు. అసలు వీరికి ఆయుధాలన్నా ఇనుమన్నా ఏమిటో తెలియదు. ఇనుముయొక్క ప్రభావంగానీ అది ఎక్కడ లభించేదీ మొదలైన విషయాలుగానీ వారికి తెలయవు. కానీ, సింహళనాగరికులు వారి మీద ఆయుధాల్ని ప్రయోగించడంతో ఆయుధాల మాహాత్మ్యం తెలిసింది. వస్త్రధారుల దగ్గిరున్న ఆయుధాల్ని లాక్కుంటేగానీ తమకు మనుగడ లేదని తెల్సుకున్నారు. ఆటు తరువాత, ఏవిధంగా, ఎప్పుడీ నిర్ణయం జరిగిందో తెలియదుగానీ బోయలు తాము సంపాదించిన తేనె మొదలైన వన్య పదార్థాలను, వస్త్రధారులు వచ్చి పోయే మార్గంలో వుంచుతూండేవారు. అటుగా వెళ్ళే వస్త్రధారులైన నాగరికులు తమవద్దకల ఆయుధాల్ని అక్కడుంచి ఆ పదార్థాలను తెచ్చుకునేవారు. తరువాత బోయలా ఆయుధాల్ని తీసుకుని వెళ్ళిపోయేవారు. ఈ విధంగా ఒకరొకరు ఎదురుపడకుండానే వస్తుమార్పిడి ప్రారంభమయింది. అరణ్యానికి ప్రభువులు బోయలు. గ్రామాలకు ప్రభువులు వస్త్రధారులైన సింహళులు. సింహళ భాష మధ్య దేశపు భాషతో కొంత కలుస్తూ వుంటుంది. ఒకప్పుడు సింహళ మంతా మహారణ్యంగా వుండేది. ఎన్ని అవాంతరాలు సంభవిస్తున్నా మానవజాతి నిరంతరాయంగా అభివృద్ధి చెందుతూనే వుంది. కనుక వస్త్రధారులైన సింహళులకు సేద్యం నిమిత్తంగానీ, ఇతర అవసరాలకు గానీ నిత్యం క్రొత్త భూములు అవసరమవుతూండేవి. అరణ్యప్రభువులైన బోయల అరణ్యాన్ని కాజేసి పండాభూములుగా మార్చేస్తూండేవారు నాగరీకులు. దీంతో వస్త్రధారులకూ, వస్త్రరహితులకూ సంఘర్షణ ప్రారంభమయింది.... ఒకొక్కప్పు డీ సంఘర్షణ ఉగ్రరూపాన్ని దాలుస్తూ ఉంటుంది. ఒకొక్కప్పుడు శాంతిస్తూ ఉంటుంది. అయితే ఎంతో కొంత సంఘర్షణ నిరంతరం జరుగుతూనే వుంటుంది.

మా భవిష్యత్తేమిటో మాకు స్పష్టంగా తెల్సును. ఆ రాత్రి మమ్మల్నా గుహలోనే వుంచారు. గుహకు ఎదురుగా, బయటిమెల్లాలో రెండు మూడు చోట్ల మంటలు వేశారు. మొదటా మంటల్లో తాము తెచ్చిన కుందేళ్ళనూ, లేళ్ళనూ కాల్చుకు తిన్నారు. తరువాత అర్ధరాత్రి వరకూ నృత్యం సాగింది. అనంతరం వాతావరణంలో ఘోర నిస్తబ్ధత వ్యాపించింది మే మున్న గుహ లోపల చాలా విశాలంగా వుంది. అయితే ముఖద్వారం మాత్రం చాలా ఇరుగ్గా, ఒకే మనిషి ప్రవేశించడానికి వీలుగా వుంది. ఆయుధపాణులైన కాపలా వాళ్ళు యమదూతల్లా ముఖద్వారంలో కూర్చుని వున్నారు. అక్కడినుండి పారిపోవడమూ సంభవం కాదు. అసలలాటి వుద్దేశ్యమూ మాలో ఎవరికి లేదు. గృహస్థుఅప్పటికే సగం చచ్చినట్లయ్యాడు. ఒకేతీరున ఏడుస్తున్నాడు. అతడి పిరికితనానికి అసహ్యించుకొని బోయలు ఒకటి రెండు దెబ్బలు కూడా వేశారు।

సూర్యోదయమయింది. మృత్యువు వెంటాడుతున్న ఈ దుర్భర స్థితిలోనూ నిద్ర మమ్మల్ని వీడలేదు. నిద్రలేస్తూనే గ్రహస్థు మళ్ళీ కన్నీరు కార్చడం ప్రారంభించాడు. గ్రహస్థు, మరో భిక్షువూ, "మేము బోయల్ని వెనకే చూశాము!" అని చెప్తూవచ్చారు. దారి పొడుగునా, అయితే, వాళ్ళు లోగడచూచిన బోయలు ఈ "ముక్తమానవులు" కారు. అరణ్యాల్లోతిరిగే ఏనుగుల్నిపట్టి అమ్మినట్లే ఈబోయల్నికూడా పట్టుకుని మంచి ధరలకు అమ్ముతూ వుంటారు వస్త్రధారులు. సింహళంలోని అనేకులీ క్రూర వ్యాపారం చేస్తుంటారు. అరణ్యాల్లో స్వతంత్రులై విహరించే ఈ బోయలు మానవ వ్యాపారులకు కావాలనేమీ దొరకరు. ఈ నీచమైన వ్యాపారులనుండి తమను రక్షించుకోవడానికి అనేక విధాల ప్రయత్నిస్తారు. చివరకు ప్రాణాలొడ్డి పోరాడతారుకూడాను ఎంతోమంది బోయలీ పోరాటంలో నశించిపోతూంటారు. సింహళంలోని బానిస వ్యాపారులు బోయస్త్రీలనూ, బాలుర్ని పట్టుకోవడంలోనే ఎక్కువ శ్రద్ధను కనబరుస్తారు. స్త్రీలూ, బాలురూ అయితే దాసత్వానికి అలవాటు పడి, పడుంటారు. వయస్కులైన పురుషులు దాస్యాన్ని భరించలేక, త్వరలోనే చనిపోతారు! మేమూ వస్త్రధారులమే. తమపట్ల క్రూరంగా

వ్యవహరించే నిష్ఠుర సమాజానికి చెందినవాళ్ళమే! ఇక వాళ్లు మాపై దయ చూపుతారన్న ఆశ మా కెలా వుంటుంది?

సూర్యోదయ మైనప్పటినుండి, మృత్యువుకోరకు ఎదురుచూస్తూ, క్షణమో యుగంలా గడుపుతున్నాము. "జరిగేదేదో త్వరగా జరిగిపోతే బాగుండు!" అనుకుంటున్నాం నేనూ బుద్ధిలుడూ. మా మనస్సులు చాలా వ్యాకులపడుతున్నాయి. ఇతర మిత్రుల్లో ఆశ అనేది పూర్తిగా చావలేదు. జాముపొద్దు ఎక్కింది. కాపలా బోయలు మాత్రం కనుపిస్తున్నారు. ఇంకెవ్వరూ మా దగ్గిరతూరాలేదు. మానసిక అశాంతిని భరించలేకుండా వున్నాము. ఎంతకీ సమయం దొర్లకపోవడం వలన బుద్ధిలుడు మాట్లాడడం ప్రారంభించాడు:

"మానవ సమూహాల మధ్యా, జాతుల మధ్యా మనమంతా ఒకే జాతికి చెందినవారమన్న" భావన లేకపోతే నిత్యం ఇలాంటి దుస్సంఘటనలే జరుగుతూంటాయి. మనుష్యుల్ని భక్షించే మానవ జాతులు కూడా కొన్ని వున్నాయని విన్నాను. ఈ సింహళ బోయలు మానవుల్ని భక్షించరు. వీళ్ళు మానవ భక్షణ చేసేవారై వుండి, అందుకే మనల్ని పట్టుకున్నట్లయితే సంతోషించే వాణ్ణి. ఎప్పుడో ఒక రోజు చనిపోక తప్పదు గదా! ఈ శరీరం నేలపడకా తప్పదు. మరి ఇప్పుడే ఈ శరీరంతో పది పదిహేను మంది క్షుత్తును తీర్చడం కంటే కావల్సిందేముంది? వీళ్ళు మనల నిలా బంధించినందుకు మనం ఏ విధంగానూ వీళ్ళను నిందించలేము. మనం నాగరికులం. మన సంస్కారం చాలా గొప్పది. వీరికంటే మనం అధికజ్ఞాన సంపన్నులం! మన దృష్టి విశాలమైంది. ఆహారం, నిద్రా, భయం, మైథునం - ఇవే జీవిత పరమావధు లనుకోము. అలాంటి మనం, వీళ్ళను వన్యజంతువుల్ని పట్టినట్లు పట్టుకుని. సంతల్లో హెచ్చుధర ఇచ్చినవాడికి అమ్ముతుంటాము! మన కంటే, పశువులు నయం! అవి ఇంతటి క్రూరానికి ఎన్నడూ పాల్పడవు. వాటికి తమ జాతిమీద ఎలాంటి స్థితిలోనూ ప్రేమా, మమకారాలుంటాయి. మన దగ్గిర తీక్షణమైన ఇనుప ఆయుధాలున్నాయి. ఈ బోయలకు పాపం ఆయుధాలు కూడా వుండవు. కాకపోతే, ఆత్మరక్షణ కొరకు ఒకటీ అరా ఆయుధాల్ని కొనుక్కుంటూంటారు. వీళ్ళు వేటాడి జీవిస్తూంటారు.

నాగరికుల్తో పోరాడవలసి వస్తే, చాలా కష్టంమీద యాభై అరవై మందిని ప్రోగుచేసుకోగలరు. మనమో? క్షణంలో వేల మందిని యుద్ధానికిసిద్ధం చేయగలం. నాగరికులమైన మన ముందు వీరు, ఏనుగు ముందు చీమల్లా వుంటారు. మరి చీమ కూడా తనకు జరిగిన అన్యాయానికి ప్రతీకారాన్ని చేస్తుందిగా? ఒక హద్దు వరకే అప రాధాలు వ్యక్తిగత మైనవిగా భావించబడతాయి. హద్దు దాటాక అప రాధాలు సమాజం మొత్తానికి చెందుతాయి! సమాజం లోని వొకానొక వ్యక్తి ఆ అపరాధాన్ని చేయక పోవచ్చు. అయినా అతడూ అపరాధి గానే భావించ బడతాడు! మన ఆరుగురి ప్రాణాలూ వీరి చేతుల్లో వున్నాయి. మేము వీరి కేవిధమైన హానీ చేయలేదు. కనుక నిరపరాధుల మనటానికి వీల్లేదు. పామును చూడగానే మనుష్యుడు చంపేస్తున్నాడు. తను చంపుతూన్న పాము తన కేవిధమైన హానీ చేయలేదన్న విష యాన్ని ఎవడైనా ఆలోచిస్తున్నాడా? అలాగే, వస్త్రధారులమైన మన మందరమూ, సమస్త సమాజమూ వీరి దృష్టిలో ఘోర అపరాధులం! నిజమే మరి. వస్త్రధారులైన బానిస వ్యాపారులు వీరిపట్ల చేసే హింసా కాండను మనమందరం వొక రకంగా సమర్థిస్తున్నాము!" అన్నాడు బుద్ధిలుడు.

కొన్ని ఉదాత్తమైన ప్రవృత్తులూ, ఉదార భావాలూ కలవారే భిక్షువు లవుతారు. మిగిలిన భిక్షువులు కూడా బుద్ధిలుడి మాటల్ని శ్రద్ధగా వింటున్నారు. కానీ, గృహస్తుకు మా మాటలు అసలు చెవు దూరడమే లేదు! రాత్రి చాలాసేపు ఏడుస్తూ కూర్చున్నాడు. తెల్లవారి నిద్ర లేచి నప్పటినుండీ మళ్ళీ ఏడుపు ప్రారంభించాడు. పైగా మేము మధ్య దేశపు భాషలో మాట్లాడుకుంటున్నాము. ఎక్కడో ఒక శబ్దంగానీ, అత డికీ అర్థ మవడం లేదు. సింహళ భిక్షువు గృహస్తు నోదారుస్తున్నాడు. "ఏడ్చి ప్రయోజనం లేదు. ఇలాంటి సమయాల్లో ధైర్యాన్ని వహించాలి" అంటున్నాడు. కాని, అతడెలా ధైర్యాన్ని వహించగలడు? ఇలా అన్నాడు: "వాళ్ళు ఒక్క వ్రేటుకు చంపేట్లయితే, నేను ఏ మాత్రమూ భయపడను. చాలా ధైర్యంగా వుండేవాణ్ణి! కానీ, వాళ్ళలా చంపరు. చాలా క్రూరంగా హింసించి చంపుతారు. బల్లేల్తో పొడుస్తారు

ఒక్కొక్క అంగాన్నీ ఛేదిస్తారు. అగ్నిలో పడదోస్తారు !" గృహస్థు బోయలు పెట్టే హింసల్ని మననం చేసుకుని మరీ విలపిస్తున్నాడు.

"కనీసం వాళ్ళు చూస్తున్నప్పుడైనా మనం ధైర్యంగా వున్నట్లు కనపడాలి. మనం పిరికిపడుతున్నామని తెల్సుకున్నారా, మరీ హింసించి చంపుతారు !" అన్నాడు బుద్ధిలుడు.

అయితే గృహస్థు వినిపించుకునే స్థితిలో వుంటేగా ?

బుద్ధిలుడు మా అందరికంటే ప్రశాంతంగా వున్నాడు. అతి సహజంగా నిరపాయ స్థితిలో వున్నట్లు మాట్లాడుతున్నాడు. నా వరకు నేనంత శాంతంగా, ధైర్యంగా వున్నానని చెప్పలేను. అయితే, మృత్యువంటే నా కెలాటి భయమూ లేదు. లోగడా అనేకమార్లు మృత్యుముఖంలోకి వెళ్ళి వచ్చాను. దేశాటనమన్నా, పండితవర్యుల సత్సాంగత్యమన్నా నాకెంతో యిష్టం. వాటి కొరకు ఎప్పుడూ ప్రాణాలకు తెగించి, సాహసోపేతమైన యాత్రల్ని చేస్తుంటాను. ముందటే బాధల్ని వూహించుకుని విలపించడం వలన ప్రయోజనం ? బాధలు వచ్చినపుడు ఎటూ విలపించక తప్పదు. నేను గుహ ద్వారంలో కూర్చుని కాపలా కాస్తున్న బోయ యువకులవంక చూస్తున్నాను. వాళ్ళు మా ప్రతిమాటనూ, ప్రతిచేష్టనూ గమనిస్తూన్నట్లు, కన్నార్పకుండా, మా వంక చూస్తున్నారు. కాపలావాళ్ళు వంతుల వారీగా మారిపోతున్నారు. గుహలోని మాకు ఇతర బోయల మాటలు అనేకం వినబడుతున్నాయి. అయితే ఎదురుగా ఉన్న ఇద్దరు బోయలు మాత్రమే కంటికి కనిపిసున్నారు. మాకు కనిపించకుండా అవతలవున్న బోయలు ఏంచేస్తున్నారో చూడాలన్న కోర్కె నాలో ఎక్కువగా ఉంది కానీ, మా స్థానాల్ని వదిలి ముందుకు నేమాత్రం వచ్చినా కాపలా యువకులు మమ్మల్ని తమ బల్లేల్తో పొడిచేస్తారు. మరి కొంచం ప్రొద్దు ఎక్కాక కొంతమంది స్త్రీలూ, బాలురూ, మమ్మల్ని చూడ్డానికొచ్చారు. వాళ్ళ చేతుల్లో మాంసంతో కూడిన ఎముకలున్నాయి. వాటినీ చీకుతూనో, నవుల్తూనో, వున్నారు. ఒక్కొక్కళ్లు గుహలోకి తొంగి చూస్తున్నారు. మా ఆకారాలు వినోదంగా, విచిత్రంగా కనుపిస్తున్నాయి వాళ్ళకు. మరి వీరి నల్లని నగ్న శరీరాలు నగరవాసులకూ ఇలాగే వినోదాన్ని కలిగిస్తాయి గావును !

మరి కొద్ది సమయం గడిచింది. గుహ ముందున్న కొద్ది ఖాళీ స్థలంలోనూ కొంతమంది బోయలు వచ్చి కూర్చున్నారు. వాళ్ళలో ఒక వృద్ధుడు మా వైపు ముఖంపెట్టి కూర్చున్నాడు. వాళ్ళు వృద్ధుడిపట్ల చాలా గౌరవాన్ని ప్రదర్శిస్తున్నారు. వాళ్ళు పెద్దగా ఏదో విషయాన్ని గురించి మాట్లాడు కుంటున్నారు. వృద్ధుడు మధ్య మధ్య తల విసురుగా తల వూగిస్తూన్నాడు. అతడి నల్లని తల వెంట్రుకలు, దాదాపుగా నీటి స్పర్శను అంతవరకూ ఎరిగి వుండవనుకుంటాను. తల వూపుకు పైకి లేస్తున్నాయి. కండ్లు ఎర్రగా వున్నాయి. గడ్డం నల్లగా, దట్టంగా ఉంది. ముడుతలు ఆ ముఖానికి కొంత క్రూరత్వాన్ని ఆపాదిస్తున్నాయి. అతడు కాసేపు చాలా పెద్దగా ఏమిటో మాట్లాడాడు. తరువాత లేచి మా వద్దకు వచ్చి మా అందర్నీ పరీక్షగా చూశాడు. తలా, వీపూ, చేతుల్నీ తడివి కూడా చూశాడు. గృహస్థు స్పృహ తప్పినట్టయ్యాడు. అతడి ఏడుపు ముఖాన్ని చూసి వీపు మీద ఒక్క తన్ను తన్ని ఏమిటో అరిచాడు వృద్ధుడు.

వృద్ధుడు మమ్మల్ని చూసి వెళ్ళాక, వాకిట్లో కూర్చున్న వాళ్ళు కూడా లేచి వెళ్ళిపోయారు. మాకు ఆకలి వేస్తూనే ఉంది. కానీ, మృత్యువు ముందు ఆకలి నెవరు లెక్కచేస్తారు? దాహం, గొంతు ఎండిపోతోంది. కాపలా వాళ్ళకు సంజ్ఞద్వారా నీరు కావాలని తెల్పవచ్చు. అయినా ప్రయోజనం వుండదని వూరుకున్నాము. ఇంతలో ఒక బోయి తోలుతిత్తిలో నీరు తీసుకువచ్చాడు మా వద్దకు। తృప్తిగా నీరు త్రాగాము. తరువాత గృహస్థును పట్టుకుని వెళ్ళారు. అతడు వెళ్ళనని తన్నుకు లాడాడు. మరి రెండు తన్నులు తినడం తప్ప ప్రయోజనం లేకపో పోయింది. అతణ్ణి తీసుకు వెళ్ళాక "ఇతణ్ణే మొదట బలి ఇస్తారు!" అన్నాడు బుద్ధిలుడు.

"దేవతకు బలి ఇస్తారా?"

"దేవతకు బలి ఇస్తారు। భయమే దేవతలను సృష్టించింది. భయ మనేది మనకంటే వీరి హృదయాల్లోనే ఎక్కువగా వుంది. ఇతడి పిరికి తనాన్ని చూసి వాళ్ళితణ్ణి అనేక రకాలుగా హింసించిగానీ చంపరు। వీళ్ళెంత వన్య జీవులైనా మన మధ్యవున్న భేదాల్ని తప్పకుండా పసి

కట్టివుంటారు. భిక్షువులమైన మన కాషాయ వస్త్రాలకూ, గృహస్థుయొక్క తెల్లని గుడ్డలకు వున్న వ్యత్యాసాన్ని వీరూ గ్రహించగలరు. గృహస్థుకు తలవెంట్రుకలూ, మీసాలూ, గడ్డమూ వున్నాయి. మన మేమో నున్నగా గొరిగించుకున్నాము. దీనికేదో కారణముంటుందని వాళ్ళు అనుకుంటారు. నాగరికులు ప్రతిసంవత్సరమూ వందల సంఖ్యలో ఈ బోయల్ని పట్టుకుని వెళ్లి పట్టణాల్లో అమ్ముతుంటారు. వాళ్ళల్లో నూటికీ, కోటికీ వకడైనా తప్పించుకుని రావడమూ కద్దు! వీళ్ళకూ భాషవుంది. వీళ్ళ భాష మన భాషలా సమృద్ధమైందీ, ధార్మిక చర్చలకూ, శాస్త్రార్థాలకు ఉపయుక్తమైందీ కాకపోవచ్చును. అయినప్పటికీ, తప్పించుకు వచ్చిన బోయవాడిద్వారా మనల్నిగురించిన విషయాల్ని తెల్సుకోవడానికి వీరి భాష సరిపోతుంది" అన్నాడు బుద్ధిలుడు.

సింహళ భిక్షువుల్లోనూ ఒకతను చాలా గంభీరంగా, ధైర్యంగా వున్నాడు. అతడిలా అన్నాడు: "బానిస వ్యాపారులు తరుణులూ, ప్రౌఢులూ అయిన బోయల్ని కూడా పట్టుకుంటూ వుంటారు. అయితే, వాళ్ళని ఈ సింహళ దేశంలో అమ్మరు కావేరీ పట్టణం, కాంచీపురం లాంటి సుదూర పట్టణాలకు తీసుకుపోయి అమ్ముతారు. ఇక్కడే అమ్మేట్లయితే, తమ వన్య జీవితాన్ని మరువరు. అవకాశం చిక్కినపుడు పారిపోతారు. పారిపోలేని చిన్న వయస్సులోని వారినే సింహళంలో అమ్ముతుంటారు. అయితే వీళ్ళు పారిపోవడమూ అంత తేలిక కాదు. బోయల్లాంటి నల్లని ఆకారాలుకలవారు సింహళ నాగరికుల్లోనూ వున్నారు. అయినప్పటికీ బానిసలైన బోయల వాలకమే వేరుగా వుంటుంది. పారిపోయిన బోయని ఒకటి రెండు గ్రామాలు దాటేలోపే పట్టెయ్యవచ్చు!"

"ఐదు, ఆరు సంవత్సరాలు మనలో ఉండి వచ్చిన బోయ మన భాషనూ నేర్చుకుని వుంటాడు. బహుశా వీళ్లల్లోనూ ఎవడైనా అలాంటి వాడు ఉన్నాడేమో" అన్నాను నేను.

"అలా వుండడానికి అవకాశం చాలా తక్కువ! వ్యాపారులు బోయపిల్లల్ని మాత్రమే ఇక్కడ అమ్ముతుంటారు. ఈ బాల బానిసలు త్వరలోనే తమ సమాజాన్ని మర్చిపోయి మన వేషభాషలకూ, ప్రవృత్తు

లకూ అలవాటు పడిపోతారు. తమ జాతియొక్క ప్రత్యేకతల్ని కోల్పోవ
డమే కాక, అన్య నాగరికుల్తో కలిసి తామూ బోయజాతిని అసహ్యించు
కోవడానికి, నిందించడానికి తయారౌతారు. కనుక సహజంగానే పారి
పోవడానికి ప్రయత్నించరు. ఎక్కడైనా, వొకడూ అరా పారిపోవడానికి
ప్రయత్నిస్తే మొత్తం సింహళ ద్వీపంలోనే వొకరిద్దరు బానిసలుమాత్రం
తప్పించుకుని అడవుల్లోకి వెళ్ళగలిగారని విన్నాము."

అలా తప్పించుకు వచ్చిన బోయవాడెవడైనా ఇక్కడ వుంటే
ఎంత బాగుండు. మా భవిష్యత్తును గురించీ, ఈ బోయల్ని గురించి
కూడా అడిగి తెల్సుకోవచ్చు అనుకున్నాను. ఆస్థితిలో ఇలా అనుకోవడం
హాస్యాస్పదంగానే వుంటుంది, కానీ, మానవుడు పుట్టుకతోనే జ్ఞాన
పిపాసను, జిజ్ఞాసను వెంబ తెచ్చుకున్నాడు గావును!

గృహస్థు తరువాత సింహళ భిక్షువుల్ని ఇద్దర్ని వొకేమాటు తీసుకు
వెళ్ళారు. ఇక మేము ముగ్గురం మాత్రం మృత్యువు కోసం నిరీక్షిస్తూ
గుహలో వున్నాము. గృహస్థును తీసుకవెళ్ళాక రెండు ఘడియల అనంతరం
సింహళ భిక్షువుల్ని తీసుకుపోయారు. కనుక ఇంకొక్క రెండు ఘడి
యలు మాత్రమే మాకీ ప్రపంచంతో నిమిత్త మనుకున్నాము. ఈ
వ్యవధిలో బుద్ధ సూత్రాల్ని పారాయణ చేయవల్సిందని సింహళస్థవిరుల్ని
వేడుకున్నాము. వారు స్వరాన్ని విప్పి, పెద్దగా దమ్మ పదంలోని కొన్ని
గాథల్ని పాడారు. తరువాత మహానిర్వాణం కొరకు బుద్ధ భగవానుడు
రాజగృహం నుండి పాటలీగ్రామం, వైశాలీలగుండా కుసీ నగరంవరకూ
చేసినయాత్ర వర్ణనల్ని, అంతిమసంస్కారానికి సంబంధించిన సూత్రాల్ని
పారాయణ చేశాము! పారాయణ మా హృదయాలకెంతో సాంత్వన
నిస్తోంది. పారాయణను మధ్యలోనే ఆపవల్సివస్తుందేమోనన్న భయమూ
కలిగింది. పారాయణ పూర్తయిన కొద్దిసేపటికి నా యిద్దరు మిత్రుల్ని
కూడా తీసుకుపోయారు. నన్నూ బుద్ధిలుణ్ణీ వొకమాటు తీసుకువెళ్ళకుండా
వేరుపరచి నందుకు ఎంతగానో దుఃఖించాను. మేము ఇన్నిరోజుల్లోనూ
ప్రగాఢమైన మిత్రత్వ బంధనలో బంధితులమయాము. కనుకనే భిక్షువు
లమూ. విరాగులమూ అయి వుండికూడా అతడివియోగాన్ని సహించలేక
పోయాను.

గుహలో ఇక నేనొక్కడ్నే ఉన్నానిప్పుడు. ఊహలు ఇష్టమొచ్చినట్లు పరిగిడుతున్నాయి ... వాళ్ళను ఈ పాటికి వధ్యస్థలానికి తీసుకుపోయుంటారు. ఇప్పుడు వధ్యశిలముందు కూర్చోబెట్టివుంటారు. ఇంత క్రితం ముగ్గుర్ని చంపారుగనుక ఈ పాటికి వారి హృదయాల్లో కొంతవరకైనా దయారసం ఉద్భవించి వుండవచ్చు. వీళ్ళను ఎక్కువ హింసించకుండా వొకే వేటుకు తలలు నరికి చంపేయొచ్చు! క్షణాలూ, ఘడియాలూ దొర్లు తున్నాయి. పగలంతా గడిచిపోయినట్లూ, సాయంత్రమైనట్లూ వూహించుకోసాగాను. నా ఊహలూ, కల్పనలూ - నన్ను అనేక రకాలైన భ్రమల్లో పడేస్తున్నాయి. ఆ క్షణాన వొకేఒక కోర్కె నాలో విశ్వరూపాన్నిదాల్చింది. "నన్నూ త్వరగా తీసుకువెళ్ళి ఈ జీవితాన్ని కడతేరిస్తేచాలు" అని కోరుకున్నాను. కానీ, నా కోర్కె ఫలించి వుంటే ఈ గ్రంథమే మీ చేతుల్లో వుండేదికాదు. కడసారి నా మిత్రుల్నిద్దర్నీ తీసుకువెళ్ళాక గుహ ద్వారంలో వొకే బోయ కాపలా కాస్తూండడాన్ని గమనించాను. సాయంత్రానికి నన్నూ గుహనుండి బయటకి తీసుకెళ్ళారు. బయటకి అడుగు పెట్టగానే, స్త్రీ పురుషులూ, బాలబాలికలూ ఓ పెద్ద గుంపుగా వచ్చి, నన్ను చుట్టుముట్టారు. మహా విచిత్రంగా చూడసాగారు. నేను వాళ్ళ దృష్టిలో ఓ విచిత్రమైన జంతువులాఉన్నాను. బహుశా అంతవరకూ వాళ్ళు నా లాంటి గౌరవర్ణుల్నెవర్నీ చూసివుండరు నా శరీరానికి ఏదైనా రంగును రాచుకున్నానేమోనవిగావును,చిన్నపిల్లలు వేళ్ళకు వుమ్మిరాచుకొని నాశరీరం మీద రుద్దిచూస్తున్నారు. శరీరాలకు రంగు పులుముకోవడం, శరీరాలమీద తాత్కాలికమైనవో, లేక శాశ్వతమైనవో గుర్తుల్ని వేసుకోవడం వాళ్లకూ అలవాటే. నా శరీరానికి రంగేమీ పులుముకోలేదని తెల్సుకున్నారు. నా కండ్లు నల్లగానేవున్నా, బంగారు రంగులోవున్న కనుబొమ్మలు వాళ్ళకు గొప్ప ఆశ్చర్యాల్లో వొకటి ; తల గొరిగించి, వారమైంది. మొరిపెల్లా కొద్ది కొద్ది వెంట్రుకలు వస్తున్నాయి. తల వెంట్రుకలూ బంగారు రంగులోనేవుండడాన్ని గమనించారు. నేను బాగా భారీగా బలంగా వున్నాను. నా అంత భారీ వ్యక్తులు బోయల్లో లేరు. నా గురించి తమ భాషలో ఏమిటేమిటో చెప్పుకుని నవ్వుకుంటున్నారు. నా శరీరంతో ఆటాడు కోవ

దానికి వారికి ఎలాంటి అభ్యంతరమూ లేదు. అయితే, నన్ను బాధించడం ఇష్టంలేక గావును అలా చేయడంలేదు. చీకటి పడబోతుండగా కాల్చిన మాంసమూ, తోలుతిత్తిలో నీళ్ళూ పట్టుకువచ్చి నా ముందు పెట్టారు. నా హృదయంలో శూలాలు గ్రుచ్చినట్లయింది. "అయితే వీళ్లు నన్ను చంపరా ? బుద్ధిలుడిలాంటి మిత్రుణ్ణి పోగొట్టుకునికూడా బ్రతికివుండ వలసిందేనా?" బుద్ధిలుణ్ణి పోగొట్టుకుని బ్రతకడమనేది చాలా దుర్భర మనిపిస్తోంది. ఉదయంనుండి ఆహారం లేకపోవడంవల్ల బాగా ఆకలిగొని వున్నాను. అయినా, ఆ అకాలంలో ఆహారాన్ని స్వీకరించడం నా కిష్టం లేదు. అలా స్వీకరిస్తే భిక్షువు నియమాల్ని భగ్నపరచిన వాణ్ణవుతాను. అయితే కడుపునిండా మంచినీళ్ళను మాత్రం త్రాగాను. అంధకారం ప్రగాఢ మవజొచ్చింది. నే నొకరకంగా జీవన్మృతుణ్ణయ్యాను. నా మస్తిష్కం భావరహితమైంది. హృదయంఆశాశూన్యమైంది. హృదయం ... మస్తిష్కం ... ఈ మహావిశ్వమే ఓ పెద్ద "శూన్య" మనిపించిం'.

రాత్రి వొకజాము గడిచింది. నా కా వొకజాము వొక మహాయుగ మనిపించింది. ఇంతలో సింహాళ భాషలో నన్నెవరో పిలిచారు. ఉచ్చా రణా, పిల్చే పద్ధతీ, దాసుడు యజమానిని పిలుస్తున్నట్టువుంది. నన్ను లాంటి స్వరంలో ఎవరూ పిలవరు. మొదటిసారి నేనుపలకలేదు. రెండవ మారు మూడవమారుకూడా "భన్తే" (స్వామీ) అన్న అతి నమ్రమైన పిలుపు నా చెవుల్నిపడ్డది. "అయినప్పటికీనన్నెవరో పిలుస్తున్నారు, నేను పలకాలి" అన్న స్ఫురణే నాకు కలగడంలేదు. నేనూ జాగ్రదావస్థలోనూ లేను, నిద్రావస్థలోనూ లేను. మానసిక ప్రపంచపు టాపర్తాయి కల్లోలిత మవుతూన్న ఆ నిశీధిలో జాగ్రదావస్థలో నిద్రానుభవాన్ని నిద్రావస్థలో జాగ్రదానుభవాన్ని పొందుతున్నాను. నే నెంతసేపటికీ పలక్కపోయే సరికి పిలవడానికి వచ్చిన అతడు నిద్రపోతున్నాడ నుకున్నాడు గావును చేయిపట్టుకు కుదిపాడు. చప్పున లేచి కూర్చున్నాను. అప్పుడే చంద్రో దయమైంది. ఆ గుడ్డి వెన్నెల్లో అవతల వ్యక్తి ముఖంలోకి చూశాను. అతడు సింహాళుడుకాదు. బోయ. నల్లగా, నగ్నంగా నిలబడి వున్నాడు. నా కప్పటికి సింహాళ భాష బాగారాదు. అయినప్పటికీ మధ్యదేశ భాష

వచ్చుగనుక అతడి మాటల్ని కొంత కొంత అర్థం చేసుకున్నాను. అతడు "మిమ్మల్ని చంపరు" అన్నాడు.

"మరి నా మిత్రులేమయ్యారు?" అడిగాను.

"వాళ్లు ఎప్పుడో చనిపోయారు. శవాల్ని తీసుకువెళ్ళి నదిలో పారేయడంకూడా అయిపోయింది."

"నన్నెందుకు చంపరు? నన్నూ చంపేసెయ్యండి. నాకు బ్రతకాలని లేదు!"

"చంపము. మీరు మా శత్రువులుకారు, విదేశీయులు, నిరపరాధులెవర్నీ మేము చంపము!"

"ఐతే నన్నేం చేయదలచారు?"—అడిగాను.

"రేపు ఉదయాన్నే తీసుకుపోయి, ఇక్కడికి దగ్గర్లోవున్న గ్రామ పరిసరాల్లో మిమ్మల్ని విడిచివేస్తాము. మీరు వెళ్ళి మా శత్రువుల్తో మేము వాళ్ళలాంటి నీచులం కామని" చెప్పండి వాళ్ళు నిరపరాధులమైన మమ్మల్ని పట్టుకుపోయి పశువుల్లా అమ్మేస్తారు. మా జీవితం నరకయాతన పాల్జేస్తారు. అందుకు మేము తప్పకుండా ప్రతీకారాన్ని చేస్తాము. అయితే వాళ్ళలా ఆ జీవిని హింసించం, ఒక్కవ్రేటు...!"

నే నతణ్ణడిగి మరికొన్ని విషయాలనుకూడా తెల్సుకుందామనుకున్నాను. కానీ, అతడు చాలా క్లుప్తంగా మట్లాడి వెళ్ళాడు. అధికంగా మాట్లాడడం అతడికి ఇష్టంలేదో లేక భాష రాదో తెలియదు. వెళ్తూ ఆహారాన్ని గురించి ప్రశ్నించాడు.

"వెళ్ళేప్పుడు తీసుకుంటా" నన్నాను.

"నన్ను చంపరు...నేను బ్రతికేఉండాలి !" అన్న వూహ నా మనస్సును బాగా వ్యాకులపరిచింది. నే నేమాత్రమూ ఆనందించలేకపోయాను. చాలాసేపు బుద్ధిలుణ్ణి తలుచుకుంటూ పడుకున్నాను. మగతగా నిద్ర పట్టింది. కల్లో నవ్వుతూ ప్రసన్న వదనుడై కనుపించా డతడు. మొదట, నాకు కఠినంగాఉన్న ప్రమాణ సముచ్చయంలోని కొంత భాగానికి వ్యాఖ్యానం చేశాడు. అనంతరం మా యాత్రను గురించి మాట్లాడుకున్నాము. "ఇక మనం సింహళంనుండి వెళ్లిపోవాలి. మనం చీనా దేశం వెళ్ళాలి. అయితే, ముందు మన మాతృదేశాలకు ఒకమాటు వెళ్ళిరావాలి.

దక్షిణా పథంలోని కొన్ని విహారాలను చూసుకుంటూ ఉజ్జయినీ వెళ్దాము. ఉజ్జయినీ నా జన్మభూమి. మహాకవి కాళిదాసుకూడా ఉజ్జయినీ నివాసే! జన్మభూమంటే ఎందుకో ఇంత ప్రేమ. జన్మభూమిపట్ల ప్రేమలేనివ్యక్తి ఉంటాడా ? అక్కడినుండి నీ జన్మభూమయిన ఉద్యానాన్ని చూడడానికి వెళ్దాం. ఇక జంబూద్వీపంనుండి శాశ్వతంగా సెలవు పుచ్చుకుందాము. ఉన్నత హిమశిఖరాలను దాటి చీనాదేశం వెళ్దాం. సముద్రమార్గాన, ఓడల్లో ఏ మాత్రం ప్రయాస లేకుండా ప్రయాణం చేయడం మనకు బాగుండదు!" అని మా యాత్రను గురించి చెప్పాడు.

కలలో అలా ఎంతసేపు బుద్ధిలుడు నాతో మాట్లాడుతున్నాడో ? నిన్నటి క్రూర సంఘటనల్ని పూర్తిగా మర్చిపోయాను. కండ్లు తెరచినా బుద్ధిలుడి ఆకారమే కన్పిస్తోంది. కొంతసేపు జాగ్రదావస్థలోఉండే బుద్ధిలుడితో మాట్లాడాను. సూర్యోదయమైంది చివరకు రాత్రి వచ్చిన బోయ యువకుడు వచ్చి, నా చేయికదిపి, పలుకరించాడు. లేచి కూర్చున్నాను. కాల్చిన పెద్ద మాంసపు ముక్క, కొన్ని ఎండు పండ్లు, తోలుతిత్తినిండా నీళ్ళు-ప్రక్కన పెట్టిఉన్నాయి.

"తినండి, చాలాదూరం నడవాలి. ఆకలి వేస్తుందేమో"అన్నాడు బోయ యువకుడు. "నదీతీరం నుండే వెళ్తామా ?" అనడిగాను, "ఔ" నని తల వూపాడు.

అతడు మాంసాన్ని, నీటినీ తీసుకొని, నన్ను వెంటపెట్టుకు బయల్దేరాడు. నదీతీరానికి వెళ్ళాక ముఖం కడుక్కొని మాంసాన్ని తిన్నాను. ఇన్ని మంచి నీళ్ళు త్రాగాను.

"కావాలంటే మిమ్మల్ని ఇక్కడేవిడిచి వెళ్ళగలను.కానీ ఇక్కడి నుండి మార్గం తెల్సుకోవడం కష్టం. మార్గం తప్పి, మీరు మళ్ళీ ఇంకో గుంపుకు చిక్కిపోతారేమోనని భయం" అన్నాడు బోయ.

నా వెంట ముగ్గురు బోయలు వస్తున్నారు. పరిచయుడైన బోయ యువకుడు వెనక కొన్నాళ్ళు బానిసగా జీవితాన్ని గడిపాడు. వెడుతూ అతడు తన కథనిలా చెప్పాడు: "నన్ను చిన్నతనంలోనే పట్టుకు పోయారు. అనురాధపురంలో ఒక బ్రాహ్మణుడికి అమ్మేశారు. చిన్నవాడినే అయినా బాగా ఊహ తెల్సేఉంది. బ్రాహ్మణుడి యింట్లో నే నొక్కణ్ణే

దాసుణ్ణి. వాళ్లకు వేరే సంతానం కూడా లేను. నేను బానిసని। బానిసలాగానే నాచేత పని చేయించేవారు. అయినా, ఆ బ్రాహ్మణుడూ, బ్రాహ్మణి నాపట్ల పుత్రవాత్సల్యాన్ని ప్రదర్శించేవారు. వారింట్లో నేను చాలా సుఖపడ్డాను. ఏదైనా పొరపాటు జరిగితే కోపగించుకునేవారు. కానీ, ఎన్నడూ చేయి చేసుకుని ఎరుగరు. వారి ఇంట్లో నేను బానిసగా కాక స్వతంత్రుడైన పని వాడిగా జీవితాన్ని గడిపాను. నా మీద చాలా నమ్మకం వారికి। నేను పట్టణ వాసానికి అలవాటు పడ్డాను. ఆ జీవితంలోని ఆనందాన్ని అనుభ విస్తున్నాను. అయినా బంధుమిత్రులు జ్ఞాపకం వస్తుండేవారు. మా అమ్మ ఎప్పుడూ నా కండ్లలో మెదుల్తూ వుండేది. ఒక్కొక్కమాటు పట్టణవాసం మీద విసుగు పుట్టేది మనస్సు స్వేచ్ఛాయుతమైన వన్య జీవనంమీదకు పోయేది. వయస్సు పెరిగి నేను యువకుణ్ణవుతూన్నకొద్దీ జన్మభూమిమీది ప్రేమా, ఆకర్షణా నాలో పెరగజొచ్చింది. కొన్నాళ్లకి బ్రాహ్మణి చని పోయింది. ఇంటి బాధ్యతలన్నీ నాపైనే పడ్డాయి. పారిపోవడానికి అవ కాశాలు పూర్తిగా లభిస్తున్నాయి. పైగా, బ్రాహ్మణుడు నన్ను స్వతం త్రుణ్ణి చేశాడు. నేను స్వేచ్ఛగా, సొంత ఇంట్లో వుంటూన్నట్లు వుంటు న్నాను. అయినా, వన్య జీవనం మీది ఆకర్షణ నన్నటువైపు లాగు తూనే వుంది. నాలాంటి నల్లని వారు సింహళ నాగరికుల్లోనూ చాలా మంది వున్నారు. పైగా నా మాటా, తీరూకూడా బోయదాసుడిలా వుండేవికావు. నేను పారిపోతానన్న శంక బ్రాహ్మణుడికి ఏకోశానా లేదు. ఒకమాటు ఒక సముద్ర తీర పట్టణానికి పనివడి పోయిరమ్మన్నాడు. సరేనని బయలుదేరిన వాణ్ణి పట్టణానికి వెళ్ళకుండా నా జన్మస్థానం వైపు వెళ్ళిపోయాను. సరిహద్దును ఎలా దాటటమా అన్నది పెద్దసమస్య అయింది. మాకు నికరమైన సరిహద్దులంటూ ఏమీ లేవు. ఘోరారణ్యమంతా మాది. మిగిలిన సింహళమంతా వస్త్రధారులది. వస్త్రాలు ధరించి మావాళ్ళలోకి వెళ్ళడానికి వీల్లేదు. చంపేస్తారు. ఇవతలే వుండి వస్త్రాలను విప్పివేస్తే బానిస వ్యాపారులు తిరిగి పట్టుకొని అమ్మేస్తారు. నే నెలాగో సరిహద్దు ప్రదేశానికి చేరుకున్నాను. ఒకరాత్రి ఆ అరణ్యంలోనే గడిపాను. తెల్ల వారుజామునే లేచివస్త్రాన్ని అన్య వస్తువుల్ని అక్కడ వదలివేశాను. ఒక కత్తిని మాత్రంవెంట తీసుకొని మా అరణ్యాల్లోకి వెళ్ళిపోయాను.

ఆ అరణ్యాల్లో ఏనుగులు అధికంగా వుంటాయి. క్రూరజంతువుల భయం చాలాఎక్కువ. అన్ని బాధలు పడి, ఎలాగో బ్రతికి మావాళ్ళల్లోకి వెళ్ళితే, వాళ్ళు నాపట్ల ఎలా ప్రవర్తిస్తారో తెలియదు. మాబోయల్లోనూ అనేక తెగలున్నాయి. వాళ్ళల్లో కొట్లాటలూ, యుద్ధాలూ, జరుగుతూంటాయి. నేనే శత్రు తెగకైనా చిక్కితే...?! నా అదృష్టంకొద్దీ మా తెగలవాళ్ళనే కల్సుకున్నాను.

ఇప్పుడా బోయకు ముప్పై ఏళ్ళకు పైనున్నాయి. పారిపోయి వచ్చేనాటికి అతడికి ఇరవై ఏళ్ళు. అంటే పదిహేను ఏళ్ళుగా అతడు సింహళ భాషను మాట్లాడి ఎరుగడు. అతడు నిదానంగా మర్చిపోయిన పదజాలాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని మాట్లాడుతున్నాడు. అతడికి లభించిన యజమాని క్రూరుడు కాడు. బానిస జీవితంలో అతడే విధమైన బాధల్ని క్రూరతల్ని అనుభవించలేదు. కనుకే నాతో ఇలా సహృదయతతో ప్రవర్తిస్తున్నాడేమో అనుకున్నాను. మధ్యాహ్నానంతరం మేమొకకొండ గుట్టను చేరాము. ఆ గుట్టమీద నిలబడి, వ్రేలితో ముందుకు చూపుతూ "ఇక్కడి నుండి ఇక మేము ముందుకు రావడానికి వీల్లేదు. అదంతా వస్త్రధారుల భూమి. ఆ కనపడే చెట్ల గుంపును దాటిపోతే పంట చేలొస్తాయి. వాటి నానుకునే గ్రామం." అన్నాడు.

# 9వ అధ్యాయం

# స్వదేశానికి....

(క్రీ. శ. 547-48)

వెనకోమాటు "భద్ర" వియోగాన్ననుభవించాను. ఎన్నో రోజుల్ని ఘోరమైన మానసికోద్వేగంలో గడిపేశాను. ఇప్పుడు బుద్ధిలుడి వియోగం నా హృదయాన్ని ముక్కలు ముక్కలు చేసివేసింది. స్నేహితులైన నలుగురు భిక్షువుల్ని పోగొట్టుకుని బ్రతకడం అవమానకరం అని పిస్తోంది. జరిగిన విషయాన్ని మిత్రులకు చెప్పాను. అందరూ చింతించారు. త్వరలోనే మిత్రుల ఉద్వేగం శాంతించింది. కానీ, నా హృదయానికి శాంతి ఏదీ? వర్షాకాలం వచ్చింది. మూణ్నెల్లవరకూ సింహళంలోనేవుండిపోవాలి. వర్షాకాలపు అభ్యంతరం లేకపోతే తక్షణం సింహళం నుండి వెళ్ళిపోయేవాడిని. ఆ మూణ్ణెల్లూ ఒక పిచ్చివాడిలా గడిపాను. ప్రతి పనీ యంత్రవతుగా చేస్తూండేవాణ్ణి. ఉదయాన్నే కాలకృత్యాలు తీర్చుకుని పట్టణంలోని ప్రసిద్ధ స్తూపాలకూ, స్తూపారామానికీ ప్రదక్షిణం చేయడానికి వెళ్ళిపోయేవాణ్ణి. భోజన సమయానికి భిక్షాపాత్ర పుచ్చుకుని భిక్షకు వెళ్ళేవాణ్ణి. సాధారణంగా ఎవరి నిమంత్రణనూ అంగీకరించేవాణ్ణి కాదు. విహార భోజనాన్ని స్వీకరించేవాణ్ణి కాదు. నియమంగా భిక్ష తెచ్చుకునేవాణ్ని. అందుక్కారణం నాలోని వైరాగ్య ప్రవృత్తి కాదు. నన్ను నేను ఏదో ఒక పనిలో ఇరికించుకోవల్సిన దుర్భర మానసిక సితి! నా స్థితికి కొందరు సహృదయులైన భిక్షువులు చాలా విచారిస్తూండేవారు. నాకెంతగానో ఊరట కల్గిస్తుండేవారు. తోటి భిక్షువులూ, కొంతమంది భిక్షుణిలు నేను మహా నిష్ఠపరుణ్ణనుకుంటూండేవారు. నావరకూ నేను ఆశ్వయుజ పౌర్ణమి ఎప్పుడొస్తుందా, ఎప్పుడు సింహళంనుండి వెళ్ళిపోదామా

అని క్షణాల్ని లెక్కపెట్టుకుంటున్నాను. మధ్యాహ్నం వరకూ సమయా న్నెలాగో గడిపే వాడిని. ఆ తరువాత సమయం దొర్లడం బహు కష్ట మయ్యేది. రాత్రిళ్ళు నిద్ర రాక దుర్భర యాతన పడేవాణ్ణి. దయామయి అయిన నిద్రాదేవి నన్ను కరుణించేది కాదు. నిద్రరాక రాత్రిళ్ళు బుద్ధ సూత్రాల్ని పఠిస్తూ కూర్చునే వాణ్ణి. ఏ తెల్లవారుజామునో కొద్ది క్షణాలు కునికేవాణ్ణి. కన్ను మూయగానే బుద్ధిలుడి సౌమ్య, శాంత, గంభీర వద నమే ప్రత్యక్షమయ్యేది. బుద్ధిలుడూ, నేనూ కలలో ఎంతో హాయిగా మాట్లాడుకునేవాళ్లం! హృదయానికి వూరట కలిగేది. కల కరిగిపోకుండా, అనంత కాలాలవరకూ జరుగుతూంటే ఎంత బాగుండును అనుకునేవాణ్ణి!

అనూరాధపురం ఓ గొప్ప వ్యాపార కేంద్రం. వివిధ దేశాలనుండి వ్యాపారులు వస్తుంటారు. సింహళ సముద్రతీరంలో అనేక రకాలైన రత్నాలు దొరుకుతాయి. అనేక దేశాల వ్యాపారులు ఇక్కడ తమ సరు కుల్ని అమ్ముకుని తిరిగి వెళ్ళేటప్పుడు రత్నాల్ని తీసుకొని వెళ్తారు. విదేశీ వ్యాపారులకు కొందరికి అనూరాధపురంలో సొంత భవనాలు కూడా వున్నాయి. నా మిత్రుడూ నేనూ సంకల్పించుకున్న చీనాదేశపు యాత్రను ఎటూ చేస్తాను. ఆ యాత్రకు ముందు ఒకమాటు నా మిత్రుడి జన్మ భూమినీ, నా జన్మభూమినీ, చూసుకుని మరీ వెళ్తాను. అయితే ఇప్పుడు ఏ మార్గాన యాత్రచేయాలి ? అన్నది సమస్య. బుద్ధిలుడు బ్రతికి వున్న ట్టయితే, ఇంత త్వరగా తిరిగి వెళ్ళడం జరిగేది కాదు. నిదానంగా దక్షిణా పథంలోని మిగిలివున్న ప్రసిద్ధ స్థలాలను చూసుకుంటూ అవంతిపురం చేరుకునే వారం. అక్కడినుండి ఉద్యానదేశానికి వెళ్ళేవాళ్ళం. కాని, నాలో దక్షిణాపథమంతటినీ యాత్ర చేయగల సాహసంలేదు. ఉజ్జయిని చూసుకుని ఉద్యానానికి వెళ్ళిపోవడం నా ఆదర్శం. నేను పర దేశీయుణ్ణి కావడం వలనా, నా సద్వర్తనుచూసి ఎంతోమంది స్త్రీ పురుషులు నాపట్ల ఆదరభావాన్ని ప్రదర్శిస్తూండేవారు. గుజరాతు దేశస్థుడైన ఒక సార్థ వాహుడు నన్ను తమ ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. నేను చాలా నమ్రతతో అతడి నిమంత్రణను తిరస్కరించాను. "భిక్షాటనలో లభిం చిన ఆహారాన్ని మాత్రమే భుజిస్తా" నని చెప్పాను.

"పోనీ, భిక్షాటనకు వచ్చేప్పుడైనా మా ఇంటిని పవిత్రం చేస్తూండండి!" అన్నాడు సార్థవాహుడు. నేనందుకు అంగీకరించాను.

శ్రేష్ఠి నడి వయస్సువాడు. ఇతణ్ణి, ఇతడి భార్యను చూచే సరికి కౌశాంబి శ్రేష్ఠి జ్ఞాపకం వచ్చాడు. "నేను గుజరాతు దేశంలోని భరుకచ్ఛ నగర వాసిని. నా భార్య అస్వస్థతగా వుంది. వర్షాకాలం ఇక్కడే వుండి, తరువాత స్వదేశం వెళ్ళిపోదా మనుకుంటున్నాము!" అన్నాడు. శ్రేష్ఠి భార్య కౌశాంబి శ్రేష్ఠి భార్యలాగానే ధర్మపరాయణ. సాధారణంగా ప్రౌఢలైన శ్రేష్ఠి పత్ను లందరూ ధర్మపరాయణులుగా, భక్తిపరులుగా వుంటారు. సింహళంలోని పవిత్ర స్థలాలను చూడడానికి భర్తతోపాటు వచ్చిం దీమె. నేను నిమంత్రణను అంగీకరించి తమ ఇంట్లో భోజనం చేయనందుకు ఎంతగానో బాధపడేది. మధ్యాహ్నానంతరం ద్రాక్షపండ్ల రసంకానీ, మరి ఇతర పండ్ల రసంగానీ తీసుకుని విహారానికి వచ్చేది. ఆమె రోజూ బుద్ధ సూత్రాల్ని పారాయణం చేయవల్సిందని ప్రార్థించింది. ఆమె ప్రార్థనను మన్నించి రోజూ మధ్యాహ్నాం తరువాత రెండు మూడు ఘడియలపాటు బుద్ధ సూత్రాల్ని పారాయణంచేసేవాణ్ణి. దంపతులిద్దరూ నిత్యమూ వచ్చి వింటూండేవారు. ఇదో కొంత కాలక్షేపముగా ఉండేది. నన్ను తమతోపాటు దేశానికి వచ్చేయ వలసిందని దంపతులిద్దరూ ప్రార్థించారు. వారితో వెళ్ళడానికి ఇష్టపడితే, దక్షిణాపథంతో ప్రమేయం లేకుండా, నేరుగా భరుకచ్ఛానికి వెళ్ళిపోవచ్చును. అక్కడి నుండి ఉజ్జయిని. బుద్ధుని జన్మభూమికి వెళ్ళడానికి ఇంతకంటే దగ్గరది, సుఖకరమైన మార్గమూ మరోటి లేదు. వారితో ప్రయాణం చేయడానికి చాలా సంతోషంగా వప్పుకున్నాను. ఉజ్జయినీ త్వరగా వెళ్తున్నందువల్ల కలిగే ఆనందంలో మిత్రుడి వియోగ బాధను కొంతవరకూ మర్చిపోగలుగుతున్నాను. ఏదో ఒక పనిలో నిమగ్నుణ్ణయి, వియోగపు సుదీర్ఘ ఘడియల్ని ఎలాగో గడిపేస్తుండేవాణ్ణి!

* * *

మహాప్రవారణోత్సవం అయిపోయాక అనూరాధపురా న్నుండి బయల్దేరాము. శ్రేష్ఠి చాలా పెద్ద సార్థవాహుడు. అతడి ఓడలు సింహళం, యవద్వీపానికే కాకుండా పశ్చిమ దేశాల కూడా వెళ్తుంటాయి.

ఉజ్జయినీలోనూ అతడికో భవనం ఉంది. మహారాజులో సరితూగ గల సంపన్నుడు శ్రేష్ఠి! అనూరాధపురానికి పశ్చిమంగా ఉన్న సముద్రతీరంలో అతని ఓడలు కొన్ని ఉన్నాయి. అయితే, ఆ ఓడలు సరుకులు నింపు కునే వరకూ నిరీక్షింపవల్సి వచ్చింది. నేను మామూలు స్థితిలో ఉన్నట్ల యితే సింహళ భూమిని విడుస్తున్నందుకు ఎంతో ఖేదపడేవాణ్ణి కానీ, ఈ స్థితిలో సింహళాన్ని విడవడం వలన హృదయం కొంత తేలికపడు తూన్నది. సింహళంలో బుద్ధిలుడి జ్ఞాపకాలు నిత్యం నన్ను వేధిస్తుండేవి. అత్యంత ప్రేమ పాత్రుడైన మిత్రుణ్ని సింహళంలో కోల్పోయాను :

పాదాపు రెణ్ణెల్లు ప్రయాణంచేసి భరుకచ్ఛం చేరుకున్నాము. శ్రేష్ఠి ఓడ నేరుగా భరుకచ్ఛం వచ్చినట్లయితే ఇంతకాలం పట్టేదికాదు. సముద్ర తీరంలోని అనేక పట్టణాల్లో అతడికి వ్యాపార సంబంధాలున్నాయి. పడ వలు ప్రతి పట్టణం వద్ద ఆగి సరుకుల్ని దింపుతూ,ఎత్తించుకుంటూండేవి. ప్రతి పట్టణంలోను శ్రేష్ఠి కర్మచారు లున్నారు. శ్రేష్ఠి ఇలా రావడము చాలా అరుదు. కర్మచారులు అతడికి బ్రహ్మరథం పట్టేవారు. తమ కార్య కలాపాలను చూడడానికి పట్టణంలోకి తీసుకు వెళ్తూండేవారు. నేనూ శ్రేష్ఠితోపాటు ప్రతిచోటా దిగుతూండేవాణ్ణి. ఎక్కడైనా విహారాలుగానీ, భిక్షువులుగానీ ఉంటేదర్శించడానికి వెళ్ళేవాణ్ణి.మొత్తం యాత్రలో చెప్పు కోదగిన విషయమేమీ జరగలేదు. ఓ రెండు రోజులు పాటు సముద్రం క్షుభితమైయింది. తద్బాధను నేనూ అనుభవించాను. ఆ రెండు రోజులూ భోజనం కూడా చేయలేకపోయాను.

తాళపత్రాలమీద వ్రాసిన గ్రంథాలు ఎక్కువ రోజులు ఉంటాయి. మా ఉద్యాన దేశంలో భూర్జపత్రాలమీద గ్రంథాల్ని వ్రాస్తుంటారు. అయితే ఉష్ణదేశాల్లో భూర్జపత్రాలు ఎక్కువరోజులు ఉండవు. తాళపత్ర గ్రంథాలు అన్నిప్రదేశాల్లోనూ చిరకాలంఉంటాయి. గ్రంథాలమీద ఎంత మమకారం ఉన్నా, యాత్రలో బరువును పెంచుకోవడం తగదు. బుద్ధి లుడూ, నేనూ చాలా కొద్ది గ్రంథాలను మాత్రం వెంట వుంచుకునే వాళ్ళం. ఇప్పుడిక బుద్ధిలుడి పుస్తకాలుకూడా నా దగ్గిరేవున్నాయి. సింహ ళంలో చాలా సుందరమైన తాళ పత్రాలు దొరుకుతాయి. బుద్ధిలుడు సింహళంలో అందమైన తాళపత్రాలమీద, ఎంతో ప్రేమతో 'ప్రమాణ

సముచ్ఛయాన్ని వ్రాసి పెట్టుకున్నాడు. బుద్ధిఖడి అక్షరాలు చాలా కుది రికగా ఉంటాయి. అతడు చిరస్మరణీయుడు. అతడు వ్రాసిన 'ప్రమాణ సముచ్ఛయ' ప్రతిని ఇప్పటికి నలభై ఏండ్లనుండి దగ్గిర వుంచుకుంటు న్నాను. బుద్ధిలుడు పోయిన క్రొత్తల్లో ఈ గ్రంథాన్ని చూస్తేచాలు. దుఃఖం కట్టలు త్రెంచుకునేది. కానీ, ఇప్పుడీ గ్రంథాన్ని చూస్తుంటే హృదయానికి ఎనలేని సాంత్వన కలుగుతోంది.

మంచి చలికాలంలో భరుకచ్ఛాన్ని చేరాము. అప్పటికి రెండు చలి కాలాల్ని సింహళంలో గడిపాను. అక్కడసలు చలేవుండదు. భరుకచ్ఛా నికి వచ్చి, చలికి ఆగలేక దుప్పట్లు కప్పుకున్నాము. ఏవో అపూర్వమైన అనుభూతులు కలిగాయి నాలో! ఆత్మీయమైన వస్తువును దేన్నో పోగొట్టు కుని తిరిగి పొందినట్లయింది. శ్రేష్ఠి, తమ పూర్వీకులు కట్టించిన విహారం లోనే నే నుండడానికి ఏర్పాట్లు చేశాడు. శ్రేష్ఠి ద్వారా నాగురించి విని, తెల్సుకుని, నన్నక్కడే కొన్నాళ్ళుండి పోఎల్సిందని కోరారు అక్కడి భిక్షువులు! కానీ, నా మానసికస్థితి నన్నెక్కడా ఆగనీయడంలేదు. ఎవరో పట్టి లాగుతున్నట్లు ఉజ్జయినీవైపుకు ఉన్ముఖుడనై యున్నాను. భరుకచ్ఛా న్నుంచి స్థలమార్గాన సార్థవాహులు ఎప్పుడూ ఉజ్జయినీకి వెళ్తూంటారు. మరికొంత కాలం భరుకచ్ఛంలో వుండవల్సిందని శ్రేష్ఠిఎంతగానో ప్రార్థిం చాడు అయినా, నేను వెళ్ళిపోవడానికే సిద్ధమయ్యాను. శ్రేష్ఠి ఉజ్జయినీ వెళ్ళే ఒక సార్థవాహుని వెంట నన్ను పంపించివేశాడు.

భరుకచ్ఛం, ఉజ్జయినీ—ఈ రెండు పట్టణాలూ వెనక క్షత్రపుల రాజధానులు. ఇప్పుడా వెనుకటి వైభవాన్ని గోల్పోయా యీ పట్టణాలు. అయితే, కొద్దిరోజులు అధోగతికిపోయినా తిరిగి కోలుకుని పైకివచ్చింది ఉజ్జయిని. భరుకచ్ఛం మాత్రం ఇకనసలు కోలుకొనేలేదు. అవంతీపురాన్నీ కన్యాకుబ్జాన్నీ పరిపాలించే రాజవంశాలు ఒకప్పుడు గుప్తుల అధీనంలో వుండే సామంత వంశాలు. కానీ, ఇప్పుడీ రెండువంశాలూ గుప్త రాజ్య లక్ష్మికి తామే వారసుల మంటున్నాయి. మిహిరకులుణ్ణి ఓడించాక విజయ లక్ష్మి చేతిలోని జయమాల తమ మెడనే అలంకరించాలని ఈ రెండు సామంత రాజవంశాలూ కీచులాడుకుంటున్నాయి. నే నివ్వాళ నామిత్రుడి జన్మనగరంలో వున్నాను. ఇది కాళిదాసు జన్మించిన ప్రియనగరం! బుద్ధి

డుకూడా వెంటవుంటే ఈ నగరాన్ని చూస్తూన్నందుకు ఎంతఆనందించే వాణ్ణో? బుద్ధిలుడి బంధువులు అవంతిపురంలో వున్నారు. వాళ్ళను కల్సుకోవడంవల్ల ఉభయులమూ దుఃఖసాగరంలో మునగడంకాక వేరు ప్రయోజన ముండదు. అయినా ఇక్కడివరకూ వచ్చి వాళ్ళను కలుసుకోకుండా వుండడం అసభ్యతగా వుంటుంది. బుద్ధిలుడి ఇంటికి వెళ్ళాను, అతడితల్లి బ్రతికివుంది. ఈ దుర్వార్తను నా నోటిమీదుగా ఆమెకు చెప్పడంకంటే మౌనంగా వెనక్కి వచ్చేయడం నయం అనుకున్నాను. కానీ, ఇంతలో బుద్ధిలుడి తమ్ముడు కలిశాడు. అతడికి యథార్థము చెప్పేశాను. అతడూ, నేనూకూడా కొద్దిసేపు దుఃఖించాము. నేను బుద్ధిలుడి మిత్రుణ్ణని తెలియగానే, అతడితల్లి, ఆనందంతో ఆహ్వానించడానికి ముందుకు వచ్చింది. కానీ, ఇంతలో పుత్రుడి దుర్మరణవార్తను విని స్పృహతప్పి క్రింద పడిపోయింది కొద్ది క్షణాలు ఆమెలో జీవించివున్న లక్షణాలు ఏమీ కనుపించలేదు. కొంతసేపటికి వృద్ధురాలు తేరుకుని లేచి కూర్చుంది. హృదయంలో నుండి పైకుబికే అపారమైన దుఃఖాన్ని దిగమింగుతూ "నిన్నే నా బుద్ధిలుడనుకుంటాను!" అన్నది.

ఇంకాకూడా ఇలా అంది: "బుద్ధిలుడికి పదేళ్ళ వయస్సుంటుంది. నేను స్వయంగా తీసుకువెళ్ళి కాంచనవన విహారంలో చేర్చాను. ఉపసంపద అయ్యేవరకూ అక్కడేవున్నాడు. వాడి విద్యాభ్యాసాన్ని గురించి, తెలివితేటల్ని గురించి ఇతర్లు చెప్పుకుంటే విని ఆనందంలో పొంగిపోయేదాన్ని! తను విన్న అనేక దేశాల్ని గురించి నాతో చెప్తూండేవాడు. విద్యాధ్యయనం పూర్తయాక ఆయా దేశాల్ని పర్యటించి రమ్మని వాణ్ణి ఉత్సాహపరిచేదాన్ని. దేశాటన కష్టసాధ్యమైందనీ, ఒక్కొక్కప్పుడు ప్రాణాపాయంకూడా సంభవించ వచ్చుననీ నాకు తెల్సు. అయినా, నేను వాణ్ణి నిరుత్సాహపరిచేదాన్ని కాను!"

ముసలామె శోకసాగరంలో మునిగిపోయింది. దుఃఖం హృదయశల్యమై జీవితాంతం బాధిస్తుందామెను! నేను ఉజ్జయినిలో ఉన్నన్నాళ్ళూ బుద్ధిలుడి గృహానికి వెళుతూనేవున్నాను. కానీ, ఆ వృద్ధురాలు ఆ తరువాత ఎన్నడూ తన కొడుకును గురించి దుఃఖించలేదు. నన్ను సొంత కొడుకులాగానే చూసుకుంది. ఆమె తమ వంశాన్ని గురించి ఇలా చెప్పింది:

"మేము శకులం. ఉత్తర దేశాన్నుండి ఇక్కడికి వచ్చాము. మొదటగా మా పూర్వీకులు, ఇరవై శతాబ్దాల క్రితం, ఈ దేశానికి వచ్చారు. ఇప్పుడీ మధ్య దేశంలో మా శకవంశస్థులు చాలామంది వున్నారు. అయితే, తాము సుదూర ఉత్తర దేశవాసులమన్న సంగతి, వీరిలో చాలామందికి తెలియదు. మేము శకబ్రాహ్మణులం. దివ్యసంపదలనూ, రాజభోగాలనూ అనుభవిస్తూ పారంపర్యంగా వస్తూన్న వంశ గౌరవాన్నీ, గర్వాన్నీ నిల్పుకుంటూన్నాము. చెష్టనుడూ, నహపానుడు మొదలైన మా పూర్వీకుల నామాలే మే మీదేశవాసులం కాదన్న విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. బుద్ధిలుడు మా పూర్వీకులైన శకుల జన్మభూమిని చూచి వస్తాడనుకున్నాను."

"బుద్ధిలుడు శకుని జన్మభూమి దరిదాపులవరకూ వెళ్ళాడు. కపిశాలో అతనికీ నాకూ స్నేహ మేర్పడ్డది మా స్నేహకారణంగానే వెనక్కి తిరిగి దక్షిణా పథానికి వచ్చాడు. లేకపోతే అటునుండి అటే శకుల భూమిలోకి వెళ్ళేవాడు. కానీ, మేము ఎన్నటికైనా శకుల భూమిని చూడాలని నిశ్చయించుకున్నాము. ఇప్పుడు మిత్రుడు లేకపోవచ్చు. కానీ, నిశ్చయం అలాగేవుంది. నేను తప్పకుండా శకులభూమిని చూచి వస్తాను!" అన్నాను.

* * *

నేను ఇప్పుడు మళ్ళీ మధ్యదేశంలో వున్నాను. ఇక్కడి గ్రామాలూ, పట్టణాలూ, మాటా, పద్ధతి- అన్నీ సుపరిచితమైనవి. మౌఖరుల రాజ్యసీమల్లో శాంతి సువ్యవస్థలు నెలకొని వున్నాయి. దేశం పల్లెల్లో, పాడిపంటల్తో కళకళ్ళాడుతోంది ఊరూరా దేవాలయాలూ, విహారాలూ వున్నాయి. ప్రయాణాలు చాలా సుకరంగా సాగుతున్నాయి. దొంగల, తోడుబోతుల భయంలేదు. ఒంటరిగానైనా ప్రయాణం చేయవచ్చు! కానీ, సాధారణంగా ఎవరో ఒకరు తోడుదొరుకుతూండేవారు. వసంతఋతువు ప్రథమపాదం. ఎండలింకా ముదరలేదు. ఎండలు తీవ్రమైతే ఉదయం, సాయంకాలం మాత్రమే యాత్ర చేయగలుగుతాను. ఇప్పుడలాంటి బాధేమీలేదు. విదిశాలో చైత్యగిరిని చూడడం ముఖ్యం! అక్కడే తథాగతుని శిష్యుడైన సారిపుత్ర మౌద్గల్యాయనుడి ధాతు

నిక్షిప్తాలైన చైత్యాలున్నాయి. వాటినీ చూడాలి. విదిశాలో ఐదురోజు లున్నాను. చైత్యాలకు చెక్కిన సుందర తోరణాలూ, శిల్పాలూ అతి మనోహరంగా వున్నాయి. వాటిని చూస్తూవుంటే బుద్ధిలుడు జ్ఞాపకం రాసాగాడు. ఆనాడు మట్టితో ఇలాంటి శిల్పాలనే చేసి, చూపిస్తూ కౌశాంబీ శ్రేష్ఠితో ఇలా అన్నాడు "ప్రతిదేశంలోనూ, ప్రతి విషయం లోనూ నిరంతరం పరివర్తన జరుగుతూనే వుంటుంది. ఒకప్పుడు తథా గతుడికి విగ్రహం వుండేది కాదు. పీఠను, పాదాలనూ బోధివృక్షాన్నీ అతడికి ప్రతీకలుగా భావించి పూజిస్తుండేవారు !"

విదిశానుండి రోపగిరి-గ్వాలియర్ - మీదుగా మధురకు వెళ్ళాను. మధురలో ఓ వర్షావాసాన్ని గడపా లనుకున్నాను. అప్పటివరకూ అవి శ్రాంతంగా యాత్రలు చేస్తూండడం వలన చాలా అలసిపోయాను. పైగా బుద్ధిలుడి తాలూకు దుఃఖం కొంతవరకూ ఉపశమించింది. ఎక్కడో ఒక చోట విశ్రాంతి తీసుకోవడం ముఖ్య మనిపించింది కనుకనే మధురలో వర్షా వాసాన్ని గడప నిశ్చయించుకున్నాను ఒకప్పుడు ఈ మధురానగ రమూ శకుల రాజధానే ! శకులూ, ఉద్యానవాసులమైన మేమూ (ఖస్ జాతి) ఒకే జాతికి చెందిన వాళ్ళమని తెల్సుకున్నాను. శకజాతికి సంబం ధించిన ప్రాచీన రాజధానులనూ, పట్టణాలనూ చూస్తూన్నా, శకజాతి ప్రజల్ని కల్సుకున్నా నాలో బంధు ప్రీతి, ఆత్మీయత పెల్లుబికేవి. పైగా శకులూ మాలాగానే బౌద్ధమతాభిమానులు. కపిషా నగరహారం, తక్షశిల, కాశ్మీరం, భరుకచ్ఛం ఉజ్జయినీ మొదలయిన నగరాల్లో శకులు కట్టించిన స్తూపాలే బౌద్ధమతం పట్ల వారికిగల శ్రద్ధాశక్తుల్ని తెలియచేస్తున్నాయి. శకరాజ్యం అంతరించి ఒకటిన్నర శతాబ్దాలు గడిచినాయి. అయినా, యిప్పటికీ కనిష్కుడూ, అతడి వారసులూ కట్టించిన స్తూపాలు మధు రలో వున్నాయి. పైగా మంచి స్థితిలోనూ వున్నాయి ! అయితే, వాళ్ళు కట్టించిన భవనాలు మాత్రం శిథిలావస్థ కొచ్చాయి. కనిష్కుడివీ. కద ఫిసుడివీ మరికొంతమంది శకరాజుల ప్రతిమల్ని చూశాను. ఈ ప్రతి మల ఆకారాలూ, శ్వేతహూణుల్నీ, తుషార దేశానికి ఉత్తరంగా వుండే అన్యజాతుల్నీ, పోలివున్నాయి. నేను చిన్న తనంలో ప్రతిమల్లోని ఆకారాలు కల ప్రజల్ని కపిషా, ఉద్యాన దేశాల్లో చూశాను. వాళ్ళ

ఉత్తర దేశాన్నుండి వస్తుండేవారు. ఈ ఔత్తరాహుల చెప్పులు మోకాళ్ళ వరకూ వుండేవి. ఈ ప్రతిమల్లోని కనిష్కుడికి, కదఫిసుడికూడా మోకాళ్ళవరకూ చెప్పులున్నాయి.

ఉరుముండ (గోవర్ధన) పర్వతాన్ని గురించి చాలా రోజులుగా వింటున్నాను. నాకు భిక్షుత్వాన్ని ప్రసాదించిన సర్వాస్తివాద నికాయం మొదటి ఉరుముండ పర్వత పరిసరాల్లోనే పుట్టిందట! ఈ చిన్నపర్వతం సర్వాస్తివాదానికి పట్టుకొమ్మలాంటిది ఇప్పటికీ ఇక్కడో, పాచీనవిహారం వుంది. అందులోనే నేను వర్షావాసాన్ని గడిపాను. సర్వాస్తివాదపు జ్యేష్ఠ స్థవిరులైన సాణవాసుని నార చీవరం ఇప్పటికీ ఆ విహారంలో వుంది. ఇలాంటి వస్తువులమీద ఇప్పుడు నాకంతగా విశ్వాసం వుండటం లేదు. అయినప్పటికీ సాణవాసుడు అతినిరాడంబర జీవితాన్ని గడిపాడనడంలో సంశయంలేదు. నిరాడంబరుడు కనుకే సన్నని నూలు చీవరం స్థానే మొరకైన నార చీవరాన్ని ధరించేవాడు. ఈ సాణవాసుడు ఒక్క సర్వాస్తివాదులకే కాక అన్యనికాయాల బౌద్ధులకూ్కడా గురుసమానుడు. సింహళం లోని మహాస్థవిర భిక్షువులూ ఇతడిపట్ల పూజ్యభావనను కలిగివుంటారు. ఉరుముండ పర్వతానికి చుట్టుపట్ల చాలాదూరంవరకూ మహారణ్యం వుంది. ఈ అరణ్యం శకవంశం నశించాక అభివృద్ధయి వుంటుందనుకున్నాను ఈ అరణ్యంలోనే అక్కడక్కడా పాడుపడిన విహారా లున్నాయని తెల్సి వాటిని చూడటానికి వెళ్తూండేవాణ్ణి. అరణ్య మధ్యంలో, నాగరిక ప్రపంచానికి దూరంగా పల్లెలుండడాన్ని గమనించాను. తక్కెడకు ఒక ప్రక్కన బరువుంచితే మరో ప్రక్కన పైకి లేవడం సహజమేగా! మానవజాతియొక్క ఉన్నతిపట్ల, సభ్యత, సంస్కృతుల వికాసాలపట్లకూడా ఇదే న్యాయం చెల్లుబాటు అవుతుంది.

బుద్ధిలుడు పోయాక ఇది రెండవ వర్షావాసం. ఇప్పుడు మానసిక స్థితి చాలావరకు బాగుపడ్డది. మిత్రుడి వియోగదుఃఖపు పైపొంగు తగ్గింది. అయితే, ఇప్పటికీ ఏ ఒక్క విషయంలోనూ స్థిర నిర్ణయాన్ని చేసుకోలేక పోతున్నాను. మనస్సును స్తిమితపరచుకోలేక పోతున్నాను. ఉరుముండ పర్వతంవద్దవున్న ఈ బౌద్ధవిహారాన్ని నటవటవిహారంఅంటారు నటుడు, వటుడు అనే ఇద్దరు ఉపాసకులు భదంత ఉపగుప్తుని కొరకు

ఈ విహారాన్ని కట్టించారుట. అందువలననే ఈ విహారానికి నటవట విహారమని పేరొచ్చింది. ఇప్పుడీ విహారంలో మూడువందలమందిదాకా భిక్షువులున్నారు. నే నున్న కోష్ఠకానికి ప్రక్క కోష్ఠకంలో ఒక చీనీ భిక్షువున్నాడు. త్వరలోనే అతడు నాకు మిత్రుడయ్యాడు. ఇద్దరం కలిసి తరచు పరిసర ప్రదేశాల్ని చూడటానికి వెళ్ళి వస్తూండేవాళ్ళం. ఇతడు మిత్రుడయ్యాక చీనా దేశం వెళ్ళాలన్న కోర్కె తీవ్రమయింది.

ఏదైనా సంఘటనను క్రొత్తగా చూసినప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. కానీ. మాటిమాటికీ అదే సంఘటనను చూస్తూవుంటే, సహజమైందిగానే కనుపిస్తుంది. ఇక్కడి పట్టణాల్లోకిగానీ పల్లెల్లోకిగానీ ఛండాలురు రావడం జరిగితే, తమ చేతికర్రను నేలకు కొడుతూ దూరంగా తొలగిపొండని ప్రజలకు తెల్పుతూ వుంటారు వీధుల్లో తిరిగేప్పుడూ అలాగే చేతికర్రను నేలకు కొడుతూ ప్రజల్ని హెచ్చరిస్తూంటారు. చీనీ భిక్షువు ఒక రోజున ఇదే విషయాన్ని గురించి అడిగాడు. నేను గాఢనిద్ర నుండి మేల్కొన్నట్లయ్యాను. నిజంగానే మానవుల్లో కొంతమందిని నీచులుగా అంటరానివారుగా భావించడం న్యాయమా? బౌద్ధ భిక్షువుల్ని చూసి కూడా ఛండాలురు అలాగే కర్ర నేలకుకొట్టి తప్పుకోమని హెచ్చరిస్తూంటారు. బౌద్ధుల్ని బుద్ధుని పుత్రులనీ,శాక్యముని పుత్రులనీ అంటుంటారు. బుద్ధునికి ఛండాలుడు, బ్రాహ్మణుడూ అన్న భేదభావన లేదు. మానవులందరూ సమానులని తథాగతుడు భావించాడు. ఊరక భావించడమే కాదు. తన భిక్షు సంఘంలో ఛండాలజాతి స్త్రీ పురుషులకుకూడా సమానస్థానా న్నిచ్చాడు. ఈ నటవట విహారంలోనూ,ఇతర అనేక విహారాల్లోనూ ఛండాల జాతి భిక్షువులున్నారు.ఇతర భిక్షువులకున్న సమస్త అధికారాలూ వీరికీ వున్నాయి. సంఘాలలో, విహారాల్లో రంగు భేదం, జాతిభేదం లేనందుకు చీనీ భిక్షువు సంతోషించాడు. కానీ, అతడు సంతృప్తి మాత్రం పడలేదు! ఈ సువిశాల జంబూద్వీపంలో మా భిక్షు సంఘాలు సముద్రంలో నీటిబొట్టులా గుంటాయి. అలాంటప్పుడు ఈ సంఘాల్లో సమానత్వాన్ని పాటించడంవల్ల వారిగే ప్రయోజనం ఏముంటుంది?సంఘాన్ని దాటి బయటికి వెడితే ఛండాలుడు ఛండాలుదేగాని, బ్రాహ్మడుగా భావించబడడుగదా ? కనీసం మానవమాత్రుడిగానైనా చూడ బడడుగదా? చీనీ

భిక్షువు ఇలా అన్నాడు: "మా దేశంలో ధనికులూ, బీదలూ వున్నారు. గౌరవనీయులూ, గౌరవ హీను లున్నారు. కానీ ఛండాలురు లేరు. ఒక మానవుణ్ణి తాకితేనూ, ఒకమానవుడి నీడను స్పర్శిస్తేను అపవిత్రమౌతా మన్న భావన అక్కడ ఎవరిలోనూ వుండదు!"

తథాగతుని భావాలు ప్రచారంలోకి వచ్చి దాదాపు వెయ్యేండ్లు గడిచాయి. అయినా, ఇప్పటికీ బుద్ధుని జన్మభూమిలో జాతిభేదం అలాగేవుంది ఎప్పుడైనా, ఈజాతికుల భేదాల్ని గురించి ఆలోచిస్తూంటే, 'ఈదేశంలో ఈ భేదాలు ఎన్నటికీ నశించవేమో!' అనిపిస్తుంది. "మరి ఈ జాతికుల భేదాల్ని నశింపచేయడానికి తథాగతుడు చేసిన ప్రయత్నమూ, పడ్డ శ్రమా వ్యర్థమే అవుతాయా?" అన్న ప్రశ్న వచ్చినప్పుడు మనస్సు క్షుభితమయ్యేది గుండెలు గతుక్కుమనేవి! ఒక్కొక్కప్పుడు ఇలా ఆలోచించేవాణ్ణి "ఈమధ్య దేశంలోనే జాతి భేదం ఇంత తీవ్రంగా వుంటానికి కారణ మేమిటి? మా ఉద్యాన దేశంలోనూ జాతి భేదం లేదు. మా దేశంలోనూ ధనికులూ, బీదలూ, ఉన్నత వర్గాలవారు, నిమ్న వర్గాలవారూ వున్నారు. కానీ, ఛండాలురులేరు. మానవుల్లో కొందరిని అంటరాదన్న భావన అక్కడ లేదు. సాధారణంగా ఛండాలు రందరూ నల్లగా వుంటారు. ఐతే, ప్రతి దేశంలోనూ, ప్రతి జాతిలోనూ ఏ కొద్దిమందో నల్లగా వుండడాన్ని మనం చూస్తున్నాము. మరి వారందరినీ అంటరానివాళ్ళగా భావించంగా? మరి వీళ్ళనే. నల్లగా వున్నారనే నెపంతో. యెందుకు అంటరానివాళ్ళగా భావించాలి?" ఈ విషయంలో నా భావాలు మహోగ్ర రూపాన్నిదాల్చాయి. పరిచయులైన భిక్షువుల్లో చాలాతీవ్రంగా ఈ విషయాన్ని గురించి వాదించేవాణ్ణి. భారతదేశంలోనే వుండడం నా జీవితాదర్శానికి విరుద్ధం! నే నీ దేశములోనే వుండడం సంభవమైతే, ఇలాంటి దురాచారాల నిర్మూలనకు తీవ్రకృషి చేసేవాణ్ణి! వేల సంవత్సరాలుగా సమాజ జీవనంలో పాతుకుపోయిన దురాచారాలు, ఏ ఒక్క వ్యక్తి ప్రయత్నంతోనే నశించవు. అయినప్పటికీ తాను దురాచారం అనుకున్నదాన్ని ధైర్యంగా ఖండించడం, నిరసించడం ప్రతి మానవుడి కర్తవ్యం!

మధ్య దేశంలోని రాజవంశాల మార్పు, విహారాలపై బాగా ప్రభావాన్ని వేసింది. రాజకీయ పరివర్తనవల్ల యెన్నో విహారాలు రక్షణ లేక శిథిల మయ్యాయి. ఒక వైపునుంచి పాత విహారాలు దక్షతలేక శిథిల మౌతుంటే, మరోవైపునుండి శ్రద్ధాళులయిన ప్రజలు క్రొత్త క్రొత్త విహారాలను కట్టిస్తున్నారు. రాజులు పాత, క్రొత్త విహారాలకు భూముల్ని, పూదోటల్ని దానం చేస్తుంటారు. వెనుకటి రాజుల దానాలను యిప్పటి రాజులు తీసివేయడంలేదు. అలా వెనుకటి దానాలను రద్దు చేయడము మహాపరాధమని రాజుల భావన! కానీ, విహారాలే శిథిలమై కాలగర్భంలో కల్సిపోతూంటే, వాటి తాలూకు దానాలు నిలిచివుండడం సంభవమా?

యమునానదికి పశ్చిమంగా నాతిదూరంలోకల ఉరుముండ పర్వత ప్రాంతంలో వర్షావాసాన్ని గడుపుతూండగా యెన్నోమార్లు "యిక నేను బౌద్ధుల దేశాన్ని (మధ్యదేశాన్ని) తిరిగి చూడలేనేమో!" ననుకున్నాను. అయితే, గంగా యమునల పేర్లు ఎప్పుడు విన్నా, బుద్ధుని జన్మభూమి తప్పక జ్ఞాపకమొస్తుంది. గత వేయి సంవత్సరాలుగా, యెంతోమంది భక్తులూ, శ్రద్ధాళువులూ ప్రపంచపు నాలుగు చెరగులనుండి వచ్చి ఈ పుణ్యభూమిని దర్శించి వెళ్ళివుంటారు. నేనూ మళ్ళీ ఏనాడైనా ఇక్కడికి వస్తానేమో? అలా రావడమే జరిగితే బుద్ధిలుడి జ్ఞాపకాలు చిగురిస్తాయి. దుఃఖం పొంగుతుంది.

మహాప్రవారణోత్సవం అయిపోయింది. నేనూ ఇతర భిక్షువులతో పాటు ఉరుముండనుండి మధురకు వెళ్ళాను. అశోకుడు కట్టించిన మూడు స్తూపాలనూ పూజించాను. తథాగతుడు నివసించిన గుందవనాన్ని చూశాను. అనంతరం ఉత్తరాభిముఖుడనై వెళ్ళిపోయాను. యమునా నదికి కుడివైపుగా, ఉత్తర దిశకు వెళ్ళిపోతున్నాను. గ్రామాలు సస్యసంపన్నంగా వున్నాయి. యాత్రలో యెవరో ఒకరు తోడుదొరుకుతూనే వుంటారు. అయితే, నేనెవరితోటీ అంతగా మిత్రత్వాన్నేర్పరచుకోలేదు. అప్పటికింకా మిత్రవియోగ భారంతో నేను బాధపడుతూనేవున్నాను. ఎవరితోటీ, మాట్లాడకుండా మౌనంగా ప్రయాణం చేయడమే అప్పట్లో నాకు ఇష్టంగా వుండేది. బుద్ధిలుడిలాంటి మిత్రుడి జ్ఞాపకాలు, ఎలాంటివారినీ దుఃఖసాగరంలో ముంచుతాయి.

మధురనుండి బయలుదేరాను. రెండు మూడు రోజుల్లో యౌధేయ భూమిని చేరాను. అక్కడ యిప్పటికీ యౌధేయులకు సంబంధించిన వీరగాథల్ని చెప్పుకుంటూంటారు. యౌధేయుల భూమిని చూస్తుంటే, వారిని గురించి వింటూంటే కపిలవస్తు, వైశాలీలు జ్ఞప్తికి వస్తూన్నాయి. పెయ్యేండ్ల క్రితము యౌధేయుల గణరాజ్యం వుండేది. దాన్ని సముద్రగుప్తుడూ, చంద్రగుప్తుడూ అతి క్రూరంగా ధ్వంసం చేసేశారు. ఇప్పుడు గుప్త సామ్రాజ్యమూ నశించింది. కానీ, ఆనాడు, యౌధేయులను నాశనంచేసే రోజున, తామూ ఒకనాడు నశించిపోతామనీ, తమ మహాసామ్రాజ్యమూ నామావశేష మౌతుందనీ ఎరుగరుకదా గుప్తులు!

దారిలో యమునానదిఒడ్డున ఇంద్రప్రస్థ గ్రామాన్ని చూశాను. ఈ ప్రాంతంలో ప్రస్థ [పట్టణం] పదం నామాంతానగల గ్రామా లెన్నో తగిలాయి. ఇది యుధిష్ఠిరుడి రాజధాని. ఆ కాలంలో గొప్ప పట్టణంగా వుండేదేమో, తెలియదు. ఇప్పుడు మాత్రం ఇంద్రప్రస్థం ఓ సుగ్రామం. యౌధేయులు ఈగ్రామానికి ఏమంత ప్రాముఖ్యత నీయలేదు. కాకపోతే తూర్పునుండి వచ్చే శత్రువుల్ని ఎదుర్కొనేప్పుడు ఈ ఇంద్రప్రస్థం వద్దనే యుద్ధ శిబిరాల్ని ఏర్పాటు చేసుకునేవారు. ఇప్పుడు యౌధేయ భూమంతటికీ గొప్పపట్టణం స్థానేశ్వరం. ఇది సరస్వతి నది వడ్డున వుంది. ఈ నగరాన్ని పరిపాలించే మహారాజు తాను మౌఖరుల సమకక్షి నంటాడు. గుప్త సామ్రాజ్యం నాశనమయాక ఈ స్థానేశ్వరం గొప్పగా అభివృద్ధికి వచ్చింది. శ్వేతహూణుల్ని నిరోధించటానికి గుప్తులు తమ సామంతుణ్ణొకణ్ణి ఈ స్థానేశ్వరంలో వుంచాడు. తరువాత ఆ సామంతుడే స్థానేశ్వరానికి రాజయ్యాడు. స్థానేశ్వర రాజవంశం మౌఖరుల్లా అన్యదేశాన్నుండి వచ్చిందికాదు. యౌధేయ గణానికి చెందిన యే ప్రముఖుడి సంతానమో అయివుంటుంది. యౌధేయుల గణతంత్రరాజ్యం నశించిపోయింది. అయినా వారు యిప్పటికీ గొప్ప యుద్ధవీరులుగా ప్రసిద్ధిని పొందుతూనేవున్నారు. శ్వేతహూణ సైనిక మహాప్రవాహాన్ని ఎదుర్కొని ఆపినది యౌధేయ సంతానమే. ఈ స్థానేశ్వరానికి ప్రక్కనే కురుక్షేత్రం వుంది. ఈ ధర్మ క్షేత్రంలో యుద్ధం చేసిన

పాండవులూ, కౌరవులూ, కేవలం కథల్లోనూ, పురాణాల్లోనూ మాత్రమే జీవించియున్నారు. పాపం, యౌధేయ వంశజులైన ఈ స్థానేశ్వరపు రాజు కథాజీవులైనా కాలేకపోయారు.

*  *  *

స్థానేశ్వరపు సరస్వతీ తీరం మధ్యదేశానికి సరిహద్దు. సరస్వతీ తీరానికి పశ్చిమంగా వెడితే ఉత్తరా పథాన్ని చేరతాము. వెనక వచ్చేప్పుడూ మేము స్థానేశ్వరం మీదుగానే మధ్యదేశాన్ని చేరాము. అయితే, అప్పుడు స్రుఘ్నమీదుగా స్థానేశ్వరానికి వచ్చాము. ఇప్పుడా మార్గాన్నే తిరిగి వెళ్ళడం నా కిష్టం లేదు. మార్గాన్ని మార్చాలని అనుకున్నాను. చాలా రోజులు ప్రయాణం చేసి, చంద్రభాగ నదీతీరాన గల శ్యాకలా నగరాన్ని చేరాను. అక్కడినుండి వెనుకటి మార్గాన్నే అనుసరించాను. నడి చలికాలం. కాశ్మీర పట్టణంలో కొన్నాళ్ళు ఆగవలసివచ్చింది. కాశ్మీరంనుండి ఉద్యానం వెళ్ళే కనుమలు మంచుతో కప్పబడి వుంటాయి. కనుక కాశ్మీరంలో కొన్నాళ్ల ఆగడం అనివార్యం! మిహిరకులుడు చనిపోయాడు. హూణులప్రభుత్వం నశించింది. హూణుల సామంతులందరూ స్వతంత్ర రాజులయ్యారు. తామే మహారాజాధిరాజులనీ, పరమభట్టారకులనీ ప్రకటించుకున్నారు. ఇలా సామంతులు స్వతంత్రులు కావడం, సామ్రాజ్యం భిన్నాభిన్నం కావడం-ఒక రకంగా బయటి శత్రువును ఆహ్వానించినట్లే అవుతూంది. అయితే, ఇది శతాబ్దాలుగా జరుగుతున్న క్రమం! ఈ క్రమాన్ని ఆపడం మానవులకు శక్యంకాదు. మానవుడు తన తాత్కాలిక స్వార్థాల్లో అంధుడై దూరాన్ని వీక్షించలేడు. మిహిరకులుడు మొదట బౌద్ధులను హింసించినా, వృద్ధుడయ్యాక చాలా మారిపోయాడు. బౌద్ధమతాన్ని ఆదరించాడు.కొన్ని విహారాలకు దానదక్షిణలను కూడా ఇచ్చాడు. కాశ్మీర నగరంలోని విహారాలు వెనుక నేనుచూచినదానికంటే మంచి స్థితిలో వున్నాయి. మిహిరకులుడు సామంతులు కొందరు బలమైన రాజ్యాలను స్థాపించారు. వారిలో కొందరు విహారాల పునర్నిర్మాణాన్ని గావించారు.

వసంత ఋతువొచ్చింది. కాశ్మీరలోయ పుష్పోద్యానంలా మహాసౌందర్యంలో శోభాయమానంగా వుంది. ఇంకా కనుమలు పూర్తిగా

హిమ ంహితాలు కాలేమ. అయినా నేను మంచులో పుట్టి మంచులో పెరిగాను. నాకా మంచు ఓ లెక్కగాదు. కాశ్మీరం నుండి ఉద్యానానికి ఒంటరిగా వెళ్ళటం అంత క్షేమకరంకాదు. మిహిరకులుడు చనిపోయాక శాసనమూ, దేశమూ అవ్యవస్థిత మయ్యాయి. ఎవరినైనా తోడుచేసుకుని వెళ్ళడమే మేలు !

నా జన్మభూమికి బయల్దేరే శుభఘడియ కోసరం ఉత్కంఠతతో ఎదురు చూస్తున్నాను. జన్మభూమికి వెళ్ళబోతున్నానన్న ఊహ నన్ను పరవశుణ్ణి చేస్తోంది. యథార్థానికి నేను ఒక మహాయాత్రకు సన్నద్ధుణ్ణవుతున్నాను. హిమాలయాలకు ఉత్తరంగా హిమప్రదేశాల భిక్షువులూ అప్పుడప్పుడూ కలుస్తుండేవారు.వారినడిగి ఆయా ప్రదేశాల పరిస్థితులను తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుండేవాణ్ణి. ఆ ప్రదేశాలకు సంబంధించిన పరిజ్ఞానాన్ని అధికాధికంగా ప్రోగుచేసుకునే వాణ్ణి వినికిడి జ్ఞానంకంటే ప్రత్యక్ష జ్ఞానం యథార్థానికి చాలా దాపులో వుంటుంది. ప్రత్యక్షంగా చూసినప్పటికీ కొంతమంది ఉన్నదున్నట్లు వర్ణించి చెప్పలేరు. అలాంటి స్థితిలో ఉత్తర దేశాల్ని గురించి మిత్రులద్వారా నేను సంపాయించుకున్న జ్ఞానం నూటికి నూరుపాళ్ళూ యథార్థమేనా? అన్న ప్రశ్న వుదయించక పోదు! అయితే, కాంస్య, కూచి దేశాల్నిగురించి కొంతవరకూ యథార్థ జ్ఞానాన్నే సంపాయించా ననుకుంటున్నాను. వెనుక కాశ్మీర విహారంలో కాంస్య, కూచి దేశాల భిక్షువుల్ని కల్సుకున్నాను! ఆ దేశాన్ని గురించి వారు చెప్పగా ఎన్నో విషయాల్ని తెల్సుకున్నాను. ఆ భిక్షువులు తమకు ఉత్తరాన కల క్రూర వన్యజాతి ప్రజల్ని గురించికూడా అనేక విషయాల్ని చెప్పారు. అవారులు మహాక్రూరులు, వారి క్రూరత్వానికి సంబంధించిన కథల్ని విన్నాక ఇక నా ప్రదేశాలకు వెళ్ళాలని మానవ మాత్రుడనుకోడు. అయితే, నా కలాంటి ప్రమాదభరితమైన యాత్రలంటే చాలా ఇష్టం! ఇంతవరకూ నేను చేసిన యాత్ర లేవీ ఒంటరిగా చేయలేదు. యెవరో ఒకరు తోడున్నారు. కానీ, ఇకమీదట నేను చేయబోయే యాత్ర సుదీర్ఘమైందే కాక బహు కష్టసాధ్యమూ, ప్రమాదభరితమైంది. చివర వరకూ తోడుగా విలువగల కొంతమంది మిత్రుల సహకారం లేంది ఇలాంటి యాత్రలు చేయలేము. కనుక ఒకరిద్దరు స్థిరమైన మిత్రుల్ని

ఏర్పరచుకోవడం ముఖ్యమనుకున్నాను. వెనక నా జన్మభూమినుండి దక్షిణదేశ యాత్రకు బయల్దేరేప్పుడు నేను నవయువకుణ్ణి. అప్పటికి నాలో ఇంకా కుర్రతనం వుండి. సుదీర్ఘమైన ఈ ఏడెనిమిది సంవత్సరాల కాలంలో నేను దృఢమైన యువకుణ్ణయ్యాను. అయితే బుద్ధిలుడి సాంగత్యమూ, అధికమైన జ్ఞానోపార్జనా నన్ను ఆ సమయంలోనే ప్రౌఢుణ్ణి చేశాయి. నా ఆకారంలో ప్రౌఢత్వం కనిపించకపోవచ్చు. నా ప్రవర్తనలోనూ, మాటల్లోనూ విధిగా ప్రౌఢత్వం కనుపించేది. ఇందువల్ల ఒక ప్రయోజనం మాత్రం లభించింది. ప్రజల్లో నా మాటలకు విలువ హెచ్చింది.

సింధు నదివైపు వెళ్ళే సార్థవాహు దెవడైనా పరిచయమౌతాడేమోనని కొన్నాళ్ళు నిరీక్షించాను. సింధునది గుండా వుద్యానానికి వెళ్ళడం చాలా సుఖకరం. మా వుద్యాన వాసులూ వ్యాపారాలు చేస్తారు. అయితే వారు చాలా చిన్న వ్యాపారులు. స్వతంత్రంగా "సార్థా"లను నిర్వహించలేరు. అదృష్టవశాత్తు కాశ్మీరశ్రేష్ఠి ఒకడు పరిచయు డయ్యాడు అతడు కాంభోజానికి వెళ్ళే సార్థవాహు ణ్ణొకణ్ణి పరిచయంచేశాడు నాకు ః ఉద్యానం, కాంభోజం— ఈ రెండూ సమీప దేశాలు. ఈ యాత్రకు ముందు తూర్పున ఓ కాంభోజ దేశం వుందని నాకు తెలియదు. అంతే కాదు. తూర్పు నో గాంధార దేశంకూడా వుంది. ఈ విధమైన నామాల ద్విరుక్తిని తరచు వింటుంటాము. తమ మాతృభూమిని విడిచి దూర ప్రాంతాలకు వలసవెళ్ళిన మానవ సమూహాలు ఆ నూతన ప్రదేశంలోని గ్రామాలకు, పట్టణాలకు, తమ మాతృ దేశపు పేర్లను పెట్టుకోవడం సహజం. నన్ను కాంభోజం తీసుకు వెడుతూన్న సార్థవాహుడు కొంచం కోపదారి. అయినా మంచి వాడు. అతడి మాతృ దేశం కపిషా. అయితే, శ్వేత హూణుల కారణంగా కాశ్మీరంలో స్థిరపడ్డాడు. ఇప్పుడు కాశ్మీర దేశం అంతట్లోకే గొప్ప సార్థవాహుడయ్యాడు. సరిహద్దుల్లో ఆవారులు మొదలైన తిరుగుబోతు జాతులు ఉంటాయి. అవి చాలా క్రూరమైన జాతులు. సరిహద్దు ప్రాంతాల్లో వ్యాపారం చేయాలన్నా, "సార్థా" న్ని తీసుకు వెళ్ళాలన్నా ధైర్య సాహ

సాలు అధికంగా వుండాలి. మన సార్థవాహులకు ధైర్యశాలిని వేరే చెప్ప నవసరం లేదనుకుంటాను.

మేము కాశ్మీరదేశాన్నుండి బయల్దేరి ఓ పెద్ద కనుమనుదాటాము. అనేక రోజుల ప్రయాణానంతరం సింధు తీరాన్ని చేరాము. నేను సింధు తటాన్ని చూడటం ఇదే చివరిసారి; ఈ సింధునది కారణంగానే పశ్చిమ దేశాల్లోనూ, చీనాదేశంలోనూ మొత్తం జంబూద్వీపాన్నే హిందూ (సింధు) అని పిలుస్తారు.

# 10 వ అధ్యాయం

# స్వదేశం లో....

*( క్రీ. శ. 548 )*

ఏడు సంవత్సరాల సుదీర్ఘ కాలం తీర్థయాత్రల్లో గడిచిపోయింది. స్వదేశానికి వచ్చేనాటికి ఇరవై తొమ్మిదేండ్ల వాణ్ణయ్యాను. ఇన్నాళ్ళూ దేశాలు తిరగడంతోపాటు అవకాశం దొరికిన ప్రతిచోటా విద్యను అభ్యసించాను. ఉద్యానదేశంలో హీనయానానికే ప్రాధాన్యత ఎక్కువ. కానీ, భారతదేశంలోనూ, ప్రపంచంలోని ఇతర బౌద్ధ దేశాల్లోనూ మహాయానపు పొంగు ఉప్పెనలా వచ్చేస్తోంది. ఈ 'పొంగు' తాలూకు ప్రభావం కొంత ఉద్యాన దేశంమీదా పడ్డది. ఐతే. మహాయానం నామీద గొప్పగా ప్రభావాన్ని వేసింది. సువాస్తు నదిని దాటి మా గ్రామ ప్రజలు చలికాలాన్ని గడిపే ప్రదేశానికి వెళ్ళాను. నా తండ్రిగారు ఆరోగ్యంగా వున్నారు. నన్ను చూసి ఆనందంలో మైమరచారు. గ్రామ ప్రజలు కూడా ఘనంగా స్వాగతాన్నిచ్చారు. ఆ చలికాలాన్ని, అక్కడే తమతోపాటు గడపవలసిందని కోరారు. నిండు చలికాలమే అయినా సుభూమి విహారమార్గం మంచుతో నిరోధింపబడలేదు. విహారానికి వెళ్ళవచ్చును. కానీ, గ్రామప్రజల కోర్కెను కాదనలేక అక్కడే వుండిపోయాను.

దీర్ఘ కాలంగా ఉష్ణదేశాల్లో తిరుగుతూండడం వలన నాశరీరంలో రూపంలో కొంత మార్పువచ్చింది, ఇన్నాళ్ళు అనేక ప్రదేశాలకు తిరిగి తథాగతుని అస్థి ధాతువుల్ని దర్శించాను, బుద్ధుని చరణ ధూళితో పవిత్రమైన తీరాల నెన్నింటినో సేవించి కృతకృత్యుణ్ణయ్యాను. ఇన్ని సంవత్సరాల తరువాత మాతృభూమియొక్క చల్లనిస్పర్శ, తల్లిఒడిలా సుఖదాయ

కంగా వుంది. ఉద్యాన దేశపు ఆహార పదార్థాలూ, వంటలూ నోటికి ఎంతో రుచిని ప్రసాదించాయి. ఉద్యానభాషను మాట్లాడుతూంటే ఎంతో ఆత్మీయత, రసానుభూతి కలుగుతున్నాయి. అనంత కాలవాహినిలో ఏడు సంవత్సరాల కాలం చాలా అగణ్యమైంది. ఈస్వల్ప వ్యవధిలోనే ఎన్నో క్రొత్త ముఖాలు కేరింతలు కొడుతూ, ఆడుతూ కనుపిస్తున్నాయి. పరిచయమున్న పాతముఖాలెన్నో ఈలోకాన్నుండి సెలవు తీసుకుని వెళ్ళి పోయాయి. మిహిరకులుడు చనిపోయి ఒక సంవత్సరమైంది. అయినా, ఇంకా ఉద్యానంలో యేధాల పరిపాలన అక్షుణ్ణంగానే సాగుతోంది. మిహిరకులుడు కోల్పోయిన దేశాల్లో, అతన్ని చాలా క్రూరుడని చెప్పుకుంటారు. కానీ, ఉద్యానంలో అత డలాటి క్రూరత్వాల నేమీ చేయలేదు. కాకపోతే, అతడి కాముక ప్రవృత్తి కొంతవరకూ మమ్మల్ని బాధించిన మాట యథార్థం! రాజుల్లో, సామంతుల్లో ఎటూ కాముకత అధికంగా వుంటుంది! అదేమంత చెప్పుకోదగిన దోషం కాదు. మిహిరకులుణ్ణి తలుచుకుంటే. సహజంగానే భద్ర జ్ఞాపక మొస్తుంది. అయితే, ఆమె నాకెప్పుడో అపరిచిత స్త్రీ అయిపోయింది.

దేశానికి తిరిగివచ్చాక ఏంచేయాలి అనేది ఇంకా నిశ్చయించుకో లేదు. ఏది ఎలా వున్నా, సుభూమి విహారానికి వెళ్ళడం అనివార్యమైన విషయం. పైగా, ఇన్నాళ్లకి తిరిగి వచ్చాక విహారానికివెళ్ళాలన్న ఆతురత కూడా ఎక్కువగానే వుంది. గ్రామప్రజలు, వర్షావాసాన్ని తమతోపాటే పసిరిక మైదానాల్లో గడపవల్సిందంటున్నారు. చిన్ననాటి ప్రియమైన పసిరిక మైదానాలు. వాటిని చూడాలని, బాల్య స్మృతులను నెమరుకు తెచ్చుకోవాలనీ హృదయమెంత తహతహలాడుతోందో ? మా వాళ్ళతో మైదానాల్లోకి వస్తాననీ అనలేదు, రానని నిష్కర్షగా చెప్పనూ లేదు.

క్రమంగా చలికాలం గడిచింది. చలికాలాన్ని గడపడానికి నదీ తీరానికి వచ్చిన గ్రామస్థులు, తిరిగి పర్వతాలపైనున్న తమ గ్రామాలకు వెళ్ళిపోతున్నారు. మా గ్రామస్థులూ, సువాస్తు నదీతీరా న్ననుసరించి ముందుకు పోతున్నారు. మళ్ళీ ఒకమాటు ఉద్యాన దేశంలోని పవిత్ర స్థలాలను దర్శించాను. మంగళపురం, మహావనవిహారం మొదలైనవాటిని చూశాను. మంగళపురం ఉద్యానదేశానికి కేంద్ర స్థానంలో లేదు. అయితే

మంగళపురంచుట్టూ అధిక సంఖ్యలో పవిత్ర స్థలా లుండడంవల్ల దానికో ప్రత్యేక ప్రసిద్ధి వచ్చింది. ఉద్యాన వాసులకు, తథాగతుని జన్మభూ మయిన మధ్య దేశపు యాత్ర అంత అసాధ్యమైందేమీ కాదు. అక్కడి ఎండలన్నా, పాములన్నా మాకు చాలా భయం. అయినా, మధ్యదేశపు యాత్రావకాశాన్ని ఎన్నడూ జారవిడుచుకోము! భిక్షువులే కాకుండా గృహస్థులు కూడా బౌద్ధ ధర్మానికి సంబంధించిన పవిత్ర స్థలాల్ని చూడ్డానికి ఉత్సాహపడుతూ వుంటారు. అయితే ప్రతి గృహస్థు సుదూర దేశాలలో పవిత్ర స్థలాల్ని సేవించడం సంభవం కాకపోవచ్చు! కనుకనే ఉద్యానవాసులు, కపిషా,గాంధారంలాంటి పొరుగు దేశాల్లో ఎన్నో పవిత్ర స్థలాల్ని సృష్టించుకున్నారు. ప్రతి సంవత్సరమూ, వేల సంఖ్యలో యాత్రార్థులు కపిషా, గాంధారదేశాలకు వెళ్ళివస్తుంటారు.

కొద్ది రోజుల అనంతరం సుభూమి విహారాన్ని చేరుకున్నాను. ఈ చలికాలంలోనే మహాస్థవిర గుణవర్ధనులు,నా పినతండ్రయిన భదంత జినవర్మగారూ కాలధర్మం చేశారని తెల్సుకుని చాలా చింతించాను. క్రొత్త స్థవిరుడు శీలస్కంధుడు నాకు పరిచయుడే. ఆయనకు నేనంటే చాలా ప్రేమ. నేను పసిరిక మైదానాల్లో వర్షావాసాన్ని గడపడం విషయంలో ఎలాంటి అభ్యంతరాన్ని చెప్పడు. వర్షావాస మయ్యాక విహారంలోనే వుండడం నిశ్చయమైంది.

ఆషాఢ పౌర్ణిమ ముందే మైదానాల్లోకి వెళ్ళిపోయాను. నా వెంట ధర్మయశుడు మరి ఇద్దరు భిక్షువులు వున్నారు. మైదానపు డేరాలలో భిక్షువులుఎలా వుండాల్సిందో నాకు తెల్సు. ఇన్ని సంవత్సరాలు ఉష్ణ దేశాల్లోవుండి రావడంవలన, మైదానంలో వర్షావాసం స్వర్గవాసంలా మహదానంద దాయకంగా వుండె.

ప్రతి గృహస్థూ భిక్షువుల్ని దేవతలా పూజిస్తూంటాడు. ఆపూజించడంలో భక్తిభావనా, ఆత్మ సంతృప్తే కాకుండా, భిక్షువు తమ కష్టాల్ని ఈడేర్చగలడన్న ఆత్మ విశ్వాసంకూడా వుంటుంది. దాదాపుగా ప్రజలందరూ భిక్షువుల్ని ఈ దృష్టిలోనే పూజిస్తా రనుకుంటాను. శరీర ధారియైన ప్రతివాడికీ ఏదోఒక కష్టం, ఏదోఒక దుఃఖం వుండనేవుంటుంది. అసలు నన్నడిగితే, జీవితంలో దుఃఖం యొక్క పాళ్ళే అధికమంటాను.

దుఃఖం ఓ మహాసముద్రం లాంటిది. సుఖం ఓ చిన్న ద్వీపం లాంటిది. మానవ జీవితమనే ఓడ చాలా అరుదుగాగాని ద్వీపాన్ని చేరలేదు. నేను ప్రమాణ శాస్త్రాన్ని అధ్యయనం చేశాను. ఆ గ్రంథంలో దిఙ్నాగుడు తన అద్భుత మేధాశక్తిని ప్రకటించాడు. ఆ గ్రంథం చదివితే లోగడ నేను విశ్వసించే అనేక విషయాలపట్ల అవిశ్వాసినయ్యాను. కానీ, మానవుల్లో ఎంత విచిత్రంగా పరస్పర విరుద్ధమైనభావనలు ఉద్భవిస్తుంటాయో! నా గతజీవితాన్ని, వర్తమాన జీవితాల్ని పరిశీలిస్తే మానవుడిలోని పరస్పర విరుద్ధ భావమిశ్రణ అర్థమౌతుంది. "కింకరిష్యంతి తారకాః" అన్న సూక్తి జ్యోతిశ్శాస్త్రంమీది నావిశ్వాసాన్నెగరగొట్టేసింది. మంత్రతంత్రాల మీది నమ్మకమూ క్షీణించింది. నాగార్జునుడి మాధ్యమిక దర్శనాన్ని అధ్యయనం చేశాక, అసలు దేవతలమీద–దేవుళ్ళమీదే విశ్వాసం నశించింది. దివ్య పురుషులమీది అనన్య భక్తికూడా పోయింది. కానీ, ఇప్పుడు, దీర్ఘంగా ఆలోచిస్తే, హృదయాన్ని లోతుగా తడువుకుంటే నేనే విషయాన్నీ పూర్తిగా అవిశ్వసించలేదనిపిస్తుంది. అలాగే, ఏ విషయాన్నీ పూర్తిగా విశ్వసించనూలేదు.

మానవుడు తన బలహీనతలతో తానే వేగిపోతున్నాడు. తనకు నచ్చని, ఇష్టంలేని పనులను విధిగా చేయవల్సిన వాడవుతున్నాడు. నాకు లభించిన కొద్దిపాటి వైద్యశాస్త్ర పరిచయంతో గృహస్థులకు సేవచేస్తుండేవాణ్ణి. రోగపీడితులైన మానవుల దుఃఖాన్ని మందులద్వారా ఉపశమింప చేయడానికి నేను సర్వదా సిద్ధంగా వుండేవాణ్ణి.అయితే, రోగులు మందుల ద్వారానే కాకుండా మంత్ర తంత్రాలద్వారాకూడా తమను రోగవిముక్తుల్ని చేయవల్సిందని కోరేవారు. మంత్ర తంత్రాలమీద నాకు విశ్వాసం లేదు. అయినా నిరాకరించేవాణ్ణి కాదు. అసహాయుడైన రోగికోర్కెను తిరస్కరించలేక మంత్రతంత్రాల్ని ప్రయోగించేవాణ్ణి. అలాచేయడంవలన రోగి మనస్సుకు కొంత తృప్తి కలుగుతుంది. ఈ యాత్రల్లో కొందరు భిక్షువుల వద్ద మంత్రాల్నికూడా నేర్చుకున్నాను. ఆ మంత్రాల్ని ప్రయోగించడానికి మొదట కొంత సంకోచించినా, ఇప్పుడు నిస్సంకోచంగా వాటిని ప్రయోగిస్తున్నాను। సూత్రాల్ని పారాయణంచేసి పుణ్యం సంపాయించడమన్నది బుద్ధుని కాలంనుండే వుంది. అయితే, గృహస్థులు సూత్రాల్ని తాము

స్వయంగా పారాయణం చేయకుండా భిక్షువులచేత చేయించి పుణ్యం కొట్టెయ్యాలని చూస్తారు. అర్థం తెలియకుండా గుడ్డిగా సూత్రాల్ని వల్లిస్తేనూ, వింటేనూ పుణ్యం వస్తుందని నేను నమ్మడం లేదు.

మేము ఐదుగురం భిక్షువులం వర్షావాసాన్ని గడపడానికి మైదానంలో వున్నాము రోజూ సంధ్యాసమయంలో మా గ్రామప్రజలు, ఇతర గ్రామాల ప్రజలు కూడా వచ్చి, ఎంతో భక్తిశ్రద్ధల్తో నా ధర్మోపదేశాల్ని వింటూండే వారు. మా ఉద్యాన భూమిలో, అందునా మైదాన గ్రామాల్లో ఉపదేశాలిచ్చే పద్ధతి వేరు, నేను యీ యాత్రల్లో చూసిన పద్ధతి వేరు. అసలు బౌద్ధ దేశాల్లో మహాయాన ప్రాబల్యం పెరిగిపోతోంది. తథాగతుని మానవోచిత జీవిత చరిత్రకంటే, బోధిసత్వుడుగా అతడు చూపిన చమత్కారాలే ప్రజలకు నచ్చుతున్నాయి. తథాగతుని మానవోచిత జీవిత చరిత్ర నాకేమీ నచ్చలేదని నే ననడంలేదు. కానీ, కేవలం మానవుడు తన ముక్తికొరకే ప్రయత్నించడం, తనవరకు తను నిర్వాణాన్ని పొంది భవసాగరాన్నిదాట చూడడము, ఉచిత మనిపించలేదు. జాతక కథలు నాపై గొప్పగా ప్రభావాన్ని వేశాయి. మానవుడు తన సుఖం కొరకూ, తన ముక్తి కొరకేకాదు బ్రతకవల్సింది. పరుల హితం కొరకూ, పరుల సుఖం కొరకూ బ్రతకడం నేర్చుకోవాలి. అదే మానవజీవితానికి ఉత్కృష్టమైన లక్ష్యం. ఈ యాత్రలో నలందాలాంటి ప్రదేశాలకు సిద్ధమైన విహారాలకు వెళ్ళాను. మహాపండితులైన భిక్షువుల్ని, కొండగుహల్లో ధ్యానమగ్నులైన భిక్షువుల్ని, ఎంతోమందిని కల్సుకున్నాను. ప్రతిచోటా ఒకే అభిప్రాయం వినవచ్చింది. బోధిసత్వుడి మార్గమే ఉత్తమమైంది. అదే మహామార్గం (మహాయానం). కేవలం తన ముక్తికొరకే ప్రాకులాడడం హీనమార్గం (హీనయానం). మహాయానాన్నిగురించి, హీనయానాన్ని గురించి ఎన్నో గ్రంథాలు చదివాను. గొప్ప వక్తలు పైవిషయాన్ని గురించి ప్రసంగిస్తూండగా విన్నాను. హీనయాన, మహాయాన పండితులు హోరాహోరీగా వాదించుకోవడాన్ని, చివరకు హీనయానులు అపజయం పొందడాన్ని కండ్లారా చూశాను. మహాయానమే సర్వశ్రేష్ఠమైన మార్గమని విశ్వసించుకున్నాను. ఈ వర్షావాసంలో ప్రతి ఉపన్యాసంలోనూ మహాయానాన్ని గురించే చెప్పాను. మహాయానులు మాంస

భక్షణ చేయరు. అయితే ఉద్యాన ప్రజల జీవన విధానాన్ని ఎరిగి వున్న వాణ్ని గనుక, మాంస భక్షణను పూర్తిగా వర్జించవల్సిందని నేనెన్నడూ చెప్పలేదు. మధ్యదేశంలో మాంస భక్షణ చేయని ప్రజ లున్నారు. కాన్నీ, విహారా లేవీ మాంస భక్షణను నిషేధించ లేదు.

ఉపదేశాల్నియడమేకాక, రోగులకు సేవ చేయడం, మందు లీయడం కూడా నా పనే! నా బాధ్యతల్లో మంత్ర తంత్రాల్ని ప్రయోగించి, దయ్యాల్ని వదిలించడమూ వుంది. నేను చాలా అన్యమనస్కంగా, అయిష్టంగా పై బాధ్యతను నిర్వహిస్తూండేవాణ్ణి. మంత్ర తంత్రాలమీద నమ్మకమున్న ప్రజలు తర్కాన్ని, హేతువాదాన్ని ఒప్పుకునేవారు కాదు. వాళ్ళకు చెప్పి, వాదించి బుర్ర చెడగొట్టుకునేకంటే, వాళ్ళ నమ్మకం ప్రకారం నడవడమే మే లనిపిస్తుంది. మంత్ర తంత్రాలు పనిచేశాయా, బాగే. పనిచేయలేదూ, అయినా, మమ్మల్ని నిందించేవాళ్లు కాదు.

నే నప్పటికింకా మంచి యువకత్వంలో ఉన్నాను. కొద్ది నెలల మాతృదేశవాసం తరువాత వెనుకటి రూపు – రంగుల్నేకాక శరీరపాటవాన్ని గూడా పొందాను. భిక్షువు తిరిగి గృహస్థు కావడమనేది ఉద్యాన దేశంలో చాలా సహజమైన విషయం. భిక్షూ జీవితంలో చేసిన అభ్యాసమూ, అధ్యయనమూ గృహస్థుగా అతడికి ఎందుకూ ఉపయోగపడవు. అయితే, భిక్షువు నుండి గృహస్థు అయినవాడు శిక్షితుడై వుంటాడు గనుక ప్రజల గౌరవానికి, ఆదరాభిమానాలకు పాత్రు డవుతాడు. యువకులైన భిక్షువుల్ని ఆకర్షించడమనేది ఉద్యానదేశపు సుందరీమణులకు ఓ గొప్ప సరదా అయిన విషయం! అలా ఆకర్షించగలిగినందుకు గర్విస్తుంటారు కూడాను. వేటగాడు లక్ష్యభేదనలో సఫలుడైనప్పుడు ఎలా గర్విస్తాడో, అలాగే, యువక భిక్షువును ఆకర్షించి, తనవైపు లాక్కోగలిగినప్పుడు ఉద్యానసుందరి అధిక గర్వీభూత అవుతుంది. మా అయిదు గురు భిక్షువుల్లోనూ, నేనే చిన్నవాడిని, వయస్సులోనూ, ఉపసంపదలో కూడా మిగిలిన నలుగురికంటే నేనే చిన్నవాణ్ణవుతాను అయినప్పటికీ విద్యా అనుభవాల దృష్ట్యా నేనే పెద్దవాడిగా ఎంచబడేవాణ్ని. ఇటీవల ఒక శిక సుందరి ప్రేమ పాశంలో బంధితుణ్నయ్యాను. అయితే, సుర

క్షితంగా, బంధనాల్ని తెంపుకుని, ఇవతల పడ్డానుకూడా! మా కాషాయ వస్త్రాలూ, నియమబద్ధమైన జీవితమూ మమ్మల్ని ప్రేమ పాశాలకు సాధ్యమైనవరకూ దూరంగా వుంచుతుంటాయి. కాషాయ వస్త్రాల్ని ధరించినట్లయితే నృత్యగానాలూ, స్త్రీలతో కలిసి విందులు భోంచేయడం, ఏకాంత సేవలూ అన్నీ మానేయవల్సిందే. అయితే భిక్షువులమైనప్పటికీ కాషాయంబరాల్ని ధరించినప్పటికీ, మాకూ ఒక్కొక్కప్పుడు విషయవాంఛల్ని విసర్జించడం అసంభవమే అవుతుంది. మైదానంలో ఆ సంవత్సరం మా డేరాల ప్రక్కనే నొక ఏధాగృహస్థు డేరాను వేసుకున్నాడు యేధాలు చదువు సంధ్యల్లో ఇప్పుడిప్పుడే అభివృద్ధి కొస్తున్నారు. సభ్యత, సంస్కృతుల్లో అన్యజాతుల్ని అనుకరిస్తున్నారు. అయినా, అప్పటికింకా ఏథాలు స్థిరనివాసులు కాలేదు. తిరుగుబోతులుగానే వున్నారు. తిరుగుబోతులుగా వున్న మానవజాతి ధార్మిక విశ్వాసాల్లో ఏకత్వాన్ని సమానత్వాన్ని కలిగి వుండదు. ఒకేజాతికి చెందిన తిరుగుబోతులు వివిధ ప్రాంతాల్లో వివిధ మతాల్ని అనుసరిస్తూ వివిధ దేవుళ్ళను పూజిస్తూంటారు. యేధాలు సూర్యోపాసకులు. రోపగిరిలో తోరమాణుడు కట్టించిన సూర్యుడి పాషాణ ఆలయాన్ని చూశాను. కానీ, ఇప్పుడిప్పుడు ఏధాల్లోనూ బౌద్ధ ధర్మం బాగా ప్రచారంలోకి వస్తోంది. ఉద్యానంలాంటి బౌద్ధ దేశాల్లో యేధాలు కూడా పూర్తి బౌద్ధులౌతున్నారు.

యేధాగృహస్థు కూతుర్ని చాలా రోజులుగా దయ్యంపట్టి బాధిస్తోంది. నేను మైదానంలోనూ ఒకరిద్దరికి మంత్రాల ద్వారా గాలిచేష్టల్ని వదిలించాను. ఒకరోజు యేధాగృహస్థు తన కూతురి దయ్యాన్నివదిలించవల్సిందని ప్రార్థించాడు. అతడి ఇంటికి వెళ్ళాను. దయ్యంపట్టిన ఆ యేధా కుమారికి 18 ఏళ్లుంటాయి. భూత బాధతో శరీరం కృశించినా సహజ సౌందర్యానికి ఎలాంటి వంకా కలుగలేదు. ఆమెను చూడగానే నా స్మృతిపథంలో భద్రజ్ఞాపకాలు తళుక్కుమన్నాయి. మనస్సు కలుక్కుమంది. కానీ, వెంటనే స్థిమిత పడ్డాను. అక్కడినుండి ఎంత త్వరగా వెళ్ళిపోతే అంత క్షేమకరం అనిపించింది. కానీ, ఎలా వెళ్ళడం? వొక ఉపాసకుని కూతుర్ని అలాంటి బాధలో విడిచి ఏ మాత్రమూ ఉపచారం చేయకుండా వెళ్ళిపోవడం తగునా! అలా చేయవచ్చునా? చివరకు

నేను విధిలేక మంత్రాలు జపించడానికి కూర్చున్నాను. మొదట్లో అమ్మాయి చాలా అన్యమనస్కంగా నా ముందుకు వచ్చి కూర్చుంది. కొద్ది క్షణాల అనంతరం తలఎత్తి నా ముఖంలోకి చూసింది. తరువాత ముఖంమీద చిందర వందరగా పరచుకున్న వెంట్రుకల్ని సరిచేసుకుంది. ఇదంతా నా మంత్ర ప్రభావంవల్ల ఏర్పడ్డ సుగుణమేనని సంతోషించాడు. గృహస్తు. రెండవరోజు మళ్ళీ మంత్ర పాఠానికి రావాల్సిందన్నారు. యేథా సుందరి మొదటి రోజుకంటే బాగా తేరుకుని వుందారోజున. ఆమె తల్లి కూడా అక్కడేవుంది. నే వెళ్ళిన కొదిసేపటికి ఏదో పని వంకతో అవతలికి వెళ్ళిపోయింది తల్లి. ఇక మే మిద్దరమే వున్నా మా డేరాలో. నే నప్పుడే మంత్రపాఠం ప్రారంభించాను. ఏదో సంశయం, బెరుకు వేధిస్తోంది. ఆమె తల్లి త్వరగా వస్తే బాగుండు అనుకుంటున్నాను. కానీ, ఆమె అంత త్వరగా వస్తుందా? నాలోని సంశయాన్ని, బెరుకునీ, యేథా సుందరి పసికట్టింది గావును. నా ముఖంలోకే కన్నార్పకుండా చూస్తూ కూర్చుంది. ఆమె ముఖమూ బాగా వికసించి కళ కళ్ళాడుతోంది. నా మంత్రాలు ఇంత అద్భుతంగా పనిచేస్తాయన్న నమ్మకం నాకు లేదు. ఇన్నాళ్లుగా ఆమెను మానసికబాధ ఏదో వేధిస్తోంది. అందువల్లనే కృశించి పోతూన్నది. ఈనాడూ మానసిక బాధ వుంది. అయితే, మబ్బు విడిచిన చంద్రబింబంలా ముఖం శోభాయమానంగా వుంది. ఆమె చూపుల్లో నుండి, అవ్యక్తమైన స్నేహ భావనతోపాటు కరుణరసం చిందుతోంది. మౌనంగా, నన్నేదో యాచిస్తున్నట్టు చూస్తున్నది. నా వైపు, ఎంతకీ నానుండి ఎలాంటి ప్రత్యుత్తరమూ లభించకపోయేసరికి, సాహసించి ఇలా అంది: "మీ ఉపదేశాలు మధురంగా వుంటాయి. కానీ, మీ హృదయం చాలా కఠోరమైంది."

నేను కొన్ని క్షణాలు ఏమీ మాట్లాడలేకపోయాను. అసలు ఏ మాటల్తో ఆమెకు సమాధానం ఇవ్వాలో తోచలేదు. ఇలాంటి పరిస్థితిని ఎదుర్కోవడానికి సంసిద్ధుణ్ణయీ లేను. కొన్ని క్షణాలు మౌనంగానే వుండిపోయాను. పరోపకార పారీణుడైన బోధిసత్వుడి జీవితాన్ని గురించి ఉపన్యసిస్తూ "బోధిసత్వుని మార్గావలంబులైన మానవులకు పరోపకారం కొరకు త్యజించరానిదంటూ ఏదీ వుండదు. ధన, మాన, ప్రాణాలు

కూడా ఒక లెక్కలోవి కావు!" అని చెప్పేవాణ్ణి. మరి పరోపకారంకొరకు ప్రాణాల సహితం త్యజించవల్సిన నేను (బోధిసత్వుని మార్గావలంబినీ, మహాయానావలంబినీ అయిన నేను) ఒక స్త్రీకి కనీసం మాటల ద్వారా నైనా సాంత్వనను కలిగించకపోవడం సమంజసమా? మేధా సుందరి అన్న పై మాటల్ని విన్నాక నా మనస్సు నన్నే ధిక్కరించింది ఆమె మాట లోని నిగూఢభావాన్ని నే నర్థం చేసుకున్నాను. ఆమె నానుండి ఏ మాశి స్తున్నదో కూడా అర్థమైంది. అయితే ఆమె ఆశించిన విధంగా నేను ప్రవ ర్తించడం అసంభవం. అయినప్పటికీ, ఏదో వొక సమాధానం చెప్పక తప్పదు! అదీ ఎంతో మృదువుగా, ఆమె మనస్సును నొప్పించకుండా చెప్పాలి. కొద్ది క్షణాలు అనంతరం మృదుస్వరంలో "మిమ్మల్ని దయ్యం వదిలినందుకు చాలా సంతోషిస్తున్నాను!" అన్నాను.

"దయ్యం వదిలింది, అనకండి. మీరు రావడం వలన పక్కకు తప్పుకుంది. మీరు నన్ను తిరస్కరించి వెళ్ళిపోయారా, మళ్ళీ నేను యథాస్థితికి వచ్చేస్తాను!"

"నేను మంత్రపఠనం చేశానుగా? ఇక నా దయ్యం మీ దగ్గిరికి రాదు. భయపడకండి!"

"మీరు అనేక దేశాలు తిరిగారని, బాగా విద్యాధ్యయనం చేశారనీ విన్నాను. కానీ, మీరు చాలా అమాయకుల్లా వుంది. నా దయ్యం మంత్రాలో పోదు!"

మేధాసుందరి భావాన్ని నే నర్థం చేసుకున్నాను. అయినా చుట్టు తిరుగుడుగా మాట్లాడుతూ కావాలని ఆమెను తిరస్కరిస్తున్నాను.

"భద్రతోపాటే మీ హృదయం ప్రేమ శూన్య మయిందనుకుంటు న్నాను. అందంలో భద్రకు నేను దీటురాలేను. కానీ, ప్రేమలో భద్రలా జారిపోయేదాన్ని కాను!" అంది మేధాసుందరి.

"భద్ర నెందుకు అనవసరంగా నిందిస్తావు?" అన్నాను.

"భద్ర నిన్ను నిజంగా ప్రేమించి వుంటే అంత తేలికగా మరొకరి వశమయ్యేది కాదు. నన్ను నమ్మండి. నేను భద్రలాంటిదాన్ని కాదు. చాలా రోజులుగా మిమ్మల్ని గురించి వింటూన్నాను. నాకు తెలియకుండానే నా హృదయంలో మీకు ఎన్నటికీ చెదరని స్థాన

మేర్పడ్డది. నా మాటలు నమ్మండి. మా ఇంట్లో వాళ్ళుకూడా ఎలాంటి అభ్యంతరాన్నీ చెప్పరు।"

"కానీ, నువ్వన్నట్లు నిజంగానే నా హృదయం ప్రేమ శూన్యమయింది నేను ప్రేమించలేను. కృత్రిమ ప్రేమతో మనిద్దరి భవిష్యత్తునూ నాశనం చేసుకోవడం నా కిష్టంలేదు।"

"క్షణికమైన ఆవేశంలో నే నిలా నా ప్రేమను ప్రకటిస్తున్నాననుకోకండి. నేను నీకోసం ఎన్నాళ్ళయినా నిరీక్షించగలను నన్ను తిరస్కరించవద్దు, కనీసం ఈవిషయమై ఆలోచిస్తానని మాట ఇవ్వండి. అంతే చాలు।"

అప్పుడే నిర్మొగమాటంగా నా అయిష్టాన్ని చెప్పేద్దామనుకున్నాను. కానీ, అలా చెప్పలేకపోయాను. తిరస్కార భావాన్ని కనబరుస్తూనే 'ఆలోచిస్తా'నని మాట ఇచ్చి అక్కడనుండి వచ్చేశాను. యేధాసుందరి ఆరోగ్యం క్రమంగా బాగుపడ్డది, నా మంత్రాలపైన ప్రజలకు మరీ నమ్మకం కుదిరింది. అయితే, నావరకూ నాకు, ఇక నొక్క క్షణంకూడా అక్కడ వుండడం దుర్భరం అనిపిస్తోంది. కానీ, నలుగురు తోటి భిక్షువుల్ని వదిలి, వర్షావాసపు నియమాన్ని భగ్నంచేసి, అప్పుడు, అక్కడినుండి వెళ్లడం సంభవమా? తరువాత నేను ధర్మోపదేశాల్ని ఇచ్చేప్పుడు ఆ యేధాసుందరి ముఖకవళికల్ని పరిశీలిస్తూండేవాణ్ణి. ఆమె చాలా విశ్వాసంతో, తన్మయతతో నా ముఖంలోకి చూస్తుండేది. "నన్ను బాగా విశ్వసిస్తోంది. నేనేమో మోసం చేస్తున్నాను।"అనుకుని కించపడేవాణ్ణి.

కార్తీక పౌర్ణమి మరొక నెల రోజులుంది. మహాప్రవారణోత్సవం దగ్గరకు వస్తున్నకొద్దీ హృదయ భారం తగ్గినట్టుగానే వుండి పెరుగుతున్నది. ఈ ప్రేమ నాటకానికి దూరమౌతూన్నందుకు హృదయ భారం తగ్గినట్లయ్యేది. కానీ, ఇంత అనుభవమూ, జ్ఞానమూ, విద్యా కలిగివుండి వొక స్త్రీని మోసగిస్తున్నందుకు హృదయ భారం పెరిగిన ట్లయ్యేది. బోధిసత్వుని పరోపకారమయమైన జీవితాన్ని గురించి వెనకటంత ఉత్సాహంగా ఉపన్యసింపలేక పోతున్నాను. మహాయానులమైన మా జీవితాదర్శం వివిధోపాయాలతోటి తోటి మానవుల దుఃఖాన్ని హరించడమే। మరలాంటప్పుడు ఒక తరుణియొక్క హృదయ వేదనను తొల

గించడం నా కర్తవ్యం కాదా! కానీ బోధిసత్వుడి మహా వ్రతానికి యిది వక్రభాష్యం అవుతుందేమో? ఆ మహావ్రతాన్ని ఈ విధం గానూ పూరించవచ్చునా? తగునా? ఇలాగే హృదయవేదనను ఉపశ మింప చేసుకోడానికి ఇంకా అనేకమంది తయారుకావచ్చును. అలాంటి స్థితిలో ఏం చేయడం? కాక, ఈమె కోర్కెను అంగీకరించి, ఆరా టాన్ని తీరిస్తే ఫలితం ఎలా వుంటుంది? అందరిలా నేనూ ఓ గృహస్థు నవుతాను. కుటుంబ పోషణలోనే జీవితం గడిచిపోతుంది. ఇక నప్పుడు బోధిసత్వుని పవిత్రాదర్శం కొరకు మాన, ధన, ప్రాణాల్ని అర్పించడం ఎలా సంభవం? కనుక ఇది పనికిరాదు. త్యాగానికి కయినా, పరోప కారానికయినా ఒక హద్దు అంటూ వుండాలి! బోధిసత్వుని వ్రతపాలనలో హద్దులంటూ లేకపోతే అవాఛితాలెన్నో జరగడానికి అవకాశ ముంటుం దనిపించింది. దక్షిణాపథయాత్రలో ఎన్నోఅవాంఛితాల్ని నేనుస్వయంగా చూశాను ఆంధ్ర దేశంలోని మహాయానులు బోధిసత్వుని పరోపకార మయ జీవితాన్ని చాటు చేసుకుని బౌద్ధ సంఘాల్లో ఘోరమైన రహస్య వ్యభిచారాన్ని సాగించారు. ఇలాంటి రహస్య వ్యభిచారం ధర్మయుక్తమే నని చెప్పే సూత్రాలూ, శాస్త్రాలూ భవిష్యత్తులో రచింపబడినా ఆశ్చర్య పడ నవసరముండదు! కాముక ప్రవృత్తులు మానవుడిచేత ఎంతటి దుస్సాహసాల నయినా చేయిస్తాయి!

మైదానంలో గడిపిన ఆ నెల రోజుల్లోనే కాక ఆ తరువాత కూడా అనేకమార్లు నే నీ విషయాన్ని గురించి ఆలోచించాను. "బోధిసత్వుని మహాయానంలో శీలాన్ని, సదాచారాన్ని పాటించడం అవసరమా? అన వసరమా?" అన్న ప్రశ్న నా మనస్సు ఎన్నోమార్లు కలచివేసింది. మానవులు తమలోని కాముకతను, స్వార్థలిప్సను చంపుకోకుండా మహా యానాన్ని అధిష్ఠించ వచ్చునా? బుద్ధుడు శీలాన్ని గురించి ప్రత్యేకం ఎక్కడా ఏమీ చెప్పలేదు. శీల, సమాధి, ప్రజ్ఞల్ని అలవర్చుకోవలసిం దని మాత్రం చెప్పాడు. ఎంతోమంది మిత్రుల జీవితాల్ని పరిశీలించాక, నా వ్యక్తిగతానుభవం దృష్ట్యా కూడా, పూర్తి బ్రహ్మచర్యం అసం భవమే నని నిశ్చయించుకున్నాను. ముఖ్యంగా యువకత్వంలో బ్రహ్మ చర్యాన్ని పాటించడం దుస్సాధ్యం! మరి అసంభవమైన బ్రహ్మ

చర్యాన్ని ఆచరించమనడంలో అర్థమేమిటి? ఉన్నతమైన ధార్మిక జీవితాన్ని, పరోపకార పారీణతను పాటిస్తూ, గడపడం గృహస్థువల్ల కాదు. పరోపకారాన్ని జీవితాదర్శంగా స్వీకరించడానికి గృహస్థు తగడు. భార్య, బిడ్డలు కలవాడు తన-పరాయి అనే భేదం లేకుండా వుండగలడా? గృహస్థు తన బంధుమిత్రుల పట్ల చూపవల్సిన కర్తవ్యాల్లో బంధితుడై వుంటాడు. అయితే, పరాయివారిపట్ల అతడికి ఏ విధమైన కర్తవ్యాలూ వుండవు. ఈ తన-పరాయి అనే భావనను అధిగమించి మానవుడు పరోపకారి కావాలంటే, గృహ జీవితం గొప్ప ఆటంకం. ఇప్పుడు నేను నా సమయాన్నంతా పరుల మేలుకొరకు ఖర్చుపెట్టవచ్చు. ఏ రోగగ్రస్తుడికో రాత్రింబవళ్లు సేవ చేస్తూ వుండిపోవచ్చు. కానీ, వివాహం చేసుకుని, నలుగురి బిడ్డల తండ్రి నయ్యాక అలా పరులకు సేవచేస్తూ వుండ వీలవుతుందా? భార్యా పుత్రుల పోషణకు ధనాన్ని ఆర్జించాలికదా? ఇప్పుడు ఒకణ్ణే ఏవిధంగానైనా జరుపుకోగలను. నా విద్య, బుద్ధి, జ్ఞానంతో పరులకు ఎంతో మేలు చేయగలను. ప్రతిఫలం ఒకపూట ఎండు రొట్టె దొరికితే చాలు. నా అవసరాలను ఇంకా కూడా సంక్షిప్తం చేసుకో గలను. కానీ, గృహస్థునైతే ఇలా గడపడం సంభవమా ?

పరోపకారాని కయినా కొన్ని హద్దు లుండడం, అందులోనూ మధ్యమ మార్గా న్ననుసరించడమే ఉత్తమ మన్న నిర్ణయానికి వచ్చాను. ఇక బ్రహ్మచర్యాన్ని గురించి ఒక నిర్ణయానికంటూ రాలేకపోయాను. నావరకూ నేను నా సమస్త శక్తుల్ని వుపయోగించి, బ్రహ్మచర్యాన్ని ఆచరించాను. మానసిక స్థితుల్ని వదలివేస్తే, శారీరకంగా బ్రహ్మచర్యాన్ననుసరించడంలో నూటికి తొంభై తొమ్మిదిపాళ్ళు కృతకృత్యుణ్ణయ్యానను కుంటున్నాను. బ్రహ్మచర్యాన్ని పాటించాను గనుకనే, ఇన్ని దేశాలు తిరగగలిగాను. నాకు తిరుగుబోతు జీవితమంటే చాలా ఇష్టం. ఇప్పుడు నా వయస్సు 70 సంవత్సరాలు. శరీరం శుష్కించింది. ఎముకలు శిథిలమవడానికి సిద్ధంగా వున్నాయి. ఉరకలువేసే మహాసముద్రాల్ని, గగనాన్నంటే మంచుకొండల్ని సునాయాసంగా దాటించిన, ఆ వెనుకటి మహోత్సాహం ఇప్పుడు లేదు.

మహా ప్రవారణోత్సవం వచ్చింది. ఆరోజు మైదానంలోని గృహస్థులు మా ఐదుగురు భిక్షువుల కొరకూ రాకరకాలైన భోజ్యపదార్థాలను పట్టుకు వచ్చారు. తమ చేతుల్తో నేసిన సన్నని వున్ని చీవరాన్ని తెచ్చి ఇచ్చారు. మా విహారానికి తీసుకుపోవడానికి వెన్నా, మాంసమూ ఇతర పదార్థాలనూ తెచ్చి యిచ్చారు. వాటిని విహారానికి చేర్చవలసిన బాధ్యత కూడా ఆ గృహస్థులదే।

కార్తీక మాసం సగపడేసరికి సుభూమి విహారాన్ని చేరుకున్నాము. నా ఉపాధ్యాయులూ, ఆచార్యులూ అయిన గుణవర్ధనులూ. పినతండ్రి అయిన జినవర్మా ఇప్పుడీ ప్రపంచంలో లేరు. అయినా, విహారంలో నాకు వెనుకటి ఆదరమూ, ఆత్మీయతా లభించాయి. భిక్షువులకు తమ విహారం సొంత గృహంలా వుంటుంది. విహారవాసులైన భిక్షువులు ఒకరిపై ఒకరు గాఢమైన ఆత్మీయతను కలిగి వుంటారు. నాయకస్థవిరులు, ఇతర భిక్షువులూ నన్ను ప్రధాన విహారంలో భదంత జినవర్మగారు వుండిన కోష్టకంలో ఉండవల్సిందనీ, వారి స్థానాన్ని స్వీకరించవల్సిందనీ కోరారు. నా బౌద్ధికాభివృద్ధి అంతా సుభూమి విహారంలోనే జరిగింది. ఆ విహారానికి నేనెంతో ఋణపడి వున్నాను. ఈ విధంగానైనా ఆ విహారపు ఋణాన్ని తీర్చుకున్నవాణ్ణి, ఆ విహారంపట్ల నా కృతజ్ఞతను ప్రకటించుకున్నవాణ్ణి అవుతానన్న ఉద్దేశ్యంతో జినవర్మగారి స్థానాన్ని స్వీకరించడానికి ఒప్పుకున్నాను. అధ్యాపక కార్యాన్ని నిర్వహిస్తూ కాలం గడుపుతున్నాను. నా జ్ఞానాన్ని అభివృద్ధి పరచుకోవడానికి స్వాధ్యాయాన్ని మించి మరి సాధనంలేదు.

భిక్షువుల సాంఘిక జీవనంలో అనేకమైన లోపాలతోపాటు కొంత ఆకర్షణ కూడా వుందని ఒప్పుకోక తప్పదు. ముఖ్యంగా స్వార్థప్రవృత్తులూ, అజ్ఞాన అహంకారాది గుణాలు లేని నాలాంటి వారికి భిక్షు జీవనంలో గొప్ప ఆకర్షణ కనపిస్తుంది. ఇతరుల స్నేహ సుహృద్భావాన్ని పొందడము నాకో ఆనందదాయకమైన విషయం. మిత్రుల్ని, సహృదయుల్ని దూరం చేసుకోవడం జరిగితే నా మనస్సు విపరీతంగా బాధపడేది. నెలల తరబడి మిత్రుల వియోగదుఃఖంలో రాత్రిళ్ళు నిద్రపట్టేది కాదు. ఒక మాటు నాకు మిత్రులైన వారిని ఎన్నటికీ పగ చేసుకునేవాణ్ణి కాదు.

మిత్రత్వాన్ని కాపాడు కోవడానికి ఎంతగానో పాటుపడేవాణ్ణి. సజీవులైన మిత్రుల్ని ఎన్నడూ మరవడమంటూ జరగదు. కాగా ఇహ జీవన యాత్రను ముగించుకున్న మిత్రుల జ్ఞాపకాలు నన్ను నిరంతరం వేధిస్తుంటాయి. ఏదో అనివార్యమైన మృదుబాధ హృదయాన్ని కొరుకుతూ ఉంటుంది. మిత్రులతో కలిసి తిరిగిన జీవితం తాలూకు స్మృతులే నా అమూల్య నిధు లని భావిస్తుంటాను.

సుభూమి విహారంలో లోగడ నాలుగేళ్ళున్నాను. విహారవాసులు అప్పుడూ నన్నెంతో ఆదరభావంతో చూసేవారు. ఇప్పుడు కూడా ఇంకా ఆదరంగా చూస్తున్నారు. నావిద్యా, జ్ఞానమూ విహారంలో నాకో ప్రత్యేక స్థానాన్నేర్పరచాయి. నా మధురభాషణా, మృదుప్రవర్తనా ఆ స్థానాన్ని కాపాడుతున్నాయి. నా దగ్గరకు అధ్యయనార్థం ఎక్కువమంది విద్యార్థులు వస్తూండేవారు. నా విద్యార్థుల్లో బాలకులైన శ్రమణులేకాక వయస్కులైన విద్వాంసులుకూడావున్నారు. అందరికీ మార్గదర్శకుణ్ణయి అభివృద్ధిపథాన నడిపించడం నా పరమకర్తవ్యం. భిక్షువయినమాత్రాన మానవుడు దోష రహితుడు కాలేడు. సుభూమివిహారంలో నియమాలు కఠినంగా వుంటాయి. విహారపు నియమాల్లోపూర్తిగా నెగ్గినవారినే శ్రమణులుగా జేర్చుకుంటారు. అలా కృతకృత్యులయినవారికే భిక్షు దీక్షనీయడం జరుగుతుంది. ఎన్ని నియమాలు వున్నప్పటికీ భిక్షు జీవితానికి పనికిరాని, అయోగ్యులు కొంతమంది విహారంలోకి వస్తూనే వుండేవారు. అయితే, అలాంటివారు సాధారణంగా విహార నియమాలకు జడిసి త్వరలో నేవెళ్ళిపోతూంటారు. వారిలోనూ కొంతమంది విహారంలోనేవుంటూ ఎలాగో కాలాన్ని దొర్లిస్తూంటారు. ఇలాంటి వారివల్ల అప్పుడప్పుడు ప్రశాంతమైన విహార వాతావరణంలో అశాంతి, అలజడులు బయలుదేరుతుంటాయి. నే నింకా తరుణ వయస్కుణ్ణేను. డెబ్బై ఎనభై ఏండ్ల వయోవృద్ధులైన భిక్షువుల ముందు నేనెంత! కానీ నన్నా విహారంలో అందరూ అజాత శత్రువుగా భావించేవారు. ఎవరికీ లొంగని వివాదాల్ని పరిష్కరించుకోవడానికి నా వద్దకే వచ్చేవారు. విహారంలో తలచూపిన ప్రతి వివాదాన్నీ చాలా నేర్పుగా, సమర్థవంతముగా పరిష్కరిస్తూండేవాణ్ణి.

విహారంలోని భిక్షువులకు సేవచేయడానికి నేనుసదాసిద్ధంగా ఉండే

వాణ్ణి. నదీతీరంలోని గ్రామ ప్రజలు కూడా ఏదైనా బాధవస్తే వెంటనే నావద్దకు పరుగెత్తుకు వచ్చేవారు. నా వైద్యశాస్త్ర పరిచయము బహు స్వల్పమని మొదటే చెప్పాను. నాకు వైద్యవిద్యను బోధించిన గురువు గారు ఇంకా బ్రతికే ఉన్నారు. గొప్పగా కీర్తినీ ఆర్జించారు. వారివద్ద సంపూర్ణముగా వైద్యశాస్త్రాన్ని అధ్యయనముచేసిన భిక్షువులిద్దరు విహారములోనే వున్నారు. ఉత్తమవైద్యులుగా ప్రసిద్ధిని బడశారు. అయినా, చుట్టుపట్ల గ్రామాల ప్రజలు, ఏ చిన్న బాధవచ్చినా ముందు నా దగ్గిరకు వచ్చేవారు. ప్రజలకు ఔషధ సేవనంమీదకంటే ఆశీర్వాదముమీదా, చేతి చలవమీదా నమ్మకము ఎక్కువ. నేనూ వాళ్లనెన్నడూ నిరాశ పరిచే వాణ్నికాదు. ఈమాటు విహారములో రెండేళ్ళు మాత్రమే వున్నాను. ఈ రెండేళ్ళలోనూ చుట్టుపట్ల ప్రజల్లో నా పరిచయమూ, పలుకుబడీ కూడా పెరిగాయి. ప్రజలెంతోమంది నాకు కానుకలూ, దాన దక్షిణాలూ తెచ్చి ఇస్తూండేవారు. వాటిని సంఘానికి ఇచ్చి వేసేవాడిని. పరిసర గ్రామాల ప్రజలు చలికాలములో క్రింది ప్రదేశాలకు వెళ్ళిపోతారు. అంతవరకూ నేను గ్రామాల్లోకి భిక్షకు వెళ్తూండేవాణ్ణి. స్త్రీపురుషులూ, బాలబాలికలూ నేనెప్పుడు భిక్షకు వస్తానా అని ఎదురుచూస్తుండేవారు. కొద్ది ఇండ్లలోనే నాకు కావల్సిన భిక్ష లభించేది. వెనక్కుతిరిగి వెళ్ళిపోయేవాణ్ణి. భిక్షా పాత్ర నిండేవరకే నేను భిక్షాటనకు తిరిగేవాణ్ణి. పాత్రనిండాక యిక నేను భిక్ష గ్రహించనని ప్రజలందరికీ తెలుసు. కనుకనే నన్నెవరూ బల వంతపెట్టేవారుకాదు. ప్రజల ఆస కివి తీర్చడానికి రోజొకవీధికి భిక్షాట నకు వెళ్తూండేవాణ్ణి. అధికంగా భోజ్యపదార్థాలను నా పాత్రలో వేయ వద్దని చెప్తూండేవాణ్ణి. పదార్థాలు రుచిగా వుండేట్టుచేసి వేస్తుండేవారు. గౌరవముకంటే స్నేహమే ఎక్కువ విలువైందని నా భావన. ప్రజలకు స్నేహపాత్రుణ్ణవడానికి ప్రయత్నిస్తూండేవాణ్ణి. ఎవరైనా రోగముతో బాధపడుతున్నారని తెలిస్తే, భిక్షాటన సమయంలో తప్పకుండా ఆ రోగి వద్దకు వెళ్ళి పరామర్శించేవాణ్ని. దరిద్రబాధవల్ల ఎవరయినా పస్తు న్నట్లు తెలిస్తే, నా భిక్షాపాత్రలోని ఆహారాన్ని వాళ్ళకు యిచ్చివేసే వాణ్ణి.

ఉద్యానంలో హీనయానం అధిక ప్రచారంలో వుంది. అక్కడి

ఇతర విహారాల్లా సుభూమి విహారంకూడా హీనయాన సంప్రదాయానికి చెందినది. హీనయానం వినయ-నియమాల్నీ, ఆచారాలనూ పాటించడంలో ఎక్కువ శ్రద్ధ చూపుతూంటుంది. అయితే, ఉద్యానంలోనూ మహాయాన ప్రభావం ఏ కొద్దిగానో కనిపిస్తూనే వుండేది. వచ్చిన మొదట్లో, మహాయానాన్ని బాగా ప్రచారంచేసి, సుభూమి విహారాన్ని మహాయానానికి కేంద్రాన్ని చేద్దామనుకున్నాను. కానీ, మైదానంలో యేధా సుందరి పరిచయాన్ని పొందాక మహాయానాన్ని గురించి ఏం మాట్లాడాలన్నా, ఏదో సంకోచము, సంశయము వివశుణ్ణిచేసి మాట్లాడనిచ్చేవి కావు. ఉపదేశించడం కంటే ఆచరించడం ఉత్తమమైన పద్ధతనుకున్నాను.విహారంలో వున్న రెండు సంవత్సరాల్లోనూ ఎన్నడూ మహాయానాన్ని గురించి ఉపన్యసించ లేదు. విద్యార్థులను చదివించేప్పుడు సందర్భాన్ననుసరించి మహాయానాన్ని గురించి చెప్తూండేవాణ్ణి. అయితే. మహాయాన, హీనయానాల సమన్వయానికే ప్రాధాన్యత నిస్తూండేవాణ్ణి. నా విద్యార్థులు మిగిలినఉపాధ్యాయుల కంటే నాపైనే ఎక్కువ శ్రద్ధ కనబరచేవారు. అన్య ఉపాధ్యాయులకంటే విద్యాజ్ఞానంలో నేను తక్కువఅనే చెప్పేవాణ్ణి. అయినప్పటికీ విద్యార్థులు నా దగ్గిరికేఎక్కువగావస్తూండేవారు. ఇతర భిక్షువులతో. విద్యలోవారు నా కంటె తగ్గినప్పటికీ, చాలా నమ్రంగా వ్యవహరించేవాణ్ణి. స్వల్ప వ్యవధిలో అధికంగా పలుకుబడిని సంపాయించి నప్పటికీ నాపై ఎవరూ ఈర్ష్య చెందకపోవడానికి కారణం నా ప్రవర్తనలోని నమ్రతే అనుకుంటాను. "శౌచకుటి"ని (పాకీదొడ్డి) శుభ్రంచేసే బాధ్యత నేను తీసుకున్నాను. ప్రతిరోజూ ఒకమాటు "శౌచకుటి"ని పర్యవేక్షించి వస్తూండేవాణ్ణి. ఉద్యానం చలిదేశం కావడం వలన శౌచానికి వెళ్ళినపుడు నీటిని ఉపయోగించే ఆచారం లేదు. కానీ, వినయ సూత్రాల్లో నీటిని ఉపయోగించవల్సిందన్న నియమం వుంది. మా విహారంలోని భిక్షువులు వినయ నియమాన్ని పాటించేవారు. నేను తిరిగిన అన్ని దేశాల్లోనూ, చూసిన అన్ని విహారాల్లోనూ "శౌచకుటీ"రాలు శుభ్రంగా వుండడాన్ని గమనించాను. సింహళములో, మహావిహారంలోని ఒక వృద్ధభిక్షువు "శౌచకుటి"ని శుభ్రం చేయడాన్ని మహావ్రతంగా స్వీకరించి పాలిస్తున్నాడు. ఆ వృద్ధభిక్షువును చూశాకనే "శౌచకుటి" శుభ్రతమీదకు నాదృష్టి

మళ్ళింది. విహార ఆవరణలో ఏ మాత్రం మురికినీ, చెత్తనీ వుండనిచ్చే వాణ్ణి కాదు. యవ్వనంలో వున్నాను. పైగా బలంగా వున్నాను. అలసట గానీ, సోమరితనంగానీ నాకు తెలియవు. నాతో, విహారవాసులూ, ఇతరులూ ఎంతో సద్భావంతో మెలిగేవారు.

అప్పుడప్పుడూ దేశాటనకు బయల్దేరాలన్న ఆసక్తి ప్రేరణా కలుగుతూండేవి. కానీ, రోజులు గడుస్తున్న కొలదీ సన్నవి సాలెగూడు లాంటి స్నేహజాలం నాచుట్టూ అల్లుకోవడాన్ని గమనించాను. యేధా సుందరికి నా నిశ్చయాన్ని తెలియపరిచే అవసరమే కలగలేదు. నియమ బద్ధమూ, నిష్ఠాగరిష్ఠమూ అయిన నా జీవితాన్ని గురించి తెలుసుకున్నాక తనకు తానై అభిప్రాయాన్ని మార్చేసుకుంది యేధాసుందరి! రోజు రోజుకూ పరిసర ప్రజలకూ, నాకూ సంబంధాలు ఘనిష్ఠ మవుతున్నాయి, దేశాలు తిరగాలన్న నాకోర్కెను బలవంతాన అణచుకోవలసి వస్తోంది. నా కాళ్ళను బంగారు గొలుసుల్తో కట్టివేసిన ట్లవుతోంది. బహుశ ఇక నేను ఎన్నటికీ స్వతంత్రంగా, స్వేచ్ఛగా, దేశాలు తిరగలేనేమోనన్న సంశయమూ కలిగేది. కానీ, మానవ జీవితంలో వుత్పన్నమయ్యే సమస్యలు ఎప్పుడూ మన మనుకున్నట్లు క్రమబద్ధంగా వుండవు. నైయ్యాయికులు చెప్పినట్లు కార్యకారణ సంబంధాలు ఎప్పుడూ స్థిరంగా, క్రమంగా వుండవు. మానవ జీవితం ఒక్కొక్కప్పుడు కప్పదాట్లువేసి ముందుకు వెళ్ళిపోవడంకూడా జరుగుతుంటుంది. ప్రతీత్య సముత్పాద నియమం సర్వత్రా వ్యాప్తిలో వుంది. ఒకనాడు నా కాళ్ళకువున్న ఈ బంగారు గొలుసులు వాటికవే తెగిపోతాయని ఎవరనుకున్నారు? స్నేహజాలం విడిపోతుందనీ, తిరిగి నేను దేశయాత్రలకు బయల్దేరుతాననీ ఎవ రూహించారు?

ఒకనాటి సాయం సమయం, విహారానికి దక్షిణంగా వున్న ద్రాక్షతోటవైపు చంక్రమణం చేయడానికి వెళ్ళాను. నావెంట ఇద్దరు యువక భిక్షువులుకూడా ఉన్నారు. ఏదో శాస్త్రాన్ని గురించి మాలో మేము తర్కించు కుంటున్నాము ఇంతలో మేము దక్షిణంగావున్న అరణ్యంలోనుండి పొగ లేవడాన్ని చూశాము. అడవి తగులబడుతున్నదనుకున్నాము. ఆ పొగకు ఏ మాత్రమూ ప్రాముఖ్యత నీయకుండా మా చర్చల్లో మేము మునిగిపోయి విహారాన్ని చేరుకున్నాము. విహారం

లోనూ ఎవరితోటీ మాకు కనుపించిన పొగను గురించి ప్రస్తావించలేదు. నియమితసమయానికి ఎవరికోష్టకంలో వాళ్ళం పడుకుని నిద్రపోయాము. అర్ధరాత్రి అయ్యేసరికి దక్షిణపు గాలి తీవ్రమయింది. మేమందరము గాఢనిద్రలో వున్నాము. గాలితోపాటు అగ్నికణములు తీవ్రవేగంతో విహారంవైపుకు వచ్చేశాయి. చుక్కపొడిచే సమయానికి, విహారంలో పెద్ద గందరగోళం చెలరేగింది. నేనప్పుడే కన్ను తెరిచాను. కోష్ఠకాన్ని దాటి బయటికి వచ్చాను. కన్నులు మిరుమిట్లు గొలిపే మంటలు .... వంటికి వెచ్చని సెగ తగుల్తోంది. గబగబా మెట్లుదిగి క్రిందికి వెళ్ళాను. విహారానికి పశ్చిమసరిహద్దుగావున్న అడవి దగ్ధమవుతోంది. అప్పటివరకూ పచ్చగా కళకళ్ళాడుతూన్న చెట్లన్నీ కాలి మసి అయిపోతున్నాయి. గాలి తీవ్రత ఏ మాత్రమూ తగ్గలేదు. పచ్చి చెట్లు కూడా ఇంతత్వరగా, ఇంత తీవ్రంగా మండుతాయని నేను కలలోకూడ వూహించలేదు. చెట్లకొమ్మలు ఆగ్నేయాస్త్రాల్లా ఫెళఫెళమనే శబ్దంతో విరిగి, దూరంగా వెళ్ళి పడు తున్నాయి. వాటి మంటల్ని అందుకుని క్రొత్త చెట్లు మండుతున్నాయి. ఈ విధంగా అంతకంతకూ అగ్ని ప్రజ్వరిల్లిపోతోంది. ద్రాక్షలతల్ని పాకించడానికి వెదుళ్ళతో, స్తంభాల్తో పందిళ్లు వేశాము. క్షణంలో ఆ పందిళ్లు అంటుకున్నాయి, అగ్నిజ్వాలలు ప్రళయాన్ని సృష్టిస్తు న్నాయి. ఏ క్షణాన్నయినా విహారం అగ్నిదేవుడికి ఆహుతయి పోవ చ్చును. నిలబడి చూడవలసిన సమయం కాదు. విహారంలో సామాన్లను సాధ్యమైనవరకూ బయటికి తెచ్చుకోవడం తక్షణ కర్తవ్యం. మా సామాన్లను భద్రపరచుకోవడానికి తగిన స్థానం నడికి ఆవలివైపునగల గ్రామం. ఒక మంచంమీద విహారంలోని గ్రంథాలన్నిటినీ వేసుకొని ఇద్దరు భిక్షువులం గ్రామంలోకి తీసుకుపోయాము. పరిస్థితిని తెల్సుకుని, గ్రామంలోని స్త్రీ పురుష లందరూ పరుగెత్తుకు వచ్చారు. విహారాన్ని రక్షించడం అసంభవం అని అందరికీ తెల్సు. సాధ్యమయినవరకూ సామానులను సురక్షిత స్థానానికి చేరుస్తున్నారు. క్షణంలో ముఖ్య మయిన వస్తువులన్నింటినీ గ్రామంలోకి చేర్చేశాము. ప్రతిమా గృహంలో అష్టధాతువుల్తో చేసిన బుద్ధ విగ్రహం ఒకటుంది. దాన్ని భద్రపరుద్దామని వెళ్ళాము. ఇంతలో ఒక మండే కొమ్మవచ్చి ప్రతిమాగృహంమీదపడ్డది.

ఒక్క పురాతన స్తూపం తప్ప! మిగిలిన గృహాలూ, భవనాలూ అన్నీ
చెక్కతో నిర్మించినవే. పైగా శతాబ్దాలనుండి ఎండుతూ వున్నాయి. ఆ
బుద్ధ విగ్రహం చాలా భారీఅయినది. యాభై, అరవై మంది బలశాలులు
కలిసి ప్రయత్నించినా, ఆ విగ్రహాన్ని పూరివరకూ చేర్చగలరన్నది
సంశయాత్మకమే. ఇక ఇప్పుడా విగ్రహాన్ని బయటకు తెచ్చే ప్రయ
త్నాన్ని మాని ఇవతలికి వచ్చాము. విహారావరణంలోని గృహాలన్నీ
ఒకదాని తరువాత ఒకటి మండుతున్నాయి. వివశంగా కండ్లు పగుల
గొట్టుకు మండుతూన్న గృహాల వంక చూస్తున్నాము. కొద్ది క్షణాల
తరువాత మౌనంగా తలలు వంచుకుని గ్రామంలోకి వెళ్ళిపోయాము.
సూర్యోదయ సమయానికి విహారం పూర్తిగా దగ్ధమైపోయింది.

సాయంకాలానికి విహారాలూ, గృహాలూ పూర్తిగా తగులబడి
మంటల్ని చల్లార్చేసుకున్నాయి. తెల్లని పొగను మాత్రంవదుల్తున్నాయి.
గాలీ తగ్గిపోయింది. విహారం దగ్గర నది బాగా వెడల్పుగావుంది. వరదలు
వచ్చి నదులు పొంగడం, గ్రామాలు కొట్టుకుపోవడం అనుభవంలోని
విషయమే కావడంవల్ల, గ్రామం నదీతీరానికి బాగా దూరంలో కట్టు
కున్నారు. అయినప్పటికీ, ఉదయం వీచిన గాడ్పులకు, అగ్నికణములు
పడి గ్రామం తగులబడుతుందేమోనని అందరూ భయపడ్డారు.

జరిగిపోయిందాన్ని గురించి చింతించడం, పశ్చాత్తాపాన్ని పొంద
డమూ నాస్వభావంలో లేదు. అయినప్పటికీ, అతి ప్రాచీనమైన విహా
రమూ, దాని తాలూకు ఎన్నో పురాతన వస్తువులూ అగ్నిదేవుడికి ఆహు
తయిపోవడాన్ని చూసి చాలా చింతించాను. అగ్నిని ఆపడం నిజంగా
సంభవం కాని విషయమేనా? విహారాన్ని రక్షించుకోవడం నిజంగానే
అసంభవమా? ఊరికీ విహారానికీ మధ్య నది వుండడంవల్ల ఊరు
రక్షింపబడ్డది. అదేవిధంగా విహారాన్ని ఆనుకునివున్న ఉత్తర, దక్షిణ
దిశల్లోని అరణ్యాన్ని కొంతవరకూ నరికి ఖాళీ ప్రదేశాన్ని ఏర్పరచి
నట్లయితే?

# 11 వ అధ్యాయము

# హిమాలయాన్ని దాటాము

(క్రీ. శ. 550)

క్షణంలో, అతి పురాతనమైన సుభూమి విహారమూ, దాంతో పాటు ఎన్నో పవిత్ర వస్తువులూ భస్మమయ్యాయి. అయితే భిక్షువుల నిత్య జీవనానికీ, అవసరాలకూ ఎలాంటి ఆటంకమూ సంభవించలేదు. ఆహార పదార్థాలనుముందేజాగ్రత్త చేసుకున్నాము. ఊళ్ళోనూ మాకు కావల సిన పదార్థాలు లభిస్తాయి. చుట్టుపట్ల గ్రామాల ప్రజలూ మాకు అనేక విధాల సహాయం చేస్తున్నారు। తమ పవిత్ర విహారం ఇలా కాలిపోయి నందుకు ప్రజలెంతగానో బాధపడుతున్నారు. దగ్గరలో చెక్క సులభంగా లభిస్తుంది. ప్రస్తుతం పని జరిగేట్టు చెక్కతో విహారాన్ని తయారు చేయడం అక్కడి ప్రజలకో కష్టమయిన పనికాదు. అయితే, మాకు అలా 'తాత్కాలిక విహారం' నిర్మించుకోవడం ఇష్టంలేదు. విహారాన్ని వెనుకటిలా భవ్యంగా,బలంగా నిర్మించాలని మా వుద్దేశం. ప్రజలుకూడా తమ విహారాన్ని వెనుకటి రూపంలోనే చూడాలని వాంఛిస్తున్నారు. మిహిరకులుడు గతించాక ఉద్యానం ఒకరకంగా నిరాశ్రయ మయింది. కపిషా, గాంధార, కాశ్మీర దేశాల్లో ఏ పెద్దరాజు అధీనంలోనో వున్నట్ల యితే క్రొత్త విహారాన్ని నిర్మించడం ఏమంత పెద్ద సమస్యకాదు. మిహిరకులుడు తన రాజ్యంలోని తూర్పు దేశాలను. కాంభోజ, వక్షు నదీతీర ప్రాంతాలను వెనకే కోల్పోయాడు. ఇప్పుడు అన్ని చోట్లా యోధ సామంతులు చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాల్ని స్థాపించారు. ఇలాంటి దుర్ఘటన తోరమాణుడి సమయంలో జరిగి నట్లయితే, వెంటనే క్రొత్త విహారాన్ని నిర్మించుకోవడానికి ఆజ్ఞ ఇచ్చే

వాడు. రాజు తల్చుకుంటే విహారా లొక లెక్క ? కానీ, ఇప్పుడలాంటి సహాయాన్ని ఆశించడానికే వీలులేదు. కనుక మా ఆశయం నెరవేరాలంటే మే మందరమూ కలసి ప్రయత్నించాలి! సుభూమి విహారంలో కాంభోజ, తుషార, కాంస్య, కూచా దేశాల భిక్షువులుకూడా వుంటారు. విదేశయాత్ర అంటే నాకెంతో ఇష్టమవడమువల్ల ఆయాదేశాల భిక్షువుల్ని అక్కడి పరిస్థితుల్ని గురించి అడుగుతూండేవాణ్ని. ఆ దేశాల్లో రత్నాలగనులూ. బంగారు గనులూ వున్నాయని తెల్సుకున్నాను. విహారనిర్మాణముకొరకు పై దేశాలకువెళ్ళి ద్రవ్య సంచయం చేయడం ఉత్తమపద్ధతనుకున్నాను. నా అభిప్రాయాన్ని విహార అధికారులుకూడా ఒప్పుకున్నారు. మరో నలుగురు భిక్షువుల్ని వెంటపెట్టుకుని, సుభూమి విహారమునుండి బయల్దేరి వెళ్ళాను.

పృథ్వి అనంతమయింది. ఈ శతాబ్దంలోని ప్రసిద్ధఖగోళ శాస్త్రజ్ఞుడు ఆర్యభట్టు చెప్పినట్లు పృథ్వి "సాంత" * మయింది అనయినా అనుకోవచ్చు! పృథ్వియొక్క అనంతత్వాన్ని గురించిగానీ, 'సాంత' త్వాన్ని గురించిగానీ నేనేమీచెప్పను. నా అనుభవం ఆధారంతో వొక విషయం చెప్పగలను. మానవుడు తనకు పదిరోజుల దూరానగల ప్రదేశాల్ని గురించికూడా పూర్తి అజ్ఞానములో వుంటాము. ఎంతో విచిత్రమైన అభిప్రాయాన్ని కలిగివుంటాము. ఇతర ప్రదేశాల్లో తమ దేశములోలా మానవు లుండరనీ, దేవతలో, రాక్షసులో వుంటారనీ అనుకుంటాము. ఇతర ప్రదేశాల్లోని చెట్లూ చేమలూకూడా మనదేశంలోలా వుండవని మన నమ్మకము. కంటికీ చెవికీ నాలుగు అంగుళాల దూరమే అయినా, వస్తువుల్ని, ప్రదేశాల్ని ఇతర మానవుల్ని గురించి కన్ను ఇచ్చినంత స్పష్టమైన, యథార్థమైన జ్ఞానము చెవి ఇవ్వదు. కనుకనే ప్రమాణశాస్త్రం, చెవితో విన్న విషయాన్ని ప్రమాణమని ఒప్పుకోదు. వసుబంధు, దిఙ్నాగులు ప్రత్యక్ష జ్ఞానంమాత్రమే ప్రామాణ్యమంటారు. ఏ విషయాన్ని అయినా కొంతవరకూ ప్రామాణికమయిందని ఒప్పుకోవడానికీ, ప్రత్యక్ష జ్ఞానంగలవారి సమర్థన అవుసరం! హిమాలయానికి అవతలి దేశాల్ని గురించి వాళ్ళూ వీళ్ళూ చెప్పగా విన్నాము. నాతోవున్న నలుగురు భిక్షు

* అంతంకలది.

వుల్లోనూ వొకతడు కాంభోజ దేశానికి చెందినవాడు. ఇతరదేశాల భిక్షు-
వుల పరిచయం లభించినట్లయితే మాకెంతో సహకారంగా వుండేది.
ఒక్క కాంభోజదేశ భిక్షువు మినహా మిగిలిన నలుగురమూ ఉద్యానవాసు-
లమే! మేము ఐదుగురుమూ నలభై యేండ్లలోపు వయసు కలవాళ్ళమే!
కాంభోజ భిక్షువు మా అందరిలోకి చిన్నవాడు. అతడివయస్సు 22-23
సంవత్సరాలు మాత్రమే వుంటుంది. అతడు సుభూమి విహారములోనే
ఉపసంపదను పొందాడు. తోటి భిక్షువులు నలుగురూ నాపై పూర్తి విశ్వా-
సాన్ని కలిగివుండేవారు.

సుభూమి విహారాన్నుండి బయలుదేరి మొదట కొంత క్రిందికి
దిగాము. తరువాత కొంతదూరము పైకెక్కాము. కునర్‌నదిని దాటి
చిత్రాలయ మనే పట్టణాన్ని చేరాము. ఈ పట్టణమూ సుభూమిలా శీతాధిక్య
ప్రదేశములోనే వుంది. అయితే, విశాలమైన పర్వతపాదభూమిలో వుండ-
డము ఈపట్టణము యొక్క ప్రత్యేకత. చిత్రాలయా (చితరాల్)న్ని
దాటాక, పశ్చిమోత్తరానికి తిరిగాము. రెండురోజులు ఒక నదితీరాన్ననుస-
రించి ఎగువకు వెళ్ళాము, నావరకు నాకు, పసిరిక మైదానాలకు వెళ్తున్నట్లని-
పించింది. అలాగే కాళ్ళనెప్పులూ, అలసటా ప్రారంభించాయి. కొంత
దూరము ఎగువకుపోయాక క్రిందిప్రదేశాలకు సహజమైన చెట్లు మాయ-
మయ్యాయి. దేవదార్లు వెలిశాయి. ఉద్యాన ప్రదేశములో లాగానే రమ-
ణీయమైన పసిరికమైదానాలూ, సుందరమైన దృశ్యాలూ ఎన్నో కనుపిం-
చాయి. అగ్రామ కనుమను చేరడానికిముందే వృక్షాలు సమాప్తమయ్యాయి.
ఇంకా మేము ఎగువకు పోతూనేవున్నాము. కాంభోజభిక్షువుపేరు సుమ-
నుడు. అతడిలా అన్నాడు: "పచ్చని వృక్షాల్తోనిండిన అరణ్యాలనుచూడ-
డము ఇక దుర్లభమే!" అగ్రామ కనుమల్లో దొంగల భయంకూడా అధి-
కంగా వుంటుందని చెప్పాడు. భిక్షువులమైన మాకు దొంగల భయం
అంతగాలేదు. అసలు మా దగ్గిర ధనమేముంటుంది గనుక? అయినా,
యాత్రికులు ఒకరూ, అరా ఈ మార్గాల్ని ప్రయాణంచేయరు. వ్యాపారపు
గుంపు (సార్థ)ల్తో కలిసి వెళ్తుంటారు యాత్రికులు. మేమూ వొక వ్యాపా-
రపు గుంపును తోడుచేసుకున్నాము. మా గుంపులో యాత్రికులూ, వ్యాపా-
రులూ కలిసియాభై మందిదాకా వున్నారు. పణ్యవస్తువుల్ని గాడిదలమీదా-

గుర్రాలమీదా మోసుకు వెళ్తుంటారు. ఈ గుంపుకు నాయకుడు ఉద్యాన వాసియైన వ్యాపారి ఒకడు. అతడి పర్యవేక్షణలో కాశ్మీర, గాంధార దేశపు వ్యాపారులుకూడా కొంతమంది వస్తున్నారు. ఆనాడు సాయం సమయానికి ముందే ఒక చిన్న వనాన్ని చేరుకున్నాము. అక్కడ ఉద్యాన వాసులు కొందరు గుడిశలువేసుకు వుంటున్నారు. వచ్చేపోయే యాత్రికులకు అవసరమైన పశుగ్రాసాన్ని, వంటచెరుకునీ అమ్ముతుంటారు వాళ్ళు. ఆ రాత్రికి అక్కడే ఆగిపోయాము. మర్నాడు తెల్లవారు జామునే లేచి, వ్యాపారులకంటే ముందు ప్రయాణం సాగించాము. ముందుగా కొంత దూరం పోయి, వ్యాపారుల కోసరం నిరీక్షిస్తుందా మనుకున్నాము. ఈ కనుమ దాటితే మంచు మరీ ఎక్కువవుతుంది యాత్ర అంతా వ్యాపారపు గుంపుతో కలిసి చేయవల్సివుంటుందని తెల్సుకున్నాము. సాహసించి ముందుకు వెళ్ళినా, మళ్ళీ వెంటనే వ్యాపారపుగుంపును కలుసుకోగలమన్న ధైర్యముంది.

అర్ధరాత్రి సమయాన కొద్దిగా మంచు పడ్డది. మేము బయల్దేర బోయే సమయానికి మంచుపడడం తగ్గింది. ఆకాశం స్వచ్ఛంగా వుంది. వెన్నెల పిండారబోసినట్టు కాస్తోంది. కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాము. తిరిగి మహోత్సాహంతో ఎగువకుఎక్కుతున్నాము. మా నాడుల్లో యువక రక్తం తెర్లుతోంది.

కనుమవద్ద మంచు కొద్దిగానే పడ్డది. కానీ, ముందుకు పోయిన కొలది, ఎక్కువ మంచుపడుతుందని తెలుసుకున్నాము. చలి బాగావుంది. అయితే శీతాకాలంలో సుభూమి విహారంలో వేసేటంత చలే ఇక్కడా వుంది. పైగా మేము అన్నివిధాల చలినితట్టుకోవడానికి సిద్ధమైవచ్చాము. కనుక చలికి ఏమాత్రమూ భయపడలేదు. ఉన్నితో చేసిన శిరస్త్రాణాన్ని తలకు పెట్టుకున్నాము. ఉన్ని కంచుకాన్ని ధరించాము. ఉన్నిచీవరంతో శరీరమంతా కప్పేసుకున్నాము. మోకాళ్ళవరకూ వుండే పొడుగాటి పాద రక్షల్ని వేసుకున్నాము. ఈ దుస్తుల్లో ఎంత ఘోరమైన చలినైనా భరించ గలము. మేమేమంత చురుగ్గా నడవడంలేదు. మా వెనుక, కొద్దిదూరంలో వ్యాపారుల గుంపుకూడా వస్తూవుంటుంది అనుకున్నాము. పశువుల మెళ్ళోవి గంటల మోతలు వినబడతయ్యేమోనని కొద్ది క్షణాలు నిలబడి

విన్నాము. వినబడలేదు. బహుశా మేము చాలా ముందు బయల్దేరి వుంటాము. ఎగుడు కఠినమైందేమీ కాకపోయినా, మంచు అధికంగా వుండడమువల్ల మనుషులం త్వరగా అలసిపోతున్నాము. పైగా, రాత్రే మంచు విపరీతంగా పడినట్లున్నది. మార్గం కనబడకుండా మంచుతో కప్పబడిపోయింది. కాంభోజ భిక్షువు మూడేళ్ళక్రితం ఈమార్గాన ప్రయాణం చేశాడు. అతడికి తన జ్ఞాపక శక్తిపై పూర్తి విశ్వాసముంది. మిగిలిన నలుగురము కాంభోజ భిక్షువు ననుసరించి వెళ్తున్నాము. ఐదుగురుమూ కలిసే వెళ్తున్నాము. కాని, కొద్దిసేపటి తరువాత మేము నలుగురమే భిక్షువుల మున్నాం. అయిదవ భిక్షువేమయ్యాడు. ఇంతలో సుమను డిలా అన్నాడు: "ఈ కనుమలో రాక్షసు లెక్కువ. ఒంటరిగా వచ్చే యాత్రికుల్ని, మాయలుపన్ని దారి తప్పిస్తారు. తరువాత తినేస్తారు!" మేము వెనక్కి తిరిగి క్రిందికి వెళ్ళాము. కొద్ది దూరం వెళ్ళాక మా మిత్రుడి కేకలు వినిపించాయి. మరి కొద్ది క్షణాలు గడిచినట్లయితే, ఆమిత్రుణ్ణి శాశ్వతంగా గోల్పోయేవాళ్ళం. నేను వెళ్ళగానే ఘాటయిన మంత్రా న్నొకదాన్ని జపించాను. నా మంత్ర మహిమ వల్లనో లేక మేము నలుగురం రావడం వల్లనో రాక్షసు లా మిత్రుని వదిలి వెళ్ళిపోయారు. కొద్ది సేపటికి అతడు మన స్పృహకొచ్చాడు. మిత్రుని వెంటపెట్టుకుని తిరిగీ ఎగువకు ఎక్కడం ప్రారంభించాము. ఒక విశాలమైన పర్వతశిల సమీపాని కొచ్చాక ఆ భిక్షు విలా అన్నాడు: "ఇక్కడికి వచ్చాక నలుగురు భిక్షువులు అటు పోతూన్నట్టు కనుపించారు. మీరే అనుకుని నేనూ వాళ్ళవెంట వెళ్ళాను. కొంతదూరం వెళ్ళేసరికి వాళ్ళు నలుగురూ మాయమయ్యారు. వెంటనే సుమనుడు చెప్పిన మాటలు జ్ఞాపకమొచ్చాయి. పెద్దగా అరిచాను!" అని తన అనుభవాన్ని చెప్పాడతడు. అతడు ప్రాణాలతో తిరిగి మాలోకి వచ్చినందుకు చాలా సంతోషపడ్డాము, అయితే ఇప్పటికీ మేము ప్రమాద స్థితిని దాటలేదు. ఈ కనుమలో రాక్షసుల భయమూ అధికమే, దొంగల భయమూ అధికమే. మంచు అధికంగా పడడంవల్ల అడుగుల గుర్తులు నశించాయి. మేము సరైన మార్గాన వెళ్తున్నామో, లేక దారి తప్పామో సుమనుడికే తెలియడం లేదు. కొద్దిసేపు వ్యాపారపు గుంపు కోసరం ఎదురుచూస్తూ, ఆ పర్వత శిలవద్దే కూర్చున్నాము. పశువులొస్తున్న సవ్వడిగానీ, మనుష

లోస్తున్న అలికిడికానీ లేదు. మా తొందరపాటుతనానికి మాలో మేమే పశ్చాత్తాప పడుతున్నాము. కానీ, ఇక్కడ కూర్చోవడంవల్ల ప్రయోజనం ఏమిటి? వ్యాపారులు మాకంటె ముందే వెళ్ళిపోయారేమో? ఒకవేళ అలా ముందు వెళ్ళివుంటే మేము కలవలేదని, మా కోసరం ఆగి, వెనక్కి మనుష్యుల్ని పంపుతారన్న నమ్మకమూ అంతగా లేదు! అసలలా వెనక్కి మనుష్యుల్ని పంపించడాన్ని నేనూ ఒప్పుకోను. నలుగురి కోసరం నలభైమంది ప్రాణాల్ని బలిపెట్టడం నాకిష్టముండదు. అక్కడినుండి లేచి ఎగువకు ఎక్కడం ప్రారంభించాము. వెనుకటి జ్ఞాపకాల సాయంతో సుమను డెలాగో మార్గాన్ని చూపుతున్నాడు. ఎగుడు మరీ కఠినమైంది కాదు. కొంత కష్టంగానైనా ముందుకు వెళ్ళగలుగుతున్నాము.

మేము దారితప్పి చాలా దూరం వెళ్ళిపోయాము. ఎగువకంతా యెక్కి పర్వతంపైకి పోయాము. ఇక నక్కడనుండి దిగువకు దిగాలి. అప్పటికి ఇంకా సూర్యోదయం కాలేదు. అలాంటి స్థితిలో దిగువకు దిగడం కోరి ఆపదల్ని తెచ్చుకోవడమే అవుతుంది. సూర్యోదయం అయ్యేవరకూ అక్కడే కూర్చున్నాము. కొద్దిసేపటికి తూర్పు దిశన కాంతిరేఖలు ప్రస్ఫుటించాయి. నాలుగువైపులా కలయ చూశాము. మేము కూర్చున్న పర్వతం మే మనుకున్నంత పెద్దదికాదు. నాలుగు వైపులా చిన్ని చిన్ని స్తూపాకారాల్లో మంచుతో కప్పబడిన పర్వత శిఖరాలు అసంఖ్యాకంగా కనుపిస్తున్నాయి. బంగారు రంగు సూర్య కిరణాలు తెల్లని మంచు శిఖరాలమీద పడి అవి బంగారు రంగులో మెరిసిపోతున్నాయి. సుమేరు పర్వతశిఖరం అంతా బంగారమే నవి చదివాను. అదే విషయాన్ని కొందరు చెప్పగా విన్నాను. కానీ, ఇక్కడ వందల సంఖ్యలో బంగారు శిఖరాలు కనుపిస్తున్నాము. ఉద్యానవాసిని కావడం వలన, మంచుశిఖరాలపైన ఉదయపు సూర్యకాంతిపడడంవల్ల తెలుపూ, పసుపుపచ్చన కలిసిన కాంతి యెలా ప్రభవిస్తుందో నాకు తెలుసును. సుమేరు పర్వతం విషయమూ ఇంతే అయివుంటుం దనుకుంటాను. సుమేరు పర్వతం నిజంగానే బంగారం అయితే, క్రొత్తవిహారం నిర్మించుకోవడానికి మేము ఇన్నిపాట్లు పడవల్సిన పనేముంది? ఎలాగో ఆ

పర్వతాన్ని చేరి కావల్సినంత బంగారాన్ని తెచ్చుకునేవారం కామా ?

మేము సుమనుణ్ని అనుసరిస్తున్నాము. అతడు యెక్కడినుండి క్రిందికి దిగడమా అనేది నిర్ణయించుకోలేక సతమత మౌతున్నాడు. ఎక్కువకాలం అలా యోచిస్తూ కూర్చోవడానికి వీలులేదు. పొద్దెక్కి ఎండ తీక్షణమైతే, మంచు కరుగుతుం . అప్పుడు దిగడం అతి ప్రమాద కరం! మేము చివరకు ధైర్యంచేశాము. ఎలాఅయితే అలాఅవుతుందని దిగడం ప్రారంభించాము. ఆ సమయంలో బుర్ర ఏం పనిచేస్తుంది ? కంటిచూపునీ, కాలి వీలునీ అనుసరించి దిగిపోతున్నాము. అలా ఒక ఘడియకాలం గడిచి వుంటుంది. ఇంతలో మానవ స్వరాలేవో వినిపించాయి. వ్యాపారుల్ని కలుసుకోవచ్చుననే ఆనందంలో మానవస్వరాలు వినిపించిన వైపు పరుగెత్తాము. అక్కడున్నది వ్యాపారులు కాదు. కత్తులూ, కటార్లు ధరించిన బందిపోట్లు పదిమంది మమ్మల్ని చుట్టేశారు. సుమనుడికి వాళ్ళ భాష తెలుసును. వీళ్ళు కాంభోజ దేశపుదొంగలని చెప్పాడు. మేమయిదుగురమూ దారితప్పిన భిక్షువులమని తెల్సుకుని, దొంగలుచాలా నిరాశ పడ్డారు. సుమనుడు వాళ్ళకు కాంభోజ భాషలో "మా దగ్గిర ధరించిన వస్త్రాలూ, భిక్షాపాత్రలూ తప్ప మరేమీ లేవని" చెప్పాడు. భిక్షువులు దివ్యశక్తుల్ని కలిగి వుంటారనీ, వారికి మంత్రతంత్రాలు వచ్చుననీ దొంగలూ నమ్ముతారు. కనుకే మమ్మల్ని వాళ్ళేమీ బాధించలేదు. దొంగల నాయకుడు సుస్తీగావున్న తన భార్యకొరకు మంత్రపఠనచేసి. అంత్రమేదైనా ఈయవల్సిందని ప్రార్థించాడు. భూర్జపత్రాలూ, కలమూ సిరాబుడ్డీ ఎటూ సిద్ధంగానే వున్నాయి. భూర్జపత్రంపైన ఒక మంత్రాన్ని వ్రాసి "అంత్రా" న్నిచ్చాను. మేము ముఖ్యమార్గాన్ని తప్పామనీ, చాలా దూరం పశ్చిమానికి వచ్చేశామనీ చెప్పారు. అక్కడికి ఉద్యానదేశ సరిహద్దునకల తక్షకుండం చాలా దగ్గిర్లోనే వుందనీ చెప్పారు. కానీ, మేము మా వ్యాపారుల గుంపును కల్సుకోవడం చాలా ముఖ్యం. వాళ్ళే మా భోజనాదికాలకు తగిన ఏర్పాట్లు కావించి, తమ వెంట తీసుకుపోతున్నారు. అలాంటప్పుడు వాళ్ళనుకలుసుకోలేకపోతే, అన్నపానాదులు లేక ఆ మంచుకొండల్లో ప్రాణాలు వదలవలసి వస్తుంది. దొంగల నాయకుడు ఇద్దరు దొంగల్ని మాకు తోడు పంపాడు. రెండు ఘడియల ప్రయాణా

నంతరం ఆ గ్రామ కనుమ మార్గానికి వచ్చాము. అప్పుడే కురిసిన మంచు పైన మనుష్యుల, పశువుల, కాలిగుర్తులు స్పష్టంగా కనుపించాయి. దొంగలు మేము పోవలసిన దిశను చూపారు. మా ఆశీర్వాదాల్ని పొంది వెనక్కు వెళ్ళిపోయారు. ఇప్పటికి రెండు ప్రమాదాల్నుండి తప్పించు కున్నాము. కొద్ది క్షణాల్లోనే మంచుభూమిని దాటి మామూలు ప్రదేశానికి వచ్చేశాము. మా ఆనందానికి మేరలేదు. మహా ఉత్సాహంగా ముందుకు వెళ్ళిపోతున్నాము. సుమనుడు కూడా చాలా ఉత్సాహంలో వున్నాడు. జాము ప్రొద్దెక్కే సరికి బయలు ప్రదేశాన్నొకదాన్ని చేరుకున్నాము. అక్కడో నది. ఆ నది వడ్డుకు వెళ్ళి కూర్చున్నాము. ఇక వృక్షాల్నిగానీ, అరణ్యాల్నిగానీ చూడలేమని సుమనుడు ముందే చెప్పాడు.

శరదృతువు అంత్యానికొచ్చింది. పర్వతాలపైన ఎక్కడా పసిరిక కనుపించడంలేదు. వర్షాకాలంలో ఈ పర్వతాలపైన రెండుబారల పొడవు గల పచ్చిగడ్డి దట్టంగా మొలిచి, పర్వతుడనే మహారాక్షసుడికి మొలిచిన పచ్చని రోమాలా అనిపిస్తుంది. కానీ, ఇప్పుడీ పర్వతాలపైన నామ మాత్రమైనా పసిరికలేదు. మరికొద్ది దూరం పోయాక వ్యాపారుల్ని కలుసు కున్నాము. మా సార్థవాహు డొక రమ్య ప్రదేశంలో తన "సార్థా"న్ని ఆపాడు. కొందరు గుడారాల్ని పాతుతున్నారు. మరి కొందరు నిర్మల మైన ఆకాశం క్రింద సామాన్లు పడేసి నిశ్చింతగా కూర్చున్నారు. హిమా లయాన్ని దాటి ఉత్తరానికి వచ్చాక, ఇక వంట చెరుకును శాశ్వతంగా మర్చిపోవల్సిందే ! పశువుల ఎరువునే ఇక్కడ వంటచెరుకుగా ఉపయో గిస్తుంటారు. యాత్రికులు మజిలీలు చేసే ప్రదేశాల్లో ఎండిన పశువుల ఎరువు అత్యధికంగా లభిస్తుంది. అయితే, ఈ మజిలీలలో పశుగ్రాసం లభించదు. గ్రాసం కోసం పశువుల్ని చాలాదూరం వరకూ తోలిరావల్సి వుంటుంది. మేము నిరపాయంగా తిరిగి వచ్చినందుకు సార్థవాహుడు చాలా సంతోషించాడు. అసలు సార్థవాహులందరూ భిక్షువులపట్ల శ్రద్ధా సక్తుల్ని కనబరుస్తుంటారు. ఇక ఉద్యానదేశపు సార్థవాహుడి విషయం చెప్పనే అవసరంలేదు. ఏకదేశవాసుల మవడంవలన ఆత్మబంధువులుగా చూసేవాడు మమ్మల్ని. మేము దారితప్పినందుకు చాలాచింతించా డతడు. మేము ఐదుగురుమూ దైత్యబాధకు గురియై గతించి వుంటామనుకున్నా

రందరు ! పాపం వాళ్ళేం చేయగలరు? తమ వెంటనే ఉండవల్సిందని ఎన్నిసార్లు చెప్పలేదు గనుక? మేము వింటేగా? ఒకభిక్షువు దైత్యబాధకు గురిఅయికూడా నా మంత్రబలంవల్ల బ్రతికాడని తెల్సుకుని అందరూ సంతోషించారు. దైత్యబాధ తాలూకు తమ హెచ్చరిక నిజమైనందుకు గర్విస్తూనే నాలాంటి గొప్ప మంత్రవేత్త తమ వెంట వున్నందుకు ఆనందపడ్డారు. దొంగలను మేము వశపరచుకున్న విధం తెలుసుకుని ఎంతగానో ఇదయ్యారు. ఈవ్యాపారపు గుంపు పెద్దదవడంవల్ల సహజం గానే దొంగలెవరూ వీరి వంక కన్నెత్తి చూడలేకపోయారు. కానీ, సార్థవాహుని అభిప్రాయం మాత్రం వేరు. మేము తమ వెంట వుండడం వల్ల దస్యులబాధ సంభవించ లేని అతని ఉద్దేశము. ఈ దృష్టితో వెనుకటికంటెకూడా మమ్మల్ని ఎక్కువ గౌరవభావంతో చూడసాగారు.

ఆ రోజు మధ్యాహ్నం కాశ్మీర వ్యాపారులు గంధశాలి బియ్యాన్ని వండారు. ఉద్యానవాసులు చాలా ఇష్టంగా, చాలా ప్రేమగా మాంసం వండారు. మా అయిదుగురు భిక్షువుల్ని కూర్చోబెట్టి బహు ప్రేమతో భోజనం వడ్డించారు. రుచ్యమైన పదార్థాల్తో అలా భోంచేస్తూవుంటే మేమొక ఎడారిలో నిర్జన ప్రదేశంలో వున్నామన్న భావనే కలగలేదు. ఆనాడు పశువులూ, మానవులంకూడా చాలా కఠినమైన యాత్రచేసి అలసిపోయాము. ఇక నానాటికి యాత్ర చాలించి అక్కడే విశ్రాంతి తీసుకున్నాము. మరుసటిరోజు మళ్ళీ యాత్ర ప్రారంభించాము. కొండ లన్నీ, ఒకేరకంగా వున్నాయి. ఏ కొండనా, చెట్లుగానీ, మొక్కలుగానీ లేవు. కాకపోతే, అక్కడక్కడా పసుపు రంగుకు తిరిగిన గడ్డిపోచలు కనుపిస్తున్నాయి. ఆ కొండల్లో రాళ్ళకంటే మట్టే అధికంగావుంది. మేమొక నది వడ్డు ననుసరించి క్రిందికి దిగుతున్నాము. మొత్తం ప్రయాణంలో దృశ్యాలన్నీ ఒకేరకంగా వున్నాయి. పరిసరాల్ని పోల్చు కోవడం మాకో పెద్ద సమస్యగా తయారవుతోంది. ఉద్యానవాసులమైన మేము చలికాలంలోనూ పచ్చని దేవదారు వృక్షాలను చూస్తుంటాము. ఇక్కడి బోడిపర్వతాల్ని చూస్తూవుంటే, ఏదో చెప్పరాని శూన్యభావన మా మనసుల్లో మెదుల్తోంది. కొద్ది రోజులు అలాగే ప్రయాణం చేశాము. ఒకచోట మా మార్గం రెండుగా చీలిపోయింది. కుడివైపుగా కాంస్య

దేశం వెళ్ళే మార్గం వుంది. ఎడం వైపున కాంభోజ పురానికి మేము వెళ్ళే మార్గంవుంది. కాంస్య, కాంభోజ నగరాలకు రెండింటికీ వెళ్ళాలి. వ్యాపారుల్లో కొందరు కాంస్య దేశానికి కూడా వెళ్ళి వున్నట్లయితే, ముందు కాంస్య దేశానికి వెళ్ళడమా? లేక కాంభోజ పురానికి వెళ్ళడమా? అన్న సమస్య ఉత్పన్న మయ్యేదే. సార్థవాహు లందరూ కాంభోజపురానికి వెళ్ళేవారే! మేమూ ముందు కాంభోజ పురా నికే వెళ్ళ నిశ్చయించుకున్నాము. మేము అనుసరిస్తూన్న నదికూడ కాంభోజపురం వైపే పోతోంది. ఈ నది నీరు నీలిరంగులో వుంది. అందువల్లే అనుకుంటాను ఈ నదిని నీలం (కీకూచా) అంటారు. నదికి రెండు వైపులా అక్కడక్కడా చిన్నచిన్న గ్రామాలు కనిపిస్తున్నాయి. అయితే, అలాంటి పేదగ్రామాల్ని నే నింతవరకూ ఎక్కడా చూడలేదు. కపిశా దేశంలోనూ సస్యం తక్కువగానే వుంటుంది. కానీ, అక్కడి గృహాలు రాళ్ళ గుట్టల్లా వుండవు. ఈ కాంభోజ దేశంలో కొండలనూ, ఇండ్లనూ పోల్చుకోవడమే కష్టమవుతుంది. కొండలూ మట్టి రాళ్ళూ కలిసిన గుట్టలుగా వుంటాయి. ఇళ్ళూ అంతే! కాంభోజ ప్రజలు ఉద్యాన వాసులకంటె ఎర్రగా వుంటారు. ఎక్కడయినా ఒకడు దరిద్రకారణంగా బక్కచిక్కి వుంటే వుండవచ్చు. సాధారణంగా కాంభోజ ప్రజలు బలంగా అందంగా వుంటారు. కాంభోజ దేశపు గుర్రాలు మాత్రం నిజంగా అద్భుతంగా వుంటాయి. బలంగా, అందంగా, చేయి ఎత్తితే అందనంత ఎత్తుగా వుండి చూడ ముచ్చటగా వుంటాయా గుర్రాలు! కాంభోజదేశపు గుర్రాలు ప్రపంచ ప్రసిద్ధిని పొందాయి. ఇంత పేద దేశంలో, ఇలాంటి కొండ ప్రదేశంలో, ఇంతటి ఉత్తమ జాతి గుర్రాలు వుండడం ఎలా సంభవం అయింది? నేను ఆశ్చర్యంగా గుర్రాల మందల వంక చూడడాన్ని గమనించి "ఈ గుర్రాలు ప్రపంచ విజయుడు, యవన రాజు అయిన అలెక్సుందర్ (అలెగ్జాండర్) యొక్క సొంత గుర్రానికి పుట్టినవి!" అన్నాడు సుమనుడు. ఉద్యానదేశపు వ్యాపారులిలాఅన్నారు: "ఈ నల్లచెవుల గుర్రాలు చాలా శ్రేష్ఠమైనవి. పారసీక, చీనా దేశాల్లో కూడా ఇవి మంచి గిరాకిగా అమ్ముడుపోతాయి!" దారిలో కాంభోజ ప్రజల గ్రామాలే కాకుండా అక్కడక్కడా యేధాల గుడారాలుకూడా తగి

లాయి. అయితే, మాఉద్యానదేశములోనూ, యేధాలు వున్నారు. ఇక్కడి యేధాలు ఉద్యానదేశంలోని యేధాలకంటేకూడా అనాగరికులు, క్రూరులు! మా ఉద్యానంలోని యేధాలు ఇప్పటికి గ్రామవాసులు కాలేదు. తిరుగుబోతులుగానే వున్నారు. ఇక ఇక్కడి యేధాలు పూర్తి తిరుగుబోతులు. దయా, నమ్రత అనే గుణాలు వీరిలో వెదికినా కనిపించవు! కాంభోజ ప్రజలు సహజంగా పిరికివారు కాదు. కానీ, యీ యేధాలు తమ అనంతమైన క్రూరత్వంతో వాళ్ళని పిరికివాళ్ళుగా, భీరులుగా చేశారు. ఏధాలు గుర్రపు వెంట్రుకల్తో నేసిన గుడ్డతో డేరాలను వేసుకుంటారు. వీళ్ళకు తమ డేరాలే గ్రామాలు. మేము కాంభోజ (బదక్షా) పురిని సమీపించిన కొలదీ గ్రామాలసంఖ్యా, సామీప్యంకూడా వృద్ధవుతూన్నది. నదికూడా బాగా విస్తృత మౌతున్నది. సస్యశ్యామలమైన పంటచేలూ కనుపించ సాగాయి. కాంభోజపురాన్ని చేరేవరకు యేధాల గుడారాల నెన్నింటినో చూశాము. వాళ్ళ జీవితక్రమాన్ని అవగాహన చేసుకున్నాయి. వీళ్ళను ఉద్యానవాసులయిన యేధాలతో పోల్చడానికి వీలులేదు. వీరిపైన గ్రామ జీవిత ప్రభావంగానీ, నగర జీవిత ప్రభావంగానీ యేమాత్రమూ పడ లేదు. అయితే, సర్దారుల డేరాల్లోమాత్రం చీనాదేశపు పట్టువస్త్రాలూ, భారతదేశపు సన్నని నూలువస్త్రాలూ ఇతర విలువైన విలాస సామగ్రి కనుపిస్తూంటుంది. సర్దారుల దుస్తులు బాగా విలువైనవి. యేధాలు తాము పశుపాలు రయివందుకు గర్విస్తూంటారు. వీరికి చదువు సంధ్యల్తో పని లేదు. ఉన్నతమైన సిద్ధాంతాలుగానీ, ఆదర్శాలుకానీ వీరి కుండవు.

మా విహారానికి ఆర్థిక సహాయార్థమై కాంభోజపురానికి వచ్చాము. ఇక్కడ పద్మరాగాలూ, ఇతరవిలువైన రత్నాలూదొరుకుతాయి. రాజాశ్రయాన్ని పొంది వాటిని సంపాయించుకు వెళ్దామని మాఉద్దేశం. కాంభోజ దేశపురాజు బౌద్ధమతాభిమాని. ధర్మశీలి. అయితే ఇప్పుడతడు నామ మాత్రపురాజు. సర్వసంపదలూ, రాజశక్తి అన్నీ యేధాల చేతుల్లోకి పోయాయి. యేధా సర్దారు డొకడు కాంభోజపురంలో వుంటాడు. అతడి చేతిలో కాంభోజరాజు కీలుబొమ్మ! మొదటగా కాంభోజపురాన్ని వశపర చుకునేప్పుడు యేధాలు మహాక్రూరత్వాన్నీ, దోపిడీలనూ చేశారు. విహారాల నన్నింటినీ దోచేశారు. రాజవిహారం ఇప్పటికీ వుంది. దాన్లో ఓపాతిక

మంది భిక్షువులూ వున్నారు.అనాగరికులైన ఈ యేధాలు విహారాల ఆస్తి పాస్తుల్ని సంపూర్ణంగా హరించేశారు. కంచుతో, ఇత్తడితోచేసిన విగ్రహాల నెన్నింటినో కరిగించి అమ్మేశారు. బంగారు ఆకులపైన వ్రాసిన గ్రంథాలనూ, లతలూ, పుష్పాలూ చెక్కిన, బంగారు నీరు తీసిన ఇతర కళాత్మక సామగ్రినీ ఈమూర్ఖులు గట్టిబంగారమనుకుని కరిగించి, నాశనం చేశారు. ఎంతో కాలంవరకూ పవిత్ర దేవాలయాల్లో తిష్ట వేసుక్కూర్చున్నారు యేధా సైనికులు। కాంబోజపురంలోని ధార్మికులైన పెద్దలుకొందరు గుర్రాలనూ,ఇతర విలువైన వస్తువులనూ వారికిచ్చి దేవాలయాలను ఖాళీ చేయించారు. తోరమాణుడికి నాగరిక జీవితపు విలువలు తెలుసు. అతడి కాలంలో కాంభోజ దేశమూ, పురమూ కొంత ఉత్తమ స్థితిలో ఉన్నాయి. అతడు గతించి మిహిరకులుడు రాజయ్యాక యేధాసర్దారొకడు హిమలయాలకి ఉత్తరాన కల రాజ్యా లన్నింటినీ స్వాధీనపరుచుకున్నాడు.ఆనాటినుండి ఈనాటివరకూ కాంభోజదేశమూ, పురమూ అంధకారంలో పడి మ్రగుతున్నాయి. కాంభోజప్రజలంటే యేధాలకు ఏమాత్రం లక్ష్యం వుండదు· యేధాలదృష్టిలో కాంభోజప్రజలు తమగుర్రాలు మేసే గడ్డికంటె హీనులు। ప్రజలకు సంతోషంగా ఉండే అవకాశాన్ని ఇస్తే వారుఇంకా అధికంగా పరిశ్రమించి ధనధాన్యాలను ఉత్పన్నంచేస్తారన్న సామాన్యజ్ఞానం కూడాలేదు యేధాలకు. కాంభోజ దేశంలో ఉత్తమ జాతికి చెందిన గుర్రాలు దొరుకుతాయి. ఇక్కడి పద్మరాగాలు ప్రసిద్ధమైనవి. ఇనుము, సీసం, రాగి, గంధకం ఇంగువ మొదలైన పదార్థాలు ఇక్కడ దొరుకుతాయి. కానీ ప్రభుత్వం నిరంతరం ప్రజలను దోచుకుంటూ వుంటే, ఎంత శ్రమించినా తా మనుభవించే దేమీ వుండదనీ తెలిస్తే, ఇక నెవరు శ్రమిస్తారు? ధనోపార్జన ఎందుకు చేస్తారు ?

రాజ్య విహారంలోని భిక్షువులు మాకు ఘనంగా స్వాగతా నిచ్చారు. భారతీయ విద్వాంసుడిగా నాపట్ల గొప్ప గౌరవభావాన్ని ప్రకటించారు. ఆ దేశపు దుస్థితిని గురించి, విహారాల దుర్భర దారిద్ర్యాన్ని గురించి చెప్పారు. ఎవరైనా ఉపాసకులు గొప్ప దక్షిణను ఇచ్చినప్పటికీ, ఆ విషయాన్ని ప్రకటించడానికిగాని, ఆ దక్షిణతో విహారాల నలంకరించడము గానీ చేయరాదు. అలా చేస్తే మళ్ళీ యేధాలను దోపిడీకి ఆహ్వా

నించడమే అవుతుంది. భారతీయ భిక్షువులు వచ్చారని తెలిసి యేధా సామంతుడు మమ్మల్ని తమ వద్దకు పిలిపించాడు. ఇంతవరకూ నేను అనేక దేశాలు తిరిగాను. ఏ దేశపు రాజయినా, అతడు బౌద్ధ మతాభిమానికానీ, కాకపోనీ, భిక్షువులు తన వద్దకు వచ్చినప్పుడు ఆసనం నుండి లేచి నిలబడి, అభివాదనం చేస్తారు. కానీ, ఈ యేధా సరదారు మమ్మల్ని చూసి ఆసనాన్ని విడవలేదు అభివాదనమూ చేయలేదు. అతదలాగే ఆసనంమీద కూర్చుని వున్నాడు. సేవకులు మమ్మల్ని క్రిందపడివున్న ఆసనాలమీద కూర్చోమన్నారు. మే మీ స్థితిని ముందే యోచించుకున్నాము. స్థానిక రాజ విహారంలోని ఒక భిక్షువు మంత్ర విద్యలో కొంత ప్రసిద్ధిని పొందాడు అతడు ముందే నా గురించి కొంత అతిశయోక్తిగా సర్దారుకు చెప్పాడు. సుమనుడు, నేను దైత్యుడి చేతుల్లో పడిన భిక్షువును అద్భుతమైన మంత్ర శక్తితో రక్షించానని స్థానిక విహారంలో చెప్పి, ఒకరకంగా పై భిక్షువును అలా అతిశయోక్తులు చెప్పడానికి ప్రేరేపించాడు. బాధలు, రోగాలూ, కష్టసుఖాలూ, దరిద్రం ఎక్కడ వుండవు? ఏ దేశీయులుగానీ, ఏ జాతీయులుగానీ—కొద్ది గొప్పల వ్యత్యాసాల్తో మానవులందరికీ పై బాధలు వుంటాయి. వాటి నుండి రక్షణను పొందడానికి మానవులందరూ సమానంగా ప్రయత్నిస్తుంటారు. స్థానిక యేధా సర్దారొక సామంతుడు. పశ్చిమదేశంలోని ఒక యేధా రాజుకు ఇతడు అధీనుడు. తన దేశంలో ఇతడు స్వతంత్రుడే నిరంకుశుడే. కానీ, యేధా రాజుకు అధీనుడుగా ఉండడం ఇతడి కిష్టం లేదు. పైగా ఆ రాజు ఏ క్షణాన తనను ఖాళీచేసి, తన ప్రాంతాన్ని అతని రాజ్యంలో కలిపేసుకుంటాడోనని ఈ సామంతుడికి చచ్చేభయం. అరిష్టం శాంతించడానికి తన కొరకు మంత్ర పఠనం చేయమన్నాడు. మేమూ అన్యమనస్కంగానే మంత్రం పఠనం చేశాము. మేము వచ్చిన ఆశయాన్ని విని అతడు కొన్ని పద్మరాగ కణికల్ని ఇచ్చాడు. కాంభోజ రాజుకూడా కొన్ని కణికల్ని ఇచ్చాడు. అక్కడ లభించిన రత్నాలను ఉద్యానదేశపు సార్థవాహుల ద్వారా సుభూమి విహారానికి పంపించి వేశాను.

త్వరలోనే ఆ పరిసరంమీద విసుగు పుట్టింది. రాజవిహారపు

భిక్షువులు చలికాలమంతా మమ్మల్ని అక్కడే వుండిపొమ్మన్నారు. "రాబోయేది చలికాలం. కాంస్య దేశానికి వెళ్ళే సార్థవాహులు అన్నప్పు డల్లా దొరకరు. ఒకరో ఇద్దరో వెళ్ళడానికి సాహసించడం కావాలని మృత్యుముఖంలో తలదూర్చడమే అవుతుంది. అక్కడి ప్రజలు చలి కాలాన్ని గడవడానికి స్వయంగా నానా అగచాట్లూ పడుతుంటారు. చలి కాలాన్ని సుఖంగా గడపడానికి కావలసిన ఏర్పాట్లను మీకు వాళ్ళేమీ చేయలేరు!" అన్నారు. కానీ, వినుగుపుట్టి మనస్సుకు విరక్తి కలిగాక ఇక నక్కడ వుండడం ఎలా సంభవం? అక్కడలా వుండడమే జరిగితే చలికాలం గడిచి వసంతఋతువు వచ్చేవరకూ సార్థవాహులెవరూ దొరకరు! అంటే ఐదారు నెల్లవరకూ అక్కడే వుండిపోవాల్సి వస్తుంది! ఈ విషయం తెలిశాక అక్కడనుండి బయలుదేరి వెళ్ళి పోవడానికి మరీ తొందరపడ్డాము.

## బోలార్

ఇక మేము పామీరు పీఠభూమివైపు వెళ్ళాలి. దీన్ని అక్కడి ప్రజలు ఆకాశంలో వేలాడదీసిన దేశం అంటారు. నీలం నది వక్షూ నదిలోకి వెళ్ళి కలుస్తుంది. వక్షూ, సింధు, సీత - ఈ మూడు నదులు ప్రపంచ నదుల్లోకే పెద్దవి. అనేక చిన్ననదులు ఈ మూడు నదుల్లోకి వచ్చి కలుస్తుంటాయి. హిమాలయానికి ఇటుగా వున్న భూమంతట్లోను ఈ చిన్ననదులు వ్యాపించి వున్నాయి. హిమాలయం తరువాత ఆ గ్రామ కనుమను దాటాము. కనుమకు అవతల గల నదులన్నీ సింధులో కలు స్తుంటాయి. ఉద్యానవాసులం అన్ని నదులను 'సింధు'అనే అంటుంటాము. మే మెన్నో మార్లు మహాసింధును (సింధునదిని) దర్శించాము. కనుమకు ఇవతల కల నదులన్నీ వక్షూలో కలుస్తుంటాయి. కాంభోజపురి నుండి బయలుదేరి వక్షూనది వెంట ఎగువకు పోవాలి మేము. ప్రవాహపు వాలు ననుసరించి, దిగువకు గనక పోతే ప్రయాణం చాలా సుగమంగా సాగు తుంది. అడుగడుక్కీ గ్రామాలు తగుల్తాయి. కానీ మేము ప్రవాహానికి ఎదురుగా, వక్షూనదియొక్క పుట్టుక స్థానంవైపు పోవాలి. ఆ గ్రామ కను మను దాటాక వక్షూనదికి ఉపశాఖ ఒకటి తగిలింది. అక్కడే కాంస్య

దేశానికి వెళ్ళే మార్గాన్ని దాటాము. అయితే, మేము మళ్ళీ క్రిందకు వెళ్లి అదేమార్గాన ప్రయాణం చేయాల్సిన పనిలేదు. ఎగువకు వెళ్లికూడ కాంస్య దేశానికి వెళ్ళవచ్చును. ఆ గ్రామ కనుమను దాటాక ఇంకా కూడా అనేకమైన చిన్న పెద్ద కనుమల్ని దాటాము. ఈ కనుమలన్నీ వక్షూనదికి ఉపశాఖలైన చిన్నచిన్న నదీతీరాలకు సమీపంలో వున్నాయి. వక్షూ లాగానే సీత కూడా ఓ మహానది. "సీత"నది కాంస్య, కుశ(కూచా) దేశాల్లో ప్రవహిస్తూంది. ఇప్పుడు మేము(కాంభోజపురి) వక్షూనది ప్రదేశంలో వున్నాము. 'సీత' నది ప్రదేశంలోకి వెళ్ళాలి. ఈ రెండు నదుల ప్రదేశాలు కల్సుకునేచోట ఓ విస్తృతమైన,ఎత్తైన మైదానం వుంది. దీన్నే పీఠభూమి అంటారు. చీనా దేశీయులీ పీఠభూమిని పలాండుగిరి (చుంగ్ లింగ్) అంటారు. ఈ మైదానమంతా హిమాలయం లాగానే అనేక చిన్న పెద్ద పర్వత శిఖరాల్తో నిండి వుంది. హిమాలయ పర్వత శ్రేణుల్ని దాటేటప్పుడూ మేము చాలా బాధలను పడ్డాము. అయితే, పామీరు పర్వతశ్రేణుల్ని దాటేటప్పుడుపడ్డ బాధల ముందు హిమాలయపు బాధలు అసలు బాధలే అనిపించలేదు. ఇక్కడి దృశ్యాలు, చెట్లూ, చేమల్లేకుండా మహా ఎండుగా వున్నాయి.

మమ్మల్ని వక్షూ తీరాన గల వక్షూగ్రామం (కిలాపంజ) వరకూ పంపించడానికి స్థానికులే కొంతమంది తోడువచ్చారు. కనుక దారి తప్పుతామన్న భయం లేకపోయింది. కానీ, ఉద్యానంనుండి కాంభోజపురి వరకూ చేసిన యాత్రకంటే ఈ యాత్ర కఠిన మనిపించింది. ఒకదాని తరువాత ఒకటిగా కష్టా లనుభవిస్తూంటే ముందు అనుభవించిన కష్టం అల్పమైన దనిపిస్తుంది. వక్షూగ్రామానికి వచ్చాక యేధాలను వదిలించుకున్నందుకు చాలా సంతోషించాము. యేధాలు చాలా క్రూరులు. అకారణంగా మానవుల్ని హింసిస్తారు. భిక్షువులమైన మేము అలాంటి ప్రవృత్తుల్ని సహించలేము. ఈ గ్రామం వక్షూతీరాన వుంది. వక్షూనదికి ఉపనదులెన్నో వున్నాయి. మంచు కరిగి ఈ నదుల్లోకి ప్రవహిస్తూంటుంది. వక్షూనది యొక్క ఉపశాఖ తీరాల్లో నివసించే అందరు మానవులూ, తమ ఉపశాఖలే అసలు వక్షూనది అంటుంటారు. ఈ గ్రామప్రజలు తమ నదే అసలు వక్షూనదంటారు. అందుకు కావల్సిన నిదర్శనాల్ని ఈ విధంగా

చూపుతారు. "మానది చాలా విశాలమైంది ఇంతటి విశాలం మరే ఉప నదికీ లేదు. మా నదీతీర మైదానాన్ని వక్షూ మైదానమని ప్రాచీనకాలం నుండి అంటున్నారు. కనుక మాదే అసలు వక్షూనది!" అంటారు.

మేమీ దేశపు అతి నిమ్న ప్రదేశంలో వున్నాము. ఈ గ్రామము ఈ ప్రాంత గ్రామాలన్నిటిలోకి పెద్దది. పైగా రాజధాని. ఈ దేశంలో ఒక చిన్న గ్రామాధికారినికూడా రాజు అనే అంటారు. అతడి పల్లె ఇక విధిగా రాజధాని అవుతుంది. ఇది చాలా బీదదేశం. కనుకే యేధాలు ఇక్కడికి అంతగా రారు. స్థానిక రాజు గొర్రెల్ని, ఇతర వస్తువుల్ని కానుకగా ఏధాల వద్దకు పంపుతూంటారు. మేము ఇంతవరకూ గోధుమలు పండే ప్రదేశంలోనే వున్నాము. ఇంక ఒక్కరోజు ప్రయాణ దూరం ముందుకుపోతే గోధుమపంట కనుపించదు. కాండంలేని యవల పంటను పండిస్తుంటారు. ఇక్కడి యవరొట్టె బాగా రుచిగా వుంటుంది. వీళ్ళు యవలేకాక బటానీలనుకూడా పండిస్తుంటారు. ఎంత పండించినా వీరికి వ్యవసాయం ప్రధాన వృత్తికాదు. పశుపాలన వీరి ముఖ్య వృత్తి। ఒక్కో గృహస్తువద్దా వందల సంఖ్యలో మేకలూ గొర్రెలూ వుంటాయి.

చలి ముదిరింది. ఇక చలికాలం వెళ్ళేవరకు కాంస్య దేశానికి సార్థవాహులెవరూ యాత్ర చేయరు. నాలుగయిదు నెలలపాటు అదే గ్రామంలో వుండిపోయాము. ఇక్కడికి కొద్దిరోజుల దూరంలో, ఈశాన్య మూలగా సువర్ణ సరోవరం (జరకుల్‌కె) వుంది. ఆ సరోవర సౌందర్యాన్ని గురించి ఎన్నోవిధాల చెప్పుకుంటూ వుంటారు. పేరు సువర్ణ సరోవరం కానీ, నీళ్ళుమాత్రం నీలంగా వుంటాయి। వేసవిలో, హంసలూ, ఇతర జల - విహంగాలూ లక్షల సంఖ్యలో ఉంటాయిట। ఎండలు ముదిరేసరికి సరోవరం చుట్టూవున్న మంచు విడివడి గడ్డి మొలుస్తుంది. అప్పుడు పరిసర దృశ్యం మహా రమణీయంగా ఉంటుందట. ఆ సరోవరం చాలా పెద్దదట. పొడవు 12 యోజనాలు, వెడల్పు 7 యోజనాలూ వుంటుంది. ఆ సరోవరం వక్షూగ్రామానికి దక్షిణ దేశమైన జంబూద్వీపానికీ నట్టనడిమధ్యలో వుందని చెప్పుకుంటుంటారు. అక్కడ మహిమాన్వితులైన ఋషులుంటారనీ చెప్పారు. ఋషుల్ని

తప్పకుండా చూడా లనుకున్నాము. ఋషులు వుంటారని తెలిసి వెనక కూడా అనేక ప్రదేశాలకు వారి దర్శనం చేసుకోవడానికి వెళ్ళాము. కానీ, ఎక్కడా వారి దర్శనభాగ్యం లభించలేదు. అంతమాత్రంచేత నిరాశ చెందడం మానవ లక్షణంకాదు. వక్షూగ్రామంలోనూ ఒక బౌద్ధ విహారం వుంది. ఈ పరిసర ప్రజలు మానవజీవిత క్రమంలో చాలా వెనుకపడి వున్నారు. వీళ్ళ రాజుకూడా చర్మదుస్తుల్ని ధరిస్తుంటాడు. వీరి వద్ద నాగరిక విలాస జీవితానికి ఉపకరించే వస్తు వొకటీలేదు. కానీ, ప్రజలకు తథాగతునిపై భక్తిమెండు. భిక్షువుల్ని సత్కరించడానికి వీరుసదా సిద్ధంగా వుంటారు. భిక్షువులకొరకు తమ సర్వస్వాన్నీ ఖర్చుపెడతారు.

మేము స్వర్ణ సరోవరాన్ని చూసి రావా లనుకున్నాము. మాకు మార్గం చూపడానికి స్థానిక విహార భిక్షువు ఒకతడు సిద్ధమయ్యాడు. అవసరమైన ఆహార పదార్థా లన్నింటినీ గ్రామంలోనే తీసుకున్నాము. వాటిని మోయడానికి రెండు గాడిదలనూ, నలుగురు దాసులనూ ఇచ్చాడు ఆ గ్రామపు రాజు. ప్రయాణం కఠినమైందే అయినా, ఒక్క రోజులోనే సరోవరాన్ని చేరుకున్నాము. అప్పటికే చలికాలం ప్రారంభమయింది. సరోవరం వద్ద ప్రాణి చిహ్నమంటూలేదు. వేసవికాలంలో ఈ పరిసర మంతట్లోనూ పచ్చిగడ్డి ఏపుగా పెరిగి వుంటుందిట. ఆ పచ్చిగడ్డిని మేసిన పశువులు చర్మం చిట్లేట్లు బలుస్తా యంటారు. ఇక్కడి గాలీ, వాతావరణమూ అతిపవిత్రమూ, ఆరోగ్య ప్రదమూ అయినవట. క్రింది గ్రామాల్లోని రోగులు ఈ సరోవర తీరానికి వస్తే కొద్ది రోజుల్లోనే ఆరోగ్యవంతు లౌతారని చెప్తారు. ఈ సరోవరానికి సంబంధించిన పైవిషయాలు కొంత వరకు అతిశయోక్తితో కూడినవి. అయితే, ఉద్యానదేశపు మైదానాల గురించి మాకు బాగాతెలుసు. దాన్నిబట్టి, ఈ పామీరు మైదానం యొక్క ప్రశస్తిని వూహించగలము. సరోవరం అప్పటికింకా మంచుతో కప్పబడలేదు. మేము సాయం సమయాన అక్కడికి చేరాము. అప్పుడు గాలి తీవ్రంగా వుంది. పెద్ద పెద్ద అలలు లేస్తున్నాయి. అక్కడి దృశ్యం సింహళ ద్వీపపు సముద్రతీరాన్ని జ్ఞప్తికి తెచ్చింది. మరునాటి ఉదయానికి గాలి తగ్గిపోయింది. సరోవరం నిశ్చలంగా వుంది. విశాలమైన నీలినీరు మరకత మణిలా మెరుస్తోంది. వేసవి కాలంలో ఈ

ప్రదేశంలో పశువుల కాపర్లు డేరాలు వేసుకుంటారు. వారు పెరుక్కువెళ్ళిన డేరా మేకులగుర్తులు ఇంకా కనపడుతూన్నాయి. అక్కడ వంట చెయడు కోసం మేమేమీ కష్టపడలేదు. పశువుల పెంట బహుళంగా వుండక్కడ. దాన్నే వంట చెరుగ్గా వుపయోగించుకున్నాము. సరోవరాన్ని మా తం చూశాము. బుషు లెవరూ కనిపించలేదు. తిరిగి వక్షూ గ్రామానికి వచ్చేశాము. ఇక చలికాలమంతా ఆ గ్రామంలోనే వుండిపోవాలి.

వక్షూగ్రామ ప్రజలు సౌమ్యజీవనులు, సత్యప్రియులు. వారి నిరాడంబర జీవనం నన్నెంతగానో ఆకర్షించింది. విలువిద్యలో నేర్పరులు, మంచి వేటగాళ్ళు. సంఖ్యాబలం తక్కువైనప్పటికీ శత్రువులకు జడవరు. శత్రువును యెదిర్చి పోరాడడానికి వీలుగావుండే పర్వత ప్రదేశాల్లో గ్రామాల్ని కట్టుకుంటారు. పురుషులు చెట్ల బెరళ్ళనూ, ఆకుల్నీ కట్టుకుంటూవుంటారు. స్త్రీలు ఆకుల్నీ, బెరళ్ళనూ వుపయోగిస్తారు. అయితే "అధోవస్త్రం" తప్పనిసరిగా నూలుదే అయివుంటుంది. ఒక్కో "అధోవస్త్రా"నికి ఒక్కో తాను గుడ్డపడుతుంది. "అధోవస్త్రాని"కి యెంత యెక్కువ గుడ్డను ఉపయోగిస్తే అంత సౌందర్యము అభివృద్ధవుతుందని అక్కడి ప్రజల భావన. కొంతమంది స్త్రీలు అనేక పొరలుగా వస్త్రాల్ని ధరించి వికట నితంబిను లౌతారు. అలాంటి స్త్రీలు ప్రామాణిక సౌందర్యవతులుగా యెంచబడతారు. ఇక్కడి ప్రజలు ముఖ సౌందర్యంకంటే పిరుదుల సౌందర్యానికి ప్రాముఖ్యత నెక్కువగా ఇస్తూంటారు.

వక్షూగ్రామంలో మేము ప్రధానంగా మాంసాహారాన్ని తీసుకుంటూ వుండేవాళ్ళము. అప్పుడప్పుడూ పిండి, రొట్టెకూడా తినేవాళ్ళం. ఇక్కడి ప్రజలు చలికాలపు నాలుగు నెల్లకూ సరిపడే మాంసాన్ని ఒకే మారు ప్రోగుచేసి పెట్టుకుంటారు. ఆ నాలుగునెల్లూ విస్తారంగా మంచు పడుతూండడంవల్ల మాంసం చెడిపోదు. చలికాలములోనూ మధ్య మధ్య వేటాడి మాంసాన్ని తెస్తూంటారు ఆ విధంగా మాంసంనిలువ తరక్కుండా చూసుకుంటారు. ఇక్కడ తోడేళ్ళబాధ ఎక్కువ. తోడేలుబారిన పడ్డ గొర్రెలు, మేకలూ దొరికితే, వాటి చర్మాన్ని దుస్తులుగా వుపయోగిస్తారు

# 12 వ అధ్యాయం

# కాంప్యాలో ........

(క్రీ. శ. 551)

చలిబాధకు, నిజంగానే తట్టుకోలేకపోయాము. గ్రామస్తులు కటిక దరిద్రులు. కృషికి సౌకర్యాలు తక్కువ. పశుపాలన, వేటా ఈ రెండే ముఖ్యవృత్తులు వారికి! ఆ గ్రామ ప్రజలకు ఆహార సముపార్జన గొప్ప సమస్య! కాంభోజపురంలోని భిక్షువుల ప్రార్థనను అంగీకరించి, చలి కాలమంతా అక్కడే గడిపితే బాగుండేది కానీ, ఇప్పుడేం చేయడం! ముందుకు పోదామా అంటే, మంచు విపరీతంగా పడడంవల్ల మార్గా లన్నీ బందయ్యాయి. వెనక్కి పోవడం నాకూ, సుమనుడికీ ఎంత మాత్రమూ ఇష్టం లేదు! మిగిలిన భిక్షువులు మా అంత నిబ్బరమైన మనస్సు కలవారు కాదు. వారూ మాలాగానే దేశాటన ప్రియులే. సాహ సము కలవారే. అయితే, ఎంతవరకని? నూతన దేశాలను చూడాలనీ, కనీ వినీ ఎరుగని కష్టాలను ఆహ్వానించాలని, ఎంత మంది అనుకుం టారు? యెక్కడయినా ఒకరు సాహసించినా రోగాలూ, రొష్టులూ వెంబడిస్తే, నిబ్బాన్ని గోల్పోక ఏంచేస్తారు? బోలారుకు వచ్చాక మాలో ముగ్గురు జీర్ణాశయ రోగాలకు గురి అయ్యారు. ముగ్గురికి రక్తపు విరోచనాలు పట్టాయి. దాదాపుగా, ముగ్గురూ మృత్యుముఖంలోకి వెళ్ళిపోయారు. అయితే మృత్యుదేవత ఒకణ్ణే స్వీకరించింది. ఇద్దర్ని తిరస్కరించింది. బ్రతికి బయటపడ్డ ఇద్దరు భిక్షువులూ మళ్ళీ వేసవికాలం వచ్చేవరకూ చిక్కి శల్యమయ్యారు. వివిధ దేశాల్లోని మానవులూ, తమతమ దేశాల్లోని శీతోష్ణస్థితుల ననుసరించి తిండి— గుడ్డల్ని నిర్ణయించుకుంటూంటారు. శతాబ్దాల అనుభవం, ఏ కాలంలో

ఎలాంటి వస్త్రాలను ధరించవల్సిందీ, ఏకాలంలో ఏయే పదార్థాలను తిన వల్సిందీ,వారికి తెలియజేస్తూ వుంటుంది. భిక్షువులంఅందరి మానవుల్లా కాకుండా ప్రత్యేకమైన దుస్తుల్ని ధరిస్తాము. అయితే, బుద్ధుడు, వస్త్ర ధారణ తాలూకూ నియమాల నేర్పరచేప్పుడు, దేశగతమైన శీతోష్ణస్థితులను తప్పకుండా దృష్టిలో వుంచుకున్నాడు. శీతల దేశీయులైన భిక్షువులు ప్రత్యేకమైన వస్త్రాలను, పాదరక్షలను ధరించడానికి తథాగతు డనుమ తించాడు. సింహళదేశ భిక్షువుల వస్త్రధారణకు,ఉద్యాన భిక్షువులమైన మా వస్త్రధారణకూ చాలా వ్యత్యాసముంది.సింహళ భిక్షువులు కుడి భుజాన్ని అనాచ్ఛాదితంగా వదులుతారు. ఇతర దేశాల భిక్షువులుకూడా తమలాగే వస్త్రధారణ చేయాలని వారంటారు.కాని,ఉద్యాన భిక్షువుల్లా కుడిభుజాన్ని అనాచ్ఛాదితంగా వుంచితే చలికాలాన్ని ప్రాణాలతో గడపగలడా? బోలా రులో ఉద్యాన ప్రదేశంలో కంటే ఎక్కువగా చలి పెరుగుతుంది. భిక్షువులం సహజంగా నడుములకు బెల్టులాంటిది ధరిస్తుంటాము. కానీ, బోలారు భిక్షువులు నడుముకు బంధానికి బదులు రోమాలుకల చర్మపు పట్టీలను కడుపుకు కట్టుకుంటూ వుంటారు."ఇక్కడి చలికి ఈపట్టీలు కట్టుకోవడం తప్పనిసరయి వుంటుం" దని అప్పుడే అనుకున్నాను. సుమనుడు నాఅభి ప్రాయాన్ని అంగీకరించాడు. మేమిద్దరమూ బోలారుకులాగా కడుపుకు చర్మపు పట్టీలను కట్టుకోసాగాము. మిగిలిన ముగ్గురు భిక్షువులూ మొదట చర్మపు పట్టీలను కట్టుకోవడానికి వొప్పుకోలేదు. చలిదెబ్బకు జీర్ణకోశాలు చెడిపోయాక అంగీకరించారు. నేను తిరుగుబోతు ప్రవృత్తి కలవాణ్ణి. నాలాంటివాడు అడుగడునామృత్యువు నెదుర్కొనవలసివుంటుంది.అయితే అనవసరంగా, అకారణంగా, మూర్ఖమైన నియమాలతో జీవితాన్ని సమాప్తం చేసుకోవడం నా కిష్టంలేదు. ఇలాంటి కొన్ని జాగ్రత్తలవల్లనే ఇన్ని దేశాలు తిరిగికూడా ఆరోగ్యంగా వుండగలిగాననీ, కర్మణ్యుడిగా మనగలుగుతున్నాననీ అనుకుంటున్నాను.

ఇకముందు చేయవలసినయాత్ర, ఇప్పటివరకూ చేసిన యాత్రకంటే కఠినమైంది. రోగపీడితులైన ఇద్దరు భిక్షువులూ, శారీరకంగా ముందుకు రాగల స్థితిలోలేరు. వెనక్కి తిరిగి వెళ్ళవల్సిందని వారికి చెప్పాము. వారూ అందుకు వొప్పుకున్నారు. వసంత ఋతువు గడిచింది. వసంత

ఋతువు ఉద్యాన దేశంకంటే చాలా ముందు వస్తుంది ఇక్కడకు. ముందే గడిచిపోతుందికూడాను. మధ్యదేశంలో వసంత ఋతువు ఇక్కడి కంటే మూణ్నెల్లు వెనుకవస్తుంది. శీతల దేశవాసులే వసంతఋతువులోని నిజమైన ఆనందాన్ని అనుభవించగలరు. శరదృతువునుండి మోళ్ళయిన చెట్లన్నీ తిరిరి పచ్చని ఆకుల్ని తొడుక్కుంటాయి. రకకకాల పూవులూ వికసించి సువాసనలను గుబాళిస్తుంటాయి. వక్షూనదికి ఉత్తరంగా, ఈపీఠభూమిలో ప్రకృతిరూపమే వేరుగావుంటుంది. పెద్దపెద్ద వృక్షాలేవీ ఉండవిక్కడ. మంచు విడిపోగా పచ్చని పసిరిక మాత్రం మొలుస్తుంది. అక్కడక్కడా ఒకటీ అరా పూలమొక్కలూ, వికసించిన పూలు కనిపిస్తుంటాయి. ఇక్కడి పచ్చిగడ్డిని పశువులు మహా ఇష్టంగా తింటాయి. ఈ దేశ ప్రజలకు పచ్చని పసిరిక, వికసించిన పూలూ చాలా ప్రియమయిన వస్తువులు.

ఈ దేశం చాలా చిన్నది. చాలా బీదది. వ్యాపారం చేయాలన్నా కొంత పెట్టుబడి అవుసరమేగా? ధనంలేని కారణంగా ఈ దేశప్రజలు వ్యాపారం చేయరు. అన్యదేశాలకు పోరు. అయితే, వీరిపశువులు మోత మోయడానికి బాగా ఉపయోగిస్తాయి. చెదురుగా ఒకరూ అరా, మార్గదర్శకులుగానో, కూలీలుగానో సార్థవాహుల వెంట విదేశాలకు వెళ్ళి వస్తూంటారు. మేము కాంస్యదేశం వెళ్ళాలి. కాంభోజ, తుషార, కపిశ దేశాలనుండి కాంస్య దేశానికి వెళ్ళే సార్థవాహు లెవరైనా వస్తారేమోనని ఎదురుచూస్తున్నాము. సార్థవాహుల రాకను ముందుగా తెల్సుకునే సాధనాలు యేమీలేవు. కాకపోతే, క్రిందటి సంవత్సరం ఏయే తిథుల్లో సార్థవాహులొచ్చారో తెలుసుకుని, ఈ సంవత్సరమూ అవే తిథుల్లో వస్తారని ఎదురు చూడవచ్చు. అయితే, వచ్చిన ప్రతి సార్థవాహుడూ తన వెంట మమ్మల్ని తీసు వెళ్ళడానికి ఇష్టపడతాడని మాత్రం నమ్మకం ఏమిటి? సార్థవాహులకు యేవిధంగానూ మేము ఉపయోగపడము. పైగా మాకు ఆహారాన్ని ఇయ్యాల్సిన బాధ్యతకూడా వాళ్ళపైనేవుంటుంది. మమ్మల్నొక అనవసరమైన బరువుగా భావించి, వాళ్లు తీసుకువెళ్ళడానికి నిరాకరించినా ఆశ్చర్యపడనవసరం వుండదు. అయితే, సార్థవాహులు సాధారణంగా బౌద్ధమతాభిమానులై వుంటారు. భిక్షువుల్ని తమవెంట తీసుకుని వెళ్ళడం

వల్ల దైవికమూ, మానవీయము అయిన బాధలనుండి రక్షింపబడడమే కాక పుణ్యాన్ని ఆర్జించవచ్చునని వారి వుద్దేశం! కనుక మమ్మల్ని తమ వెంట తీసుకువెళ్ళడానికి సదా సిద్ధంగా వుంటారు.

మొదటగా బాహ్లికదేశం వెళ్ళే సార్థవాహు డొకడు వచ్చాడు. అతడి వెంట ఒక భిక్షువుకూడా వున్నాడు. ముందు భిక్షువును పరిచయం చేసుకున్నాము. అనేక దేశాలు పర్యటించి, కొంతవరకూ విద్యా గంధం కల మాలాంటి భిక్షువుల పరిచయం లభించినందుకు, చాలా సంతోషించాడా భిక్షువు! వెంటనే సార్థవాహుని వద్దకు తీసుకువెళ్ళి మమ్మల్ని పరిచయం చేశాడు. దారి ఖర్చుకు అవసరమైతే మావద్ద ఎలాగూ కొంతడబ్బు వుంది. మా పరిచయాన్ని పొందాక సార్థవాహుడు "నేను తమను కాంస్యదేశం వరకూ భద్రంగా తీసుకువెడతాను. ఆ దేశంలో భిక్షువుల్ని గొప్పగా పూజిస్తారు!" అని చెప్పాడు. అతడలా చెప్పాక మా కెంతో ధైర్యమొచ్చింది. ఇక మాకు డబ్బుతోకూడా ఏమీ పనిలేదు. మా దగ్గిర వున్న డబ్బును ఉద్యానదేశానికి తిరిగివెళ్లే భిక్షువులకు ఇచ్చి పంపాలనుకున్నాము. కొంత దారి ఖర్చుకు వాడుకున్నా, మిగిలింది విహారానికి చేరుస్తారు! మే మక్కడినుండి బయలుదేరక ముందే కాంభోజపురానికి వెళ్లే యాత్రికులు కొంతమంది వచ్చారు. అప్పటికి జబ్బున పడిన ఇద్దరు భిక్షువులూ బాగా కోలుకున్నారు. వాళ్ళ నా యాత్రికులతో కాంభోజపురానికి పంపించివేశాము.

ఇక మేము బాహ్లికదేశ సార్థవాహుడితో కాంస్య దేశం వెళుతున్నాము. వక్షుఉపనది నొకదా న్ననుసరించి తూర్పుదిశగా వెళ్ళిపోతున్నాము. కొన్నివారాల వరకూ ఒకేరకమైన ప్రకృతి దృశ్యాల్ని చూస్తూ ప్రయాణం చేశాము. విశాలమైన మైదానాల్లో వక్షునది సన్నని రేఖల్ని కల్పిస్తూ వంకలు తిరిగి పారుతోంది. నదికి దూరంగా చిన్ని చిన్ని మట్టి దిబ్బల్లాంటి బోడికొండ లున్నాయి. వాటిలో నిజంగానే రాళ్ళకంటే మట్టి ఎక్కువ! సార్థవాహుడు స్థానిక ప్రజల పశువుల్ని కొన్నింటిని అద్దెకు తీసుకుని, వాటిపైన పశుగ్రాసాన్ని, వంట చెరుకునీ, ఇతర పదార్థాలనూ మోయించుకు వస్తున్నాడు. మేము వెళ్తున్నది ఎగువకే అయినా, అంత కఠినమైన ఎగువకాదు. కాకపోతే, అక్కడక్కడా, కొండల్ని తొలిచి,

నదిఏర్పరచుకొన్న ఇరుకైన మార్గంగుండా ప్రయాణం చేయడం కొంచం కష్ట మనిపిస్తోంది. రెండు రోజుల ప్రయాణానంతరం పూర్తి నిర్జన మైన ప్రదేశానికి వెళ్ళిపోయాము. పరిసరంలో ఎక్కడా గ్రామాలు గాని, మానవ సంచలనంగానీ లేదు. చలికాలం వెళ్ళి, పచ్చిగడ్డి పెరిగాక, పశుల కాపర్లు తమ మందల్తో ఇటువస్తారు. ఆ సమయంలో మాత్రం ఈ పరిసరం మానవ సంచలనాల్తో, పశుస్వరాల్తో ప్రతిధ్వని స్తుంది! సంవత్సరాని కోమాటు పసిరిక ఇక్కడి ప్రకృతికి జీవం పోస్తూవుంటుంది.

ఇప్పటివరకూ నేనుచేసిన యాత్రల్లోకి ఇదే కష్టతరమైన యాత్ర. అసలు నిజమైన యాత్ర ఇదే నేమో అనిపించింది. ముందుకుపోతూ న్న కొలదీ, నూతన ప్రదేశాలనూ, కష్టాలనూ ఎదుర్కొంటూన్న కొలదీ బుద్ధిలుడు జ్ఞాపకం వస్తూండేవాడు. "బుద్ధిలుడు వెంట వుంటే, ఈయాత్ర, ఎంత ఆనందదాయకంగా వుండేదో!" అనుకున్నా నెన్నోమార్లు. సుమ నుడూ నాకెంతో ప్రియమిత్రు డయ్యాడు. అయితే, వయస్సులోనేకాక, విద్యలోకూడా అతడు నాకంటే చిన్నవాడు. అతడి నుండి నేను నేర్చుకో వలసింది ఏదీవుండదు. మనస్సు విప్పి నా సంశయాలనూ, సమస్యలనూ అతడికి చెప్పుకోవడమూ కష్టంగా వుండేది. నాలుగు రోజుల పరిచయం తరువాత బాహ్లీకదేశపు భిక్షువుకూడా సుమనుళ్ళాగానే మంచి గుణాలు కల వాడని తెల్సుకున్నాను. యాత్ర సుఖకరంగా గడవాలంటే, సహయాత్రికు లైన భిక్షువుల్లో కొన్ని ప్రత్యేక గుణాలూ, లక్షణాలూ వుండాలి. అలాంటి ప్రత్యేక గుణాలు సుమనుడిలోనూ, బాహ్లీక భిక్షువులోనూ వున్నాయి. అయితే, వారు నన్ను సమవయస్కుడూ, సహచరుడూ అయిన భిక్షువులా కాక, గురువులా భావిస్తుంటారు. గురువు – శిష్యుల మధ్య, తండ్రీ కొడుకుల్లో వుండే వ్యత్యాసం వుంటుంది. సుమనుడికీ నాకూ మధ్య, బాహ్లీక భిక్షువుకూ నాకూ మధ్యకూడా అంత వ్యత్యాసం వుంది. అది నాకు ఇష్టంలేదు, నాతోటి భిక్షువులు నన్ను గౌరవిస్తారు నామీద గురుభావన వుంచుతారు. కానీ, నేను కోరేది మిత్రత్వం .... బుద్ధిలుడు పోయాక మిత్రత్వపు కొరత నా హృదయంలో తీరని ఆరా టాన్ని కలిగిస్తూనేవుంది. బుద్ధిలుడు నిరంతరం జ్ఞప్తికి రావడానికి

కారణం, అంతటి మిత్రుడు ఇక నాకు లభించక పోవడమే అనుకుంటు న్నాను. రాజ్యాలకు సరిహద్దులున్నట్లే నదులకూడా సరిహద్దులుంటాయి. రాజ్యాల సరిహద్దులను దాటేప్పుడు మానవకృతమైన బాధలెన్నో సంభ విస్తాయి. అయితే, సార్థవాహులు తమ రాజ్య సరిహద్దుల్లోకి రావడానికి ఏ రాజూ అభ్యంతరాన్ని చెప్పడు. కానీ, నదుల సరిహద్దుల్ని దాటడం చాలా కష్టసాధ్యం! ఇప్పుడు మేము వక్షూనది ప్రాంతం నుండి, 'సీత' నది ప్రాంతానికి వెళ్ళాలి. వెనుక సింధు ప్రాంతాన్ని దాటేప్పుడు ఎంత బాధ పడ్డామో ఇప్పుడు వక్షూ ప్రాంతాన్ని దాటటానికీ అంతే బాధ పడ వల్సి వుంటుంది.

వక్షూనది నుండి సీత(తరిం) నదివైపుకు వెళ్తున్నాము. నడవడం దుర్భరం అనిపిస్తోంది. పదడుగులు వేసేసరికి ఆయాసం వచ్చేస్తోంది. మధ్యాహ్నానంతరం తీవ్రమైన ఈదురుగాలి వీచేది. చలికి శరీరం కొంగర్లెత్తేది. మహోధృతమైన ఆ గాలిలో శ్వాస పీల్చుకోవడమే కష్ట దాయకంగా ఉండేది. పోనీ, ఉదయం పూటనే ప్రయాణం చేద్దామా అంటే, నీరు గడ్డకట్టేంత చలిగావుంది. దారిలో ఎక్కువనీరు లభించేది కాదు. నీరంతా మంచులా గడ్డగట్టుకుపోయేది. రెండు జాములు దాటాక మంచు కరిగేది. ఇక అప్పటినుండి గాలి తీవ్రత హెచ్చేది. అప్పు డప్పుడూ వర్షం కురిసేది. అయితే, అది నీటి వర్షంకాదు. మంచువర్షం. చివరి గ్రామాన్ని వదిలాక నాలుగు రోజులవరకూ ఎగువకు ఎక్కాము. అక్కడో కనుమను దాటాము. కనుమకు అటువైపునున్న నదీతీరా న్ననుసరించాము.

బోలాన్ నుండి తెచ్చుకున్న పశుగ్రాసం, ఇతర పదార్థాలూ కను మను సమీపించేసరికి అయిపోయాయి. అక్కడనుండి వచ్చిన గాడిదలూ, సేవకులూ మమ్మల్ని కనుమవద్ద వదిలి వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు. కొంతదూరం నదీతీరాన వెళ్ళాక, ఉత్తర దిశకు మళ్ళిందా నది. అక్కడి నుండి చూస్తే తూర్పు దిశగా హిమాచ్ఛాదిత పర్వత శ్రేణులు కనిపిం చేవి. వాటిని ఖసగిరి పంక్తు లంటారు. ఆ పర్వతాల పేరు విన్నాక "వీటికీ మా జాతికి ఏమైనా సంబంధం వుందా?" అని చాలా రోజుల వరకూ ఆలోచిస్తూండేవాణ్ణి. ఈ విషయాన్ని గురించి యోచిస్తూనే ఆ

నిర్జనభూమిలోని అనేక క్రోసుల దూరాన్ని నడిచాను. అక్కడక్కడా మేషపాలుర గుడారాలు కనిపించేవి ఆ మేషపాలురు బహుకొద్ది ఆహారాన్ని మాత్రమే వెంట తెచ్చుకుంటారు. కనుక ఎలాంటి స్థితిలోనూ ఎంత డబ్బిచ్చినా ఆహారాన్ని మాత్రం ఇచ్చేవారుకాదు. కాకపోతే ఏ కొద్దిగానో మాంసాన్నిచ్చేవారు. మరికొంతదూరం పోయాక కుడివైపుగా ఒక సరోవరం కనిపించింది. సువర్ణ సరోవరం ముందు యిదో చిన్న నీటిగుంటలావుంది. అయినా, నిర్మలమయిన స్వచ్ఛసమృద్ధ సరోవరాన్ని చూసేసరికి పోయిన ప్రాణాలు లేచివచ్చిన ట్లయింది. ఆ సరోవరంలో ఎన్నో జలపక్షులు ఈదులాడుతున్నాయి. హిమాలయానికి సుదూరాన, ఉత్తరంగా కల ఈ శీతల దేశాల్లో, సరోవరాల్లోని మంచుకరిగి, పక్షులు ఈదులాడుతున్నా యంటే, మధ్య దేశంలో నిప్పులు చెరిగే ఎండలు కాస్తుంటా యన్నమాట. తరువాత రెండు హిమశిఖరాల మధ్యగుండా తూర్పుగా కొంత దూరం ప్రయాణంచేసి ఒక పెద్ద సరోవరం చేరుకున్నాము. ఆ సరోవరం పేరు శిలాపతి। అప్పటికి రెండు రోజులనుండీ మంచు పడడంలేదు. ఈ రెండు రోజులోనే సర్లోవరప్రాంతాల్లో వేసవి లక్షణాలు కనిపిస్తున్నాయి. చాలా దూరంగా, మూడు వైపులా మూడు కొండ లున్నాయి. ఆ కొండల్నానుకొని విస్తృతమైన ఇసుక ప్రదేశం వుంది. ఆ ఇసుక ప్రదేశంలోనే అనతిదూరం వరకూ వ్యాపించి వుంది సరోవరం. ఇసుక భూమి సరోవరం యొక్క వ్యాప్తిని చాలావరకు అడ్డగించింది. ఇసుక ప్రదేశమే గనుక లేకపోయినట్లయితే సరోవరం పర్వతాలవరకూ వ్యాపించి మహా విస్తృతిని పొందేది. త్వరలోనే ఒక గ్రామాన్ని చేరుకున్నాము. ఖసగిరి (కాశ్గర్) నగరం దాపుకొచ్చాము. అప్పటికి ఎన్నో రోజులుగా పశువులకు కడుపునిండా మేతలేదు. మనుషులూ తిండికి కటకటపడ్డారు. ఖసగిరిలో అవసరమైన పదార్థాలెన్నింటినో కొనుక్కోవాలి. ఇంత దీర్ఘయాత్ర చేసినందుకు పశువులకూకొంత విశ్రాంతి నీయడం అవసరం। ఖసగిరిలో ఐదు రోజులుందామన్నాడు సార్థవాహుడు.

దుర్గమమూ, దుర్లంఘ్యమూ అయిన మంచు కొండల్ని దాటి కాంస్య దేశానికి వచ్చాము. నేనెంతో ఆనందాన్ని, గర్వాన్ని పొందాను.

ఖసగిరిలో మేము విడిది దిగిన ప్రదేశానికి దాపులో ఒక సరోవరం వుంది. సరోవర తీరాన ఒక విహార ముంది. మరుసటిరోజు మేము ముగ్గురం ఆ విహారాన్ని చూడడానికి వెళ్ళాము. భారతీయభిక్షువు నవడం వల్ల నా మీద సహజంగానే శ్రద్ధాభక్తుల్ని కనబరిచారు. కాంస్య దేశాన్ని గురించి నే విన్న మాటలు నూటికి నూరుపాళ్ళూ నిజమయ్యాయి. వాళ్ళు నిజంగానే దేవుడిలా పూజిస్తారు. మేమూ, స్థానిక భిక్షువులూ చాలాసేపు మాట్లాడుకున్నాము. కాంస్య దేశానికి సంబంధించిన అనేక విషయాలను తెలుసుకున్నాము. కాంస్య దేశంలో అనేక రాజ్యాలున్నాయి. వివిధ రాజ్యాల్లోనూ ప్రజలు వేరు వేరు భాషల్ని మాట్లాడుతూంటారు. కానీ, అక్కడి ప్రజలు సాధారణంగా రెండు భాషల్ని మాట్లాడుతూంటారు. ఒకటి తమ మాతృభాష. రెండవది మధ్యదేశపు భాష! కాంస్య దేశపు భిక్షువుల్లో విద్యాప్రేమ అధికం! ప్రజలు ఉద్యాన వాసుల్లాగానే ఉంటారు. కాకపోతే, వారిలోని ప్రత్యేకత నీలి కండ్లు, రాగిజుట్టు!

పరిచయమయ్యాక విహారంలోని భిక్షువులు తమ వద్ద కొద్దిరోజులు వుండిపోవల్సిందని బలవంతం చేశారు. వారిమాటను కాదనలేక పోయాము. సార్థవాహునివద్ద సెలవు పుచ్చుకొని విహారంలోకి వచ్చాము. ఇకపైన మార్గం సుగమంగా వుంటుంది. గ్రామాలు దూరదూరంగానే వున్నప్పటికీ ప్రజలు వస్తూ పోతూవుంటారు. అతిశీతలమైన పామీరు పీఠభూమిని నడిచాము. ఇకమీద ఉష్ణప్రదేశాల్లో ప్రయాణం చేయాల్సి వుంటుంది. వెనుకే అత్యుష్ణప్రదేశాల్లో యాత్ర చేశాను. ఉష్ణదేశాల పేరు వింటేనే భయపడే స్థితి ఇప్పుడ్లేదు. 'శిలావతి' ఓ చిన్న విహారం! అక్కడి భిక్షువులు నన్నో మహాపండితుడిగా భావించేవారు. ప్రమాదవశాత్తు తగులబడిపోయిన మా విహారాన్ని పునర్నిర్మించుకోవడానికి, ధనార్జనకొరకు, ఈ కాంస్య దేశం వచ్చాము. దేశపు ఆర్థికస్థితిని గురించి భిక్షువుల్నడిగాను. వారి సమాధానం చాలా నిరాశను గొలిపింది. దేశం మాకేవిధంగానూ సహాయంచేసే స్థితిలో లేదు. ఆవారులు హూణ వంశజులు. హూణుల్లాగానే వీరు క్రూరులు, తిరుగుబోతులు! వెనుక ఖసగిరి (కాశ్గర్), కుస్తన్ (ఖోతన్), కూచా మొదలైన నగరాలను

స్థానిక రాజులు పరిపాలిస్తుండేవారు. ఇప్పుడా స్థానిక రాజులందరూ ఆవారులకు అధీనులయ్యారు. ఈ ఆవారులు ప్రజారంజకులు కాదు. ప్రజల రక్తమాంసాల్ని పీల్చడమే వీరి ప్రధానాదర్శం। త్యోర్కులు కూడా వెనుక ఈ ఆవారులకు అధీనులే। కానీ, ఇప్పుడు గర్భ శత్రువు లయ్యారు. కొన్ని సంవత్సరాల నుండి త్యోర్కులు విప్లవాలను లేవ దీస్తూ, తమ యజమానులైన ఆవారుల శక్తిని క్షీణింప చేస్తున్నారు. అసలు కాంస్య దేశీయులకు ఆవారులంటే ఏ మాత్రము గిట్టదు. తెల్లని గుడ్డ డేరాల్లో వుండే తిరుగుబోతులైన ఆవారులు ఎవరినీ లెక్కపెట్టరు. తమ స్వార్థమే వారికి ముఖ్యం. కనుకనే అక్కడి ప్రజలు ఆవారులకు అహితులయ్యారు. వారి సర్వనాశనాన్ని కాంక్షిస్తున్నారు. అప్పుడప్పుడు త్యోర్కులు ఆవారుల్ని ఓడించారన్న గాలివార్తలు దేశంలో వ్యాపిస్తుంటాయి. కానీ, ఆవారులు పల్లెలకు వచ్చి దోపిడీలు చేస్తున్నన్నాళ్లూ, వాళ్ళు పరాజితులయ్యారని ఎలానమ్మడం? ఈసంవత్సరం(551క్రీ.శ.) వచ్చిన వార్త గాలివార్త కాదు, నిజమైన వార్తే నంటున్నారు. త్యోర్కుల నాయకుడు తూమిన్ ఆవారుల్ని ఘోరంగా ఓడించాడట. అసంఖ్యాకులైన శత్రువుల్ని హతమార్చి "ఇలిఖాన్" అనే పేరుతో సింహాసనాన్ని ఎక్కడంతో ఓ నూతన త్యోర్కు రాజవంశం ప్రారంభమైంది. నూతనంగా ప్రారంభమైన ప్రతి రాజవంశమూ ప్రజల మాన ధన ప్రాణాల నపహరించడం తన కర్తవ్యం అనుకుంటుంది. త్యోర్కులు కూడా "కూచా"కు అవతలి దేశాల్లో గ్రామాల్నిదోస్తున్నారనీ, శక్తివంచన లేకుండా ప్రజల మాన ధన ప్రాణాల్ని హరిస్తున్నారని వినికిడి।

త్యోర్కులు సింహాసనాసీను లయ్యారని తెలియగానే కాంస్యదేశపు గతి దుర్గతయిందనుకున్నాను. ఇక ఏ క్షణాన్నయినా త్యోర్కులు ఈ దేశంమీదకు వచ్చిపడతారు. ఆవారులు మిగిల్చిన రక్తమాంసాలను పీల్చి ప్రజలను శల్యావశిష్టుల్ని చేస్తారు. ఇలాంటిస్థితిలో కాంస్య దేశాన్నుండి సహాయాన్ని ఆశించడం, దురాశే అనిపించుకుంటుంది. అయితే నాయీ యాత్రకు కేవలం ధనార్జనే ఆదర్శం కాదు. దేశాటన తాలూకు గాఢమైన తిరుగుబోతు ప్రవృత్తి నన్నీ యాత్రకు పురిగొల్పింది. ఉద్యానదేశపు భిక్షు

వులు తిరిగి వెళ్ళిపోవడం నాకు కొంత ఆనందాన్ని కలిగించింది. వాళ్ళే వుంటే ధనార్జనను గురించిన ఆలోచనలు నన్ను బాగా హింసించేవి. అవిరళకృషి సలి తే నాలుగయిదు తులాల బంగారాన్ని సంపాయించ గలిగేవాణ్ణేమో। ఈ స్వల్పమొత్తంతో ఏమిటి జరుగుతుంది? డబ్బు సంపాయించాలన్న భావనను పూర్తిగా మర్చేపోయాను. బుద్ధిలుడూ, నేనూ ఏ ఉన్నతాశయాన్ని నిర్మించుకున్నామో, ఏ ఆదర్శాన్ని గురించి సంవత్సరాల తరబడి చర్చించుకున్నామో-ఆ ఆశయాన్ని, ఆదర్శాన్ని నిర్వహించాలని నిశ్చయించుకున్నాను।

శిలాపతి విహారంలో కొద్దిరోజులు గడిపాము. ఒకరోజు కొద్దిగా వర్షం కురిసింది. అయితే, భిక్షువులు భాద్రపదం నుండి వర్షావాసాన్ని ప్రారంభిస్తారు. సాధారణ ప్రజలకు శ్రావణ మాసంతోటే వర్షాకాలం ప్రారంభమౌతుంది.వినయపిటకం భాద్రపదంనుండి భిక్షువులు వర్షావాసపు నియమాన్ని పాటించవచ్చు నంటుంది. అంటే ఇంకో నెల రోజులు మాత్రమే చారిక చేయగలమన్నమాట! శిలాపతి భిక్షువులు వర్షావాసాన్ని తమ విహారంలోనే గడపవల్సిం దన్నారు. కానీ, మేము ఖసగిరికి వెళ్ళి అక్కడే వర్షావాసాన్ని గడప నిశ్చయించుకున్నాము. ఇక్కడికి ఈశాన్య దిశగా రెండురోజుల ప్రయాణదూరంలో వుంది ఖసగిరి। అక్కడికి వెళ్ళాము. పట్టణానికి చుట్టూవున్న గ్రామాలు చాలా బీదవి। అయితే పచ్చగా కళకళ్ళాడుతూన్నాయి. గ్రామాల చుట్టూ పండ్లతోటలూ, పంట చేలూ వున్నాయి. ప్రతి గ్రామంలోనూ తప్పనిసరిగా విహార ముంది: భిక్షువు లున్నారు. విహారాల్నానుకనివున్న ద్రాక్ష పందిళ్ళు,పూలతోటలు గ్రామసౌందర్యాన్ని ఇనుమడింపచేస్తున్నాయి. ఖసగిరిపరిసరాల్లో ప్రత్తి ఎక్కువగా పండుతుంది. మధ్యదేశీయుల్లాగానే అక్కడి ప్రజలు నూలు వస్త్రాల్ని అధికంగా ధరిస్తుంటారు. అయితే, చలికాలంలో మాత్రము ఉన్నివస్త్రాల్ని ధరిస్తుంటారు. ఖసగిరి నగరం 'ఖస' నదీతీరంలో వుంది. ఈ పట్టణంలో నేర్పరులైన శిల్పులున్నారు. వివిధ లోహాలపైన పాషాణాలపైన సౌందర్యంతో విలసిల్లే అపూర్వమైన రూపాలను మలు స్తారు ఇక్కడి శిల్పులు। ఈనగరపు అభివృద్ధికి ముఖ్యాధారం వాణిజ్యం। ప్రపంచములోని వివిధదేశాల వ్యాపారుల్ని ఇక్కడచూడవచ్చు। చీనా

దేశపు పట్టువస్త్రాలు ఇక్కడినుండే పశ్చిమ దేశాలకు వెళతాయి. ఖస గిరినుండి "సొగ్ద"కు వెళ్ళడానికి ప్రత్యేక మార్గముంది. యిక్కడికి ఉత్తరాన కల తిరుగుబోతు జాతుల దేశాలకు వెళ్ళే సార్థవాహాలు ఇక్కడి నుండే బయలుదేరుతారు. నే నింతవరకూ శైవుల్నీ, నిర్గంథ ధర్మావలంబుల్నీ (జైనులు), పారశీకుల్నీ మాత్రమే చూశాను. వీరి దేవాలయాలకు, విహారాలకూ మాత్రమే వెళ్ళాను. ఈ ఖసగిరిలో యింకా కూడా అనేక మతాలవారిని చూశాను. వారి వారి దేవాలయాలకు వెళ్ళాను. ఈ పట్టణంలో మసీహీ (నెస్తొరీ) భిక్షువుల్ని చూశాను. వారి మతాన్ని దర్శించాము. పారసీక మతంలోనే "మానీ" సంప్రదాయ మొకటుంది. ఈ సంప్రదాయా న్ననుసరించే భిక్షువులు తెల్లని వస్త్రాల్ని ధరిస్తుంటారు. శ్వేతవస్త్రధారులయిన "మానీ" స్యనాసులనూ, సన్యాసినులనూ చూశాను. దుర్గమమైన పర్వతాల మధ్య యిలాంటి పట్టణ ముంటుందని నేను కలలోకూడా వూహించలేదు. ఖసగిరి ప్రజలు ఉదారులు,విద్యావంతులు, విద్యాప్రియులు। కాంస్య దేశంలో ప్రధానమతం బౌద్ధమే అయినప్పటికీ, ఇంకాకూడా అనేక మతా లున్నాయి. ప్రజల్లో సంకుచిత తత్వం లేదు. వివిధమతాల వారూ సోదరుల్లా మెలుగుతారు. యిక్కడి రాజులూ, రాణులూ వస్త్రధారణలో యేధా సామంతులను అనుకరిస్తూంటారు. స్త్రీలు తలపైన రంగు రంగుల టోపీలను ధరిస్తారు. పైజామాపైన మోకాళ్ల వరకూ వుండే నిడుపాటి చొక్కాలను ధరిస్తారు. లోపల ధరించిన కంచుకమూ, విలువైన ఆభరణాలూ కనబడేట్లు చొక్కా మెడను విశాలంగా ఉంచుకుంటారు. వస్త్రాలమీద అందమైన లతాగుచ్ఛాల్ని అల్లుకుంటారు. దుకూల ధారణకూడా చేస్తారు స్త్రీలు అందమైన తమ చేతులూ, ఇతర శరీరాంగాలూ కనబడేట్లు వస్త్రధారణ చేస్తారు. రాజులూ సామాన్య ప్రజలూ, అందరూ ఒకేరకంగా వస్త్రధారణ చేస్తుంటారు. కాకపోతే, రాజులు చీనాంబరాల్ని ధరిస్తుంటారు. సాధారణులు నూలు వస్త్రాల్ని ధరిస్తారు.

రాజ విహారం ఖసగిరిలోని అన్యవిహారాల కంటే పెద్దదేకాక, ప్రాచీనమైంది కూడాను। మేము రాజ విహారంలోనే వర్షావాసాన్ని గడప నిశ్చయించుకున్నాము. మొదటి రెండు నెలల్లోనే స్థానిక ప్రజల భాషను

కొంత అభ్యసించాము. అయితే ఈ 'సీతా' మైదానంలో అనేక భాషలు వాడుకలో వున్నాయి. ఏదో ఒక ప్రాంతపు భాష కాంస్య దేశమంతటికీ ఉపయోగపడుతుం దనుకోవడం పొరబాటు। విహారాల్లో ఏ విధమైన ఇబ్బంది వుండదు. మధ్యదేశపు ప్రాకృత భాష తెల్సిన భిక్షువులుఒకరూ అరా వుంటూనే వుంటారు. ఇక్కడి లిపిప్రాకృత లిపిని పోలివుంటుంది. అసలు 'ఖసగిరి' అన్న పేరును వినగానే బహుశః ఇది 'ఖస' ప్రజల జన్మభూమి అయి వుంటుం దనుకున్నాను. ఇక్కడి ఆచారాలు నా అభి ప్రాయాన్ని బలపరచాయి. మాది 'ఖస' జాతి అని మొదటే చెప్పాను. మా పూర్వీకులు ఇక్కడనుండే ఏ యుగంలోనో దక్షిణానికి, భారత దేశానికి, వలసవెళ్ళి వుంటారు. ఈ ఖసగిరిలో కనిష్కుడు కట్టించిన స్తూపం ఒకటుంది. మధ్యదేశంలోనూ కపిషా, గాంధార దేశాల్లోనూ కనిష్కుడు నిర్మించిన స్థూపాల నెన్నింటినో చూశాను. మరి ఈ కాంస్య దేశంకూడా కనిష్కుడి పాలనలో ఉండేది గావును ! లేకపోతే ఈ ఖసగిరిలో కనిష్క స్తూపం వుండడం ఎలా సంభవించేది ? ప్రతి ఐదుసంవత్సరాలకూ ఒకమహోత్సవం జరుగుతూ ఉంటుందీ పట్నంలో. ఆ రోజు పట్నాన్ని చాలా చక్కగా అలంకరిస్తారు. బుద్ధుని అస్థిధాతు వును నగరమంతటా ఊరేగిస్తారు. అస్థిధాతువు దర్శనార్థం శ్రద్ధాళువు లైన భక్తులు దేశపు నలుమూలల్నుండీ వస్తారు. భారత దేశంలోనూ, సౌగ్ధ, బాహ్లిక దేశాల్లోనూ కుషాణుల తరువాత యేధాలు రాజ్యాధి కారాన్ని వహించారు. అదే సమయంలో ఈ దేశంలో కూడా యేధాజాతీ యులు రాజ్యపాలన చేశారు. కాలక్రమంలో యేధాల శక్తి క్షీణించింది. అవారులు యేధాలకు సమకక్షు అయ్యారు. కాంస్య దేశీయులు యేధాల ప్రభుతనూ అంగీకరించారు, అవారుల ప్రభుతనూ అంగీకరించారు. విహారంలో కొంతమంది చీనా దేశపు భిక్షువులుకూడా వున్నారు. వారు భారత దేశంలోని వజ్రాసనాన్ని దర్శించడానికి వెడుతూ, ఖసగిరి విహారంలో కొద్దిరోజులు ఆగారు. చీనా దేశంలో బౌద్ధమతం బాగా వ్యాప్తిలో ఉందనీ, అశేషంగా భారతీయ గ్రంథాలు చీనీ భాషల్లోకి అనువదింపబడుతున్నా యనీ వారి వలన తెలుసుకున్నాము. చీనా దేశం వెళ్ళాలనే నాకోర్కె చిగుళ్ళు తొడిగింది.

వర్షాకాలం గడిచింది. మేమక్కడనుండి బయలుదేరాము. 'సీతా' మైదానం చాలా విశాలమైంది. ఈ మైదానానికి దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశల్లో మహోన్నతమైన పర్వత శిఖరాలు ఉన్నాయి. ఈ పర్వతాలు సదా మంచుతో కప్పబడి ఉంటాయి పర్వతాల్ని అనుకొని ఉన్న భూమి సారవంతమైనది. తూర్పుకు పోయినకొలదీ, భూమి సారం తగ్గుతుంది. ఇసుక ఎడారి ప్రారంభ మౌతుంది. సీతానది తూర్పుగా ప్రవహించి, విశాలమైన ఇసుక ఎడారిలో అదృశ్యమౌతుంది. అసంఖ్యాకమైన 'సీతా' నదియొక్క ఉపనదులూ ఇసుక ఎడారిలో ఇంకిపోతాయి. భారతదేశం లోని సరస్వతీ నదికూడా స్థానేశ్వరం దగ్గిర ఎడారిలో ఇంకిపోతుందని విన్నాను। ఖసగిరి, యార్‌కంద్, కుస్తన్, కూచా ఈ పట్టణాలన్నీ ఎడారి నానుకొని వున్నాయి. నిరంతరం ఈ పట్టణాలను ఎడారితనలో లీనంచేసు కోడానికి ప్రయత్నిస్తూంటుంది. కానిమానవుడు అజేయుడు।సముద్రాల్తో, ఎడారితో, మహారణ్యాలతో సంఘర్షిస్తూనే ఉంటాడు. ఈదేశప్రజలు ఎడారితో అహర్నిశలూ సంఘర్షిస్తూ ఉంటారు. రాజులూ,ప్రజలూ కలిసి కాలువలు త్రవ్వించి, నిరంతరం నగర పరిసరాల్ని సస్యశ్యామలంగా ఉంచుతూంటారు. ఎడారి పట్టణాలను తనలో లీనం చేసుకోవడానికి ప్రయత్నిస్తూంటుంది. మానవులు కాలువలు త్రవ్వి,నీరుపెట్టి ఎడారిని సస్యశ్యామలంగా మార్చడానికి ప్రయత్నిస్తుంటారు। మానవుడికీ ఎడారికీ జరిగే ఈ మహాసంగ్రామంలో మానవుడు ఏమాత్రం ప్రమత్తుడైనా.కాలవలను బాగు చేసుకోవడంలో, తోటల్ని పెంచడంలో ఏమాత్రం అశ్రద్ధ చూపినా, పరాజితుడవక తప్పదు। ఎడారనే మహారాక్షసుడు నగరాలనూ, పట్టణాలనూ, కళకళ్ళాడే జనపదాలనూ పొట్టన పెట్టుకుంటాడు। ఖసగిరిని దాటి కొద్ది దూరం వెళ్ళాక ఎడారి వచ్చింది. ఎడారిని దాటి యార్‌కంద్‌కు వెళ్ళాము. మానవులు తీరప్రదేశాల్లోనేకాక నట్టనడి ఎడారిలో కూడా గ్రామాల్ని నిర్మించుకున్నారు. అక్కడా వారు ఎడారి రాక్షసుడితో సంఘర్షిస్తున్నారు. ఈ దేశంలో ప్రతి గ్రామంలోనూ విహారాలున్నాయి. ప్రతి ఇంటి ముందూ పూజా స్తూపాలున్నాయి. ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వెళ్తూవుంటే చంక్రమణం చేస్తున్నట్టుగా ఉంటుంది. ఇక్కడ।

కుస్తన్ నగరం చాలా ప్రసిద్ధమైనది. కుస్తన్ (ఖోతన్) అంటే 'భూమాత స్తనము' అని అర్థం. పాడి పంటలు విశేషంగాకల ప్రదేశమని కూడా చెప్పుకోవచ్చును. నిజంగానే కుస్తన్ చాలా సమృద్ధమైన పట్టణం. ఈ నగరంలోనూ బౌద్ధమతం బాగా వ్యాప్తిచెందింది. ప్రతి గ్రామంలోనూ ఒక విహారముండడం, ప్రతి ఇంటిముందూ ఒక పూజాస్తూప ముండడం ఇక్కడి ప్రత్యేకత కుస్తన్ పట్టణంలో ఇండ్లు దగ్గిర దగ్గిరగా వుండక ఆకాశంలోని నక్షత్రాల్లా చెల్లా చెదురుగా పరుచుకుని వున్నాయి. ఆ ఇండ్లు కట్టుకోవడాన్ని చూసి "బహుశా వీరికి దస్యుల బాధలేదు గావును. అందువల్ల ఇండ్లు దూరదూరంగా కట్టుకున్నారు." అనిపిస్తుంది. విదేశీయులైన యాత్రికులువస్తే ప్రజలు గొప్పగా ఆదరించి ఆతిథ్యాన్నిస్తారు. ఈ ప్రాంతంలో విహారాలకు ప్రక్కనే బాటసార్లుండడానికి చిన్న చిన్న ఇండ్లను కట్టిస్తుంటారు. నగరంలోని విహారాల్లో గోమతి - విహారం ప్రాచీనమయింది. ఇదే రాజ విహారం. ఇదికాక, మరి మూడు పెద్దపెద్ద విహారా లున్నాయి. ప్రతి సంవత్సరం నాలుగవ నెల మొదటి రోజున ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఆరోజు పట్టణాన్ని చక్కగా అలంకరిస్తారు. రాజ వీధుల్ని వూడ్చి నీళ్ళు చల్లుతారు. నగరపు ముఖ్య ద్వారం వద్దకు రాజ పరివారమంతా వచ్చి కూర్చుంటుంది. ఆ రోజు గోమతి విహారం నుండి బుద్ధ విగ్రహపు వూరేగింపు బయలుదేరుతుంది. మంగళవాయిద్యాలను వాయించుకుంటూ ప్రజలు నగర వీధుల్లో తిరుగుతారు. పట్టణానికి ఒక క్రోసు దూరంలో ఓ పెద్ద రథం వుంది. ఆ రథం మీదనే బుద్ధ విగ్రహాన్ని ఊరేగిస్తారు. ముందా రథాన్ని ఓ రాజప్రాసాదంలా అలంకరిస్తారు. చుట్టూ పతాకాలు ఎగురుతూంటాయి. రథం మధ్యలో బుద్ధ ప్రతిమ నుంచుతారు. ప్రతిమకు ఉభయ పార్శ్వాల్లో అవలోకితేశ్వరుని విగ్రహము, మంజుశ్రీ విగ్రహము ఉంటాయి. గోమతి విహారం హీనయానానికి చెందింది. కానీ, అక్కడి భిక్షువులు మహాయానావలంబులు. కనుకనే, బుద్ధప్రతిమకు పక్కల్ని సారిపుత్రుడి, మౌద్గల్యాయనుల విగ్రహాలుంచకుండా బోధిసత్వులైన అవలోకితేశ్వర, మంజుశ్రీల విగ్రహాల నుంచడం జరిగింది. రథంలో ఇవికాక ఇంకా పది పదిహేను దాకా దేవతా ప్రతిమ లున్నాయి. వారందరూ బుద్ధుని పరిచా

రకలు, దేవతా ప్రతిమలన్నీ ఎంతో కళాత్మకంగా, బంగారు రంగులో మెరిసిపోతున్నాయి. రథం ప్రధాన నగరద్వారం దగ్గిరకు వచ్చాక, రాజు కిరీటాన్ని తీసి క్రింద పెట్టి పుష్పహస్తుడై, ఒట్టికాళ్ళతో నడిచిరథం వద్దకు వెడతాడు. అప్పుడతడు నూతన సుశ్వేత వస్త్రాల్ని ధరిస్తాడు. రాజు పరివారమంతా రెండు వరుసలుగా బారులుతీరి అతణ్ణనుసరిస్తుంది. తథాగతుని విగ్రహాలవద్దకు వెళ్ళి సాష్టాంగ దండప్రమాణ మాచరించాక తన చేతిలోని పుష్పాల్ని విగ్రహాలమీద చల్లి పూజిస్తాడు. అనంతరం రథం నగరంలోకి ప్రవేశిస్తుంది, రథంమీద రాణులూ, వారి పరిచారికలూ కూర్చుని నాలుగు వైపులా పూవుల్ని చల్లుతూంటారు. గోమతి విహార రథయాత్ర అయ్యాక, మరుసటి రోజు మరో విహార రథయాత్ర ఉంటుంది. ఇదేవిధంగా చదుర్దశి తిథివరకూ రథోత్సవాలూ, రథ యాత్రలూ ఉంటాయి. ఆ తరువాతనే రాజ పరివారం తమ ప్రాసాదానికి వెడుతుంది.

ఈ దేశంలో భారతీయుల్ని ఎంతో మందిని చూశాను. శతాబ్దాల క్రితం ఎన్నడో వాళ్ళ పూర్వీకు లీ దేశానికి వలసవచ్చి వుంటారు. తమ పూర్వీకులు ఎప్పుడా దేశానికి వచ్చారోకూడా అక్కడి భారతీయులకు తెలియదు. ఈ వలస వచ్చిన భారతీయుల్లో మధ్యప్రాంతపు ఆచార వ్యవహారాలు ఎన్నోకనిపిస్తుంటాయి. వాళ్ళ మాట్లాడేభాష ప్రాకృతాన్ని పోలిఉంటుంది. అదీ ఈనాడు మధ్యప్రాంతంలో వ్యవహారంలో వున్న ప్రాకృతం కాదు. పురాతన ప్రాకృతాన్ని పోలివుంటుంది. వస్తువుల కొలతల్లో, తూనికల్లోనూ మధ్యప్రాంతపు ప్రభావం కనిపిస్తుంటుంది. ప్రస్థ (దోసెడు) ని వీళ్ళు ప్రస్త అంటారు. మూడు సంఖ్యను "త్రె" అని త్రయోదశాన్ని "త్రోదస"యనీ అంటారు. ఇక్కడి పట్టణాల్లోని ప్రజలు తమకు తెలియకుండానే యెన్నో భారతీయ పదాల్ని నిత్యం పాడుతూంటారు. ఈ దేశీయులు ఉపయోగించే ప్రాకృత పదాలను, ఇతర భారతీయ శబ్దాలనూ విన్నప్పుడు "ఒకప్పుడీ దేశంలో భారతీయులు ఎక్కువగా వుండేవారు గావును!" అనుకునేవాడిని. కానీ, విశాలమైన నది మహాసముద్రంలో కలిసి తన వ్యక్తిత్వాన్ని గోల్పోయినట్లు భారతీయులు కూడా ఇక్కడి ప్రజల్లోకలిసి, తమ ప్రత్యేకతను గోల్పోయారు. బిరుదు

ల్లోనూ మధ్యప్రాంతపు ప్రభావం స్పష్టంగా కనుపిస్తుంది. ఉదాహరణకు మహరయతిరయ (మహారాజాధిరాజ), మహానువ (మహానుభావ), మహారయ (మహరాజ), మహారాజ రాజాతిరాజ (మహారాజ రాజాధిరాజ) మొదలైన బిరుదు శబ్దాలను మధ్యప్రాంతపు సమానార్థక బిరుద వచనాల్తో పోల్చి చూసుకుంటే ప్రాకృత భాషా ప్రభావం ఎంతగానో కనిపిస్తుంది.

కుస్తన్ నగరంలో నెలరోజు లున్నాము. యాత్రార్థం పరాయిదేశం వెళ్ళినవాడికి ఆ దేశీయుడెవడైనా మిత్రుడైతే ఇక నాదేశం పరాయిదేశ మనిపించదు. కుస్తన్‌లో సంఘిలుడనే యువక భిక్షువు ఒకతడు మిత్రుడయ్యాడు. అతడు విద్యాప్రియుడు. అధ్యయనార్థం భారతదేశం వెళ్ళాలను కుంటుండగా నేనుపరిచయ మయ్యాను. ఆనెల రోజుల్లోనూ కొంత వరకూ ప్రమాణ శాస్త్రాన్ని నావద్ద అధ్యయనం చేశాడు. ఇక మీదట అతడూ మాతో యాత్ర చేయడానికి సిద్ధం అయ్యాడు. మేము ముగ్గురం, నలుగుర మయ్యా మిప్పుడు! సీతానది ఖసగిరినుండి తూర్పుకు ప్రవహిస్తుంది. కాంస్య దేశానికి ఉత్తరపు సరిహద్దులుగా వున్న పర్వత పంక్తులకు చాలా సమీపానికి వెళ్తుంది. అక్కడే ప్రసిద్ధమైన కూచా నగరం వుంది. కూబా నగరం కూడా ధర్మపరాయణతకల పట్టణ మని విన్నాము. అయితే ఉత్తరం దేశాన కల ఆవారులకూ, తోర్యుక్కులకూ యుద్ధం సంఘటిల్లింది, నిత్యం నూతనమైన యుద్ధవార్తలు వినవస్తుండేవి! అలాంటి స్థితిలో కూచానగరం మీదుగా (ఉత్తర మార్గాన) చీనా వెళ్ళడం క్షేమకరం కాదు. ఎడారిగుండా దక్షిణ మార్గాన వెళ్ళడమే శ్రేయస్కరం! ఈ మార్గం ఎడారికి దక్షిణ కొస నుండి వెళ్తుంది. కాంస్య దేశానికి దక్షిణానకల హిమవత్పర్వతాల్లో నుండి వచ్చే నదీనదాలు ఈ ప్రదేశాన్నంతటినీ సారవంతం చేస్తూ ఉత్తరంగా ప్రవహించి ఎడారిలో ఇంకిపోతాయి. మేము ఎక్కువగా ఎడారి నానుకునివున్న గ్రామాల్లో నుండి ప్రయాణం చేస్తున్నాము. మధ్య మధ్య పూర్తిగా ఎడారిలో నుండి ప్రయాణం చేయాల్సి వస్తోంది.

పదిరోజుల వరకూ సారవంతమైన పచ్చనిభూమిగుండా ప్రయాణము చేశాము. అప్పటికే చలికాలం ప్రవేశించింది. భూమి చాలా భాగం సస్యశూన్యమైంది. ప్రజలు పని పాటల్నుండి విశ్రాంతి తీసుకునే కాల

మది. ఈ కాలంలో, గ్రామాల్లో ఉత్సవ, వినోదాలు ఎక్కువగా జరుగు తూంటాయి. ఎప్పటికప్పుడు యుద్ధవార్తలు తెలుస్తూనే ఉన్నాయి. ఈ యుద్ధం కారణంగా యీ యాత్ర ఏమంత చురుగ్గా సాగడం లేదు. కృష్ణా నది (కారాముగాన్) తటాన్ని చేరాము. ఈ నదితీరాన ఓ పట్టణముంది. నది పేరూ, పట్టణం పేరూ - రెండూ ఒకటే! కృష్ణ పట్టణంలోకి వెళ్ళాక ఇకముందుకుపోవడానికి మార్గంలేదని తెలుసుకున్నాము అయితే, ఆ మాత్రానికి యాత్రను ఆపే రకంకాదు మేము. నలుగుర మున్నాము. మేమూ సశక్తమైన సైనిక కూటమిగా సంఘటిత మయ్యాము. మేము సాయుధులం కాము అయినా మా నలుగురిలో ఎవరూ ఓటమిని ఒప్పు కోరు. ధైర్యాన్ని గోల్పోరు. ముందుకు పోవడమే మా యుద్ధం .. అదే మా ధ్యేయం. ఇలాంటి మిత్రులు కూడడం నిజంగా అదృష్టమనే చెప్పాలి. మా అందరి స్వభావాలూ ఒకేరకం! ప్రపంచంలో ఏ ఇద్దరి స్వభావాలూ ఒకరకంగా వుండవు. మేము నలుగురం....పైగా నాలుగు దేశాలకు చెందినవాళ్ళం! మా స్వభావాల్లో ఏ నూలువాసో వ్యత్యాసా లున్నా, అవి మా మిత్రత్వం మీదగానీ, మా ఆదర్శం మీదగానీ ఎలాంటి ప్రభావాన్ని వేయలేవు. నేను గురువును. వాళ్ళు ముగ్గురూ నా అంతేవాసులు. ఎక్క డైనా ఆగా లనుకుంటే ఒకటి రెండు వారాలు ఆగిపోతాము. వెళ్ళాలను కుంటే వెళ్తాము! త్వరగా వెళ్ళవల్సిన తొందర లేమి లేవు. అసలీ విధంగా ఆలస్యంగా వెళ్తే, ఈలోపు యుద్ధం ముగుస్తుందనీ, నిరపాయంగా చీనా దేశానికి వెళ్ళవచ్చుననీ మా ఉద్దేశం! కానీ, మా వూహ సరైందికాదు. అవారులకూ, తుర్కులకూ మధ్య సంభవించిన యుద్ధం ఏనాడో ముగి సింది. తుర్కులు విజయాన్ని పొందారు. అవారులు తమ పరాజయాన్ని విజయ మనిపించు కోవడానికి శతవిధాల ప్రయత్నిస్తున్నారు. తిరుగు బోతులు స్థిరనివాసులతో చాలా క్రూరంగా యుద్ధం చేశారు. అయితే, రెండు తిరుగుబోతులు జాతుల మధ్య యుద్ధం జరిగినప్పుడు వాళ్ళ క్రూరత్వం పరాకాష్ట నందుకుంటుంది. అతి భీకరమైన పశుత్వాన్ని ప్రదర్శిస్తారు. తమ శత్రువుయొక్క నామరూపాలుకూడా లేకుండాచేయడానికి బద్ధకంకణు లౌతారు. యుద్ధం ముగిసింది. కానీ, అవారులకూ తుర్కులకూ మధ్య కల శత్రుత్వం ముమ్మరించింది!

మేమొక మహానది వద్దనున్నాము. ఈ నది తూర్పు తీరానకల అతి విశాలమైన క్షారసరోవరం (లోబనోర్)లో కలుస్తుంది. ఈ నది వద్దున రంగు రంగుల రాళ్ళు దొరుకుతాయి. వాటితో చషకాల్ని, ఇతర చిన్న చిన్న అందమైన పాత్రలనూ తయారుచేస్తారు. నదికి రెండువైపులా చాలా దూరంవరకూ పంటచేలు వున్నాయి. కొద్ది దూరం పోయాక చిన్న పట్టణ మొకటి తగిలింది. స్థానిక సంఘూరామంలో రెండు వారాలున్నాము. అంత వరకూ నేను చీనీ భిక్షువుల్ని చాలామందిని చూశాను. అయితే, చీనీ కుటుంబాల్ని మొదటగా ఈ పట్టణంలోనే చూశాను. అసలు కాంస్య దేశంలో వర్షాలు తక్కువ, ఈ ప్రాంతంలో మరీను ; సంవత్సరాల తరబడి ఒక్క వర్షపు చినుక్కూడా పడదు. ప్రజలు ఎక్కువగా మంచు కరిగిన నీటిమీద ఆధారపడతారు. ఈ నదే ఇక్కడి ప్రజల జీవనాధారం; హిమాచ్ఛాదిత పర్వత శిఖరాల మీది హిమం కరిగి ఈ నది లోకి ప్రవహిస్తుంది.

నూతన దేశాల్ని చూడాలనే కోర్కె మమ్మల్ని ముందుకు లాక్కుపోతోంది. బలీయమైన ఈ కోర్కెముందు మార్గమధ్యంలో సంభవించే బాధలూ, కష్టాలూ మాకో లెక్కలోకిరావు. ఓరకంగా మేము ప్రాణాలకు తెగించాము, అయితే, వ్యాపారులూ మాలాగానే అనేకమైన బాధల్ని సహించి, ఎన్నో కష్టాల కోర్చి, ప్రాణాలను లెక్కచేయకుండా విదేశ యాత్రలను చేస్తుంటారు. వారికి మాలాంటి ఉన్నతమైన ఆదర్శాలుగానీ. ప్రాణాలపై విరక్తిగానీ వుండదు. అయినా వారు మా అంత సాహసాన్ని ప్రదర్శిస్తారు. దుస్సాధ్యమైన యాత్రల్ని చేస్తారు. మానవుడు కొన్ని పరిస్థితుల్లోచాలా పిరికివాడుగా వ్యవహరిస్తాడు. ఆ క్షణాన అతణ్ణిచూసిన వారు జన్మభీరు వనేస్తారు. కానీ, జన్మతః పిరికివారుగా భావింపబడే వ్యాపారులు దుస్సాధ్యమైన యాత్రల్ని చేస్తూ, అనూహ్యమైన సాహసాన్ని ప్రదర్శించడం చూస్తే, జన్మతః పిరికివారుగానీ, జన్మతః సాహసులుగానీ వుండరేమో, పరిస్థితులే మానవుణ్ణి పిరికివాడిగా, సాహసికుడిగా చేస్తాయేమో ననిపిస్తుంది: అయితే, జంబూద్వీపపు వ్యాపారులకంటేఇక్కడి సార్థవాహులు సాహసులని ఒప్పుకోక తప్పదు ; ఈ దేశపు వ్యాపారులు అతి ప్రమాదభరితమైన మార్గాలగుండా వ్యాపారం చేయాల్సి వుంటుంది.

కొన్ని ప్రదేశాల్లో సశస్త్ర రక్షక భటులు లేకుండా ప్రవేశించడానికే వీలుండదు. అలాంటిస్థితిలో సార్థవాహుడు తన వ్యాపారపు గుంపుకు నాయకునిగానే కాక, నేర్పరి అయిన సైన్యాధిపతిగాకూడా వ్యవహరించ వలసివుంటుంగి. ఇక్కడి సార్థవాహుల్ని ఒక్కొక్కప్పుడు, పెద్ద సంఖ్యలో దొంగలు ముట్టడిస్తూంటారు. వారితో పోరాడేప్పుడు నిజమైన సేనాపతుల్లా సేనను నడప వలసివుంటుంది. ఇక్కడనుండి నెలల తర బడి ప్రయాణం చేస్తేగానీ, చీనా దేశాన్నీ, ఆ దేశపు "పెద్ద గోడ"నూ చేరలేరు వ్యాపారులు! ఇక్కడి నుండి చీనా వెళ్ళే మార్గంలో అతి క్రూరులైన తిరుగుబోతుల దేశాలున్నాయి. ఆ దేశాలగుండా ప్రయాణం చేయడమంటే అడుగడుగునా మృత్యువు నెదుర్కోవడ మన్నమాటే. ఈ సార్థవాహులు వివిధరకాలైన వణ్యావస్తువుల్ని తమ పశువులపై వేసు కుని, ప్రాణాలకు తెగించి చీనా దేశంవైపుకు ఎందుకు వెళ్తారు? అక్కడి పట్టు వస్త్రాల్ని, ఇతర వస్తువుల్ని తెచ్చి తమ దేశాల్లో అమ్ముకోవడా నికి. ఆ దేశంలో తక్కువ ధరకు కొంటారు. తమ దేశాలకు తీసుకు పోయి ఎక్కువ ధరకు అమ్ముకుంటారు. ఈ విధంగా లాభాలను సంపా యిస్తారు. ధనాన్ని గడించి సుఖజీవనాన్ని గడపాలని వీరి కాంక్ష. మేము తిరుగుబోతు ప్రవృత్తి కారణంగా యాత్రలు చేస్తున్నాము. సార్థవాహులు సుఖాల్ని కాక్షించి యాత్రలు చేస్తారు. ఉభయుల ఆశయాల్లో భిన్నత్వం వుండవచ్చు. కానీ, ఇద్దరి మార్గమూ ఒకటే. ఉభయులమూ ప్రమాదాల్ని లక్ష్యపెట్టకుండా యాత్రలు చేస్తాము. ఈ ఏకత్వం కారణంగానే సార్థ వాహులు మాపట్ల ఆదర భావాన్ని, అనురాగాన్ని ప్రదర్శిస్తూంటారు. ఈ పట్టణంలో(చేర్చెన్)సొగ్ద సార్థవాహుడొకతను పరిచయమయ్యాడు. మేము అడక్కుండానే అతడు మమ్మల్ని, తన వెంట చీనా దేశంవరకూ రమ్మన్నాడు. అతణ్ణి నే నిలా అడిగాను: "మార్గం చాలా ప్రమాద భరితంగదా? మీరా ప్రమాదాల్ని లక్ష్య పెట్టరా?"

వ్యాపారి నవ్వుతూ "మానవుడికి ప్రమాదమంటూ వుండని ప్రదేశం ఏది? కర్మించాలకపోతే ఇంట్లో సుఖంగా ఉన్నవాడికే ప్రమాదం సంభవించవచ్చు! తిని కూర్చుని ఇంటి కప్పు నెత్తినపడి చచ్చినవాళ్ళు లేరా? రోగాలు ప్రాణం తీస్తే ఏం చేస్తాం? ఈ కృష్ణానదిలో స్నానా

ఏకి దిగామనుకోండి. మునిగిపోతే ? ఇది కృష్ణానది. మా దేశంలో ఇంతకంటే కూడా పెద్ద కృష్ణానది (సిర్‌దరియ) వుంది. ఆ నది చాలా లోతూ, వెడల్పూ వుంటుంది. అందుకే దాని నీళ్ళు నల్లగా వుంటాయి. నల్లని నీరు కలది గనుక కృష్ణానది అంటాము. అంత పెద్ద నదిని మీ రింతవరకూ బహుశా, చూసి వుండరేమో !" అన్నాడు.

"మీ కృష్ణానదిని నేను చూడలేదు. బహుశా అది పెద్దదే కావచ్చు. కానీ మా భారత దేశంలో గంగా, సింధులాంటి పెద్దపెద్ద నదులెన్నో వున్నాయి. అవి మీ కృష్ణానది కంటేకూడా చాలా పెద్దవి !"

"మా కృష్ణానది కంటె పెద్ద వని నే నొప్పుకోను. నేను చీనా నుండి రోమక దేశంవరకూ వ్యాపార నిమిత్తంవెళ్ళి వస్తూంటాను. ఇంత వరకూ కృష్ణానది అంతటి పెద్ద నదిని చూడలేదు. కాని,చీనా దేశంలోని పచ్చనది (హ్వాంగ్-హో) నది మాత్రం మా కృష్ణానది కంటె పెద్దదని వొప్పుకుంటాను !" అన్నాడు వ్యాపారి.

"మీ దేశంలో వర్షం అంతగా కురవదనుకుంటాను?" అన్నాను.

"ఎందుక్కురవదు ? కురుస్తుంది ! మా దేశంలో కురిసిన వర్షం ఈ కాంస్య దేశంలో ఎన్నడు కురిసింది ?"

నేనిలా అనుకున్నాను:"ఇతడు ఎక్కువ వర్షాలు కురిసే దేశాల్ని చూడలేదు గావును. కాంస్య దేశం కంటె ఇతడి మాతృభూమిలో ఎక్కువ వర్షమే కురవచ్చు. అదే ఘన మనుకుంటున్నాడు. తక్కువ వర్షాలు కురిసే దేశ ప్రజలు తమ ఇండ్ల కప్పుల్ని మట్టితో నిర్మించుకుంటారు. కానీ, అధిక వర్షాలు కురిసే దేశాల్లోని ప్రజలు ఇంటి కప్పుకు మట్టిని వాడరు. కాశీ, పాటలీపుత్రం లాంటి అధిక వర్షాలు కురిసే ప్రదేశాల్లో మట్టికప్పు యెన్నాళ్ళుంటుంది?" పైకి ఇలా అడిగాను. "మీరూ ఇక్కడి లాగానే ఇంటికప్పుల్ని మట్టితో నిర్మించుకుంటా రనుకుంటాను ? ఆ మపైనా రెండు మూడంగుళాల మందం మాత్రమే పోస్తారు!"అన్నాను.

"అవును. సామాన్యులు ఇంటి కప్పులపైన మట్టి పోసుకుంటారు. కానీ, ధనికులు ఇంటి కప్పులకు కూడా రాతిని వాడుతారు."

నేనన్నాను: "మా దేశంలో విపరీతమైన వర్షాలు కురుస్తాయి. ఆ భయంకరమైన వర్షాల్లో మట్టికప్పులు ఒక్కరోజుకూడా ఉండవు. అక్కడ

పడ్డ వర్షపు నీరంతా మా నదుల్లోకి పోతుంది. మీ కృష్ణానదికి మంచు కరిగిన నీరే ఆధారమనుకుంటాను."

నేను అనేక దేశాలు తిరిగాననీ, అసత్య మాడననీ వ్యాపారి తెల్సుకున్నాడు. ఎదురువాదన చేయకుండా నా మాటల్ని విశ్వసించాడు. మే మతడివెంట చీనాదేశం వెళ్ళే విషయంలో మిత్రుల సలహాలు తీసుకున్నాను. ప్రయాణం నిశ్చయమైంది.

ఇలాంటి వ్యాపారపు ముఠాల వెంట ప్రయాణం చేయడం వలన మేము కొంత స్వేచ్ఛను గోల్పోవాల్సి ఉంటుంది. దారిలో మేము మా ఇష్టానుసారంకాక సార్థవాహుని ఇష్టాన్ననుసరించి మజిలీలను చేయాల్సి ఉంటుంది. అయితే, మేము స్వతంత్రించి విడిగా వెళ్ళినా, నాలుగయిదు రోజులు మాత్రమే ప్రయాణం చేయగలం. ఆ తరువాత అంతా ఎడారి। ఎడారిలో ఒంటరిగా ప్రయాణం చేయలేము. మార్గం తెల్సిన వ్యాపారపు ముఠాసాయం అనివార్యం. సార్థవాహుని వెంట బయల్దేరాము. క్షారసరోవరం వరకూ కృష్ణా తీరాన్ననుసరించాము. ముందుకు పోయినకొలది, గ్రామాలు పూర్తిగా తగ్గిపోయాయి. సరోవరం దగ్గర మాత్రం ఓ చిన్న పట్టణం వుంది. ఆ పట్నంలో ఒక దుర్గంకూడా వుంది. గ్రామాన్ని దాటాక కొంతదూరం సరోవరపు ఉత్తర తీరానికి సమాన దూరంలో, సమీపంగా ప్రయాణం చేశాము. ఇప్పుడు మేము ఇసుక భూమిలో ప్రయాణం చేస్తున్నాము. పరిసరంలోని నీరు కటిక ఉప్పన. ఆ నీటిని మానవులే కాదుకదా పశువులు కూడా తాగవు. కనుకనే సార్థవాహులు మంచినీటి బావులున్న ప్రదేశంలో మాత్రమే మజిలీ చేస్తారు. క్షార సరోవరాన్ని దాటాక ఇక నంతా ఎడారే. దిగంతాలవరకూ వ్యాపించిన ఇసుక. ఈ అనంతమైన ఇసుక రాశిలో మంచినీరు లభించడం ఎలా సంభవం? మరి మంచినీరే లభించని పక్షంలో మానవులు ఎందుకిక్కడ మార్గ మేర్పరచుకుంటారు. ఇలాంటి ఎడారుల్లో మార్గమున్నదీ అంటే మంచినీరూ వుందనే అర్థం.

క్షారసరోవరాన్ని దాటాక ఒక నెలరోజులు ఈ ఇసుక ఎడారిలో ప్రయాణం చేయాలి. ఈ నెలరోజుల మార్గంలోనూ ఇరవై ఏడూ, లేక ఇరవై ఎనిమిది మంచినీటి బావులున్నాయి. ఆ బావుల్లోనైనా పుష్క

లంగా నీరుండదు. ఒక్కమారు నూరు మంది దాహాన్ని తీర్చలేవు. చలి కాలం అయినా, పగటి ఎండలో ప్రయాణంచేస్తే దాహం వేస్తుంది. కనుక రాత్రిళ్ళే ప్రయాణం చేసేవాళ్ళం. పగలంతా ఏ మంచినీటి బావి వద్దో పడుండేవాళ్ళం.

ఎడారివి గురించి ఎన్నో చిత్ర విచిత్రాలైన కథల్ని చెప్తుంటారు. వేల సంవత్సరాలుగా మృత్యువును ధిక్కరిస్తూ, మానవుడీ ఎడారిగుండా ప్రయాణం చేస్తున్నాడు. ఎంతోమంది అభాగ్యులు ఈ ఎడారిలో తమ జీవితాల్ని కోల్పోయారు అలా అకాలమృత్యువు పాలపడ్డవారంతా భూతాలై తిరుగుతుంటారని వదంతి. ఈ భూతాలూ, దయ్యాలూ అన్యమానవుల్నికూడా తమలాగానే దుర్గతిపాలుచేయ చూస్తుంటాయని చెప్పారు. మా సార్థవాహుడూ, ఇతర అనుభవజ్ఞులూ మమ్మల్ని సదా హెచ్చరిస్తూంటారు. "ముఠాకు వెనుకబడడంగానీ, ముందుపోవడంగానీ చేయవద్దు. జాగ్రతః రాత్రిపూట, ఎడారిలో ఒకసారి దారితప్పారా, ఇక కల్సుకోవడం అసంభవం! దయ్యాలెప్పుడూ మనుష్యులకోసం పొంచుంటాయి. మంచిమాటల్తో మనుష్యుల్ని దారి తప్పించి, చంపేస్తాయి అవి మాటాడుతూంటే మన సహచరులు మాట్లాడినట్టుగానే వుంటుంది" అనేవారు. ఇంకాకూడా ఇలా చెప్పేవారు: "ఎడారి దయ్యాలు, రాత్రిళ్లే కాదు, పగటిపూటకూడా తిరుగుతూంటాయి. ఒంటరి వాళ్ళనే కాదు, పెద్ద పెద్ద ముఠాలనుకూడా దారి తప్పిస్తాయి. పెద్ద గుంపుగా దయ్యాలు మేళాలు వాయించుకుంటూ వస్తాయి. 'భయపడవద్దు, భయపడకండి!' అంటూనే యాత్రికుల్ని పథభ్రష్టుల్ని చేస్తాయి. ఇక వాళ్ళను చంపి, మాంసాన్ని తిని, కళ్యాల్ని వదిలివేస్తాయి!" అని చెప్పేవారు.

దారిలో పశువులవీ, మానవులవీ అస్థిపంజరాల్ని ఎన్నింటినో చూశాను. అవన్నీ దయ్యాలు మాంసాన్ని తిని వదిలినవని సహచరులు చెప్పారు. మా ముఠాకు వినయసూత్ర పాఠాలమీద విశ్వాసం మెండు. సూత్రపఠంవల్ల భూతబాధ తప్పుతుందని వారి నమ్మకం. దారిపొడుగునా అందరూ ఏవో మంత్రాలనూ, సూత్రాలనూ గొణుగుతూనే వున్నారు. నేనూ అప్పుడప్పుడూ సూత్రపఠనం గావిస్తూండేవాణ్ణి. అయితే, నేను సూత్ర పఠనం చేయడం భూతబాధ నివారణకోసమా, లేక కాలక్షేపం

కోసమా? అన్నది వివాదాంశం. సూర్యాస్తమయ సమయంలో, ప్రపంచ మంతా తనకార్యకలాపాల్ని ముగించి విశ్రాంతితీసుకోవడానికి, నిద్రించ డానికి ఉద్యుక్తమౌతుంది. కానీ. మేము అప్పుడే యాత్ర ప్రారంభిస్తాము. మార్గదర్శకుడికి సార్థవాహుడు చాలా ధనాన్నిస్తాడు. మొత్తం ముఠాలో అతడికో ప్రత్యేకమైన, గౌరవనీయమైన, స్థానముంటుంది. ప్రతి రాత్రి యాత్ర ముగిశాక, మార్గదర్శకుడు అక్కడో గుర్తును వేసుకుంటాడు. తిరిగి ప్రయాణం ఏ దిశగా ప్రారంభించాల్సి ఉండేది ఆ గుర్తుద్వారా తెలు స్తుందంటారు. నిజంగానే ఎడారిలో ఏ ముఖంగా ప్రయాణాన్ని సాగిస్తే గమ్యాన్ని చేరుతామనేది పెద్దసమస్య. ఎటుచూసినా ఒకేరకమైన ఇసుక కనుపిస్తూంటుంది. సముద్రంలో మార్గాన్ని తెల్సుకోవడం ఎలా అసంభ వమో, ఈ ఇసుక సముద్రంలోనూ అంతే! జలయాత్రికులు నక్షత్రాల ఆధారంగా మార్గాన్ని నిర్ణయించుకుంటారు. యెడారి యాత్రికులు కూడా నక్షత్రాల ననుసరించే దిశల్ని నిర్ణయించుకుంటారు ముందుకు సాగు తారు.

సూర్యోదయానికి ముందే మేము పై మజిలీని చేరుకునేవాళ్ళం. మార్గదర్శకుని ఆజ్ఞను ఎవరూ ఉల్లంఘించరు. అతడు ఎక్కడ "ఆగ" మంటే, అందరూ అక్కడ, ఆక్షణాన తక్కిన ఆగిపోవల్సిందే.రాబోయే మంచినీటిబావి ఎంత దూరానుందో తెల్సుకోవడానికి ప్రయత్నించేవాళ్ళం కాదు. సహజంగా ఎడార్లు చాలా స్వచ్ఛంగా వుంటాయి. ఎటు చూచినా పచ్చని సువిశాలమైన ఇసుక దర్శనమిస్తుంది. అయితే,మంచినీటిబావుల వద్ద మాత్రం మానవవాసం కారణంగాకొంతమురికీ,అశుభ్రత కనిపిస్తూం టాయి. సామాన్యంగా ఎడార్లలో, చలికాలంలోనే ప్రయాణాలు చేస్తుం టారు. అందుకో ముఖ్యకారణముంది. చలికాలంలోనే ఇసుక తుఫానులను కల్పించే ప్రళయగాడ్పులు వీచవు. పగటిపూట మందపవనాలు మాత్రం వీస్తుంటాయి, రాత్రిపూట అదీ వుండదు. ప్రకృతి స్తబ్ధుగా వుంటుంది. అలాంటిసమయంలో మార్గం స్వచ్ఛంగా వుండి, ఎడారి ప్రయాణం నిరా టంకంగా సాగుతుంది! దారిలో అక్కడక్కడా ఇసుక గుట్టలు కనిపిస్తుం టాయి. ఇవి ఇసుకగూళ్ళలా ఒకవైపు ఇసుకను ఎవరో కావాలని తీసి నట్టుగా వుంటాయి. వీటిని చూపి ముఠాలోవాళ్ళు ఇలాంటి గుట్టల్ని

దయ్యాలే చేస్తుంటాయి అనేవారు. ఈ గుట్టలు లేక దిబ్బలూ దారి పొడు
గునా వుంటాయి. గాలి బాగా వీచేప్పుడు ఒకచోటవున్న దిబ్బలు
చూస్తుండగానే కరిగిపోయేవి. మరోచోట నూతనమైనవి ఏర్పడుతూ
వుండేవి. ఇలా ఇసుక దిబ్బలు కరగడాన్ని, ఏర్పడడాన్ని దయ్యాల
ఆట అనేవారు. అయితే, దయ్యాలకు ఇంతకుమించి మరేమీ పనివుండ
దనీ, నిరంతరం ఇసుక దిబ్బల్ని మాయంచేస్తూ, పుట్టిస్తూండడమే వాటి
పననీ నమ్మలేకపోయాను. కానీ, ఇసుక దిబ్బ లీ విధంగా ఏర్పడుతూండ
డమువల్ల మార్గాన్ని తెల్సుకోవడం కష్టమని అనుకున్నాను. ఆకాశం నిర
భ్రంగావుంది. నక్షత్రాలు స్వచ్ఛంగా కనిపిస్తున్నాయి. సింహళంలో
నుండి చూస్తే ధృవనక్షత్రం ఉత్తరపు క్షితిజాన్నానుకుని కనుపిస్తుంది.
జంబూద్వీపంలో నుండి చూస్తే క్షితిజాన్నుండి ఇంకొంచెం పైకి
వచ్చి కనిపిస్తుంది. ఇక్కడ మరీ పైకివచ్చి కనిపిస్తుంది ధృవ
తార! ధృవనక్షత్రానికి కుడివైపుగా, తూర్పుకు ప్రయాణం చేస్తు
న్నాము.

క్షీరసరోవరాన్నుండి బయల్దేరి పది రోజులయింది. ఆనాటి
సూర్యోదయంతోపాటు మేమొక మంచినీటి బావిని చేరాము. కొద్ది క్షణాల
అనంతరం కొందరు మనుష్యులు మా దగ్గరకు పరుగెత్తుకుంటూ
వచ్చారు. వాళ్ళిలా అన్నారు: "తోర్యక్కులు గ్రామాలను దోచుకుని,
నిప్పంటిస్తున్నారు. మనుషుల్ని చిత్రహింస చేస్తున్నారు స్త్రీ, పురుష,
బాల, వృద్ధ అందర్నీ చంపుతున్నారు. మేము ఆవారుల ఏలుబడిలో
వుంటున్నాము. ఇప్పుడు తోర్యక్కుల అధికారాన్ని అంగీకరించడానికి
సిద్ధంగావున్నాము. అయినా, వాళ్ళు మా మాటలు వినడంలేదు!" అని
చెప్పారు. ఇది వినగానే సార్థవాహుడు ముఠాలోని పెద్దల్ని, అనుభ
వజ్ఞుల్ని సలహా అడిగాడు. నా అభిప్రాయాన్ని తెల్సుకున్నాడు. ముఠా
ఎలాంటి స్థితిలోనూ యుద్ధానికి వెరవదు. అయితే, ప్రాణ, ధనాల్ని
రెండింటినీ గోల్పోవడం తప్పదని తెలిసినప్పుడు వెనక్కి తగ్గడమే
శ్రేయస్కరం. వెంటనే వెనక్కి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నాము.
ఆనాటి మధ్యాహ్నానికి క్రితం రాత్రి విడిచి వచ్చిన మంచినీటి బావిని
తిరిగి చేరాము.

వెనక్కి తిరిగిరావడంవలన ప్రయాణపు దిశను పూర్తిగా మార్చేసు కోవల్సిన పరిస్థితి ఏర్పడ్డది. లేక, తొర్కుల రాజ్యం స్థిరపడే వరకూ చీనా యాత్రను ఆపనయినా ఆపాలి. మేము వచ్చిన మార్గాన్నే తిరిగి వెనక్కు వెళ్ళి, వెనక మేము వుండి వచ్చిన, కృష్ణానది వొడ్డున కల పట్టణాన్ని చేరాము. కుస్తన్ నుండి కూచా వెళ్ళే మార్గం నిరాపదంగా వుండవచ్చు ననుకున్నాను. తోటివారిని విచారించాను. ఇప్పుడా మార్గంలో శాంతి నెలకొన్నదన్నారు. ఇప్పుడు మేము నేరుగా వెనక్కి రావడంలేదు. చుట్టుపట్లవున్న గ్రామాల్లోగానీ, దక్షిణ దిశనగల పర్వతాల్లోగానీ, విహారాలున్నా, విద్వాంసులున్నా ఆగి. వారిని చూసుకుంటూ వస్తూన్నాము. ఈ విధంగా మూడవనెల్లో (జ్యేష్ఠం) కుస్తన్ నగరాన్ని చేరుకున్నాము. క్రిందటి సారి కుస్తన్ నగరంలో వున్నప్పుడు రథోత్సవాన్ని చూడలేకపోయాను. ఈ మాటు నాలుగవ నెల రాకముందే కుస్తన్ చేరాలని సంకల్పించాను. అలాగే చేరాను.

రాజధానికి రెండు క్రోసుల దూరంలో. పశ్చిమదిశన నూతన రాజవిహారముంది. నూతన విహారమంటే, ఒకటి, రెండు, లేక పది సంవత్సరాల క్రితం కట్టించింది కాదు. దీన్ని కట్టికనీసం రెండువందల యాభై సంవత్సరాలయివుంటుంది. కాకపోతే గోమతీ విహారం కంటె నూతనమైంది. దీన్ని స్థానిక రాజొకడు కట్టించాడు. అప్పటినుండి పది పన్నెండు మంది రాజులయ్యారు. విహార స్తూపం రెండు వందల యాభై బారల ఎత్తున, వెండి బంగారు నగిషీలతో మహా సుందరంగా నిర్మించబడ్డది. ఈ స్తూపాన్ని నిర్మించడంలో బహు మూల్యమైన ద్రవ్యాలను ఎన్నింటినో వాడారు. బంగారు, వెండి సరేసరి. రత్నాలూ, వజ్ర, వైఢూర్యాలనూ లెక్క లేకుండా వాడేశారు. ఈ స్తూపానికి వెనుక ప్రతిమా గృహముంది. అదీ చాలా అందంగా నిర్మించబడ్డది. ప్రతిమా గృహపు స్తంభాలూ ద్వారాలు, గవాక్షలూ—అన్నీ బంగారు పూతపూసి వున్నాయి. భిక్షువుల నివాసాల్ని కూడా ఇలాగే కళాత్మకంగా, అధిక ధనవ్యయంతో నిర్మించారు. ఈ దేశపు రాజుల పేర్లకు ముందు 'విజయ' శబ్దం వుంటుంది. ఈ 'విజయ' రాజ వంశాన్ని ఐదు వందల సంవత్సరాల క్రితం, విజయ సంభవు డనేవాడు స్థాపించాడు. విజయ సంభవుడు సింహాసనాన్ని అధి

ష్టించిన ఐ పేశ్శకు బౌద్ధమతా న్నవలంబించాడు. ఇతడి గురువు వైరో చనుడు, భారతీయ లిపి ఆధారంగా ఓ నూతనమైన లిపిని సృష్టించాడు. ఈ దేశపు రాజులూ, ప్రజలూ బౌద్ధ ధర్మంపట్ల ఎనలేని భక్తి శ్రద్ధల్ని కలిగివుంటారు. రాజ కుమారులూ, రాజ కన్యలూ బౌద్ధ సంఘాల్లో చేరి భిక్షువు లవుతుంటారు. ఇక్కడి భిక్షువులు, హీనయానులేకానీ, మహా యానులేకానీ, వినయ నియమాలను తు. చ. తప్పకుండా పాటిస్తారు. ఇక్కడి ప్రజలపై బౌద్ధమత ప్రభావం స్పష్టంగా కనుపిస్తుంది. ప్రజలు మృదు ప్రకృతిగలవారు. సత్యశీలురు, న్యాయప్రియులు. వీరికి సాహిత్య ప్రేమ అధికం. విశాలహృదయులు, ఉత్సవాల్లో వినోదాల్లో చాలా ఉత్సా హంగాపాల్గొంటారు. వీరికి నృత్యగానాదులపై ఆసక్తి ఎక్కువ. శతాబ్దాల క్రితం ఈ దేశపు మహా రాజొకడు చీనాదేశపు రాజకన్యను వివాహ మాడాడు. మొదటగా చీనాంశుకాన్ని (పట్టు వస్త్రాల్ని) ఆమె ఈ దేశా నికి తీసుకువచ్చింది. సామాన్యులు నూలు వస్త్రాల్ని ధరిస్తారు. ధనికులు పలుచని పట్టు వస్త్రాలపై ఆసక్తిని కనబరుస్తారు. చలికాలంలో, చర్మం లేక ఉన్ని దుస్తుల్ని ధరిస్తుంటారు. చలికాలంలో బీదవారు దూది నింపిన దుస్తుల్ని ధరిస్తుంటారు.

# 13 వ అధ్యాయం

## కహాచీలో....

*( క్రీ. శ. 552 - 53 )*

ఈమాటు కుస్తన్ నగరంలో నాలుగు నెల్లున్నాము. ఈ నాలుగు నెల్లలోనూ ఇక్కడి ప్రజలనూ, వారి జీవిత విధానాలనూ ఇంకా కొంత విపులంగా అర్థం చేసుకోవడానికి అవకాశమేర్పడ్డది. వీరు మధుర స్వభావులు. "అతిథిదేవోభవ"అన్నసూక్తిని నిజంగా చరితార్థం చేస్తున్నారు. కుస్తన్ ప్రజలు। తరువాత కూచీకి వెళ్ళాము. కూచీ జాతి ప్రపంచంలోకే అద్వితీయమైన జాతి. ఎన్నో ఉత్తమ లక్షణాలూ, గుణాలూ కల జాతి। ఖసగిరి నుండి సీతానది పాయమీదుగా ప్రయాణంచేసి కూచీకి సులభంగా వెళ్ళవచ్చును. అయితే, కుస్తన్ ప్రజలు కుస్తన్నదిమీదుగా వెళ్ళి సీతానదిని చేరి, అక్కడినుండి సులభంగా కూచీ దేశం వెడతారు. ఇక్కడి ప్రజలు తమ రాజధాని పేరుతోనే తమ నదినికూడా పిలుస్తారు. భిక్షువులు కుస్తన్నది అనీ అంటారు లేక దీన్ని సీతానది అనీ అంటారు. నా వరకూ నాకు కుస్తన్నదిని సీతాఅనడమా లేకఖసగిరి సమీపాన్నుండి వచ్చేనది (యార్కండ్నది)ని సీతా అనడమా, అన్న సమస్య నిరంతరం వేధిస్తూండేది. కుస్తన్నది నేరుగా ఉత్తరానికి ప్రవహించి కూచీ సమీపాన ఆ నదిని యార్కండ్ నది కలుస్తుంది. పీటి దృష్ట్యా చూస్తే కుస్తన్ నదే గొప్పది. వైభవము, విద్యా ఇతర అనేక విషయాల్లో కుస్తన్ నగరం కాంస్య దేశం మొత్తంలోకి ప్రథమ స్థానాన్ని పొందుతుంది. కుస్తన్నది రాజధానినుండి నేరుగా ఉత్తరానికి వెళ్తుందని చెప్పాను. ఒక రోజు ప్రయాణ దూరం వెళ్ళేసరికి ఇసుక ఎడారి వచ్చేస్తుంది.నిధికి రెండువైపులా అనంత దూరాలవరకూ ఇసుకమాత్రం

కనిపిస్తుంటుంది. కుస్తన్ నదిని ఎడారి తనలో లీనం చేసుకోవడానికి నిరంతరం ప్రయత్నిస్తూంటుంది. నది ఎడారి ప్రయత్నాలను వమ్ము చేస్తూ అజేయంగా ముందుకు వెళ్ళిపోతూ వుంటుంది. నది - ఎడారుల ఈ సంఘర్షణ నుండి మానవుడు కొంత లాభాన్ని పొందుతున్నాడు. కుస్తన్ నది యొక్క ఉభయ తీరాల్లోనూ మానవులు గ్రామాల్ని నిర్మించుకున్నారు. కాలవలు త్రవ్వుకొని, భూములకు నీరు పెట్టుకుంటున్నారు. తోటల్ని పెంచి, పంటలు పండించి ఎడారిని సస్యసమృద్ధం చేస్తున్నారు. కుస్తన్ నదీతీరాన ప్రయాణం చేస్తుంటే వెనకటిలా దారి తప్పుతామేమోనని భయపడ నవసరంలేదు. మంచినీరు దొరకదేమోనన్న సంశయమూ వుండదు. అయితే, ముందుకు పోయిన కొలదీ నదిలో నీరు తగ్గుతూంటుంది. కుస్తన్. సీతా నదుల సంగమ స్థానంలో కుస్తన్నది మరీ క్షీణించి, నామమాత్రావశేషమవుతుంది. కానీ, సీతానదిలో కలిశాక కుస్తన్కూడా సీత అయిపోతుంది! కుస్తన్, సీత నదుల సంగమాన్ని దాటాము. ఉత్తరంగా హిమాచ్ఛాదిత పర్వత పంక్తులు కనుపిస్తున్నాయి. దక్షిణ దిశన ఎడారి వుంది. ఉత్తరపు హిమ శిఖరాల్లో నుండి శ్వేతనది (అక్-సూ) దక్షిణానికి ప్రవహించి సీతానదిలో కలుస్తుంది. శ్వేత, - సీతా నదుల సంగమాన్ని దాటి నదీతీరా న్ననుసరించి ఉత్తరంగా వెళ్ళాము. ఉత్తరానికి వెళ్ళినకొలదీ ఎడారికి దూరమౌతున్నాము. కొంత దూరం పోయాక ఇసుక నగరాన్ని చేరాము. ఇసుక నగరమూ కూచీ దేశంలోని ఒక పట్టణమే! ఈ నగరంలో భిక్షువులు ఆచరణలో హీనయానులూ. భావాల్లో మహాయానులూ! ఇసుక నగరాన్నుండి వాయవ్య దిశకు వ్యాపారులు ప్రయాణించే కాలిబాట ఒకటుంది. ఈ మార్గం దుర్గమమైన మంచు కొండల్లోనుండి, సముద్రంలా విశాలమైన ఓ మహా సరోవర తీరానికి వెడుతుంది. ఆ ప్రదేశం అతి శీతలమైనదే. అయినా, చలికాలంలోనూ సరోవరంలోని నీరు గడ్డ కట్టదుట! కనుకనే ఆ సరోవరాన్ని తప్త సరోవరం (ఇస్సిక్-కుల్) అంటారు. భారత దేశపు హిమాలయాల్లాగానే ఈ హిమవత్పర్వతాలూ చాలా రమణీయ మైనవి. ఈ పర్వతాల్లోనూ చూడదగిన చిత్రవిచిత్రా లెన్నో వున్నాయి. ప్రతి విచిత్రాన్నీ చూడాలని ప్రయత్నించడంవల్ల ఎటు గాలి వీస్తే అటు

ఎగిరిపోయే ఎండుటాకువలె అవుతాము. కూచీ నగరాన్ని చేరడం మా ప్రధానాదర్శం! తప్తసరోవరాన్ని చూడాలన్న కోర్కెను బలవంతాన అణచుకున్నాను. ఇసుక నగరాన్ని, దాని పరిసర గ్రామాల్ని కూచీ దేశంనుండి విడదీయడం జరిగింది. ఈ నగరాన్ని, పరిసరాన్ని ప్రత్యేకం ఓ రాజు పరిపాలిస్తున్నాడు. కూచి జాతి మహా శౌర్య పరాక్రమాలు కలది. ఈ జాతిని నిర్వీర్యం చేయడానికి చీనా ఈ రాజ్యాన్ని రెండు భాగాలుగా విభజించింది. చీనాచేసిన దుస్తంత్రం వల్లనే ఈ ఇసుక నగరాన్ని మరోరాజు అధీనంలో చూస్తున్నాము. లేకపోతే ఇసుక నగరంలో కూడా కూచీ దేశంలోదే.

ఇసుక నగరపు విహారంలో ఒక వారం రోజులున్నాము. అనంతరం తూర్పుగా ప్రయాణం సాగించాము. ఎడమచేతి వైపున ఉత్తరంగా గల మంచుకొండలు చాలా దగ్గరలో వున్నట్లు కనుపిస్తాయి. వాస్తవంలో అవికనుపించినంత దగ్గరలో మాత్రం లేవు! శరదృతువులోనూ, హేమంతం లోనూ ఆకాశం నిర్మలంగా నిరభ్రంగా వుంటుంది. అందువల్లనే, పర్వతాలు చాలా దగ్గిరలోవున్నట్లు భ్రమ కలుగుతుంది. కొండల్లోనుండి ప్రవహించే చిన్నచిన్న నదులెన్నో మా మార్గానికి అడ్డుతగిలాయి. అయితే, ఆ నదుల్లో నీరు చాలా కొద్దిగావుంది. మా ప్రయాణానికి ఎలాంటి ఆటంకమూ జరుగలేదు. మేము మంచుకొండల ప్రక్కగుండా సమానాంతర దూరంలో ప్రయాణం చేస్తున్నాము. కొండలాన్నినుకుని ఎక్కడయినా ప్రసిద్ధ విహారా లున్నాయని తెలిస్తే వెళ్ళి చూచి వస్తున్నాము. ఇసుక నగరానికి కూచీ పట్టణం నూరుక్రోసుల దూరంలో వుంది. అంత తొందరగా వెళ్ళవలసిన పనేమీ లేదు. నిదానంగా, ఒక నెలరోజుల్లో కూచీనగరాన్ని చేరుకున్నాము. తొమ్మిదో నెల (మార్గశిరం) అంత్యాని కొచ్చింది. హేమంతఋతవు ప్రవేశించింది. కూచీ నగరంలో రెండు సంవత్సరాలుండవల్సి వస్తుందనుకోలేదు. రెండు వసంత ఋతువుల్ని కూచీ దేశంలో గడిపాము. ఈ దేశంలో గోధుమ, వరి, జొన్న, సజ్జ అధికంగా పండుతాయి. ద్రాక్ష, దానిమ్మ, సీమరేగి, మొదలైన పండ్లు ఈదేశానికి గొప్ప ప్రసిద్ధిని తెచ్చాయి. ఇక్కడికి ఉత్తరంగా వున్న పర్వతాల్లో అనేక రకాలైన ఖనిజాలు దొరుకుతాయి. బంగారము,

రాగి, ఇనుము – ఆ పర్వతాల్లో దొరికే ముఖ్య ఖనిజాలు. ఈఖని జాలు కూచీ దేశపు సమృద్ధికి తోడ్పడుతున్నాయి. కూచీ ప్రజలు విద్యా ప్రియులు, విశ్వాసపాత్రులు ఇంతటి విద్యావేత్తలూ. విశ్వాసపాత్రులూ, ప్రపంచంలోని మరే జాతిలోనూ లేరన్నా, అతిశయోక్తికాదు. నృత్య, గీత, వాయిద్యాదుల్లో కూచీ జాతి అద్వితీయమైందని చీనీప్రజలూ ఒప్పు కుంటారు. చీనా దేశపు రాజాస్థానాల్లో కూచీ కళాకారులకు ప్రథమస్థానం లభిస్తుంటుంది. వీరు ఉన్నిదుస్తుల్ని ధరిస్తారు. అయితే, వేసవిలోమాత్రం నూలు వస్త్రాల్ని ధరిస్తారు. పురుషులు కేశఖండన గావిస్తుంటారు. గడ్డం పెంచుకోవడంలో అంతగా ఆసక్తివుండదు వీరికి! వీరి తలలు వెనుక భాగంలో పాముపడిగలా అణచుకుని వుంటాయి. తల్లులే శిశువుల తలల్ని అలా అణిచివేస్తారని చెప్తారు.

ఈ నగరాని కిలా ఆలస్యంగా రావడమూ ఒక మేలే అయింది. భారతీయ పండితభిక్షువులు వస్తున్నారన్నవార్త మాకంటే ముందే రాజ ధానికి చేరింది. ఈనగరంలోని భిక్షువులు మా రాకకొరకు ఎదురు చూస్తు న్నారు మేము వెళ్ళేసరికి. కూచీ దేశంలో మొత్తం నూరు వరకూ విహారాలున్నాయి. ఐదువేలమంది వరకూ భిక్షువు లున్నారు. వీరిలో ఎక్కువ భాగం రాజధాని నగరానికి చుట్టుపట్ల వుంటున్నారు. కూచీ నగరం (రాజధాని)లో చాలా విహారా లున్నాయి.రాజ విహారం అన్నింటి కంటే పెద్దది. సంపన్నమైందికూడాను. రాజవిహారంలోనే మేము వుండ డము నిశ్చయమైంది.మహాయాన బౌద్ధులు మాంసాహారాన్ని ముట్టరాదు. కానీ. హీనయానానికి చెందిన సర్వాస్తవాదులూ, మహా విహారవాదులూ, ఇతర ప్రాచీన నికాయాల ననుసరించేవారు మాంసాన్ని తినవచ్చును. హీనయాన వినయ పిటకంలో, తమకోసం కావాలని చంపుకోకపోతే మాంసాహారం తప్పు కాదని చెప్పబడ్డది. ఇతరదేశాల్లోని అనేక విహా రాలు మహాయానాన్ని స్వీకరించాక మాంస భక్షణను వర్జించాయి. కానీ కూచీ దేశంలోని విహారాలు, మహాయానున్ని స్వీకరించినప్పటికీ మాంస నిషేధాన్ని ప్రకటించలేదు. అక్కడి భిక్షువులు మహాయానులయినా మాంసాన్ని భక్షిస్తారు. వినయ నియమాలను పాటిస్తుంటారు. పట్టణానికి రెండు యోజనాల దూరంలో పర్వతాల వద్ద రెండు ప్రాచీన విహారా

లున్నాయి. వాటిలో సుందరమైన బుద్ధ ప్రతిమ లున్నాయి. వాటిలో తూర్పు దిశనగల విహారంలో పచ్చరాతిపై బుద్ధుని పాదాలు మలచ బడినాయి. చరణ చిహ్నాలను చూడడానికి వెళ్ళాము. సింహళంలోనూ ఓ పర్వత శిఖరంపై బుద్ధుని చరణ చిహ్నాలు వున్నట్లు విన్నాము. సింహళంలో వుండగా, ఆ పర్వత శిఖరానికి వెళ్ళి శ్రీ పాదాల్ని దర్శనం చేసుకు వద్దామనుకున్నాము. కానీ, అనుకోని విధంగా ప్రమాదం సంభవించడంవల్ల శ్రీ చరణాల దర్శనం చేసుకోకుండానే వచ్చేశాను. ప్రాచీన కాలంలో బుద్ధ విగ్రహాల్ని పూజించే ఆచారం లేదనీ, ఆ కాలంలో బోధి వృక్షాన్నీ, పీఠాన్నీ, స్తూపాన్నీ బుద్ధునికి ప్రతీకలుగా ఎంచి పూజిస్తూండేవారనీ బుద్ధిలుడు చెప్పగా విన్నాను. బహుశా ఆ రోజుల్లో చరణాలనుకూడా పూజించేవారు గావును. కనిష్కుడి సమయం నుండే బౌద్ధ మతంలో విగ్రహారాధన ప్రారంభమైంది. పచ్చరాతిపై మలచిన శ్రీ పాదాలను చూడగానే "ఇవి యీ దేశంలోని అతి ప్రాచీనమైన పూజా చిహ్నామై వుంటుం" దనుకున్నాను. కానీ, వెంటనే భయం కూడా కలిగింది. అమూల్యమైన రాతిపై మలిచిన ఈ పాదాలు ఏ నీచుడి లోభదృష్టికైనా గురై తేనో? అనుకన్నాను. ఒక్క శ్రీపాదాల గురించే భయమెందుకు? ప్రతి తరమూ, ప్రతి రాజూ, విహారాల్ని వెండి బంగారాల్తో, వజ్ర వైఢూర్యాల్తో అలంకరించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రయత్నంగా విహారాల్లో అపార్ధంగా ధనం ప్రోగుపడుతోంది. ఏనాడైనా ఈ విహారాలన్నీ లోభదృష్టికి గురై, శల్యావశిష్టాలైనా ఆశ్చర్యపడ నవసర ముండదు.

నగరపు పశ్చిమ ద్వారానికి వెలుపల మార్గానికి రెండు వైపులా రెండు బుద్ధ ప్రతిమ లున్నాయి. అవిచాలా పెద్దవి. ఒక్కొక్కటీ అరవై బారల ఎత్తు వుంటుంది. పంచ వర్షీయ మహోత్సవం ఈ ప్రతిమల వద్దే జరుగుతుంది. ఈ ఉత్సవం శరత్ పౌర్ణమి పదిరోజు లుండనగా ప్రారంభమై, పౌర్ణమి వరకూ జరుగుతుంది. దేశంలోని స్త్రీ పురుషులందరూ ఈ ఉత్సవంలో పాల్గొంటారు. కుస్తన్ నగరంలో లాగానే ఇక్కడకూడా విహారాలన్నీ వంతుల ప్రకారం బుద్ధ ప్రతిమల్ని వూరేగిస్తాయి. నగరానికి వాయవ్య దిశన, నది ఒడ్డున ఆశ్చర్య-విహారముంది. ఈవిహారపు భిక్షు

వులు విద్యలో, వినయపాలనలలో గొప్ప ప్రసిద్ధిని పొందారు. కూచీదేశ భిక్షువులు మాతృభాషను ఎటూ అభ్యసిస్తారు:ధర్మగ్రంథ పఠనం కొరకు పాళీభాషనుకూడా అభ్యసిస్తారు। ఇక్కడి విహారాల్లో బౌద్ధ పిటకాల అధ్యయనంతోపాటు పాణిని వ్యాకరణ సూత్రాలూ, వ్యాకరణ మహాభాష్యం మొదలైన భారతీయ గ్రంథలనూ అధ్యయనం చేస్తారు, ఇంత చక్కగా ఈ గ్రంథాల అధ్యయనం కేవలం మధ్యప్రాంతంలో మాత్రం చూడగలం. అన్యత్రా దుర్లభం: దీన్నిబట్టే ఇక్కడి భిక్షువుల విద్యానురాగాన్నివూహించవచ్చును. ఈదేశంలో ఇంతటి విద్యాభిలాష వుండడం వలననే వినయ పిటకాన్నీ, ఇతర శాస్త్రాల్నీ అధ్యయనం చేయడానికి సుదూర దేశాలనుండి కూడా ఇక్కడికి విద్యార్థులు వస్తూవుంటారు.

'కూచీ' ని ఇక్కడి ప్రజలు 'కుశీ' అనీ, లేక 'కుశ' అనో అంటారు. వీళ్ళసలు 'చ' ని 'శ' అని ఉచ్చరిస్తారు. వీరి భాష భారతీయ భాషల కోవకు చెందిందే: అయినా, కూచీ భాషకూ భారతీయ భాషలకూ ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది।

ఉదాహరణకు :—

| సంస్కృతం : | కూచీభాష : | సంస్కృతం : | కూచీభాష : |
|---|---|---|---|
| అవీచి | అవిశ | 7 సప్త | శ్వద్ధ |
| ద్వీప | ద్వీప్ | 8 అష్ట | ఔకధీ |
| కలియుగ | కలియుక్ | 9 నవ | జూ |
| రూప | రూప్ | 10 దశ | శక్ |
| అంజలి | అచయిలీ | 11 ఏకాదశ | శక్మపి |
| అమాత్య | అమాశ్ | 12 ద్వాదశ | శక్వేపి |
| చక్ర | చక్కర్ | 20 వింశతి | వికీ |
| గంగా | గంగ్ | 30 త్రిశంత్ | తరియా |
| మర్గఫల్ | మార్కపల్ | 40 చతుర్వింశత్ | ప్త్వరాక్ |
| రామ్ | రామే | 50 పంచాశత్ | ప్శ్యాజక్ |
| లక్ష్మణ | ల్యాక్మ్సం | 60 షష్టి | శక్సక్ |
| దశగ్రీవ | దశగ్రీవే | 70 సప్తతి | శక్తుక్ |

| | | | |
|---|---|---|---|
| లంకా | లాంక | 80 అశీతి | ఓక్తుక్ |
| 1 ఏకం | శ | 90 నవతి | న్వుక్ |
| 2 ద్వే | పే | 100 శత | కస్థ |
| 3 త్రీ | త్రి | 1000 సహస్ర | వల్త్రి |
| 4 చత్వారి | స్త్వర | 10000 దశ సహస్ర | తూమా |
| 5 పంచ | పజ | కోటి | కోరి |
| 6 షట్ | షక్ | | |

కూచీ నగరంలో కనిష్కమహారాజు కట్టించిన విహారాలేమీ లేవు. కనిష్కుడూ, అశోకుడూ కట్టించిన స్తూపాలున్నాయి. 'కూచీ' 'కుశ' ఈ రెండు పేర్లూ ఒక్కటే నని తెలుసుకున్నాను. కనిష్కుని వంశాన్ని గురించి ఇలా చెప్పబడ్డది: "కోషానో సౌనానో సావ" (కుషా దేశపు చక్రవర్తులు) ఈ సూక్తి వలన కుషాణ వంశం కూచీదేశానికి సంబంధించిందేనని స్పష్టమౌతోంది. అందువలననే గావును, కనిష్కుడు తమ వంశపు మాతృభూమైన కూచీని ప్రయత్న పూర్వకంగా తన రాజ్యంలో కలుపుకున్నాడు. కూచీ ప్రజలు, ఉత్సవాల్లో, వినోదాల్లో, ఆట పాటల్లో మహోత్సాహంతో పాల్గొంటారు. ఆ సమయంలో వారు కేవలం విలాస పురుషుల్లా వుంటారు. కానీ, అవసరమొస్తే ప్రతి కూచీ పురుషుడూ ఒక మహా వీరుడై పోతాడు. అయితే, కూచీ ప్రజల సంఖ్యాబలం అత్యల్పం। ప్రక్కలో ఆవార, త్యోర్క, చీనా మొదలైన సంఖ్యాబల సమృద్ధమైన దేశా లున్నాయి. ఇలాంటి దేశాల మధ్యన వుంటూ తామెంతటి త్యాగాలు చేసినా. సాహసాన్ని ప్రదర్శించి పోరాడినా స్వతంత్రంగా, స్వేచ్ఛగా మనగలగడం అసంభవం అన్న విషయం గతానుభవం తెలిపిన కటు సత్యం। ఏ మహారాజుకో, లేక, చక్రవర్తికో అధీనులై వుండడమే శ్రేయస్కరమని తెలుసుకున్నారు కూచీ ప్రజలు। హూణులు చాలా కాలం ఈ దేశాన్ని పరిపాలించారు. చీనీ దేశీయులు, ఆవారులూ పరిపాలించారు. ఆవారులను త్యోర్కులు జయించారని తెలియగానే వారి ఆధీనతకూ అంగీకరించారు. కూచీ నగరానికి వచ్చాక ఆవారులకూ, త్యోర్కులకూ మధ్య సంభవించిన యుద్ధం ముగిసిందని తెలుసుకున్నాము. అయినా, చీనా వెళ్ళడం దుస్తరంగానే వుంది।

ఈ నగరానికి వచ్చాక కుమార జీవుని గురించి విన్నాము. ఇతడు ఈ కూచీ నగరంలోనే రెండు శతాబ్దాలక్రితం రాజ వంశంలో జన్మించాడు. పితృదేశమైన కాశ్మీరంలోనూ, మాతృదేశమైన కూచీలోనూ వివిధ శాస్త్రాలనూ అభ్యసించాడు. మహా విద్వాంసుడై, కూచీనగర మహారాజుకు గురువుగా గొప్ప కీర్తి నార్జించాడు. ఇతడి కీర్తి సువాసనలు చీనాదేశం వరకూ వ్యాపించాయి. ఇతడికోసం చీనా మహారాజు కూచీ రాజుతో యుద్ధం చేశాడు. జయించి, విజయ స్మారకంగా కుమార జీవుని తన దేశానికి తీసుకువెళ్ళాడు. చీనా దేశంలో నేను చేసిన అత్యల్ప ధార్మిక కార్యక్రమాలకు ఈ కుమార జీవుడే ఆదర్శం. నేను సంస్కృత గ్రంథాలను చీనీ భాషలోకి అనువదించేప్పుడూ ఈ కుమార జీవుణ్ణే ఆదర్శంగా పెట్టుకున్నాను. ఇతడికి తన మాతృదేశంమీద ప్రేమాభిమానాలు మెండు. ఇంతవరకూ ఎంతోమంది బుద్ధులు ఉద్భవించారు. వివిధ దేశాల్లోను ఉద్భవించిన బుద్ధుల సంఖ్యను కుమార జీవుడిలా ప్రకటించాడు. కూచీలో 99 మంది, ఇసుక నగరంలో 25 మంది, కపిలవస్తులో 20 మంది, వారణాసిలో 60 మంది, ఉద్యాన దేశంలో 26మంది చీనా దేశంలో 225 మంది, పురుషపురంలో 100 మంది - బుద్ధులు ఉద్భవించారని ప్రకటించాడు. కూచీ దేశంలో వుండగా అతణ్ణి గురించి మేము సంపూర్ణంగా తెల్సుకోలేకపోయాము. కాకపోతే. కుమారజీవుడు చాలా సంస్కృత గ్రంథాలను చీనీ భాషలోకి అనువాదం చేశాడనీ, ఆ దేశంలో గొప్ప ఆచార్యుడిగా కీర్తి నార్జించాడనీ మాత్రం తెల్సుకోగలిగాము. చీనాదేశం వెళ్ళాకనే కుమార జీవుణ్ణి గురించి పూర్తిగా తెల్సుకోవడం జరిగింది.

కూచీభిక్షువులు ధర్మగ్రంథాల్ని భారతీయభాషలోనే(సంస్కృతం) చదువుతారు. వాళ్ళు కఠిన పరిశ్రమచేసి, వ్యాకరణాన్ని, అన్యశాస్త్రాల్ని అభ్యసిస్తారు. వారి సంస్కృత జ్ఞానం నిజంగా ప్రశంసించదగింది. అయితే. కూచీదేశంలోని గృహస్థులకు సంస్కృతం అలభ్యమైన వస్తువు. వారు సంస్కృత గ్రంథాల్లోని ధార్మిక విషయాలను అర్థం చేసుకోవడం దుర్లభం। గృహస్థులకూ, సాధారణులకూ ధార్మిక జ్ఞానాన్ని కలిగించడానికి, సంస్కృత పాణీ భాషల్లోని గ్రంథాల నెన్నింటినో తమ మాతృ

భాషలోకి అనువదించారు. కూచీ భిక్షువులు. కూచీ ప్రజలకు సంగీతమన్నా నాట్యమన్నా చాలా ఇష్టం! కూచీ భాషలో స్వతంత్ర నాటకాలేకాక, సంస్కృతాన్నుంచి అనువాదం చేసుకున్న నాటకాలుకూడా బహుళంగా వున్నాయి. "నంద ప్రవరాజన్" (నంద ప్రవ్రజ్యా). "నందవిహార పాలన" మొదలైన నాటకాలు ఎన్నో కూచీ భాషలో వున్నాయి. ఈ నాటకాల్ని చాలా చక్కగా అభినయిస్తా రక్కడి ప్రజలు. మహోత్సవ సమయంలో మైత్రేయ బుద్ధుని జీవితాన్ని నాటకంగా పది రోజులూ అభినయిస్తారు. మైత్రేయ బుద్ధుడంటే ఇక్కడి ప్రజలకు ఎంతో ఇష్టం. గౌతమ బుద్ధుని భిక్షు జీవితం కంటే, మైత్రేయ బుద్ధుని గృహస్థజీవితం అభినయానికి వీలుగా వుంటుంది. అందువల్లనే అనుకుంటా, ఇక్కడి ప్రజలు గౌతమ బుద్ధుని కంటే, మైత్రేయ బుద్ధుడే మహిమాన్వితు డంటారు!

ఆశ్చర్య విహారం, రాజవిహారం — రెండింటిలోనూ వుంటూండే వాడిని. భిక్షువులు బలవంతం చేయడం వలన ఆశ్చర్యవిహారంలోనూ ఒక వర్షావాసాన్ని గడిపాము. కూచీ నగరంలో సుఖంగా కాలం గడిచేది. నేను కోరకపోయినా, రాజులూ, అమాత్యులూ నా పట్ల గౌరవాదర భావాలను ప్రదర్శిస్తుండేవారు. నన్నక్కడే వుండిపొమ్మని భిక్షువులు అభ్యర్థిస్తుండేవారు. కానీ, ఇంత త్వరలో, ఇంత అకస్మాత్తుగా యాత్రా సంకల్పాన్ని మార్చుకోవడం నా కిష్టంలేదు. నా సహచరులైన ముగ్గురు భిక్షువులూ ఈ రెండు సంవత్సరాల కాలాన్ని సద్వినియోగపరుచుకున్నా రనే చెప్పవచ్చు. చాలా శ్రద్ధతో అధ్యయనం చేశారు. సంఘిలుడు ప్రతిభావంతుడైన యువకుడు, మంచి సాహసుడుకూడాను. పైకి కన బరచేవాణ్ణి కాదు గానీ, అతడంటే నాకు ప్రత్యేకమైన అభిమానం వుండేది. కూచీ దేశంలో ఓ విచిత్రమైన ఆచారం వుంది. ఒక భిక్షువు తన యిష్టాన్నిబట్టి ఎన్నిసార్లయినా గృహస్థు కావచ్చును. అలాగే ఒక గృహస్థుకూడా తనకు ఇష్టం వచ్చినప్పుడు భిక్షువయిపోవచ్చును ఇవ్వాల్టి భిక్షువు రేపు గృహస్థుగా కనబడడమూ, నిన్నటి గృహస్థు ఈ రోజు భిక్షువుగా దర్శన మీయడమూ ఈ దేశంలో సహజం. ఈ ఆచారం మొదట నా మనస్సును బాధించింది. "వీరు ఆమోదప్రియులని ఒప్పు

కుంటాను. తమ జీవితాలతో ఎటూ ఆటాడుతూనే వుంటారు కానీ, ప్రవ్రజ్యతోకూడా ఎందుకిలా ఆటాడుతారు ?" అనుకునేవాణ్ణి. కూచీ ప్రజల్ని గురించి యోచించేప్పుడు వైశాలీ నగరపు భిక్షువులు జ్ఞప్తికి వచ్చేవారు. బుద్ధ భగవానుడు వైశాలీ యువతీ యువకుల్ని స్వర్గంలోని ముప్ఫైమూడు కోట్లమంది దేవకుమారులకూ, దేవకుమారికలకూ పోల్చాడు. కూచీ స్త్రీ పురుషుల్ని చూస్తుంటే దేవకుమారులూ, దేవకుమారికలూ జ్ఞప్తికి వస్తున్నారు. ఇంత అందమైన స్త్రీ పురుషుల్ని మరే జాతిలోనూ చూడలేదు. అయితే చీనీ దేశీయులు కూచీజాతి సౌందర్యవంతమైన జాతి అని ఒప్పుకోరు. వీరి బంగారు రంగు కేశాల్ని, అగ్నిలాంటి ఎర్రని శరీర రంగునూ చూసి కోతు లనేవారు. ప్రతిదేశమూ సౌందర్యానికి ప్రత్యేకమైన దృష్టికోణాన్ని అలవరచుకుంది. భారతీయులు ఏ రూపాన్నీ, రంగునీ శరీర సౌందర్యానికి అత్యున్నత ప్రతీకలుగా భావిస్తుంటారో ఆ రూపు - రంగుల్ని కూచీ యువతీ యువకుల్లో చూడగలం. కూచీ ప్రజలు భిక్షువుల్ని చాలా గౌరవిస్తారు భిక్షువుల పట్ల సదా ప్రేమాదరాల్ని, స్నేహాన్నీ ప్రదర్శిస్తుంటారు. మిత్రులతో, విదేశీయులతో నిష్కపటంగా ప్రవర్తిస్తారు. త్యోర్కులూ, ఆవారులూ చీనీ దేశీయుల్ని పోలివుంటారు. చట్టిముక్కులూ, వంకర కండ్లూ, మీసాలూ, గడ్డం మొలవని ముఖాలూ - వాళ్ళ ఆకారాలు మన కంతగా నచ్చవు. ఆవారులూ, త్యోర్కులూ తిరుగుబోతుజాతి తెగలు. వారు క్రూరులు, అనాగరికులు, నిరక్షరకుక్షులు. అయితే కూచి ప్రజల మధుర ప్రవర్తన అలాంటి తిరుగుబోతు జాతుల్ని ఆకర్షించింది. కూచీయులు యుద్ధభూమిలో శత్రువుపట్ల యమ భటులౌతారు. యుద్ధక్షేత్రాన్ని దాటి బయటకువస్తే శత్రువునైనా ప్రేమతో ఆలింగనం చేసుకోవడానికి సిద్ధంగా ఉంటారు. ఆవారులకూ, త్యోర్కులకూ మధ్య సంభవించిన ఈ యుద్ధంలో కూచిజాతి తిరుగలిలోపడ్డ పప్పుగింజలా నలిగిపోయేదే. కానీ, తెలివిగా వ్యవహరించి ఏ మాత్రం దెబ్బతినకుండా తప్పుకున్నారు.

కూచీ ప్రజలు ప్రవ్రజ్య (భిక్షుత్వం)తో ఎందుకిలా ఆటాడుతారు ? అన్న ప్రశ్నకు సమాధానం త్వరలోనే లభించింది. ముప్ఫై

మూడు కోట్ల దేవకుమారులూ, దేవకుమారికలుకూడా ఇలాగే చేసేవారుట. వీరికి సుఖంగా, విలాసంగా జీవించటానికి కావల్సిన సమస్త సంపదలూ వున్నాయి. వాటిని ఆనంద పూర్వకంగా అనుభవించటానికి కావల్సిన ఉదాత్త, అత్యున్నత మనస్తత్వమూ వుంది. దుఃఖము, బాధలు అంటే ఏమిటో వీరికి తెలియవు. ఒకవేళ జీవితంలో ఏవైనా బాధలువున్నా, వాటిని ఇతర్ల ముందు చెప్పుకోరు. అలా తమ బాధల్ని ఇతర్లకు చెప్పుకోవడం ఆత్మ గౌరవానికి లోటుగా భావిస్తారు. శిశువు జన్మించిది మొదలు అతడు పెరిగి పెద్దవాడై చనిపోయేవరకూ మొత్తం జీవితాన్ని ఆనందంతోనే గడుపుతాడు. దుఃఖమన్నా, దీనత్వమన్నా ఏమిటో వాళ్ళకు తెలియదు. జీవితం అంటే ఆనందాన్ని ప్రసాదించే ఓ పవిత్రమైన సాధన అని వీరి భావన। కూచీ దేశం ఇంత త్వరగా హీనయానం నుండి మహాయానంలోకి మారిపోవడానికి ఈ దృష్టికోణం ఓ ప్రధాన కారణ మనుకుంటున్నాను. హీనయానం కంటే మహాయానంలోని నియమాలు కొంత వరకూ మానవుడికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చాయి. మహాయానావలంబికి జీవిత సౌఖ్యాల్ననుభవించడానికి ఎక్కువ అవకాశం వుంది. కూచీ ప్రజలు ఎంత విలాస ప్రియులయినా, కర్తవ్యాల్ని. విధుల్ని పాటించ డంలో ప్రపంచంలోని ఏ జాతికీ తీసిపోరు. వినయ నియమాల్ని పాటించడంలో వారికి వారే సాటి. ఆశ్చర్య విహారపు భిక్షువులు అత్యంత కఠోరమైన నియమాలను అతి విశ్వాసంతో, సహనంతో పాటిస్తుంటారు. కూచీ ప్రజల నిజాయితీకీ ఆత్మశుద్ధికీ ఇది ఒక నిదర్శనం। ఏ నియమాన్ని స్వీకరించినా, మనోవాక్కాయ కర్మల్తో పాటించడం అసంభవం అనుకున్న క్షణాన నియమాన్ని పూర్తిగా వదిలివేస్తారు. చీవరాన్ని వదిలి గృహస్థు అయిపోతారు. అప్సరసల్లాంటి అనన్య సౌందర్యవంతులుకల ఈ దేశం ప్రవ్రజ్యకు నిజంగానే తగదు. అయితే బుద్ధుని ఉపదేశాలు ఈ దేశంపైన గాఢంగా ప్రభావాన్ని వేశాయి. కేవలం ఈ కూచీ నగరంలోనే ఐదువేల మందిదాకా భిక్షువులున్నారు.

కుమారజీవుడి తండ్రి కాశ్మీరదేశ భిక్షువు. కూచి దేశం వచ్చి, రాజ పరిచయాన్ని, సన్మానాన్ని పొందాడు. ఒకనాడు రాజకుమారి సౌందర్యాన్ని చూసి మోహితుడయ్యాడు. కాషాయంబరాల్ని వదలి గృహస్థు

అయ్యాడు. భిక్షువిలా గృహస్థు కావడం ఇక్కడేమంత ఆశ్చర్యకరమైన విషయం కాదు. కూచి దేశం సౌందర్య నిలయం. ఈ దేశంలో యువతీ యువకులు స్వేచ్ఛగా ప్రేమించుకుంటారు. వారి ప్రేమకు ఎలాంటి ఆటంకాలూ, అభ్యంతరాలూ వుండవు. ఇంతటి సౌందర్యాన్ని చుట్టూ వుంచుకుని ఇలాంటి స్వేచ్ఛాయుత వాతావరణంలో కుమారజీవుడి తండ్రి చలించకుండా వుంటే నిజంగా ఆశ్చర్య పడవల్సిన విషయమయ్యేది. యువతీ యువకుల పరస్పర గౌరవాదరాలు ఏ క్షణాన ప్రగాఢ ప్రేమ బంధానికి కారణమౌతాయో చెప్పడం కష్టం; నేనూ ఏ తరుణీమణి ప్రేమ పాశంలోనైనా బంధింప బడతానేమోనని భయపడుతూండేవాణ్ణి! అలా జరక్కుండా వుండడానికి అనేకమైన జాగ్రత్తల్ని తీసుకుంటూండే వాణ్ణి! నేనూ, బుద్ధిలుడూ కలిసి మా యాత్రలకు సంబంధించిన ఓ ఘనమైన ఆదర్శాన్ని నిర్మించుకున్నాము. ఆ ఆదర్శం చెదిరిపోతే నా హృదయం ఘొల్లుమంటుంది. మిత్రుడికి అపచారం చేసినవాణ్ణవుతాను. ఈ కారణంవల్ల రాజ ప్రాసాదాలకూ, రాజకన్యల ప్రేమాదరాలకు చాలా దూరంగా వుండేవాణ్ణి. కానీ, నా సహచర భిక్షువులిద్దరు నాలా దూరంగా వుండలేకపోయారు.

*　　　*　　　*

బాహ్లిక భిక్షువు పేరు రేవతుడు, ప్రతిభా పంపన్నుడు. విద్యాసక్తి కలవాడు కావడం వలన నాకు సన్నిహితుడయ్యాడు. ఈ యాత్రలో నాకు లభించిన సహచర భిక్షువుల్లాంటి స్నేహితులు, మరే యాత్రలోనూ ఎవరికీ లభించివుండరేమో అనుకుంటున్నాను. రోజులు గడిచి, మా పరిచయం అభివృద్ధయినకొద్దీ మా స్నేహం ప్రగాఢ మవసాగింది. అయితే, నా సహచర భిక్షువు లిద్దర్ని ఈ దేశంలో కోల్పోయినందుకు చాలా విచారించాను. రేవతుడిలో ఎన్నో ఉత్తమ గుణా లున్నాయి. గొప్ప సౌందర్యవంతుడు. ఇతడూ కుషాణ రాజవంశానికి చెందినవాడే. ఈ రాజవంశం అంతరించి రెండు శతాబ్దాలకు పైనయింది. అయితే, బౌద్ధమతం మీది అపారప్రేమనూ, భక్తినీ తెల్పుతూ, కుషాణులు చేసిన సత్కృతులు, వారి కీర్తి గంధాన్ని ఇప్పటికీ నలుదిశలకూ వెదజల్లుతున్నాయి. ఈ రాజవంశం ముందు అనేక శాఖలుగా విభక్తమయింది.

కాలక్రమంలో కొన్ని శాఖలు నశించాయి. కొన్ని శాఖలు ఏధాలకు సామంతులయ్యాయి. రేవతుడు కుషాణ సామంత కులంలో జన్మించాడు. తలిదండ్రులు బౌద్ధమతాను యాయులు. తలిదండ్రుల కోర్కెపై కొద్దిసంవత్సరాల క్రితమే రేవతుడు భిక్షువయ్యాడు. అతడికి దేశాలుతిరగాలన్న కోర్కె వుంది. ఉత్సాహమూ వుంది. విపరీతమైన పరిస్థితులు సంభవించక పోయినట్లయితే, అతడు చిరకాలము నాతో యాత్రలు చేస్తూండేవాడే.

రేవతుడి కుటుంబం కూచి నగరానికీ, కాంస్య దేశానికీ సమీపంలో వుంటూండేది. తమ కుషాణ రాజవంశం ప్రథమంలో కూచి దేశంలోనే పుట్టిందని అతడికి తెలుసు. కూచి నగరానికి వచ్చాక రేవతుడికి ఈ దేశంపైనా, ఇక్కడి ప్రజలపైనా ఓ నూతనమైన ఆకర్షణా, అనురాగమూ కలిగాయి. ఈ దేశానికీ, ఇక్కడి ప్రజలకూ సంబంధించిన చారిత్రక విషయాలన్నింటినీ తెల్సుకోవాలని సంకల్పించుకున్నాడు. కూచి దేశపు స్త్రీ పురుషులు అపూర్వ సౌందర్యవంతులని చెప్పాను. అలా చెప్పడంలో, నా ఉద్దేశ్యం, కూచి దేశంలో కురూపులు, వికృతులూ అసలు లేరని కాదు. ప్రపంచంలోని ఇతర దేశాల్లోకంటే ఈ దేశంలో అందమైన స్త్రీ పురుషుల సంఖ్య ఎక్కువ. రేవతుడు రాజధానీ నగరంలోని అపూర్వ సౌందర్యవంతుల్తో పోటీకి నిలువగల అందగాడు. కాషాయ వస్త్రాలు అతడి సౌందర్యానికి ఏ విధంగానూ అభ్యంతరాన్ని కలిగించవు. కూచీయుల్లాగానే శరీరం స్వర్ణవర్ణంగా వుంటుంది. కండ్లు నీలంగా వుంటాయి. భిక్షువు తలా మీసాలూ గడ్డాల్నేకాక కనుబొమల్ని కూడా గొరిగించుకోవాలి. రేవతుడు కనుబొమలనుకూడా గొరిగించుకున్నాడు. కాషాయాంబరంలోనుండి అతడి శరీర సౌందర్యం చూపరులను ఆకర్షిస్తూవుంటుంది. అతడు చీవరాన్ని ధరించి, భిక్షాపాత్రను పుచ్చుకుని వీధిలోకి వెడితే, మత్తకాసినుల మదమత్త నయనాలెన్నో అతడి చుట్టూ ప్రదక్షిణలు చేస్తూండేవి. నాలుగయిదు ఇళ్ళకు వెళ్ళేసరికి అతడి భిక్షాపాత్ర నిండిపోయేది. కూచి నగరంలోని యువతులు రేవతుడిపై అనురక్త లవుతున్నారని తెల్సుకున్నాను. జాగ్రత్తగా వుండవల్సిందని ఒకటి రెండు మార్లు హెచ్చరించానుకూడా. ఇతడూ కూచి నగ

శాన్ని విడిచి వెళ్ళిపోవడానికి తొందరపడుతూనే వున్నాడు. అయితే, చీనా దేశం వెళ్ళడానికి ఇంకా కొద్ది రోజులు ఆగాలి।

కుషాణ వంశాన్ని గురించిన వివరాల్ని తెల్సుకునే ప్రయత్నంలో రేవతుడికో మంత్రివర్యుడు పరిచయమయ్యాడు. కుషాణ సామంతులందరి లోకీ మంత్రివర్యుడు- 'కూచా' 'కుషా' ఒకే శబ్దముయొక్క భిన్నరూపా లనీ, కుషాణులు ప్రథమంలో కూచి దేశీయులేననీ ఇతడు తేల్చిచెప్పాడు. ఇంకాకూడా మంత్రి ఇలా అన్నాడు: "ఒకప్పుడీ దేశం కుషాణుల్లో అంతః శాఖ అయిన 'ఖస' జాతి అధీనంలో వుండేది. కనుకనే ఈ దేశంలోని ఒక నగరానికి 'ఖసగిరి' (కాశ్గర్) అన్న పేరొచ్చింది. ఐదారు వందల సంవత్సరాల క్రితం వరకూ మనజాతి ప్రజలు తూర్పు, ఉత్తర దేశాల్లో కూడా వుంటూండేవారు. ఇప్పటి అవారులూ, తుర్కులూ మొదట ఒకే జాతి. హూణులు వీరి పూర్వీకులు. వెనుక మన దేశపు సరిహద్దుల్లో హూణు లుంటుండేవారు. మన పూర్వీకులు ఈ సీతా తీరానికి రాకముందు తిరుగుపోతులు. యుద్ధం చేయడంలో వారు అద్వితీయులు. స్థిరనివాసులూ నాగరికులూ అయ్యాకకూడా వారిలో ఆ వెనుకటి యుద్ధనైపుణి ఏమాత్రమో మిగిలివుంది. హూణులు మహాక్రూరులు. వారు అతిభీకరంగా యుద్ధం" చేస్తారు. అయితే, యుద్ధంలో శకులు తమ కేవిధంగాను తీసిపోరని హూణులకు తెలుసు. ఆ(। కుషాణులు శకుల్లో ఒక వుపశాఖ। మాకు ఉత్తరంగా వున్న దేశాల్లో శకు లున్నారు. అక్కడ వారిని "వూసున్" అంటారు. చీనా ప్రజలూ చాలాకాలం క్రితమే గ్రామ జీవితాన్ని స్వీకరించారు. గ్రామ నగర నివాసంవల్ల వారు కోమల హృదయు లయ్యారు. యుద్ధంలో హూణులకు ఎదురు నిలబడ లేకపోయేవారు. తరచు హూణులు వారి గ్రామాల్ని, నగరాల్ని దోచుకునేవారు. హూణులు ఆక్రమణల నుండి రక్షణ పొందడానికి చీనీయులు వేలక్రోసుల పొడవుగల అడ్డు గోడను కట్టుకున్నారు. ఒకప్పుడు చీనా ప్రజలు హూణుల్ని పూర్తిగా అణచి వేశారు. హూణుల్ని వారి జన్మస్థానంనుండి తరిమేశారు. తిరుగుబోతు జీవితం ప్రవహించే నీరులాంటిది నిరంతరం తిరుగుతూండడం హూణులకు అలవాటే. ప్రవహిస్తున్న నీటికి అడ్డుకట్ట వేస్తే. ఆ నీరు ఇంకో వైపు నుండి మార్గాన్నేర్పరచుకోవడం సహజం। చీనా దేశం

లోకి మార్గం బందవడంతో హూణులు మన మాతృభూమి మీదకు వచ్చి పడ్డారు. శక దేశంలోని అనేకమైన పసిరిక బీళ్ళను వశపరచుకున్నారు. మానవుల్ని చిత్రహింసల పాల్జేశారు. హూణులబారినుండి తప్పించుకుని ఎంతోమంది శకులు అన్యదేశాలకు పారిపోయారు. ఆ పారిపోయిన శకుల్లో ఒక భాగం ఈ దేశానికి వచ్చి కుషాణులుగా ప్రసిద్ధినిపొందింది."

మంత్రిగారి మాటల్ని విన్నాక రేవతుడి మనస్సులోని సంశయాలెన్నో నివృత్తమయ్యాయి. ఇద్దరికీ గాఢపరిచయ మేర్పడ్డది. రేవతుడు మంత్రిగారితో మాట్లాడడానికి తరచు వారింటికూడా వెళ్ళిరాసాగాడు. మంత్రిగారికి రేవతుడిమీద పుత్రవాత్సల్యం ఏర్పడ్డది. అప్పుడప్పుడూ రేవతుడితోపాటు నేనూ వారింటికి వెళ్ళేవాణ్ణి. మమ్మల్నెంతోఆదరించేవారు. మా కోసరం ఫలాహారాలను తెప్పిస్తుండేవారు. కానీ, ఈ ఆదరణా, ఆత్మీయతా ఘోర అరిష్టాన్ని తెచ్చి పెడతాయని మేమెవ్వరమూ అనుకోలేదు. కనీసం అలాంటి అనుమానం రేవతుడి కూడా కలుగలేదు. మంత్రి విద్యాప్రియుడు. బౌద్ధ మతాభిమాని. అతడికి పురుష సంతానం లేదు. ఒక్క కొడుకు వున్నా అతన్ని బౌద్ధ సంఘానికి ఇచ్చివేసేవాడే. మంత్రిగారు మాకు తరచు దాన దక్షిణల నర్పిస్తుండే వారు. వారికో కుమార్తె వుంది. ఆమె నవయవ్వనవతే కాక, గొప్ప అందకత్తె! రాజధానిలో, అందంలో ఆమెను మింపగల స్త్రీ లేదు.తమ ఇంటికి వచ్చే భిక్షువుల్ని, తన దండ్రి దయకు, ప్రేమకు పాత్రులైన అన్యుల్ని సహోదరుల్లా భావించి ఆదరిస్తూండేది ఆమె. వారిపట్ల ఏక గర్భ జనితులపై చూపించే ప్రేమను ప్రకటించేది. సహోదరుడిగా మంత్రికుమార్తె ప్రేమను పంచుకోవడంలో రేవతుడికి ఎలాంటి అభ్యంతరమూ కనుపించలేదు. మంత్రి కూతురు తన తల్లితోపాటు అప్పుడప్పుడూ సంఘారామానికి వచ్చి పోతూ వుండేది. ఈ విధంగా ఒక సంవత్సరం గడిచింది. ఈ లోపు రేవతుడు కూచీ ప్రజల్ని గురించిన సమస్త విషయాలనూ తెల్సుకున్నాడు. అనువైన పరిస్థితులు ఏర్పడినట్లయితే ఎన్నడో వెళ్ళిపోయుండేవాళ్ళం! కానీ, తూర్పుగా వెళ్ళడానికి మార్గం సరిగాలేదు. తోఖ్యరుక్కలూ, ఆవారులూ యాత్రికుల్ని హింసించడం తగ్గలేదు. మరి కొన్నాళ్ళు అక్కడే ఉండిపోయాము.

కూచీ ప్రజలు సంగీతప్రియులు, నృత్యగానాదుల్లో నిపుణులు. లలిత కళల్ని అభ్యసించని యువతీ యువకులు వుండరా దేశంలో! మంత్రికన్య సౌందర్యంలోనేకాక నృత్య, గాన సంగీతాది లలిత కళల్లోనూ గొప్ప ప్రసిద్ధిని బడసింది! ఒకనాడు మంత్రి కుమార్తె తమ భవనంలో, ఒక కోష్ఠకంలో కూర్చుని తంత్రీ వాయిద్యాన్ని వాయిస్తోంది. ఆమె సంగీత నైపుణికి రేవతుడు తన్మయుడయ్యాడు. అయితే, ఆమె యొక్క మహోన్నత అభినయ కౌశలాన్ని చూసే అదృష్టం, మరుసటి సంవత్సరం మహోత్సవ సమయంలోగానీ లభించ లేదతడికి. మహోత్సవం పది రోజులూ, రాత్రిళ్ళు నాటక ప్రదర్శనలు జరుగుతాయి. ఆ రోజు "నంద ప్రవ్రజ్య" అనే నాటకం జరుగుతోంది. మహాకవి అశ్వఘోషుడి "సౌందర నంద" కావ్యం ఆధారంగా తీసుకుని కూచీ భాషలో ఎవరో కవి రచించాడీ నాటకాన్ని. "నందుడు" బుద్ధుని సవతి సోదరుడు. అతడి భార్య పేరు 'నందా'!" వీరిద్దరికీ క్రొత్తగా వివాహమైంది. 'నందా' మొత్తం శాక్యగణంలోకే సౌందర్యవతి. నూతన వధూవరులిద్దరూ అహర్నిశలూ గాఢానురాగంలో నిమగ్నులై లోకాన్ని మరిచి వుండేవారు. సిద్ధార్థుడు బుద్ధుడై తన జన్మ భూమయిన కపిలవస్తును చూడడానికి వచ్చాడు. అన్నగారైన బుద్ధునికి సేవచేయడం, వారిపట్ల భక్తి శ్రద్ధల్ని ప్రదర్శించడం తన కర్తవ్యం అనుకున్నాడు నందుడు. తమ్ముని సేవలకు తగిన ప్రతిఫలాన్ని ఇవ్వాలని బుద్ధుడూ అనుకున్నాడు. ఒకనాడు అన్నగారి దర్శనార్థం వెళ్ళిన నందుడు బుద్ధుని భిక్షాపాత్రను తన చేతుల్లోకి తీసుకున్నాడు. బుద్ధుని మనస్సులో ఒక భావన మెరిసింది. కారుమేఘాల్లోని సౌదామినిలా – "ఈ చేతులు భిక్షాపాత్రకే తగివున్నాయి!" అనుకున్నాడు బుద్ధుడు.

అదే సమయంలో నందుని భార్య నందా, సౌధోపరి భాగంలో నిలబడి తల వెంట్రుకల్ని ఆర్పుకుంటోంది. ఒక చెలికత్తె పరుగెత్తుకుంటూ వచ్చి "నీ నందుడు భిక్షాపాత్ర పుచ్చుకుని తథాగతుని వెనకాలే వెళ్తున్నాడు. చూశావా?" అన్నది. నందా పైనుండి తొంగి చూసింది. ఆమె హృదయం కంపించింది. అటు నందుడు, బుద్ధుడు ఎప్పుడు అడుగుతాడా, భిక్షాపాత్ర నతడికి ఇచ్చి, వెనక్కి తిరిగి, భార్యవద్దకు

ఎప్పుడు వెడదామా, అని చూస్తున్నాడు. కానీ బుద్ధుడు భిక్షాపాత్ర నడగలేదు. నందుడు బుద్ధుని వెనకాలే నడిచి వెళ్ళిపోతున్నాడు. నందా ఇక ఎక్కువసేపు మౌనంగా వుండలేకపోయింది. సంకోచాన్ని విడిచి "ఆర్యపుత్రా, త్వరగా వచ్చేయండి!" అని అరిచింది. కాని ఆర్య పుత్రుడు త్వరగా ఎలా రాగలడు? అతడు శాశ్వతంగా బుద్ధపథానుగామి అయ్యాడు. ఆనాటి నాటకంలో ఈ సన్నివేశాన్ని అభినయిస్తున్నారు. మంత్రి కూతురు "నందా" పాత్రను ధరించింది. దృశ్యాంతంలో అద్భుతంగా నటించి ప్రేక్షకుల్లో అపూర్వానుభూతుల్ని కలిగించి ది మంత్రి కూతురు. వేల సంఖ్యలోవున్న దర్శకులు వివశులై కన్నీరు కారుస్తున్నారు. అభినేత్రి భావోద్రిక్తతలో మైమరచి రంగస్థలంపై పడిపోయింది. సహజంగా భిక్షువులెవరూ నృత్య, గాన, సంగీతాది విలాస కార్యక్రమాల్ని తిలకించడానికి వెళ్ళరు. అయితే, ఈ నాటకం బౌద్ధ మతానికీ, బుద్ధజీవితానికీ సంబంధించింది కావడం వలన ప్రేక్షకుల్లో భిక్షువులు కూడా అధికంగానే వున్నారు. ముందు వరుసలో వున్న ప్రేక్షకుల్లో రేవతుడుకూడా వున్నాడు. తన మిత్రుడి కూతురియొక్క సౌందర్యాన్ని అత డీనాడే పరిపూర్తిగా చూస్తున్నాడు చివరి సన్నివేశంలో కరుణరసం పరాకష్ఠ నందుకుంది. ఆక్షణాన మంత్రి కూతురు సౌందర్య దేవతలా భాసించింది. రేవతుడి హృదయంలో అవ్యక్తమైన భావాలు ఎన్నాళ్ళుగా గూడుకట్టుకుంటున్నాయో, ఆ క్షణాన పరిపక్వాన్ని పొందాయి. రేవతుడు మంత్రికుమార్తెను ప్రేమించాడు. మంత్రి కుమార్తె అంతకు ముందే రేవతుడిమీద కన్నువేసిందని వేరే చెప్పనవసరం లేదనుకుంటాను. కూచి దేశంలో భిక్షువులు చీవరాన్ని వదిలి గృహస్థు కావడం క్రొత్త విషయం కాదు, అందుకు మంత్రిగారు గానీ, వారి కూతురుగానీ సిగ్గుపడవల్సిన అవసరమూ లేదు. మంత్రి కూతురు అభినయంలో మంచి ప్రవేశం కలది. ఆ రోజు రేవతుడు సమీపంలో కూర్చుని వుండడంవల్ల అంతటి తన్మయతలో నటించి, స్పృహ తప్పింది.

నాకు సంబంధించిన వరకూ తరువాత కథ ఇది – వీరిద్దరి ప్రేమను గురించి విని మంత్రి, మంత్రి భార్య చాలా సంతోషించారు. వారికో

యోగ్యుడైన అల్లుడు దొరుకుతున్నాడాయె మరి! రేవతుడు ఒక రోజున నా వద్దకువచ్చి, సిగ్గుపడుతూ, కన్నీరు కారుస్తూ గృహస్థు కావడానికి ఆజ్ఞనీయవల్సినదని ప్రార్థించాడు. ఆనాటినుండే మంత్రిగారి ఇల్లరికపు ఉల్లుడయ్యాడు.

*  *  *  *

సుమనుడు కాంభోజ దేశస్థుడు. ఉద్యానంలోనే నాకు పరిచయమయ్యాడు. ఉదాహ్యగా నా విద్యనంతటినీ అభ్యసించిన శిష్యుడితడే! వివిధ దేశాల భిక్షువులూ కొద్దో గొప్పో వైద్య శాస్త్రాన్నభ్యసించడం సహజం. ఉద్యాన దేశపు భిక్షువులుకూడా వైద్యశాస్త్రాన్ని అభ్యసిస్తుంటారు. అసలు బౌద్ధ ధర్మంలోనే వైద్యశాస్త్రానికో ప్రత్యేకమైన స్థాన ముంది. భేషజ్య గురువు రూపంలో బుద్ధుని ప్రతిమలెన్నో వున్నాయి. ప్రజలా భేషజ్య గురువు ప్రతిమల్ని భక్తిభావంతో పూజిస్తుంటారు కూడాను. అలాంటప్పుడు భిక్షువుల దృష్టి చికిత్సా శాస్త్రంమీదకు పోవడం స్వాభావికం. రోగపీడితులైన మానవులకు సేవచేయడం భిక్షువుల ప్రధాన కర్తవ్యం. వైద్యశాస్త్రంలో ఎవరికెంత ఎక్కువగా ప్రవేశముంటే, వారంత సమర్థవంతంగా తమ ఈ కర్తవ్యాన్ని నిర్వహించగలరు. సుమనుడు పరోపకార దృష్టితో వైద్యశాస్త్రాన్ని అభ్యసించాడు. వైద్యశాస్త్రంలో అతడికున్న గహనప్రవేశం నాకు లేదు. వైద్యశాస్త్రాన్ని అభ్యసించాలన్న ఆసక్తి భిక్షువులందరికీ వుంటుంది. అయితే, ఆశాస్త్రాన్ని పరిపూర్ణంగా అధ్యయనం చేయగలిగేది కొందరు మాత్రమే. సుమనుడు ఇతర శాస్త్రాలను అభ్యసించకుండా, కేవలం వైద్యశాస్త్రాన్నే అభ్యసించినట్లయితే, పరిపూర్ణతను పొందేవాడని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఏ శాస్త్రాన్నయినా అభ్యసించడం చాలదు. అభ్యసించిన విషయాల్ని ఆచరణలో పెట్టడానికి కావలసిన అవకాశమూ, తెలివితేటలుకూడా వుండాలి. సుమనుడికి తన విద్యను ప్రదర్శించడానికి తగిన అవకాశాలు లభించాయి. ఆ అవకాశాల్ని చక్కగా వుపయోగించుకోవడానికి కావల్సిన మేధాశక్తి అతడికి వుంది. అతడు విద్యార్థిగా వున్నప్పుడుకూడా రోగులకు వైద్యం చేస్తుండేవాడు. అయితే విద్యాధ్యయనం పూర్తయ్యాక అతడి వైద్యశాస్త్ర ప్రయోగం ఎక్కువయింది. కుస్తన్‌కంటే కూచీ నగరంలో అతడెక్కువ

మందికి వైద్యం చేశాడు. నూటికి నూరుపాళ్ళూ సఫలతను పొందాడు. రోగంలో, దుఃఖంలో వుండి బాధామయ జీవితాన్ని గడుపుతూన్న మానవులకు సేవ చేయడంలో భిక్షువులకో అపూర్వమైన ఆనందం లభిస్తుంది. ఇక మేము మహాయానులం. ప్రాణాలనయినా అర్పించి, ఇతర మానవులకు సుఖసంతోషాలను కలిగించడం మా కర్తవ్యం. అలాంటప్పుడు సుమనుడు ఏకాగ్రచిత్తుడై రోగులకు సేవచేయడంలో, సఫలతను పొందడంలో ఆశ్చర్యమేముంటుంది ? కూచీ నగరంలో ఒక సంవత్సరం వుండేసరికి సుమనుడు వైద్యుడిగా గొప్పప్రసిద్ధి పొందాడు. అతడు అందరు వైద్యుల్లాకాక, రోగికి సేవచేయడం తన పవిత్రకర్తవ్యంగా భావించేవాడు. హృదయాంతర్గతమైన పునీత భావనలు ప్రేరేపించగా నిద్రాహారాలను విసర్జించి రోగులకు వైద్యం చేస్తుండేవాడు. ఎక్కడైనా, ఎవరైనా, రోగంలో అసహాయ స్థితిలో బాధపడుతున్నారని తెలిస్తే, పిలవనవసరం లేకుండా తనకు తానై వెళ్ళి ఆ రోగికి వైద్యం చేసేవాడు.

ఒక రోజున శల్యావశిష్టుడైన వృద్ధుడొకడు సుమనుడి వద్దకు వచ్చాడు. సుమనుణ్ణి చూస్తూనే దుఃఖా న్నాపుకోలేక బావురుమనేశాడు. అతడికో కూతురుంది. ఆమె రోగంతో తీసుకుంటూ, చివరకు ప్రాణావశిష్ట అయింది. వైద్యంచేసి, తన కూతుర్ని బ్రతికించవల్సిందని వృద్ధుడు ప్రార్థించాడు. సుమనుడు వృద్ధుడి వెంట, అతడి ఇంటికి వెళ్ళాడు. వృద్ధుడి నివాసం పట్టణం చివర. ఆ పరిసరాన్ని చూస్తూనే వృద్ధుడి ఆర్థిక స్థితిని అంచనా వేయవచ్చు! ఒకప్పుడు అ పరిసరం మొత్తం పట్టణంలోకే సమృద్ధమైంది. ఇప్పుడు కటిం దరిద్రంతో వేగిపోతోంది. రాజ వంశాలు మారిపోయేప్పుడు ప్రజల్ని దోచుకోవడం సహజం. త్యోర్కులు ప్రబలులై ఆవారులు నగరాన్ని విడిచి వెళ్ళవలసిన స్థితి ఏర్పడ్డాక, పట్టణాన్ని ఇష్టమొచ్చినట్లు దోచుకున్నారు. ప్రజల్ని చిత్రహింసల పాల్చేశారు. కొద్దిరోజులలో ధనికు లందరూ నిరుపేద లయ్యారు. ఈ వృద్ధుడు ఇలా దోచబడిన దురదృష్టవంతుల్లో ఒకడు. ఈ ముసలివాడికి ఒకకొడుకు వుండేవాడు. అతడు ఆవారుల్ని ఎదిరించాడు. ఆవారు లతణ్ణి వెంటనే చంపివేశారు. అంతటితో తృప్తిపడక ముసలివాడి ఇంటిని దోచు

కుని, తగులబెట్టారు. పుత్రశోకంతో ఇతడి భార్య కొద్దిరోజుల క్రితమే చనిపోయింది. కూతురూ అదే సమయంలో జబ్బుపడి చివరకు ప్రాణా పాయస్థితికి వచ్చింది. రాజధానిలోని ఎంతోమంది వైద్యులు వైద్యం చేశారు. కానీ. కూతురి జబ్బు నయంకాలేదు.

సుమనుడు వృద్ధు ణ్ననుసరించి ఓ శిథిల గృహంలోకి వెళ్ళాడు. కూచీ ప్రజలు ఇండ్లను మట్టితో కట్టుకుంటారు. గృహ నిర్మాణంలో కర్రనుగానీ. చెక్కనుగానీ అంతగా వుపయోగించరు. అయితే. మట్టి ఇండ్లనే అలికి. ముగ్గులుపెట్టుకుని శుభ్రంగా, అందంగా వుంచుకుంటారు. వృద్ధుడికి తనఇంటిని బాగుచేసుకునే శారీరక బలంలేదు. కూలీలనుపెట్టి బాగు చేయించుకునే ఆర్థిక వసతిలేదు. వృద్ధుడి నివాసాన్ని చూశాక సుమ నుడి హృదయం కరిగిపోయింది. ఇల్లు పూర్తిగా శిథిలమయింది. కేవలం ఒక గదిమాత్రం వాసయోగ్యంగా వుంది. ఆ గదిలో ఒకమూల, చినిగిన గుడ్డల్ని పరచుకుని ఎవరో పడుకున్నారు. చినిగిందే ఒకవస్త్రం కప్పి వుందా రోగికి! ప్రక్కనే ఒక ముసలామె కూర్చుని వుంది. సుమనుణ్ణి చూడగానే వృద్ధురాలు కన్నీరు కారుస్తూ లేచి అవతలికి వెళ్ళిపోయింది. కూచీయులు తమ దుఃఖాన్ని ప్రకటించి ఇతరుల హృదయాలను శోకా కులంచేసే మన స్తత్వం కలవారు కాదు అయితే, ఓర్పూ, సహనాలు మాత్రం ఎంతవరకూ? వృద్ధురాలు ఆ వృద్ధుడికి చెల్లెలవుతుంది. తన మేనకోడలు చనిపోయిందనుకుంది ఆమె. అందువలననే కన్నీరు కారు స్తోంది. చెల్లెలి ముఖంలోని భావనను అన్న అర్థం చేసుకున్నాడు. నోట మాటలేకుండా నిలబడిపోయాడు. సుమనుడు రెండడుగులు ముందుకువేసి రోగి ముసుగును వత్తిగిలించాడు. అతడు చూసిన దృశ్యం అతికరుణా జనకమయింది. వృద్ధుడి కూతురు పచ్చని చర్మంతో కప్పబడినఎముకల ప్రోగులా కనిపించింది. రోగిలో జీవించివున్న లక్షణాలేవీ కనుపించడం. లేదు. కండ్లు కపాల అస్థికల్లోని రంధ్రాల్లా లోపలికి పీక్కుపోయాయి. మూసుకుని వుండడంవల్ల ఆ కండ్లలో జీవించి వున్న చిహ్నాలేమైనా ఉన్నాయో, లేవో తెల్సుకోవడం సంభవం కాదు. రోగిలో మృత్యులక్ష ణాలే అధికంగా వున్నాయి. సామాన్యుల దృష్టికి ఆ రోగి ఎప్పుడో చని పోయింది. కానీ. వైద్యుల దృష్టివేరు. సుమనుడు కొన్ని క్షణాలు

రోగి ముఖంలోకి కన్నార్పకుండా చూశాడు. చప్పున రోగి చేతిని తన చేతిలోకితీసుకుని నాడిచూశాడు నాడిఆగిపోలేదు. ఎక్కడో అంతర్గతంలో, అత్యంత క్షీణస్థితిలో నాడి కొట్టుకుంటోంది. సుమనుడి ముఖంలో ఉత్సాహను ఉరకలు వేసింది. వృద్ధుడి చేతిలోవున్న తన మందుల సంచీని తీసుకున్నాడు. ఆ సంచీలో. పలుచని మృదువైన మృగచర్మంతోకట్టిన చిన్నచిన్న సంచులెన్నో వున్నాయి. వాటిలో సంజీవి తుల్యమైన మందులెన్నోవున్నాయి. అన్ని సంచుల్లోనుండి ఒకసంచిని విప్పాడు. కుడిచేతి చిటికెనవ్రేలి గోటితో కొద్దిగా మందునుతీశాడు. సుమనుడుకూడా అన్యవైద్యుల్లా తన కుడిచేతి చిటికెనవ్రేలి గోటిని బాగా పెంచేసుకున్నాడు. ఆ మందును రోగి గొంతులోకి వెయ్యాలి, ఎలా? తను ఆ మందును రోగి గొంతులో వేసేలోపే, అతి స్వల్పంగావున్న జీవనలక్షణాలు అంతరించి పోతాయేమోనని అతడి భయం. ఒక గ్లాసులో కాసిని నీటిని తెప్పించాడు. సుమనుడు మందుల సంచిని విప్పేసరికి ముసలివాడి కండ్లల్లో కూతురు బ్రతక వచ్చునన్న ఆశ మెరిసింది. సుమనుడు క్షణము మౌనంగా గడిపాడు, తరువాత "నమో భేషజ్య గురువే .." అంటూ గోటిలోని మందుని రోగి నోట్లో వేశాడు. కాసిని మంచినీటిని పోశాడు. ప్రాణాల్ని బిగబట్టుకుని. ఒక క్షణకాలం రోగి ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు. రోగి గుటకవేసింది. జీవికి ప్రాణాలంటే ఎంత మోహమో? స్వప్నంలోనూ, మూర్ఛాగతమైనప్పుడుకూడా హృదయాంతరాళంలో యెక్కడో ప్రాణాలమీది మోహం మినుకు మినుకు మంటుంది.

ప్రక్కనే నిలబడివున్న వృద్ధుల్ని ఉద్దేశించి, "ఇక ఫరవాలేదు." అన్నాడు సుమనుడు.

వృద్ధుల కయితే ధైర్యాన్నిచ్చాడుగానీ, తనకు తాను ధైర్యాన్ని వహించ లేకపోతున్నాడు సుమనుడు. రెండు క్షణాల అనంతరం వృద్ధుల్ని ఉద్దేశించి మళ్ళీ యిలా అన్నాడు: "మృత్యువు నాలింగనం చేసుకోబోతూన్న మానవుల్ని రక్షించడానికి దీన్నిమించిన మందులేదు. దీన్ని నాగార్జునుడు తయారుచేశాడు. శిష్యపరంపర ననుసరించి నాదాకా వచ్చింది."

ద్రాక్షరసంలో నీరు కలిపి కొంచెం కొంచెంపడుతూండ వల్సిందని చెప్పాడు. సాయంత్రం వొకమాటు వచ్చిచూసి పోతాననికూడా చెప్పాడు. రోగి తల వెంట్రుకలన్నీ రాలిపోయాయి। ఎముకల ప్రోగులావున్నరోగి రూపాన్నిగానీ. కనుముక్కు తీరునుగానీ ఊహించడం ఎలా? సుమనుడు తిరిగి వస్తూ వృద్ధులకు ధైర్యవచనాలను చెప్పాడు. కానీ మనస్సులో ఇలా అనుకున్నాడు: "సాయంత్రం నే నొచ్చేవరకూ ఈమె ప్రాణాలు నిలిస్తే ఇక ఫరవాలేదు."

అపరాహ్ణానంతరం భిక్షువులు పట్టణాల్లోకి వెళ్ళరు. అయితే, వైద్యు లయిన భిక్షువులకు ఈ నియమం వర్తించదు. కనుకనే తనే సాయంత్రం పట్టణంలోకి వచ్చి రోగిని చూస్తానని మాట యిచ్చాడు సుమనుడు. కానీ, సాయంత్ర మవకుండానేవృద్ధుడు సుమనుడి దగ్గరకు పరుగెత్తుకువచ్చాడు. వృద్ధుడి ముఖలక్షణాలు ఆశాజనకంగా వున్నాయి. ఏమంత నిరాశపడ నవసరం లేదనుకున్నాడు సుమనుడు.

వృద్ధుడు "మీరు చెప్పినట్లే ద్రాక్షరసం తాగించాము రోగి కద లడ మేమీలేదు. కానీ, ఈపూట రోగిలో జీవించే లక్షణాలు ఎక్కువగా కనుపిస్తున్నాయి।" అన్నాడు.

సుమనుడి మనస్సు కుదుటపడ్డది. పట్టణంలోకి వెళ్ళి రోగిని చూచాడు. మళ్ళీ మదించ్చాడు. అనుపానాన్ని చెప్పాడు. వెళ్తూ, "నేను తిరిగి రేపు మధ్యాహ్నం రోగిని చూడడానికి వస్తాను. ఈలోపు ఆందోళన కలిగించే పరిస్థితులేమైనా యేర్పడితేనే నా కోసం రాండి। లేకపోతే మీరు అనవసరంగా శ్రమపడి నాకోసం రాకండి।" అన్నాడు వృద్ధుడితో.

సుమనుడు ఈ మధ్య ఎవరికీ అంతగా వైద్యంచేయలేదు. పైగా, ఇంతటి అసాధ్యమైన రోగాన్ని కుదర్చడం మాట అటుంచి, అసలింత వరకూ ఇలాంటి రోగుల్ని చూడనయినాలేదతడు. వైద్యశాస్త్రంలో తనకు కల పరిచయానికీ, అనుభవానికీ కొంచెంగా గర్వపడ్డాడు. భీషణమైన రోగంతో వ్యధపడుతూన్న ఒక రోగి బాధను ఉపశమింప చేయగలిగి నందుకెంతోసంతోషించాడు. రోగిఒకరకంగా శవంఅయిపోయింది. అక్కడి

ప్రజలు సుమనుడు శవాన్ని బ్రతికించాడనే అనుకున్నారు. అలాగే చెప్పుకునేవారు. ఈ అపూర్వమైన సఫలతకు సుమనుడు గొప్ప ఆనందానుభూతిని పొందుతున్నాడు. చర్మం కప్పుకున్న ఎముకల ప్రోగులాంటి ఆరోగిలో మొదట జీవించే లక్షణాలు సూక్ష్మంగాకనుపించాయి. ధమనుల్లో మెల్లగా రక్తసంచారం ప్రారంభమైంది. ఎముకలకూ చర్మానికీ మధ్య మాంసం ఏర్పడసాగింది. పుర్రె లోపలకు పీక్కుపోయిన కండ్లుతిరిగిపైకి రాసాగాయి. కాంతివంతమైన తల వెంట్రుకలు క్రమంగా మొలవసాగాయి. ఒక నెలరోజుల తరువాత రోగి అటూ ఇటూ కదలడానికి కావలసిన బలాన్ని కూర్చుకుంది. సుమనుడు ఆమెను పూర్తి ఆరోగ్యంలో, మామూలు మనిషిగా చూడాలనుకుంటున్నాడు. కనుకనే అతడు ఆమెకు ఇంకా వైద్యం చేస్తున్నాడు. అతడు రోజూవెళ్ళి ఆమెనుచూసి వస్తూండేవాడు. తను నాటిన విత్తనం, మొక్క అయి, పెరిగి పెద్దదవుతూన్నకొద్దీ రైతు అపూర్వ ఆనందాన్ని పొందుతాడు. సుమనుడూ ఆమెను చూచి అమాయకుడైన రైతులాగానే ఆనందాన్ని పొందుతున్నాడు. నా హృదయం చాలా సున్నితమైంది. ఇతర్ల బాధల్ని చూచి నా వ్యక్తిత్వాన్ని కూడా మరచి కన్నీరు కారుస్తుంటాను. సుమనుడి హృదయం నా హృదయం కంటేకూడా మెత్తనిది అతణ్ణి దయాసముద్రుడనే అనవచ్చును. అంతటి దయార్ద్ర హృదయుడు కావడం వల్లనే ఆ రోగిపై అంత శ్రద్ధ తీసుకున్నాడు. నిత్యం వెళ్ళి చూచి వస్తుండే వాడు రోగిని. క్రమేణా రోగిలో వచ్చిన శారీరక మార్పుకు సుమనుడు చకితుడయ్యాడు. ఒకనాడతడు రోగి ముఖంలోకి పరిశీలనగా చూశాడు. ఇప్పుడామె ఆ వెనుకటి ఎముకల ప్రోగుకాదు. విశాల నేత్రాలు స్నిగ్ధమై, సుందరమై మెరుస్తున్నాయి. కనుబొమలు ఎక్కుపెట్టిన మన్మథబాణాల్లా భాసిల్లుతున్నాయి. నల్లని కండ్లలోనుండి కాంతి కిరణాలుఅపూర్వంగా వికీర్ణమౌతున్నాయి. తనను చూసినప్పుడు ఆ కండ్లలో కృతజ్ఞతా భావనా,నునుసిగ్గూ దోబూచులాడుతూండడాన్ని గమనించాడు సుమనుడు. ఆరునెల్ల తరువాత ఆమె పూర్తి ఆరోగ్యాన్ని పొందింది. మామూలు మనిషి అయింది. పాడుపడిన వృద్ధుడి గృహంలో తిరిగి ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. సుమనుడు తన పరిచయుల వద్దనుండి కొంత ఆర్థికసహాయాన్ని చేయించాడు.

ఆ ధనంతో వృద్ధుడు తన ఇంటిని, మరమ్మత్తు చేయించుకుని, నూతన గృహంలా తయారు చేసుకున్నాడు.

తనలోని దయాభావన పరులకు ఇంత గొప్పమేలు చేస్తుందని సుమనుడు ఎన్నడూ ఊహించనయినా లేదు. అయితే, అవ్యాజమైన భావనతో చేసిన సేవే, పరోపకారమే నిజమైన దయకు నిదర్శనం. ఇద్దరు పురుషుల స్నేహంలో సేవా భావనలో, అవ్యాజత, నిస్వార్థత. సంభవం కావచ్చునేమో కానీ. భిన్న జాతులకు చెందిన స్త్రీ పురుషుల స్నేహంలో, సేవలో అవ్యాజతకు స్థానముంటుందా అనేది అనుమానాస్పదమైన విషయమే! స్త్రీ పురుషుల మధ్యకల దయాభావన ఏ క్షణాన ప్రేమభావనగా మారుతుందో ఎవరు చెప్పగలరు ? సుమనుడిలోని దయభావన త్వరలోనే ప్రేమభావనగా మారిపోయింది. నేనింకో మిత్రుణ్ణి కోల్పోయాను.

కూచీ పట్టణానికి వచ్చి రెండు సంవత్సరాలు నిండాయి. ఇద్దరు మిత్రుల్ని పోగొట్టుకోవడంవల్ల నేనూ సంఘిలుడూ చాలా మనస్తాపాన్ని పొందాము. రానురాను మామీద మాకే విశ్వాసం నశించసాగింది. దేవకుమారులూ, దేవకుమారికలతో నిండిన ఈ పట్టణం మహాప్రమాదకరమైందిగా కనుపించసాగింది. అక్కడినుండి ఎంత త్వరగా వెళ్ళిపోతే అంత మంచిదనుకున్నాం. అయితే, చీనా దేశానికి వెళ్ళడానికి మార్గమధ్యంలోని మంచు విడిపడ్డదో, లేదో, తెలియలేదు.

# 14 వ అధ్యాయం

# దిశా పరివర్తన

*(క్రీ. శ. 554)*

కూచీ పట్టణం నుండి ముందుకు పోవడానికి మార్గం సరిగాలేదు. అలా వెళ్ళడం ప్రమాదంకూడాను. కనుకనే కూచీ పట్టణంలో రెండు సంవత్సరాలు వుండిపోయాము. సార్థవాహులు ఎలాంటి ప్రమాదస్థితిలోనూ సరిహద్దుల్ని దాటి అన్యప్రాంతాలకు వ్యాపార నిమిత్తం వెళ్తుంటారు. మా సార్థవాహుడూ సాహసించి ముందుకు వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. అయితే, మేమే అతణ్ణి వారించి ఆపాము. 18 సంవత్సరాల క్రితం, తోర్కులు, మొదటిసారి సువర్ణ పర్వతం వద్ద, తమ ఏలికలైన అవారుల్ని ఓడించారు. ఆనాడు అవారులు ఓడిపోవడానికి రెండు ముఖ్యకారణా లున్నాయి. ఒకటి తోర్కులకు తూమిన్‌లాంటి గొప్ప నాయకుడు దొరికాడు. రెండు స్వయంగా అవారులు, సుఖభోగాల్లో మునిగి దుర్బలులయ్యారు. అవారులూ, తోర్కులూ, చీనా దేశంలోని కొంత భాగాన్ని పరిపాలిస్తున్న తోపాలూ-వీరు ముగ్గురూ హూణజాతికి చెందినవారే. (వీరి భాషలో హూణ్ శబ్దానికి మనుష్యుడని అర్థం! వీరి కీ పేరును అన్యజాతీయులు పెట్టివుంటారు. భారతదేశంలో 'ముండ' శబ్దానికి మనుష్యుడని అర్థం! కానీ, అన్యజాతుల ప్రజలు శబరుల్ని 'ముండాజాతి' అనేవారు!) ఈ హూణులంటే చీనా దేశీయులకే కాక, పారసీకులకూడా చచ్చే భయం! ఈ హూణులు శలభ సాదృశులు. ఈ క్రూరమైన మిడుతలదండు ఎటువెడితే అటు సర్వనాశనమూ, మహాప్రళయమూ సాక్షాత్కరిస్తాయి. చీనా దేశాన్ని పరిపాలిస్తున్న తోషా జాతిలోని ఉపశాఖ 'అశినా' జాతి! రాజ్యభ్రష్టు లయ్యాక ఈ 'అశినా'

జాతి ప్రజలు, సువర్ణ పర్వతపు దక్షిణపు కొసకు పారిపోయి తలదాచు కున్నారు. ప్రథమంలో ఈఅశినా ప్రజల కుటుంబాలు 500లు మాత్రమే! ఈ అయిదు వందల కుటుంబాల ప్రజల్ని ఆవారులు బానిసల్ని చేసు కున్నారు. వీరిచేత ఇనుప గనుల్లో పనులు చేయించేవారు. అతిత్వరలో వీరి సంఖ్యాబలం పెరిగిపోయింది. ఆవారుల క్రింద వుంటూనే, నొక్కా మూటయాభై సంవత్సరాల్లో వీరు మహాబలవంతులయ్యారు. అన్యతిరుగు బోతు జాతుల ప్రజల నెందరినో తమలో కలుపుకున్నారు. ఇక ముందు మేము వెళ్ళవలసినదేశాలు అదో రకంగా వుంటాయి. అక్కడి ప్రజలు కూడా చిత్రంగా వుంటారు. వాళ్ళకళ్ళు నిమీలితంగానూ, కనుబొమలు వంకరగానూ వుంటాయి. సొట్ట ముక్కులు, పైకి వుబికిన దౌడలు. పైగా అక్కడి ప్రజ లందరూ వొకేరకంగా వుంటారు. కొత్తవాళ్ళు ఆ దేశాలకు వెడితే వాదే వీడనీ, వీదే వాడనీ కంగారు పడవల్సివస్తుంది. గడ్డాలూ, మీసాలూ మొలవని వాళ్ళ ముఖాలన్నీ వొకే రకంగా వుండి పోల్చుకోవడానికి శక్యం కాకుండా వుంటాయి. అయితే, వాళ్ళల్లో వాళ్ళు పోల్చుకోగలరు. ఆ దేశాల్లోని ప్రజలందరూ త్యోర్కులే. అయినా, వాళ్ళల్లోనూ కోక త్యోర్కులనీ, కారా త్యోర్కులనీ రెండు తెగలున్నాయి. ఎన్ని తెగ లున్నా, మా దృష్టికి వాళ్ళందరూ వొకటే. వాళ్ళ చేతుల్లో పడ్డామా,ఇక బ్రతుకుమీద ఆశ వదులుకోవల్సిందే.కానీ. ఇప్పుడిప్పుడే ఆవారు సర్దారులు కొందరు బౌద్ధమతానురక్తు లవుతున్నా రని వినికిడి! తోపా రాజుకూడా బౌద్ధ మతాభిమానే. అతడు పర్వతాల్ని తొలిచి విశాలమైన గుహ-విహారాలను నిర్మించాడు. వాటిని చూసి నప్పుడు నాకు విదర్భ దేశపు (అజంతా, ఎల్లోరా) గుహ - విహారాలు జ్ఞప్తికి వచ్చాయి. త్యోర్క సర్దారులుకూడా తోపా వంశాన్ని గురించి గర్విస్తూవుంటారు. ఆ వంశం అనుసరించినది గనుక బౌద్ధ మతమంటే త్యోర్కులకూ అభిమానమే! మేము చీనా దేశం వైపుకే వెడుతూన్నాము. అయితే, త్యోర్కులకూ, ఆవారులకూ ఇతర తిరుగుబోతు జాతులకూ మధ్య ద్వేషానలం తీవ్రంగా రగుల్కొంటోంది. గాడ్పులు మహోధృతంగా వీస్తున్నాయి. ఏ క్షణాన తిరుగుబోతు జాతుల పరస్పర సంఘర్షణ జ్వాలల్లో దగ్ధమైపోతామో తెలియదు. మేము ముందుకువేసే

ప్రతి అడుగూ మృత్యువును సామీప్యానికి తెస్తోంది. అయితే. నేనూ సంఘిలుడూ మృత్యువు నేమాత్రమూ లెక్క-చేయడం లేదు. సంఘిలుడు కాంస్యదేశ నివాసి. అతడికీ కూచీ ప్రజలకూ గాఢమైన సంబంధాలున్నాయి. అతడికి కూచీ భాష బాగా వచ్చును. పైగా, అవారులతోకూడా అతడికి పరిచయాలున్నాయి. అవారుల భాషను అర్థం చేసుకోగలడు. నావరకు నాకు అంధకారంలో ప్రయాణం చేస్తున్నట్టుగావుంది. కాకపోతే పరిసర భాషా సంప్రదాయాలు తెలిసిన సంఘిలుడు ప్రక్క-న వుండడం వల్ల గుడ్డి వెన్నెల ప్రసరించినట్టుగా వుంటోంది.

తూమిన్‌ని గురించి మేము అనేక విషయాలు తెల్సుకున్నాము. అతడు గొప్ప వీరుడేకాకుండా, విద్యావంతుడు, సభ్యపురుషుడు. రాజ్యాధికారి అయ్యాక తిరుగుబోతు జాతి వ్యక్తి విధిగా అనేక విద్యల్ని అభ్యసిస్తాడు. అక్షరాస్యుడౌతాడు. లలిత కళల్లో ప్రవేశాన్ని కల్పించుకుంటాడు. ఔను మరి. సువిస్తృతమైన రాజ్యాన్ని, విద్యాగంధ శూన్యుడైన వ్యక్తి పరిపాలించడం కష్టం। పైగా ముఖతః ఇచ్చే ఆజ్ఞలు సుదూర ప్రదేశాలకు ప్రసారం కావడంకష్టమనీ, ఆలస్యమనీ తిరుగుబోతులకు తెల్సును. నిజం చెప్పాలంటే కూచీ పట్టణంలో ఇంతకాలం వుండకుండా, ఏనాలుగయిదు నెల్లోవుండి, బయల్దేరి నట్టయితేనే చాలా బాగుండేది. అలా చేసినట్టయితే ఇద్దరు సహచరుల్ని గోల్పోవనవసరమూ వుండేదికాదు. ప్రస్తుతం మే మనుభవిస్తున్న బాధలూ తప్పిపోయేవి. కాకపోతే, ఏ ఎల్-ఖ-ఆన్ (ఇలఖాన్ = సమూహ నాయకుడు) చేతిలోనో పడేవాళ్ళం। అతడు మమ్మల్ని తూమిన్ దగ్గరకు తీసుకుపోయేవాడు. మేము కూచీ పట్టణంనుండి బయలుదేరడానికి, రెండు సంవత్సరాల క్రితం తూమిన్ అవారుల్ని ఘోరంగా ఓడించేడు. అవారుల క-అన్ (ఖాన్-రాజు) ఆత్మహత్య చేసుకున్నాడు. కొందరు అవారులు పశ్చిమంగా పారిపోయారు. మరికొందరు చీనా దేశం వెళ్ళిఅక్క-డే స్థిరపడిపోయారు. ఎంతోమంది అవారులు తమ విజేతల్లో కలిసిపోయారు. తూమిన్ ఉన్నివస్త్రంమీద కూర్చున్న రాజుగా ప్రకటించబడ్డాడు. సింహాసనంమీద కూర్చోవడం అంటేనే ఈ తిరుగుబోతులు ఉన్నివస్త్రంమీద కూర్చోవడం అంటారు. వీళ్లు ఉన్నితో ఒకరకమైన వస్త్రాన్ని తయారు

చేస్తారు. ఉన్ని వస్త్రాల్ని తయారుచేయడంలో ఆవారులు మహానేర్ప రులు. కాంస్య దేశీయులకూ ఈ విద్యలో ప్రవేశం వుంది. అయితే, ఆవారుల్తో పోటీపడలేరు.

సామాన్యంగా తిరుగుబోతులు, దేరాలను ఉన్ని వస్త్రాలతో నిర్మించుకుంటూ వుంటారు. నివాసాన్ని మార్చేప్పుడు మృదువైన కర్రల్తో నిర్మించిన దేరాల ఆకారాలను, ముందుగా గుర్రాలపైన తాము వెళ్ళవలసిన చోటికి పంపించుకుంటారు. ఈ ఆకారాలను అక్కడ పాతుకుంటారు. తరువాత ఉన్ని వస్త్రాల్తో వాటిని కప్పేస్తారు. ఈ ఉన్ని దేరాలే వాళ్ళ నివాసాలు. ఈ దేరాలు చాలా సుఖకరంగానూ, వాస యోగ్యంగానూ వుంటాయని స్వానుభవంవల్ల తెలుసుకున్నాను. భారత దేశంలోలాంటి విపరీతమైన ఎండలు ఇక్కడ వుండనిమాట వాస్త వమే ! అయినా, మధ్యాహ్న సమయాల్లో, నిర్మల ఆకాశం క్రింద ఈ సువిశాల మైదానాల్లోనూ ఎండ కొంత వరకూ తన దర్పాన్ని ప్రదర్శి స్తుంది. అలాంటి మధ్యాహ్న సమయాల్లో ఈ ఉన్నిదేరాలు చాలాచల్లగా వుంటాయి. పైగా చలికాలంలో ఈ దేరాలు వెచ్చగా సుఖకరంగా వుంటాయి. వీళ్ళు దేరాలకు మధ్యలో పైన పొగపోవడానికి కంతలు వుంచుతారు. కంతలకు సూటిగా క్రింద పొయ్యిలను ఏర్పాటు చేసు కుంటారు ఈ ప్రదేశాల్లో కట్టెపుల్లలు దొరకడం అసంభవం కావడం వల్ల, ఎండిన పశువుల పెంటనే వంట చెరుగ్గా ఉపయోగిస్తూవుంటారు. గుర్రపు లద్దెలూ, మేక పెంటికలూ - సర్వం వంట చెరుక్కిందే ఉప యోగపడుతూంటుంది ఇక్కడ! త్వరగా మండడానికి, మంట అనడానికి పొయ్యిల్లోకి తోలుతిత్తుల్తో గాలి ఊదుతూంటారు వీళ్ళు! వీళ్ళ నివాసాలు చిన్నవి. పైగా తాత్కాలికమైనవి. దేరాలను వొకచోటి నుండి మరో చోటుకు మారుస్తూనే వుంటారు. అలాంటి స్థితిలో అనవసరమైన సామాను ప్రోగుపడకుండా చూచుకోవడం ముఖ్యం. తిరుగుబోతులు తమ జీవితాలకు అనుగుణంగానే బహు కొద్ది సామాన్లతో జీవ యాత్రను సాగిస్తూంటారు. అప్పటికీ, తిరుగుబోతు సర్దారుల దేరాలు అనేక రకాలైన సామాన్లతో నిండి వుంటాయి. వీళ్ళ దేరాల్లో చీనా, పారసీక దేశాల వస్తువుల్నేకాక, సుమారానకం

భారత దేశపు వస్తువుల్నికూడా చూశాను. చీనా దేశం, పారశీక దేశం, విజంటీన దేశం - ఈ మూడు దేశాలు తిరుగుబోతులకు ఇరుగు పొరుగు దేశాలు. కనుకనే సదా తిరుగుబోతుల ఈర్ష్యాగ్రహాలకు గురి అవుతూం దేవి. భారతదేశం పై మూడు దేశాల్లా తిరుగుబోతులకు పొరుగు దేశం కాదు. తిరుగుబోతులు భారతందేశంపట్ల ఈర్ష్యను ప్రకటించడాన్ని నే నెప్పుడూ చూడలేదు. పైగా, ఎంతో భక్తి భావాన్ని ప్రకటిస్తూండే వారు. తిరుగుబోతుల హృదయాల్లోని భారతదేంమీది ఈ భక్తి భావనకు కారణం వొక్క దూరమే కాదనుకుంటాను. అనేకమంది తిరుగుబోతు సర్దారులు బౌద్ధ ధర్మాను యాయులయ్యారు.తమ సర్దారులు అనుసరించిన బౌద్ధధర్మ ప్రవక్త బుద్ధుని జన్మ భూమి పట్ల తిరుగుబోతులకు భక్తిభావన కలగడం సహజమేకదా! తూమిన్ ఖాన్ క్రిందటి సంవత్సరం- క్రీ. శ. 550 మార్చిలో-చనిపోయాడు. తూమిన్ ఖాన్ పోయాక అతడి కుమారుడు ఇస్తేమికగాన్ - ఇతణ్ని 'ఇసగిఖాన్' అనిఅంటారు. కొద్దికాలం మాత్రం పరిపాలించాడు. తిరుగుబోతుల్లో రాజు పోగానే రాజు కొడుకే రాజ్యాధికారి కావాలన్న నియమ మేమీ లేదు. ఎవరికి బలంవుంటే, ఎవడు రాజ్యాన్ని హస్తగతం చేసుకోగలిగితే, వాడు రాజవుతాడు. వాడే ఉన్ని వస్త్రంమీద కూర్చుని రాజునని ప్రకటించుకుంటాడు. తిరుగుబోతులు తమ రాజుముందు బలి పశువుల్లా, బానిసల్లా తలలువంచరు. అవుసరం అయితే, అతిసాధారణ తిరుగుబోతు కూడా తమ మహారాజుతో వివాదపడడానికి సిద్ధంగా వుంటాడు. తాను యబగూ, శాద్, కగాన్ కావాలనికోరే తిరుగుబోతు తనప్రజల్లోని అధిక సంఖ్యాకుల ఆదరాన్ని పొందవలసి వుంటుంది. వాళ్ళ విశ్వాసాన్ని చూరగొనవలసి వుంటుంది. ఇలాంటిస్థితిలో,రాజు కాగోరే వాడిలోఒక్క శౌర్యంవుంటేనే చాలదు. ఆతడు ప్రజారంజకుడుకూడా అయివుండాలి.

అనాదినుండి ఈనాటివరకూ తిరుగుబోతుల రాజ్యవ్యవస్థ ఒకో రకంగా నడిచింది. తోర్కులూ, అవారులూ, వీళ్ళ పూర్వీకులు హూణులూ, వీళ్ళందరూ ఒకేరకమైన రాజ్యాంగాన్ని అనుసరించారు. తూమిన్ ఖాన్ కొడుకుని రాజ్యచ్యుతుణ్ని చేసి మయూవంశపు సర్దారొకడు రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. ఇతడి రాజ్యంలో

మేము కొంతదూరం ప్రయాణించాము. రాజ్యమంతటినీ అతడుపూర్తిగా తన అధికారంలోకి తెచ్చుకోలేదు. అప్పటికీ ఆవారులు ఇంకా అక్కడక్కడా, యుద్ధం చేస్తూనే వున్నారు. ఇప్పుడు క్రొత్తగా తూమిన్ కుటుంబీకులుకూడా గృహ యుద్ధాన్ని ప్రారంభించారు. తరువాత నేను చీనాదేశంలో వుండేప్పుడు, ముయుఖాన్ అనేవాడు చాలా ప్రతాపవంతుడిగా ప్రసిద్ధిని పొందాడు. ఇతడు "ముయు" వంశస్థాపకుడి కంటేకూడా ఘనమైన కీర్తిని ఆర్జించుకున్నాడు. ముయుఖాన్ తరువాతివాడు తోపాఖాన్ (క్రీ. శ. 569-580) రాజయిన మరుసటి సంవత్సరం, ఒక్క తన వంశాన్నేకాకుండా (క్రీ. శ. 570లో) త్యోర్కులందర్నీ బౌద్ధమతంలో చేర్పించేశాడు.

త్యోర్కుల పేర్లూ, గౌరవవాచకాలైన నామాలూ ఇతర్లకూ చాలా విచిత్రంగావుంటాయి. వీరు తమ ప్రజల్ని 'ఏల్' అంటారు. ఈ పదం భారతీయ భాషల్లోని 'జనం' అన్న శబ్దానికి సమానార్థక మౌతుంది. ఈ 'ఏల్,-జనం-సర్దారుని' కగాన్, అంటారు. కగాన్ అంటే రాజు. ఇతడి అధీనులు యబగూ, షాద్‌లు. కగాన్‌కు యబగూ కుడిచేతి వైపునా, షాద్ ఎడంచేతివైపునా వుంటుంటారు. వీరి స్థానాల ననుసరించే విలువలు కూడా వుంటాయి. వీరిని మన అమాత్యులతో పోల్చుకోవచ్చును. కగాన్ భార్యను కాతూన్ (రాణి) అంటారు. వీరిభాషలో 'కగాన్' అంటే తండ్రి అనే అర్థంకూడా వుంది. నిజంగానే ఇక్కడి 'కగాన్' తన 'ఏల్'తో మహారాజులా కాకుండా, తండ్రిలా వ్యవహరిస్తారు. వీరి భాషలో తల్లిని 'ఓగ్' అంటారు. అయితే, 'ఓగ్' అంటే కోడలూ, దాసుడు, హస్తము అన్న అర్థాలుకూడా వస్తాయి। కగాన్‌కు కుటుంబంలో అందరికంటే అధిక గౌరవం లభిస్తుంటుంది. అధికారం విషయంలో మాత్రం యబగూ, షాద్‌లదే అందరికంటె పైచేయిగా వుంటుంది. కగాన్ ముఖ్యుడు. అతడి తరువాత యబగూ, షాద్‌లు వస్తారు. వీరి తరువాత రాజకుమారులు గణపీయులు. రాజకుమార్లను తరకన్ అనీ, ముయురక్ అనీ, తుతుక్ అనీ అంటారు. వీరిపేర్లకు చివర 'బేగ్' అన్న బిరుదనామం ఉంటుంది. బేగ్ అంటే సర్దార్ అని అర్థం। ఈ రాజకుమారుల తరువాతి స్థానం చిన్న చిన్న ప్రజానాయకులది. ఈ

నాయకుల్ని కరాబుదున్ అంటారు. క్రిందినుండి చూస్తే, అట్టడుగు స్థానం ప్రజల్ది. వారిపైన కరాబుదన్‌లు, వారిపైన బేగ్‌లు వుంటారు. వీరి అందరికీ పైన యబగూ, షాద్‌లూ, కగాన్ వుంటారు. రాజ పరివారంలో కగాన్ తరువాతి స్థానం రాజకుమారులకు చెందుతుంది. వీరి తరువాత రాజకుమారికలూ, తరువాత పరిజనం. సాధారణ దృష్టికి పదవుల్ననుసరించి గౌరవాదరాల్ని ప్రదర్శించుకోవడంలో వీరు అట్టే శ్రద్ధ వహించరేమో అనిపిస్తుంది. కానీ ఉచిత గౌరవాలు లభించని కారణంగా, ఘోరమైన ఉపద్రవాలు జరగడమూ వీరిలో సంభవమే.

తిరుగుబోతుల కుటుంబాల్లో పురుషులకంటే స్త్రీలకే విలువ ఎక్కువగా వుంటుంది. సహజంగానే పురుషుడి మాటకంటే స్త్రీ మాటకే చెలామణి ఎక్కువగా ఉంటుందా కుటుంబాల్లో. వీళ్ళు యుద్ధం చేయడంలోనూ పురుషులకే మాత్రం తీసిపోరు. తిరుగుబోతులు శవాలను తగుల బెడుతూంటారు. అప్పుడప్పుడు పాతిపెడుతూంటారు కూడాను ఒక్కొక్కప్పుడు శవాలను ఆ పళంగానే వదిలివేస్తుంటారు. తిరుగుబోతులు శోకాన్ని ప్రకటించే పద్ధతికూడా విచిత్రంగానే వుంటుంది. గుండెల్ని బాదుకునీ, జుట్టు పీక్కునీ? ఎదుర్రొమ్ముల్ని గోళ్ళతో పీక్కుని రక్తమయం చేసుకునీ. శోకాలు పెడుతూంటారు. దేవతకు శ్వేతాశ్వాన్ని బలి ఈయడం అంటే వీళ్ళకు చాలా ఇష్టం. గుర్రాల్ని, ఇతర పశువుల్ని బలి ఇచ్చి మృతాత్మల్ని సంతుష్టి పరుస్తూంటారు కూడాను. వీళ్ళు తెల్లని దుస్తుల్ని శుభసూచకంగానూ, నల్లని దుస్తుల్ని అశుభసూచకంగానూ భావిస్తుంటారు.

కూచీ నగరంనుండి బయల్దేరేప్పుడు మేము కొంతవరకూ సంతోషంగానే వున్నాము. మేము వెళ్ళవల్సిన ప్రదేశం నాగరికమైంది. కూచీ, కుస్తన్ లాంటి నగరాలగుండానే ఇకమీదటకూడా మేము ప్రయాణం చెయ్యాలి. అక్కడా బౌద్ధమతం బహుళ ప్రచారంలో వుంది. అక్కడి ప్రజలూ బౌద్ధ భిక్షువుల్ని ఆదరభావంతో చూస్తారు. ఎంతో ఆత్మ విశ్వాసంతో ముందుకు వెళ్ళిపోతున్నాము. ఆ ప్రాంత ప్రజలు నగరవాసులే అయినా, వారిని పరిపాలించేవారు, అధికారాన్ని చెలాయించేవారు. తిరుగుబోతులు. ఎక్కడ పశుగ్రాసం కనబడితే అక్కడ డేరాలు వేసుకు

పడివుండే ఈ తిరుగుబోతులు నగరవాసుల్ని చాలా హేయదృష్టితో చూస్తుంటారు. హీనులుగా, దీనులుగా, బానిసలుగా చూస్తారు నగరవాసుల్ని. అలాగే వ్యవహరిస్తారు వారిపట్ల. కనుకనే వీరంటే నగరవాసులకు చచ్చేభయం. సాధారణంగా ప్రతి సార్థవాహుడూ, భిక్షువుల్ని తమతోపాటు తీసుకువెళ్ళడానికీ, వారి రక్షణనూ, ఖర్చునూ తను భరించడానికి సంసిద్ధంగా వుంటాడు. ఇందుకు రెండు కారణాలున్నాయి. సర్వ సామాన్యంగా సార్థవాహులందరూ, బౌద్ధ మతాభిమానులే అయివుండడం ఒక్కారణం. రెండవది : భిక్షువులు తమతోపాటు వుండి, బుద్ధ సూక్తుల్ని పఠనం చేస్తూ వుంటే, మార్గమధ్యలో సంభవించే సమస్త ఆపదలూ వాటంతటవే తొలిగిపోతాయని వారి విశ్వాసం. పైగా భిక్షువులు చెప్పడంవల్ల తిరుగుబోతులు తమను హింసించడం మానుకుంటారని సార్థవాహులకు ఓ నమ్మకం. ఈ నమ్మకం వల్లకూడా సార్థవాహులు మమ్మల్ని తమవెంట తీసుకు వెడుతూంటారు. దారిలో చాలమంది తోర్కబేగ్‌లు (రాజకుమారులు) కలిశారు వాళ్ళందరూ అత్యంత క్రూరులైన తిరుగుబోతులు మాత్రమేకాదు. ఆ రాజకుమారుల్లోనూ కొంత నాగరికతా గంధం కనుపించింది. వాళ్ళు చీనాంబరాల్ని ధరించారు. కాంస్యదేశపు సామంతుల గృహాల్లో మాత్రమే చూడగల, అత్యంత అమూల్యమైన విలాసవస్తువు లెన్నింటినో రాజకుమారులడేరాల్లో చూశాము. మేము తూర్పుగా ప్రయాణిస్తున్నాము. పర్వతపంక్తులు మాకు కుడివైపుగా బారులు తీర్చివున్నాయి. సీతానదీప్రవాహం మాతో దోబూచులాడుతూ ముందుగా సాగిపోతోంది. పర్వతపంక్తుల్లోనుండివచ్చిన చిన్ని చిన్ని నదులెన్నో సీతానదిలో కలిసిపోతున్నాయి. ఎడారి సీతానదికి ఆవల చాలా దూరాన వుంది. మార్గాయాసం ఏమాత్రం లేకుండా సుఖంగా ప్రయాణం చేస్తున్నాము. దారిపొడుగునా గ్రామాలు తగుల్తూనే వున్నాయి. గోధుమ, జొన్నకాక ఇతర అనేకరకాల ధాన్యాలు ఇక్కడ పండుతాయి. పండ్లతోటలుకూడా విరివిగా వున్నాయి. ఇక్కడి ప్రజలు నూలు వస్త్రాలకంటే ఉన్ని వస్త్రాల్ని అధికంగా ధరిస్తారు. ముందుకు పోయిన కొలదీ, నూలు వస్త్రధారణ మరీ తగ్గిపోవడాన్ని గమనించాము. ఇక్కడి ప్రజలందరూ బీదా, ధనికవ్యత్యాసం లేకుండా ఉన్నివస్త్రాల్ని ధరిస్తారు. కాక

పోతే, బీదల దుస్తులు మొరటుగా వుంటాయి. ధనికుల దుస్తులు సన్నగా నాజూగ్గా వుంటాయి. భారతీయుల్లా తలవెంట్రుకల్ని ముడికి అందేట్టు పెంచుకోవడం వీరికి అంతగా నచ్చదు. గడ్డాల్ని పెంచుకోవడంలోనూ వీరికి అట్టే ఆసక్తిలేదు! వీరికీ, తిరుగుబోతులకూ స్పష్టమైన భేదాలెన్నో ఉన్నాయి.

ఇక్కడ మొదటగా మేము చూచినపట్నం పేరు 'అగ్ని' (దీన్నే 'అవినీ' 'కరాశర్' అనికూడా అంటారు). కూచీలాగానే ఇదీ ఒక మంచి పట్నం. ఇక్కడో రాజుకూడా ఉన్నాడు. ఇతడు త్యోక్కుల ఆధీనంలో వుంటాడు. పట్టణానికి ఆగ్నేయమూలగా ఆరుకోసుల దూరంలో ఓ పెద్ద సరోవరం వుంది. నాలుగు కొండల మధ్య ఆనకట్టకట్టి ఈ సరోవరాన్ని ఏర్పరిచారు చిన్ని చిన్ని కాలువలద్వారా పట్టణవాసులు ఈ సరోవర జలాన్ని తమ భూములకు పెట్టుకుంటూ వుంటారు. పట్టణంలో విహారాలు కూడా చాలా వున్నాయి. ఒక వెయ్యిమందిదాకా భిక్షువులు వున్నారు. ఇక్కడి భిక్షువులందరూ హీనయానులే అయినప్పటికీ, వీరి భావాల్లో మహాయానపు ఛాయలు గోచరిస్తాయి! వినయపిటక పాలనలో వీరు భారత దేశాన్ని ఆదర్శంగా పెట్టుకున్నారు. వీరికి మాంసభక్షణ నిషేధం కాదు. అప్పటికి పదిరోజులుగా ప్రయాణం చేస్తున్నాము. ఈ పదిరోజుల ప్రయాణంలోనూ మేమెలాంటి కష్టాన్నీ అనుభవించలేదు.కూచీ, కుస్తన్ పట్టణాల పరిసరాల్లో తిరుగుతూన్నట్టుగానే వుంది మాకు! అగ్నిపురిలోని అరణ్యవిహారంలో కొన్నాళ్ళున్నాము.కూచీనగరంలోలాగానే ఇక్కడకూడా నాగురించి, నేను రాకముందే అనేక విషయాలుతెలిశాయి. భిక్షువులు దేశదేశాలు తిరుగుతుంటారు. తమతోపాటు వార్తల్నికూడా మోసుకు వెళ్తూంటారు. అరణ్యవిహారంలోని భిక్షువులు, అగ్నిపురనివాసులూ మాకు ఘనమైన స్వాగతాన్నిచ్చారు. వారి స్వాగతాన్ని చూశాక, చప్పున తెమిలి ఆ పట్టణంనుండి బయటపడడం సంభవం అవుతుందని నే ననుకోలేదు. అయితే, ఎవరితోటీ ఘనమైన సంబంధాన్ని కల్పించుకోకూడదని, దీర్ఘకాలం అక్కడే వుండిపోవడానికి కారణమయ్యే కార్యక్రమాల్ని ప్రారంభించరాదనీ ముందే నిర్ణయించుకున్నాము.

తరువాత పట్టణం పదిరోజుల ప్రయాణదూరంలో వుంది. మేము రోజుకో యోజనం నడుస్తున్నాము. దారిలో అక్కడక్కడా పల్లెలు తగుల్తున్నాయి. అగ్నిపురిలో లేదులే దంటూనే పదిరోజులు గడిపాము. ఈ పట్నం నుండి బయల్దేరే నది, సీతానదిలో కలవదు. మేము సీతానదిని వదిలి చాలా ముందుకు వెళ్ళిపోయాము. అగ్నిపురం నుండి బయల్దేరే ఈ నది దక్షిణంగా వెళ్ళి ఓ పెద్ద క్షార సరోవరంలో కలుస్తుంది. ఈ సరోవరానానుకునే ఒక విహారం వుంది. మేమా విహారంలోనే దిగాము. అక్కడి భిక్షువులు ప్రక్కనే ఓ మహాసముద్రం వుందని చెప్పారు. చూడ్డానికి వెళ్ళాము. లోగడ సింహళ యాత్రలో సముద్రాన్ని చూశాము. ఇది అంత పెద్దదికాదు. కాకపోతే ఓ పెద్ద (క్షార) సరోవరం అనవచ్చును. సరోవరం కొంచెం పెద్దదయితే, గాలి తీవ్రతకు అలలు లేస్తూండడం, అవతలి వడ్డుకనుపించక పోవడం సహజం. అయితే, విచిత్రమైన విషయం ఏమిటంటే, ఈ 5 1/2 అడుగుల మానవుడు తన వ్యక్తిత్వంలో నుండి ప్రపంచాన్ని కొలవచూస్తాడు. తను అవతలి వొడ్డును చూడలేక పోయిన మాత్రాన, తను చుట్టుతిరిగి రాలేకపోయిన మాత్రాన అది "అనంతసముద్ర" మౌతుందా? మానవుకి వ్యక్తిత్వము ఎంత? సామాన్య జలాశయం చాలు ఇతడి వ్యక్తిత్వాన్ని లుప్తం చేయడానికి!

అగ్నిపురినుండి బయల్దేరి మేము ముందుకు వెళ్ళి పోతున్నాము. మార్గం నిరాపదంగావుంది. సస్యశ్యామలమైన మైదాన ప్రదేశాల్నే కాకుండా మధ్య మధ్య చిన్ని చిన్ని పర్వతాల్నికూడా దాటుతున్నాము. ఇకముందు రానున్న పట్టణం 'కరఖీజా'! దీన్నేచీనా దేశస్థులు కావ్-శాంగ్ అంటారు. ఈ పరిసర ప్రజలూ, వారి ఆచార వ్యవహారాలూ, కాంస్యదేశపు ఇతర ప్రదేశాల్లో లాగానే వున్నాయి. అయితే, ఇక్కడి మైదానాల్లో తిరుగుబోతులు అధికసంఖ్యలో కనిపిస్తున్నారు. శతాబ్దాల నుండి ఉత్తర దేశీయులైన తిరుగుబోతులతో పరిచయ బాంధవ్యాలు సంభవిస్తూండడం వలన, ఇక్కడి ప్రజల ముఖాల్లో తిరుగుబోతుల ముఖకవళికలు కనుపిస్తూన్నాయి. కావ్-శాంగ్ కూడా అగ్నిపురిలాగానే వణిక్-పథాన్ని ఆనుకుని వుంది. కనుకనే ధనధాన్యాలతో తులతూగు

తోంది. ఐశ్వర్యం దృష్టితోచూస్తే ఈ కావ్-శాంగ్ కూచీనగరంతో కూడా పోటీ చేయగలదు. ఈ పట్టణంలోని వణిక్కులూ, సార్థవాహులూ మహాధనికులు. కూచీనగరం నుండి రెండు వణిక్-పథాలు (వ్యాపార మార్గాలు) ఉత్తర పశ్చిమ దిశలకు వెళ్ళిపోతాయి. ఈ కావ్-శాంగ్ నుండికూడా ఒక వ్యాపార మార్గం ఉత్తరంగా కొండల్లోగుండా వెళ్ళిపోతుంది. మరొకటి పశ్చిమంగా వున్న అగ్నిపురానికి, కూచీ నగరానికి వెళుతుంది. ఈ పట్టణంలోని ధనిక శ్రేష్ఠులగృహాలూ, సామంత రాజుల గృహాలూ మహాసుందరంగా వున్నాయి. ప్రతిఇంటికి వెనుక పండ్ల తోట లుండడం ఒక ప్రత్యేకత. ఇక్కడ ఇండ్ల నిర్మాణానికి ఉపయోగించే కలప దొరకడం బహు దుర్లభం. ప్రతిగృహస్థూ విధిగా తనదొడ్లో ఇంటికి కావలసిన కలప నిచ్చే వృక్షాలను పెంచుతుంటాడు. ఇక్కడికి సుదూరాన ఉత్తరంగా కల పర్వతాల్లో భూర్జ, దేవదారు వృక్షాలున్నాయని వినికిడి. అయితే, చాలా దూరాన్నుండి రావలసి వుండడం వల్ల, భూర్జ, దేవదారు కలప చాలా ప్రియంగా వుంటుంది. ఆ కలపని కేవలం ధనికులు మాత్రమే కొనగలరు. కనుకనే సామాన్య గృహస్థులు తమ దొడ్లలో కలపనిచ్చే వృక్షాల్ని పెంచుతూంటారు. పట్టణానికి వెలుపలకూడా కొన్ని విహారాలున్నాయి. మేమున్న విహారం అగ్నిపురంలోని అరణ్య విహారానికి సంబంధించింది.

మేము అంతకంతకూ అపరిచిత ప్రదేశాలకూ, అనన్యమానవ సమూహాల్లోకీ వెళ్ళిపోతున్నాము. ఆత్మీయులూ స్నేహశీలురూ అయిన సుపరిచిత ప్రజాసమూహాలకు అనుక్షణమూ దూర మౌతున్నాము. మేము వెళ్ళే ప్రతిగ్రామానికి సంబంధించిన వివరాలను శ్రద్ధగా అడిగి తెలుసుకుంటున్నాము. నూతనప్రదేశాలకు సంబంధించిన చరిత్రనుఆమూలాగ్రం తెల్సుకోవడం నాకో అలవాటు. మరొక్క నెలరోజుల ప్రయాణానంతరం చీనాదేశపు సరిహద్దుకు చేరగలమని తెల్సుకున్నాను. చీనాదేశపు అడ్డుగోడ మాకు కేవలం నలభైఐదు రోజుల ప్రయాణదూరంలోవుంది. అయితే, ఏ అవాంతరమూ సంభవించకుండా, స్వతంత్రంగా నిరభ్యంతరంగా ముందుకు పోగలిగితేనే నెలా, నెలా పదిహేను రోజుల్లో చీనా దేశాన్ని చేరగలం. అనేకమైన అభ్యంతరాలు సంభవించినప్పటికీ ఇంత

వరకూ ముందుకు సాగిపోతూనే వున్నాము. ఇకమీదటకూడా ఇలాగే నిరాటంకంగా ముందుకు పోగలమని అనుకుంటున్నాము.

కావ్-శాంగ్ పట్నంలో ఓ వారంరోజు లున్నాము. ఇక్కడికి దక్షిణంగా ఎడారి వుంది. ఎడారిగుండా వెళ్ళేట్టయితే, నీటికి బాగా ఇబ్బంది పడవలసి వుంటుంది. మధ్యలో ఎక్కడ పల్లెలుగానీ, పట్నాలుగానీ తగలవు. ఉత్తరంగా వున్న పర్వతాల్ని ఆనుకుని ఓ మార్గంవుంది. అటుగా వెడితే నీరు సమృద్ధిగా దొరుకుతుంది. మధ్య మధ్య గ్రామాలూ తగుల్తాయి కనుకనే ప్రజలు ఎక్కువగా పర్వతమార్గాన్ననుసరించి వెళ్తూంటారు. మేమూ పర్వత మార్గాన్ననుసరించి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాము.

మార్గంలో చాలామంది తిరుగుబోతులు కనుపించారు. వాళ్ళ ముఖాలు విచిత్రంగా వుంటాయి. మొదటగా వాళ్ళ ముఖాలను చూసినప్పుడు, మా హృదయాల్లో ఓ నూతనమైన. జుగుప్సాకరమైన భావన ఉదయిస్తూండేది. కొన్నాళ్ళకా వాళ్ళముఖాలను చూడడానికి మేము అభ్యస్తులమైనాము. ఇప్పుడు తిరుగుబోతులను చూస్తువుంటే మాలో ఎలాంటి భావనా కలగడంలేదు. సాధారణంగా మానవుల స్వభావాలు ఒకేలా వుంటాయని సంఘిలుడు అంటూ వుండేవాడు. ఈ సుదీర్ఘ యాత్రలో నేనూ కొంత అనుభవాన్ని సంపాయించాను. నా అనుభవం దృష్ట్యా చూచినా, మానవుడు సహజంగా ఉదారస్వభావుడు. మృదుహృదయుడు. కాకపోతే, పరిస్థితులు ఒక్కోమాటు అతణ్ని కఠినాత్మునిణ్ణి, క్రూరుణ్ణి చేస్తుంటాయి. మానవులు బ్రతకడానికి దోపిడే ప్రధానవృత్తి అయినప్పుడు, ఇక నా దోపిడిదారుల్లో క్రూరత్వం వుండడం సహజమే కదా? మాంసమే ప్రధానమయినప్పుడు, ఆ మాంసాన్ని సంపాయించడానికి మానవుడు కఠోరమైన మార్గాలననుసరించడంలో తప్పేముంది? తిరుగుబోతులో బాగా పరిచయమయ్యాక. వాళ్ళ సర్దారులు ఎన్నోమార్లు మాకు విందుచేశారు. వాళ్ళస్త్రీలు మాచేత మంత్రపఠనంకూడా చేయించేవారు. కూచీ పట్టణంలో, సామంతుల గృహాల్లో కనిపించినలాంటి అందమైన స్త్రీలు, ఈ తిరుగుబోతుల గూడారాల్లోనూ అక్కడక్కడా కనుపించారు. దీన్నిబట్టి చూస్తే "హీనకులం నుండయినా స్త్రీ రత్నాన్ని

తీసి తెచ్చుకోవడం విధ్యుక్తం!" అన్న సూక్తిని వీళ్ళు విశ్వసించి, అనుసరిస్తారనిపిస్తోంది. ఈ స్త్రీలు తమ భర్తలమీద చాలా ప్రభావాన్ని వేస్తుంటారు. వీళ్ళు తమ పురుషుల్ని ఉదార హృదయుల్ని చేశారు. భార్యల కారణంగా, తిరుగుబోతుల సర్దారులు తమజాతీయ దేవతల్తోపాటు బుద్ధదేవుణ్ణి పూజిస్తున్నారు తిరుగుబోతుల జాతియదేవత నీలాకాశం (కోక్). నీలాకాశమే కాకుండా కొండల్లో, కొనల్లో ఎక్కడయినా, ఏద యినా విచిత్రం కనుపిస్తే, దాన్ని దేవతగా పూజిస్తుంటారు తిరుగుబోతులకు పూజార్లుకూడా ప్రత్యేకంగా వుంటారు. పూజార్లకు వొళ్లు పెరగడం, దేవతలు పూనడం సహజమైన విషయం. తిరుగుబోతులు ప్రతి చిన్న విషయంలోనూ తమ పూజార్ల సలహాలను పాటిస్తూంటారు. బుద్ధ పథ గాములమైన మాకు అన్ని మతాలవారి దేవుళ్ళమీద ఎలాంటి ద్వేషమూ వుండదు. మానవులు తమ సంస్కారాన్ని, జ్ఞానాన్ని అనుసరించి దేవుళ్ళను సృష్టించుకుంటూ వుంటారని బుద్ధభగవానుడు ఏనాడో చెప్పాడు. జంబూద్వీపంలోనూ ఇంద్రుడు, కుబేరుడు, విరూఢకుడు, విరూపాక్షుడు- ఇలాగే ఎంతోమందిదేవుళ్ళు వున్నారు. అక్కడి భిక్షువులెవరూ పై దేవుళ్లను గురించి వ్యాఖ్యానించరు. వ్యాఖ్యానించమని బుద్ధుడూ చెప్ప లేదు. మేముకోరేది ఒక్కటే. అందరూ సుఖంగా వుండాలి. అందరూ ఆరోగ్యంగా వుండాలి. దేవతలుకూడా పరస్పర వైషమ్యాల్ని మరచి మానవ కళ్యాణానికే పాటుపడాలని మేము వాంఛిస్తాము. మేము ఎన్నో ప్రదేశాల్లో పర్యటించాము. అక్కడి దేవతల నామరూపాల పరిచయాన్ని పొందాము. ఆ దేవతల కిచ్చిన గౌరవనీయమైన స్థానాన్ని, ఈ తిరుగు బోతుల దేవతలకు మాత్రం ఎందుకు ఇవ్వకూడదు? అయితే, ఈ దేవ తలు తమ రక్తపిపాసను కొంత తగ్గించుకుని, సాధారణ పూజార్చనల్తో సంతృప్తిపడితే ఎంతబాగుండు అనుకునేవాణ్ణి. సంఘిలుడికి సూత్రపాఠ మంటే చాలా ఇష్టం. రోజూ విధిగా సూత్రపాఠాన్ని గావిస్తూండేవాడు. అప్పుడప్పుడూ సర్దారుల డేరాల్లోకి సూత్రపఠనం చేయడానికి సంఘిలుణ్ణి పంపుతూండేవాణ్ణి. నూతనంగా పరిచయమైన వారు అతణ్ణి నా శిష్యు డనుకునేవారు. అయితే, నే నతణ్ణి శిష్యుడిగా కాక, సోదరుడిలా చూస్తూండేవాణ్ణి.

కొండల్ని, మైదానాల్ని దాటి మేము ఎడారిలో ప్రవేశించాము. కొన్నిరోజుల ప్రయాణానంతరం రెండుఎడారులకు మధ్యవగల ఓ మహా నగరాన్ని చేరాము. చెట్లూ, చేమలూ, పచ్చని పసిరికతో కళకళ్ళాడు తోందా పట్టణం. ఆ పట్నం పేరు 'హామి'. ఇంతవరకూ చేసిన ప్రయాణంలో అక్కడక్కడా యుద్ధాన్ని గురించిన వార్తలు వినవస్తూనే వున్నాయి. కొన్నిచోట్ల అత్యంత ప్రమాదస్థితి నుండి సురక్షితంగా బయటపడ్డాము. పట్టణంలోకి వచ్చాక ఒక సంఘారామంలో బసచేశాము. అక్కడ నుండి ఏ అవాంతరమూ లేకుండా, సురక్షితంగా ముందుకు పోవచ్చునని చెప్పారు. ఈ పట్టణంలో తిరుగుబోతులు ఎక్కువగా కను పించారు. కొందరు తిరుగుబోతులు నగరవాసానికి కూడా అలవాటు పడ్డారు. మే మున్న విహారాన్ని అవారుల రాజొకడు కట్టించాడు. అవార జాతికి చెందిన భిక్షువుల్ని మొదటగా ఇక్కడే చూశాము. ఈ అవార భిక్షువులవలన భవిష్యత్ యాత్రలో మాకు ఉపయోగించగల అనేక విషయాలు తెలుసుకొనవచ్చును. మేముంటున్న విహారంలో తోఖ్యార్క జాతికిచెందిన భిక్షువు ఒకడున్నాడు. మేము అతణ్ణి పరిచయం చేసుకోవ డానికి చాలా కుతూహలపడ్డాము. అతడూ మా పరిచయం కోసం తహ తహలాడాడు. అతడి ముఖంలో తిరుగుబోతుల కవళికలు తక్కువ! ఎరుపూ, గులాబీ కల్సిన రంగులో వుంది ముఖం.

అతడికి 18, లేక 19 ఏళ్ళుంటాయి. తిరుగుబోతుల్లో కేవలం అవార జాతినుండి మాత్రమే కొంతమంది భిక్షువులు తయారయ్యారు. అప్పట్లో తోఖ్యార్క జాతికి చెందిన భిక్షువుల్నిగానీ, శ్రమణుల్నిగానీ - సంఘారామాల్లో చూడగలగడం అసంభవం! మరి ఈ తోఖ్యార్క యువ కుడు శ్రమణుడు ఎలా అయ్యాడు? ఇతడితల్లి కుస్తన్ జాతికి చెందింది. కనుకనే ఇతడు శ్రమణు డయ్యాడు. నేనుండగానే తోఖ్యార్క యువకుడు భిక్షు దీక్షను స్వీకరించాడు. నే నతడికి 'శాంతిల్' అని పేరుపెట్టాను. బుద్ధిలుకి పరిచయం అయ్యాక, నాకీ 'ఇల్' శబ్దంమీద మమకారం ఏర్పడ్డది. ఈ కారణం వల్లనే నేనీ యువకుడికి కావాలని 'శాంతిల్' అని పేరు పెట్టాను. నేను, ఉపాధ్యాయు డయ్యాను. సంఘిలుడు ఆచార్యుడయ్యాడు ఈ తోఖ్యార్క యువకుడికి!

ఈ పట్నానికి కొన్ని ప్రత్యేకత లున్నాయి. ఇక్కడ ప్రజలూ కూచీజాతికి చెందినవాళ్ళే. వీళ్ళకు పశుపాలనే ముఖ్యావృత్తి! అయినా వీళ్ళల్లో తిరుగుబోతుల లక్షణాలు తక్కువ. ఇక్కణ్ణుండి ఉత్తరదిశకు పోతే ఇక స్థిరనివాసులంటూ కనుపించరు. గ్రామాలనూ పట్టణాలను చూడలేము. గొర్రెబొచ్చుతో నేసిన వస్త్రాల్తో డేరాలు వేసుకున్న తిరుగుబోతులు మాత్రమే కనుపిస్తారు. ఈ తిరుగుబోతులకు గుర్రాలూ, ఆవులూ, ఒంటెలూ, చమరీమృగాలూ, మేకలు, గొర్రెలే సమస్తమూను! గుర్రపు స్వారీలో తిరుగుబోతుల్ని చెప్పే మరొకర్ని చెప్పుకోవాలి! చిన్నచిన్న పిల్లలుకూడా లగామూ, రికాబూలేకుండా, గుర్రపుమెడను కావిలేసుకుని మహావేగంగా స్వారీ చేస్తుంటారు. ఇంత కంటె కూడా చెప్పుకోతగ్గ విషయం ఇంకోటుంది. వీళ్ళు గుర్రంమీద స్వారీచేస్తూనే, లక్ష్యం తప్పకుండా బాణాన్ని వేయగలరు! పశుపాలన ఒక్కటే కాకుండా, వేటాడికూడా కొంత ఆహారాన్ని సంపాయించుకుంటూ వుంటారు వీళ్ళు! ధాన్యాన్ని ఆహారం క్రింద ఉపయోగించడం వీరికి అంతగా తెలియదు. పాలుత్రాగుతారు. గుర్రప్పాలతో ఒక రకమైన సారాయినికూడా తయారుచేస్తారు. వీళ్ళ గుర్రాలు ఉభయతారకమైనవి. గుర్రంమీద స్వారీచేస్తున్న రౌతు, ఆకలయిం దనుకున్నప్పుడు, తను స్వారీచేస్తున్న గుర్రంయొక్క రక్తపు నాడివద్ద కత్తితోకోసి రక్తాన్ని తాగి కడుపు నింపుకుంటాడు. హూణ వంశజులైన ఈ తిరుగుబోతుల్ని అజేయులని నిస్సంశయంగా అనవచ్చు! చీనా దేశపు సైనిక బలం అపారమైందేకాక సుదృఢమైంది కూడాను. శత్రుసైన్యం తమకంటె అధికంగా వుందను కున్నప్పుడు తిరుగుబోతు లిక యుద్ధం చేయరు. తప్పించుకు పారిపోతారు. వీళ్ళకు స్థిరమైన ఇళ్ళు వాకిళ్ళుగానీ, గ్రామాలుగానీ వుండవు. వ్యవసాయం అసలు చేయనేచేయరు తమ కుటుంబపు సామగ్రినంతటినీ గాడిదలమీద వేసుకుని ఉత్తరదిశకు క్షణంలో పారిపోతారు. ఈ తిరుగుబోతులకు ప్రాదేశికమైన మమతలూ ఏమీవుండవు. ఇలాంటివారికి శత్రువు చేయగలిగిననష్టం ఏముంటుంది? చీనా దేశపు సైన్యం శత్రువు మీద దాడి చేయాలంటే. ఆహారాన్ని, వంటచెరుకునూ, నీటినీ .. ఈ మూడింటినీ ముందుగా జాగ్రత్తపరచు

కోవాలి: ఇంకోరకంగా చెప్పాలంటే, ఆహార సామగ్రి చక్కగా సరఫరా అవుతూవుంటేనే చీనాదేశపు సైన్యం యుద్ధ క్షేత్రంలో నిలబడ గలదు: ఆహారసామగ్రి సరఫరా ఆగిపోయిన క్షణాన చీనాసైన్యం తిరో ముఖం పట్టక తప్పదు. పైగా తిరుగుబోతులు రాత్రి పూట చీనా సైన్యాన్ని కన్ను కూరనివ్వరు. క్షణం మైమరచారా వచ్చి మీద పడతారు. చీనాదేశపురాజు ఎంత ప్రయత్నించినా ఒక్క నెలరోజుల ప్రయాణ దూరంకంటె అధికం ఒక్క అడుగుకూడా తిరుగుబోతుల్ని తరమలేక పోయేవాడు. నెలరోజుల ప్రయాణదూరాన్ని మించి ఏ మాత్రం ముందుకు వెళ్ళినా చీనాసైన్యం సర్వనాశనమవక తప్పదు. అనేకమార్లు చీనాసైన్యం సాహసించింది. అయితే, సర్వనాశనమవడం తప్ప మరో ప్రయోజనం కలగలేదు. శత్రుత్వం వహించి నాశనమవడం కంటే, మిత్రత్వంతో తిరుగుబోతుల్ని మంచి చేసుకోవడమే ఉత్తమ మైన మార్గమని చీనాదేశస్తులు తెలుసుకున్నారు లోగడ ఆవారులతోటీ, త్యోర్కులతోటీ చేసిన యుద్ధాల్లో, చీనాదేశం బాగా నష్టపడింది. కనుకనే ప్రస్తుతం ఆవారులకూ, త్యోర్కులకూ మధ్య సంభవించిన గృహ యుద్ధంలో తను ఎటూ జోక్యం కల్పించుకోవడం లేదు. తిరుగుబోతులు ఈవిధంగా గృహయుద్ధంలో చిక్కుకొని వుండడమే తనకు క్షేమ దాయకమనీ, తమదేశ సరిహద్దులు సురక్షితంగా వుంటాయనీ చీనా దేశం తెలుసుకుంది.

ప్రస్తుతం మేముంటూన్న ఈ (హామీ) పట్టణ ప్రజలు తమ సోదరులైన కూచీ ప్రజలకు కొంత భిన్నంగా వుంటారు. వీళ్ళు వ్యవ సాయమే కాకుండా వ్యాపారం కూడా చేస్తుంటారు. ఈ పట్నంలోని ముఖ్యాతిక వ్యాపారం సోగ్గ, పారస్య, కుస్తన్, ఖసగిరి — మొదలైన పట్టణాలకు చెందిన ధనికశ్రేష్ఠుల చేతులలోవుంది. ఈ ధనికవ్యాపారులు స్థానిక ప్రజల కంటే నాగరికులు. స్థానిక ప్రజలు విశ్వాసపాత్రులు, సరళస్వభావులు. అతిథి సేవాపరాయణులు. గృహస్థు, అతిథి సేవలో గొప్ప తత్పరతను ప్రదర్శిస్తాడు. అతిథి సేవకు తన భార్యా, బిడ్డల్ని (ఆడపిల్లల్ని) కూడా పంపుతూవుంటాడు. అన్యదేశీయులు వీరి సద్భావాన్ని అర్థం చేసుకోలేక, పైఆచారాన్ని ఘోరంగా నిందిస్తుంటారు.

ఆచార వ్యవహారాలు అన్ని దేశాల్లోనూ ఒకేరకంగా వుండవు. వీరు అతిథిసేవను దైవకార్యంగా, అతి పవిత్రమైందిగా భావిస్తుంటారు. కనుకనే గృహస్థు తన భార్యనూ, ఈడు వచ్చిన తన కూతుళ్ళనుకూడా అతిథిసేవకు నియోగిస్తుంటాడు. విచిత్రమైన ఈ అతిథిసేవ నుండి. అన్యదేశాల గృహస్థులే కాక. భిక్షువులు కూడా అనుచితమైన లాభాన్ని పొంద చూస్తుండడం శోచనీయమైన విషయం. బయటి నుండి వచ్చే ప్రజలు మాత్రమే ఈ ఆచారాన్ని నిందిస్తుంటారు. ఇక్కడి ప్రజల్లో అధికసంఖ్యాకులు బౌద్ధ మతస్థులు క్రైస్తవ మతాన్ని, పారసీక మతాన్ని అనుసరించే వాళ్ళుకూడా వున్నారు. వివిధ మతానుయాయుల్లోనూ ఎలాంటి ద్వేషాలూ లేవు. అన్యమతస్థుల మఠాల్లోకీ, ప్రార్థనా మందిరాల్లోకీ మేము వెళ్తూండేవాళ్ళం వారు మాకు, నిండు హృదయంతో, ఘనస్వాగతాన్నిచ్చేవారు.

ఇక్కడి నుండి మేము చీనాదేశపు దక్షిణపు సరిహద్దుకు వెళ్ళాలి. ఈ సరిహద్దులో యుద్ధ భయం అధికంగానే వుందని వార్తలొస్తున్నాయి. సార్థవాహులు, ప్రాణాలను అరిచేతుల్లో పెట్టుకుని ముందుకు వెళ్ళాలి. మేము ఈ పట్నంలో ఒక వేసవిని, వర్షాకాలాన్ని గడిపేశాము. ఇంత దీర్ఘకాలం ఈ పట్నంలో వుండటానికి, మార్గమధ్యంలో సంభవించగల ప్రమాదాల భయం కొంత కారణమైనా, ఇక్కడి ప్రజల ఎనలేని వాత్సల్యానురాగాలు ముఖ్యకారణమైనాయి. ముఖ్యంగా శాంతిలుడి భక్తిశ్రద్ధలు మమ్మల్ని కట్టివేశాయి. అతడి తల్లీదండ్రికూడా వర్షావాసాన్ని అక్కడే గడపవలసిందని బలవంతం చేశారు. మా నియమప్రకారం ఆషాఢపౌర్ణమి నుండి మూణ్ణెల్లు వర్షాకాలంగా భావించి యాత్రలుచేయము. అయితే ఈ దేశంలో వర్షాలు అత్యల్పంగా కురుస్తాయి. ఈ దేశపు వాతావరణాన్ననుసరించి పై మూణ్ణెల్లూ యాత్రలను ఆపుకోవలసినంతగా వర్షాలు పడవు. అయినా మేమా మూణ్ణెల్లూ యాత్ర చేయము. ఆక్కడసలు వర్షాకాలంలో వర్షాలకంటే చలికాలంలో మంచు అధికంగా కురుస్తుంది. చలికాలం, ప్రయాణం ప్రమాద భరితంగానే వుంటుంది. అయినా, సార్థవాహులు యాత్రలు సాగిస్తూనేవున్నారు. మానవ కల్పితమైన ప్రమాదాన్ని మినహాయిస్తే, ఎడారి ప్రయాణం చలికాలమే సుఖకరంగా వుంటుంది. ఇసుక

తుఫానులు వీచవు. దారి తప్పుతామన్న భయముండదు. ఇతర కాలాల్లో ఎడారుల్లో భయంకరమైన ఇసుక తుఫాన్లు వస్తూవుంటాయిట. ఆ సమయంలో పెద్ద పెద్ద పట్టణాలే ఇసుకదిబ్బల క్రింద గుర్తు తెలియకుండా కూరుకుపోతాయని విన్నాను! ఇదేమంత పెద్ద ఆశ్చర్యకరమైన విషయంగానీ, అసంభవమైన విషయంగానీ కాదు. ఎడారుల్లోని పెద్ద పెద్ద ఇసుక దిబ్బల్ని నేనూ చూశాను. గుర్రపుగిట్టల ఆకారంలో వుంటాయాదిబ్బలు.

పై కారణాల్ని పురస్కరించుకుని మామిత్రులందరూ చలికాలపు ప్రయాణమే ఉత్తమ మన్నారు. శాంతిలుడుకూడా నాతో వచ్చేయడానికి సిద్ధమయ్యాడు. అతడి తలిదండ్రులుకూడా కొడుకును నాతో పంపించివేయడానికి ఇష్టపడ్డారు. భారతీయవిద్వాంసుడైనభిక్షువుసాహచర్యంలోవుంటే, తమ కొడుకూ విద్వాంసుడు కాగలడని వారి ఆశ. శాంతిలుడి తల్లి గొప్ప భక్తురాలు, అపూర్వ సౌందర్యవతి. ఈమె సౌందర్యానికి ముగ్ధుడై ఒక బేగ్ ఈమెనువివాహమాడాడు. ఈమె తనసౌందర్యంతో బేగ్‌నుపూర్తిగా వశ్యుణ్ణిచేసుకుంది. బేగ్‌మీదా, అతడిఅనుచరులమీద శాసనం చెలాయిస్తూ వుంది. శాంతిలుడు నాతో రావడం ఈమెకు ఇష్టమే. కానీ, కొడుకును తిరిగి జీవితంలో చూడగలదో, లేదో, అనుమానం! మరికొన్నాళ్ళు తమ వద్ద వుండవలసిందని ప్రార్థించింది. అయితే, నేను చీనాదేశం వెళ్ళాలని ఒకరకంగాఆత్రపడుతున్నాను. ఈశాన్యమూలగావెళ్ళే మార్గాన పయనించాలని నా ఉద్దేశ్యం నాకు అవారభాషవచ్చును. త్యోర్కభాషకూ,అవార భాషకూ అట్టే వ్యత్యాసం ఏమీలేదు.ఇన్నాళ్ళూ అవారుల పరిపాలనలో వుండడం వలన ఈ పట్టణంలో అవారభాషే రాజభాషగా చెలామణీ అయింది. ఇప్పుడు అధికారాలు మారిపోయాయి. ఈ పట్టణం త్యోర్కుల పాలనలోకి వచ్చింది. రాజ భాష త్యోర్కభాష అయింది నేను చాలా ఇష్టంగా త్యోర్కభాషను నేర్చుకుంటున్నాను. ఈ భాషను అభ్యసించడంలో శాంతిలుడు నాకు సహకరిస్తున్నాడు. శాంతిలుడి తండ్రి ప్రస్తుతం త్యోర్క బేగ్‌గా చెలామణీ అవుతున్నాడు. కానీ, అతడు అవార రాజకుటుంబానికి చెందినవాడు. వీళ్ల తమ ఉన్నిడేరాల్ని వెంట పెట్టుకుని అనేకచోట్లకు తిరుగుతూవుంటారు.తిరుగుబోతు కావడం వల్లనే ఈ బేగ్

తన యథార్థ సంబంధాల్ని దాచి, తోక్తా బేగ్‌గా చెలామణీ కాగలుగు తున్నా ననుకున్నాను.

చలికాలం ప్రారంభమైంది. ఇదిగో, అదుగో అంటూ ఇంకో నెల కూడా గడిచింది. శాంతిలుడి తండ్రి తను స్వయంగా మమ్మల్ని వెంట పెట్టుకొని చీనాదేశపు సామంతుని వద్దకు తీసుకువెడతానన్నాడు. అలాంటి స్థితిలో కొంత ఆలస్యమే జరిగినా నాకేమీ కష్ట మనిపించలేదు. తిరుగు బోతులు వ్యవసాయాన్ని ద్వేషిస్తారు. పశుపాలన వాళ్ళ ముఖ్యవృత్తి! వ్యాపారం కూడా చెదురుగా చేస్తుంటారు. వీళ్ళ గుర్రాలు పొట్టిగా, బలంగా వుంటాయి. చీనాదేశంలో వాటికి మంచి ధర పలుకుతుంది. వీళ్ళు ఒంటెల్ని అమ్ముతారు గొర్రెల విషయం యిక చెప్పనే అవసరం లేదు. వేల సంఖ్యలో అమ్ముడవుతాయి. శాంతిలుడి తండ్రి బయల్దేరా డంటే, అతడివెంట కొన్నివందల పరివారాలు కదుల్తాయి. అదే పరి మాణంలో అమ్మకానికి పశువులు కూడా వెంట వుంటాయి. ఈ బేగ్ వెంట అతడి సహచరులేకాక, శత్రువులున్నుండి గెల్చుకున్న బానిసలు కూడా అధిక సంఖ్యలో వున్నారు. ఒక శుభదినాన, దైవ ప్రార్థనా నంతరం బేగ్ మమ్మల్నందర్నీ వెంటపెట్టుకొని చీనాదేశం వైపు బయ ల్దేరాడు. బయల్దేరేముందు గుర్రాన్నొకదాన్ని దేవతకు బలి ఇచ్చారు. తిరుగుబోతుల్తో కలిసి ప్రయాణంచేసే అవకాశం, నాకుగానీ సంఘిలుడికి గానీ ఇంతవరకూ లభించలేదు. ప్రతిరోజూ తెల్లవారడానికి ఒక జాము ఉందనగా బయల్దేరేవాళ్ళం. వెన్నెల రాత్రిళ్లు, హుషారుగా, త్వర త్వరగా నడిచి జాము పొద్దెక్కేసరికి తరువాతి మజిలీని చేరేవాళ్ళం! మజిలీ అంటే ప్రత్యేకంగా, ముందే నిర్ణయింపబడిందేమీ కాదు. వెళుతూ వుంటాం. నీరూ, పశుగ్రాసం ఎక్కడ లభ్యమౌతాయనుకుంటే అక్కడ డేరాలు దించేస్తారు. చూస్తుండగానే నిర్జనమైన ఆ ప్రదేశంలో ఓ డేరాలగ్రామం. మానవ సంచలనంతో సంచలించిపోతూ కని పిస్తుంది. అందరికంటే ముందు డేరాలను మోసే ఒంటెలు వెళ్ళిపోతాయి. నీరూ పసిరికా కనబడినచోట ఆ వంటెలను ఆపి వాటిమీది డేరాల పంజ రాల్ని దింపుతారు. డేరాల ఆకారాలు పంజరాల్లా వుంటాయి. చెక్కతో నిర్మించిన ఈ డేరాల ఆకారాలు విడి భాగాలుగా వుంటాయి. ఒంటెల్ని

ఆపి, పంజరాల వికిభాగాలను త్వత్వరగా బిగించేస్తారు. తరువాత వాటి మీద ఉన్నివస్త్రాల్ని పరుస్తారు. దేరాలు తయారయి పోతాయి. దేరాల విడి భాగాలను అమర్చే పనివాళ్ళ నేర్పరితనాన్ని చూచి తీరవల్సిందే. ఒక్కో దేరాలో పది పన్నెండు మంది మనుషులు విశ్రాంతిగా పడుకో వచ్చును. అంత పెద్దవిగా వుంటాయి. బేగ్ దేరా ఇంకా పెద్దదిగా వుం టుంది. తిరుగుబోతుల్లో కళా ప్రేమ, సౌందర్యపిపాసా అత్యధికం. ఇతర అనేక విషయల్లో ఎంతో వెనుకబడివున్న ఈ తిరుగుబోతుల్లో ఇంతటి సౌందర్యపిపాస, కళాప్రియతా ఎలా సంభవమయ్యాయి? తిరుగుబోతుల దేశంలో పసిరికగానీ, పూవులుగానీ వుండవు. కానీ, రంగుల మిశ్రమం వల్ల కృత్రిమ సౌందర్యాన్ని ప్రాదుర్భవింపచేయవచ్చని వీరికి తెలుసు. వీరి ప్రతి చిన్నకార్యకలాపంలోనూ కళాదృష్టి నిండి నిబిడీకృతమై వుంటుంది. వొక్కొక్క దేరాను అమర్చడమయ్యాక, ఎక్కడ వుండవల్సిన సామాన్లను అక్కడ సర్దేస్తారు. మొదట సామాన్లను మోసే పశువులూ, ఒంటెలూ వెళ్ళిపోతాయని చెప్పాను. అందరికంటే వెనుక బేగ్, అతడి అనుచరులైన గుర్రపు రౌతులూ వస్తుంటారు. వాళ్ళల్లోని ఒక్కవిషయం నన్ను గొప్పగా ఆకర్షించింది. కష్టపడి పనిచేయటాన్ని తప్పుగాభావించరు వాళ్ళు. బేగ్ కూడా తన అనుచరుల్తో సమానంగా కష్టించడాన్ని నేను చూశాను. ఒక్క బేగే కాదు. ఖాన్‌లూ, యబగూయి కూడా స్వయంగా దేరా లను పాతుకుంటారు. తమ గుర్రాలను తామే మాలీస్ చేసుకుంటారు. ఇప్పుడిప్పుడే అవార, త్యోర్క్ బేగ్‌లూ, ఖాన్‌లూ బౌద్ధ భిక్షువుల్ని ఆద రించి గౌరవించడం నేర్చుకున్నారు. వీరి వెంట బౌద్ధ భిక్షువు లుండడం సాధారణ విషయమౌతున్నది. ఇక్కడి భిక్షువులూ వినయ పిటకాన్ని పఠిస్తారు. వినయ నియమాలు వీరికీ తెలుసు అయినా, వాటిని పాటించి పాలించలేరు. మేము బయల్దేరే రోజున, నన్నూ, సంఘిబుణ్ణీ గుర్రాల మీద ప్రయాణం చేయవలసిందని చాలా బలవంతం చేశారు. వినయ నియమాల ప్రకారం, ఆరోగ్యంగా వున్న భిక్షువులు గుర్రాలపై ప్రయా ణము చేయరాదు. నావపై ప్రయాణం చేయవచ్చును. అనారోగ్యస్థితిలో తోటి భిక్షువు మోసుకుని వెళ్ళవచ్చును. వినయ నియమాన్ని కాదని గుర్రాన్నెక్కడానికి నేను సిద్ధపడలేదు. మేము కాలి నడకన ప్రయాణం

చేయడానికి బేగ్ వప్పుకున్నాడు. శాంతిలుడుకూడా మమ్మల్ని అనుస
రించి గుర్రాన్ని దిగి నడవసాగాడు. మా ముగ్గురికీ ఓ ప్రత్యేకమైన
డేరానూ, ఇద్దరు పరిచారకుల్ని ఇచ్చారు. కాలి నడకన ప్రయాణం చేయ
వలసినవాళ్ళం గనుక మేము ముగ్గురమూ అందరికంటె ముందులేచి
ప్రయాణమయ్యే వాళ్ళం. మా వెంట ఒక వొంటెమీద మా సామాన్లు
వస్తూండేవి. అందరి కంటె ముందుగా మేమే మజిలీని చేరే వాళ్ళం.
నిర్జన ప్రదేశాల్లో క్షణకాలంలో ఓ పెద్దగ్రామం తయారయి పోవడాన్ని
విచిత్రంగా చూస్తుండేవాళ్ళం. ఆ సమూహంలోని మానవు లందరూ
చీమల్లా బిలబిలల్లాడుతూ ఎవరిపనుల్లో వారు నిమగ్నులయ్యే వారు.
ముందుగా పాలు ఇచ్చే పశువుల్ని పితుక్కుని మేతకు వదిలే వాళ్ళు.

మొదట్లో వొంటెపాలు నా కంతగా రుచించేవికావు. మేకపాల్లా
గానే ఇవీ ఓ రకమైన వెగటువాసన కొడుతూండేవి. కానీ, కొన్నాళ్ళ
అలవాటయ్యాక వొంటెపాలనే ఇష్టంగా తాగేయసాగాను. అభ్యాసం
వల్ల మానవుడి రుచుల్లో ఎంతో మార్పును తీసుకురావచ్చునని అప్పుడు
తెలుసుకున్నాను. వొక్కొక్క వొంటె కడివెడుకుపైన పాలు ఇస్తుంది.
ఇంత అధికంగా పాలిచ్చే జంతువు మానవులకు ఎంత ఉపయోగకర
మైందో!

మజిలీని చేరగానే అప్పుడప్పుడే పితికినవెచ్చని ఒంటెపాలను
త్రాగడానికి ఇచ్చేవారు. అపరాహ్ణానంతరం బౌద్ధ భిక్షువులం ఆహారాన్ని
స్వీకరించం. సూర్యుడు సరిగా నడినెత్తికి వచ్చాక భోంచేయడం అల
వాటు నాకు! అంతకంటే ముందుకూడా భోంచేయవచ్చును. కానీ అలా
పెందలాడే భోంచేస్తే, మర్నాటి మధ్యాహ్నం వరకూ ఆకలికి తట్టుకో
వడం కష్టం. పైగా, ఉదయాన్నే లేచి పైమజిలీవరకూ నడవడానికి శరీ
రంలో శక్తికూడా వుండాలి. మావెంట వచ్చే సేవకుల దగ్గిర ఎండు
మాంసం ఎప్పుడూ సిద్ధంగానే వుంటుంది. దారిలో నీరసిస్తామేమోనన్న
భయంతో, సేవకులు ముందుగానే ఎండు మాంసాన్ని తిని, బయలుదేర
వలసిందని, బలవంతం చేసేవారు. కానీ మేము పై మజిలీని చేరేవరకూ
ఆహారాన్ని ముట్టుకునేవాళ్ళం కాదు. నేను చీనాదేశం వచ్చాకనే మాంసా
హారాన్ని త్యజించాను. భారత దేశంలోనూ, సింహళంలోనూ వినయ

నియమాలను తు. చ. తప్పకుండా పాలించే భిక్షువు లెందరోన్ని చూశాను. అంతటి వినయ దురంధరులైన భిక్షువులుకూడా మాంసాన్ని భుజిస్తుండే వారు. అంతవరకూ చదివిన గ్రంథాల్లో, బుద్ధుడు మాంస విసర్జన చేయ మన్నట్టు చూడలేదు. కనుకనే మహాయానాన్ని అధిష్ఠించాక్కూడా నేను మాంస భక్షణ చేస్తుండేవాణ్ణి! నేనా రోజుల్లో మాంసాన్ని తినడమే మంచిదయింది. మాంసాహారాన్ని విసర్జించి, ఆ తిరుగుబోతుల దేశంలో బ్రతకడమే అసంభవం. మా బేగ్ వద్ద ధాన్యమూ, ఎండు పండ్లుకూడా వుంటూంటాయి. అయినా, వాళ్ళ ప్రధానాహారం మాంసం. ఎండు మాంసాన్నీ తింటారు. అప్పటికప్పుడు కోసిన పచ్చిమాంసాన్నీ తింటారు. వొక్కోప్పుడు మాంసాన్ని ఉడకబెట్టుకునిగానీ, కాల్చుకునిగానీ తింటూంటారు. మొదట చిన్నగొయ్యి తీస్తారు. దానిలో కట్టెపుల్లల్ని వేసినిప్పుముట్టిస్తారు. కట్టెలు బాగా రాజుకున్నాక, గొర్రెనొకదాన్ని చంపి, మంటమీద పడే స్తారు. దానిపైన ఇసుక పోస్తారు. ఆవంలో పెట్టినట్టు, నిదానంగా గొర్రె కాల్తుంది. అలాకాల్చిన మాంసమంటే తిరుగుబోతులకు మహాఇష్టం! ఐతే అలా కాల్చిన, రుచ్యమైన, తాజామాంసాన్ని తినే అదృష్టం ఒక్క బేగ్‌కు మాత్రమే వుంటుంది. బేగ్‌కు అతిథులమైన కారణంవల్లమాకూ అలాంటి రుచ్య పదార్థాలే లభిస్తుంటాయి. మధ్యాహ్న సమయంలో, రుచికరమైన ఆహారాల్ని ఒక పాత్రలో పెట్టుకుని శాంతిలుడి తల్లి మా డేరాలోకి వచ్చేది. మేము మగ్గురం పట్టులాంటి మృదువైన కృష్ణాజినంమీద కూర్చునేవారం! శాంతిలుడి తల్లి ఆహారాన్ని మా ముందుపెట్టి, భక్తి తత్పరయై నమస్కరించేది. మేము "సుఖీభవ!" అని దీవించేవారము. భోజనానంతరం ధర్మోపదేశం చేసేవాళ్ళం. ఒక్కోమాటు ఆమె డేరా లోకి వెళ్ళి, ధర్మోపదేశాల్ని ఇస్తుండేవారం. అప్పుడప్పుడూ సూత్ర పాఠాల్ని చదివేవాళ్ళం! శాంతిలుడి తల్లికి కూచీభాష బాగా వచ్చును. కనుక మేము కూచీ భాషలోనే ధర్మోపదేశాల్ని గావిస్తుండేవాళ్ళం! బేగ్‌కు కూచీభాషరాదు. అందువల్ల కూచీభాషలో జరిగే ధర్మోపదేశాల్ని (మత సంబంధమైన ఉపదేశాలు) వినడానికి కదాచిత్తుగా మాత్రమే వస్తుండేవాడు. బేగ్‌వచ్చిన రోజున మా ఉపదేశాల్ని తోర్యుర్కు భాషలోకి అనువదించి తండ్రికి చెప్పే బాధ్యతను శాంతిలుడు స్వీకరించేవాడు.

వొక వారం గడిచింది. ప్రశాంతంగా, సుఖంగా యాత్ర చేస్తు న్నాము. తిరుగుబోతులకు యాత్రకూడా స్థిర నివాసంలాగానే వుంటుంది. పరిసరాల్లోని మార్పును మినహాయిస్తే, మనుష్యులూ, పశువులూ, - అన్నీ తమకు పరిచయమైనవే. తమ చుట్టూ వుంటూ వుంటాయి. అలాం టప్పుడు ప్రయాణమూ స్థిర నివాసంలాగానే వుండడంలో ఆశ్చర్యమే ముంది? ఈ తిరుగుబోతు జీవితం నాకు ఆనందదాయకంగానే వుంది. నేను యాత్రార్థిని.పర్యాటకుణ్ణి! నాలాంటి వాడికి ఈ తిరుగుబోతు జీవితం సహజంగానే నచ్చుతుంది. జీవితాంతం యాత్రచేస్తూ, యాత్రనే మహావ్రతంగా పాటిస్తూన్న మహాయాత్రికు లీ తిరుగుబోతులు. ఎదురుగా కొండలబారు కనుపిస్తోంది. మరొక వారం ప్రయాణం చేస్తే ఆ కొండ ల్లోకి వెడతాము. అవి బోడికొండలే అయినా, ఏ కొద్దిగానో పసిరికా, నీరూ తప్పకుండా లభిస్తుంది. ఆ తరువాత పది పదిహేను రోజులు, ఆ కొండల్లో ప్రశాంతంగా ప్రయాణాన్ని సాగిస్తే చీనా "అడ్డుగోడ"ను చేరుకుంటాము. ఆ "అడ్డుగోడ"ను గురించి మేము ఎన్నో విచిత్రమైన కథల్ని చెప్పుకునేవాళ్ళం. చీనా దేశంలో ప్రవేశించాక మాబేగ్ తను తెచ్చిన పశువుల్ని అక్కడ అమ్మేస్తాడు, తమ పశువులకు మంచి ధర పలుకుతోందో, లేదో, నన్న చర్చ బేగ్ అనుచరుల్లో నిరంతరం జరు గుతూ వుంటుంది. పశువుల్ని విక్రయించి ఆ ధనంతో చీనాంబరాల్ని కొంటారు. తనకూ తన అనుచరులకూ అవసరమైన చీనాంబరాల్ని వుంచుకుని మిగిలిన వాటిని తిరుగు ప్రయాణంలో అమ్మేస్తాడు బేగ్! వొక్కోప్పుడు మంచి ధర పడకపోతే చీనాంబరాల్ని అమ్మడానికి కాచీ దేశంకూడా వెళ్తూంటాడు బేగ్.

ఒకనాటి ఉదయం : పై మజిలీని చేరడానికి ఇంకో యోజన దూరం ప్రయాణం చేయాలి. మిట్టలూ, దిబ్బలూ లేని సమతల ప్రదే శంలో ప్రయాణం చేస్తున్నాము. ఉదయపు వాతావరణంలో చాలాదూరం వరకూ దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది. ఇంతలో కొన్ని వందల మంది రౌతులు, తమ గుర్రాలను అతివేగంగా పరుగెత్తిస్తూ మావైపు రావ డాన్ని చూశాము. వాళ్ళను చూడగానే మా గుంపంతా ఆగిపోయింది. మాలో ఎక్కువమంది కాలినడకను ప్రయాణం చేస్తున్నారు. పది పది

హేను మంది మాత్రమే గుర్రాల నధిరోహించారు. మాకు అభిముఖంగా వస్తూన్న గుర్రపు రౌతుల్ని గురించిన నా భావనకూ, మా గుంపులోని మిగిలినవారి భావనకూ చాలా వ్యత్యాసం వుంది. "ఆ వచ్చేవాళ్ళూ త్యోర్కులే. ఏదో తొందర పనిమీద, ఎక్కడికో వెళ్తున్నారు." అనుకున్నాను నేను. అయితే తోటితిరుగుబోతుల అభిప్రాయం వేరుగావుంది. మా గుంపు నాయకులకు ఇందులో ఏదో ప్రమాదం స్ఫురిస్తోంది. పశువుల్ని ఆపేశారు. మా గుంపులోని యోధులందరూ ధనుస్సులను చేత పుచ్చుకుని బాణాలను ఎక్కుపెట్టి సిద్ధంగా వున్నారు. "ఏమిటి పరిస్థితి?" నేను శాంతిలుణ్ని అడిగాను.

"ఆ వచ్చేవాళ్ళుకూడా త్యోర్కులే! అయితే, ఏం? త్యోర్కుల్ని త్యోర్కులే దోచుకోవడం, చంపుకోవడంకూడా కద్దు. దోచుకోవడానికి అదను దొరకాలేగాని, తన వాళ్ళనయినా వదలరు త్యోర్కులు! తమలో తామే దోచుకున్నారని తెలిస్తే ఖాన్ (రాజు) దోపిడీ చేసిన ముఠాని క్రూరంగా దండిస్తాడు. కానీ, దోపిడీచేసిన ముఠా కేవలం దోచుకునే వూరుకోదు దోపిడీ జరిగిన విషయం ఖాన్ చెవిన పడకుండా వుండడానికి, ఎదటి ముఠాలోని వాళ్ళ నందర్నీ చంపి గుర్తుతెలియకుండా చేస్తుంది!" అని చెప్పాడు శాంతిలుడు.

మా యోధుల అనుమానం నిజమయింది. ఎదటి గుర్రపు దళం మమ్మల్ని సమీపించింది. మా గుంపు నాయకులు పరిచయా న్నియవల్సిందని అడిగారు వాళ్ళను! వాళ్ళు సమాధానా న్నియలేదు. అటునుంచి తీవ్ర వేగంతోవచ్చిన బాణాలు, మా గుంపులోని ప్రజలగుండెల్లోనుండి దూసుకుపోయాయి. వెంటనే మే మందరం ఎక్కడివాళ్ళము అక్కడ సర్దుకున్నాము. మా యోధులు పశువులచాటున కూర్చుని శత్రువులమీద బాణాల్ని వేయసాగారు. అయితే, శత్రువులు అత్యధిక సంఖ్యలో వున్నారు. కొంతసేపు రెండు వైపులనుండి తీవ్రవేగాలతో బాణాలు దూసుకుపోవడాన్ని చూశాను. ఇరుపక్షాల యోధులూ నేలకు ఒరగడాన్నికూడా చూశాను. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు.

నేను కండ్లు తెరిచాను. స్పృహ వచ్చింది. అర్ధరాత్రి చీకటిదట్టంగా వ్యాపించివుంది. ఆకాశంలో నక్షత్రాలు మంచి ముత్యాల్లా మెరుస్తు

న్నాయి. పరిస్థితి ఏమిటి ? ఎక్కడ వున్నాను ? ఏం జరిగింది ? అన్న ప్రశ్నలకు సమాధానం దొరకనేలేదు. తలా, పొట్టా, ఎడంచేయి నెప్పి పెడుతున్నట్టనిపించింది. కుడిచేత్తో నెప్పిపెడుతూన్న ప్రదేశాల్ని తడివి చూసుకున్నాను. నా శరిరం నుండి రక్తం స్రవిస్తూన్నదనీ, రక్తంతో తడిసి పడివున్నాననీ తెల్సుకున్నాను. బాధ భరించలేకుండా వున్నాను. మానవుడికి తన జీవితంకంటె ప్రియమైన వస్తువు మరొకటి వుండదు. కానీ, ఆ క్షణంలో నేను నా జీవితాన్ని గురించే కాక, నా ఇద్దరు సహచరుల్ని గురించికూడా ఆలోచించసాగాను. పరిసరంలోని శబ్దాలనూ, ధ్వనులనూ కొన్ని క్షణాలు జాగ్రత్తగా విన్నాను. ఎవరో మూలుగుతూన్న శబ్దం వినిపించింది. మరుక్షణంలో శాంతిలుడు హీనస్వరంలో నన్ను పిల్చాడు. అతడు చేత్తో తవుళ్ళాడి నా శరీరాన్ని స్పృశించాడు. నేను అటు ఇటూ కదిలాను. "నేను బ్రతికేవున్నాను. రెండు మూడు చోట్ల బలమైన దెబ్బలు తగిలాయి. బాణమొకటి ఇంకా పొట్టలో గుచ్చుకునేఉంది!" అన్నాను. శాంతిలుడు పొట్టకు గుచ్చుకున్న బాణాన్ని బలవంతాన లాగేశాడు. దాంతో గాయం పెద్దదయింది అయినా, అలా బాణాన్ని లాగివేయడం చాలా ముఖ్యం! శాంతిలుడికి ఏమాత్రం దెబ్బలు తగల్లేదని తెల్సుకుని చాలా సంతోషించాను. సంఘిలుడు మా ప్రక్కనే పడివున్నాడనీ, ఇంకా స్పృహ రాలేదనీ తెల్సుకున్నాను. మా చుట్టూ శత్రువులు మూగివున్నారు. చాలా జాగ్రత్తగా వుండాలి. ఒక్కొక్కమాటనే, శత్రువులకు వినబడకుండా, రహస్యంగా మాట్లాడుకుంటున్నాము. "ముందు సంఘిలుడి విషయం ఆలోచించు!" అన్నాను శాంతిలుడితో.

తరువాత మళ్ళీ స్పృహ తప్పాను. బలమైన దెబ్బలు తగిలాయి. రక్తం అత్యధికంగా స్రవించింది. అలాంటి స్థితిలో స్పృహ తప్పడం సహజమే. నేను తిరిగి కండ్లు తెరిచేసరికి బాగా పొద్దెక్కింది. ఎండ ఫెళ్లున కాస్తోంది. శాంతిలుడు నా తలవైపున కూర్చుని వున్నాడు. నేను కండ్లు తెరచినప్పటికి అతడి ముఖంలోని విషాదచ్ఛాయల్లో ఏమాత్రమూ మార్పు రాకపోవటాన్ని గమనించాను. సంఘిలుడికి ఎలా వుందని అడిగాను.

"వారు మనకికలేరు!" అంటూ దుఃఖాన్ని ఆపుకునే ప్రయత్నంలో దృష్టిని మరోవైపుకు తిప్పుకున్నాడు శాంతిలుడు.

మా చుట్టూ కాళ్ళూ చేతులూ తెగి, దెబ్బలు తిని, కొనఊపిరితో వున్నవాళ్ళూ, శాశ్వతంగా ఈ ప్రపంచాన్ని వదలివేసిన వాళ్ళూ పడి వున్నారు. శత్రుమూకలోని వారు ఎవర్ని గురించీ పట్టించుకోకుండా తమకు దొరికిన ప్రతివస్తువునూ ప్రోగుచేసుకుంటున్నారు. నాకు స్పృహ రావడాన్ని చూసి ఇద్దరు యువకులు మా వద్దకు వచ్చి కూర్చున్నారు. వాళ్ళ వాలకాన్నిబట్టి చూస్తే మాగతికి మమ్మల్ని వదలడం వాళ్ళకు ఇష్టం లేదనిపించింది, అప్పటికే వాళ్ళు శాంతిలుణ్ణి అడిగి మా గురించి చాలా విషయాలు తెలుసుకున్నారు. ఇంకా కూడా తెల్సుకోవాలన్న కుతూహలం వాళ్ళ ముఖాల్లో కనుపించింది. యువకులు వెళ్ళి, నేను స్పృహలోకి వచ్చానని తమ సర్దారుతో చెప్పారు. అతడు నా దగ్గరకు వచ్చి ఇలా అన్నాడు.

"మీరిలా గాయపడ్డందుకు మేము చాలా విచారిస్తున్నాం! మా ఖాన్ యబగూలకు మీరు గాయపడడం సుతరామూ ఇష్టం లేదు. మీతో వచ్చిన బేగ్ తోఘ్రుల్ జాతికి చెందినవాడుకాడు. ఆవార రాజకుమారుడు. ఈ విషయాన్ని ఇంతవరకూ రహస్యంగా వుంచాడు. కానీ, మేము మా శత్రువుల్ని ఏదో విధంగా పట్టేస్తాము. మా ఖాన్‌కు ఈ రహస్యం తెల్సింది. వెంటనే అతణ్ణిపట్టి తీసుకురమ్మని ఆజ్ఞయిచ్చాడు. ప్రాణాల్తో దొరక్కపోతే చంపి శవాన్నయినా పట్రమ్మన్నాడు. ఈ ఆవార రాజ కుమారుడు చనిపోయాడు. అతడి భార్య, సర్వసంపదా మా వశ మయ్యాయి. కానీ, ఈ ఆవార బేగ్‌ను ప్రాణాల్తో పట్టుకోలేక పోయి నందుకు విచారిస్తున్నాను. మా ఖాన్‌కూ, యబగూకూ భిక్షువు లంటే ఎంతో భక్తి! మీరు మా వెంట వచ్చేయండి!" అన్నాడు.

# 15 వ అధ్యాయం

# తిరుగుబోతుల దేశంలో

(క్రీ. శ 555-56)

మా మార్గం మారిపోయింది. నెలలతరబడి ప్రయాణం చేసినా ఎటు పోతున్నామో, ఎటు పోవాలో తెలియని అగమ్య స్థితిలో పడి పోయాము. పగలు సూర్యుడి సాయంతో, రాత్రిళ్ళు నక్షత్రాల సాయంతో మేము వెళ్తూన్న దిక్కును తెల్సుకో గలుగుతున్నాము. అయితే, ఆ దిక్కు మమ్మల్ని ఏ నూతన ప్రపంచంలోకి తీసుకువెడుతుందో తెల్సు కోవడం ఎలా ? వీళ్ళకు, శాంతీలుడు అవార రాజకుమారుడి కొడుకని తెలియదు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. శాంతిలుడు ముఖంలో తండ్రి కంటే తల్లి కవళికలే ఎక్కువగా వున్నాయి. కనుకనే శాంతిలుడు అవార వంశజుడని తెల్సుకోలేక పోయారు. అవార రాజ కుమారుడి అనుచరులూ, బానిసలూ కొందారు ప్రాణాల్తో దొరికిపోయారు వీళ్ళకు. వాళ్ళనీ, మా ఇద్దరినీ వొకేచోట వుంచినట్టయితే, కొద్ది రోజుల తరువాత అయినా, ఈ రహస్యం తప్పకుండా బయటపడేదే. ఇకనప్పుడు ఈ త్యోర్కులు శాంతిలుడిపట్ల ఎలా ప్రవర్తించేవారో, వేరుగా చెప్ప నవసరం లేదనుకుంటాను.

కొద్ది సేపటి తరువాత ఆ సర్దారు మళ్ళీ నాదగ్గరకు వచ్చాడు. మా సామాన్లును తీసుకువెళ్ళవల్సిందని తన వాళ్ళకు ఆజ్ఞ ఇచ్చాడు. నన్ను తన వెంట రమ్మన్నాడు. మా పట్ల అతడు చాలా నమ్రంగా, సభ్యతగా ప్రవర్తిస్తున్నాడు. మాటల సందర్భంలో అతడిలా అన్నాడు: "ఇంత వరకూ మేము అవారులకు దాసులం. కానీ, ఇప్పుడు అధికారం మాచేతు ల్లోకివచ్చింది. పరిపాలన మాదయింది. మీబుద్ధీ,విద్యా,అవారులకు ఎంతో

పాయపడ్డాయని మాకు తెల్సు, మీకు యుద్ధాలూ, కొట్లాటలూ గిట్టవనీ. మీరు ఆయుధ ధారణచేయని అహింసా వ్రతధారులనీ మాకు తెల్సును. అలాంటి స్థితిలో మీ మీద మాకు కోపంగానీ, శత్రుత్వంగానీ, ఎందు కుంటుంది? నేను మిమ్మల్ని మా యబగూ (అమాత్యుడు) వద్దకు తీసుకు వెడతాను. యబగూ మిమ్మల్ని చాలా గౌరవిస్తాడు. తనవద్ద ఉంచుకుం టాడు. యబగూ వద్ద వుండడం మీకు ఇష్టం లేకపోతే, ఎక్కడికి పోవా లనుకుంటే, అక్కడికి పంపిస్తాడు."

పై మాటలు విన్నాక మాకు కొంత ధైర్యం వచ్చింది. భవిష్యత్తుకు సంబంధించిన వినూత్న ఊహలు తిరిగి ప్రస్ఫుటించసాగాయి. నాకు బాగా బలమైన దెబ్బలు తగిలాయి. ఎదం డొక్కలో తగిలినదెబ్బ మిగిలిన దెబ్బలన్నిటికంటె చాలా ప్రమాదకరమైనది. అయితే, వెంటనే సర్దారు తన వైద్యుణ్ణి పిలిపించి గాయాల్లో మందుకూరి కట్టు కట్టించాడు. కట్టు కట్టాక రక్తం కారడం తగ్గింది. కొంత ధైర్యం వచ్చింది. నన్నొక గుర్రంమీదా, శాంతిలుణ్ణి ఒక గుర్రంమీదా ఎక్కించారు. రెండు రోజుల వరకూ చాలా నిదానంగా ప్రయాణం చేశాము. తరువాత గుర్రాలు పరుగు లంకించుకున్నాయి. తిరిగి మేము మూడువారాలక్రితం విడిచి వచ్చిన ఆ వెనుకటి పట్నాన్ని (హామీ) చేరాము అక్కడ కొన్నాళ్ళు ఆగుతా రను కున్నాను. శాంతిలుడి రహస్యం బయటపడుతుందేమోనని భయపడ్డాను. కానీ, మా సర్దారు యబగూను కల్సుకునే తొందరలో వుండడంవల్ల పట్నం బయట కేవలం వొక్కరాత్రి మాత్రమే విడిది చేశాడు. మర్నాడు ఉదయమే సర్దారు ఐదుగురు రౌతుల్ని వెంటపెట్టుకుని, మమ్మల్నికూడా తీసుకుని యబగూ దగ్గరకు ప్రయాణమైనాడు.

శాంతిలుడి తల్లి గతి ఏమైందన్న విషయం అప్పటి కింకా మాకు తెలియలేదు భర్తను చంపేశాక ఆమెను తోేర్కులు తీసుకుని వెళ్ళిపోతా రనుకున్నాము. కానీ, ఆమె వయస్సు చూసి, వాళ్ళు తీసుకు వెళ్ళక పోతేనో? మరి అలాంటి స్థితిలో ఆమె ఏమైంది? ఆమె తన పుట్టింటికి వెళ్ళిం దనీ భిక్షుణి అయి భవిష్యజ్జీవితాన్ని గడప నిశ్చయించుకుందనీ, తరువాత తెల్సింది. ఆమె భిక్షుణి జీవితానికి నూటికి నూరుపాళ్లూ తగిపోతుంది. వెనక భర్తదగ్గిర వున్నప్పుడు కూడా సర్వసంగ పరిత్యాగంచేసిన సన్న్యా

సిని లాగానే జీవితాన్ని గడుపుతూండేది. సాధారణమైన పరిస్థితుల్లో తల్లి ఇలా వెళ్ళిపోయుంటే, శాంతిలుడు ఏ మాత్రమూ బాధపడేవాడు కాదు. ఆమె వెళ్లిపోయినప్పటి పరిస్థితుల్ని తలచుకుని శాంతిలుడు చాలా బాధపడుతూండేవాడు. మేము ఇంతవరకు చేసిన తిరుగుప్రయాణంలో నీటికి బాగా ఇబ్బంది పడ్డాము. ఈ (హామీ)పట్టణం నుండి పర్వతపాదభూమి ననుసరించి ప్రయాణం చేయాలి. మేము ఊహించుకున్న దానికంటె, నీరూ, పసిరికా అధికంగానే లభించా ఈ పర్వతాల్లో! వెనుక మేము ఈ పట్నానికి వచ్చేప్పుడు మార్గ మధ్యంలోవి పర్వతాల్లో కళకళ్ళాదే గ్రామా లెన్నింటినో చూశాను ఇప్పుడా గ్రామాలన్నీ శిథిలమైనాయి. గ్రామాల్లో పచ్చగడ్డి ఏపుగా పెరిగింది. పశువులమేతకు పసిరిక బీళ్ళుగా ఉపయోగ పడుతున్నాయి గ్రామాలు. శిథిల గ్రామాల పరిసరాల్లో త్యోర్కుల దేరాలు కనుపిస్తున్నాయి.

డొక్కలో తగిలిన దెబ్బ పూర్తిగా నయం కావడానికి చాలా కాలం పట్టింది. అయితే, ఇప్పుడు నేనూ, శాంతిలుడుగూడా ప్రమాదస్థితి నుంచి బయట పడ్డాము. ప్రయాణంచేయటానికి వెనకటంత బాధపడడం లేదు కూడాను. నేను వైద్య శాస్త్రాన్ని ఒక యాత్రికుడికి అవసరం కాగలవరకే అధ్యయనం చేశాను. ఇంతవరకు నాతో ప్రయాణం చేసిన నా మిత్రులు సమర్థులైన వైద్యులు కావడంవల్ల, నావైద్యశాస్త్ర పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవల్సిన అవసరం కనిపించలేదు. సాధారణమైన దెబ్బలకూ, జబ్బులకూ, అవసరమైన కొన్నిమందులు ఎప్పుడూ మావెంటవుంటూ వుంటాయి డొక్కకు తగిలిన దెబ్బకు ఎక్కువ భాగం నా దగ్గరవున్న మందులేవి వాడాను. ప్రస్తుత పరిస్థితిలో, నా మానసిక స్థితి అయోమయంగా వుంది. ఎన్నాళ్ళనుంచో నిర్మించు కుంటూన్న మా ఆదర్శం చెదిరిపోయింది. మా జీవితాలు ఏమౌతాయో, ఎక్కడ రాలిపోతాయో తెలియని అనిశ్చిత సితిలో పడ్డాము. సర్దారు మమ్మల్ని చాలా గౌరవంగా చూస్తున్నాడు. అయినా, ఒక రకంగా మేము అతడికి బందీల మయ్యాము.

ఒక చిన్న కొండవాగు ననుసరించిపర్వత పంక్తుల్లోకి వెళ్ళాము. ఆ పర్వతాల్లో నీటికీ మేతకూ కొదువలేదు. ఎక్కడయినా మజిలీవేసి,

ఒకటి రెండు రోజులు విశ్రాంతి తీసుకోవచ్చు ! కానీ, సర్దారు యబగూను కల్సుకోవాలన్న తొందర్లో వున్నాడు ఎక్కడా మజిలీ వేయలేదు. రెండు మూడు రోజుల్లో పర్వత పంక్తుల్ని దాటాము. ఒక విశాల సరోవరాన్ని చేరాము. సరోవరానికి ఈశాన్యంగా దగ్గర్లోనే ఓ (బర్కుల్) పట్టణం వుంది. పట్టణాన్ని చేరాము. పట్టణానికి దక్షిణవైపుగా వున్న పర్వతాల్ని దాటి పట్నంలో ప్రవేశించాము. పట్నానిక ఉత్తర దిశన కూడా ఇలాంటివే పర్వపంక్తు లున్నాయి. ఇలాంటి ఎడారి ప్రదేశాల్లో సరోవరం వుందంటే, దాని నీళ్ళు ఉప్పగా వుంటాయని వేరుగా చెప్పనవసరంలేదు. ఎక్కడైనా మజిలీ వేశామంటే, ఇక సర్దారు గంటల తరబడి మాతో మాట్లాడుతూ కూర్చునేవాడు. మా మీద సర్దారుకు ఎలాంటి అనుమానమూ లేదు. మేము శత్రుపక్షంలోని వాళ్ళం కామని ఏనాడో నిర్ణయించుకున్నాడు. కనుకనే, చాలా ఆత్మీయంగా మాట్లాడేవాడు. తిరుగుబోతుల్లోనూ వ్యక్తుల స్థితుల్ని, హోదాల్ని అనుసరించి వ్యక్తిత్వాలు, సభ్యతలూ మారుతుంటాయి. సర్దారు యబగూకు విశ్వాసపాత్రుడైన సామంతుడు. తిరుగుబోతుల్లోని ఉన్నత వర్గానికి చెందినవారు, చదువు సంధ్యల్లోనూ, ఇతర విషయాల్లోనూ అన్యజాతుల్లోని ఉన్నత వర్గాలలోనివారికి ఏమంత తీసిపోరు. సింహళంలో బోయల్ని చూశాను. వాళ్ళకూ ఇళ్ళూ వాకిళ్ళూ ఏమీ లేవు. పశుపాలురు కూడా కాదు. వేట వారి ప్రధానవృత్తి . వాళ్ళూ, ఈ తిరుగుబోతుల్లాగానే, క్రూరులు, అతిభయంకరులు. నిర్దయులు. అయినా, ఆ బోయలకూ, ఈ తిరుగుబోతులకూ చాలా వ్యత్యాస ముంది. బోయల కంటే ఈ తిరుగుబోతులు నాగరికులు ! ఈ తిరుగుబోతులు పశుపాలనను విడిచి, వ్యవసాయాన్ని ప్రారంభించినట్లయితే, నాగరికతలో ప్రపంచంలోని ఇతర జాతుల్తో పోటీ చేయగలిగేవారే. కానీ, వీరికి వ్యవసాయ మంటే గిట్టదు. అయితే, కళల యందు వీళ్ళకు చాలా ఆసక్తి. చిత్ర, శిల్ప కళల్లో వీళ్ళను చెప్పే మరొక జాతిని చెప్పాలి ! వీరి దేరాల్లో గొప్ప చిత్రకారు లుంటూంటారు. వస్త్రాలమీదా, ఇతర వస్తువులమీదా అద్భుతంగా చిత్రాలను చిత్రిస్తూంటారు. ఇక్కడి పర్వతాల్లో రాగి, ఇనుము, బంగారము లభిస్తాయి. శత్రువులతో పోరాడడానికి ఆయుధాలు అవసరం

గనుక, ధాతు శిల్పాన్ని చాలా అభివృద్ధి పరచుకున్నారు. వెనుక తోఖ్యర్కులు సువర్ణగిరివద్దకల అవారుల ఇనుప గనుల్లో పనిచేస్తుండే వారని చెప్పాను. ఈ పర్వతానికి సువర్ణగిరి అని ఊరకనే పేరు పెట్టలేదు. పర్వతానికి దక్షిణంగా పెద్ద పెద్ద బంగారపు గను లున్నాయి. ఈ గనులవల్ల ఖాన్‌కు చాలా బంగారం లభిస్తూంటుంది. భారతదేశానికి ఉత్తరంగా బంగారు పర్వతం ఉందని ఒక కథ చెపుతారు. ఇక్కడ కూడా సువర్ణగిరిని గురించి ఒక కథ చెపుతుంటారు. అయితే, ఈ సువర్ణగిరికి సంబంధించిన కథ వొట్టి కథ మాత్రమే కాదు. సువర్ణగిరి నుండి తెచ్చిన బంగారపు ఇటుకల్ని యబగూవద్ద నేను కండ్లారా చూశాను.

ఈ పట్నమే మా ప్రయాణంలోని చిట్టచివరి పట్నం : ఈ పట్నాన్ని దాటాక చాలా కాలం వరకు తిరిగి మేము పట్నాల్నిగానీ, గ్రామాల్నిగానీ చూడలేదు. ఎన్నో రోజుల తరువాత తిరిగి గ్రామాల్లో ప్రవేశించినప్పుడు, ఏవో నూతన లోకాల్లో విహరిస్తున్నట్లు మహదానందమూ, విస్మయమూ కలిగింది. ఈ పట్నంలోనూ సంఘారామం ఒకటుంది. కొందరు భిక్షువులున్నారు. ఇక్కడి ప్రజల ముఖాల్లో తోఖ్యర్కుల కంటే కూచీ ప్రజల పోలికలే అధికంగా వున్నాయి. ప్రజల్లో అధిక భాగం వ్యాపారులూ, శిల్పకారులూ వున్నారు. పట్టణం వెలుపల చిన్ని చిన్ని గ్రామాలూ వున్నాయి. ఆ గ్రామాల్లో నామమాత్రంగా వ్యవసాయం సాగుతూ వుంటుంది. పట్నంలో మాత్రం ఎండుపండ్ల తోటలూ, కూరగాయల తోటలూ వున్నాయి. ఈ పట్నంనుండి పశ్చిమంగా పోయే మార్గం ఒకటుంది. ఆ మార్గం కొంతదూరం వెళ్ళాక సోగ్ద వెళ్ళే మార్గంలో కలుస్తుంది. బంగారు గనులకు వెళ్ళేమార్గంకూడా వొకటుంది. అయితే ఈ మార్గాన బంగారు గనులవరకూ వెళ్ళడానికి అనేక ఆటంకాలూ, అభ్యంతరాలూ వున్నాయి. తోఖ్యర్కులూ, వీరికి ముందున్న అవారులూ బంగారుగనులను గురించి ఇతరు లెవరికీ తెలియకుండా వుండడానికి తగు జాగ్రత్తల్ని తీసుకున్నారు. వివిధ దేశాలమధ్య సంభవించే యుద్ధాలకు పరోక్షంగాగాని, ప్రత్యక్షంగాగానీ, కారణం బంగారమే. బంగారం కోసమే వివిధ జాతులూ, దేశాలూ కొట్టుకు చస్తు

న్నాయి. శత్రువు బలవంతు డయినప్పుడు, తిరుగుబోతులు తమ పశు వుల్ని తోలుకుని దూరంగా పారిపోగలరు. కానీ. అలాంటి స్థితిలో ఈ బంగారు గనుల్ని తీసుకుని వెళ్ళడం ఎలా సంభవం ? చీనా, పార సీక భారతదేశాలు బంగారం కోసం సదా దేవులాడుతూంటాయన్న మాట యథార్థం! అందుబాటులో బంగారం ఉందని తెలిస్తే సైనిక బలాన్నుపయోగించి ఆ బంగారాన్ని హస్తగతం చేసుకోవడానికి ప్రయ త్నించేమాటా యథార్థమే! అయితే, పైదేశాలవారు. నీరూ, నిప్పూ దొర కని ఎడార్లల్లో నెలల తరబడి ప్రయాణం చేసి, ఈ పర్వతాల వరకూ రావడం అసాధ్యమైన విషయం. అయినా. తిరుగుబోతులకు తమబంగారం కోసం ఇతర దేశాలవారు వచ్చి పడతారేమోనన్న భయం ఉండనే ఉంటుంది. బయటి వాళ్ళేకాక, ఆ గనుల్లో పనిచేసే త్యోర్కు-దాసులే బంగారాన్ని దొంగిలించవచ్చునన్న భయమూ వుంటుంది. కనుకనే బంగారు గనుల్ని రాజ్యపు సంపత్తిగా భావించి. ఆ గనుల్లోకి ఇతరు లెవరూ వెళ్ళడానికి వీల్లేకుండా జాగ్రత్తల్ని తీసుకున్నారు.

మే మా పట్నంనుండి బయల్దేరాము. ఈశాన్య దిక్కుగా వెళ్ళే మార్గాన ప్రయాణం చేస్తున్నాము. ఆకాశం అతి నిర్మలంగా వుంది మాకు అభిముఖంగా పర్వత పంక్తులు కనుపిస్తున్నాయి. ఆకాశం నిరభ్రంగా ఉన్నప్పుడు బహుదూరాన కల పర్వతాలుకూడా అతిసమీపాన ఉన్నట్లు కనుపిస్తాయి. పర్వతపంక్తులకూ మాకూ మధ్యనగల భూమి సమతలంగా వుంది. ఇక్కడఫరాసవృక్షాలు, ఇతరముండ్లపొదలు అధికంగా ఉన్నాయి. ఈ ఫరాస వృక్షాలను మధుర దగ్గిరకూడా చూశాను. అయితే, మధుర ప్రాంతం ఇసుక భూమి కాదు. నీరు ఏమాత్రమూ దొరకని, ఈ ఎడారి ప్రాంతాల్లో, ఫరాస వృక్షాల్లాంటి పెద్దపెద్ద వృక్షాలు మొలవడం నిజంగా నన్ను ఆశ్చర్యపరిచింది. వొకచోట ఫరాసవృక్షాల వనం వొకటి కను పించింది. సాయంకాలానికి ఆ వనాన్ని చేరుకున్నాము, రాత్రికి అక్కడే విశ్రాంతి తీసుకుందామని ఉద్దేశం. ప్రొద్దుకుంకు సమయానికి వంటెలు గుంపు వొకటి వచ్చింది ఆ వనంలోకి. ఇక్కడి వంటెలు భారతదేశపు వంటెలకంటే చిన్నవిగా ఉంటాయి. "ఈ వంటెలకు ఫరాస ఆకులు ఇష్టం గావును, మేయడానికి వచ్చాయి!" అనుకున్నాను. భారతదేశం

లోని వంటెలు ముళ్ళచెట్ల ఆకుల్ని ఇష్టంగా తింటాయి. ఫరాసముళ్ళచెట్టు కాదుకదా? ఇక్కడి వంటెలకు వంటి నిండా మృదువైన వెంట్రుకలు ఉంటాయి. వాటితో నేసిన వస్త్రాలను రాజవంశీకులుకూడా ధరిస్తుంటారు. భారత దేశపు వంటెలకు వొకే మూపురం ఉంటుంది. కానీ, ఇక్కడి వంటెలకు రెండు మూపురాలుంటాయి. వంటెలు బరువు మోయడానికి, ఇసుకలో ప్రయాణం చేయడానికి పనికి వస్తాయి. వంటెలు మోసినంత బరువు గాడిదలుగానీ, గుర్రాలుగానీ మోయలేవు. అయితే, ఇక్కడి ప్రజలు, గుర్రపు మాంసంలాగానే, వంటె మాంసాన్నిగూడా తింటారు. వంటె మాంసాన్ని కేవలం పేదల ఆహారంగా పరిగణిస్తారు. సమతల ప్రదేశాల్లో సామంతులు బండ్లల్లో ప్రయాణం చేయడంకూడా కద్దు. ఇక్కడ నేర్పరులైన వడ్రంగులు లేనేలేరని చెప్పవచ్చును. తిరుగుబోతులకు ఇండ్లు వుండవు ఇండ్లల్లో వుండే రకరకాలు సామాన్లు వారికి అనవసరం। అలాంటప్పుడు వడ్రంగులు ఎలా వుంటారు? వున్నా, వారిలో నైపుణ్యత ఎలా వస్తుంది? ఇంకొంచెం ముందుకుపోయాక, చెట్లూ చేమలూ కల ప్రదేశాల్లోకి వచ్చాము. అక్కడి వడ్రంగులు తమ సాధారణమైన సాధన సంపత్తితోనే, అందమైన బండ్లను తయారు చేయడం చూశాను.

కొన్నిరోజుల ప్రయాణానంతరం, మాకు ఎదురుగా కనుపిస్తున్న పర్వతాల్ని చేరాము. ఈ పర్వతాల్ని 'సువర్ణగిరి' అనే పిలుస్తారు. భారతదేశంలోని హిమాలయం లాగానే ఈ సువర్ణగిరికూడా చాలా దూరం వ్యాపించి వుంది. ఇప్పుడు మేము ప్రవేశించన వైపు బంగారపు గనులు లేవు. కానీ, ఇదే పర్వతపు పశ్చిమ కొసన బంగారపు గనులున్నాయి. వాటిని ఆధారంగా చేసుకుని, ఈ మొత్తం పర్వతాన్నే సువర్ణగిరి అనేశారు. ఈ పర్వతాల్లో ఎక్కడా నాకు పసిరిక కనుపించలేదు. పెద్ద పెద్ద చెట్లు అసలు వుండడానికే వీల్లేదు. అయితే పర్వతపు ఉత్తర భాగంలో చెట్లూ – చేమలూ, ఏపుగా పెరిగిన పసిరికా కనుపించాయి. ఈ ఉత్తర భాగంలో చలి అధికంగా వుంది.

నా అనుభవంలో పర్వతాల పై భాగాలకు పోయినకొలదీ చలి అధికం కావడాన్ని చూశాను. అలాగే ఉత్తరదిశకు పోయిన కోలదికూడ

చలి అధిక మౌతుంది. భారత దేశంలో మంచు మిక్కుటంగా కురిసే పర్వతాలపైగానీ, భూర్జ, దేవదారులాంటి వృక్షాలు మొలవ్వు. కానీ, ఇక్కడ అలా కాదు. సమతల ప్రదేశాల్లోనే భూర్జ, దేవదారు వృక్షాలను చూశాను. కాంస్య దేశానికి వచ్చాకనే నేను ఉన్ని చీవరాన్ని ధరించసాగాను. శాంతిలుడి తల్లి నా కొకటి, శాంతిలుది కొకటి, ఉన్ని కంచుకాలను స్వయంగా తయారుచేసి ఇచ్చింది. అయినా, వాటితో చలి ఆగేదికాదు. సర్దారూ. అతడి అనుచరులూ, వేసవికాలంలోకూడా చర్మపు దుస్తుల్ని ధరిస్తుంటారు. ఇక చలికాలంలో అడగవలసిన పనేలేదు. వెంట్రుకలు బయటికి వుండేట్టు తయారుచేసిన గొర్రె చర్మపు దుస్తుల్ని ధరిస్తున్నారు. సర్దారు వేసుకున్న పసుపు పచ్చని జింక చర్మం చొక్కా చాలా విలువైంది. పచ్చగా మేలిమి బంగారంలా మెరసిపోతూ, వెన్న పూసలా మృదువుగా వుంది. అలాంటి మృగ చర్మాలు ఇంకా ఉత్తర దేశానికి పోతేగాని లభించవు. తలకు అలాంటి మృగ చర్మంతోటి తయారు చేసిందే టోపీ వుంది. మోకాళ్ల వరకూ ఉన్ని పాదరక్షలు వున్నాయి. వాటిపైన అంతే పెద్దవి చర్మపు పాదరక్షల్ని ధరించాడు. చొక్కా చేతులు చాలా పొడవుగా ఉండి ముంజేతుల్ని దాటి క్రిందికి వ్రేళ్లాడుతున్నాయి. ఆ దుస్తుల్ని చూశాక, మానవుడు దేశకాలాల ననుసరించి తన రక్షణకు అవసరమైన విధంగా సాధనలను ఏర్పరచుకుంటాడని తెల్సుకున్నాను.

నేను చలిని భరించ లేకుండావున్న విషయాన్ని సర్దార్ తెలుసుకున్నాడు దట్టంగా వెంట్రుకలున్న చర్మపు దుప్పటిని ప్రతిరోజూ రాత్రి పూట కప్పుకోవడానికి పంపించేవాడు. ఇలా చర్మపు దుప్పటిని కప్పుకోవడం వినయ నియమాలకు విరుద్ధమని సింహళ భిక్షువులు అంటారు. కానీ, ఈ విపరీతమైన చలిలో చర్మపు దుప్పట్లను కప్పుకోకుండా ఒక్క క్షణంకూడా బ్రతకలేమని వారి కేం తెలుసు? బుద్ధ భగవానుడు ఇక్కడికి వచ్చి, ఈ చలిని అనుభవించి ఉన్నట్లయితే, ఇక్కడ భిక్షువులూ, భిక్షుణిలూ చర్మపు దుస్తుల్ని ధరించడానికి తప్పకుండా తన ఆమోదాన్ని తెలియపరచేవాడు. సర్దారు మొదటగా, చర్మపు కంచుకాన్ని, టోపీని, దుప్పటినీ ఉపయోగించు కోవల్సిందని చెప్పినపుడు, నేను నిరాక

రించాను. కానీ రెండురోజుల తరువాత చలికి వివశుణ్ణయి వాటినే ధరించ డానికి వప్పుకున్నాను. ఉద్యానంలాంటి చలిదేశాల్లో భిక్షువులు ఉన్ని టోపీలను ధరించడం సర్వసాధారణమైన విషయం. మరికొంచెం అధికంగా చలిపెట్టే దేశాల్లో ఉన్ని స్థానంలో చర్మపు టోపీలను ధరించ డానికి మేము అభ్యంతరం చెప్పం. కానీ ఈ విపరీతమైన చలిలో పొట్టనూ, గుండెనూ రక్షించుకోవడం ముఖ్యం. లేకపోతే పొట్ట దెబ్బతింటుంది. జబ్బు పడతాము. ఇన్నాళ్టికి నా గాయాలు పూర్తిగా నయమయ్యాయి।

ఈ కొండలు ఏమంత పెద్దవికావు. వీటిని ఎక్కడానికి మేము ఏ మాత్రమూ శ్రమపడడం లేదు. పైగా గుర్రాలనెక్కి ప్రయాణం చేస్తున్నాము. దెబ్బలు తిని అశక్తుణ్ణయి నప్పటినుండీ గుర్రాలపై ప్రయాణం చేయడానికి అలవాటు పడ్డాను. ఇప్పుడు తిరిగి కోలుకున్నాను. నడవగల శక్తి వచ్చింది. అయినా నడిచి వస్తాననడానికి వీల్లేని పరిస్థితి। మేము కాలినడకన ప్రయాణం చేయడంవలన మిగిలినవాళ్ళు మా కోసరం ఆగవల్సి వస్తుంది. గమ్యాన్ని చేరడం ఆలస్యమౌతుంది. అలాంటి స్థితిలో సర్దారు మమ్మల్ని గుర్రాన్నెక్కి ప్రయాణం చేయాల్సిందని తప్పని సరిగా బలవంతం చేస్తాడు. ఇవన్నింటినీ దృష్టిలో వుంచుకొని ఆరోగ్యవంతుడైన భిక్షువుకు గుర్రపు ప్రయాణం ఉచితం కాదని తెల్సికూడా అంగీకరించాను.

ఇక నిప్పుడు మేము పర్వతాల్ని దిగి, రెండవ వైపునున్న మైదానంలో ప్రవేశించాము. విశాలమైన ఈ మైదానంలో చూద్దామన్నా కొండలు కనుపించవు. కాకపోతే, చిన్నచిన్న కొండల్లాంటి మట్టిదిబ్బలు మాత్రం అక్కడక్కడా వున్నాయి. ప్రస్తుతం యువరాజే యబగూ పదవిని నిర్వహిస్తున్నాడు. ఖాన్ తరువాత ఇతడే ఖాన్ అవుతాడు. తిరుగుబోతుల్లో రాజుకొడుకు తిరిగి రాజు కావాలనే దేమీ లేదు. ఎవడైనా వొకవ్యక్తి గొప్ప పదవిని అలంకరించాలంటే అతడిలో భుజ బలం, బుద్ధి బలం, పరాక్రమం ఉండాలి। 'వంశానుగతం' అన్నది అక్కడ పనికిరాదు. ఇంతకు క్రితం త్యూమన్ త్యోర్కుల ఖాన్. కానీ ఇప్పుడు ఖాన్ పదవి నలంకరించింది త్యూమన్ కొడుకు కాదు. ముయూ అనే

మరొక పరాక్రమ వంతుడు ఖాన్ అయ్యా డిప్పుడు. ముయా తరువాత ప్రస్తుతపు యబగూ అతడి స్థానాన్ని స్వీకరిస్తాడు. కాబోయే ఖాన్‌కు అవసరమైన అన్ని హంగులూ, హోదాలూ ఇతడికి ఉన్నాయి. ఇతడికి అనేక దేరా లున్నాయనీ, వాటిలో 50 వేలమంది సశస్త్రులైన సైనికు లున్నారనీ అంటారు. ఈ తిరుగుబోతుల కుటుంబాలను వొక రకంగా చిన్ని చిన్ని సైనిక కూటము లనవచ్చును వీళ్ళ దేరాలను సైనిక శిబిరా లనవచ్చును. తిరుగుబోతులు సాధారణంగా యువకుల్నీ ప్రౌఢులైన పురుషుల్నీ సైనికులుగా లెక్కిస్తారు. కానీ, అవుసరం వస్తే, స్త్రీ. పురుష వ్యత్యాసం లేకుండా బాలాది వృద్ధులూ యుద్ధానికి సిద్ధమౌతారు. స్త్రీలు కూడా పురుషుల్తో సమానంగా గుర్రపు స్వారీ చేస్తారు. గుర్రా లపై స్వారీ చేస్తూనే శత్రువుల గుండెల్లోనుండి దూసుకుపోయేట్లు బాణాల్ని వేస్తారు. వరసన అనేక దేరాలు వొకే చోట వుంటే, అదీ వొక పట్నంగానే వుంటుంది. ప్రతి దేరా ముందూ ఆ కుటుంబానికి సంబంధించిన వొంటెలూ, గుర్రాలూ, చమరీ మృగాలూ కట్టివేసి వుంటాయి. ఈ పశువులే తిరుగుబోతులకు ముఖ్య సంపత్తి. ఇవేవారికి జీవనాధారం. పశువుల వసతికోసం దూర దూరంగ దేరాలను వేసు కుంటారు. యబగూ వుండే ప్రదేశం దాపుకు చేరాము. ఈ ప్రదేశంలో యబగూ చలికాలంలో నివసిస్తూ వుంటాడు. అక్కడి అతడి అనుచరు లకూ, బేగులకూ ప్రత్యేకమైన స్థానాలు ఏర్పాటై వున్నాయి. ఈ ప్రదే శంలో పశుగ్రాసం, నీరు, వంట చెరకూ సమృద్ధిగా లభిస్తుంది. పైగా మంచు చాలా తక్కువగా కురుస్తుంది. ఎప్పుడైనా నాలుగు రోజులపాటు మంచు అధికంగా కురిసినా, ఆ నాలుగు రోజులకూ అవుసరమైన పశు గ్రాసాన్ని, వంట చెరకును ముందే జాగ్రత్త చేసుకుంటారు.

అంతదూరాన్నుండే యబగూ దేరాను గుర్తించాను. అతడి దేరా ఇతరుల దేరాలకంటే చాలా పెద్దదిగానూ, విశాలంగానూ వుంది. దేరా ముందు నలుచదరంగా వున్న విశాలమైన గుడ్డపందిరి వొకటుంది. రంగు రంగుల గుడ్డల్తో ఆ పందిరి చక్కగా అలంకరించి వుంది. మేము వెళ్ళ డానికి రెండు మూడు రోజులముందే మంచు విపరీతంగా పడ్డది. ఇప్ప టికీ పరిసరమంతా మంచుమయంగా వుండడంవల్ల దేరాల రంగుల్ని

పోల్చుకోవడం కష్టమౌతూన్నది. యబగూ మమ్మల్ని ఎలా ఆహ్వా నిస్తాడో చూడాలన్న కుతూహలం నాలో ఎక్కువగా ఉంది. "అతడి తల్లి బౌద్ధఉపాసిక। తల్లి కారణంగా యబగూకూడా భిక్షువులపట్ల శ్రద్ధాసక్తులు కలిగాయి. మా వెంట బౌద్ధ భిక్షువుల్ని తప్పక తీసుకు రావలసిందని చెప్పాడు. మీరు కనుపించకపోతే దారిలో, ఏదో వొక పట్నంలో ఆగి, ఇంకెరివనైనా భిక్షువుల్ని వెంట తీసుకువచ్చేవాళ్లం।" అన్నాడు సర్దారు.

సర్దారు అబద్ధమాడుతున్నాడనుకోవడానికి అవకాశమే లేదు. అవసరమూలేదు। పైగా యబగూ మమ్మల్ని ఏమోచేస్తాడన్న భయమూ అంతకంటెలేదు. వొకవేళ భయమేవున్నా, ఆ భయాన్నే నెమరు వేసుకుంటూ, చిక్కశల్యమయ్యే స్థితిలోలేను నేను. జీవితం మీద అంతటి మోహమూ నాకులేదు. మేము వస్తున్నామన్న వార్తను నాలుగు రోజుల క్రితమే దూత యబగూకు తెలియచేశాడు. యబగూ దేరాకూ, ఈ సర్దారు దేరాకూ వొకక్రోసు దూరముంటుంది. సాయంత్రానికి సర్దారుదేరాను చేరు కున్నాము.

స్థిర నివాసి అయి, వొకేచోట ఉంటూన్న మానవుడు ప్రపంచం లోని విచిత్రాన్ని చూడలేడు. తెల్సుకోనూలేడు. సింహళంలో ఋతు పరివర్తన అసలు ఉండనే ఉండదు. కాస్తే ఎండలూ, లేకపోతేవర్షం, అంతే. సింహళంలో ఉండగా, రాత్రిపూట్ల, ఆకాశం నిరభ్రంగా ఉన్న పుడు,ధృవ నక్షత్రాన్ని చూడడానికి ప్రయత్నించేవాణ్ణి। ఉత్తర క్షితిజా న్నానుకుని ఎప్పుడైనా, కదాచిత్తుగా కనబడుతూ ఉండేదా నక్షత్రం. మా ఉద్యానంలో నుండి చూస్తే, క్షితిజానికి చాలాపైగా కనుపించేది. ఇక్కడి నుండిచూస్తే మరీపైకి కనుపిస్తున్నది. ఇంకొంచెం ఉత్తరానికి పోతే ధ్రువనక్షత్రం నడినెత్తిన కనుపిస్తుందనుకుంటాను ? వొకేచోట ఉండేవ్యక్తికి ఈమార్పు ఎలా అర్థమౌతుంది ? రాత్రి పగలూకూడా ఇక్కడ చాలా వ్యత్యాసంగా ఉంటాయి. ఇక్కడి పగలు కేవలం రెండు న్నర జాముమాత్రమే ఉంటుంది. (నాలుగున్నర, లేక ఐదుగంటలు) మిగిలిన సమయమంతా అంధకారమయమే। సర్దారు దేరాను చేరగానే మారాకను గురించిన సమాచారాన్ని యబగూకు అందజేశాడు. అరాత్రే

యబిగూ తిరుగు సమాధాన్ని పంపించాడు. తెల్లవారగానే భిక్షువుల్ని తీసుకుని తన దేరాకు రావలసిందని సర్దారుకు కబురు పంపాశ. సుదీర్ఘమైన ఈ రాత్రిళ్ళను గడపడమూ కష్టమే. అక్కడికి వెళ్ళగానే మా ఇద్దరికీ ఓ ప్రత్యేకమైన దేరాను ఇచ్చాడు సర్దారు. చిట్టచివరి పట్టణం (హామీ)ని దాటిన మూడవరోజునుంచీ సర్దారు మాకుకొంత స్వేచ్ఛనిచ్చాడు. ఇక మే మెటూ పారిపోమని నిశ్చయించుకున్నాడుగావును. కాకపోయినా, ఈ ఎడారి ప్రదేశాలకు వచ్చాక వెనక్కి పారిపోవ చూడడముగొప్ప మూర్ఖత్వం. మా ప్రవర్తనకూడా సర్దారుకు ఏమాత్రం అనుమానం కలిగించలేదు. సువర్ణగిరిని దాటాక మాకు పూర్తిస్వేచ్ఛ నిచ్చేశాడు. అతడి సైనికులు ఇద్దరు మా వెంట ఉండేవారు. సువర్ణగిరిని దాటాక ఇద్దరు సైనికులూ,మాకు కాపలా దారుల్లాకాక,సేవకుల్లా వ్యవహరించారు.

మర్నాడు సూర్యోదయంతో పాటు భోంచేశాం. ఈ ప్రదేశంలో పగలు చాలాకురచ అని చెప్పాను. అయినా,మా వంటిపూట భోజన నియమానికి ఎలాంటి ఆటంకమూ ఉండదు.ఎనిమిది జాముల్లోనూ వొక్కసారి భోంచేయడం ఆచారమైనప్పుడు పగలు కురచ అయితేమాత్రం నష్టమేముంది. అయితే,సింహళంలో ఉండగా ఉదయాన్నే అల్పాహారం తీసుకునే వాళ్ళం.తరువాత జామున్నర పొద్దెక్కాక పూర్తిఆహారాన్ని తీసుకునేవాళ్ళం. ఇక్కడ సూర్యోదయమైన జాములోపే అపరాహ్ణమై పోతుంది. కనుక ఆలోపే భోజనం చేయడం పూర్తి అయిపోయేట్టు చూసుకోవాలి. దుస్తుల్లో పరివర్తన జరిగినట్టే, ఆహారంలోనూ పరివర్తన జరుగుతుందేమోనని భయపడుతూండేవాణ్ణి. నియమాలు ఎక్కడ సడలుతాయోనని జాగ్రత్త తీసుకునేవాణ్ణి. మొదటిరోజు సూర్యోదయంతోపాటు, మర్నాటి వరకూ ఆగేట్టు, కడుపునిండా భోంచేశాం.

భోజనమై బయటికిరాగానే, రెండుతెల్లని గుర్రాల్ని వెంట పెట్టుకుని యబిగూ అనుచరు లిద్దరు దేరా వాకిట్లో నిలబడి వుండడాన్ని చూశాము.ఆ గుర్రాలు తోఖార్ల గుర్రాలకంటే భారీగా ఉన్నాయి. తెల్లగా చాలా అందంగా ఉన్నాయి. గుర్రాల నెక్కబోయేముందు అనుచరు లిలా అన్నారు. "ఇవి యబిగూ సొంతగుర్రాలు. చాలా సాధుస్వభావం కలవి.

మీరేమీ భయపడనవసరం లేదు. ఎక్కండి." సర్దారుకూడా తనవద్ద ఉన్న ఇలాంటి తెల్లని గుర్రాన్నే వేసుకుని, మావెంట బయల్దేరాడు. కొద్దిక్షణాల్లో యబగూ దేరాను చేరాము. మేము వెళ్ళేసరి" యబగూ వేటకు వెళ్ళడానికి సిద్ధంగాఉన్నాడు. అతడో శ్వేతాశ్వాన్ని అధిరోహించి ఉన్నాడు. అతడివెంట చాలామంది భటులూ అనుచరులూ ఉన్నారు. యబగూకు రెండువైపులా రెండువందలమందిదాక సామంతులు విలువైన గుర్రాలనెక్కి వేటకు సిద్ధమై ఉన్నారు. యబగూ మొలకు మృగచర్మాన్ని కట్టుకున్నాడు. ఆకుపచ్చని సాటిన్ కంచుకాన్ని ధరించాడు. తలవెంట్రుకలు బాగా పెరిగి వెనక్కి విరబోసుకుని ఉన్నాయి. నుదురుమీద తెల్లని పట్టువస్త్రపు పట్టీ నొకదాన్ని కట్టుకున్నాడు. పట్టీకొసలు వీపుమీద చాలా పొడుగ్గా వ్రేలాడుతున్నాయి. సామంతులుకూడా విలువైన దుస్తుల్ని ధరించారు. మిగిలిన భటులందరూ మృగచర్మాల్ని, ఉన్నితోటి నేసిన మొరటు కంచుకాలనూ ధరించారు. ప్రతివాడి చేతిలోనూ బాణమో, బల్లెమో ఏదో వొక ఆయుధం ఉంది, భుజాన ధనుస్సు, వీపున తూణీరాలూ ఉన్నాయి. భటుల్లో కొందరు వంటెలమీద ఎక్కిఉన్నారు. కొందరు గుర్రాలమీద ఎక్కి ఉన్నారు.

యబగూ చాలా సంతోషంగా మమ్మల్ని కల్సుకున్నాడు. దారిలో మేము పడిన బాధలకు ఎంతో సానుభూతిని తెలియపరచాడు. "మీరు మా అతిథులేకాక, గురువులు కూడాను. మీనుండి నేర్చుకోవల్సింది ఎంతో ఉంది." అన్నాడు. మేము వచ్చిన సమయానికే తను వేటకు వెళ్ళవల్సి వచ్చినందుకు బాధపడుతూ "మీ కోసం ఒకదేరాను ప్రత్యేకించాం. కొందరు పరిచారకులను కూడా వినియోగించాము" అన్నాడు. తరువాత వొక సామంతుణ్ణి మాదగ్గిరకు పిల్చి "మీకే వస్తువు అవసరమైనా ఇతణ్ణి అడగండి. తెచ్చి ఇస్తాడు. ఇతడు అహర్నిశలూ మీసేవకు సిద్ధంగా ఉంటాడు" అంటూ నమస్కరించి అనుచరుల్తో కలిసి వెళ్ళిపోయాడు యబగూ. సామంతుడు మమ్మల్ని మా దేరావైపు తీసుకుపోయాడు. నిన్న సాయంకాలం నేను దూరంనుండి చూసిన విశాలమైన దేరాకు బంగారుపోగులు అల్లారు. బాలసూర్యుడి నునువెచ్చని లేకిరణాల స్పర్శతో బంగారుతీగలు మెరిసిపోతూ మా కండ్లను మిరుమిట్లు గొల్పి

తున్నాయి. నేను, యబగూయొక్క రాజస్థానాన్ని చూడాలన్నాను. సామంతుడు చాలా సంతోషంతో నన్నక్కడికి తీసుకుపోయాడు. తరువాత యబగూ ఆ డేరాలో తనసామంతుల్తో సభ జరుపుతూండగాకూడా చూశాను. యబగూ సింహాసనానికి రెండువైపులా పరుపులు పరిచిన ఉచితాసనాలు బారులుతీర్చి ఉన్నాయి. వీటిలో సామంతులూ, ఇతరసభాసదులూ కూర్చుంటూంటారు. సభాభవనపు వైభవాన్నిచూసి నేను చకితుణ్ణయ్యాను. తిరుగుబోతులు ఇంతటి వైభవాన్ని కలిగిఉంటారని కలలోకూడా ఊహించలేము. సభ్యప్రపంచములోని రాజ్యసభావైభవానికి, ఈతిరుగుబోతుల రాజ్యసభావైభవం ఏమాత్రమూ తీసిపోదు. సభాసదుల వెనుక సేవక బృందం వొకటి, ఏ క్షణాన ఏమవసరం వస్తుందోనని, చేతులు కట్టుకు నిలబడి ఉంటుంది. వొకనాటి సాయంకాలం నేనీ సభాస్థలానికి వెళ్ళాను. సాయం సమయాల్లో ఈ సభాస్థలం వినోదాలకు ఆటపట్టుగా వుంటుంది. అక్కడో పెద్ద పానగోష్ఠి జరుగుతోంది. గుర్రప్పాల సారాకు బదులు, ఎర్రని నిఖార్సయిన ద్రాక్షసారాను బహు మూల్యములైన చషకాల్లో త్రాగుతున్నారు సభ్యులు. ఎదురుగా ఉడకబెట్టిన గుర్రపు మాంసమ్ముక్కలు ఇంత ఎత్తున పేర్చి ఉన్నాయి. సేవకులు కలశాలతో సారాను పోస్తున్నారు. వొకవైపున గాయకులు పాటలు పాడుతూ, వాయిద్యాలను వాయిస్తూ పానగోష్ఠికి ప్రాణం పోస్తున్నారు.

అయితే, సభ్య దేశాల్లోని రాజ్య సభలకూ, ఈ రాజ్య సభకూ వొక వ్యత్యాసం మాత్రం ఉంది. ఇక్కడి వినోదంలో లైంగిక భావన ఏ మాత్రం లేదు. యబగూ భార్యలూ, ఇతర సభాసదుల భార్యలూ పానగోష్ఠిలో ఉన్నారు. అయినా, కాముకత గోచరించదు. ప్రతివాళ్ళ ముఖంలోనుండి వీరరసం చిందుతోంది. అక్కడున్నవాళ్ళ హోదాల్లోనూ, అంతస్థుల్లోనూ తరతమ భేదాలున్నాయి. అయితే, సాధారణ దృష్టికి అందరూ వొకలా కనుపిస్తారు.

*　　　*　　　*

ఆ చలికాలం గడిచింది. ఇలాంటి విపరీతమైన చలిని వెనక ఎన్నడూ చూళ్ళేదు. హిమాలయ కనుమల్లో చలికాలంలో ఇంత కంటె కూడా ఎక్కువ చలి పెడుతుందని నేను వొప్పుకుంటాను. అయితే

మేము వేసవి కాలంలో ఆ కనుమల్ని దాటాము. పైగా కొద్ది గంటల సేపు మాత్రమే, మే మా కనుమల్లో తిరిగాము. కనుక ఇంతటి చలిని మేము అక్కడా అనుభవించలేదు. ఇప్పుడు మే మున్నది పర్వతాగ్ర ప్రదేశంకాదు. పర్వతాల క్రింది సమతల మైదానం, మైదాన ప్రదేశాల్లో ఇంతటి చలిని ఊహించడం కూడా అసంభవమే. యబగూ మా సౌక ర్యాలకు సంబంధించిన సర్వ జాగ్రత్తలనూ స్వయంగా తీసుకునేవాడు. అతడికి నేను బౌద్ధ ధర్మాన్ని గురించి చెప్పాను. నా ఉపదేశాల ప్రభావం వల్ల అతడు ఉపాసకు డయ్యాడు. అతడి హృదయంలో భక్తి బీజాల్ని నాటి, బుద్ధ - ధర్మ సంఘాలకు శరణు తొచ్చేట్టు చేశాను. పై వాక్యాల్ని నేను గర్వంతో కాదు వ్రాయడం, యథార్థాన్ని వ్రాస్తు న్నాను. అంతే! యబగూ గొప్ప వీరుడు. కొద్ది సంవత్సరాల క్రితం తన పినతండ్రి అయిన తూమిన్ ఖాన్‌కూ, ఆవారులకూ జరిగిన యుద్ధంలో యబగూ పినతండ్రి తరపున యుద్ధంచేసి గొప్ప విజయాన్ని సాధించాడు. నన్నడిగితే, అతడు జన్మతః సేనా నాయకు డంటాను. అతడిలో తీవ్ర యుద్ధ పిపాసతోపాటు కొన్ని ఉత్తమ ప్రవృత్తుల్ని, సాధు ప్రవృత్తుల్ని చూశాను. తిరుగుబోతు యోధుడిలో సాధు ప్రవృత్తు లుండడం గొప్ప ఆశ్చర్యాల్లో ఒకటి. అతడు గొప్ప ఉదార స్వభావుడు. జ్ఞాన పిపాసువు. వీరునిలో ఈ గుణాలు వుండవనిగానీ, వుండగూడదని కానీ నేననడం లేదు. కానీ నిరంతరం రక్తపుటేరుల్లో మునిగి తేల్తూ ఉండే తిరుగుబోతు వీరునిలో పై చెప్పిన ఉత్తమ గుణా లుండడం ఆశ్చర్యకరమైన విషయం కాదా? ఆవారుల్లో చాలా రోజులుగా బౌద్ధ మతం ప్రచారంలో వుంది. ఆవార సర్దారులేకాక కొందరు ఖానులు కూడా బౌద్ధ మతానుయాయు లయ్యారు. వాళ్ళ పూర్వీకులైన హూణుల్లోను బౌద్ధ మతం ప్రచారంలో ఉంది. కానీ. తోర్కులింత వరకూ పరమతాను యాయులు కాలేదు. అయితే అప్పుడప్పుడూ యబగూ ఇలా అంటూండే వాడు: "మా పూర్వీకుడైన చీనా దేశపు చక్రవర్తి "తోబా"కూడా బౌద్ధ మతానుయాయే. మనం ఎప్పుడైనా చీనాదేశం వెళ్ళేట్టయితే, అతడు నిర్మించిన గుహా—విహారాలను చూపుతాను. అవి ఇప్పటికీ చెక్కు చెదర కుండా ఉన్నాయి" అన్నాడు.

యబగూ అనేక విషయాల్ని గురించి నన్ను ప్రశ్నిస్తుండేవాడు. అతడి ప్రశ్నలకి సమాధానాల నీయడం, అతడి జిజ్ఞాసకు పరితృప్తిని కలిగించడం నాకేమంత కష్టంకాదు. కానీ, భాషా సంబంధమైన చిక్కు నన్ను ఇరకాటంలో పడేసేది. ఇన్నాళ్ళలోనూ త్యోర్కు భాషను కొద్దిగా అభ్యసించాను. అయితే, నిగూఢమైన బౌద్ధ ధర్మ తాత్వికజ్ఞానాన్ని బోధించడానికి అత్యల్పమైన నా త్యోర్కు భాషాజ్ఞానం చాలదు. పోనీ, అంతకు క్రితమే త్యోర్కు భాషలోకి బౌద్ధగ్రంథాలు అనువాదమైయున్న ట్లయితే ఆ అనువాదాన్ని ప్రామాణికంగా పెట్టుకుని శాంతిలుడి సాయంతో ఓ శబ్దకోశాన్ని తయారుచేసుకునేవాణ్ణి. అదీ జరగలేదు। అయినా శాంతిలుడి సాయంతో, అభిధర్మకోశపు శబ్దాలకు త్యోర్కు భాషలోని సమానార్థక శబ్దాలను వెతుక్కుంటూ, ఒక్కో శబ్దానికి నూతన శబ్దాన్నే నిర్మించుకుంటూ ఓ చిన్ని శబ్దకోశాన్ని తయారుచేసుకున్నాను. కొన్ని త్యోర్కు భాషా శబ్దాలనూ, కొన్ని సంస్కృత శబ్దాలనూ వాడి ఎలాగో బౌద్ధ దర్శనాన్ని బోధిస్తూండేవాణ్ణి యబగూకు। ప్రతిరోజూ రెండు మూడు గంటలసేపు మా గోష్ఠి జరుగుతూండేది. యబగూ ప్రతిభాశాలి। కొద్ది రోజుల్లోనే బౌద్ధ దర్శనాన్ని అర్థంచేసుకుని, రసాన్ని ఆస్వాదన చేయసాగాడు. యబగూ భార్యకూడా గోష్ఠిలో పాల్గొంటూండేది. ఆమె లోనూ బౌద్ధమతంమీద అభిమానం, శ్రద్ధ జాగృతమైనాయి. బుద్ధ చరిత్రాన్ని శ్రద్ధగా వినేది. బుద్ధుని జన్మభూమిని గురించీ, నాయాత్రల్ని గురించీ అనేక విషయాలు అడుగుతూండేది.

చీనాదేశం వెళ్ళి, పాళీ, సంస్కృత భాషల్లోని బౌద్ధ మత గ్రంథాలను ఆ దేశ భాషలోకి అనువాదం చేయడం మా ఆదర్శం. ఈ పుణ్యకార్యాన్ని చేయడానికి మేమే ప్రథములం కాము. శతాబ్దాల క్రితం నుండి అనేకమంది మహానుభావులు ఈ పుణ్యకార్యంకోసం తమ జీవితాల్ని వెచ్చించారు. ఇప్పటికీ ఎంతోమంది ఈ మహత్కార్యాన్ని నిర్వహిస్తున్నారు. నా ఆదర్శమే గ్రంథానువాదమైనప్పుడు, ఉత్తమమైన గ్రంథాల్ని కొన్నింటిని నా వెంట తీసుకుని వెళ్ళడం సహజం. తాళపత్ర గ్రంథా లెన్నింటినో ఉద్యానంనుండే వెంట తెచ్చుకుంటున్నారు. బుద్ధిలుడు స్వయంగా తన చేత్తో వ్రాసిన "ప్రమాణ

సముచ్చయం" ప్రతి ఒకటి నా మూటలో వుండనే వుంది. ఆ ప్రతే నా జీవిత సర్వస్వం. వసుబంధు యొక్క "అభిధర్మకోశం" కొన్ని సూత్రాలూ నాకు నోటికే వచ్చును. నలాంటి యాత్రార్థి అయిన జీవిపట్ల "కంఠస్థమైన విద్యే నీది. మిగిలింది నీది కాదు" అన్న లోకోక్తి నూటికి నూరు పాళ్ళూ తగ్గిపోతుంది. కనుకనే ఉత్తమమైన గ్రంథాలను కంఠస్థం చేయడంలో ఎన్నో సంవత్సరాలు ఖర్చుపెట్టాను. యబగూ జ్ఞాన పిపాసను తీర్చడానికి కావల్సిన సామగ్రిని ప్రోగుచేసుకున్నాను. కానీ, అతడి రాణికి ఈ గంభీరమైన విషయాల్ని ఎలా బోధించడం?

మేము తెచ్చుకున్న ఉత్తమమైన గ్రంథాల్లో ఎన్నో పోయాయి. ఈ అనంతమైనయాత్రల్లో, సంఘర్షణల్లో, దోపిడీల్లో- గ్రంథాలూ తమ వంతుకర్తవ్యాన్ని నిర్వహించాయి. పెట్టెల్లో,మూటల్లో తెచ్చుకున్న పుస్తకాలన్నీ 'గతం గతః' అయ్యాయి. నా వీపునగల జోలిలోని పుస్తకాలు మాత్రమే దక్కాయి. శాంతిలుదు బేగ్ కొడుకు కాకుండా వున్నట్లయితే, అతడూ కొన్ని పుస్తకాల్ని వీపున కట్టుకునేవాడు. మరి కొన్ని పుస్తకాలు కూడా దక్కేవి.

యబగూ, అతడి భార్యా తరచు నన్ను నా యాత్రానుభవాల్ని గురించి అడుగుతూండేవారు. వారలా అడిగినప్పుడు నా మాతృభూమి, జ్ఞాపకాల మడతలో తళుక్కున మెరిసేది. విపరీతమైన వేగంతోనన్ను తనవైపు లాక్కునేది. అయితే, అజస్ర యాత్రికుణ్ణయిన నన్నిఆకర్షణ లేమి, చేయగలవ్? నేను పుట్టి,పెరిగి, ఆడుకున్న ఉద్యాన దేశాన్ని విడిచాను. ప్రాణమిత్రుణ్ణీ, పూజ్యులైన గురువులమా గోల్పోయిన సింహళాన్ని విడిచాను. ఇప్పుడీ మంచుతో కప్పబడివున్న మైదానప్రదేశంలో తిరుగుతున్నాను. మాతృభూమికి ఇంత దూరంలో వున్నప్పటికి నేనొకరకంగా అదృష్టవంతుణ్ణనే అనుకుంటున్నాను. ఈ పరదేశంలోనూ, యబగూ, అతడి సర్దారుల్లాంటి పరిచయులు దొరికారు. జీవితపు బాధలుగానీ, అవసరాలుగానీ నన్నేవిధంగానూ వేధించడం లేదు. అనుచరులున్నారు. ఏ క్షణాన ఏది కోరితే అది తెచ్చిపెడతారు. అయినా నాకు తృప్తిలేదు. నా ఆదర్శం, లక్ష్యం చీనాదేశం వెళ్ళడం. నా ఆదర్శం చెదరిపోయింది.ఆదర్శభ్రష్టుడైన వ్యక్తికి సుఖం ఎక్కణ్ణుండి వస్తుంది?

బాహ్య సుఖాలు అతణ్ని సంతోషపెట్టగలవా? ఒక్కొక్కప్పుడు "ఇక నా జీవితం ఇలా తిరుగుబోతుల్లోనే గడిచిపోతుందేమో?" అనుకునేవాణ్ణి. అయితే అందుకు విచారించేవాణ్ణి కాదు. ఈ విధంగా వో నూతన కార్య క్షేత్రంలో ప్రవేశిస్తున్నా ననిపించేది. మొదటగా "అభిధర్మకోశం"లోని అనేకశబ్దాలకు, త్యోర్కు (టర్కి)భాషలో పర్యాయపదాలను నిర్మించిన క్షణాన వో నూతనపథాన్ని ఏర్పరుస్తున్నానని తెల్సుకున్నాను. ఈనూతన పథ నిర్మాణాన్ని గురించి అప్పుడప్పుడూ శాంతిలుడితో మాట్లాడుతూండే వాణ్ణి. అతడిలా అనేవాడు : "ఈ దేశంలో ఇలాంటి ప్రమాదాలు ఎప్పుడూ వస్తూనే వుంటాయి. ఇప్పు డిక్కడికి వచ్చాము. ఇంకో క్షణానికి ఎలాంటి స్థితి ఏర్పడుతుందో, ఎక్కడికి కొట్టుకుపోతామో ఎవడికి తెల్సు?"

ప్రస్తుతపు మా స్థితి అనిశ్చితమైందని తెలిసికూడా, త్యోర్కు భాషలోకి బుద్ధుడి వచనాలనూ, సూత్రాలనూ అనువాదంచేయ ప్రారంభించాము. ఈ దేశంలో తాళపత్రాలు దొరకవు. భూర్జ పత్రాలు కావలసినన్ని! త్యోర్కు భాషకు అప్పటివరకూ లిపిలేదు. అసలు త్యోర్కులకు అంతవరకూ వ్రాత అవసరం అంతగా కనుపించలేదు. కాని, ఇప్పుడు ఆవారుల సువిశాల సామ్రాజ్యానికి (కొరియానుండి కాస్పియన్‌సముద్రం వరకు) త్యోర్కులు అధిపతులయ్యారు. ఇప్పుడు వారికి లిపి అవసరం తెల్సింది। నేను త్యోర్కుశబ్దాలను భారతీయలిపిలో వ్రాయడాన్ని యబగూ చూశాడు. త్యోర్కుభాషక్కూడా వొకలిపిని ఏర్పాటు చెయ్యా లనుకున్నాడు. అయితే, త్యోర్కు శబ్దాలను లిపిబద్ధం చేయడం చాలాకష్టం. త్యోర్కులు వొకేశబ్దాన్ని అనేక రూపాల్లో పలకుతూ వుంటారు. రాజును-కగాన్, ఖకాన్ ఒఆన్-ఖాన్ ఇన్ని రూపాల్లోనూ పిలుస్తారు. అదే విధంగా మంత్రిని- యబగూ, జబకూ, జబగూ, జబఖూ- ఇన్నివిధాలా పిలుస్తారు. కనుక ఇన్ని శబ్దాలకూ వొకే రూపాన్ని స్థిరం చేయడం కొంత కష్ట సాధ్యమైన విషయం। అంటే వివిధరకాల ఉచ్చారణలకూ, అవకాశాన్నిచ్చే అక్షరాలను తయారుచేసుకోవాలి. వొకే అక్షరం. కాని ఉచ్చారణలు అనేకం. (ఉదాహరణంగా సంస్కృతంలోని 'ష' అక్షరాన్ని చెప్పవచ్చు।) దీన్నే కొందరు 'ఖ' అంటారు, కొందరు 'శ' 'ప' అని

కూడా అంటారు. ఇందువల్ల స్పష్టమైన లాభం వొకటుంది. చాలాతక్కువ అక్షరాలతో లిపి సిద్ధమౌతుంది; 16, 17 అక్షరాల్లో మొత్తం తోఖర్ భాషనే ఇమడ్చవచ్చును. *

పై ఉద్దేశ్యం ప్రకారం కొన్ని అక్షరాల్ని కల్పించి యబగూకు నేర్పాను. తోఖర్ భాషలో మరో పెద్దచిక్కు కూడా వుంది. ఉన్నతవర్గాలకు చెందిన తోఖర్ కుటుంబాల్లోని భాషలోనూ, శబ్దాల ఉచ్చారణ పలు రకాలుగా వుంటుంది. కనీసం ఉన్నతవర్గాల్లోనైనా వొకేరకమైనభాష వాడుకలో వుంటే వర్ణమాలను సంపూర్ణంగా తయారుచేయడానికి వీలయ్యేదేమో. యబగూ సంస్కృతాన్ని అభ్యసించాలన్న తన కోర్కెను వెల్లడించాడు. నేను చిన్న అభ్యంతరాన్ని చెప్పాను. "మొదట జ్ఞానోపార్జనకు ప్రయత్నించండి; తరువాత సంస్కృతం నేర్చుకోవచ్చు. ముందే సంస్కృతము కోసం ప్రయత్నిస్తే, విషయం జటిలమైంది కావడం వల్ల, నిరుత్సాహ పడతారేమోనని భయం!" అన్నాను.

రోజులు గడిచిన కొద్దీ చలి ముదురుతోంది. ఆకాశం నుండి మేఘశకలాల్లాంటి మంచుపొరలు నిరంతరం భూమ్మీదకురాలుతున్నాయి. మంచుకురవడం నాకు తెల్సు. కానీ రెండు మూడు గజాల వెడల్పున నాలుగు అంగుళాల మందంలో మంచు పొరలు ఆకాశం నుండి పడడాన్ని నే నింతవరకూ చూడలేదు. ఆమంచుపొరల్తో ఆకాశమంతా కర్పూరంలా తెల్లనయ్యేది. ఆ పొరలు మా డేరాల మీద పడడం, అనుచరులు వాటిని క్రింద పడేయడం సర్వసాధారణమైన విషయం. ఇలా మంచు మహోధృతంగా కురిసేపుడు మేము డేరాల్లో మంటలు వేసుకుని చలికాగుతూ ఆపాదమస్తకం మృదువైన మృగ చర్మాన్ని కప్పుకుని, ఏదో ఒక

---

* ద్రవిడభాషల్లోకి ప్రధానమైనదయిన తమిళభాషకూ 16 అక్షరాలే. తమిళంలో ఐదుబళ్ళకూ, ప్రథమ చివరి అక్షరాలు మాత్రమే వుంటాయి. క, ఙ, చ, ఞ, ట, ణ, త, న, ప, మ, వొక్క 'క' అక్షరమే, ఖ, గ, ఘ, హ మొదలైన అక్షరాలకు ఉపయోగింపబడుతుంది. ఇదే విధంగా మిగిలిన నాలుగు బళ్ళలోని మొదటి అక్షరాలూ, తమిళిడిలోని ఇతరఅక్షరాలకు బదులుగా ఉపయోగింపబడతాయి. అను॥

విషయాన్ని గురించి మాట్లాడుకుంటూ వుండేవారం. కాలగతి ఎవరి కోసరమూ ఆగదు. ఓ మహా ప్రవాహంలా నిరంతరం ముందుకు వెళ్ళి పోతూనే వుంటుంది. చలికాలం నడిమికి వచ్చేసరికి పగలు మరీ కురచ అయింది. కేవలం ఒక్కజాము ముండేది పగలు. మిగిలిన సమయమంతా, సుదీర్ఘమైన రాత్రి. ఎనిమిది జాముల్లోనూ ఏడు జాములు రాత్రి అయి, ఒకే జాము పగలయినప్పుడు అంత పెద్దరాత్రిని ఎలా గడపడ మనేదీ సమస్యే! బుద్ధ ధర్మానికి సంబంధించిన మాటల్ని చెప్పుకుంటూ చాలా రాత్రి వరకూ మేలుకుని వుండేవారం. ప్రకృతంతా తెలుపే. తెల్లని మంచుని చూసి, చూసి విసిగి పోయాము. వసంత ఋతువు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూండే వాళ్ళం. ఐదునెల్ల నిరీక్షణతరువాత, చలికాలం గడిచి, వసంతకాలం వచ్చింది

వసంత ఋతువును ఎక్కడ గడపడం అనే విషయంలో ముందే ఒక నిర్ణయానికి వచ్చాం. నేను పసిరికను గురించీ, దట్టమైన అడవుల్ని గురించీ చెప్తూండేవాణ్ణి. అలాంటి ప్రదేశాల కోసం ముఖం వాచినట్టయ్యే వాణ్ణి. యబగూ తను చూసిన అడవుల్ని స్ఫురణకు తెచ్చుకుంటూ "ఇక్కణ్ణుండి ఇంకా ఉత్తరానికపోతే, భూర్జవనాలూ, దేవదారు వనాలూ తగుల్తాయి. అంతటి దట్టమైన అడవుల్ని మీ రసలు చూసి వుండరేమో ఇంతవరకూ!" అనేవాడు. తను చూసినవే మహారణ్యాలని యబగూ అనుకునేవాడు. నేనూ, నేను చూసినవే మహారణ్యా లనుకునేవాణ్ణి. యబగూ తను చూసిన మనోహర దృశ్యాల్ని, నిరాడంబరమైన, సరళమైన శబ్దాల్లో వర్ణించి చెప్తూండేవాడు. ఆ దృశ్యాల్ని చూడాలన్న తీవ్ర ఆకాంక్ష నాలో జాగృత మయ్యేది. ఆ సంవత్సరపు వసంతంలో యబగూ కఅన్ వద్దకు (పశ్చిమానికి) వెళ్ళాలనుకున్నాడు.నేను అక్కడ లేకపోతే నిజంగా వెళ్ళేవాడే! కానీ, నాకోసమని ఆ వసంతంలో తన యాత్రను ఉత్తర దిశకు మార్చాడు. ఉత్తర దిశన, తన శాసనంలో వున్న భూమి ఎంత వరకో యబగూకే తెలియదు. అక్కడి ఘోరారణ్యాల్లో అంత్యోర్కు జాతులుకూడా చాలా వున్నాయి. వాళ్ళు అక్కడి త్యోర్కు శాసనాలకు ఎదురుతిరిగి విప్లవాన్ని లేవదీశారు. "ఇందులో వన్యజాతి ప్రజల తప్పు అంతగా లేదు. మా శాసకులదే తప్పు. వీళ్ల

కేవలం దండనతో ఆ ప్రజల్ని అదుపులో వుంచుకోవాలని చూస్తారు." అన్నాడు యబగూ.

సుదీర్ఘమైన నిరీక్షణ తరువాత వసంత ఋతువు వచ్చింది. యబగూ, వేల సంఖ్యలో వున్న అతడి అనుచరులూ ప్రస్థానాన్ని సాగించారు. మొదట ఈశాన్యంగా కొంతదూరం వెళ్ళారు. తరువాత తూర్పుకు తిరిగారు. తిరుగుబోతుల రాజు యాత్రకూడా ఇతరరాజుల యాత్రలాగానే ఆడంబరంగా, అన్ని సౌకర్యాలతోటీ సాగుతుంది. మేము ప్రతిరోజూ నాలుగు యోజనాల దూరం ప్రయాణం చేసే వాళ్ళం. సామాన్లనూ, డేరాలనూ నౌకర్లు ముందుగానే చేరుస్తుండేవారు.

తిరుగుబోతులు ప్రత్యక్షవాదులు (ఎదురుగా చూసిందాన్నిమాత్రమే నమ్మేవారు). చంద్రుడి వృద్ధిక్షయాలను వారు చూస్తూంటారు. కనుక చంద్రమాసం వారికి తెలుసు. కానీ, ఋతు పరివర్తన చంద్రుడి వలన కాదు. సూర్యుడి వలన జరుగుతుంది. సూర్య వర్షానికి, చంద్ర వర్షానికి పదిరోజుల వ్యత్యాసం వుంది. అంటే చంద్ర మాసాల్ని లెక్కవేసు కుంటే సంవత్సరం గడిచాక పది రోజులకుగానీ ఋతు పరివర్తన జర గదు. సూర్య వర్షాన్ని గురించి యబగూకు చెప్పాను. అతడు సూర్య వర్షపు సిద్ధాంతాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. అయితే, జ్యోతిషాన్ని (నక్షత్రాలకు సంబంధించింది) గురించిగానీ, గణితాన్ని గురించిగానీ అర్థం చేసుకోవడానికి పూర్వానుభవం చాలా వుండాలి. ఎన్నో సంవత్సరాలు అధ్యయనం చేస్తేగానిఅర్థంకాని జటిలవిషయాలవి. కనుకనే ఈ విషయాల్ని నేనంతగా అతడికి బోధించలేదు. పై రెండు విషయాలూ బహుగహనమైనవని, తా నింతవరకూ తెల్సుకున్న దాని కంటే, తెల్సుకోవల్సిందే సముద్రంలా గుందనీ, అతడికీ తెలుసునను కుంటాను.

మే మిప్పుడు ఎడారిని వదలి మామూలు భూమిలో ప్రయాణం చేస్తున్నాము. చెట్లూ, చేమ అక్కడక్కడా కనిపిస్తున్నాయి. చిన్న చిన్న నదు లెన్నింటినో దాటాము. చివరకు పశ్చిమానికి ప్రవహిస్తున్న ఓ మహానదిని సమీపించాము. ఆ నదీజలం గాఢ నీలపురంగులోఉంది. అలాంటి స్వచ్ఛమైన,గంభీరమైన మహానదిని చూసి ఎన్నియుగాలో గడిచా

యనిపించింది. తిరుగుబోతులు స్నానం చేయరు. స్నానం చేయడాన్ని నిత్యకర్మగా కాక, ఓ సరదా అయిన క్రియగా భావిస్తుంటారు. చలి కాలంలో, శరీరాలకు చమట పట్టదు. స్నానం చేయవల్సిన అవుసరం వుండదు. కానీ, మిగిలిన కాలాల్లో శరీరాలకు చెమట పట్టేంత ఎండలు తప్పకుండా కాస్తాయి. అప్పుడూ వాళ్లు స్నానం చేయరు. దగ్గరకు వెడితే, వాళ్ళ శరీరాలనుండి దుర్వాసన గుప్పున కొడుతుంది. వాళ్ళను అనుకరించి, మేమూ స్నానం చేయడం మానుకున్నాము. కాళ్ళూ చేతులూ మాత్రం కడుక్కునే వాళ్ళం:

ఎదురుగా మహానది కనిపించింది. మధ్యాహ్న సమయం. ఎండ మాడ్చేస్తోంది. తల పైకి ఎత్తితే నుదురు చుర్రుమని కాల్తోంది. కానీ, అదే సమయాన తల వెనక భాగం చలికి కొంగర ఎత్తుతోంది. ఒకే సమయంలో ఇంత ఎండ, ఇంత చలి ఈ తిరుగుబోతుల భూమిలో మాత్రమే సంభవం అనుకున్నాను.

నేనూ, యబగూ చాలా ఉత్సాహంగా మహానదిలో దిగి స్నానం చేశాము. స్నానం పట్ల యబగూ కూడా నా అంత ఉత్సాహాన్ని ప్రదర్శించాడు. అతడేకాదు, అతడి అనుచరులూ, మిగిలిన స్త్రీ – బాల – వృద్ధు లందరూ నదిలో మునకలు వేశారు. అందరూ దుస్తుల్ని వదలి, పూర్తి నగ్నశరీరులై, తనివితీరా స్నానంచేశారు. వాళ్ళ శరీరపురంగు నారింజ రంగులో, అందంగా ఆకర్షణీయంగా వుంది. శరీరాంగాలుకూడా కుదిరిక గానే వున్నాయి, ముఖాలు మాత్రం చాలా వెదల్పు. ముక్కులు చట్టి ముక్కులు! వాళ్ళ ఆకారాల్నిగురించీ, ముఖాల్ని గురించీ, పరిహాసంగా శాంతిలుడికి, "నాకు బ్రాహ్మణ మతం మీద నమ్మకంలేదు. వుంటేవీళ్ళ ఆకారాలకు సంబంధించిన ఈ కథను అక్షరాలా నమ్మేవాడిని" అంటూ ఈ క్రింది కథను చెప్పాను. "బ్రహ్మదేవుడు అన్ని దేశాల మానవుల్ని సృష్టించాక, చివరకుతనకళనంతాఉపయోగించి మహాసౌందర్యవంతులైన స్త్రీ పురుషుల్ని ఇద్దర్ని సృష్టించాడు. వాళ్ళిద్దర్ని ఒక చోటికి చేర్చాడు. వాళ్ళిద్దరూ ఒకరి సౌందర్యానికి ఒకరు ముగ్ధులై, తన సృష్టిని వేనోళ్ళ పొగుడుతారని బ్రహ్మదేవుడి ఉద్దేశం. కానీ, వాళ్ళలాచేయలేదు. అతడి సృష్టిని హేళన చేశారు, నిందించారు. దీంతో ముసలి బ్రహ్మకు కోపం

వచ్చింది. చేతిలోని టాపీతో వాళ్ళ ముఖాలమీద విసరి కొట్టాడు. ఆ దెబ్బతో ముక్కూ, బుగ్గలూ అదుచుకుపోయాయి; ముఖం వెడల్పయింది. ఈ విధంగా ఆ యిద్దరికీ శరీర సౌష్ఠవమంతా బాగుంది ముఖం మాత్రం దానికి ప్రతికూలంగా తయారయింది. ఇప్పటికీ తోర్యక్కా తిరుగుబోతులు ఆ అనాది స్త్రీ పురుషుల సంతానమే!"

నేనూ, సింహళంలో సర్వకాల సర్వావస్థల్లోనూ నగ్నంగా వుండే మానవ సమూహాలను చూశాను. కనుకనే స్నానం చేసేప్పుడు తిరుగుబోతులు నగ్నంగా వుండడాన్ని చూసి నేనేమీ ఆశ్చర్యపడలేదు. అందరూ నగ్నంగానే స్నానం చేసేప్పుడు, అదే ఆచారంగా పరిణమించినప్పుడు, ఇక ఆశ్చర్యానికి తావెక్కడిది? భారత దేశంలోనూ కొందరు నగ్నంగా స్నానంచేసేవా రున్నారు. ముఖ్యం, స్త్రీలు బట్టల్ని విడిచి నీటిలో దూకేస్తారు

మహానదిని దాటాము. దీని ఉపనదిని అనుసరించి కొంతదూరం వెళ్ళి వొకపర్వతాన్ని (ఖంగయీ) చేరాము. ఈ పర్వతం మీద, దేవదారుల్లాంటి పెద్ద పెద్ద వృక్షాలు లేకపోయినా, సాధారణమైన వృక్షాలున్నాయి. పచ్చని పసిరికతో కళకళ్ళాడుతోంది. వృక్షాల్లేని దేశాల్లో నివసించే తిరుగుబోతులే, ఈ వేసవిలో చల్లని వృక్షచ్ఛాయల్ని చూసి మహదానందాన్ని పొందుతున్నారు. ఇక నా ఆనందాన్ని ఏ మాటల్తో చెప్పడం! మా పశువుల్లో ఒంటెల సంఖ్య క్రమంగా తగ్గిపోతోంది. వాటి స్థానాన్ని చమరీమృగాలు ఆక్రమిస్తున్నాయి. ఈ చమరీలు మధ్యదేశపు బర్రెలంత వుంటాయి. అలాగే నల్లగా, చాలా బలంగా వుంటాయి. వీటిపాలు చాలా బలవర్ధకమైనవి. మాంసం బహు రుచిగా వుంటుంది. అడవి చమరీలూ వుంటాయి. అవి మచ్చికఅయిన చమరీలకంటె పెద్దవి, ఏనుగంత వుంటాయి. వీటి కొమ్ములు తీక్షణంగా వుంటాయి. ఆ కొమ్ములు తగిలిన మానవుడు ఇక మంచినీ ళ్ళడగడు. యబగూకు వేట అంటే మహా ఇష్టం. ఈ అడవి చమరీలను వేటాడాలని అతడి ఉద్దేశం. కానీ, వీటిని వేటాడడం మహా ప్రమాదకరమైన విషయం. మామూలు బాణాలు రెండు మూడు తగిలినా వీటికి ఓ లెక్కగా వుండదు. అయితే, తిరుగుబోతుల విలువిద్యా నైపుణ్యం

మాత్రం తక్కువైందా? గుర్రం మీదా విపరీతమైన వేగంతో స్వారీ చేస్తూనే, లక్ష్యం తప్పకుండా బాణం వేయడం వాళ్ళకు చిటికలు వేసినంత మాత్రం! ఇక అలాంటప్పుడు పొంచునివుండి, చమరీమృగపు గుండెలకు గురిచూసి బాణం విడవడం వాళ్ళకేం కష్టం? పైగా, ఒకేసారి అనేక బాణాల్ని కూడా వేస్తారు వీళ్లు. ఏనుగంత బలంగల ఈ మహా జంతువు, తనలో యాభయ్యోవంతు బలం కూడా లేని మానవుడి చేతుల్లో చచ్చిపోవడం ఆశ్చర్యాల్లోకల్లా ఆశ్చర్యం. అడవులు ఎక్కువగా వున్నచోట జంతువులు ఎక్కువగా వుంటాయి. శీతోష్ణస్థితినిబట్టి అడవుల్లోని జంతువుల్లోనూ వ్యత్యాసం వుంటుంది. యబగూ రకరకాలైన జంతువుల్ని వేటాడి పట్టుకు వస్తుండేవాడు. జంతువులు అధికంగా వున్న అరణ్యాన్ని చూశాడంటే, కనీసం పదిరోజులైనా మకాం వేయకుండా, రకరకాల జంతువుల్ని వేటాడకుండా అక్కణ్నుండి కదలడు. యబగూ ఇలా అరణ్యాల్లో వేటకోసం మకాంవేయడం అతడి అనుచరులకూ ఇష్టమే. ఈ అరణ్యవాసం వల్ల పశువులకు సమృద్ధిగా మేత దొరుకుతుంది, మనుషులకు తాజా మాంసం లభిస్తుంది. ఒంటరిగానూ వేటాడుతూంటారు. సామూహికంగానూ వేటాడుతూంటారు. ఒంటరి వేటకంటే సామూహికమైన వేటే అధిక సఫలతను సాధిస్తుంది. కొన్నివేల మంది మనుషులు ఆయుధపాణులై కొన్నిమైళ్ళ విస్తీర్ణంగల వలయాకారంలో నిలబడి జంతువుల్ని కేంద్ర ప్రదేశానికి తరుముతారు. అల్లరి చేస్తూ, కేకలు వేస్తూ తమ వలయాన్ని కుంచించుకుంటూ ముందుకు పోతూంటారు. అరుపులూ, కేకలూ విని జంతువులు భయపడి కేంద్ర ప్రదేశానికి పరుగెత్తుతాయి. చివరకు జంతువులచుట్టూ సాయుధులైన మానవులు పెట్టని గోడలా నిలబడి వుంటారు. సామర్థ్యం కలజంతువులు ఈ మానవశరీరాల గోడను పడనెట్టుకుని అవతలికి వెళ్ళిపోతాయి. మిగిలిన జంతువులు వివశంగా ప్రాణాల నర్పిస్తాయి. అయితే, ఇలామానవ సమూహాన్నిచీల్చుకుని వెళ్ళగల సాహసమూ, బలమూ ఒక్క చమరీకి మాత్రమే వున్నాయి. సామూహిక వేట జరిగిన రోజున డేరాలముందు జంతుకళేబరాలు గుట్టలుపడివుంటాయి. ఇక నా రోజు అందరూ ఉత్సవం చేసుకుంటారు. గుర్రప్పాల సారా చమరీ కొమ్ముల్లో పోసుకుని తెగ

త్రాగుతారు. కాల్చిన మాంసాన్ని ఇష్టంగా తింటారు. అరణ్యాల్లో వంటచెరుక్కేం కొదువ?

ఇక నిప్పుడు మార్గంలో పర్వతాలు అధికంగా తగుల్తున్నాయి. ఒక్కొక్క పర్వతాన్నీ దాటుతూ ముందుకు పోతున్నాము. కొన్నాళ్ళకి మరొక మహానదిని (సేలింగా) చేరాము. ఇక్కడి ప్రకృతి దృశ్యాలు హిమాలయాల్లోని మనోహర దృశ్యాల్ని మరిపిస్తున్నాయి! పర్వతాలు అంతగాలేవు. ఉన్నా, చిన్న చిన్న గుట్టలు! మాకు దిడిపైపుగా ఒక హిమాచ్ఛాదిత శిఖరం కనుపించింది. హిమశిఖరాన్ని చూసేసరికి నా మాతృదేశపు హిమాలయాలు స్ఫురణ కొచ్చాయి. హిమాలయ శిఖరాల మీద దేవతలు నివసిస్తుంటారని ప్రతీతి! ఇక్కడా ఈ శిఖరంమీద (ఓగదాఉలా, ఉల్‌సుతఈ) దేవతలు నివసిస్తుంటారని ఇక్కడి ప్రజల విశ్వాసం! ఈ శిఖరం వద్ద దేవతలకు ప్రీతిగా శ్వేతాశ్వాన్ని బలి ఇస్తూ వుంటారు. యబగూ త్రిశరణాన్ని పొంది బౌద్ధఉపాసకుడయ్యాడు గానీ. లేకపోతే అతడూ తెల్లగుర్రాన్ని బలి ఇచ్చేవాడే! ఇతర సర్దారులూ, సామంతులూ, బేగ్‌లూ తెల్ల గుర్రాల్ని హిమశిఖరానికి బలి ఇచ్చారు. తోర్యుక్కులూ, వారి వంశజులైన ఇతర తిరుగుబోతులూ చిన్ని చిన్ని పొట్టి గుర్రాల్నే ఎక్కువగా ఉపయోగిస్తూంటారు. తిరుగుబోతుల భూమిలో ఇలాంటి చిన్నిగుర్రాలు చాలా ఉపయోగకరం! వీటికి ఎక్కువ నీరూ, ఎక్కువ మేతా అవసరం వుండదు. ఎడార్లల్లో పసిరిక బీళ్ళల్లో, సమతల ప్రదేశాల్లో – ఎక్కడయినా – ఒకేరకంగా అలసట లేకండా ప్రయాణం చేస్తుంటా యీ గుర్రాలు. ఖాన్లూ, యబగులూ, బేగ్‌లూ – భారీ గుర్రాలను కూడా పసందు చేస్తుంటారు. అయితే, ఆ గుర్రాలు అలంకారానికి మాత్రమేనవి ఇక్కడివారి భావన! పెద్ద పెద్ద గుర్రాలు. కాంబోజ, బాహ్లీక దేశాలనుండి వస్తాయి ఇవి తెల్లగా, ఎర్రగా అనేక రంగుల్లో మనిషి ఎత్తునవుంటాయి. చాలా అందంగా వుంటాయి. అనుకూలమైన సమతల ప్రదేశాల్లో ఇవి తిరుగుబోతుల గుర్రాలకంటే వేగంగా పరుగెత్తుతాయి. అయితే, తొందరగా అలిసిపోతాయి. వీటిని తిరుగుబోతులు ఊసూను (శకుల)ల గుర్రాలంటారు. శకులు, కాంభోజ బాహ్లిక, జంబూద్వీపం వరకూ వెళ్ళారు. కదఫిస్, కనిష్కుడు – ఈ

శకవంశపు మహారాజులే! బహుశ, శకులుతమతోపాటు తమ గుర్రాల్ని కూడా పై దేశాలకు తీసుకువెళ్ళి వుండవచ్చును. అంతమాత్రానికి కాంభోజ, కపిశా దేశాల్లోని గుర్రాలన్నీ శకుల గుర్రాలే, అనడం తర్కయుక్త మనిపించడం లేదు!

ఇప్పుడు మేము ఆ మహానది (సేలింగా) ననుసరించి ఈశాన్యంగా ప్రయాణం చేస్తున్నాము. ముందుకు పోయిన కొలది చెట్లూ, చేమలతో. వనస్పతితో నవ్యాలంకృతయై భూదేవి వన దేవతలా భాసిస్తోంది. వెనక యబగూ ఉత్తర దేశంలో వనస్పతి బహుళంగా వుంటుం దని చెబితే నేను నమ్మలేదు. ఇప్పు డతడి మాటలపై విశ్వాసం కుదురుతోంది. కొండలు చాలా చిన్న చిన్నవి. ఈ ొండలపైన పచ్చని దేవదారు వనాలు వ్యాపించి వున్నాయి. అక్కడక్కడా తెల్లని భూర్జవృక్షాలు కూడా వున్నాయి.

మహానదికి ఉత్తరంగా కొంత దూరం ప్రయాణంచేసి వన్య ప్రజల్ని (యాకూత్) కలుసుకున్నాము. వాళ్ళు మృగచర్మాల్ని, తేనెనూ కొన్ని బంగారు నగలనూ తెచ్చి యబగూకు కానుక ఇచ్చారు. యబగూ సహజంగానే మృదుస్వభావుడు, ఉదారహృదయుడు. బుద్ధభక్తుడయ్యాక ఇంకా దయార్ద్రు డయ్యాడు. వన్య ప్రజలపట్ల ఎంతో దయను ప్రదర్శించాడు. ఆదరభావంతో వ్యవహరించాడు. యబగూ వన్య ప్రజల్తో ఇలా ప్రవర్తిస్తున్నందుకు, అతడి అనుచరులు చాటుగా తమ అసంతృప్తిని ప్రకటించేవారు. "ఈ వన్య ప్రజలు చమరీమృగాల్లా. ఎలుగుబంటుల్లా మహా ప్రమాదకరమైన వాళ్లు; మన యజమాని వీళ్ళ చేతుల్లో ఘోరంగా దెబ్బతింటాడు!" అనేవారు.

నేను అనుచరుల పై అభిప్రాయాన్ని వప్పుకునేవాణ్ణి కాదు, అయితే శాంతిలుడి అభిప్రాయం నా అభిప్రాయంతో భేదించింది: "యబగూ ఇంకా గట్టి రక్షణతో, జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు శాంతిలుడు.

మేము ఇంకా ఉత్తర దేశానికి వెళ్ళిపోయాము. ఇక్కడి వాళ్ళూ వన్య ప్రజలే! దుప్పులే వీళ్ళకు ప్రధానమైన పశువులు. అవే సామాన్లను మోస్తుంటాయి. వీళ్ళకు గొర్రెలూ, గుర్రాలూ లేవు. తో[illegible]

అవారులూ సమతల ప్రదేశాల్లో గుర్రాన్ని, వంటెల్నే కాకుండా ఎడ్ల బండ్లను కూడా ఉపయోగిస్తుంటారు. కానీ వీళ్లు మంచులో, చక్రాల్లేని, కుక్కలు లాగే బండ్లలో ప్రయాణం చేస్తుంటారు. వీళ్లు చర్మపుదుస్తుల్ని ధరిస్తారు. వీళ్ల డేరాలు కూడా తోళ్ళతోనే వేసుకుంటారు. అచ్చం మాంసమే వీళ్ళ ఆహారం. కాకపోతే, వీళ్ళకు ఇనుప ఆయుధాలు అవసరం. వాటిని త్యోర్కులవద్ద తీసుకుంటారు.

మహానదికి ప్రక్కగా, కొద్ది దూరంలో చిన్న చిన్న కొండలున్నాయి. వాటిలో ఒక సరోవరం వుంది. యబగూ, నన్నూ శాంతిలుణ్ని వెంట పెట్టుకుని, కొంతమంది అనుచరుల్తో ఆ సరోవరం వద్దకు వెళ్ళాడు. అప్పుడా సరోవర ప్రాంతం మహా రమణీయంగా వుంది. వేలకొలది పక్షులు కలవరం చేస్తున్నాయి. చలికాలంలో భారతదేశంలోని సరోవర ప్రాంత దృశ్యాలు ఇలాగే వుంటాయి. ఇక్కడి పక్షులుకూడా భారతదేశపు పక్షుల్లాగానే వున్నాయి. పక్షులు ఆకాశగాములు కావడం వల్ల, భూమిమీది అభ్యంతరాలేవీ వాటికి వుండవు. పైగా తీవ్ర వేగంతో ప్రయాణం చేస్తుంటాయి. పాటలీపుత్రం, ఉజ్జయినీ మొదలైన భారతదేశపు మహా నగరాల్లో హేమంతం ప్రారంభం కాగానే ఉత్తర దేశాన్నుండి వేలకొలది పక్షులు రావడాన్ని చూస్తుంటాము. హేమంతం గడిచి వసంతం రాగానే తిరిగి ఆ పక్షులు ఉత్తర దేశానికి వెళ్ళిపోవడాన్ని చూస్తుంటాము. అయితే ఆ పక్షులే ప్రతి సంవత్సరం భారతదేశానికి వెళ్ళి వస్తుంటాయని ఎలా అనుకోవడం? త్యోర్కులు పక్షుల్ని వేటాడు తుంటారు. కానీ యబగూ మాత్రం పక్షుల్ని చంపవద్దని తన అనుచరులకు గట్టిగా చెప్పాడు. అతడు అప్పుడప్పుడూ ఇలా అంటూంటాడు: "ఆహారంకోసం ప్రాణిహింస అనివార్యమైనప్పుడు, చిన్న చిన్న ప్రాణుల్ని పదింటిని చంపేకన్న, ఒకే పెద్ద ప్రాణిని చంపుదాం!" అనేవాడు. ఒక్కొక్క గొర్రెను పిసరు మిగలకుండా తినేసే త్యోర్కులు వున్నారు. అలాంటి వాళ్ళకు ఎన్ని పక్షులు తింటే కడుపు నిండేట్టు?

పగటిపూట పొద్దు ఎక్కువగా వుంటోం దిప్పుడు. మధ్యాహ్నం దాటింది. యబగూ అనుచరులు వెనక్కుతిరిగి వెళ్ళాలనే తొందరలో

వున్నారు. కానీ, మాకా సరోవర సౌందర్యం ఎంత చూసినా తనివితీరడం లేదు. సూర్యుడు. పశ్చిమానికి కృంగాడు. ఇక్కడి ప్రకృతి రామణీయకతకు ముగ్ధుడై సూర్యుడు తన గమ్యాన్ని చేరడాన్ని మరుస్తున్నాడా అనిపిస్తోంది. నిదానంగా ప్రొద్దు కృంగుతోంది. దిశలు ఎర్ర నౌతున్నాయి. యబగూ అనుచరుల తొందర అధికమౌతూన్నది. "ప్రశాంతమైన ఈ సుందర ప్రకృతిలో, భయపడవల్సిన అవసరం ఏమిటి? మా వెంట వున్న యాభై మంది అనుచరులూ కాకలు తీరిన యోధులు! ఇంక సంశయమూ, తొందర ఎందుకు?" అనుకుంటున్నాము మేము.

సరిగా అదే సమయాన మా వెనుకవున్న అడవిలో నుండి, కొందరు వన్య ప్రజలు ఏమాత్రం శబ్దం కాకుండా వచ్చి మీద పడ్డారు. ఆయుధాల్ని సర్దుకునే అవకాశం కూడా మాకు ఈయలేదు. శత్రువును ప్రాణాలతో విడవడం వాళ్ళకు తెలియదు. అకస్మాత్తుగా జరిగిన ఈ ముట్టడికి తోఁర్కులు దిగ్భ్రాంతి చెందారు. అయినా, వెంటనే తెప్పరిల్లుకుని, పరిస్థితిని అర్థం చేసుకున్నారు. ప్రాణాలకు తెగించి పోరాడారు. అపూర్వమైన శౌర్యాన్ని ప్రదర్శించారు. వేల సంఖ్యలో శత్రువులొచ్చి మీద పడుతూంటే, యాభై మంది శౌర్యం ఎందుకు పనికొస్తుంది ? మేమిద్దరం బౌద్ధ భిక్షువులం కావడంవలన, ఆయుధాల్ని ముట్టకుండా, దూరంగా నిలబడి, మానవరక్తం ధారలు కట్టి ప్రవహించడాన్ని చూస్తున్నాం. ఇంతలో సరోవరంలోకి ఎక్కణ్ణుండో, రెండు నౌకలు అతి వేగంగా వచ్చాయి. అవి చెట్లను దొల్లచేసి తయారు చేసిన నౌకలు. ఒకో దాంట్లో ఇరవై మంది దాకా ధనుర్ధారులున్నారు. వాళ్ళు యబగూ దేరాలోకి జొరబడ్డారు. "మా ప్రస్థానం మహాప్రస్థానంగా మారబోతోంది" అనుకున్నాను. వాళ్ళలో ఒకడు మాముందుకు వచ్చాడు. ఒక్క క్షణంలో అతడు తన ఆయుధంతో మమ్మల్ని తెగటారుస్తాడనుకుంటున్నాను. కానీ, అతడలా చేయలేదు, నా భుజాన చేయి వేశాడు. అతడి చేతి స్పర్శలో మిత్రత్వపు మృదుత్వం అనుభూతికి వచ్చింది. మా ఇద్దరికీ ఒకరి భాష మరొకరికి తెలియదు. వాళ్ళల్లో తోఁర్కుల భాష తెల్సిన వాళ్ళు ఎవరూ లేరు! అయినా మానవులకు 'సౌంజ్ఞ' అనే అపూర్వమైన భాష తెల్సు : అతడు తన వాళ్ళకు సంజ్ఞద్వారా ఇలా తెలియ పరచాడు "మా భైషీ "

# 16 వ అధ్యాయము

# శీత సముద్రమూ, మహా ఎడారి

(క్రీ. శ. 556-57)

ఈ వనవాసులు తోఖ్యాలులకంటే క్రూరులని విన్నాము. మా పట్ల వీళ్ళలా సౌమ్యంగా వ్యవహరిస్తారని మేము అనుకోలేదు. మమ్మల్ని తమ వెంట నడవమని సంజ్ఞ చేశారు. ఈ విశాల ప్రపంచంలోని, అనంత ప్రదేశాల్లో క్రొత్త పాత అనేవి మాకులేవు. ఎక్కడికి వెళ్ళినా ఒకటే। ఈ విధంగానైనా, నూతన ప్రదేశాల్ని చూసినవాళ్ళ మవుతాము అనుకున్నాము। వీళ్ళ నావలు సరోవరంలో వున్నాయి. పోగా, మిగిలిన కొద్ది పుస్తకాలనూ వీపుకు కట్టుకొని వాళ్ళ వెనక బయల్దేరాము. ఈ వన వాసులు యబగూనూ, అతడి అనుచరులనూ ప్రాణాలతో విడువరని మాకు తెల్సు. కానీ, మే మేం చేయగలం? మౌనంగా, విషాదంగా, విచా రంగా వనవాసుల వెనుక నడిచి వెళ్తున్నాము। ఇలా వీళ్ళతో వెళ్తున్నం దుకు, ఒక విధంగా విచార పడుతూన్నప్పటికీ, మరో విధంగా కొంత ఆనందాన్నికూడా పొందుతున్నాము. నూతన ప్రదేశాల్ని చూడవచ్చునన్న ఆనందం మాహృదయాంతరాళాల్లో గిలిగిలింతలు పెడుతుంది. వీళ్ళు మమ్మల్ని నావలో కూర్చొబెట్టుకొని, నావను అతి వేగంగా నడుపుకుని వెళ్ళిపోతున్నారు. ప్రకృతి నిశ్చలంగా వుంది. సరోవరం ప్రశాంతంగా వుంది. ఒక జాము అలా ప్రయాణం చేశాము నావల్ని ఆపారు. కొందరు నావల్లోనే వున్నారు. కొద్దిమంది మమ్మల్ని వెంటపెట్టుకుని, ఉత్తర దిశకు బయల్దేరారు. దట్టమైన అడవిగుండా వెళ్ళిపోతున్నాము. సూర్యరశ్మి చొరరాని గహనవనం। అయితే, ఎండయొక్క వేడిమి తప్పకుండా ఈ వనంలోకి ప్రవేశిస్తుంది. లేకపోతే, ఈ వనంలో,

క్రింద పేరుకున్న మంచు ఎలా కరుగుతుంది ? పసిరిక ఏపుగా పెరి గింది. ఇలాంటి ప్రదేశాల్లో దారి తెల్సుకోవడం ఈ వనవాసులకే సంభవం. ఒకవేళ, యఃగూ శత్రువుల్ని జయించినా, మమ్మల్ని తిరిగి వెనక్కి తీసుకు వెళ్ళలేడు. మమ్మల్ని వెతకడానికి అడవిలో పదడుగులు వేస్తే చాలు,దారి తప్పుతాడు ! తోర్యుక్కులు ఎడార్ల లో ఘనులే కావచ్చు. ఈ అడవుల్లో అతి నిస్సహాయులు. మా వెంట పదిమంది మాత్రమే వన వాసు లున్నారు. మిగిలిన వాళ్ళు యఃగూతో పోరాడే తమ సహచరు లకు సాయం చేయడానికి అక్కడే వుండిపోయారు. ఈ ప్రదేశంలో పగలు సుదీర్ఘంగా వుంటుంది. రాత్రి చాలా కురచ ! పైగా, రాత్రిపూట అంధకారం వ్యాపించదు. ఇక్కడి రాత్రులు భారతదేశంలోని పౌర్ణమి రాత్రులకంటె కూడా కాంతివంతంగా వుంటాయి. ఈ అర్ధరాత్రిసమయం లోనూ పుస్తకంలోని అక్షరాలు చక్కగా, స్పష్టంగా కనబడుతున్నాయి, కనుకనే ఈ ప్రదేశాల్లో రాత్రి కారణంగా ప్రయాణాన్ని ఆపవలసిన అవ సరం వుండదు. అయినా, విశ్రాంతికోసం ఆగడం ముఖ్యం ! ఆ దీన్ని రాత్రిని వొకచోట మజిలీనిచేసి గడిపేశాము. చకిముకి రాయితో నిప్పు తయారు చేసుకున్నారు. ఇంత చెత్త ప్రోగుచేసి మంట పెట్టారు. వీళ్ళు పచ్చి మాంసాన్నే తినేస్తారు. మాంసాన్ని కాల్చుకోవడానికి నిప్పు ముట్టించాలన్న సమస్యలేదు వీళ్ళకు ! దుష్ట జంతువులనుండి రక్షణకు మాత్రమే నిప్పును ముట్టించి, మంటలు వేస్తుంటారు ! ఎటూ మంట వేశారు గనుక మాంసాన్ని కాల్చుకు తినసాగారు. మాకూ పెట్టబోయారు. వద్దని సంజ్ఞ చేశాం. మేము ఎందుకు వద్దన్నామో వీళ్ళకు అర్థంకాలేదు. కానీ, సహజ ప్రసన్న వదనులమై వద్దనడంవల్ల మరి మమ్మల్ని బల వంతం చేయలేదు. బాగా అలిసిపోయాము. పైగా, మనస్సులో ఎలాంటి భయాందోళనలూ లేవు. పడుకోగానే నిద్ర పట్టింది. ఎంతసేపు నిద్ర పోయామో తెలియదు. కళ్ళు తెరిచేసరికి వొక వందమంది దాకా మను ష్యులు మా చుట్టూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

వీళ్ళ భాష కొంత తెలిసే వరకూ వీళ్ళతో మాట్లాడడం సంభవం కాదు. మాలో మేము సంస్కృతంలో మాట్లాడుకుంటున్నాము. వీళ్లూ తమ భాషలో దారి పొడుగునా ఏమేమిటో మాట్లాడుకుంటున్నారు.

పెద్దగా నవ్వుకుంటున్నారు. సంస్కృతం వీళ్లకు తెలియదని మాకు గట్టిగా తెల్సు! ప్రపంచానికే ఉత్తరపు కొన అయిన ఈ ప్రాంతానికి (సైబీరియా) సంస్కృతం తెల్సినవాడు ఎవడూ, ఎన్నడూ వచ్చి ఉండడు. కనీసం వీళ్ళు సంస్కృత భాషను ఇంతవరకూ విని ఉనా ఉండరు. కనుకనే కావాలని సంస్కృతంలో మట్లాడుకుంటున్నాము. త్యోర్కు భాషలోనూ, మాట్లాడు కోగము. అయితే ఎంతో కాలంగా త్యోర్కుల అధీనంలో ఉంటూన్న ఈ వన్య ప్రజలకు తప్పని సరిగా త్యోర్కు భాషా పదాలు కొన్ని తెల్సివుంటాయి!

యబగూ ఎన్నోమార్లు జ్ఞాపకం వచ్చాడు. చాలా మంచివాడు. మాతో ఎంతో స్నేహంగా వ్యవహరించాడు. అతడి రాజ్యంలో ఉండి మా జీవితాలను ధార్మిక కార్యక్రమాలకు అంకితం చేసుకోవాలని నిశ్చయించుకున్నాం కూడాను! కానీ, ఈ వనవాసుల మధ్య మా జ్ఞానం, చదువు, ధర్మనిష్ట, సాహసం-వీటి ఉపయోగం ఏమిటి?

మేము నిద్ర లేచాక వీళ్ళలో వొకడు మాదగ్గిరకు వచ్చాడు. వచ్చీ రాని త్యోర్కు భాషలో "మేము వెళ్తున్నాము. మాతో రండి! మీ కేమీ భయంలేదు!" అన్నాడు.

"మా కేవిధమైన భయంగానీ, అనుమానంగానీ లే"వని మేం చెప్పాము. భోంచేయ మన్నాడు. మధ్యాహ్నానంతరం భోంచేయమని చెప్పాను. మా వేష భాషలూ, ఆకారమూ ప్రత్యేకంగా ఉండడం, వీళ్ళని ఆకర్షించింది. మా ముఖాలు కూడా ప్రత్యేకంగా ఉన్నాయి మా లా కాషాయ వస్త్రాలు ధరించిన వాళ్ళను వీళ్ళింత వరకూ చూచి వుండరు. మేము క్రితంరోజే తలలు గొరిగించుకున్నాము. వీళ్ళ కసలు తలలు గొరిగించుకోవడం తెలియనే తెలియదు. పైగా వీళ్ళముఖాలు త్యోర్కుల ముఖాల్లాగానే వుంటాయి. గడ్డాలూ మీసాలు మొలవ్వు. చట్టిముక్కులు. ఉన్నతమైన నాసికలూ, నల్లని కండ్లూ కల మాలాంటి మనుషుల్ని వీళ్ళు ఇంతవరకూ చూడనే లేదు. శాంతిలుడి తండ్రి అవార రాజకుమారుడే! కానీ, శాంతిలుడిలో, అవార లేక త్యోర్కు జాతుల పోలికలు అంతగా లేవు. అందు క్కారణం వొకటుంది. అవార రాజకుమారులకూ, కాంస్య

దేశపు రాకుమార్తెలకు అనాదినుంచి సంబంధాలుంటూ వచ్చాయి. ఈ విధంగా ఉభయ జాతుల్లోనూ రక్తసమ్మిశ్రణం జరుగుతూవచ్చింది.

తోర్యుక్ భాష తెలిసిన వ్యక్తి, ఇతర వనవాసులకంటె కొంచెం తెలివి గలవాడు. ఎన్నోమార్లు తోర్యుక్ల దేశాల్లోకి కానుకల్ని తీసుకు వెళ్ళడమే కాకుండా, ఒకటి రెండు సంవత్సరాలు వాళ్ళ దగ్గిర వున్నాడు కూడాను. ఇతడు కొంతవరకు బయటి ప్రపంచాన్ని చూశాడు. కొంత సేపు ఆలోచించాక "మీరు దేవవాహనులా?" అన్నాడు. అదే మాటను తన వాళ్ళకు చెప్పాడు. పౌరోహిత్యం, వైద్యం, దైవకార్యం-ఈమూడు పనులనూ చేసే వ్యక్తిని వీళ్ళ భాషలో 'శమన్' అంటారు. శమన్ శబ్దం 'శ్రమణ్' (బౌద్ధ భిక్షువు)కు అపభ్రంశం। దేవవాహనుడంటే పురోహితుడని అర్థం.

అతడడిగిన ప్రశ్నకు శాంతిలుడు 'ఔ' నని తల వూపాడు. తోర్యుక్ భాష తెలిసిన వ్యక్తి తనవాళ్ళకు మమ్మల్నిగురించి గొప్పగా చెప్పాడు. తన పరిజ్ఞానాన్ని చాటుకోవడానికి మా మహిమల్ని గొప్పచేసి పొగడి వుండవచ్చును. "మన పురోహితులకంటే వీళ్ళల్లో అద్భుతమైన శక్తులుంటాయి। వీళ్ళు చచ్చిన వాళ్ళను బ్రతికిస్తారు. ముసలి వాళ్ళను పయసు వాళ్ళను చేస్తారు।" అని చెప్పి వుంటాడతడు. ముసలి వాళ్లను వయస్సు వాళ్ళుగా మార్చడం ఓ గొప్ప ఆకర్షణీయమైన విషయం। వీళ్ళసలు ముసలి వాళ్ళను బ్రతకనీయరు. ముసలివాళ్ళు చనిపోవడానికి వీలైన పరిస్థితుల్ని కల్పించి, ఒంటరిగా వదిలివేస్తారు। వీళ్ళకు ఇల్లూ వాకిళ్లూ వుండవు. నిరంతరం తిరుగుతూ, నివాసాల్ని మారుస్తూంటారు. ఈ తిరుగుబోతు జీవితంలో ఒంటరిగా వదిలిన ముసలివాళ్ళు, ఆకలి దప్పులకుగానీ, వన్యమృగాలకు గురిఅయిగానీ చనిపోతారు.

మూడు రోజు లలాగే అడవిలో ప్రయాణం చేశాము. కొంత దూరం కొండలమీద ప్రయాణం చేశాము. అక్కడక్కడా సమతల ప్రదేశమూ తగిలింది. కొండలు నామమాత్రపు కొండలేగాని ఏమంత పెద్దవి కావు. మూడు రోజుల అనంతరం వీళ్లలో ప్రయాణపు తొందర తగ్గింది. నిదానంగా వెళ్ళసాగారు. జల జంతువులుగానీ, వన్య మృగాలు గానీ సమృద్ధిగా దొరికే ప్రదేశం అది. అలాంటిచోట ఆహారాన్ని మోసు

కాని ప్రయాణం చేయవలసిన అవసరం ఏముంది? అక్కడక్కడా అగి మృగాలను వేటాడేవారు. జలాశయాల్లో చేపల్ని పట్టేవారు. ఆ తెల్లని రాత్రి పూట్ల నీటి పక్షుల్ని వేటాడేవారు. నాలుగవరోజు మధ్యాహ్నం దూరంగా పొగ కనుపించింది. మే మా పొగకు అభిముఖులమై వెళ్ళి పోతున్నాము. పొగ లేస్తున్న ప్రదేశాన్ని సమీపించడానికి ముందు దుప్పుల మందలు పసిరిక మేస్తూ కనుపించాయి. మేము వాటికి బాగా దగ్గరకు పోయాము. అయినా, అవి మమ్మల్ని చూసి, బెదరి పరుగెత్త లేదు. భారతీయులకు ఆవులూ, బర్రెలూ మచ్చిక అయినట్లే, వాళ్ళకు దుప్పులు మచ్చిక అయ్యాయి గావును అనుకున్నాము. దుప్పులు ఆ వన వాసుల పెంపుడు జంతువులు. మరి కొంతసేపటికి పొగ లేస్తున్న ప్రదే శాన్ని చేరాము. అక్కడ పది పన్నెండు తోళ్ళతో నిర్మింపబడిన దేరా లున్నాయి. దేరాల బయట నిలబడివున్న స్త్రీ పురుషులు మా వెంట ఉన్న వనవాసులకు ఘనస్వాగతాన్ని ఇచ్చారు. తోర్క్యుర్కు భాష తెలిసిన వ్యక్తి పట్ల ప్రత్యేకమైన అభిమానాన్ని చూపారు. వీళ్ళ దేరాలూ తోర్క్యుర్కుల దేరాల్లా కళాత్మకంగానే వున్నాయి. అయితే, ఈ దేరాల్లో నిరాడంబరత అధికంగా కనిపిస్తోంది. అసలీ దేరాల్ని దేరా లనలేము। చుట్టూ కర్రల్ని పాతి, పైన చర్మాన్ని కప్పుతారు। వీళ్ళు ధరించేవి కూడా చర్మపు దుస్తులే. ఉన్ని వస్త్రాలంటే తెలుస్తుంది కానీ, వాటిని ధరించరు. ఇక్కడ చలి విపరీతం. లేళ్ళూ, దుప్పులూ అసంఖ్యాకంగా వుంటాయి. ఇక్కడి విపరీతమైన చలిక తట్టుకోవాలంటే మృగచర్మాల్ని ధరించడం తప్పనిసరి। ఉన్ని నిరుపయోగం. కనుకనే గొర్రెల్ని పెంచరు.

మా వెంటవున్న వనవాసు లందరూ తమ జాతి ప్రజలలోకివచ్చి పడ్డారు. భాష ఆత్మీయతను పెంపొందించుకోవడానికి ఓ ముఖ్య సాధనం. తోర్క్యుర్కు భాష తెలిసిన వ్యక్తి వనవాసుల సర్దారు. అతడి నెత్తికి ఒక టోపీ వుంది. ఆ టోపీకి రంగురంగుల పక్షి ఈక లున్నాయి. వీళ్ళ భాష మాకురాదు. వచ్చివుంటే చాలా సంతోషంగా మాట్లాడేవాళ్ళం. ఆత్మీయులం అయ్యే వాళ్ళం। సామాన్య దృష్టికి తోర్క్యుర్కులకూ, ఈ వన వాసులకూ ఆకారాల్లో అట్టే వ్యత్యాసం కనుపించదు కానీ, పరిశీలనగా చూస్తే తోర్క్యుర్కులకూ వీళ్ళకూ ఆకారాల్లో కొంత తేడా కనుపిస్తుంది.

త్యోర్కులకంటే ఈ వనవాసుల ముక్కులు ఎక్కువ పట్టిగా వుంటాయి. దవడలు చప్పిగా వుంటాయి. కాంతిలుడు వీళ్ళని "మహా కురూపు" లంటాడు.

"కురూపం సురూపం అనేది దేశాన్ని బట్టీ, ప్రజల మనస్తత్వాల్ని బట్టీ నిర్ణయింపబడుతూ వుంటుంది. వీళ్ళదృష్టికి మనమూ కురూపులుగా వుండవచ్చును! ఎందుచేతనంటే మన ముక్కులు ఉన్నతంగా వుంటాయి! ముఖాలు గుండ్రంగా వుండవు. వీళ్ళలా మనవి చప్పి దవడలు కావు!" అని నేననేవాణ్ణి. మేము అక్కడికి వెళ్ళగానే పదిమంది ఆడవాళ్ళు మా చుట్టూ ప్రోగుపడ్డారు. వీళ్ళ దృష్టికి మేము ఆడుకునే బొమ్మల్లా వున్నాం గావును. మా శరీరాలనూ తాకి చూడసాగారు. వీళ్ళ ప్రవర్తనలో పసిపిల్లల సరళత్వం, సహజత్వం గోచరిస్తున్నాయి. ఈ స్త్రీల అమాయక, నిష్కపట ప్రవర్తనలకు మేమెంతో ముగ్ధుల మవుతూన్నాము. కానీ, వీళ్ళలా మమ్మల్ని తాకి, ఆట బొమ్మలుగా చూడ్డం మా వ్యక్తిత్వానికీ, మేం పెంచుకున్న ఆత్మాభిమానానికి గొప్ప దెబ్బగా వుంది. సందిగ్ధావస్థలో పడివున్న మమ్మల్ని సర్దారు చూశాడు. వనవాసుల్ని వుద్దేశించి తమ భాషలో అతడేదో అన్నాడు. మమ్మల్ని తాకడానికి ముందుకువస్తూన్న చేతులన్నీ, అగ్నిని స్పర్శించినట్టు చప్పున వెనక్కిపోయాయి. అందరూ తత్కాలంలో రెండడుగులు వెనక్కివేసి, అవతలకి తప్పుకున్నారు. వాళ్ళ ముఖాల్లోని వెనుకటి కుతూహలం స్థానంలో భయభక్తులు కనుపించాయి. బహుశః సర్దారు తమ భాషలో "మేము మృత్యువును కూడా ధిక్కరించగల శక్తి సంపన్నులం!" అని చెప్పి వుంటాడు. కొద్ది క్షణాల తరువాత ఐదేళ్ళ కుర్రవాణ్ణొకణ్ణి మా దగ్గరకు తీసుకు వచ్చారు. పాలిపోయిన అతడి ముఖాన్ని, ఎముకల ప్రోగులాంటి శరీరాన్ని చూస్తూనే రోగ పీడితుడని తెల్సుకున్నాము. కానీ, అప్పుడు మా దగ్గర మందులేమీ లేవు. ఆ నూతన ప్రదేశంలో మాకు తెల్సిన ఓషధుల్ని వెతుక్కొని ఔషధాన్ని తయారు చేసుకోవడమూ సంభవం కాదు. త్యోర్కుల చేతుల్లో పడ్డ తరువాత ఎప్పుడూ ఏవో కొన్ని మందులు వెంట వుండడం ముఖ్యమని తెలుసుకున్నాము. అలాగే మందుల పెట్టెను వెంట వుంచుకునేవాళ్ళం! కానీ

యబగూతో సరోవర విహారానికి వచ్చేటప్పుడు మందుల పెట్టెను వెంట తెచ్చుకోవలసిన అవసరం ఏముంటుంది? దేరాలోనే మందుల పెట్టెను వదలి విహారానికి బయల్దేరాము. అలా కాకుండా ఏ రెండు మూడు పుస్తకాల్తోపాటు మందుల పెట్టెను కూడా వెంట తెచ్చుకుని ఉన్నట్లయితే ఎంత బాగుండేది!

సమయానుకూలంగా ప్రవర్తించగల నేర్పు శాంతిలుడికి నాకంటే యెక్కువగా వుంది.

"భర్తే! మీ రింతగా ఆలోచించవలసిన పనేముంది. మనమేమీ ఇక్కడ స్థిరంగా వుండబోవడంలేదుకదా? కొద్దిసేపటి తరువాత ఎటూ ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతాం! అలాంటప్పుడు ఏదో ఒక వుండ గొంతులో వేస్తేసరి!" అంటూ—

యావి కాని చ మూలాని యేన కనాపి పింశయేత్
యస్య కస్యాపి దాతవ్యం యద్వా తద్వా భవిష్యతి.

—పై శ్లోకాన్ని చదివాడు.

నేనే వయస్సులో పెద్దవాణ్ణి. పైగా గంభీరంగా, గౌరవనీయంగా కూడా కనిపిస్తున్నాను. కనుక నేనే మందు ఇవ్వడం వుచితంగా, ప్రభావోత్పాదకంగా వుంటుంది. సర్దారుతో మందు తీసుకు రావడానికి వెళ్తున్నానని చెప్పి యెదురుగా కనిపిస్తున్న చెట్ల గుబుర్లలోకి వెళ్ళాను. ఖూర్జ, దేవదారువృక్షాలక్రిందకువెళ్ళి నిలబడి ఏదో మొక్కకోసం వెతుకుతూన్నట్లు కొంతసేపు నటించాను. తరువాత ఏదో పిచ్చి మొక్క నొకదాని పీక్కొని వచ్చి శాంతిలుడికిఇచ్చాను. ఇలాంటివ్యవహారాల్లో శాంతిలుడే నా కంటే తెలివిగా వ్యవహరించగలడు. అందువలనే అతడి చేతికే ఇచ్చాను మొక్కను. శాంతిలుడు ఆ మొక్కను చేతిలోకి తీసుకున్నాడు. రెండు క్షణాలు ఏదో ధ్యాన్నిస్తున్నట్లు మౌనంగా వున్నాడు. తరువాత అక్కడ పడుకుని వున్న రోగి తలనుండి కాళ్ళవరకూ మూడు మార్లు ఆ మొక్కను రాచాడు. అనంతరం ఆకుల్ని గిల్లుకుని సర్దార్‌ చేతికిఇస్తూ "వీటిని నూరి చన్నుబాలల్లో కలిపి ఉదయ మొకసారి, సాయంత్ర మొకసారి ఇవ్వ"మన్నాడు. వీళ్ళు చిన్న తనంలో తల్లిపాలను మాత్రం తాగుతారు. పెద్దవాడయ్యాక తల్లిపాలను యెటూ తాగరుసరే, పశువులపాలను

కూడా తాగరు. జంతువులపాలగానీ, పశువుల పాలనుగానీ తాగడమనేది వీళ్ళ కసలు తెలియదు వీళ్ళల్లో బాలింతలు చాలామంది వున్నారు చనుబాలకు కొదువలేదు. ఈ ప్రక్రియ గొప్పగా ప్రభావాన్ని వేసింది వీళ్ళమీద।

మధ్యాహ్న భోజనానంతరం కొద్ది క్షణాలు విశ్రమించాము. తరువాత మళ్ళీ ప్రయాణాన్ని సాగించాము. మామందు కుర్రవాడిఆరోగ్యాన్ని ఏ మాత్రం బాగుచేసిందో చెప్పలేముగాని, వనవాసులదృష్టిలో మా విలువను అపూర్వంగా పెంచేసింది। కొంతదూరం వెళ్ళాక మా వెంటవున్న వనవాసులు జట్లుగా చీలిపోయారు. ఏ జట్టు కా జట్టు తమ గ్రామానికి వెళ్ళిపోయింది. వీళ్ళు గ్రామమని సమూహాన్ని అంటూవుంటారు. చర్మపు డేరాల సమూహాన్ని కూడా వీళ్ళు సహజంగా గ్రామమనేస్తారు. త్యోర్కులు తమతో సరిగా వ్యవహరించడం లేదన్నకోపంలో వీళ్ళలా అకస్మాత్తుగా యబగూమీద విరుచుకు పడ్డారు. అయితే తాము ఆక్రమణ జరిపింది ఉప-ఖాన్ మీదని ఈ వనవాసులకు తెలియదు "యబగూ నేం చేశారని?" సర్దార్ నడిగాము. అయితే, అతడు మాకు సరైన సమాధానం ఏమీ చెప్పలేదు.

మరి నాలుగు రోజులు ప్రయాణం చేశాక ఒకపర్వతాన్ని చేరాం. ఆ పర్వతం మీదనుండి చూస్తే ఓ మహా జలరాశి కనుపించింది హ మాస చరులైన వనవాసులు దాన్ని 'మహాజలరాశి' అన్నారు, బహుశాసముద్రం గావును అనుకున్నాము. పర్వతాన్ని మరికొంచెం అధిరోహించాము. మరో ఎత్తయిన శిఖరాన్ని ఎక్కి చూశాము. ఈ మాటు కొంచెంగా సంశయం కలిగింది. మాకు ఎదురుగా కనిపిస్తూన్న ఈ మహా జలరాశి సముద్రమేనా ? అన్న ప్రశ్న ఉదయించింది మాలో. మరునాటికి మేమా మహా జలరాశి వొడ్డుకు చేరుకున్నాము.* నీటిని ముట్టుకుచూశాము. నోట్లో పోసుకున్నాము, నీరు చల్లగా, తియ్యగా వుంది. సాధారణంగా సముద్ర జలం ఉప్పగా ఉంటుంది. మంచినీటి సముద్రాన్ని చూసేసరికి

---

* బైకాల్ సరస్సు.

శాంతిలుడు ఆనందంతో పొంగిపోయాడు. "మంచినీటి సముద్రం!" అన్నాడు.

మేమూ జలరాశి వద్దకు చేరినప్పుడు గాలి ఎక్కువగా లేదు. అలలూ సాధారణంగానే వున్నాయి. కానీ, సాయంత్రానికి గాలి తీవ్ర మయింది. ఉత్తుంగ తరంగాలు లేవసాగాయి. జలరాశి సముద్రమంత భీకరంగానూ తయారయింది. అది చూసి "ఇది సముద్రం కాకపోవచ్చు కానీ, ప్రపంచంలోకే మహావిశాలమైన, అద్వితీయమైన సరస్సు!" అన్నాను.

ఇది మాకో నూతన ప్రపంచంలా వుంది! ఈ ప్రపంచాన్ని గురించి ఎక్కువ విషయాలు తెలుసుకోలేక పోతూన్నందుకు మేమెంతో విచారపడుతూండేవాళ్ళం! ఇక్కడ ప్రతి విషయాన్నీ కండ్లతో చూసి తెలుసుకోవల్సిందే! చెవులతో విని పరోక్ష జ్ఞానాన్నిపొందే అవకాశం మాకు లేదు. వీళ్ళ భాష మాకు తెలియదు. వీళ్ళ సర్దారు కొన్ని వందల కుటుంబాలకు నాయకుడు. ఇన్ని కుటుంబాల ప్రజల్నీ వంతులవారీగా కల్సుకుంటాడు. సర్దారు ఎంత తొందర పనుల్లోనూ అవకాశాన్ని చూసు కుని మమ్మల్నీ కల్సుకుంటూ వుండేవాడు అయితే, వచ్చీ రాని తార్యక్కుభాష ద్వారా అతడు చెప్పే విషయాలు మాకేమీ అర్థమయ్యేవి కావు. మేము వెళ్ళినప్పుడు సరస్సు ప్రాంతంలో ఏదో ఉత్సవం జరుగుతోంది. ఎన్నో కుటుంబాల ప్రజలు వచ్చి పోతున్నారు. ప్రతి కుటుంబానికి పదో పదిహేనో దుప్పులుంటాయి. ఇవి లేడి జాతికి చెంది నవే అయినా, కొమ్ములు శాఖోపశాఖల్ని కలిగి ఉండడం వలన, ఓ ప్రత్యేకమైన జాతిగా పరిణతిని చెందాయి. వీటి చర్మం చాలా మృదు వుగా ఉండి, ఎంతటి చలినైనా ఆపుతుంది. ఈ వనవాసులకు పాలు తాగడం తెలియదుగానీ, తెలిసి పితుక్కుంటే ఇవి పాలుకూడా అధికం గానే ఇస్తాయి. వీటిని బరువులు మోయడానికి ఉపయోగిస్తూంటారు. వీటి మాంసాన్ని తింటారు. చర్మాన్ని, క్రింద పరచుకోవడానికీ, డేరాలకూ ఉపయోగిస్తూంటారు. ఈ ప్రదేశంలో సర్వకాల సర్వావస్థల్లోనూ చలి మిక్కుటంగా ఉంటుంది. ఇక్కడి చలిని వూహించడంకూడా కష్టమే!

ఉష్ణఋతువుల్లోనూ యిక్కడ ఉదయంపూట నీరు గడ్డకట్టుకు పోతుంటుంది.

మానవజాతి యొక్క బాల్యావస్థలోనే ఉన్నారు వీళ్లు। కనుకనే వీళ్ళకు ఆట పాటలూ, వినోదమూ జీవితంలోని ప్రధానాంగాలుగా తయారయ్యాయి. వేటాడడం, తేనె పట్టడమే వీళ్ళ ముఖ్యవృత్తులు. వీటినీ వినోదాత్మకంగా నిర్వహిస్తుంటారు. తిరుగుబోతులైన త్యోర్కులు నృత్యగానాల్ని, పానగోష్ఠుల్ని ఎక్కువగా ప్రేమిస్తుంటారు. అయితే పై విషయాల్లో వీళ్లు త్యోర్కుల్నికూడా మించిపోయారు. ఉత్సవం పౌర్ణమి వారముందనగా ప్రారంభమయింది. పౌర్ణమి వెళ్ళిన వారం రోజుల వరకూ జరిగింది. రాత్రిపూట్ల చీకటి ఎటూ ఉండదు. రాత్రిం బగళ్ళు అవిశ్రాంతంగా మహోత్సవం జరుపుకున్నారు. సర్దారు కంటేకూడా ఇక్కడి ప్రజలమీద ప్రభావాన్ని వేసిన వ్యక్తి మరొకడున్నాడు. అతడు వీళ్ళ పురోహితుడు. ఎర్రని కండ్లూ, ఆజానుబాహుడైన అతణ్ణి చూసిన క్షణానే ఏదో విలక్షణత కనుపించింది అతడిలో। సాధారణంగా మమ్మల్ని పురోహితులనే అనుకుంటూ వుంటారు. కనుక ఆ పురోహితుడికి మా మీద సహజంగానే ఈర్ష్య జనించవచ్చును. మాకు వాళ్ళభాష తెల్సివున్నట్టయితే "నీ వ్యవహారాలకూ మాకూ ఏమాత్రం సంబంధంలే" దని స్పష్టంగా చెప్పేసే వాళ్ళం. పోనీ సర్దారు చేతనయినా ఈ మాట చెప్పించవచ్చును. కానీ, అలా చెప్పించడం వలన సర్దారు దృష్టిలో ఇక మాకు విలువే వుండదు. అయితే, అతడితో పూర్తి నమ్రతగా వ్యవహరించాలని మాత్రం అనుకున్నాము. అతడిపట్ల భక్తి శ్రద్ధల్ని ప్రకటిస్తూండేవాళ్ళం। త్వరలోనే తమ పురోహితుడు మాకంటే గొప్ప అన్న భావన ఆ వనవాసుల్లో వ్యాపించింది.

సామాన్యంగా రాత్రిపూట అతడికి వళ్ళు పెరుగుతూంటుంది. అతడి వంటిమీదకు దేవుళ్లు వస్తూంటారు. అలాంటి సమయాల్లో అతడు గొప్పగా అట్టహాసం చేస్తుంటాడు. విచిత్రమైన దుస్తుల్ని ధరిస్తుంటాడు. ఆ దుస్తుల్లో అతణ్ణి చూస్తేనే చాలు, గుండెలు దడ పెడుతూంటాయి. అతడు అప్పుడు ధరించేదుస్తుల్లో ప్రధానమైంది ఒక పొడుగాటిచొక్కా

అది రంగురంగుల జంతువుల చర్మాలతో తయారు చేయబడ్డది; ఆ చొక్కాను తరతరాలుగా పురోహితులు ధరిస్తూ వచ్చారనిపించింది. తలకో పెద్ద బొచ్చుటోపీని పెట్టుకుంటాడు. అతడి పూజా సామాగ్రిలో ముఖ్యమైనవి మానవుడి పుర్రె, ముంజేతి ఎముకలూను. ఈ సాధనా లన్నింటినీ ముందు పెట్టుకుని, విచిత్రమైన దుస్తుల్లో తెల్లని అర్ధరాత్రి సమయాల్లో అతడు పూజకుపక్రమిస్తే, దర్శకులు సహజంగానే ప్రప్రా భావితులవుతూంటారు, మానవుడి పుర్రె పాత్రలో, తేనెతో తయారు చేసిన సారా వుంటుంది. రెండు గుక్కలు సారా తాగుతాడు. చేతిలో ముంజేతి ఎముక వుంటుంది. ఆవులింతల్తోపాటు, అతడి కండ్లు రక్తారుణిమ వర్ణంలో భయంకరంగా మెరిసిపోతూంటాయి. ఇక నప్పుడతడికి దేవుడు పూనాడు। గద్యపద్య మిశ్రితమైన మంత్రాల్ని కొన్నింటిని, అటు పద్యాల్ని పాడుతూన్న స్వరంలోనూ, ఇటు వచనాల్ని చదువు తూన్న స్వరంలోనూ ఉచ్ఛరిస్తుంటాడు. దేవుడు మొదట పురోహితుడి ముఖతా ఇలా, "నేను సృష్ట్యాదినుండి మీ జాతిని రక్షిస్తున్నాను. ఎవ డైనా నా ఆజ్ఞల్ని ఉల్లంఘించాడా? ఘోరంగా దండించేస్తాను. నా పట్ల అపచారం చేసిన ప్రతిసారీ మీ మీదకు మహమ్మారిని తోలాను. మిమ్మల్ని మంచులో పూడ్చి చంపాను. తిండి దొరక్కుండా చేశాను. వరదల్లో కొట్టుకుపోయేట్టు చేశాను।" చెప్పేవాడు.

పై వాక్యాల్ని వింటూనే ప్రజల ముఖాలు రక్తం విరిగినట్టు పాలిపోయేవి. అందరూ భయభ్రాంతు లయ్యేవారు. దేవుడికి కోపం వస్తే తిరిగి అలాంటి మహోపద్రవాలే సంభవిస్తాయని హడలిపోయారు. సర్దారూ. ఇతర పెద్దలూ. పురోహితుడికి పూనిన దేవుణ్ణి ఎంతో బ్రతిమ లాడుతారు. అయితే, ఒట్టి కబుర్లతో దేవుళ్ళకోపం తగ్గుతుందా ? కాను కల రూపంలో దుప్పుల్ని, విలువైన చర్మాల్ని ఇస్తేగాని దేవుడు శాంతించడు. ఇది వార్షిక మహోత్సవ సమయం. పురోహితుడికి కానుకలూ అవీ అధికంగా లభించే సమయం ఇదే.

ఉత్సవ సమయాల్లో ఏ దేశీయులైనా, నూతనవస్త్రాల్ని ధరించి, తిండి విషయంలో ధారాళంగా ఖర్చుపెడు తుంటారు. వీళ్ళు మరీను ! ఈ వనవాసులు ఉత్సవ ప్రియులు. దుఃఖాలనూ, బాధలనూ, మరిచి

మహోత్సాహంతో ఉత్సవాల్లో పాల్గొంటూ వుంటారు. వీళ్ళలో నిత్యం స్నానం చేసే ఆచారంలేదు. ఇలాంటి ఉత్సవ సమయాల్లో మాత్రం కొందరు స్నానం చేస్తుంటారు. వీళ్ళ శరీరఛాయ గొప్పదే! ముఖాలు ఎర్రగా, రక్తంలా వుంటాయి. పురోహితుడంటే మాకోరకంగా భయం గానే వుంది. మేము తనకు పోటీదార్లమనుకుంటూ దేమోనని మాబాధ! అయితే, మేమన్నా అతడికి భయంగానే వుంది. ఆ మంత్రతంత్రాల్లోని గుట్టు మట్టులన్నీ ఎటూ మాకు తెల్సే వుంటాయి గనుక, అతడి చేష్ట లకూ, పనులకూ, ఇతరులెంత భయపడినా, మేము భయపడమనీ, అత డికి తెలుసును. దేవుడు పూనడం మొదలైనవి మేము నమ్మమనీ అత డికి తెలుసును. దేవుడు పూనినప్పుడు అతడు కావాలని అనేక రకాలుగా ప్రజల్ని భయపెట్టి కానుకల్ని వసూలు చేస్తుంటాడు. మేము యథార్థాన్ని ప్రజలకు చెప్పేస్తే అతడి వృత్తినే దెబ్బకొట్టిన వాళ్ళ మవుతాము. అలాంటి స్థితిలో అతి భయంకరంగా పగ తీర్చుకోవడానికి సిద్ధపడతాడు. మేము అక్కడికి వెళ్ళిన మొదటి రోజునే త్యోర్కు భాష తెలిసిన సర్దారును వెంట పెట్టుకుని అతడు మా దగ్గరకు వచ్చాడు మాట్లాడి పోవ డానికి. మా వెంట ఉన్న ఇతర వనవాసుల్ని అనుసరించి, మేమూ అతడి పట్ల ఆదరభావాన్ని ప్రకటించాము. "మీరు ఏదేవుడి పూజారు?" లని అడిగాడు. క్షణం ఆలోచించి "బుద్ధదేవుడి పూజారులం!" మన్నాము. ఈ పేరు అతడికి మహా విచిత్రమైన దనిపించింది. మా దేవుడి లక్షణా లను చెప్పినట్లయితే మరీ ఆశ్చర్య పడేవాడే! మా దేవుడి మీద అతడికి ఎలాటి ఈర్ష్యా,ద్వేషం కలక్కుండా ఉంటానికి ముందుగానే ఇలాచెప్పాం: "మా దేవుడికి ప్రపంచంలోని ఏ ఇతర దేవుడి తోటీ విరోధం లేదు. ఇతర దేవుళ్ళ రాజ్యాల్లో ప్రవేశించాలనీ మా దేవు డనుకోడు!" అని చెప్పాం.

పై మాటల్తోనే ఆ పూజారి తృప్తిపడివుంటాడు. అయినా ఊరు కోక ఇంకో విషయాన్ని గూడా స్పష్టం చేశాము. "మీ ప్రజలతో ఎలా స్నేహం చేయాలనుకుంటున్నామో, మీ దేవుడితోనూ అలాగే స్నేహ భావాన్ని కలిగి వుండాలని కోరుతున్నాం!" అన్నాము.

మొదటిరోజు సంభాషణతోనే మామీద కల అనేక అనుమానాలు నివృత్తమయినాయి. ఆ తరువాత మా ప్రవర్తనాకూడా అతడి సంశయాలను నిర్మూలం చేసింది. అప్పటి మా ప్రవర్తనా, మా మాటలు పూర్తి కృత్రిమమూ, అసత్యమూ అని ఒప్పుకోక తప్పదు. అయినా, అలా చేయక తప్పలేదు. పైగా మరో పనిగూడా చేశాము. ఆతడి శక్తి యుక్తులు మాకంటే గొప్పవని ఒప్పుకున్నాము. అతణ్ణి గొప్పగా పొగిడేశాం కూడాను. ఇందువల్ల కలిగిన ఒక లాభం ఏమంటే, ఎవరికయినా జ్వరం రావడమో, లేక దయ్యం పట్టడమో జరిగినప్పుడు, మేము బుర్రబద్దలు కొట్టుకోవలసిన అవసరం లేకుండా పోయింది. నేరుగా ఆ పురోహితుడి దగ్గరకు పంపించేవాళ్ళం! మరొక లాభం, మే మతణ్ణి పొగిడి తన వాళ్ళల్లో గొప్ప చేశాం గనుక అతడూ మమ్మల్ని పొగడ్డం తప్పని సరయింది. "వీళ్ళ దేవుడు చాలా మంచివాడు. వీళ్ళు మన మిత్రులు!" అని తన వాళ్ళతో అన్నాడు.

ఉత్సవం సమాప్తం కావచ్చింది. ఇంతవరకూ మాలో ఎలాంటి అసంతృప్తి కలుగలేదు. కానీ మేము ఏ ఆదర్శంతో ఈ మహా యాత్రను ప్రారంభించామో, ఆ ప్రధానాదర్శం ఛిన్నాభిన్న మయింది. గుర్తించలేకుండా మారిపోయింది. ఆదర్శం చెదిరింది.

ఆదర్శచ్యుతులమైన మేము, ఇప్పుడు ప్రపంచపు ఉత్తరపు కొసన వున్నాము. మన జ్యోతిశ్శాస్త్రం (ఖగోళశాస్త్రం) నిజమైనదయితే ఆర్యభట్టు (క్రీ. శ. 450) చెప్పినట్టు పృథ్వియొక్క వ్యాసం 1056 యోజనాలూ, పరిధి 8000 యోజనాలూ ఉన్నట్లయితే, ధృవ ప్రదేశం ఇక్కడికి ఏమంత దూరంలో వుండదు. 30 అక్షాంశాల దూరంలో వుండాలి; కానీ, ఆర్యభట్టు సిద్ధాంతంమీద నాకంతగా విశ్వాసం లేదు. అతడు ప్రత్యక్షంగా కనిపిస్తూన్న సూర్యభ్రమణాన్ని త్రోసిరాజని పృథ్వీభ్రమణానికి ప్రాధాన్యత నీయచూశాడు. కానీ, ఈ సిద్ధాంతాన్ని నే నెలా ఒప్పుకోగలను? అభిధర్మ కోశంలో భూమండలాన్ని గురించి తథాగతుడు చెప్పిన సూక్తులుకూడా ఆర్యభట్టు సిద్ధాంతానికి విరుద్ధంగా వున్నాయి. అతడి సిద్ధాంతం మనని ఒక్కొక్కప్పుడు తప్పుదారి పట్టిస్తుందని కూడా నే నంటాను! నావలో ప్రయాణం చేస్తూన్న వ్యక్తికి తీరాన

గల వస్తువులన్నీ పయిగెత్తుతున్నట్టూ, తన నావ స్థిరంగా వున్నట్టూ కనుపించడం సహజం! చెప్పవచ్చేదేమిటంటే, ఒక ప్రదేశాన్నుండి ధ్రువ నక్షత్రం ఎంత ఎత్తున వుంటుందో, ఆ ప్రదేశాన్నుండి ధ్రువ ప్రదేశం అంతే దూరాన వుంటుంది! ఈ సత్యాన్ని నేను ప్రత్యక్షంగా చూస్తున్నాను. సింహళ ద్వీపంలోని అనూరాధపురం భూమధ్య రేఖకు ఉత్తరంగా 8 అక్షాంశాల దూరం కంటే కూడా తక్కువలో వుంది. అక్కడినుండి చూస్తే ధ్రువనక్షత్రం క్షితిజానికి చాలా దగ్గరగా క్రిందకు వాలినట్టు కనుపించేది. ఉత్తరానికి వస్తూన్నకొద్దీ ధ్రువతార ఇంకా ఇంకా ఆకాశంలో పైకి పోవడాన్ని నేను స్పష్టంగా చూశాను.

ప్రపంచాన్ని చూసినకొద్దీ మానవుడి జ్ఞానం విస్తృతమౌతుంది. దాంతోపాటే అతడి జిజ్ఞాసకూడా పెరుగుతుంది. ఈ దేశాన్ని గురించి ఇక్కడి విచిత్రాల్నిగురించి నాదేశ ప్రజలకు చెబితే నమ్ముతారా? చక్రాల్లేని బండ్లు ఎక్కడైనా వుంటాయా? కానీ నేనిక్కడ చక్రాల్లేని బండ్లను చూశాను. చలికాలంలో చక్రాలున్న బండ్లకంటే కూడా ఈ బండ్లు వేగంగా మంచుమీద జారుతూ వెళ్ళిపోతుంటాయి. ఆరేసీ, ఎనిమిదేసీ కుక్కలు లాగే రథాలుంటాయని చెప్తే ఎవరు నమ్ముతారు? ఈదేశ ప్రజలు మూరేసి బారల పొడవుగల చెక్క చెప్పులు వేసుకుని పరుగు పందాల్లో పాల్గొంటూంటారు. వెన్నపూసలాంటి మృదువైన రోమాలుగల మృగ చర్మాలు ఇక్కడ దొరుకుతాయి. భారత దేశంలో ఆవుల్ని, బర్రెల్ని, మేపినట్టే, ఇక్కడ దుప్పుల మందల్ని మేపుతుంటారు. నేను చూళ్ళేదు గానీ, ఇంకొంచెం ఉత్తరానికిపోతే తెల్లని ఎలుగుబంట్లు వుంటాయని, సర్దార్ చెప్పాడు. ఈ సర్దారు ఇంకోటికూడా చెప్పాడు. "ఇక్కడికి మూణ్ణెల్ల ప్రయాణ దూరంలో ఉప్పునీటి సముద్రముంది. ఆ సముద్రపు నీరు సంవత్సరంలో తొమ్మిది నెల్లు గడ్డకట్టుకునే వుంటుంది. అక్కడ మూణ్ణెల్లకోమాటు సూర్యు డుదయిస్తూ వుంటాడు" అన్నాడు. సర్దారు మాటల్ని కాదవడానికి కానీ, నమ్మకపోవడానికి కానీ కారణం కనుపించ లేదు. నిజానికి మనం రోజూ నమ్ముతూండే అనేకమైన అనంభవ విషయాలకంటే ఇది ఎంతో సంభవం. ఒంటికాలు మానవులు నివసించే దేశాలున్నాయనీ, కొన్ని దేశాల ప్రజల చెవులు చాలా పెద్దవిగా

వుంటాయనీ, ఒక చెవును పక్కకు, మరొక చెవును కప్పుకోనూ ఉప యోగించుకో వచ్చుననీ చెప్పుకుంటారు. ఇక రాక్షసుల విచిత్ర వేషాలను. భయంకరమైన ఆకారాలను నమ్ముతూనేవున్నాము. ఇన్నిటిని నమ్ముతుం డగా, ఈ దేశపు విచిత్రాన్ని నమ్మక పోవడానికి కారణం కనుపించదు.

హిమ సముద్రాన్ని చూడటానికి ఉత్తర దేశానికి వెళ్ళాలన్న తలంపు నాకుంది. కానీ, ఈ వనవాసులు అన్నప్పుడల్లా ఉత్తర దేశానికి వెళ్తూండరు. వీళ్ళా దేశానికి వెళ్ళక పోవడానికి ప్రధానమైన కారణంఒక టుంది. ఇక్కడిలా అక్కడ అడవులుండవు. చాపలూ, చాపల్ని తిని బ్రతికే తెల్లని ఎలుగుబంట్లు మాత్రమే ఉంటాయి. చాపల్ని పట్టీ, ఎలు గుల్ని వేటాడీ బ్రతకవలసి ఉంటుంది అక్కడ. వీళ్ళ దుప్పుల మందలు బ్రతకడానికి అక్కడ ఏ విధమైన మేతా దొరుకదు. ఇన్ని కారణాలు ఉండడంవల్ల ఈ వనవాసులు ఉత్తరదేశానికి వెళ్ళరు. పరిస్థితుల నను సరించి మానవుడు తన జీవితాన్ని నిర్మించుకుంటూ వుంటాడు. ఇక్కడ దుప్పుల్ని పెంచడం తేలిక. వాటివల్ల లాభంకూడా అధికంగా వుంటుంది. కనుకనే ఇక్కడిప్రజలుబ్రతకడానికి ప్రధాన సాధనం దుప్పులయ్యాయి. ఉత్తర దేశంలో, అడవులుగానీ, వనస్పతిగానీ వుండదు. పసిరికమీద ఆధారపడే జంతువులేవీ అక్కడ బ్రతకలేవు. అలాంటి జంతువుల్ని పెంచడమూ సంభవం కాదక్కడ। అక్కడి మానవులు మత్స్యభుక్కులు। పైగా ఋతువుల్ననుసరించి నివాస స్థలాల్ని మారుస్తుంటారు. వాళ్ళే కాదు. పక్షులుకూడా చలికాలంలో తమ నివాసాల్ని దక్షిణానికి మారు స్తూంటాయి. ఉద్యాన వాసులమైన మేమూ, తోర్యుర్కులూ, చివరకు వన్య ప్రజలయిన వీళ్ళుకూడా వేసనిలో ఉత్తరానికి, చలికాలంలో దక్షి ణానికి తమ నివాసాల్ని మారుస్తుంటారు. వేసంగుల్లో వీళ్లు ఉత్తరంగా ప్రస్థానం సాగించినప్పుడు హిమ సముద్ర ప్రాంతపు మత్స్యభుక్కుల్ని చూడ్డానికి ఏ మాత్రం అవకాశం లభించినా జారవిడువము.

ఈ ఉత్సవం వర్షాకాలం సమాప్తమవబోయే ముందు జరుగుతూ వుంటుంది. ఇక్కడసలు వర్షాలు తక్కువగా కురుస్తుంటాయి. తక్కు వయిన వార హిమవృష్టి జరుగుతూంటుంది. మామూలు సమయాల్లోనూ ఎక్కువసేపు వర్షం కురిసిందంటే, నీటి వర్షం క్రమేణా హిమవర్షంగా

మారిపోతుంది. ఉత్సవం సమాప్తమయ్యాక దేరాల్ని పీక్కొని ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోతారు. ఎక్కడయినా, నాలుగు దేరాల్ని దించి కొద్ది సేపు కాలక్షేపం చేశారంటే, ఆ కాసేపటికి అదొక గ్రామంగా మారి పోతుంది.

సర్దారు మమ్మల్నెందుకు ఇక్కడికి తీసుకువచ్చాడు? ఎందుకింత సుఖంగా వుంచుతున్నాడు? అన్న ప్రశ్నలకు సరైన సమాధానం ఇంత వరకూ దొరకలేదు. మావిచిత్రమైన వేషం ఇతణ్ణి ఆకర్షించిందా? లేక పూజార్లూ, పురోహితులు అంటే ఇతడికి అమితమైన భక్తేమో? మమ్మల్ని పురోహితు లనుకున్నాడేమో? అన్నింటినీ మించి, సహజంగా ఇతడు మంచివాడేమో? క్రూరుడు కాదేమో? యథార్థమాలోచిస్తే, మాన వుడు సహజంగా క్రూరుడు కాదు. ఏవోకొన్ని ప్రత్యేకమైన పరిస్థితుల్లో కొందరికి శత్రువై, శత్రుత్వాన్ని అలవరుచుకుంటాడు. మాకూ, తోర్యుక్లకూ ఎలాంటి సంబంధమూ లేదని స్పష్టంగా తెలుస్తూనేవుంది. అలాం టప్పుడు ఇక మమ్మల్ని ఎందుకు చంపుతారు? చంపినందువల్ల ప్రయో జనం మాత్రం ఏముంటుంది? పోనీ, వీళ్ళు నరభక్షకులైతే ఆహారం కోసం చంపుతారేమో ననుకోవచ్చు. నరభక్షకులు కాదు. నరభక్షకులు వున్నారని వినటమేగాని మేము ఎక్కడా అలాంటివాళ్ళను చూడలేదు. ఏమైనాగానీ, ఎందుకైనాగానీ వీళ్ళు మమ్మల్ని తమ వెంట తీసుకువె ళ్తున్నారు. ఇన్ని రోజుల్లోనూ మామీద కల కుతూహలం క్రమంగా నశించసాగింది వీళ్ళల్లో. మాకంటే తమ పురోహితుడే మహిమాన్వితు డనీ, మేముకూడా అతడికి శిష్యుల్లా వ్యవహరిస్తున్నామనీ తెల్సు కున్నారు. సర్దారుకు మామీద ఓరకమైన ఉదాసీన భావన ఏర్పడ్డది. అయితే, పురోహితుడు మాపట్ల శ్రద్ధను కనబరుస్తున్నాడు. ఉత్సవం సమాప్తమై ఎవరి దారిన వాళ్ళు వెళ్ళేప్పుడు పురోహితుడు మమ్మల్ని తన వెంట రమ్మన్నాడు. ఈ పురోహితుడి కింద కొన్ని కుటుంబాలుం టాయి. ఇతడు తన అధీనంలోవున్న కుటుంబాలమీద మహారాజులాగానే అధికారాన్ని చలాయిస్తుంటాడు. ఇతడు ఎక్కడికయినా కదిలాడంటే ఇతడి అధీనంలో వున్న కుటుంబాలన్నీ కదుల్తాయి. ఓ పెద్ద గ్రామం కదిలి వస్తున్నట్టుగా వుంటుంది. వీళ్ళల్లో బానిసలుగానీ, నౌకర్లు గానీ

వుండరు. అందరూ సమానులే! కాకపోతే, సంపదలో వ్యత్యాసం మాత్రం వుంది. పురోహితుడికి సేవచేయడానికి సేవకులు వుంటారు. అయితే, వాళ్ళు సేవ చేసినంతసేపే సేవకులుగా భావించ బడతారు. మిగిలిన సమయాల్లో వాళ్ళూ అందర్లో కల్సిపోతారు.

ఒక రోజున 15 డేరాల మా చిన్న గ్రామం దక్షిణ దిశకు ప్రస్థానం సాగించింది. మా వెంట ఓ వెయ్యి దుప్పు లున్నాయి. మను షులు కూడా ఓ యాభై మంది దాకా వున్నారు ఒక గ్రామంలో కల ప్రజలందరూ ఒక తల్లి బిడ్డల్లా వుంటారు. రక్తసంబంధపు మమత్వం వీళ్ళల్లో చాలా అధికంగా వుంటుంది. ఇరుగు పొరుగు గ్రామాలతో (సమూహాలతో) స్పర్థలూ, కొట్లాటలూ సంభవిస్తుంటాయి. ఈ చిన్న చిన్న కొట్లాటలే మహాదారుణమైన రూపాన్ని ధరిస్తుంటాయి. ఘోర యుద్ధాలకు దారితీస్తాయి! తెగబడి నరుక్కుంటారు. దెబ్బకు దెబ్బ అన్నదే వీళ్ళ ప్రధాన సిద్ధాంతం! ఈ కొట్లాటలూ, ద్వేషాలూ తరతరాల వరకూ అలా సాగిపోతూంటాయి. ఇలాంటి ప్రత్యేక సమయాల్లో పురో హితుల విలువ మహా పెరిగిపోతుంది. వీళ్ళు దేవుడి పేరుమీద ఉభయ గ్రామాలనూ స్నేహసూత్రంలోనూ బంధించగలరు. లేదా మరికొంచం ఆజ్యంపోసి క్రోధానలాన్ని ప్రజ్వలింపనూ చేయగలరు. ఈవిధంగా తర తరాలుగా ద్వేషాలూ యుద్ధాలూ జరుగుతూ వస్తూన్నప్పుడు, ఏ ఒక్క గ్రామమూ తనవరకు తాను శత్రువుల్ని ఎదిరించగల నన్న ధైర్యంతో వుండలేదు కనుకనే ఉభయపక్షాలవారూ అవుసరమైతే తమ అన్య గ్రామ వాసు లకు సాయం చేయడానికి వీలైనంత దగ్గర్లో గ్రామాల్ని నిర్మించు కుంటూ ఉంటారు.

స్థానిక ప్రజల భాష రాకపోవడం పెద్దఇబ్బందిగానే తయారైంది మేమీ వనవాసుల్లోకి వచ్చి మూణ్ణెల్లకు పైన అవతోంది. కొత్త భాషలు నేర్చుకోవాలన్న ఉత్సాహం మాలో ఎంతగానో ఉంది. త్వరగా నేర్చు కోగలం కూడానూ! అయినప్పటికీ ఈ మూణ్ణెలల్లో మే మీ భాషను సంతృప్తికరంగా అభ్యసించకలేక పోయాము. చాలా కష్టంగా నిత్యావస రాల్ని గురించి మాట్లాడగలుగుతున్నాము. అన్య విషయాల్ని గురించి మాట్లాడే మాత్రపు భాషాజ్ఞానం మాకులేదు. ఈ పురోహితుడూ మాతో

మాట్లాడాలన్న ఆసక్తిని కనబరుస్తూంటేవాడు. వచ్చీరాని తొర్యుక్కు-పదాలతోటీ, సంజ్ఞలతోటీ ఏమిటో చెప్పాలని ప్రయత్నించేవాడు. కానీ, చెప్పలేక పోయేవాడు. ఒక రోజున నేను తాళపత్ర గ్రంథాన్నొకదాన్ని చదువుతున్నాను. నేనా తాళపత్రాలను చూసి చదివేది ఏమిటో తెల్సుకోగోరాడతడు. నేనూ ఆ గ్రంథాన్ని గురించి చెప్పడానికి సంసిద్ధుణ్ణయ్యాను. వీళ్ళ భాషకు లిపి లేదు. అయినా, చెట్లూ, నీరూ, దుప్పులూ- మొదలైన వాటి చిత్రాలను గీసి, తమ భావాన్ని ప్రకటించే ఆచారం ఉంది ఇక్కడ। వీళ్లు తమ చర్మపు దుస్తులమీద ఫల పుష్పాదుల చిత్రాలూ, మనుష్యులవి, ఇతర ప్రాణుల చిత్రాలూ చిత్రించుకుంటూ ఉంటారు. నేను నేలమీద వ్రాసి "ఇది క, ఇది ఖ" అని చెప్పడానికి ప్రయత్నించాను. అయితే, వీళ్ల దుస్తుల మీద చిత్రాలు ఆకృతికి సంబంధించిన సంకేతాలు ఉంటాయి. తాళపత్రాల్లోని ఈ సంస్కృతభాష, ఉచ్చారణకూ, ధ్వనికి సంబంధించింది. అప్పటికి నేను చీనీ లిపిని చూడలేదు. చీనీ గ్రంథం ఏదైనా నా దగ్గిర ఉన్నట్లయితే అతడికి విపులంగా వివరించి చెప్పడానికి వీలయ్యేది. నేను ఎంత ప్రయత్నపూర్వకంగా వివరించినా అతడికి అర్థంకాలేదు. కాకపోతే, తను చదువుతూన్నటువంటి మంత్రాల్నే నేనూ చదువుతున్నాననీ, మంత్రాల్ని మర్చిపోకుండా ఉండటానికి వీటిమీద ఏవో గుర్తులు వేసుకున్నాననీ అనుకున్నాడు. తాళ పత్రాల్ని చూసి, అవి ఒక రకమైన చర్మాలు గావును అనుకున్నాడు. ఇవి చర్మం కావనీ, చెట్ల ఆకులనీ నేను చెప్పలేను. అప్పటికే తల నొప్పి పుట్టుతోంది. ఇంకెక్కడ చెప్పను ? సాకార పదార్థాల్ని గురించి చెప్పడం, తెల్సుకోవడమూ సులువే। కానీ, భాషకు సంబంధించిన విషయాల్ని మాట్లాడుకునేప్పుడు కేవలమూ నిరాకారమూ భావబోధకమూ అయిన శబ్దాలుకూడా అనేకంవస్తుంటాయి. వాటిని గురించి చెప్పడం ఎలా ? పురోహితుడు చాలా తెలివి కలవాడు. పైగా ప్రస్తుతం మేము అతడి దయకు పాత్రులమై ఉన్నాము. అతడికి కోపాన్ని కలిగించడం మా కేమాత్రమూ క్షేమకరంకాదు. అతడు భార్యలనూ, పిల్లలనూ, ఇతర పరిజనాన్నీ కోపంతో కొట్టడాన్ని చూశాము. కోపం వస్తే మనిషి పిచ్చివాడయిపోతాడు. పెద్దాచినాన్న,

భార్యా బిడ్డలన్న ఆలోచన లేకుండా అందర్నీ తెగ బాదుతాడు! అతడి కోపానికి గురి అయ్యామా? మన్మల్నీ విడువడు! అయితే కోపం తగ్గాక చాలా పశ్చాత్తాపాన్ని పొందుతాడు. దెబ్బలు తిన్నవాళ్ళని సంతోషపెట్టడానికి ఎన్నో విధాల ప్రయత్నిస్తాడు.

ప్రస్తుతం మేము తిరుగుతూన్న భూమి, చెట్లూ చేమలతో, పచ్చని పసిరికతో కళకళ్ళాడుతూన్న పర్వత ప్రాంతం! పర్వతాలంటే, హిమాలయాల్ని గానీ, భారతదేశంలోని ఇతర పర్వతాల్నిగానీ జ్ఞప్తికి తెచ్చుకోరాదు. ఈ పర్వతాలు చాలా చిన్నవి. వీటిలో రాతికంటే ఎక్కువ భాగం మట్టే ఉంటుంది. ఈ చిన్ని చిన్ని కొండలపైన రకరకాలైన చెట్లూ చేమలూ ఉన్నాయి. మేము ఒక్కోచోటా పది లేక పన్నెండేసి రోజులు మజిలీ చేసుకుంటూ, ముందుకు వెళ్ళిపోతున్నాము. కొంత తూర్పుగానూ, కొంత దక్షిణంగానూ ప్రయాణం చేస్తున్నాము. మొత్తంగా చూస్తే మేము శీతసముద్రానికి దక్షిణంగా వెళ్ళిపోతున్నాము. అలా కొంతదూరం వెళ్ళాక, ఒక విశాలమైన నదిని సమీపించాము. వెనుక ఒకమాటు శీతసముద్రంలో కలిసే మహానది నొకదాన్ని చూశాము. యబగూ, అతని అనుచరులూ, మేమూ ఆ నదీ తీరాన చాలా దూరం నడిచాం కూడాను. ఇప్పుడు మేము చేరిన ఈ నది, ఆ వెనుకటి నదే ననిపించింది నాకు! త్స్యోర్కులు ఈ వన వాసులను ఇంతటితో వదలరని నాకు తెల్సు. వీళ్ళు ఏ సాధారణ అధికారికో ఎదురు తిరిగినట్టయితే, వాళ్ళంతగా పట్టించుకునే వాళ్ళు కాదేమో! కానీ, వీళ్ళు యబగూను చంపేశారు. ఇక వీళ్ళను త్స్యోర్కులు బ్రతకనిస్తారా?

మేము మహానది ఒడ్డుకు చేరుకున్నాము. మంచు అప్పుడప్పుడే అధిక మవుతోంది. క్రమంగా భూమి మంచుతో కప్పబడిపోతోంది. ఇక్కడ మూడువైపుల కొండలూ, ఒకవైపున ఈ మహానదీ వున్నాయి. మధ్యలో విస్తృతమైన మైదానం వుంది. మైదానంలోని పచ్చి గడ్డిని అప్పుడప్పుడే మంచు మింగేస్తోంది. అక్కడికి వెళ్ళగానే ఆడా మొగా అందరూ గడ్డినికోసి భద్రపరచ సాగారు. అవును మరి! చలికాలంలో పశువులకు మేతకావాలి! చలికాలంలో వేటఆడటం కష్టం: జంతువులు దొరకవు. మనుష్యుల ఆహారానికి కూడా ఇబ్బంది పడవలసి వస్తుంది.

మేత సరిగా అమరక పోవడంవల్ల దుప్పులు రోజురోజుకూ శుష్కించి పోతున్నాయి. ఒకనాడు ఓ పండ దుప్పుల్ని నరికేశారు. వాటి చర్మాల్ని విడిగా తీసారు. మాంసాన్ని చెట్లకు ఆరగట్టారు. వేటమీద జీవనం జరిగినంత వరకూ ఈ మాంసాన్ని ముట్టుకోరు. ఎప్పుడు వేట లభించకపోతే అప్పుడీ మాంసాన్ని కదిలిస్తారు. మా వెంట కొన్ని కుక్కలు కూడా వస్తున్నాయి. చలికాలంలో వాటికీ ఆహార సమస్య తటస్థమవుతుంది. ఈ వనవాసులు కుక్కల్తో అంతగా రథాల్ని ఈడ్పించరు. కానీ ఉత్తరదేశాన గల మత్స్య ధుకున్లు కుక్కల్తో రథాన్ని లాగిస్తారు. వాళ్ళ కసలు కుక్కలే సర్వస్వం।

ఇక్కడ చలి విపరీతంగా ఉంటోంది. ఇంతటి చలిని నేను మరెక్కడా చూళ్లేదు. మొదట్నుండీ చలికి అలవాటు పడిన వ్యక్తిని గనుక ఎలాగో నిభాయించుకున్నాను. కొత్తవాళ్ళు ఈ చలికి తట్టుకోలేరు. మనుష్యులు ఎలాంటి వాతావరణానికయినా చప్పున అలవాటు పడిపోతారు. ఇంతటి చలిపెట్టే యీ ప్రదేశంలో, ఈ చలిని తట్టుకోవడానికి తగిన అనువైన మెత్తని, వెచ్చని మృగచర్మాలు లభిస్తుంటాయి. మేము పురోహితుడికి ఏ విధంగానూ ఉపయోగపడడం లేదు. కాకపోతే అతడి మహిమల్ని గురించి ప్రజల్లో మరికొంచెం ప్రచారం చేస్తున్నాము. ఆ ప్రచారం మేము చేయకపోయినందువల్ల అతడికి వచ్చిన నష్టమూ ఏమీలేదు. పాపం, అతడు మాత్రం మా గురించి అన్నివిధాలా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. మా ఇద్దరికోసం చెరో చర్మపు ముసుగునూ తయారు చేయించాడు. ఈ చలిలో కళ్ళు. ముక్కు మినహా మరే అవయవాన్నీ బయటికి పెట్టలేము. సాధారణ దుస్తుల్తో ఈ చలిని తట్టుకోవడంకష్టం. కొండల మధ్య మరుగ్గావున్నప్రదేశం గనుక గానీ, లేకపోతే, ఈ చర్మపు ముసుగు ధరించినప్పటికి వణికిపోయేవాళ్ళం. మా కంటెకూడా వీళ్ళు చలికి అలవాటు పడ్డ ప్రాణులు. ఈ చలిలోకూడా కాళ్ళు చేతులను అనాచ్ఛాదితంగానే వుంచుకుంటారు. ఇంత కంటె కూడా విపరీతంగా మహా ప్రళయంగా, చలిపెట్టినప్పుడు గానీ వీళ్ళు నిండా ముసుగులు వేసుకోరు. చర్మపు ముసుగుల్ని వంటినిండాకప్పుకున్నప్పుడు, వీళ్ళు అచ్చం ఎలుగుబంట్లలా వుంటారు. వీళ్ళదుస్తుల్నిగురించి

అప్పుడప్పుడూ ఆలోచిస్తూండేవాణ్ని. ఈ మెచ్చని చర్మపు దుస్తుల్ని త్యోర్కులకుగానీ చీనాదేశీయులకు గానీ అమ్మితే బంగారంతో సమానంగా కొంటారు. కానీ, వీళ్ళదృష్టికి ఇవి అతి సామాన్యమైనవి. జీవితం చాలా విలువైంది. కనుకనే మానవులు ఎంతటి విలువనైనా మెచ్చించి జీవితాన్ని కాపాడుకోచూస్తారు. మాంసమే ప్రధాన ఆహారమైంది. నదిపైకి గడ్డ కట్టుకు పోయింది. కానీ, అంతర్గతంగా ఇంకా స్థిరు ప్రవహిస్తూనే ఉంది. పైన పేరుకున్న మంచుకు రంధ్రంపెట్టి అప్పుడప్పుడూ చేపల్ని పడుతూ ఉంటారు. శీతసముద్రపు వద్దనుండి బయల్దేరి వచ్చేటప్పుడు అక్కడ ప్రజలు పురోహితుడికి కొన్ని చేపల్ని ఇచ్చారు. అవి ఎండిపోయాయి. వాటినే ఇంతవరకూ వాడుతూ వచ్చాము. పురోహితుడు తను తినే ఆహారాన్నే మాకూ పెడుతున్నాడు. ఇక్కడి ఆహారంలో శాకాహారాన్ని గురించిన ప్రసక్తే ఉండదు. కాకపోతే, రుచి పరివర్తనకోసం అప్పుడప్పుడూ ఏవైనా పండ్లనూ దుంపలనూ తింటూండే వాళ్ళం.

"ఇక మీదట ఏం చేయడమూ" అన్న దాన్ని గురించి ఎలాంటి నిర్ణయాన్ని చేయలేని స్థితిలో ఉన్నాము. అసలు ఎటు పోతున్నామో, ఎటునుండి వచ్చామో కూడా తెలియని అయోమయ స్థితిలో పడ్డాము. కాకపోతే, ప్రపంచపు ఉత్తరపు కొనన ఉన్నామని మాత్రం తెల్సు ! మేమీ వనవాసుల్లోకి వచ్చి ఆరో నెల గడుస్తుంది. ఇన్నాళ్ళకి వీళ్ళ భాషను కొంచెం అర్థం చేసుకో గలుగుతున్నాము. ఈ మాత్రం భాషా జ్ఞానం కలగడంతో మాకెంతో ధైర్యం వచ్చింది. వెండి, బంగారు, రాగి, ఇనుము మొదలైన లోహాలతో చేయబడిన వస్తువుల ఉపయోగం వీళ్ళకూ తెలును, ఆ వస్తువుల్ని సంపాయించుకోడానికి బయటి ప్రపంచంతో సంబంధాన్ని పెట్టుకుంటారు. తమ దగ్గిర ఉన్న మృగ చర్మాల్ని, ఇతర వస్తువుల్ని దక్షిణ దేశవాసులైన త్యోర్కుల కిచ్చి, వారి దగ్గర నుండి తమ కవసరమైన పై వస్తువుల్ని తెచ్చుకుంటారు. ప్రతి సంవత్సరం ఇలా వస్తు మార్పిడి చేసుకోవడం కూడా ఈ వనవాసుల జీవితంలో ఓ ప్రధానమైన భాగం ! త్యోర్కుల్తో విరోధం కొని తెచ్చుకోవడం వల్ల ఈ రకమైన వస్తుమార్పిడికి ఆటంకం జనించింది.

పురోహితుడు కూడా తనవద్దకల మృగచర్మాలను కొన్నింటిని దక్షిణ దేశానికి పంపించి, అక్కడ నుండి తనకు కావలసినవస్తువుల్ని తెప్పించుకోవాలని చూస్తున్నాడు. అయితే, త్యోర్కులు తన వాళ్ళను ఎక్కడ చంపేస్తారో నని భయపడుతున్నాడు. అట్లాగని, తనుస్వయంగా వెళ్ళే ధైర్యమూ లేదతనికి. మేమీ కార్యాన్ని సాధించగల మనుకున్నాడు. త్యోర్కులం కాకపోయినా, ఆ భాష బాగా తెలిసిన వాళ్ళం. పైగాకూడ, గౌరవనీయులమైన అతిథులం. ఈ కార్యాన్ని నెరవేరిస్తే మేమే నెరవేర్చాలి! పురోహితు డొకనాడు మాతో ఈ విషయాన్ని ప్రస్తావించాడు. ఈ ప్రస్తావనను విని మేమెంతో సంతోషించాం! పైకి మా సంతోషాన్ని కనబడనీయకుండా, అతడు మాకు చేసిన మహోపకారానికి ప్రత్యుపకారాన్ని చేయడానికి మాత్రమే ఈ ప్రస్తావనను అంగీకరిస్తున్నట్టు నటించాము. చలికాలం గడవకముందే, కొందరు వనవాసుల్ని వెంటతీసుకుని, మృగ చర్మాల మార్పిడి కోసం దక్షిణాభిముఖంగా వెళ్ళవలసి వుంటుందని చెప్పింది.

ఈ ప్రదేశపు ప్రకృతి సౌందర్యం అత్యద్భుతంగా వుంది. ప్రకృతి సౌందర్యంలో దేశకాలగతమైన భేదాలు కనుపిస్తుంటాయి. చుట్టూవున్న పర్వతాలన్నీ మంచుతో కప్పబడి పోయాయి. నది తెల్లగా మంచుగడ్డలా వుంది. హిమాలయ పర్వతప్రాంతంలా దూరాల వరకూ దృష్టిని పోనీకుండా అడ్డుపడే పెద్ద పెద్ద పర్వతాలు లేక పోవడం, ఇక్కడి ప్రత్యేకత.

ఎలాగయితేనేం, చలికాలం గడిచింది. మధ్యాహ్న సమయాల్లో మంచు కరుగుతోంది. వసంత ఋతువు వచ్చేసూచనలు కనిపిస్తున్నాయి. నదిమీది మంచు కరుగుతూన్న సూచన లేమీ లేవు. మే మున్న ప్రదేశంలోని మంచుకూడా ఇంకా కరగడం మొదలు పెట్టలేదు. అయినా ఋతు పరివర్తన జరగనున్నదన్న విషయం స్పష్టం. ఒక రోజున పదిమంది అనుచరులతో పదిహేను దుప్పుల్తో పురోహితుడు మమ్మల్ని దక్షిణానికి పంపించివేశాడు. వెళ్ళేప్పుడు, వస్తువుల్ని తీసుకున్నాక, తన అనుచరులతోపాటు మమ్మల్ని తిరిగివచ్చేయమన్నాడు పురోహితుడు. అప్పటికి 'సరే' నన్నాము. తిరిగి రామని చెప్పే ధైర్యం మాకు లేదు.

ఔను మరి! ఎన్నిసార్లు మా ప్రయాణాన్ని వెనక్కి మరల్చలేదు? ఈ మాటూ ఏవో కొన్ని ఆటంకాలు సంభవించి తిరిగి వీళ్ళల్లోకి రావల్సి వస్తుందేమో ఎవరు చూశారు? దక్షిణంగా వెళ్ళిపోతూన్నాము. ముందుకు పోయిన కొలదీ చలితగ్గి ఉష్ణం అధికమౌతోంది. ఎనిమిది రోజుల అనంతరం మరో నదీతీరాన్ని సమీపించాము. ఇక్కడే మొట్టమొదటగా సూర్యోదయంతోపాటు, తెల్లని పడగండ్లంతేసి మంచుగడ్డలు నదీప్రవాహంలో కొట్టుకుపోవడాన్ని చూశాము. హేమంతం పీడ వదిలిపోతోందని తెలుసుకుని ఆనందపడ్డాము. మా వెంట వస్తూన్న వనవాసులు చాలా భయపడుతున్నారు. త్యోర్కుల చేతుల్లో పడితే తమనేం చేస్తారో వాళ్ళకు తెలుసు! బయల్దేరేప్పుడే పురోహితుడు అన్నీ చెప్పి పంపించాడు. ఎక్కడయినా త్యోర్కులు తారసిల్లితే తమ నిజమైన పరిచయాల్ని ఇవ్వవద్దని, "తూర్పుదేశాలకు చెందిన వాళ్ళమని" చెప్పమనీ మరీ మరీ చెప్పాడు. అయినప్పటికీ ఈ వనవాసులు భయపడుతూనే ఉన్నారు. రెండు వారాల తరువాత గమ్యాన్ని చేరాము. పదిహేడవ రోజున హిమ-విహీన ప్రదేశాన్ని చూశాము. అక్కడే మొట్టమొదటగా ఒంటెల్ని చూశాము వాటి సమీపంలో ఒక స్త్రీ నిలబడి ఉంది ఆమె తలవెంట్రుకల్ని రెండు కొప్పులు వచ్చేట్టుగా అలంకరించుకుంది. అవి చూడడానికి కొమ్ముల్లా ఉన్నాయి. ఆమె త్యోర్కు జాతికి చెందిందా? లేక ఆవార జాతికి చెందిందా? అన్న విషయాన్ని మేమే నిర్ణయించుకోలేకపోయాం. అసలు త్యోర్కుల్లో, అవారుల్లో భేదం కనిపెట్టడం చాలా కష్టం! శాంతిలుడు ఆమె దగ్గిరకు వెళ్ళి త్యోర్కుభాషలో పలుకరించి, మాట్లాడాడు. ఆమె ఆవార స్త్రీ అని తెల్సింది కానీ, అవార స్త్రీనని ఒప్పుకోలేదు ఆమె! తిరుగుబోతులు పరిపాలనతోపాటు జాతినీ, పేర్లను కూడా మార్చేసుకుంటారు.

ఆమెతో మనసారా త్యోర్కు భాషలో మాట్లాడుతూ ఉంటే, ప్రాణాలు లేచివచ్చినట్టుగా ఉంది మాకు. మాట్లాడే అవకాశం దొరక్కపోతే మానవుడి బుద్ధి కుంఠిత మౌతుంది. ఇంకో రెండు సంవత్సరాలు వనవాసుల్లో ఉన్నట్లయితే మా బుద్ధీ, మా జ్ఞానమూ తిరోముఖం పట్టేవి గావును. మేము పుట్టి పెరిగిన సమాజం ఈ వనవాసులకంటే త్యోర్కు

లకు సమీపంలో ఉంది. అందుకే త్యోర్క్ స్త్రీతో మాట్లాడుతూ ఉండే నా దేశీయులతో మాట్లాడుతూన్న అభిప్రాయం అనుభూతికి వచ్చింది. అప్పుడే మా గురించి ఆమెను ఏమీ చెప్పవలసుకోలేదు మేము. ఎండ చిటపటలాడుతోంది. మెడ దగ్గిర ఉన్న తామ్రవర్ణపు చీవరం చర్మపు ముసుగులోనుండి మెరుస్తూ కనుపిస్తోంది. ఆమె కాసేపు తీక్షణంగా చీవరం వంక చూసింది. "మీరు భిక్షువులా?" అనడిగింది. అబద్ధం చెప్పవలసిన అవసరం కనుపించలేదు. అవునన్నట్లు తల వూగించాము. నెత్తిన ఉన్న టోపీలు తీసి నున్నని తలల్ని చూపించాము. ఆమె భక్తి భావనతో అభివాదం చేసింది. దూరంగా దూరున్ని ఉన్న కొడుకును పిలుచుకుని, మమ్మల్ని వెంట పెట్టుకుని, తమ డేరాలవైపు నడిచింది. ఒక చిన్న కొండను దాటాక చిరపరిచితమైన తెల్లని ఉన్ని డేరాలు కొన్ని కనుపించాయి. అవే తమ డేరాలని చెప్పింది ఆమె. శాంతిభద్రుడు మాకు అవసరమైన విషయాలెన్నింటినో ఆమెనుండి తెల్సుకోవాలను కుంటున్నాడు. ఆమెకూడా ధారాళంగా మాట్లాడేస్తోంది. ఆమె ఎంతో మంది బౌద్ధ భిక్షువుల్ని చూసింది. తన వాళ్ళందరూ బుద్ధ భక్తులేనని చెప్పింది. అక్కడికి రెండురోజుల ప్రయాణ దూరంలో సంఘారామం ఉందనీ, అక్కడే సంతగూడా జరుగుతూ ఉంటుందనీ చెప్పింది. సంఘారామానికి చీనీ వ్యాపారులు కూడా వస్తూంటారట. ఆమె చీనీ భిక్షువులనుకూడా చూసిందట। మా వరకు మాకు స్వదేశానికి వచ్చినట్టుగా వుంది.

ఆమెతో మాట్లాడుతూ డేరాల దగ్గిరకు వచ్చాము. త్యోర్క్‌ల్ని కలుసుకున్నందుకు మేము మహదానందాన్ని పొందుతున్నాము. అయితే, మా సహచరులైన వనవాసులకు మాత్రం ప్రాణాలు అరచేతుల్లో వున్నాయి. కాకపోతే త్యోర్క్ స్త్రీ మాపై ఆత్మీయతనూ, భక్తి భావననూ ప్రదర్శించడాన్ని చూసి కొంత ధైర్యాన్ని తెచ్చుకుంటున్నారు. మేము డేరాలను సమీపించకముందే చర్మపు ముసుగుల్ని తీసి దుప్పటపైన పడేశాము. దూరాన్నుండి భిక్షువులు వస్తూండడాన్ని చూసిన డేరాల దగ్గరనున్న స్త్రీ పురుషులు లేచి నిలబడి స్వాగతం ఈయడానికి సిద్ధంగా వున్నారు. త్యోర్క్ స్త్రీ మాకంటే ముందే గబగబా డేరాల దగ్గిరకు వెళ్ళింది "వీరు జంబూ ద్వీపపు భిక్షువులు. శీత సముద్రాన్ని

చూశారుట. ఉత్తర దేశాన గల వనవాసుల్లో పర్యటించి వస్తున్నారుట" అని చెప్పింది.

మేము వెళ్ళగానే స్త్రీ పురుషులందరూ భక్తి భావనతో వంగి నేలను స్పృశించి నమస్కరించారు. మేము కూర్చోవడానికి ఆసనాల్ని వేశారు. త్రాగడానికి చమరీ పాలను తెచ్చి ఇచ్చారు. మా వెంట ఉన్న వనవాసుల్ని గురించి పరిచయా న్నిచ్చేప్పుడు పురోహితుడు చెప్పిన విషయాల్ని జ్ఞాపకం వుంచుకున్నాము. యబగూకూ, వనవాసులకూ జరిగిన యుద్ధం తాలూకు వివరాలేవీ వీళ్ళకు అంతగా తెలియవు. యబగూను వనవాసులు కొద్ది రోజులు తమ వద్ద వుంచుకుని, సగౌరవంగా పంపించి వేశారనీ. యబగూకూడా వనవాసులను క్షమించి వేశాడనీ తెలుసుకున్నాము. ఈ విషయాన్ని మా సహచరులకు చెప్పాము. వాళ్ళ ఆనందానికి మేరలేదు.

అక్కడక్కడా ఎదురుగా మాత్రమే మంచు కనుపిస్తోంది పచ్చని పసిరిక నలువైపులా కనుపిస్తోంది. త్సోర్కు గృహస్థు అంత త్వరగా మమ్మల్ని పోనిచ్చేట్టులేడు. కనీసం ఒక వారమైనా వుండిపోవలసిందని బలవంతం చేస్తున్నాడు., కానీ మా అనుచరుల్ని త్వరగా వెనక్కి పంపించేయడం ముఖ్యం। వీళ్ళు తిరిగి స్వస్థానాన్ని చేరేవరకూ పురోహితుడి కక్కడా మనశ్శాంతి వుండదు. మేమా రోజు మధ్యాహ్నం అక్కడికి చేరాం. గృహస్థు బలవంతం వల్ల మర్నాడల్లా అక్కడే విశ్రాంతి తీసుకున్నాము. మర్నాడు గృహస్థు కోర్కెపై మధ్యాహ్నం శాంతిలుడు పరిత్రాణ సూత్రాన్ని పఠించాడు. నేను బుద్ధుడి జీవితాన్ని గురించి ఉపన్యసించాను.

త్సోర్కుల దగ్గర సెలవు పుచ్చుకుని సంఘారామానికి బయల్దేరాము. అక్కడే సంత జరుగుతుంది. వనవాసులకు అవసరమైన వస్తువుల్ని తీసుకోడానికి వీలుంటుంది. త్సోర్కు స్త్రీ భర్త, పినతండ్రి మాతో పాటు సంఘారామం వరకూ రావడానికి సిద్ధపడ్డారు. వాళ్ళకూ సంఘారామంలో ఏదో పనుందిట. తమ పనిని చూసుకున్నట్టూ వుంటుంది. మాకు సేవ చేసినట్టూ వుంటుందని బయల్దేరారు. ప్రకృతి అతి రమణీయంగావుంది. ఎటు చూసినా మనోహరమైన దృశ్యాలు మనస్సుల్ని

పులకింప చేస్తున్నాయి. రెండు రోజుల అనంతరం నదీ తీరానగల ఒక గ్రామాన్ని చేరాము.

నదీ తీరానగల సమతల ప్రదేశంలో వందల సంఖ్యలో డేరాలున్నాయి. ఉత్తర దేశాన్నుంచి మాకంటే ముందే వచ్చిన చాలా మంది వనవాసులు తమ పశువుల్ని (మిప్పుల్ని) వెంట పెట్టుకుని, చర్మపు డేరాల్లో సిద్ధంగా వున్నారు. మా వెంట ఉన్న వనవాసుల్ని కూడా అక్కడే ఉంచి, మే ముద్దరమూ సంఘారామం వైపు బయల్దేరాము.

సంఘారామం మట్టితో నిర్మించబడిన ఓ అందమైన విహారం. విహారంలోని చిత్రాలూ, శిల్పాలూ కళా సమన్వితంగా ఉన్నాయి. విహార నిర్మాణం భారత దేశపు విహారాల్ని పోలివుంది. ఇక్కడ చలికాలంలో యాభై మందిదాకా భిక్షువు లుంటారు. వసంతాగమనంతోపాటు ఈ భిక్షువులు స్థానికులైన తిరుగుబోతు ఉపాసకుల్తో వివిధ ప్రదేశాలకూ వెళ్ళిపోతూంటారు. మేము వెళ్ళేనాటికి సంఘారామంలో పదిహేనుమంది మాత్రమే భిక్షువులున్నారు. మేము లోపలికి అడుగుపెట్టగానే వయస్కుడైన భిక్షువు ఒకడు చిరునవ్వు నవ్వుతూ మాకు ఎదురు వచ్చాడు. అతడితో ఏ భాషతో మాట్లాడదమా? అని రెండు క్షణాలు ఆలోచించాము. ఇంతలో అతడు తో్యార్కు భాషలో నా వయస్సును (భిక్షు దీక్షను పొందిన వయస్సు) అడిగాడు. పందొమ్మిది సంవత్సరాలని చెప్పాను. వెంటనే మోకాళ్ళమీద కూర్చుని నా కాళ్ళకు నమస్కరించాడు. తన వయస్సు పదిహేను సంవత్సరాలని చెప్పాడు. శాంతిలుడి నమస్కారాల్ని స్వీకరించాడు. తను చీనా దేశపు భిక్షువునని చెప్పుకున్నాడు. మా జన్మస్థానాల్ని గురించి ప్రశ్నించాడు. నేను జంబూ ద్వీపపు భిక్షువుననీ, శాంతిలుడు కుమార జీవుడి మాతృభూమి అయిన కూచా దేశపుభిక్షువు అనీ చెప్పాను. చీనా దేశంలో జంబూ ద్వీపపు భిక్షువుల్ని, కూచా దేశపు భిక్షువుల్ని చూడగలగడం సంభవమే। కానీ ఈ ప్రదేశంలో పై దేశాల భిక్షువుల్ని చూడగలగడం పూర్తి అసంభవం। బహుశా, ఆ సంఘారామానికి వెళ్ళిన ప్రప్రథమ భారతీయుణ్ణి నేనే నేమో। అక్కడున్న భిక్షువు లందరికంటె వయస్సులో నేను పెద్ద

వాణ్ని. ఆ ఆరామ స్థవిరుడుకూడా నా కంటె చిన్నవాడే; పైగా, బుద్ధుని జన్మభూమైన జంబూ ద్వీపవాసిని; నన్ను చూడగానే. స్థవిరులతో సహ భిక్షువులందరూ లేచి నిలబడి ఘనస్వాగతా న్నిచ్చారు. సాయం సమయమది. భోజనంచేయడానికి వీల్లేదు. మధురసాన్ని త్రాగడానికి ఇచ్చారు. మేము నేరుగా దక్షిణ దేశాన్నుండి రాలేదిక్కడికి; చుట్టు తిరిగి, ఉత్తరంగా, సుదూరానగల వనవాసుల్లోనుంచి వచ్చాము. కనుక మానుండి స్థానిక భిక్షువులు తెల్సుకోవల్సిన విషయాలు ఎన్నోవున్నాయి.

# 17 వ అధ్యాయం

# చీనా దేశం వైపు

(క్రీ. శ. 557)

దేశాలు తిరగడం అలవాటులేని మనిషికి—ఎంత తిరిగేవాడైనా అన్నిచోట్లకూ వెళ్ళలేడుగదా!—నాలుగడుగుల అవతలి ప్రపంచం అంధకార సదృశంగా వుంటుంది. కానీ, మానవుడు తిరిగినకొలదీ, వివిధ దేశాల్ని గురించి విన్నకొలదీ అంధకారం అదృశ్య మౌతుంది. జ్ఞానమనే ప్రకాశవంతమైన వెలుగు వెల్లి విరుస్తుంది. నేను ఈ విశాలమైన పృథ్వీస్థలిలోని అనేక దేశాల్ని చూశాను. అనంతమార్గాల్ని పర్యటించాను. కానీ, శీత సముద్రానికి దక్షిణానగల ఈ సస్యశ్యామలమైన భూమి, ఈ పర్వతాలూ, ఈ నదీ – వీటికి అవతలగల సమస్త ప్రపంచాన్ని గురించిన పరిచయాన్ని చీనీ భిక్షువు బోధిసంఘుడి వలననే పొందగలిగానని చెప్పక తప్పదు అతడివలన చీనా దేశానికి సంబంధించిన అనేక విషయాలు తెలుసుకున్నాను. అదో విశాలమైన ప్రాచీన దేశం! సభ్యత సంస్కృతీ, విద్యా ప్రేమగల దేశం! ఆ దేశంలో బౌద్ధ మతం రాజ సన్మానాన్ని పొందుతోంది. భారతీయ బౌద్ధభిక్షువులెందరో ఆ దేశంలో వున్నారు. చీనా దేశం వెళ్ళడానికి మార్గాన్నికూడా చెప్పాడు బోధి సంఘుడు. మార్గం కష్ట సాధ్యమైంది. దాదాపు రెండు వందల యోజనాల దూరం ఘోరమైన ఎడారిగుండా ప్రయాణం చెయ్యాలి! "సంఘారామం నుండి చీనా దేశాన్నిచేరడానికి ఒక నెల రోజులు పడుతుంది" అని కూడా బోధిసంఘుడు చెప్పాడు. ఇక్కడి నుండి చీనా దేశం వెళ్ళడానికి మార్గం వుందని అతడు చెప్పాక

చెదిరిన మా ఆదర్శాలేవో తిరిగి గూడు కట్టుకున్నట్టయింది. వన వాసుల్లోకి పోయాక మా ఘనమైన ఆశయం ఖండితమైంది. కాక పోతే, వనవాసుల చేతుల్లో నుంచి తప్పించుకోగలిగినా, త్యోర్కు ల్లోనో ఆవారుల్లోనో వుంటూ జీవితాన్ని గడపవలసి వుంటుందనుకున్నాను. త్యోర్కు భూమిలో జీవితాన్ని గడపడానికి కొంతవరకూ తయారు కూడా అయ్యాము. "అభిధర్మకోశం" లోని అనేక పదాలకు త్యోర్కు భాషలో నూతన పదాలను నిర్మించాము. కాని, బోధిసంఘుడి పరిచయం అయ్యాక ఇంకా కూడా ముందుకు సాగించాలని నిశ్చయించుకున్నాను.

సంఘారామపు స్థవిరులూ, ఇతర భిక్షువులూ మాపై అపారమైన స్నేహ వాత్సల్యాలను ప్రదర్శిస్తున్నారు. మమ్మల్ని ఎంతో ఆదరణతో చూస్తున్నారు. అంత త్వరగా మాకు వీడ్కోలు తీయడం వాళ్ళల్లో ఎవరికీ ఇష్టంలేదు. మాకూ అక్కణ్నుంచి అంత తొందరగా వెళ్ళాలని లేదు. వర్షావాసం త్వరలో ప్రారంభం కానుంది. వర్షాకాలపు మూడు నాలుగు నెల్లూ ఎటూ సార్థవాహులు దొరకరు. ఈ సమయాన్ని సంఘారామం లోని భిక్షువుల విద్యాధ్యయనాల్లో సహకరించడానికి వినియోగించదలి చాను. ఆ మూడునెల్లూ మే మిద్దరమూ, మాకు సాధ్యమైనంతవరకూ అక్కడి భిక్షువుల్ని విద్యావంతుల్ని చేయడానికి ప్రయత్నించాము. అప్పటికి త్యోర్కు భాషలో ధార్మిక గ్రంథాలు లేవనేచెప్పాలి. అభిధర్మ కోశంలోని మరికొన్ని సూత్రాల్ని శాంతిలుడి సాయంతో, త్యోర్కు భాషలోకి అనువాదం చేశాను. "ప్రతి మోక్ష సూత్రం" (భిక్షువులూ, భిక్షుణిలూ అనుసరించవలసిన నియమాలు) మొదటే అనువాదం అయి ఉంది. అయితే, అనువాదం అంత ఉత్తమంగా లేదు. ఆ అనువాదాన్ని పరిష్కరించాము.

ఇక్కడో నది (తోలా) ఉంది. ఈ నదీజలం వెనుక మేము చూసివచ్చిన మహానదికి (సేలింగా) ఉపశాఖ అయిన ఓఖోన్ నదిలో కలుస్తుంది. అంటే, వర్షాకాలంలో ఈ ప్రాంతంలో కురిసే నీరంతా శీత సముద్రంలో పడుతుందన్న మాట! ఈ లెక్కన ఆ ప్రదేశం శీత సముద్రానికంటే (సముద్ర తలానికి) నాలుగువేల అడుగుల ఎత్తు ఉంది. సామాన్య నియమ ప్రకారం ఇంత ఎత్తునవున్న ప్రదేశంలో చలిమిక్కు

టంగా ఉండాలి; కానీ, ఈ ప్రదేశం దక్షిణాన ఉండడం వలననే, శీత సముద్రంకంటే తక్కువ చలి వేస్తోంది. ఈ ప్రదేశమంతట్లోనూ చిన్న చిన్న పర్వతాలున్నాయి. ఇక్కడి చమరీ మృగాలను-ఒంటెలనూ ఎక్కువగా పెంచుతూంటారు. ఇక్కడా కుక్కలున్నాయి. అయితే వాటితో రథాలు లాగించరు. వీళ్ల వేషభాషలు యబిగూ సహచరుల్ని పోలి వున్నాయి. ఈ తిరుగుబోతుల్లో ఒక ప్రత్యేకమైన ప్రవర్తన మనల్ని ఎంతగానో ఆశ్చర్యపరుస్తుంది. వీళ్లు కానవుల్ని అనుసరించి తమ జాతినే మార్చేసుకుంటూ వుంటారు. పదేళ్ళ క్రితం వీళ్ళందరూ ఆవాములు. కానీ, ఇప్పుడు తోయర్కులమని చెప్పుకుంటున్నారు.

వర్షాకాలం ప్రారంభమైంది. మగధ, కాశీ, కోసల ప్రాంతాల్లో కురిసినట్లు అధిక వర్షాలు ఇక్కడ కురవవు. కనీసం ఉద్యాన భూమిలో కురిసిన వర్షాలుకూడా ఇక్కడ కురవవు. అయితే, కాంస్య దేశంకంటే ఫరవాలేదు. అప్పుడప్పుడూ ఉరుములు, మెరుపుల్తో వస్తూండే వర్షాలను చూస్తోంటే భారత దేశం జ్ఞప్తికి వస్తోంది. కానీ, భారతదేశాన్ని తలపుకు తెచ్చే గొప్పవర్షాలు ఒకటి రెండు సార్లు మించి పడలేదు. కొండలమీద కురిసిన ఆ మాత్రపు వర్షానికి స్థానిక నది పొంగి పొర్లింది. పరవళ్లు తొక్కుతూ శీత సముద్రం వైపుకు పరుగిడింది. నదీ మార్గానికి అడ్డొచ్చిన చెట్లూ చేమలు కూడా కొట్టుకుపోయాయి. సర్వత్రా పచ్చని పసిరిక పట్టులా పరుచుకుంది.

రోజూ ఉదయం, సాయంత్రం కొన్ని ఘడియల పాటు స్థానిక భిక్షువుల్ని చదివించడం మా పని। అప్పుడప్పుడూ ప్రశ్నోత్తరాలద్వారా భిక్షువుల జిజ్ఞాసకు పరితృప్తి కలిగిస్తూండేవాళ్ళం. ప్రశ్నోత్తరాల సమయంలో తరచుగా భారతదేశాన్ని గురించి చెప్తూండడం జరిగేది. ఈ దేశం పసిరికతో కళకళ్ళాడుతూంటుంది. ఇక్కడి భిక్షువులు సస్య సమృద్ధ భారతదేశాన్ని ఊహించగలరు. పచ్చని పసిరికతో,వనస్పతితో భారతదేశం అతి మనోహరంగా ఉంటుందని చెబితే, తేలికగా అర్థం చేసుకుని, అనుభూతికి తెచ్చుకుంటారు. భారత దేశంపట్ల వీళ్ళకో పూజ్యమైన, పవిత్రమైన భావన వుంది. కనుకనే, అతి ప్రాచీనమైన ఈ

హూణుల దేశం కంటె కూడా భారతదేశం సుందరంగా ఉంటుందని ఒప్పుకుంటారు. నేను భారతదేశం యొక్క గొప్పతనాన్ని, ఆధిక్యతల్నే కాకుండా, అక్కడి విపరీతమైన ఎండల్ని గురించి, పాముల్ని గురించి, తేళ్ళను గురించి కూడా చెప్తూండేవాణ్ని. భారత దేశపు అడవుల్లో ఏనుగులూ, సింహాలూ, ఖడ్గమృగాలూ, బర్రెలూ ఉంటాయని కూడా చెప్పేవాణ్ణి. అయితే, ఇక్కడి భిక్షువుల్లో ఒకరిద్దరు మాత్రమే పై జంతువుల చిత్రాలను చూసి ఉంటారు. మిగిలిన వారు వాటి ఆకారాలను ఊహించనుకూడా లేరు. ఈ సమయంలో బుద్ధిలుడే గనుక ఉన్నట్లయితే చిత్రాలు గీసి. సింహం ఎలా ఉండేదో, ఏనుగు ఎలా ఉండేదో, చూపించేవాడు. చిత్రకళను అభ్యసించ నందుకు నేను నిజంగా విచారపడుతున్నాను.

సంఘారామ స్థవిరుడు ఆవార రాజ వంశానికి చెందినవాడు. అతడికి నలభై ఏళ్ళుంటాయి. కాంస్య దేశంలో కొన్ని సంవత్సరాలున్నాడు. కూచీ భాషను అభ్యసించాడు. అక్కడే సంస్కృతాన్ని కొంచెంగా అభ్యసించాడు. తన ఆరామంలోకూడా భారతదేశపు ఆచారాలను పాటించాలన్న కాంక్షగలవాడు. అతడి ఆశయ పూర్తికి నేనూ నా శక్తికొలది సహకరిస్తున్నాను. బుద్ధిలుడూ నేనూ కాంచిన మహత్ స్వప్నాన్ని చరితార్థం చేయాలన్న నా తలంపు అలాగే ఉంది. కానీ, సంఘారామపు సోదర భిక్షువులు తమ ప్రేమ పాశంలో నన్ను బంధించి వేశారు. నేను అక్కడినుండి వెళ్ళడం వారికి ఏవిధంగానూ సమ్మతంకాదు. వాళ్ళ మనసుల్ని నొప్పించి బలవంతంగా వెళ్ళిపోవడం నాకూ ఇష్టంలేదు. ఇలాంటి స్థితిలో ఒకే ఒక మార్గం ఉంది. మా ఇద్దరిలో ఎవరో ఒకరు ఇక్కడ ఉండి పోవాలి. నన్ను విడిచి అక్కడ ఉండడం శాంతిలుడికి ఏమాత్రం ఇష్టంలేదు. అయినా, అతణ్నే అక్కడ ఉండమన్నాను. "చీనా దేశం ఒక్క నెల రోజుల ప్రయాణ దూరంలో ఉంది. ప్రతి సంవత్సరం ఎంతో మంది సార్థవాహులు ఇక్కడినుండి చీనాదేశం వెళ్తూ ఉంటారాయె! నువ్వు ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడే రావచ్చు" అని శాంతిలుడితో అన్నాను. నేను చీనాదేశం వెళ్ళడం నిశ్చయమైంది. శాంతిలుడు సంఘారామంలో ఉండిపోవడానికి

ఒప్పుకున్నాను. అతడి సాహచర్యంలో మూడు సంవత్సరాలు గడిచాయి. ఈ మూడేళ్ళు అవిశ్రాంతంగా యాత్రలు చేస్తూనే వున్నాము. అయినా; ఆతడి విద్యాభ్యాసానికి ఎలాంటి ఆటంకమూ జరగలేదు. మంచి బుద్ధి కుశలత కలవాడు. దానికి తోడు శ్రమించి చదువుతాడు. ఈ మూడేళ్ళలోనూ సంస్కృత భాషను బాగా అభ్యసించాడు. 'అభిధర్మ కోశం', 'న్యాయం ముఖం', 'ప్రమాణసముచ్చయం' లాంటి ఉత్కృష్ట గ్రంథాలను పఠించాడు. మూల గ్రంథాల కొరత బాగా వుండేది. అయితే, నేను ఎన్నో గ్రంథాలను వెనకే కంఠస్థం చేసి వున్నాను. వాటన్నిటినీ శాంతిలుడి కొరకు భూర్జ పత్రాలమీద వ్రాశాను. అనేకమైన సూత్రాలకూ, శ్లోకాలకూ, భావ విపులీకరణ చేశాను. అన్నింటినీ మించి సూత్రాలను కంఠస్థ పెట్టడంలో శాంతిలుడు ఎవరికీ తగ్గడు. ఈ కొద్ది రోజుల్లోనే నావద్ద నేర్వగలిగినంత విద్యను నేర్చాడు శాంతిలుడు.

* * * *

మహా ప్రవారణోత్సవం (ఆశ్వయుజ పౌర్ణమి) వచ్చింది. వేల సంఖ్యలో త్యోక్యుఖ్ ఉపాసికలూ, ఉపాసకులు ఉత్సవానికి వచ్చారు. సంఘారామం చుట్టూ డేరాల్ని వేసుకున్నారు. ఈ మహోత్సవాన్ని అనేక అనేక దేశాల్లో చూశాము. ఏ దేశానికీ, ఎవరికీ తీసిపోని మహోత్సాహంతో త్యోక్యుఖ్ లీ ఉత్సవంలో పాల్గొన్నారు. సాధారణ ప్రజలే కాకుండా త్యోక్యుఖ్ బేగ్ లూ, రాజకుమారులు కూడా ఉత్సవంలో పాల్గొనటానికి వచ్చారు. ఈ ఉత్సవానికి కూచీ దంపతులు కూడా ఇద్దరు వచ్చారు. ఎర్రని రాగిజుట్టు, నల్లని కండ్లూ కలిగి, తమ జాతీయ దుస్తుల్లో ఉన్న కూచీ దంపతులను చూసి శాంతిలుడు పరమానంద భరితుడయ్యాడు.

ఉత్సవం సమాప్తమయింది. క్రొత్తగా పరిచయులైన మిత్రులేకాక, పరమ ఆత్మీయుడైన శాంతిలుణ్ణికూడా విడిచి వెళ్ళవలసిన సమయం ఆసన్నమయింది. శాంతిలుడూ కన్నీళ్ళను ఆపుకోలేకపోయాడు. నేనూ ఆపుకోలేక పోయాను.

* * *

త్యోర్కు సార్థవాహులు కొందరు చీనా దేశానికి వెళుతున్నారు. వాళ్ళు తమవెంట నన్ను తీసుకు వెడతామన్నారు. అయితే, చీనా సార్థవాహుల్తో కల్సి ప్రయాణం చేయాలని నా ఉద్దేశం. అలా చేయడం వలన ఆ దేశానికి సంబంధించిన అనేక విషయాలను ముందే తెల్సుకోవడానికి అవకాశం లభిస్తుంది. బోధిసంఘుడు (బోసంగ్) కూడా నా అభిప్రాయంతో ఏకీభవించాడు. చీనీ సారవాహు డొకడితో మాట్లాడి ప్రయాణాన్ని ఖాయపరిచాడు. వనవాసుల దేశంలో దొరికే కృష్ణా జినాలకు చీనా దేశంలో మంచి గిరాకీ ఉంటుంది. ఇవి రాజ పరివారాల్లో బంగారం కంటె విలువగా అమ్ముడవుతాయి. కనుకనే, ఈ మృగ చర్మాలను కొనుక్కు వెళ్లడానికి చీనీ సార్థవాహులు సంఘారామానికి వస్తూంటారు. అక్కడికి వచ్చిన చీనీ సార్థవాహుల్లో, నన్ను తీసుకు వెడుతూన్న సార్థవాహుడు అందరికంటె ధనికుడు. చీనాదేశపు రాజధాని అయిన 'ఏహో' నగర నివాసి. బౌద్ధమతావలంబి కావడం వలన నన్నెంతో ఆదరించాడు. ఏలోటూ జరక్కుండా చీనాదేశం తీసుకువెడతా నన్నాడు.

ఒకనాటి మధ్యాహ్నానంతరం, భోజనాలయ్యాక ప్రస్థానాన్ని సాగించాము. పసిరికతో కళకళ్ళాడుతూన్న చిన్న చిన్న కొండల్నీ, అడవుల్నీ దాటుతూ వెళ్ళిపోయాము. రెండు రోజుల తరువాత అరణ్యం ఆఖరయింది. చిన్న చిన్న కొండలు మాత్రం మరికొంత దూరం వరకూ తగిలాయి. కొద్ది రోజుల తరువాత ఒక పెద్ద పర్వతాన్ని (దోగ్దావులా) దాటాము. ఆ పర్వతానికి అవతల అనంత దూరాల వరకూ వ్యాపించిన ఎడారి నోరు తెరచుకునివుంది. ఇప్పటికి మేము రెండు వందల క్రోసుల దాకా ప్రయాణం చేశాము. ఎడారిలో కనీసం ఎనిమిది వందల క్రోసుల దూరమయినా ప్రయాణం చేయాల్సి వుంటుంది. ఈ భూమి సమతలంగా లేదు. అక్కడక్కడగా చిన్ని చిన్ని గుట్టలు కనుపిస్తున్నాయి- కొన్ని చోట్ల పల్లపు ప్రదేశాలు కూడా వున్నాయి. వర్షం పడ్డప్పుడు ఈ పల్లపు ప్రదేశాలే సరోవరాలుగా మారిపోతాయి. అయితే, నీరు ఎక్కువ కాలం నిలవ వుండదు. ఇసుక భూమి త్వరలో పీల్చేస్తుందా నీటిని! ఎడారిలో నీటి సమస్య చాలా ప్రధానమయింది. నీరు దొరకడం కష్టమే అయినా, అసలు దొరక్కుండా మాత్రం వుండదు. అసలు నీరుదొరక్క

పోయే పక్షంలో సార్థవాహులు ప్రయాణం చేయనే చేయరు కదా! అది శరదృతువు. చలి ఎక్కువగాలేదు. ఎండలూ అధికంగా లేవు. మేము ప్రతిరోజూ మధ్యాహ్నానంతరం ప్రయాణం సాగించేవాళ్ళం. అర్ధరాత్రి తరువాత ఆగిపోయేవాళ్ళం! సార్థవాహుడు నాకో గుర్రాన్ని ఇస్తానన్నాడు. తప్పనిసరి పరిస్థితుల్లో మాత్రమే నేను భిక్షు నియమాల్ని అతిక్రమించాను. సాధారణ పరిస్థితుల్లో నియమాలను తు. చ. తప్పకుండా పాటిస్తాను. నేనూ, బోధిసంఘుడు కాలినడకనే ప్రయాణం చేశాము. సామాన్యంగా రోజుకు మూడు యోజనాల దూరం ప్రయాణం చేసేవాళ్ళం.

మేము ఎడారిలో ముందుకు పోయిన కొలదీ పసిరిక తరువవుతూన్నది. చెట్లూ, చేమలూ ఎక్కడా కనిపించడం లేదు. ఎక్కడయినా పసిరిక కనుపించినా, అదీ ఇసుకరంగులో పసుపు పచ్చగానే ఉంది. మధ్యలో గుట్ట ఒకటి తగిలింది. చిన్నచిన్నగుట్టలు తగిలినచోట్ల దేవతల ఆకారాల్ని మలిచి పెట్టారు. ఇలాంటి ప్రదేశాల్లో దేవతల ప్రీత్యర్థం పశువుల ఎముకలూ, పుర్రెలూ, కొమ్ములతోపాటు కొయ్య మొద్దుల్ని గూడా పడేసి ఉంచుతారు. ఎడారిలో అతి దుర్లభమైన వస్తువుల్ని సమర్పించనప్పుడుగాని దేవతలు సంతసించరు.

ఈ ఎడారి పూర్తి నిర్జనమైంది అనడానికి వీల్లేదు. మజిలీ ప్రాంతాల్లో, అక్కడక్కడా గుడారాలూ, పశువులూ కనుపిస్తున్నాయి. మానవులు నివసిస్తున్నారు. సమతల ఎడారిలోనూ అక్కడక్కడా నదీ ప్రవాహపు చాళ్ళు కనుపిస్తున్నాయి. ఎడారిలో వర్షాలు కురవడమూ వ్యర్థమే అవుతుంది. అందుకనే గావును ఇక్కడ వర్షాలు నామమాత్రంగానే కురుస్తుంటాయి. అసలు వర్షాలు కురవకనే ఈ ప్రదేశం మహా ఎడారిగా మారిపోయిందేమో! ఒకప్పుడు ఈ ప్రదేశంలోనూ ధారాళంగా వర్షాలు కురిసేవేమో! ఈ భూమీ, చెట్లు చేమలతో కనుల పండువుగా వుండేదేమో. దూరంగా, క్షితిజాన్నానుకుని కనిపిస్తూన్న కొండల వరుసలు శీత సముద్ర ప్రాంతంలోని కొండల్లా వనస్పతితో నిండి వుండేవేమో? దృష్టికి అవరోధం ఏమీ లేకపోవడంవల్ల బహుదూరాన గల దేరాలుకూడా స్పష్టంగా కనిపిస్తున్నాయి.

మజిలీని చేరగానే బరువులు మోసే ఒంటెలు నిలిచిపోయేవి. వాటి వీపులమీది బరువుల్ని దించి గోడగా ఒకచోట పేర్చేవారు. అనంతరము ఒంటెలన్నీ మేతకోసం వెళ్తాయి. ఇక వాటి అవసరం మర్నాడు ప్రయాణ మప్పుడే. పరాస వృక్షాలు కొద్దిగానేవున్నా, మార్గానికి ఓచిన్న వనంలా కనుపిస్తున్నాయి. ఒంటెల్లాగానే ఈ పరాసవృక్షాలు కూడాఎడారి జీవులు. భారతదేశంలాంటి ఉష్ణదేశపు ఎడార్లల్లో ఒంటెలు వుండడాన్ని చూశాము. అయితే, హూణదేశపు ఈ అతిశీతల ఎడారిలో (గోబీ) ఒంటెల అవసరం ఎంతైయినా వుంది. ఇక్కడికి ఒంటెలతోపాటు పరాస వృక్షాలు వచ్చాయో, పరాస వృక్షాల ననుసరించి ఒంటెలు వచ్చాయో చెప్పలేము ఈ రెంటింటిలోనూ, స్థావర జంగమ వ్యత్యాసం ఉన్నప్పటికీ, వీటి ప్రవృత్తి వొకేలాగుంటుంది. మజిలీల దగ్గిర తిరుగుబోతుల దేరా లుంటాయి. వాళ్ళు పాలు, మాంసం, వంట చెరుకూ సార్థవాహాలకు అమ్ముతూంటారు. ఈ యెడార్లల్లో నీళ్ళూ, నిప్పూ రెండూ దుర్లభమైనవే. ఉత్తరదేశంలోని వనవాసులు కాల్చని పచ్చి మాంసాన్ని ఉప్పు అయినా లేకుండా తినేస్తారు. వాళ్ళకు నిప్పుతో పనిలేదు. నిప్పు లేకపోయిన మాత్రాన వాళ్ళభోజనములో వచ్చేమార్పు ఏమీవుండదు. కానీ, తోఖ్యర్కు తిరుగుబోతులు అలా పచ్చి మాంసాన్ని తినే జాతి కాదు. కట్టెల్తో నిప్పు తయారుచేసుకోవడం ఈ ఎడార్లలో జరిగే పనికాదు. కట్టెలుగానీ, మొద్దులుగానీ దొరకవు. వంట చెరుకు రూపంలో పశువుల ఎండు పెంటను వాడుతూంటారు. ఈ యెండుపెంట ఎడారిలోని మజిలీల సమీపాల్లో బహుళంగా దొరుకుతూ వుంటుంది. స్త్రీలూ పిల్లలూ, ఈ పెంటను ప్రోగు చేసుకోవడానికి గుంపులు గుంపులుగా వెళ్ళడాన్ని చూశాను. ఇక్కడి స్త్రీలు, భారతదేశంలోని బర్రెల కొమ్ముల్లా తమ కేశాలను అలంకరించుకుంటూ వుంటారు. ఇలాంటి కొమ్ములు కల పశువు ఈప్రదేశాల్లో ఏదైనా వుందేమో తెలియదు. అయితే, హిమాలయాన్ని దాటి ఇవతలికి వచ్చాక నే నింతవరకూ బర్రెను చూడలేదు. అసలిలా యెందుకు అలంకరించుకుంటారో. వీళ్ళ అలంకరణలన్నీ, అస్వాభావికంగానూ, అజ్ఞానంతోనూ కూడిఉన్నాయి.

మేము ఎడారిలో ప్రయాణం చేస్తున్నాము. మనిషికి దేశం కంటె కూడా సమాజం చాలా ముఖ్యమైంది. ఎన్నో రోజుల తరువాత అనురూప మైన మానవ సమాజంలోకి వచ్చాము. సంఘారామంలోకి వచ్చాక ఎన్నో సంవత్సరాల తరువాత వరి అన్నాన్ని కండ్ల చూశాము. ఈ దేశములో వరే కాదు. ఏ ధాన్యమూ పండదు. దూర ప్రాంతాలనుండి తెప్పించు కోవాలి. అలాంటి స్థితిలో అధిక ధరలను చెల్లించవలసి వుంటుంది. అదికాక, ఈ తిరుగుబోతులకు శాకాహారం అంతగా రుచించదు. ఇన్ని కారణాలవల్ల ఈ ప్రాంతాల్లో వరి అన్నాన్ని కళ్ళ చూడడం చాలా అపురూపమైన విషయం. నేను ఎన్నో సంవత్సరాలుగా మాంసాహారం చేస్తున్నాను. చీనీ సార్థవాహులు పరిచయమయ్యాకనే, చీనీ భిక్షువులు మాంస భక్షణ చేయరని తెల్సుకున్నాను. పరిచయమయిన మొదటి రోజునే, కమ్మని వరి అన్నంతోంపాటు రుచ్యమయిన పదార్థాలను తయారు చేయించి పెట్టారు. మహాయానం మాంస భక్షణను నిషే ధిస్తుంది. చీనా దేశంలోని భిక్షువులు మహాయానులనీ, కనుకనే మాంసాన్ని తినరని బోధి సంఘుడు తరువాత చెప్పాడు. నేను అదే క్షణాన మాంసాన్ని తినరాదని నిశ్చయించుకున్నాను. నేనూ మహా యానాన్ని అదిష్టించాను. "పరోక్షంగా గానీ, ప్రత్యక్షంగా గానీ హింస జరగందే మాంసం లభించదు. కనుక మాంస భక్షణ అవశ్యం వర్జ నీయం" అనుకున్నాను.

చీనా దేశంలో నేను చేయవలసిన కార్యక్రమాన్ని ముందే నిర్ణ యించుకున్నాను. ఆ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించాలంటే ఆ దేశపు భాష రావడం చాలా ముఖ్యం. బోధి సంఘుడు పరిచయమైన క్షణాన్నుండే చీనీ భాషను అభ్యసించటం ప్రారంభించాను. ఒక భాషను అభ్యసించాలంటే ఆ భాష తాలూకు వ్యాకరణాన్ని క్షుణ్ణంగా అధ్య యనం చేయడం చాలా అవసరం. సంస్కృత వ్యాకరణాన్ని అధ్య యనం చేసిన వ్యక్తికి చీనీ భాష వ్యాకరణం ఒక లెక్కలోది కాదు. చీనీ భాషలోని క్రియా పదాలకు ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషుల భేదం వుండదు. ఏక, బహు. ద్వి వచనాల పీడగాని, భూత, భవిష్యత్, వర్తమాన కాలాల గొడవగానీ వుండదు. చీనీభాషలో సంస్కృతంలోలా

ధాతురూపాల బాహుళ్యత వుండదు. నామవాచకాలకు విభక్తులు గానీ, వచనాలుగానీ వుండవు. బోధి సంఘుడు మొదటగా లిపిని నేర్పడం ప్రారంభించాడు. చీనీ లిపికి ఉచ్చారణతో నిమిత్తం లేదు. స్వర వ్యంజనము లుండవు. మన అంకెల్లా కేవలం అర్థాన్ని మాత్రమే ప్రతిపాదిస్తూ వుంటుందా లిపి। అంటే. ఎన్ని శబ్దాలు, లేక వస్తువులు ఉన్నాయో అన్ని అక్షరాల్ని నేర్చుకోవాలి। నేను ధైర్యాన్ని కోల్పో లేదు. అయినా, భాషను నేర్చుకోవడం పట్ల అధిక శ్రద్ధను కనబరచ సాగాను. లిపిపట్ల సహజంగానే ఉదాసీనత జనించింది. నా ఉదాసీనతను చూసి "చీనా దేశం చాలా పెద్దది. అక్కడ వొక ప్రాంతపు భాష మరో ప్రాంతీయుడికి అర్థంకాదు। అందరికీ సమానంగా అర్థం అయ్యేది, అర్థం చేసుకోగలిగింది ఈ లిపి వొకటే ।" అన్నాడు బోధిసంఘుడు.

అర్ధరాత్రికి మజిలీని చేరేవాళ్ళం। నిద్ర తూగుతూ వుండేది. మజిలీని చేరగానే పడి నిద్రపోయేవాళ్ళం. సార్థవాహుడు ద్రాక్షరసాన్ని త్రాగమని బలవంతం చేసేవాడు. నేను ఎప్పుడోగాని ద్రాక్షరసాన్ని తాగేవాణ్ణి కాదు. అప్పుడు పడుకున్న పడుకోవడం తెల్లగా తెల్లవారి లేచేవాణ్ని। సార్థవాహుడు మాత్రం మధ్యాహ్నానికి, భోజన సమయానికి లేచేవాడు, అతడు చేయవలసిన పనేమీ వుండదు. ఇష్టమొచ్చినంతసేపు నిద్రపోతాడు. సాధారణంగా మధ్యాహ్న సమయాల్లోనే అతడు మాతో ధార్మిక విషయాల గురించి మాట్లాడుతూంటాడు. మా ధార్మిక చర్చలకు బోధిసంఘుడు ద్విభాషిగా వుండేవాడు.

ఈ ప్రదేశానికి మోయూఖానే శాసకుడు. అక్కడేకాదు, తూర్పున గల సుదూర ప్రదేశాల్లోకూడా, తిరుగుబోతులు మోయూఖాన్‌నే తమ శాసకుడిగా భావిస్తున్నారు. అవారుల అంతిమకాలంలో ఇక్కడ రాజ్య వ్యవస్థ శిథిలమైంది. అల్లరులు ఎక్కువయ్యాయి. ఈ మార్గాన వెళ్ళే సార్థవాహుల ప్రాణ, ధనములకు భద్రత నశించింది. సార్థవాహులు పూర్తి కట్టుదిట్టంతో, సాయుధ బలగాలను వెంటపెట్టుకుని ప్రయాణం చేసేవారు. అయినా, దొంగల బారినుండి తప్పించుకోలేకపోతూ వుండే వారు, తిరుగుబోతులు సార్థవాహుల్ని దోచుకోవడం అధర్మంగా భావించరు. మా చిరపరిచయుడు, దయామయుడూ అయిన యబగూ ఈ

ప్రాంతానికి అధికారి। అయితే, అతడి ప్రాంతానికి ఎన్నడూ వచ్చి వుండడు. ఇక రాడుకూడాను.

ప్రతిరోజూ నేనూ, బోధిసంఘుడూ కాలి నడకన ప్రయాణం చేసేవాళ్ళం। ఎడారుల్లో ప్రతిక్షణమూ దారి తప్పుతామన్న భయంగ వుంటుంది. మానవుల పదచిహ్నాలే బాటలుగా మారుతాయి. ఎడారిలో ఈ పదచిహ్నాలు నిలిచే అవకాశమే వుండదు. ఏ మాత్రం గాలి వీచినా అడుగుల గుర్తులు మాసిపోతాయి. ఇక బాటలు ఏర్పడ్డానికి అవకాశమెక్కడిది? ఎడారిలో అక్కడక్కడా ఇసుక దిబ్బలుంటాయి. ఈ ఇసుక దిబ్బల్ని భూతాలు తయారు చేస్తుంటాయని. వీటి ద్వారా మానవుణ్ణి పదభ్రష్టుల్నిచేసి, తినేస్తాయని చెప్తుంటారు. కనుక ఎవ్వరూ ఒంటరిగా ప్రయాణం చేయరు. సార్థవాహుడు మమ్మల్ని ఒంటరిగా ఇష్టమొచ్చినట్లు వెళ్ళవద్దని గట్టిగా చెప్పాడు. మేము అందరికంటే ముందు వెళ్లే పరివారకుల్తో కల్సివెళ్తూండేవాళ్ళం. ఆ పరివారకుల్ని అంటి పెట్టుకుని వుండేవాళ్ళం। ప్రయాణంలోనూ, నేనూ బోధిసంఘుడూ ఎప్పుడూ ఎన్నో విషయాల్ని గురించి మాట్లాడుకుంటూండే వాళ్ళం. భాషాజ్ఞానాన్ని అభివృద్ధి పరచుకోడానికి మాట్లాడడంకంటే గొప్ప సాధనం మరొకటిలేదు. మాటల సందర్భంలో నేను బుద్ధిలుణ్ణి గురించికూడా చెప్తూండేవాణ్ణి. బుద్ధిలుణ్ణి గురించి మాట్లాడేటప్పుడు అతడి ముఖం నా కండ్ల ముందు తిరుగుతూండేది. అతడూ, నేనూ ఒకప్పుడు చీనాదేశం వెళ్ళాలని నిశ్చయించుకున్నాము. ఆనాటి మా సంకల్పాన్ని నిర్వహించడానికి అతడు లేడన్న విచారంవున్నా, కనీసం నేనయినా నిర్వహించగలుగుతూన్నందుకు సంతసిస్తున్నాను. కానీ, ఈ ప్రయాణంలో అతడూ నావెంట వుంటే ఎంత బాగుంటుంది? మహా విద్వాంసులయిన భారతీయ భిక్షువులెందరో చీనా దేశంలో వున్నారు. అయితే బుద్ధిలుడిలాంటి యువకుడైన పండితుడు చీనా దేశానికి రావటం ఇదే ప్రథమమై వుండేది. మేమిద్దరమూ కలిసి. ఎంత చక్కగా కార్యక్రమాన్ని నిర్వహించేవారమో। ప్రస్తుతం, చీనా దేశంలో బౌద్ధమత గ్రంథాల అనువాదం మహాజోరుగా సాగుతుంది. బుద్ధిలుడే వున్నట్లయితే ఈ అనువాద కార్యక్రమాన్ని ఎంత గొప్పగా నిర్వహించేవాడో।

ఇన్నాళ్ళ అభ్యాసం తరువాత చీనీ లిపిని నేర్చుకోగలనన్న నమ్మకం కలిగింది. చీనా దేశం వెళ్ళాక కుమార జీవుడి అనువాదాల్ని స్వయంగా చూశాను. చీనా దేశపు మహావిద్వాంసులు అతణ్ణి ప్రశంసిస్తుండగా విన్నాను. కుమార జీవుడు చీనీ భాషనూ, లిపినీ చక్కగా అభ్యసించాడు. అతనికి కూచీ భాషలోకల ప్రవేశమే, చీనీ భాషలోనూ, సంస్కృతంలోనూ కూడా వుంది. బుద్ధిలుడే గనక బ్రతికివుంటి, ఈదేశం వచ్చి వున్నట్లయితే రెండవ కుమార జీవుడిగా గొప్ప ప్రసిద్ధిని పొందేవాడు. సంఘిలుడు విడిపోయాక నేనొక రకంగా బుద్ధిలుణ్ణి మర్చిపోయాను.కానీ, ఇప్పుడు మళ్ళీ అతడి జ్ఞాపకాలు తిరుగబడుతున్నాయి.

మేము ఎడారిలో ఎక్కడా, ఒక్కరోజుకూడా అనవసరంగా నిలబడలేదు. ఏవిధమైన ప్రమాదాలు సంభవించలేదు. పశువులేమైనా జబ్బుపడినా వాటికోసం ముఠా ఆగదు. వాటిని మజిలీలోవదలి మిగిలిన పశువులమీద సరకుల్ని సర్దుకుని ముఠా వెళ్ళిపోతుంది. సార్థవాహుండు ప్రాణిహింసను చేయడు. మాంసంకోసం పశువుల్ని చంపడు. కనుకనే నిరుపయోగమైన పశువుల్ని మజిలీలో విడిచి పెడతాడు. తాము చంపక పోయినప్పటికీ,నిరాధారంగా వదిలిన పశువును ఏదో ఒక "జంతువు"తప్పకుండ చంపుకుతింటుంది.ఇదీ ఒక రకమైన హింసేగా? పశువుల విషయంలోనే కాదు.అనుచరుల్లో ఎవరైనా జబ్బుపడినా, అతడికోసం సార్థం (ముఠా) ఆగదు. చివరకు సార్థవాహుండే జబ్బుపడినా, తనకు తోడుగా ఒక ఒక రిద్దరు పరిచారకుల్ని దగ్గిర వుంచుకొని మిగిలిన ముఠాని పై మజిలీకి పంపించి వేస్తాడు. బోధిసంఘుడుగానీ, నేనుగానీ ఈ మొత్తం ఎడారి ప్రయాణంలోనూ ఏమాత్రం జబ్బుపడలేదు. మా ఇద్దరిలో ఏ ఒకరు జబ్బుపడినా ఇద్దరమూ ఆగిపోవలసి వచ్చేది. ఇక నప్పుడు మేము ఏమయ్యేవాళ్లమో చెప్పలేను. ఎడారి ప్రయాణంలో ఇలా మనుషుల్నీ, పశువుల్నీ వాళ్ళ విధికి వదలి వెళ్ళిపోవడంకూడా ఒక భాగమే। అయితే, మేము ఏ ప్రమాదమూ, ఉపద్రవమూ లేకుండా ముందుకు వెళ్ళి పోతున్నాము. అంత కంతకూ చీనా దేశం సమీపిస్తోంది. దేశాన్ని సమీపించిన కొలదీ తిరుగుబోతుల దేరాలూ, మానవ సంచలనమూ అధికంగా కనిపిస్తోంది. పశుగ్రాసమూ, నీరూ కూడా సమృద్ధిగా లభిస్తు

న్నాయి. చివరకు ఒక పెద్ద సరోవరం (కొకొనోర్) కనిపించింది. సరోవరపు నీరు ఉప్పుగా వున్నది. అయినా, అంతటి జలరాశిని ఎదురుగా చూసే సరికి నా హృదయం ఆనందంతో పొంగి పొర్లింది. ఇంకో రెండు రోజుల్లో చీనా దేశపు సరిహద్దును చేరబోతున్నామని తెల్సింది.

చిట్టచివరి రోజున ఉదయాన్నే ప్రస్థానాన్ని సాగించాము. మధ్యాహ్నానికల్లా దూరంగా ఏదో ఆకారం అస్పష్టంగా కనుపించ సాగింది. "అదే చీనా దేశపు అడ్డుగోడ!" అన్నాడు బోధి సంఘుడు. నేను కూచీ నుంచి బయల్దేరినప్పుడు అడ్డుగోడకు అభిముఖంగానే వెళ్ళాను. కానీ, అడ్డుగోడను చేరకుండానే దిశా పరివర్తన జరిగింది. పశ్చిమంగా అడ్డుగోడను సమీపించాలనుకున్న నేను అసఫలుడినై తిరిగి ప్రయత్నించి అడ్డుగోడయొక్క ఉత్తరభాగాన్ని చేరుతానని ఆనాడు ఎవరనుకున్నారు? చిట్టచివరి రోజు కొంచెం అధికంగానే ప్రయాణము చేశాము. సరిహద్దును సమీపిస్తున్నానన్న ఆనందంలో అలసట ఏ మాత్రమూ తెలియలేదు!

ఈ అడ్డుగోడ ప్రపంచపు వింతల్లో ఒకటి! పురాతనమైన ఈ పెద్ద దేశాన్ని ప్రపంచంలోని అన్య దేశీయులు 'చీనా' అంటారు. దీనికి ఈ పేరు రావడానికి కారణమైన 'చిన' వంశం ఇప్పటికి ఎనిమిది శతాబ్దాల క్రితం ఈ దేశాన్ని పరిపాలించింది. ఈ వంశం ఈపెద్దదేశాన్ని ఒకే రాష్ట్రంగా మార్చింది. ఈ 'చిన' వంశపు మూడవ చక్రవర్తి అయిన శీహ్‌హూవాంగ్‌తి ఈ అడ్డుగోడను కట్టించాడు. అతడి ప్రయత్నము వల్లనే ఈ దేశం ఒక రాష్ట్రంగారూపొందింది. అనాదికాలంనుండి ఎడారి మొదలు శీత సముద్రం వరకూ గల సమస్త ప్రదేశము తిరుగు బోతుల అధీనంలో ఉంటూ వచ్చింది. ఈ తిరుగుబోతుల్ని హూణులంటారు. వాళ్ళ భాషలో 'హూణ' శబ్దానికి మనుష్యుడని అర్థం! ఈ శబ్దం చీనీ భాషలోకి వచ్చి, తన అర్థాన్ని గోల్పోవడమే గాక వ్యతిరేక అర్థాన్ని ఈయసాగింది. చీనీ భాషలో 'హూణ' శబ్దానికి రాక్షసుడని అర్థం. ఈ హూణులు చీనా దేశపు సమృద్ధమైన నగరాల మీదా, పల్లెలమీదా దాడి చేసి దోచుకుంటూ ఉండేవారు. వీరి దృష్టిలో చీనీ ప్రజలు పాడిగోవు ల్లాంటి వారు. వాళ్ళను ఎలాగైనా పిండు కోవడమే వీళ్ళపని. ఈ

హూణుల దాడినుండి దేశాన్ని రక్షించడానికే అడ్డుగోడ కట్టబడింది. చినవంశానికి ముందుకూడా ఎందరో రాజులు దేశ రక్షణకు ప్రయత్నించారు. అయితే. ఆ రాజులెవరూ శీహిన్హూవాంగ్‌తి లాంటి సమర్థత కలిగినవారూ కాదూ, సంపన్నులూ కాదు. ఈ గోడను నిర్మించడానికి తీ. తన రాజ్యంలోని ప్రజలనందరినీ బలవంతాన నియోగించాడు. అందరిచేత దయా విహీనుడై పని చేయించాడు. ధనాన్ని గవ్వల్లా వెదజల్లాడు. అంత కూర్రంగా ఉన్నాడు గనుకనే తూర్పు సముద్రాన్నుండి. పీత నదికి పశ్చిమంగా ఉన్న తిరుగుబోతుల భూమి వరకూ (మూడు వందల యోజనాల దూరం) గల ఈ గోడను కట్టించగలిగాడు. ఈ గోడ నిర్మాణానికి అడ్డుగా అడవులూ కొండలూ ఎన్నో వచ్చాయి. అయినా, నిర్మాణం ఆగలేదు గోడ అవిచ్ఛిన్నంగా సాగిపోయింది. యీ గోడను కట్టిన వాళ్ళల్లో బహుమతులు పొందిన సైనికులే మూడు లక్షల మందివున్నారు. వీళ్ళుకాక ఎంతో మంది ఖైదీలూ, అపరాధులైన ప్రభుత్వాధికారులూ ఈ గోడ నిర్మాణంలో పాల్గొన్నారు. చక్రవర్తి కోపానికి గురి అయిన పండితులూ. కవులు కూడా పారలూ, తట్టలూ తీసుకుని మట్టి మోశారు. ఈ గోడను కట్టడం కొరకు లక్షల సంఖ్యలో మానవులు నశించారు. ఇంత చేసినా ఈ గోడ కట్టిన మాత్రాన తిరుగుబోతుల దోపిడీలు తగ్గలేదు. కొండలపైనా, గోడ కట్టడానికి వీల్లేని నదుల వద్దా సైనిక పహరాలను వుంచాడు. గోడలోనూ అక్కడక్కడా దుర్గాల నేర్పరచి సైనికుల్ని కాపుంచాడు. ఎవరినుండి దేశాన్ని రక్షించడానికి ఈ గోడ కట్టబడ్డదో, ఆ తిరుగుబోతులు ఇప్పటికీ వున్నారు. వాళ్ళ జీవితక్రమంలో ఎలాంటి మార్పు రాలేదు. వాళ్ళు ఇప్పటికీ దోపిడీలు చేస్తూనే వున్నారు

చిన వంశం సమస్తదేశాన్ని ఒకటిగా చేసింది. ఇప్పుడా ఏకత్వం నశించింది. దేశం ముక్కలు ముక్కలయింది.

సాయంత్రం కావచ్చింది. పొద్దుగూకేలోపు గోడను దాటి లోపలికి వెళ్ళిపోవాలన్న తొందర్లో వున్నాము. అయినప్పటికే కొని క్షణాలు గోడను చూస్తూ అలాగే వుండిపోయాను. మానవ నిర్మితాలయిన అద్భుత కృతుల నెన్నింటినో చూశాను. కొండలను తొలచి

నిర్మించిన భవనాలను చూశాను. ఒకే రాతిలో మలచిన నూరేసి బారల ఎత్తుగల గొప్ప విగ్రహాలను చూశాను. కానీ, వాటికంటె కూడా ఈ గోడ ఆశ్చర్య జనకం అనిపించింది. గోడను ఆ చివర నుండి ఈ చివరకు చూడా లనుకుంటే కొన్ని నెలలు ప్రయాణం చేయవలసి వుంటుంది.

గోడను దాటాక మొట్టమొదటగా తగిలే పెద్ద పట్టణం కలగన్. గోడకు ఇటు వైపు కూడా చిన్న చిన్న పల్లెలూ మైదానా లున్నాయి. సార్థవాహులు ఈ మైదానాల్లోనే తమ వస్తువుల్ని దింపుకుంటారు. ఇక్కడే ప్రభుత్వ అధికారులు సుంకాన్ని వసూలు చేస్తారు. గుప్తచరులు వ్యాపారుల వేషంలో శత్రువు ఎవరైనా లోపలకు ప్రవేశిస్తాడేమోనని జాగ్రత్తగా పరిశీలిస్తూ వుంటారు. విదేశీయులను ప్రత్యేకం పరీక్షిస్తారు. మేమిద్దరమూ విదేశీయులమే. అయినా, మేము హూణ సంతానం కాదని మా ముఖాలే చెప్తున్నాయి. మేము నిరాటంకంగా లోపలికి వెళ్ళిపోయాము.

ఈ సార్థవాహుడు మామూలు వ్యాపారి కాడు. రాజాదరాన్ని పొందిన నగరశ్రేష్ఠి. సార్థవాహుణ్ణి దుర్గపాలుడు ఎరిగి వున్నాడు. గోడ దాటి లోపలికి వెళ్ళడానికి ఎలాంటి అభ్యంతరాన్నీ చెప్పలేదు. అతడి వెంట వుండడం వల్ల మమ్మల్ని అడ్డగించలేదు. వ్యాపారి తన పణ్య వస్తువులన్నింటిని నౌకర్లకు వప్పగించి పట్నంలోకి వచ్చాడు. పట్నంలో శ్రేష్ఠికో చిన్న భవనం వుంది. శ్రేష్ఠి తన భవనానికి వెళ్ళకుండా ముందుగా దుర్గపాలుడి భవనానికి వెళ్ళాడు. అతడు మమ్మల్ని గొప్పగా గౌరవించాడు. ఈ నగరపు మహారాజు వేన్‌శాన్‌తీ. బౌద్ధమతాభిమాని. అతడి మంత్రులూ, సామంతులు కూడా బౌద్ధ మతానుయాయులయ్యారు. కనుకనే దుర్గపాలుడు మమ్మల్ని అత్యధికంగా గౌరవించాడు. సార్థవాహుడు తను తెచ్చిన అమూల్యమైన మృగ చర్మాలను కొన్నింటిని దుర్గపాలుడికి కానుకగా ఇచ్చాడు.

సుదీర్ఘమైన యాత్రానంతరం ఈ పట్నానికి రావడం అంధకారంలో నుండి వెలుగులోకి వచ్చినట్లుగా వుంది. ఈ నగరంలో నన్నాకర్షించింది కేవలం నాగరిక జీవితమే కాదు. ఇక్కడ బౌద్ధమతం బహుళ ప్రచారంలో ఉంది. ఇది చీనా దేశపు సరిహద్దున గల పెద్ద పట్టణం. ఈ పట్టణంలోని

ప్రతి బజారుకూ ప్రార్థనా మందిరాలూ, స్తూపాలూ ఉన్నాయి. భిక్షువులూ, సన్యాసినులూ, ఉండడానికి పదిపన్నెండు విహారాలు కూడా వున్నాయి. ఈ పట్నంలోనే ఇన్ని విహారాలు వుంటే ఇక రాజధానిలో ఎన్ని ఉంటాయో? ఈ దేశంలో బౌద్ధమతాన్ని, తోబా రాజ వంశం ఇంతగా ప్రచారంలోకి తెచ్చింది. ఈ వంశం చాలా కాలం పాటు (క్రీ.శ. 386 నుండి 529 వరకు) ఉత్తర చీనాదేశాన్ని పరిపాలించింది. ఈ వంశం లోని ఎందరో చక్రవర్తులు మహా సామ్రాజ్యాధినేతలయి వుండి కూడా భిక్షువుల్లా జీవితాల్ని గడిపారు. వీరు తమ రాజధాని (తాతుంగ్)కి సమీపాన గల పర్వతాల్లో సంఘారామాల్ని నిర్మించారు. వీరు నిర్మించిన సంఘారామాలు ఇంకా అలాగే చెక్కు చెదరకుండా వున్నాయి. తన జన్మ భూమిని దాటి, సుదూరానగల ఈ దేశానికి వచ్చి, చిగిర్చి మూడు పూవులూ ఆరు కాయలుగా వున్న బౌద్ధమతాన్ని చూసి పరమానంద భరితుణ్ణయ్యాను. కానీ, విహారాల్లో ఇంత అధిక సంఖ్యలో భిక్షువులూ, సన్యాసినులూ వుండడాన్ని చూసి కొంత కించ పడ్డాను. దేశంలోని స్త్రీ పురుషులందరినీ భిక్షువులూ, సన్యాసినులూ కిమ్మని బుద్ధుడెక్కడా చెప్ప లేదు. పైగా, భిక్షుత్వాన్ని స్వీకరించి నియమ బద్ధంగా జీవితాన్ని గడప గల మానసికదార్ఢ్యం కొందరికి మాత్రమే వుంటుంది. అందరికీ వుండదు. ఇలా భిక్షువులు కావడానికి అందరికీ అవకాశం ఈయడంవల్ల చరిత్ర హీనులైన స్త్రీ పురుషుల్తో విహారాలు నిండిపోతాయి. తరువాత జీవితంలో ఈ స్థితిని కళ్లారా చూశాను.

సరిహద్దు నగరంలో కేవలం ఒక రోజు మాత్రమే వున్నాము సార్థవాహుడు నన్నుతీసుకుని రాజధానికి వెళ్ళాలన్న తొందరలోవున్నాడు. అతడి నివాసంకూడా రాజధానిలోనే ! నన్ను తీసుకుపోయి మహారాజుకు పరిచయంచేసి, ఇంతటి భారతీయ పండితుణ్ణి ఆస్థానానికి తీసుకువచ్చిన ఘన గౌరవాన్ని కొట్టేయాలని సార్థవాహుడి వూహ! రాజధాని(యేహో)కి వెడుతూ మార్గమధ్యంలో తగిలే గ్రామాలనూ, పట్నాలనూ ఎన్నింటినో చూశాను. భారతదేశంలో లాగానే ఇక్కడా బీదలూ, ధనికులూ వున్నారు. గృహాలు వారి వారి ఆర్థిక స్థితి ననుసరించి, పెద్దవిగా, చిన్నవిగా వున్నాయి. అయితే, వీళ్ళు ఇళ్ళు కట్టుకోవడం అదోలావుంది. ఈ

దేశంలో కాగితం అత్యధికంగా తయారవుతుంది. భారతదేశంలో ఉన్న వరకూ నేను కాగితాన్ని చూళ్ళేదు. అన్యదేశాల్లో కదాచిత్తుగా కాగితాన్ని చూశాను. కానీ. ఇంత అధికంగా మరెక్కడా చూళ్ళేదు. దీన్ని బొంగులూ చెట్ల బెరళ్ళూ నానవేసి తయారు చేస్తారు. ఇది తాళపత్రంకంటే పలచగా వుంటుంది. గట్టితనానికీ, ఎక్కువ కాలం నిలచి వుండడానికి దీనికంటే తాటిఆకే శ్రేష్ఠం। కొన్ని విషయాల్లో కాగితం, తాళపత్రం కంటే ఎంతో ఉపయోగకారిగా ఉంటుంది. ఎట్లా మడుచుకున్నా విరిగిపోదు. పలుచగా, తెల్లగా చూడ ముచ్చటగా వుంటుంది। కాగితానికి అవసరమైనపదార్థాలు భారత దేశంలోనూ దొరుకుతాయి. మరి భారతీయు లెందుకు కాగితాన్ని తయారుచేయరో ?

చలికాలమొచ్చి ఒక్క నెల గడిచింది. సార్థవాహుడు అయిదారు గురు అనుచరుల్తో రాజధానికి బయల్దేరాడు. మేము సార్థవాహుణ్ణి అనుసరించి కాలినడకనే వెళ్తున్నాము. ఈ భూమి, ఇక్కడి దృశ్యాలూ మధ్య దేశాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. అలాంటివే చిన్న చిన్న గ్రామాలూ, గ్రామాల చుట్టూ పంటచేలూ! ఈ దేశపు రైతు. భారత దేశపు రైతు లాగా పళ్ళు దాచుకోకుండా కష్టించి పంటలు పడిస్తాడు. భూమిని బాగా దున్ని సాగు చేసుకోవడమే కాకుండా, భూమికి కావలిసినంత ఎరువు పెట్టడం కూడా వీళ్ళకు తెలుసు. పశువుల ఎరువునేకాక, మానవుల అశుద్ధాన్నికూడా ఎరువుగా వాడతారు ఇక్కడ. మధ్య దేశంలో (భారత దేశంలో) అశుద్ధాన్ని ముట్టుకోరు. అశుద్ధాన్ని శుభ్రపరిచి జీవించేవాళ్ళను చాలా నీచజాతిగా చూస్తారు. ఇక్కడలా కాదు, రైతు తన చేతుల్తో అశుద్ధాన్ని పట్టుకువెళ్ళి చేలల్లో వేసుకుంటాడు. పొలమూ, పుట్రాలేని పట్నవాసుల దగ్గిరనుండి అశుద్ధాన్ని కొనుక్కుంటూంటారు కూడాను। అన్నింటినీ మించి చెప్పుకోవల్సిన విషయం: ఇక్కడ అస్పృశ్యత లేదు. ధనికులున్నారు నిర్ధనులున్నారు, గౌరవనీయులున్నారు, గౌరవ హీను లున్నారు. కాని, అంటరానివారు మాత్రం లేరు. బుద్ధుడు "మానవులందరూ ఒకటి।" అని చెప్పాడు. బుద్ధుని భావానికీ. వాక్యానికీ రూపాన్నిచ్చి, ఆకారాన్ని కల్పించారిక్కడ. ఈ సమానత్వాన్నిసాధించడానికే బుద్ధుడు సంఘాల్లో కఠిన నియమాలను ప్రవేశపెట్టాడు. ఒకప్పుడు

శాక్యరాజ కుమారులయిన అనిరుద్ధుడు, ఆనందుడు భిక్షువు లవడానికి బుద్ధుని వద్దకు వచ్చారు. వాళ్ళ ననుసరించి ఉపాలికుడనే మంగలి కూడా వచ్చాడు. బుద్ధుడు ముందుగా మంగలికే భిక్షు దీక్షను ఇచ్చాడు. ఎందుకో తెలుసా? ముందుగా భిక్షుత్వాన్ని స్వీకరించినవాడు పెద్దవాడు అవుతాడు గనుక. మిగిలిన శాక్యకుమారులు కులీనులమన్న అహాన్ని, గర్వాన్ని వదలి మంగలికి నమస్కరించుతారనీ, ఈ విధంగా కులతత్వాన్ని, అసమానతను నశింపచేయ వచ్చుననీ అనుకున్నాడు బుద్ధుడు. కనుకనే మంగలికి ముందుగా భిక్షుత్వాన్నిచ్చాడు. కానీ, బుద్ధుడు పుట్టి, వేయి సంవత్సరాలు కావస్తోంది. అయినా, అంటరానితనం భారతదేశంలో యథాతథంగానే వుంది. కాకపోతే అక్కడి బౌద్ధ సంఘాల్లో మాత్రం అంటరానితనంలేదు. బుద్ధుడు చెప్పిన ఆదర్శాన్ని ప్రచారంచేసి, ఇక్కడి మానవుల్ని ఆ యా మార్గాలలో నడిపించాలనే పవిత్రోద్దేశంతో నే నీ చీనా దేశం వచ్చాను. కానీ, వీళ్ళు అనేక విషయాల్లో ముందుగానే బుద్ధుడు చెప్పిన మార్గాలను అనుసరిస్తున్నారు. బౌద్ధమతము అన్నివిధాల గొప్పగా ప్రచారాన్ని పొందింది యిక్కడ! ఇక నేను చేసే ధర్మప్రచారం ఏముంటుంది?

సార్థవాహుడు "చిన్" చక్రవర్తిని మహా పొగిడేస్తుంటాడు. అతడు నన్నెంతో గౌరవిస్తుంటాడని కూడా చెప్పాడు. రాజాదరణ,గౌరవాలపట్ల నాకు ఆసక్తిలేదని అనను. అయితే, కేవలం ఈ ఆదరణ, గౌరవం కోసమే నేనీ దేశం రాలేదు.ఇంతటి మార్గాయాసాన్ని అనుభవించింది. ప్రాణాలకు తెగించి, సాహసయాత్రలు చేసింది రాజాదరణకోసం మాత్రమే కాదు! రాజుల ఆదరాన్ని పొందితే, సంపదలతో తులతూగవచ్చు. అయితే, సుఖాల ననుభవించాలన్న ఆసక్తి నాకేమాత్రమూలేదు. ఇక నిలాంటి స్థితిలో నేను చేయదగినదేమిటి? నా జీవితాదర్శమైన మహాయానాన్ని అధిష్టించి, అనుష్టించడమే.

మేము రాజమార్గంకుండా వెడుతున్నాము. ఈ మార్గంలో ప్రతి యోజనానికి ఒక పాంథశాల వుంది. పాంథశాలల్ని ఆనుకునే గ్రామాలున్నాయి. గ్రామాల్లో అన్నిరకాల తినుబండారాలూ దొరుకుతాయి. సత్రాల్లోనూ అతిథుల్ని గొప్పగా ఆదరిస్తుంటారు. గ్రామాల్లో తప్పని

షరిగా విహారా లుంటాయి. వాటిలో యాత్రార్థులై వచ్చే భిక్షువులకు, ఎప్పుడూ స్థానముంటుంది. ఇక నాలాంటి భారతీయ పండిత భిక్షువులకు ఘనస్వాగతం లభిస్తుందనడంలో సందేహం లేదు. అయితే, నేను ఇతరత్రా ఆతిథ్యాన్ని స్వీకరించడం సార్థవాహుడికి ఇష్టం లేదు.

ఉదయాన్నే ఫలాహారాన్ని చేసేవారం. మధ్యాహ్నంవరకూ నడిచే వాళ్ళం. మధ్యాహ్నంలోపు భోజనంచేసి కొద్ది క్షణాలు విశ్రమించే వాళ్లం। తిరిగి ఒకటి రెండు ఘడియల్లో సూర్యాస్తమయ మవుతుందనే వరకూ ప్రయాణంచేసి, మజిలీని వేసేవాళ్లం. సాయంత్రం అయ్యాక మజిలీకి దగ్గర్లో ఉన్న గ్రామంలోకి వెళ్తొండేవాణ్ణి. విహారాల్ని, సంఘా రామాల్ని చూసి వచ్చేవాణ్ణి. దేశా న్ననుసరించి వేషాన్ని మార్చడం అవసరమేగానీ, అయినా నేను మాత్రం నా వేషాన్ని మార్చలేదు. ఆ వెనుకటి ఉద్యానదేశపు భిక్షు వేషంలోనే గ్రామాల్లోకి వెళ్ళేవాణ్ణి నా వేషాన్ని చూడగానే, పరదేశీయుణ్ణని తెల్సుకునేవారు ప్రజలు. అందరిదృక్కులూ నామట్టూ కేంద్రీకరించుకునేవి ప్రజలు ఎంతో ఆదరభావాన్ని ప్రదర్శించేవారు నాపట్ల. ఇలా భిక్షు వేషంలో ప్రజల ఆదరాన్ని పొందడం నా మనస్సును ఎంతగానో బాధిస్తూండేది. సమస్త ప్రాణికోటికీ సేవ చేయడమనేది నా ఆదర్శం. "అలాంటప్పుడు వేషంతో ప్రజలనుండి శ్రద్ధా గౌరవాల్ని పొందకూడదం, సేవల్ని పొందడం ఎంతవరకు ఉచితం ?" అని నా మనస్సును నేనే ప్రశ్నించుకునేవాణ్ణి. కానీ, వినయ నియమాలను త్రోసిరా జనలేను. వినయ నియమాల ప్రకారం ఆపత్కాలంలో కేవలం ఒక్కరోజు మాత్రం భిక్షువు తన చీవరాన్ని విసర్జించ వచ్చును. వేషాన్ని మార్చుకోవచ్చును. ఇష్టం లేకపోయినా నేను నా వేషం కారణంగా ప్రజల శ్రద్ధా భక్తులకు పాత్రుణ్ణవుతూండే వాణ్ణి. సంఘారామాల్లోని చీనీ భిక్షువుల్తో చీనీ భాషలోనే మాట్లాడు తూండేవాణ్ణి. ఇన్నాళ్లలో నా చీనీ భాషాజ్ఞానం బాగా అభివృద్ధయిం .

ఎవరి జన్మభూమి వారికి ప్రియమైందిగా వుంటుంది, కొండలతో గుట్టలతో నిండివున్నప్పటికీ నేను గొప్పగా ప్రేమించి అభిమానించే దేశం ఉద్యానం. దాని తరువాత రెండవ స్థానం, బుద్ధుని జన్మభూమ యిన మధ్య దేశానికిస్తాను. ఇప్పుడు నేను చూస్తున్న ఈ చీనా దేశం

లోనూ మధ్యదేశ పోలిక లెన్నో వున్నాయి. కనుకే ఈ దేశం నన్నెంతో గానో ఆకర్షిస్తోంది. చీనాదేశం భారతదేశం లాగానే చాలా పెద్ద దేశం. దేశం మొత్తంలోనూ ఒకే రకమైన వాతావరణం వుండదు. అక్కడక్కడ మంచుకూడా పడుతూ వుంటుంది. మహోన్నతమైన పర్వతాలూ, సువిశాలమూ, సుదీర్ఘమూ అయిన నదులూ వున్నాయిక్కడ. పీతనది (వాంగ్-హో) గంగానది కంటెకూడా పెద్దది.

బోధి సంఘుడితో నేను వెనకటిలా మాట్లాడడ లేదు. ప్రయాణం చేస్తూన్నప్పటికీ ఎక్కువ సమయాన్ని అంతర్ముఖుడనై, ఆలోచిస్తూ గడుపుతూండేవాణ్ణి. భవిష్యత్తులో నేను చేయవలసిన కార్యక్రమాన్ని గురించి రకరకాలుగా ఆలోచిస్తూండే వాణ్ణి ఎంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేక పోతున్నాను. నా మీద నాకే విసుగు జనించేది "ఇలాంటి సమయాల్లో బుద్ధిలుడే వుంటే ఎంత బాగుండేది!" అనుకునేవాణ్ణి బోధి సంఘుడు సాధారణయువకుడు. నామానసిక కల్లోలాన్ని అర్థంచేసుకోలేడు.

ఒక వారం తరువాత రాజధానిని చేరాము. పెద్ద పెద్ద భవనాలతో అలంకృతమైన రాజప్రాసాదాలతో, వివిధవస్తు సంచయాలయిన బజార్లతో నిండిన మహా నగరాన్ని చూస్తున్నాను. అయినా, మహానగరం నన్నాకర్షించలేక పోతూన్నది. నా దృష్టి మహానగరంమీదా వున్నా, మనస్సు మాత్రం ఎక్కడో వుంది. ఎందుకనో చెప్పలేను. ఈ పట్నం కంటే ఎడారే నన్నెక్కువగా ఆకర్షించింది. ఒక్కొక్కప్పుడు "నేనిక్కడకి ఎందుకు వచ్చాను?" అని నా మనస్సును నేనే ప్రశ్నించుకునేవాణ్ణి.

"ఇక్కడికి వచ్చి మత ప్రచారం చేస్తానని బుద్ధిలుడికి మాట ఇచ్చావు. మాట నిలుపుకోడానికి?" అని మనస్సు చెప్పేది.

మరొకప్పుడు ఇలా ఆలోచించే వాణ్ణి. "దుఃఖం అధికంగా వున్న చోటనే నా సేవకూ, ప్రచారానికీ అవకాశమూ, అవసరమూ వుంటుంది. దుఃఖంలో వున్న ఏ ఒక్క ప్రాణికయినా స్వాంతనను కలిపించ గలిగితే నా జీవితం చరితార్థమైనట్లే. త్యాగ్యుర్కుల తిరుగుబోతు జీవితంలో కంటె వనవాసుల ఆటవిక జీవితంలో కంటె ఈ నాగరిక జీవితంలోనే దుఃఖం అధికంగా ఉందని ఒప్పుకోక తప్పదు. అలాంటప్పుడు నేను మానవాళికి సేవ చేయాల్సింది ఇక్కడే. ఈ ప్రజలకే నా సేవ అవసరం!"

రాజధానిని చేరాము. నగర ద్వారాన్ని దాటి లోపలికి పోయాం. ఎందుకనో నా గుండెలు గతుక్కుమన్నాయి. ఇంతటి నిరాశ, నిస్పృహలు జీవితంలో మరెన్నడూ నే ననుభవించ లేదు. నగర శ్రేష్ఠి నా వెంట వున్నాడు. నగర ద్వారంలోని ద్వారపాలకులు నన్నడ్డగించలేదు. ఎక్కడికి వెళ్లాలి? ఎక్కడ వుండాలి? అన్న సమస్యలూ లేవు. సార్థవాహుడు ముందుగానే తన గృహాన్ని పావనం చేయవలసిందని ప్రార్థించాడు. కానీ, భిక్షువునైన నేను. గృహస్థుల ఆశ్రయంలో వుండడం తగదు. ఏదైనా సంఘారామంలో బస ఏర్పాటు చెయుమని చెప్పవల్సింది. కానీ, నేనేమీ చెప్పకుండా మౌనంగా సార్థవాహుని వెంట నడిచాను. అలా చాలా దూరం వెళ్ళాము ఎన్నో వీధులను గడిచాము. రాజ ప్రాసాదం పట్టణపు దక్షిణ భాగంలో ఉంది.

ఈ పట్టణం మొదట ఒక సామంతుడి రాజధాని. ఛాంగ్ అన్, లోయాంగ్ లాంటి నగరాలు దీనికంటె ఎంతో పెద్దవి! ఈ నగరం రాజధానిగా మారి ఆరేడు సంవత్సరాలే అయింది కనుకనే ఇంకా తగినంతగా అభివృద్ధి కాలేదు. వంకర టింకర మార్గాలూ, మార్గాల ప్రక్కనే ఉన్న రెండంతస్థులవీ, మూడంతస్థులవీ భవనాలూ, ఇరుగ్గావున్నా చూడ ముచ్చటగా వున్నాయి! ఎటు చూసినా దుకాణాలే! నాకో విషయం ఆశ్చర్యాన్ని కలిగించింది. అందరూ అమ్మే వాళ్ళే అయితే కొనేవాళ్ళెవరు! అయితే ఈ విషయాన్ని గురించి ఆశ్చర్య పడనవసరం ఏమీ లేదు. భారత దేశపు మహా నగరాల్లో కంటె కూడా ఇక్కడ దుకాణాలు ఎక్కువగా వున్నమాట స్పష్టం! వ్యాపార జీవనులు కాని శిల్ప కారులూ ఉన్నారీపట్నంలో. రాజ్యాంగ వ్యవహారాలకోసం వచ్చిపోయే ప్రజలూ ఉంటారు. చుట్టుపట్ల నుండి పల్లె ప్రజలూ వస్తూంటారు. వీళ్ళందరూ ఈ దుకాణాల్లో సరుకుల్ని కొంటూంటారు గదా!

కొంత దూరం వెళ్ళాక విశాలమైన రాజవీధిని చేరాము. అక్కడో పెద్ద ప్రహరీ గోడ వుంది. ద్వారాన్ని దాటి ప్రాంగణంలోకి వెళ్ళాము. ఎదురుగా రాజ ప్రాసాదం లాంటి గొప్ప భవనం కనుపించింది. భవనా

నికి రెండు వైపులా పశువుల గృహా ఉన్నాయి. మేము వస్తున్నామన్న వార్త ఒక రోజు ముందే ఇక్కడికి అందింది. సార్థవాహుడికి స్వాగత మీయడాని కందరూ గడపలో నిలబడి వున్నారు. అతడిభార్య ఆనందాతి రేకంలో మైమరచి భర్తను కౌగలించు కుంది. సార్థవాహుని ఇద్దరు కొడుకులూ, కోడళ్ళూ కూడా మాకు ఘనంగా స్వాగతాన్ని ఇచ్చారు.

# 18 వ అధ్యాయం

# వ్యథిత జీవితం

## (క్రీ. శ. 558 - 77)

ప్రథమంగా రాజధానిని చేరిన క్షణాన, నేనెందు కలా ఉదాసీనుణ్ణయ్యాను? యావజ్జీవితమూ యాత్రార్థి నయిన నాలాంటి వాడికి క్రొత్త ప్రదేశానికి వెళ్ళినప్పుడు నిరాశ పడడం, విషాద వదనుడవడం తగదు. ఏ దేశం వెళ్ళినా, ఏ ప్రాంతం వెళ్ళినా అక్కడి ప్రజల్లో తానూ ఒకడయి మెసలడం యాత్రికుడికి ఎంతో అవసరం. సంతోషపడవలసిన విషయం ఏమిటంటే ఆ నిరాశ, ఉదాసీనత నన్నెక్కువ రోజులు పీడించలేదు. కేవలం ఒకటి రెండు రోజులు మాత్రమే ఆ స్థితిలో వున్నాను.

సార్థవాహుడు నన్ను రాజస్థానానికి తీసుకువెళ్ళాడు. చక్రవర్తి వేన్ - శ్వాన్ (క్రీ. శ. 555 - 58) ముందే, సార్థవాహుని ద్వారా నా గురించి విని వున్నాడు. మాకు ఘన స్వాగతాన్ని ఇచ్చాడు. అసాధారణమైన నా యాత్రను గురించి కూడా విన్నాడు చక్రవర్తి. నా సాహసాన్ని చూసి పాండిత్యాన్ని గురించి విని ప్రభావితు డయ్యాడు. రెండు రోజుల అనంతరం నాకు నగరంలో కల్లా పెద్ద దయిన థియేన్-పింగ్ విహారంలో నివాసాన్ని ఏర్పాటు చేశాడు. నా భోజనాన్ని గురించి, ఇతర సౌకర్యాలను గురించి మహారాజు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాడు. మంత్రులనూ, ఇతర కర్మచారులనూ నాకేవిధమైన లోటూ కలక్కుండా చూస్తుండవలసిందని ఆజ్ఞాపించాడు.

అప్పట్లో చీనా దేశం దక్షిణ, ఉత్తర భాగాలుగా విభజింపబడ్డప్పటికి, రెండూ రెండు మహా రాజ్యాలుగా విలసిల్లుతూండేవి. స్వీత

నదీ తీరమంతా ఉత్తర చీనాలో ఉంది. యాంగ్‌చీ తీరం దక్షిణ చీనాలోకి వస్తుంది. అడ్డుగోడ ఉత్తర చీనాకూ, తిరుగుబోతుల దేశానికి మధ్యలో ఉంది. అయితే స్వాభావికమైనవే గానీ, అస్వాభావికమైనవే గానీ ఎలాంటి అభ్యంతరాలూ వాళ్ళనూ ఆపలేకపోతున్నాయి. హూణ వంశజులైన తిరుగుబోతులు మిత్రభావంతో గానీ, శత్రుభావంతో గానీ స్ఫీత నదీ తీర ప్రదేశాల్లోకి వస్తూనే ఉన్నారు. వెనుక చెప్పిన వేయీ (తోపా) వంశం దాదాపు రెండు వందల సంవత్సరాలపాటు ఉత్తర చీనా నంతటినీ అవిచ్ఛిన్నంగా పరిపాలించింది. అడ్డగోడలు చేయలేని మహత్కార్యాన్ని చీనా ప్రజలూ, వారి సభ్యతా చేసి చూపించాయి. మిత్ర భావంతోగానీ, శత్రు భావంతోగానీ ఈ దేశంలోకివచ్చిన సమస్త జాతులూ మహాసముద్రంలోని నదుల్లా, తమ వ్యక్తిత్వాలనూ, జాతీయ ప్రత్యేకతల్నీ గోల్పోయి, ఈ దేశ ప్రజల్లో కలిసిపోయారు. హాన్ వంశం (క్రీ. శ. 220) పతనమయ్యాక చీనా దేశం ఉత్తర దక్షిణ, పశ్చిమ దేశాలుగా విభక్తమయింది. ఉత్తర ప్రాంతాన్ని వేయీ వంశమూ, దక్షిణ ప్రాంతాన్ని వూ వంశమూ, పశ్చిమ ప్రాంతాన్ని శూ వంశమూ పరిపాలిస్తూ వుండేవి. ఉత్తరదేశాన్ని పరిపాలించే వేయీ రాజ దర్బారులోని ఒకానొక మంత్రి స్వయంగా రాజయ్యాడు. మిగిలిన రెండు వంశాలను కూడా అంత మొందించి, సమస్త చీనా దేశాన్ని 51 సంవత్సరాలు ఏకచ్ఛత్రం క్రింద పరిపాలించాడు. ఇతడు చిన వంశ మనే నూతన వంశాన్ని స్థాపించాడు. తరువాత 70 సంవత్సరాలపాటు అరాచకత్వం ప్రబలింది. అనంతరం తోపా వంశం రాజ్యాధికారానికి వచ్చింది. వీరు తను రాజధానిని తాతుంగ్ వద్ద నిర్మించుకున్నారు. ప్రక్కనే వున్న పర్వతాల్లో అద్భుతమైన విహారాలను నిర్మించారు. ఈ వంశంలోని శ్యావు - వేన్ (471-500) అనే చక్రవర్తి వెనుకటి రాజధానిని వదలి లోయాంగ్‌ను రాజధానిగా చేసుకున్నాడు. దీంతో తోపా వంశం తన హూణత్వాన్ని సంపూర్తిగా గోల్పోయింది. మనుష్యులకు వలెనే రాజ వంశాలకూడా తారుణ్యం వృద్ధాప్యం వుంటుంది. కొంత కాలానికి పై చెప్పిన వేయీ వంశం కొద్ది సంవత్సరాల పరిపాలనానంతరం తూర్పు వేయీ, పశ్చిమ వేయీ అనే రెండు వంశాలుగా

విభక్తమయింది: ఈ రెండు వంశాలూ అనతికాలంలోనే తన నీచీ మంత్రుల చేత ఓడింపబడి సమాప్తమయ్యాయి. ఉత్తర చీ వంశం, ఉత్తర చావూ వంశం అనే రెండు క్రొత్త రాజవంశాలు ఉద్భవించాయి. ఉత్తర చీ వంశంలోని ఒకానొక రాజు, సామంతుడి ముఖ్య పట్టణమైన 'యేహో' నగరాన్ని రాజధానిని చేసుకున్నాడని ముందే చెప్పాను. ఈ ఉత్తర చీ వంశం మొత్తం 27 సంవత్సరాలు రాజ్యపాలన చేసింది. వీరిలో నన్నాదరించిన చక్రవర్తి వేన్‌షియేన్ టీ 9 సంవత్సరాలు (క్రీ. శ. 550 నుండి 59 వరకూ) మాత్రం రాజ్యం చేశాడు. (ఇతడి తరువాతవాడు కేవలం ఒక సంవత్సరం మాత్రమే రాజ్యం చేశాడు. అతడి తరువాత శ్యావు చావు, వూ చాంగ్ టీ అనేవారు ఇద్దరూ కొద్ది మాసాలే రాజ్యం చేయగలిగారు. తరువాత హౌవు చూ అనే చక్రవర్తి పన్నెండు సంవత్సరాలు రాజ్యం చేశాడు. ఇతడి తరువాత మరొక రిద్దరు కొద్ది నెలలు పరిపాలించారు. వాళ్ళ పరిపాలనను పరిపాలన అనడానికి వీల్లేదు. చివరకు ఉత్తర చావూ వంశం, చీ వంశాన్ని అంత మొందించింది. ఈ రాజ్యాన్ని గూడా తన ఏలికలోకి తీసుకుంది. 'యేహో' నగరం తన హోదాను గోల్పోయింది. ఛాంగ్ ఆన్ రాజధానయింది.

చీ వంశం రాజ్యాధికారానికి వచ్చిన 8వ ఏట నేను "యేహో" నగరాన్ని చేరాను. అప్పుడు నేను నలభై ఏండ్ల వయసులో వున్నాను. నేనా పట్నంలో ఏక బిగువున 19 సంవత్సరాలున్నాను. ఆ పందొమ్మిది సంవత్సరాలూ రాజ సన్మానాలతో గొప్ప గౌరవమర్యాదలతో గడిచాయి. పందొమ్మిది సంవత్సరాల అనంతరం, నా 59వ ఏట నేనా పట్నాన్ని వదిలి వెళ్ళిపోయాను అలాంటి క్లిష్టపరిస్థితులు ఏర్పడ్డాయప్పుడు. చీనాదేశంలో బౌద్ధమతానుయాయులైన చక్రవర్తులు ఎందరో ఉద్భవించారు. బౌద్ధమతాన్ని అన్నివిధాలా అభివృద్ధికి తెచ్చారు. అయితే, బౌద్ధమతాన్ని సర్వ నాశనం చెయ్యడానికి తలపెట్టిన చక్రవర్తులూ కొందరు పుట్టుకొచ్చారు. వీళ్ళు బౌద్ధారామాలనూ, మందిరాలనూ పడగొట్టించేవారు. బుద్ధ విగ్రహాలను పగులగొట్టేవారు. భిక్షువులనూ, సన్యాసినులనూ కాషాయాంబరాలను వదిలేసి గృహస్థులు కండని బలవంతం పెట్టేవారు. ఒక్కొక్కప్పుడు భిక్షువులనూ, సన్యాసినులనూ సజీవులుగా పూడ్చిపెట్టేవారు.

వే-పేయీ వంశపు తాయి వూ (క్రీ. శ. 424-451) చక్రవర్తి ఇలాగే చేశాడు. భిక్షువులనూ, సన్యాసినులనూ సజీవంగాపూడ్చిపెట్టించాడు. బౌద్ధ గ్రంథాల నెన్నింటినో తగుల బెట్టించాడు. అతడు తన 27 సంవత్సరాల రాజ్యపాలనలోనూ బౌద్ధమతాన్ని నామరూపాలు లేకుండా చేయడానికి సర్వవిధాలా ప్రయత్నించాడు. అయితే, మానవులు పుడతారు, చని పోతారు. కానీ లోకహిత సాధకాలయిన ఉత్తమ భావాలు నశించవు. ప్రజల మస్తిష్కాలను విడిచి పోలేవు. పోవు. తాయి-వూ గతించిన మరుక్షణానే, హేమంతంలో వాడిపోయిన వనస్పతి వసంతంలో తిరిగి చిగిర్చినట్లు బౌద్ధమతం మూడు.పూవులూ ఆరుకాయలూ కాసింది. భిక్షు వుల సంఖ్య వెనకటికంటె కూడా అధికమైంది. దేశపు ఇతర ప్రాంతా ల్లోనే కాకుండా రాజధాని అయిన లోయాంగ్‌లోనూ అనేక వేలమంది. భిక్షువులు తయారయ్యారు. ఏ బజారులో విన్నా, ఏ మూల చూసినా సూత్రఘోష చెవులను గింగురు మనిపిస్తూండేది. ఉత్తరపేయీ వంశపు చివరికాలంలో దేశం మొత్తంలో 20 వేలమంది భిక్షువులు తయా రయ్యారు. 30 వేలదాకా బౌద్ధ మందిరాలు నిర్మింపబడ్డాయి. ఇదీ ఒక రకమైన "అతి" అంటాను. భిక్షువులు తమ ఆహారం కోసం ఎలాంటి పరిశ్రమనూ చేయరు. ఇతరుల సంపాదనమీద ఆధారపడి బ్రతుకు తూంటారు. ప్రజల్లో భిక్షువులపట్ల శ్రద్ధాసక్తులు పెరుగుతూన్నకొలది దానదక్షిణలు అధికంగా లభిస్తూంటాయి. ఆ ధనంతో భిక్షువులు సర్వ సౌఖ్యాలనూ అనుభవిస్తూంటారు. వీళ్ళను చూసి, సుఖభోగాలను అనుభ వించాలనే తృష్ణతో ఎంతోమంది అయోగ్యులుకూడా భిక్షువు లవుతారు. వీరివలన జరిగే దుశ్చర్య లన్నింటికి బౌద్ధమతం బాధ్యతను వహించ వలసి వుంటుంది. బౌద్ధధర్మం అప్రతిష్ఠ పాలవుతుంది. ఈ స్థితిని అరి కట్టాలంటే భిక్షువుల సంఖ్యను అదుపులో వుంచాలి. బాగా పరీక్షించిన తరువాత. యోగ్యులైన వ్యక్తుల్ని మాత్రమే సంఘంలోకి తీసుకోవాలి. ఈ దురాచారం కారణంగానే ఒక్కొమారు బౌద్ధ మతం మహారాజుల క్రోధానికి గురి అవుతోంది.

నేనూ, బోధిసంఘుడూ థియేన్ - పింగ్ విహారంలో వుంటు న్నాము. ఈ విహారంలోనే ఫా-చే అనే చీనీ భిక్షువు మిత్రుడయ్యాడు.

అతడూ నాకు సహాయభూతుడుగా వుండి, అనువాద కార్యక్రమంలో సహకరిస్తూ వుండేవాడు. చీనాదేశంలో వెనుక కన్-ఫూ-జూ, లావు-జూ అనే ఇద్దరు మతకర్తలు ఉద్భవించారు. వీరిద్దరూ బుద్ధుని సమకాలికులు. భారతదేశంలో బుద్ధుడు దుఃఖిత మానవులకు తరణోపాయాన్ని చూపుతూన్న కాలంలోనే వీరిద్దరూ చీనాదేశంలో పుట్టి, తమ భావాలను ప్రజల్లో ప్రచారం చేసుకుంటున్నారు. కన్ ఫూ జీ మతం ఇహ జీవితానికి సంబంధించింది. మానవుడు సద్వర్తనుడవాలంటుంది. తల్లిదండ్రుల ఎడల భయభక్తులు ప్రదర్శించమనీ, రాజుపట్లా, రాజాజ్ఞలపట్లా విధేయతను ప్రదర్శించమనీ అంటుందీమతం. లావు జూ వేదాంతాచార్యుడు. ఇతడి మతంలోనూ, భిక్షువులూ, సన్యాసినులూ వుంటారు. వీరిద్దరూ స్వదేశస్థులవడం వలన, వీరి ఉపదేశాలు చీనీ ప్రజల దృష్టినాకర్షించడం సహజం. ఈ రెండు మతాల అనుయాయులూ, ఆచార్యులూ బౌద్ధ మతాభివృద్ధిని ఏమాత్రం సహించలేరు. విహారాల్లో భిక్షూ భిక్షుణుల సంఖ్య అధికమై, అనాచారతా, దురాచారాలూ ప్రబలినప్పుడు, ఈ మత పెద్దలు బౌద్ధమతాన్ని అణచి వేయడానికి, బౌద్ధ మతాన్ని నాశనం చేయడానికీ ఓ చక్కని అవకాశం లభిస్తూంటుంది. బౌద్ధమతం ఇతర మతాల్ని ద్వేషించవద్దంటుంది. మేము ఏ మతాన్ని ద్వేషించము. అన్యమతాలపట్ల సామరస్య భావంతో వ్యవహరిస్తూంటాము. మా ఈ ప్రవృత్తిని మరీ ప్రమాదకరమైందిగా వుంటుంది. పై మతాలవారికి, వాళ్ళు మా సామరస్యాన్ని నిందిస్తూ "మమ్మల్ని మీలో కలుపుకోవడానికి ఇదో ఎత్తు" అనేవారు.

చక్రవర్తి బౌద్ధ మతాభిమాని. బుద్ధభక్తుడు. ఇతడు రాజ్యానికి వచ్చిన ఈ ఏడెనిమిది సంవత్సరాల్లోనే బౌద్ధమత గ్రంథాల నెన్నింటినో ప్రోగు చేశాడు. నేను ఇక్కడికి వచ్చిన మరుసటి రోజునే, తాళ భూర్జ గ్రంథాలమీద వ్రాసిన సంస్కృత గ్రంథాల నెన్నింటినో నా దగ్గరకు పంపించాడు. వాటిని తమ దేశ ప్రజలకు అర్థమయ్యేట్టు చీనీ భాషలోకి అనువదించమని ఆజ్ఞాపించాడు.

ఈ వంశం రాజ్యంచేస్తూన్న కాలంలో 'యేహా' నగరంలోవున్న భారతీయ భిక్షువును నేనొక్కడ్నే. ఈ సమయంలో సంస్కృతగ్రంథాలను

చీనీ భాషలోకి అనువాదం చేసిన భిక్షువునూ నేనొక్కణ్ణే కానీ, చీనీ దేశం రావడానికి పదిహేను పదహారు సంవత్సరాల క్రితం, పూర్వ వేయీ వంశపు రాజకాలంలో భారతీయ పండిత భిక్షువులు కొందరు సంస్కృత గ్రంథాల నెన్నింటినో చీనీ భాషలోకి అనువదించారు. వారణాసిలో జన్మించిన గౌతమ ప్రజ్ఞారుచి 16 గ్రంథాలదాకా చీనీ భాషలోకి అనువదించాడు. ఇతడి అనువాదాలు ఒకరకంగా నాకు మార్గదర్శకా లయ్యాయి. ఉద్యాన నివాసి అయిన ఉపశూన్యుడుకూడా ఎన్నో గ్రంథాల ననువదించాడు. ప్రజ్ఞారుచికి సహకారిగా వున్న విమోక్ష ప్రజ్ఞుడు కూడా కొన్ని గ్రంథాలను అనువదించాడు. ఈ దేశీయులు విమోక్ష ప్రజ్ఞుడు శాక్య వంశీయుడే నంటారు. శక, శాక్య ఈ రెండు శబ్దాలూ ఒకటేనని వీరి భావన. ధర్మబోధి అనే మరో భారతీయ భిక్షువు "మహా పరినిర్వాణ సూత్రా"న్ని చీనీభాషలోకి అనువదించాడు. ముందుగా ఈ అనువాదాలను మూల గ్రంథాల సహాయంతో ఒకమాటు చదువుకున్నాను గ్రంథానువాదానికి అవసరమైన చీనీ భాషాజ్ఞానం నాకు లేదు. అయితే, చీనీ పండిత భిక్షువుల సహకారంతో ఈ కార్యక్రమాన్ని నిర్వహించాలని నిశ్చయించుకున్నాను. ఫా – చే సహకరించడానికి సిద్ధంగా ఉన్నాడు. కొన్ని నెల్లపాటు, గతంలో జరిగిన అనువాదాల్ని పరిశీలించాక, భిక్షువు ఫా–చే సహకారంతో గ్రంథాల ననువదించగలనన్న నమ్మకం కలిగింది.

'యేహా' నగరంలో ఉన్న భారతీయ పండిత భిక్షువును నేనొక్కణ్ణే కావచ్చును. కానీ, ఉత్తర దక్షిణ చీనా దేశాలలో ఎంతో మంది సంస్కృత గ్రంథాలను చీనీ భాషలోకి అనువదిస్తున్న పండిత భిక్షువులున్నారు. బుద్ధుని ఉపదేశాలు సంస్కృతంలోమాత్రమే ఉన్నంతవరకూ, ఇక్కడి ప్రజల కవి దురూహ్యాలుగానే ఉంటాయి. బుద్ధుని ప్రవచనాలను ప్రజా బాహుళ్యానికి అందచేసే పవిత్ర అనువాద కార్యాన్ని ప్రతిచోటా విరివిగా భారతీయ, చీనీ భిక్షువులు కొనసాగిస్తున్నారు. ఉత్తర చావూ వంశపు రాజధాని అయిన ఛాంగ్–అన్ నగరంలో గుణభద్రుడు, జ్ఞానయశుడు, యశోగుప్తుడు, జ్ఞాన గుప్తుడు – మొదలుగా గల పండిత భిక్షువులు అనువాద కార్యాన్ని సాగిస్తున్నారు. 'యేహా' నగరానికి వచ్చిన మొదటి సంవత్సరంలోనే (క్రీ. శ. 558 లో) "చంద్ర ద్వీప

సమాధి సూత్రం" "మహా కరుణ పుండరీక సూత్రం", "సుమేరు గర్భ సూత్రం", "పదీపదానీయ సూత్రం", మొదలైన గ్రంథాలను అనువాదం చేశాను. తరువాత సంవత్సరంనుంచి నామీద మరికొన్ని ఇతర బాధ్యతలు కూడా వచ్చి పడ్డాయి. వాటి కారణంగా అనువాద కార్యక్రమం మొదటి సంవత్సరమంత చురుగ్గా సాగలేదు. మొత్తంగా చూస్తే మరికొన్ని గ్రంథాలనుకూడా అనువాదం చేశాను. నేనుఅనువాదంచేసిన ఇతర గ్రంథాలివి: "అభిధర్మ హృదయశాస్త్రం", "చంద్ర గర్భ సూత్రం", "పితాపుత్ర సమాగమ సూత్రం."

ఇక్కడికి వచ్చిన మొదటి సంవత్సరంలో పై నాలుగు గ్రంథాలను మాత్రం అనువాదం చేశాను. రెండవ సంవత్సరంలో వేన-శ్వేన్ మహారాజు తన రాజధానిలోని భిక్షు సంఘానికి నాయకుణ్ణి చేశాడు నన్ను। నేనీ పదవిని కోరలేదు; పైగా వద్దన్నాను కూడాను. కానీ, చక్రవర్తి ఒప్పుకోలేదు. "బౌద్ధ మతాభివృద్ధిని కాంక్షించే మీలాంటి వారే సంఘాల మంచి చెడ్డల్ని చూడ నిరాకరిస్తే, మరెవరు చూస్తారు చెప్పండి?" అన్నాడు. ఈ వంశం రాజ్యానికి వచ్చి, ఎనిమిది తొమ్మిది సంవత్సరాలు మాత్రమే అయింది. నూతన రాజవంశాయ కీర్తిని సంపాయించాలంటే సంఘారామాల్ని తప్పని సరిగా నిర్మించాలి. ఉత్తర చీ వంశానికి ప్రతిద్వంది అయిన ఉత్తర చావూ వంశం, తన రాజధాని అయిన ఛాంగ్ - ఆన్ నగరంలో సంఘరాజు అనే సంఘారామాన్ని నిర్మించింది. ఆ రాజ్యంలోని సమస్త సంఘారామాలూ, ఈ సంఘరాజు అధీనంలో వుంటాయి ప్రతి రాజ్యంలోనూ రాజ్యం తరపున నడపబడే సంఘారామం ఒకటి తప్పకుండా వుంటుంది. ఈ రాజ్యంలోనూ అలాంటి రాజకీయ సంఘారామం వుంది. మహారాజు నన్నా సంఘారామానికి నాయకస్థవిరుణ్ని చేయాలని పట్టు పట్టారు. ఈ పదవికి తగివున్నానని నేననుకోవడం లేదు, కాని, మహారాజుగారూ ఇతర భిక్షువులూ నేనే ఈ పదవికి తగిపోతానని భావిస్తూండడం వలన వారి అభిప్రాయానికి తల వంచాను. దూరంగా వుండి అభిప్రాయాల్ని చెప్పడం వేరు, స్వయంగా కార్యభారాన్ని నెత్తిన వేసుకుని ఈదడం వేరు. సంఘాన్ని అనుశాసనలో వుంచాలన్నప్పుడు, హృదయంలో దయకే కాక కఠినత్వానికూడా స్థాన

మీయాల్సి వుంటుంది. అలాంటి స్థితిలో ఏ కొందరికో తప్పకుండా విరోధుల మవుతాము। అయితే. ఈ మాత్రానికి భయపడి కార్యభారాన్ని మోయ నిరాకరించే వ్యక్తిని కాను.

నేను మొత్తం 19 సంవత్సరాలు "యేవో" నగరంగా వున్నానని చెప్పాను. ఈ పందొమ్మిది సంవత్సరాల్లోనూ మొదటి సంవత్సరంలోనే అనువాద కార్యక్రమం చురుగ్గా సాగింది. మిగిలిన 18 సంవత్సరాల్లోనూ కేవలం మూడు మామూలు గ్రంథాలను మాత్రం అనువాదం చేశాను. ఈ అనువాదాలవల్ల చీ రాజవంశానికి, ఇన్ని గ్రంథాలను అనువాదం చేయించిన అమరకీర్తి లభించిందన్న సంతృప్తి దక్కింది. అనువాదాలవల్ల అమ కీర్తిని సంపాయించానన్న సంతృప్తిని నేనూ పొందేవాణ్ణే। కానీ అమరత్వంపట్ల నా కెలాంటి విశ్వాసమూ లేదు. నేను క్షణికవాదిని। కనుక నా అనువాదాలను చూసి నే నెన్నడూ గర్వపడలేదు, పడను। అనంత కాలాల వరకూ నిలిచే కీర్తికంటే, తత్కాలంలో లభించే రవ్వంత శాంతి నాకెంతో గొప్ప। అనువదించడానికి గొప్పగొప్ప గ్రంథాలెన్నో ఉన్నాయి. బుద్ధిలుడు తన చేత్తో వ్రాసి ఇచ్చిన "ప్రమాణ సముచ్చయం" ప్రతి కూడా ఒకటి నా దగ్గర ఉంది. దీన్ని అనువాదం చెయ్యాలన్న సంకల్పం కలిగింది. అయితే మనస్సు అంగీకరించలేదు. నేను అనువాదం చేసినవన్నీ మహాయాన గ్రంథాలే। ఇతర ప్రాణులకోసం ఈ జీవితాన్ని వినియోగించడ మనేది నా పరమ పవిత్రమైన ఆదర్శం। ఆర్యసూరుడి జాతక కథామాలను ఎలాగో సంపాయించాను. రోజూ జాతక కథలను పారాయణ చేస్తూండేవాణ్ణి। బోధిసత్వుడి మహాత్యాగాలు నన్నెంతగానో ఆకర్షించేవి. నేనూ బోధిసత్వుడిలా అన్యజీవుల సుఖం కోసం పాటుపడా లనుకున్నాను.

నేను అన్యప్రాణుల సుఖం కోసం పాటుపడుతూన్నకొలది హృదయం ద్రవిస్తుండేది. ఏ ప్రాణి బాధనూ సహించలేక పోతూండేవాణ్ణి। చుట్టు పక్కలగల పల్లెలకు వెడుతూండేవాణ్ణి. అక్కడ బాధలు పడే స్త్రీ, బాల, వృద్ధుల్ని చూసినప్పుడు విపరీతమైన మానసిక వేదనను అనుభవించేవాణ్ణి।వాళ్ళను ఆయా బాధనుండి కాపాడకుండా ఉండలేక పోయేవాణ్ణి. అలా కాపాడడం నా కర్తవ్యం అనుకునేవాణ్ణి. ఇక్కడికి

వచ్చాక నేను వైద్యశాస్త్రాన్ని చక్కగా అభ్యసించాను. చీనీ భిక్షువులు
ప్రజాసేవకు వైద్యశాస్త్రం ఓ గొప్ప సాధనంగా భావిస్తారు. ఈ దేశం
లోని భిక్షువులూ, భిక్షుణీలూ విధిగా వైద్యశాస్త్రంతో పరిచయాన్ని కలిగి
వుంటారు. కిన్-ఫూ-టీ, లవు-జూ, మతానుయాయులు ఈ వైద్యశాస్త్ర
పరిచయం కూడా ప్రజల్ని వశపరుచుకోవడానికి వేసే ఎత్తుల్లో ఒకటి
అనేవారు. అయితే, సదాశయంతో ప్రారంభించిన సత్కార్యాన్ని ఎవరో
ఏమో అన్నారని మానగలమా?

ఎంత అభ్యసించినా నేను నేర్పరైన వైద్యుణ్ని కాలేకపోయాను.
ఏ విషయంలోనైనా గొప్ప నేర్పును పొందాలంటే మానవుడు పుట్టుక
తోనే కొన్ని ప్రత్యేక లక్షణాలను తోడు తెచ్చుకోవా లనుకుంటున్నాను.
నాలో అలాంటి లక్షణా లేవీ లేనందున నే నే మాత్రమూ కించపడటం
లేదు. నాకు వైద్య శాస్త్రంలో ప్రావీణ్యతేఉన్నట్లయితే రోగులకు వైద్యం
చేయడంలోనే నా సమయమంతా గడిచిపోయేది మొత్తం చీ రాజ్యం
లోని సంఘారామాల్లో వైద్యానికో ప్రముఖ స్థానాన్నియడానికి తగిన
ఏర్పాట్లను చేయలేకపోయే వాడిని। సంఘారామాల్లో రోగులకు వైద్యం
చేయడమనేది, వెనుకటినుండి వున్న ఆచారమే। అయితే, ఇప్పటిలా
వ్యాపకంగానూ, ఒక పద్ధతిలోనూ లేదీ ఆచారం। ప్రతి సంఘారామం
లోనూరోగులకు విలువవుండేవసతివెనుకలేదు. నే నా వసతినికల్పించాను.

మహారాజు నన్ను సుఖభోగాల్లోనూ సంపత్సౌఖ్యాల్లోనూ ముంచా
లని చూశాడు. కానీ, సంపదను నే నెన్నడూ కోరలేదు. సుఖాలను
కామించి ఆనందించేవాణ్ణి కాదు. ప్రాణికోటిని దుఃఖంలోనుండి విముక్తం
చేయడానికి నా సర్వస్వాన్నీ త్యాగం చేయడమే నాకు పరమానందం।
అసలు వినయ పిటకంలో భిక్షువు వెండి బంగారాలనూ, ధనాన్నీ ముట్ట
రాదని ఉంది. ఆర్థిక దృష్ట్యా భిక్షువు అట్టడుగు మానవుడితో సమానంగా
ఉండాలని వినయ నియమాల ఆశయం। కొందరు మహానుభావులు ఇంకా
కూడా ముందుకుపోతారు. ధనాన్నే కాకుండా నూతన వస్త్రాలనుకూడా
ముట్టుకోరు. చిరిగిపోయిన చింకిపాతలతో తమ చీవరాలను తయారు
చేసుకుంటూ ఉంటారు. నేనూ నాకొరకు ధనాన్ని స్వీకరించను। ఇతరుల
సహాయార్థం అవసరమైతే ధనాన్ని స్వీకరిస్తాను. సంఘ నాయకుణ్ని

యాక కొన్ని నియమాలను ఏర్పరచుకున్నాను. కేవలం భిక్షాటన ద్వారా లభించిన భోజనాన్ని మాత్రమే భుజించాలన్నది ఒకటి; చింకిపాతలతో తయారుచేసిన చీవరాన్ని మాత్రమే ధరించాలన్నది రెండవది. ఈ రెండు నియమాలనూ జీవితాంతం పాటించాను.

ఐదు సంవత్సరాల అనంతరంగానీ నా ఆదర్శాలు ఫలించలేదు. గుణభద్రుడనే వైద్య భిక్షువు ఒకడు నాకు మిత్రుడయ్యాడు. ఇతడు కుస్తన్‌నగర నివాసి; గుణభద్రుడికి, అనువాదం చేయగల యోగ్యత, భాషాజ్ఞానమూ ఉన్నాయి. కానీ, ఇతడే గ్రంథాన్ని అనువాదంచేయలేదు. ఈ కారణంగా ఎక్కడా ఇతడి పేరు కనుపించదు, భవిష్యత్తరాల వారు ఇతణ్ని పూర్తిగా మర్చిపోవచ్చు కూడాను. అయితే, లక్షల సంవత్సరాల వరకూ కీర్తి నిలచివుండేట్టు ఏదోగొప్ప ఘనకార్యాన్ని సాధించడంకంటే బాధామయజీవి అయిన ఎదటి మానవుడికి ఒక్క క్షణం సుఖాన్నియ్యడమే మా మహోన్నత ఆదర్శం; నేను సంఘ నాయకుణ్నయిన మొదటి సంవత్సరంలోనే ఖ్యాన్-పింగ్ సంఘారామం వద్ద ఒక పెద్ద వైద్యశాలను కట్టించాను. అందులో భేషజ్య గురువు ప్రతిమ నొకదాన్ని స్థాపించాను. ఈ ప్రతిమ కంచుతోగానీ, ఇతర లోహాలతోగాని చేయించింది కాదు. కేవలం మట్టితో చేయించింది ప్రతిమ; లోహ సంబంధమైన ప్రతిమలమీద దుష్టుల దృష్టి పడడమూ, వాటిని కరిగించి, అమ్మి అకార్యాలకు ఆ ధనాన్ని వాడడమూ మనం చూస్తూనే వున్నాము. అలాంటి దుర్గతి పట్టరాదనే ఉద్దేశ్యంతోనే భేషజ్య గురువు ప్రతిమను మట్టితో చేయించాను. తనను గౌరవించేవారూ, రక్షించేవారూ ఉన్నన్నాళ్లూ మాత్రమే ఈ ప్రతిమా ఉంటుంది.

వైద్యశాలను కట్టేపుడు రోగులను ఉంచే గదులపట్ల ప్రత్యేకమైన శ్రద్ధను తీసుకున్నాము. వాటి కొరకు ధనాన్ని కూడా అధికంగానే వెచ్చించాము.

కూలీలు భవన నిర్మాణం చేస్తున్నారు. కొందరు ఇటుకల్ని తయారుచేస్తున్నారు. ఇంకొందరు మట్టి మోస్తున్నారు. నేను చూస్తూ నిలబడి ఉన్నాను. తోటి మానవులు పని చేస్తూ వుంటే అలా చేతులు కట్టుకు నిలబడి ఉండడం నా మనస్సును బాధించింది. నేను వెంటనే మట్టి

బుట్టను నెత్తి కెత్తుకున్నాను. నేనూ మట్టి మోయసాగాను. మట్టి మోయాలన్న నిర్ణయాన్ని అప్పటికప్పుడు చేసుకున్నాను. నిర్ణయించుకున్న తరువాత ఇక ఆగడమంటూ ఉండదు. ఈ విషయంలో నలుగురూ నన్ను విమర్శించవచ్చును. "చూశారా! సంఘ నాయకుడై ఉండి కూడా గర్వం లేకుండా ఎలా మట్టి తట్టలు మోస్తున్నాడో!" అని అనిపించుకోవడానికే ఇలా చేస్తున్నానని అనుకోవచ్చును. నా హృదయాన్ని వొకమాటు తడివి చూసుకున్నాను. అలాంటి గర్వానికి అసలు స్థానమే లేదు. అయితే, నా ప్రక్కనే ఉన్న భిక్షువులూ, రాజకీయ ఉద్యోగులూ అభ్యంతర పెట్టారు. అయినా, నే నాగనని వాళ్ళకూ తెల్పాను. చింకిపాతల్తో తయారు చేసుకున్న కాషాయరంగు చీవరానికి మట్టి కొట్టుకుంటే వచ్చే నష్టం ఏముంటుంది? పోనీ నేనేమైనా సుకుమారంగా పెరిగినవాణ్ణి గనుక, మట్టి మోయడం ఎలాగా అని బాధ పడతానా? ఆ రోజంతా మట్టి మోశాను. ఈ విషయం చీ రాజ్యం అంతట్లోనూ మారుమోగింది. చక్రవర్తి చెవిన కూడా పడ్డది. ఇందువల్ల ఓ మంచిమాత్రం జరిగింది. మిగిలిన భిక్షువులు కూడా ఇలాంటి పనులు చేయసాగారు.

నేను తరచుగా ఇతర సంఘారామాలను చూసి రావడానికి బయటి పల్లెలకూ, పట్నాలకూ వెళ్తూండేవాణ్ణి. గుణమిత్రుడు మాత్రం ఎప్పుడూ రాజధానిలోనే ఉండేవాడు. ధియేన్-పింగ్ మహా చికిత్సాలయానికి అతడు మహావైద్యుడు. చక్రవర్తి నగరంలో ఒక శుశ్రూషాలయాన్నికూడా కట్టించాడు. గుణభద్రుడు అక్కడికీ వెళ్ళి చూసి వస్తూండేవాడు. గుణమిత్రుడు చేసిన మరో గొప్ప చెప్పకుండా ఉండలేను. సుయోగ్యులైన వైద్యుల్ని తయారుచేశాడు. నేను సంఘ నాయకుణ్ణయ్యాక భిక్షుత్వ దీక్షను, రాజ్యం మొత్తానికీ ధియేన్-పింగ్ విహారం మాత్రమే ఇచ్చేట్టు చేశాను. భిక్షుత్వాన్ని స్వీకరింపదలచినవారు ఎంత దూరాన్నుండి అయినా ధియేన్-పింగ్ విహారానికి రావలసిందే। నేనూ, ఇతర భిక్షువులూ, అనేక విధాల పరీక్ష చేసిగానీ నూతనులకు భిక్షుత్వాన్ని ఇచ్చేవారం కాదు. అయోగ్యులూ, కేవలం సుఖలాలసతో వచ్చేవారూ సంఘాల్లో చేరకుండా తగు జాగ్రత్తలు తీసుకునేవారం। సంఘాల్లో చేరిన యువతీయువకుల చదువుసంధ్యల్ని గురించికూడా జాగ్రత్త తీసుకునేవాళ్ళం। నగర ప్రాకారం

లోపల వెనకే ఒక స్త్రీల సంఘారామం ఉంది. అయితే అది ఇప్పుడు సరిపోవడం లేదు. అనేక విధాల సువ్యవస్థిత మౌతూన్న సంఘారామాల్లోకి స్త్రీలుకూడా విరివిగా వస్తూన్నారు. చక్రవర్తిగారి కూతురు కూడా ప్రవ్రజ్యను స్వీకరించి భిక్షుణి అయింది. ఆమె స్త్రీల సంఘారామం దగ్గర విశేషంగా ధనాన్ని వెచ్చించి స్త్రీలకో వైద్యశాలను కట్టించింది. అంతే కాకుండా, చికిత్సాశాస్త్రాన్నికూడా అభ్యసించింది.

నేనెక్కడికి వెళ్ళినా, అక్కడున్న వైద్యశాలకు తప్పకుండా వెళ్లేవాణ్ణి; రోగుల్ని పరామర్శించేవాణ్ణి; వాళ్ళ కష్టసుఖాలను వాళ్ళ నోటి మీదుగా వినేవాణ్ణి। వెనకే చీ రాజ్యంలో ప్రతి గ్రామంలోనూ సంఘారామాలున్నాయి. నేను సంఘనాయకుడిగా వున్న మొదటి పదిసంవత్సరాల్లోనూ ప్రతి సంఘారామానికి అనుబంధ శాఖగా ఒక వైద్యశాలను కట్టించాను. రాజధానిలోని ధియేన్-పింగ్ సంఘారామాన్ని అనుకుని వున్న ఉద్యానవనాన్ని ఇంకా పెద్దది చేయించి, వైద్యానికి ఉపయోగపడే మొక్కల్ని నాటించాను. ఇతర గ్రామాల్లోకూడా వైద్య ఉద్యానాలను పెంచే ఏర్పాట్లు చేశాను. మొక్కలూ వాటి గుణగణాలూ ప్రజలకు తెలిసేట్టు చేశాను. ధియేన్ - పింగ్ విహారంవద్ద ఔషధ నిర్మాణశాల నొకదాన్ని నిర్మించడం జరిగింది. వైద్యం విషయంలో దేశగత, వ్యక్తిగత భేదాలను, లెక్కపెట్టేవాణ్ణి కాదు. ఎలాంటి పక్షపాతానికి తావిచ్చేవాణ్ణి కాదు. రోగి అయిన ప్రతివాడూ వైద్యం చేయించుకోడానికి హక్కుదారే.

సంఘారామాలనూ, వైద్యశాలలనూ వాటి సద్వ్యవస్థనూ చూస్తూండడం నా కర్తవ్యం కావడం వలన ఎప్పుడూ గ్రామాలవెంట తిరుగుతూ వుండేవాణ్ని. నా వెంట మరో ఐదుగురు భిక్షువులు వుండేవారు. మా తిండి భారాన్ని ఏ వక్కరిమీదనో వేయడం మాకు ఇష్టంలేదు. భిక్ష తెచ్చుకు తినేవాళ్ళం. నేను అంగవిహీనుల శరణాలయా న్నొకదాన్ని కట్టించాను. చక్రవర్తి నాకు ఇచ్చే ధనాన్ని ఇలాగే వైద్యశాలల్ని, శరణాలయాల్ని కట్టించడంలో, వాటి వ్యవస్థకొరకూ ఖర్చుపెడుతూ వుండేవాణ్ని। ప్రయాణాల్లో, యాత్రల్లో కనిపిస్తూండే అనాథలందరినీ శరణాలయాలకు చేర్చే ఏర్పాట్లు చేసేవాణ్ని। గ్రామాల్లోని ప్రజలు

నీటికి నానాయాతనలూ పడడాన్ని చూశాను. ఎంతో దూరాన్నుండి మోసుకు తెచ్చుకుని మురికి నీటిని త్రాగుతూన్న ప్రజలనెందరినో చూశాను. ఇంకేం। బావులు త్రవ్వించే కార్యక్రమాన్ని చేపట్టాను. నీటికి బాధపడే గ్రామాల్లో బావుల నిర్మాణాన్ని ప్రారంభించేవాణ్ని. మొదట కొన్నాళ్ళు నేనూ మట్టి మోసేవాణ్ని. నన్ను అనుసరించి వందల సంఖ్యలో గ్రామప్రజలు మట్టిమోయడానికి వచ్చేవారు. బావులు తయారయిపోయేవి. మొట్టమొదటిసారి నేను త్రవ్వించిన బావి నీరు ప్రజలు త్రాగుతూండడాన్ని చూసి మహదానందాన్ని పొందాను. చీ రాజ్యం ఎడారి ప్రదేశంకాదు, రెండు మూడు గజాలు తవ్వితే తియ్యని మధురజలం లభిస్తుంది। మరి ఇక ప్రజలు నీటికి ఎందుకు కొరత పడాలి? ఎందుకు మురికి నీటిని త్రాగాలి? రాజ్యం అంతట్లోనూ బావులు త్రవ్వించాను. గ్రామాలకు దూరంగావున్న మార్గాల్లో బాటసార్లు నీరు దొరక్క బాధపడడాన్ని చూశాను. అలాంటి మార్గ మధ్యాల్లోనూ బావుల్ని త్రవ్వించాను. వేసవికాలంలో నేను త్రవ్వించిన బావిదగ్గర కూర్చుని దాహంగొన్న బాటసారులకు స్వయంగా చల్లటి నీటిని అందిస్తూండేవాణ్ని। బాటసారులు దాహం తీర్చుకొని తృప్తిగా వెళ్ళిపోవడాన్ని చూచి జన్మతరించిం దనుకునేవాణ్ని. మొదట నా సేవాకార్యాన్ని ప్రదర్శన మన్నా వాళ్ళున్నారు. కానీ, జీవితాంతం ప్రతిక్షణం సేవా వ్రతాన్ని పాటిస్తున్నప్పుడు ఇక ప్రదర్శనమని ఎలా అనగలరు? ఒక వేళ ఎవరైనా అవివేకులు అన్నా, నేను నా మార్గాన్ని ఎందుకు వీడతాను?

నా సంచార జీవితం ఒక రకంగా అంతమైందనే చెప్పాలి? వెనుకటిలా సుదీర్ఘమైన, సాహసోపేతమైన యాత్రల్ని చేయడం లేదు ఇప్పుడు। యాత్రలు చేయాలనే బలీయమైన కుతూహలాన్ని చీ రాజ్యం లోనే తిరిగి తీర్చుకుంటున్నాను. రోజులూ, నెలలూ, సంవత్సరాలూ దొర్లిపోతూన్నాయి. చీనీ భాష మాతృభాషలా అయిపోయింది. చీనీ ప్రజలుకూడా సన్నిహితు లయ్యారు. అప్పుడప్పుడూ ఈ దేశపు ఇతర భాగాలను కూడా చూడాలనిపిస్తూండేది. కాని, సంఘనాయకుడిని కావడం వలన ఎప్పుడూ బాధ్యతల్లో కర్తవ్యాల్లో మునిగి వుండేవాణ్ని. దూర

ప్రదేశాన్ని చూడ్డానికి వీలుండేది కాదు. సంఘ నాయకుని పదవి నా కాళ్ళకు బంధాల్ని వేసింది. అయితే, ఇందుకు నేనే విధంగానూ బాధ పడటం లేదు. దీనులకూ, దుఃఖితులకూ సేవ చేయడం నా జీవితా దర్శంగా పెట్టుకున్నాను. నా సేవల వలన తేరుకుని విస్ఫారిత వదనులైన రోగులనూ, దీనులనూ, అనాథలనూ చూసిన క్షణాన నేను పడిన శ్రమ కెంతటికి ఫలితం లభించిందనుకునే వాణ్ని.

మానవుల దుఃఖాలను దగ్గరగా, పరిశీలనగా చూసినప్పుడు వాటి కారణాలు చాలా లోతుగా, బలీయమైనవిగా కనపడతాయి. మానవ జీవితాలను దుఃఖమయం చేస్తూన్న కారణాలను వేళ్ళతో సహా పీకివేయండి. దుఃఖాలు శమించవు. వైద్యశాలల్ని కట్టించడం, శరణాలయాల్ని స్థాపించడం, బావులూ, చెరువులూ త్రవ్వించడం. వీటివలన దుఃఖం సమూలంగా ఎన్నటికీ నశించదు. అయినా నా మనస్సుకు కొంత తృప్తి నిస్తున్నా యీ పనులు!

నా ముఖమూ, శరీరపు రంగూ ప్రత్యేకంగా ఉండేవి. ఇక్కడి ప్రజలు నేను అనాగరికమైన పడమటి దేశాలనుండి వచ్చాననుకునేవారు. అప్పుడప్పుడూ నేనూ, బోధిసంఘుడూ రాజధానిని వీడి తూర్పు సముద్ర తీరానికి వెళ్లే వాళ్ళం! అనంతంగా వ్యాపించిన నీలి జలరాశిని చూసినప్పుడు మనస్సు ఉర్రూతలూగేది. భూ మార్గాన ఎంతో ప్రయాణంచేశాను కానీ, జల మార్గాన నామ మాత్రంగానే ప్రయాణం చేశాను. సముద్ర యాత్ర చేయాలన్న బలీయమైన కాంక్ష జాగృత మయ్యేది.

రోగులకూ, అనాథలకూ సేవ చేయడమూ, అహింసా వ్రతమూ. ఈ రెండూ నా జీవితంలోని అభిన్న అంగాలుగా తయారయ్యాయి అయితే, వీటినుండి నేను పూర్తిగా సంతృప్తి పడుతున్నానని మాత్రం చెప్పలేను. నేను చేస్తున్న ఈ సేవా కార్యాల్ని గురించి దీర్ఘంగా ఆలోచించినప్పుడు నా మీద నాకే ఒక రకమైన అవిశ్వాసమూ, అపోహ కలుగుతూంటాయి. ప్రజలు దీనులూ దరిద్రులూ అయితేనే కదా, వాళ్ళకు సేవ చేసే అవకాశం లభించేది నాకు? అంటే పరోక్షంగా ప్రజలు దీనులు కావాలని కోరుకుంటున్నా నన్నమాట? ఇంత కంటె ప్రజలు సకల సంపదలతో సమృద్ధులైవుండి, నాకు సేవ చేసే అవకాశమే

లభించకుండా ఉండడం న్యాయం కాదా ? నాలో ఇలాంటి భావాలు కలగ డానికి ముందు చాలా సంవత్సరాల క్రితమే నేను కూచా నగరంలో పారసీక సాధువుల్ని చూశాను. యేహా నగరంలో పారసీక మతస్థుల మఠం ఉంది. చాంగ్ - అన్ లోని పారసీకుల మఠం చాలా పెద్దది. అక్కడికి ఆ మతానికి సంబంధించిన గొప్ప గొప్ప పండితులు వస్తూంటారు. బౌద్ధ మతంలో మహాయాన సాంప్రదాయం పుట్టుకు వచ్చి నట్లే, పారసీక మతంలోనూ ఓ నూతన సాంప్రదాయం పుట్టుకువచ్చింది. ఈ క్రొత్త సాంప్రదాయాన్ని 'మానీ' అనే ఓ మహా పురుషుడు ప్రవ ర్తిల చేశాడు. ఇతడు గొప్ప మేధావి, పరోపకారి, కళాకారుడు కూడాను. ఇతర పారశీక మత గురువుల్లాగానే ఈ 'మానీ' కూడా బుద్ధుని పట్ల ఎంతో భక్తి శ్రద్ధల్ని కలిగి ఉంటాడు. ఇతడి నూతన సాంప్రదాయాన్ని అనుసరిస్తూన్న సాధువులు కూడా బుద్ధుని పట్ల భక్తి భావాన్ని కలిగి ఉంటారు. బుద్ధ మందిరాలకూ, విహారాలకూ వస్తూంటారు. బౌద్ధ మతం పట్ల శ్రద్ధాశక్తుల్ని కనబరుస్తుంటారు, అయితే బౌద్ధులు వీరివి తిరస్కార దృష్టితో చూస్తూండడం నా మనస్సును ఎంతో బాధించేది. నా సహచరు లైన బౌద్ధ భిక్షువులలోని, వీరిపట్లగల దుర్భావాన్ని మార్చడానికి ఎంతో ప్రయత్నించాను. నేను మాత్రం ఈ పారశీక సాధువులపట్ల గొప్ప స్నేహ భావాన్ని కలిగివుండేవాణ్ణి। సృష్టిలోని నీచాతి నీచమైన ప్రాణికోసరమైనా సరే ప్రాణాల నర్పించడానికి సిద్ధంగా వుండవల్సిన మహాయానుల మైన మేము, పారసీక సాధువులను తిరస్కార దృష్టితో చూడ్డం ఏం సబబుగా వుంటుంది। 'యేహా' నగరపు పారసీకుల మఠంలో మానీ సాంప్రదాయపు సాధువు ఒకడు వున్నాడు. అతడికి నా వయసే వుంటుంది. అతడు తరచుగా తమ మతాన్ని గురించి, తమ ఆదర్శాన్ని గురించి చెప్తూండేవాడు. అతడో మాటు ఒక విషాదాంత గాథను చెప్పాడు. ఆ గాథను విని నేనెంతో వ్యాకులపడిపోయాను. నేను చేస్తున్న సేవాకార్యం పట్ల కొంత అసంతృప్తి కూడా జనించింది.

ఆ పారసీక మిత్రుడి పేరు మిత్రదాత. అప్పుడు నేను యాభై ఏండ్ల వాణ్ణయ్యాను. మిత్రదాతకు కూడా అంతే వయసు వుంటుంది. కొద్దిరోజుల్లోనే మే మిద్దరం అభిన్న మిత్రులమైనాము. నేను చుట్టుపట్ల

గ్రామాలకు వెళ్ళినపుడు సుత్రదాత కూడా నా వెంట వుంటూండేవాడు. అతడొకమాటు ఆ విషాదగాథను ఇలా చెప్పాడు.

"అప్పట్లో నాకు పదేళ్ళ వయస్సు వుండేదనుకుంటాను. మానీ తరువాత ఈ సాంప్రదాయపు గురువుల్లో మజ్దక్ గొప్పవాడు. అతడు ఆజీవనం ప్రజల సౌఖ్యంకోసరం పాటుపడ్డాడు. అతడిలా అనేవాడు: 'రోగులకూ, దీనులకూ సేవ చేయడం గొప్ప విషయమే। కానీ, అందువలన దుఃఖపు మూలకారణాలు నశించవు. దుఃఖం నశించాలంటే మానవుల్లో ఆర్థిక అసమానత వుండరాదు. ఒకడు కడుపునిండా తిని త్రేన్పడమూ, మరొకడు తిండిలేక నకనకలాడటం తగదు. ఈ స్థితిని పోగొట్టినప్పుడే దుఃఖం నశిస్తుంది.' మజ్దక్ ఉపదేశాలు మా దేశంలో గొప్పగా ప్రచారంలోకి వచ్చాయి. గ్రామాలకు గ్రామాలూ, పట్టణాలకు పట్టణాలు మజ్దక్ ఉపదేశాలకు అనుగుణంగా మారిపోయాయి. ఎక్కడ చూసినా సమత్వం ఏకఛత్రంగా దర్శనమీయసాగింది. మా దేశపు చక్రవర్తి కవాత్ గూడా మజ్దక్ మతాన్ని పుచ్చుకున్నాడు. అతడికి అనుయాయి అయ్యాడు. కానీ, పీదలరక్తాన్నిపీల్చుకు త్రాగడానికి అలవాటుపడ్డ ధనికులు ఈ సమానతను ఎలా సహిస్తారు? తమ ఐశ్వర్యం విలుప్తమవడాన్ని ఎలాచూస్తూ వూరుకోగలరు? మజ్దక్ ఆశయాలు ఫలించకుండా వుంచడానికి ధనికులు నిరంతరం ప్రయత్నిస్తూండేవారు. చివరకు వాళ్ళ ప్రయత్నాలు ఫలించాయి. కవాత్ వృద్ధుడయ్యాడు. అతడికొడుకు అన్‌వశకఖాన్(ఖుసరో) ధనికులచేతిలో కీలుబొమ్మ అయ్యాడు. దేశమంతట్లోనూ అతిదారుణమైన హత్యాకాండను జరిపాడు. ఆ హత్యా కాండను తల్చుకుంటే నా శరీరం ఇప్పటికీ గగుర్పొడుస్తుంది. నా కండ్లల్లో ద్వేషాగ్ని జ్వలిస్తుంది. ఎవరినీ ద్వేషించవలదని మా గురువుల ఆజ్ఞ। అయినప్పటికీ ఆ క్రూర హత్యాకాండను తలుచుకున్నప్పుడు ఖుసరోను ద్వేషించకుండా వుండలేను. మా గురువు మజ్దక్—"స్వర్గం ఎక్కడోలేదు. ఈ భూమిమీదనే అవతరిస్తుంది. ఒక మానవుడి రక్తాన్ని మరొక మానవుడు పీల్చే అవకాశం లేనిరోజున ఈ భూతలమే స్వర్గ మవుతుంది।" అనిచెప్పాడు. మజ్దక్ కేవలం ఉపదేశాల్ని ఇవ్వడమే కాకుండా వాటిని ఆచరణలో పెట్టేవాడు. "నీ—నా" అనేభావాన్ని

తీసేయమన్నాడు. 'ఒక్క సంపదలపట్లే కాదు, వివాహ సంబంధంలో కూడా "నీ-నా" అనే భేదం కూడదన్నాడు. వివాహంవల్ల సంతానం కలుగుతుంది. సంతానం వలన పక్షపాతం, 'ఇది నాది' అనే భావం జనిస్తుంది. కనుక వివాహాన్ని మానెయ్యాలి అన్నాడు. మజ్దక్ బోధనలను విని నా దేశీయులందరూ వివాహాల్ని మానేశారు. నా తల్లి నాకు తెలుసు. కానీ నా తండ్రి యెవరో నాకు తెలియదు. మహాహంతకుడు ఖుసరో ఒకనాడు, రాజధానిలో, తన రాజ ప్రాసాదానికి ఎదురుగా మానవ శరీరాలతో ఉద్యానవనాన్ని నిర్మించాడు. స్త్రీ, పురుషుల తలల్ని భూమిలో పాతించి కాళ్ళూ, చేతులను తల్లక్రిందులుగా పైకి కట్టించాడు. ఈ దారుణదృశ్యాన్ని మజ్దక్ శిష్యులకు చూపుతూ "ఇదుగో! ఇదే, భూమీద వెలసిన స్వర్గం!" అన్నాడు. పది, పన్నెండేళ్ళ పిల్లలందర్నీ ప్రోగుచేసివాళ్ళకు ఈ దారుణ దృశ్యాన్ని ప్రత్యేకం చూపించాడు, భవిష్యత్తులో బాలకుల హృదయాల్లో మజ్దక్ ఉపదేశాలేవీ పనిచేయకుండా వుండాలని. మజ్దక్ శిష్యుడనుకున్న ప్రతివాడినీ ఇలాగే దారుణంగా హత్యచేయించాడు. అన్నింటినీ మించి చెప్పుకోవలసింది ఏమిటంటే, ఆ రాక్షసుణ్ణే, ఆ ఖుసరోనే చరిత్రకారులు ధర్మరాజని పొగిడేస్తున్నారు.

మిత్రదాత చెప్పిన విషాద గాథను విన్న తరువాత నా మనస్సు ఘోరంగా వ్యాకుల పడ్డది. మానీ, మజ్దక్, వాళ్ళ సాంప్రదాయాన్ని అనుసరించే ఇతర పారసీక గురువులూ, బుద్ధుడులాగానే ప్రజల దుఃఖాలను బాపాలనుకున్నారు. మహాయానం కూడా అదే మాట చెపుతుంది. 'ప్రపంచంలో దుఃఖితుడైన మానవుడు ఒకడున్నప్పటికీ నీకు నిర్వాణం అనవసరం!' అంటుంది మహాయానం అయితే బుద్ధుడు చెప్పిన మార్గం కంటె, మానీ, మజ్దక్‌లు చెప్పిన మార్గమే ఉచితమైనదనిపించింది. ఆర్థిక సమానత్వం సిద్ధించిందే, ఎన్ని శరణాలయాల్ని పెట్టించినా, ఎన్ని వైద్యశాలల్ని కట్టించినా, ఎన్ని బావుల్ని తవ్వించినా దుఃఖం సమూలంగా నశించుతూన్నటు కనుపించదు.

మిత్రదాత తల్లిని కూడా ఖుసరో అలాగే పాతించాడు. తల్లిని గోల్పోయిన పిల్లలందర్నీ కల్పిత తండ్రులదగ్గిర వదిలాడు. మిత్రదాతను

కూడా ఓ చిన్న సామంతుడికి కొడుకును చేసేశాడు. మిత్రదాతకు తన తల్లి అంటే అపారమైన ప్రేమ! తల్లిని తలక్రిందులుగా పూడ్చిన దృశ్యాన్ని ఇతడు తన కండ్లతో చూశాడు. కాళ్ళు ఆకాశాన్ని చూస్తున్నాయి. రెండుచేతులూ భూమ్మీద చలన రహితంగా పడి వున్నాయి. ఇంతటి ఘోరకార్యాన్ని చేయగలిగినందుకు, ఆ అధము , ఆ ఖుసరో గర్వ పడవచ్చు కానీ, తల్లుల్ని గోల్పోయిన ఆ సంతానం ఎంత తల్లడిల్లిందో ? ఖుసరో ఆ సాంప్రదాయాన్ని అనుసరించే ప్రతి ఒక్కరినీ చంపించి వేశాడు. వారి సంతానాన్ని కల్పిత తండ్రులకు పంచి పెట్టించాడు. ఇలా చేయడం వలన మజ్దక్ భావాలు ఈ సంతానానికి అంటవని అతడి ఉద్దేశం !

మిత్రదాత ఆరు సంవత్సరాలు అలా కల్పిత తండ్రి దగ్గర వున్నాడు. అనుక్షణం అతడికి జీవంలేని తనతల్లి నగ్నశరీరం కనిపిస్తూండేది. తల్లి కల్లో ఇలా చెప్పేదతడికి : "నాయనా, భయపడకు ! ఇవ్వాళ కాకపోయినా, వేయి సంవత్సరాల తరువాత అయినా మజ్దక్ చూపిన మార్గమే మానవ జాతికి కల్యాణాన్ని చేకూర్చగలదు !"

మిత్రదాత క్రమేణా పెద్దవాడయ్యాడు. మానీ, మజ్దక్‌లు చెప్పిందేమిటో తెల్సుకోవా లనుకున్నాడు. కానీ, ఆ దేశంలో వాళ్ళను గురించి తెల్సుకునే అవకాశం ఏమాత్రంలేదు. ఖుసరో చంపేస్తాడన్న భయంతో ప్రజలందరూ మారిపోయారు. తమ ఆశయాల్ని మార్చుకోలేని కొందరు దేశాన్ని విడిచిపోయారు. 17 సంవత్సరాల వయస్సులో మిత్రదాత కూడా తన మాతృదేశాన్ని వదలి హూణ రాజ్యంలోకి వెళ్ళి పోయాడు. మానీ మతానుయాయుల్ని కల్సుకున్నాడు. మానీ, మజ్దక్‌లు చెప్పిన ఆదర్శాలను అవగాహన చేసుకున్నాడు. తరువాత హూణ దేశాన్నుంచి చీనా దేశం వచ్చాడు. ఇక్కడే స్థిరపడిపోయాడు.

ఇతడి గాథను విన్న తరువాత నా భావాలు తిరుగబడ్డాయి. ధనిక-బీద వర్గాలున్న వరకూ మానవజాతి దుఃఖసాగరం నుంచి ఉద్ధరింపబడలేదు. కానీ, ఈ వర్గాలను నశింపచేసి, మానవజాతి నంతటినీ ఏక వర్గంగా తయారుచేయాలంటే, ప్రతిదేశంలోనూ ఒక ఖుసరో తయారు కాడా?

శయాయి కావచ్చును. కానీ, వాళ్లు ఎన్నాళ్ళు ఈ పృథ్వీస్థలిపై స్వర్గం అవతరించకుండా ఆపగలరు? స్వర్గం అవతరించకుండా ఆపే ఖుసరోల సంఖ్య ఎంత వుంటుంది? ప్రేళ్ళమీద లెక్కించవచ్చు వీళ్ళని। మరి స్వర్గం అవతరిస్తే లాభించే ప్రజలసంఖ్య అనంతంగా వుంది. ఈ అనంత ప్రజా సమూహం అజ్ఞానంలో, అంధకారంలో వున్నన్నాళ్ళే ఖుసరోల ఆటలు సాగుతాయి. తథాగతుడు ప్రాణికోటిమీద దయ చూపమన్నాడు. ఎవరినీ ద్వేషించ వద్దన్నాడు. అయినప్పటికీ ఖుసరోలాంటి వారిని ద్వేషించకుండా వుండలేక పోతున్నాను. మిత్రదాత చెప్పిన దారుణ గాథను విన్న తరువాత హృదయంలో అపారమైన ద్వేషం తెర్ల సాగింది. ఈ ద్వేషంలోనే జబ్బుపడ్డాను. కడుపులో విపరీతమైన పోట్లు పుట్టుకువచ్చేవి. పళ్లు బిగబట్టి ఎలాగో పోట్లను అణచుకునేవాణ్ణి. ఆజబ్బుస్థితిలో కూడా నా హృదయంలోని ద్వేషం అలాగే నిలిచి వుంది.

నేను జబ్బు పడ్డానని విని చక్రవర్తి హవు చూ తన రాణిని వెంట పెట్టుకుని నన్ను చూడ్డానికి వచ్చాడు నా మంచం ప్రక్కనే రెండు ఆసనాలు వేశాయి. మహారాజు, రాణి ప్రక్కనే కూర్చుని నా ఆరోగ్యాన్ని గురించి ఎంతో అడిగారు. చక్రవర్తి ఇలా ఒక సాధారణ, అన్యదేశీయ భిక్షువును చూడ్డానికి రావడం అసాధారణమైన విషయం। నేను జబ్బుపడ్డందుకు దుఃఖపడ్డాడు. ఇతడు చీ వంశపు మహా చక్రవర్తి। ఆ వంశపు ఇతర చక్రవర్తుల కంటే ఇతడే ఎక్కువ సంవత్సరాలు పరిపాలించాడు. ఇతడి తరువాత నామ మాత్రపు చక్రవర్తు లిద్దరు కొన్నినెల్లపాటు రాజ్యపాలన చేశారు. అనంతరం 'చీ' రాజ్యలక్ష్మి శాశ్వతంగా అంతరించింది.

చక్రవర్తి ముఖంలోకి ఒకమాటు చూశాను. ఇతడి ముఖంలోనూ ఖుసరో కనుపించాడు. ఇతడు మహారాజు, చక్రవర్తి। మానవ జాతిలోని ఆర్థిక విషమతను పరిపోషించడమే ఇతడి ప్రధానాశయం। మరి నేను ఈ ఆర్థిక విషమతను నిర్మూలించడానికి ప్రయత్నిస్తున్నానని తెలిస్తే అప్పుడూ నన్నిలా గౌరవంగా చూస్తాడా? ఇలా వస్తాడా? ఎన్నటికీ రాడు। ఈ గౌరవం, మర్యాద ఇవన్నీ నేను అతడి ఆశయానికి సహకారి

వని తెలిసిన వరకే. వ్యతిరేకమని తెలిసిన క్షణాన అన్నీ విశ్రమిస్తాయి. చక్రవర్తి నా ఎదురుగా కూర్చున్న ఆ కొద్ది క్షణాల్లోనూ, ఎలాంటి అమర్యాదకరమైన మాట నా నోటి నుంచి వస్తుందోనని చాలా జాగ్రత్త పడ్డాను. ప్రాణాల మీద నా కెలాంటి మోహమూ లేదు. చక్రవర్తి ఎంతో కొంత ప్రజాసేవ చేయడానికి సిద్ధంగా వున్నాడు. అనవసరమైన తిరస్కారంతో కూడిన మాటలు మాట్లాడి అతడిని సేవాకార్యం నుంచి విరతుణ్ణి చేసిన వాణ్ణవుతానని నా భయం।

చాలా రోజులు మంచంలో వున్నాను. గుణమిత్రుడి పట్టుదలా, వైద్యమూ నన్ను బ్రతికించాయి. రోగంలో ఉండగా ఏవేవో వూహలు వూహించే వాణ్ణి। "మానవ జాతిని దుఃఖసాగరంలో ముంచే ఇలాంటి చక్రవర్తులపట్ల సానుభూతి కలిగి వుండడం మంచిది కాదు. అట్లాగని ఎవడో ఒక చక్రవర్తిని తిట్టినందువల్లా, చంపినందువల్లా ప్రయోజనం ఏంటి? ఈ చక్రవర్తి పోతే ఇతడి స్థానంలో మరో చక్రవర్తి వస్తాడు కనుక ఎవడో ఒక చక్రవర్తినో, సార్థవాహుణ్ణో దోషిగా భావించి చంపినందువల్ల ఈ విషమత నశించదు. అసలు చక్రవర్తులూ, సార్థవాహులూ జన్మించడానికే వీలులేని ఓ నూతన వ్యవస్థను నిర్మించాలి. అలాంటి వ్యవస్థను నిర్మించడానికి ప్రజల్ని మేల్కొలపాలి। విజ్ఞాన వంతుల్ని చేయాలి।"

ఈ వూహలవల్లా, నిరంతర తర్కంవల్లా దుఃఖవిరోధానికి ఓ నూతన మార్గాన్ని కనిపెట్టాను. అయితే, నేనా నూతన మార్గాన్ని ఎంత వరకూ అనుసరించానూ. అనేది ప్రశ్న ? నేనసలు ఆమార్గాన్ని అనుసరించనేలేదు. జబ్బునయమయ్యాక కూడా వెనుకటిలాగానే, దీనులకూ రోగులకూ సేవచేస్తూ మిగిలిన జీవితాన్ని గడిపేశాను. జబ్బుపడి లేచిన క్రొత్తలో "అభిధర్మ హృదయశాస్త్రం" అనే గ్రంథా న్నొకదాన్ని అనువాదం చేశాను. దీంతో అనువాదాలు చేయాలన్న కాంక్ష, ఉత్సాహమూ నశించాయి. "మజ్ఝిక్ పరిపృచ్ఛా" అనే స్వతంత్ర గ్రంథా న్నొకదాన్ని వ్రాయడం ప్రారంభించాను. కానీ, నా అనంతరం ఈ గ్రంథం నిలిచి వుంటుందని నేను అనుకోవడం లేదు. నా అనంతర మేకాదు. ఇప్పుడు

మాత్రం ఈ గ్రంథానికి రక్షణవుందా? ప్రభువుల కంటపడకుండా చాలా జాగ్రత్తగా ఈ పనిని సాగిస్తున్నాను. ఈ గ్రంథాన్ని రాస్తున్నాను. ఈ గ్రంథమే గనుక చక్రవర్తి కంటపడితే ఒక్క గ్రంథాన్ని నాశనం చేయడమే కాదు, గ్రంథాన్ని రాసిన కవినికూడా నాశనం చేసేస్తాడు. ఇది నా పిరికితనమనీ, నేను ప్రాణభీతిచే ఇలా చేస్తున్నాననీ ఎవరైనా అనుకోవచ్చును. అది సరికాదు. ప్రస్తుతం ప్రజలకు ఏ కొంతో సేవ జరుగుతోంది. అదీలేకుండా చేయడం న్యాయంకాదు. వర్తమానం నిరాశా జనకంగా వుందని ఒప్పుకుంటాను. కానీ, ప్రజలు నిరాశావాదులు కారు. ఎన్ని కష్టాలకయినా ఓర్చి, భీషణ హత్యాకాండల్ని సహించి, దుఃఖ నివారణకు సరియైన మార్గాన్ని కనుక్కుంటారు. ఈ భూస్థలిపై నిజంగా స్వర్గాన్ని సృష్టిస్తారు!

## 19 వ అధ్యాయం

# స్వాం రుష్యా మారుతం

## (క్రీ. శ. 557-81)

సుఖకరమైన, ప్రశాంతమైన 'యేహో' నగర నివాసం సమాప్త మవడానికి సిద్ధంగావుంది. నేను మరి రెండు గ్రంథాలనుకూడా అను వాదంచేశాను. (క్రీ. శ. 566) "చంద్రగర్భ సూత్రం", (క్రీ. శ. 568) "పితా పుత్ర సమాగమ సూత్రం", అనువాదం చేసేశాను. హావు-చూ చక్రవర్తి తన అంతిమకాలంలో నా కార్యక్రమాలకు బాగా సహక రిస్తూ వచ్చాడు. వెనుకటి సేవా కార్యాన్నే నిర్వహిస్తున్నాము. దుఃఖ నివారణకు అది సరైన మార్గం కాదని నాకు తెలుసు. అయినా, గత్యం తరంలేక అదే కార్యక్రమంలో మునిగి తేలుతున్నాను. ఇన్నాళ్ళలోనూ చీ వంశం పూర్తిగా నిర్బలమైంది. అత్యాచారాలను అరికట్టలేకపోతోంది. దుర్మార్గులయిన అధికారులను శిక్షించ లేకపోతోంది. సామంతులను అదుపులో పెట్టుకోలేక పోతోంది. ఎంత దుర్బలమైనప్పటికీ హావు-చూ ఉన్నంతకాలం రాజ్యం పతనం కాలేదు. హావు-చూ తరువాత అతడి వారసులు అన్-తేహ-వాంగ్ (క్రీ. శ. 567), చూ-చూ (క్రీ. శ. 557) వీ రిద్దరూ కొద్ది నెలలమాత్రమే రాజ్యం చేశారు. ఛాంగ్-అన్ లోని ఛావూ వంశం చీ రాజ్యాన్ని కబళించడానికి అవకాశం కోసం ఎదురు చూస్తోంది. ఛావూ వంశపు కోర్కె ఫలించింది. వూ-తీ (క్రీ. పూ. 561 – 78) అనే మహారాజు చీ రాజ్యాన్ని కైవసం చేసుకున్నాడు. ఇతడి తరువాత ఖూ-యేన్-తీ (క్రీ. పూ. 578–80) సింహాసనా న్నెక్కాడు. రాజవంశాలు మారడం వలన 'యేహో' నగరానికి రాజధాని యోగం తప్పి పోయింది. అయినప్పటికీ,

ఉత్తరదేశపు తురుగులతో సరిహద్దులోవున్న పెద్దనగరం కావటంవల్ల వ్యాపార దృష్ట్యా ఇప్పటికీ ఆ నగరం కొంత ప్రాధాన్యతను కలిగి ఉంది. వూ తి చీ రాజవంశానికి విశ్వాస పాత్రులయినవారి వలన తనకు హాని జరుగుతుం దనుకున్నాడు. అలాంటి విశ్వాస పాత్రులను అణచ డము, నాశనం చేయడం ముఖ్య మనుకున్నాడు. చీ వంశపు విశ్వాస పాత్రుల్లో నేనూ. మిత్రదాశా, గుణమిత్రుడూ—మేము ముగ్గురమూ వున్నాము. వూ–తీ దృష్టి మా మీద కూడా పడ్డది. మేము ముగ్గురం రాజధానిని విడిచి వెళ్ళిపోవాల్సి వచ్చింది. వూ–తీ అనంతరం వేన్–తీ సింహాసనా న్నెక్కాడు. ఇతడు మరీ దారుణాలను చేశాడు. తన వంశపు రాజధాని అయిన ఛాంగ్–అన్‌లోని భిక్షువుల్ని ఏమాత్రం హింసించే వాడు కాదు. కానీ, చీ రాజ్యంలోని భిక్షువుల్ని నానా హింసలు పెట్టాడు. అతడిలా శాసించాడు : "బౌద్ధ భిక్షువుల కార్యక్రమాలన్నింటినీ తక్షణం ఆపేసెయ్యాలి। భిక్షువులూ, భిక్షుణిలూ చీవరాల్ని వదలి గృహస్థులు కావాలి। అలా గృహస్థులుగా నిరాకరించేవారికి ప్రాణదండన విధించబడుతుంది."

నేను ప్రాణాల నివ్వడాని కయినా సిద్ధపడతాను. కానీ, నా సేవా కార్యాన్ని ఆపడం ఇష్టంలేదు. అయితే, నా మిత్రులు నన్నలా చేయ నీయలేదు. చనిపోవడం కంటే బ్రతికవుండి, దేశకాలాల ననుసరించి మళ్ళీ సేవా కార్యాన్ని సాగించడం ఉత్తమమని నామిత్రుల అభిప్రాయం. పైగా నే నిలా ప్రాణత్యాగానికి సిద్ధపడితే నాతోపాటు ప్రాణత్యాగానికి సిద్ధపడేమిత్రులు ఎంతోమంది ఉంటారు. వారందరూ ప్రాణత్యాగం చేస్తే నిజంగానే బహుజనహితం కుంటుపడుతుంది. తాత్కాలికంగా నా కార్య క్రమాల్ని ఆపేశాను. చీవరాన్ని మాత్రం వదల్లేదు. కానీ, చీవరంపైనే గృహస్థుల్లా చొక్కా నొకదాన్ని ధరించేవాణ్ణి. మా వైద్యశాల లన్నిం టినీ మేము చూస్తుండగానే మూసేశారు. 18 సంవత్సరాలపాటు నిరం తరం శ్రమించి మేము స్థాపించిన వైద్యశాలల్నీ, ఆశ్రమాలనూ ధ్వంసం చేసేశారు. కొద్ది రోజుల అనంతరం నేనూ, నా మిత్రులూ 'యేహో' నగరాన్ని వీడవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. చీనా దేశపు వివిధ భాగాలనూ చూడాలన్న నా కోర్కె ఈ విధంగా ఫలించింది. మేము

ఉత్తర చీనా దేశాన్నుంచి దక్షిణ చీనా దేశానికి ఆత్మరక్షణార్థం తరలి వచ్చేశాము.

ఈ దక్షిణ దేశంలో, చావూ వంశం మా కెలాంటి అపకారమూ చేయలేదు. అయితే, మేమూ వలలోనుండి బయటికి విసరబడిన చేపల్లా నిశ్శక్తుల మయ్యాము. ఈ క్రొత్త ప్రదేశంలో మళ్ళీ క్రొత్తగా కార్యక్రమాల్ని ప్రారంభించే సహనమూ శక్తీ నశించాయి. 59 సంవత్సరాల వయస్సులో నేను రహస్య జీవితాన్ని గడపవలసిన వాణ్ణయ్యాను 60 ఏండ్లు నిండేసరికి మానసికంగా ఘోర నిరాశకు గురి అయ్యాను. నా ఆశయాలూ ఆదర్శాలూ అన్నీ శిథిల మయ్యాయి. 60 సంవత్సరం జీవన్మరణాలకు మధ్యన గల సరిహద్దుకు ఆవలి సీమ। 60 సంవత్సరాల వయస్సును దాటిన వ్యక్తి ఇక ఏనాడయినా ఈ జీవితాన్ని చాలించడానికి సిద్ధంగా వుండాలి। అప్పుడిక క్రొత్తగా మళ్ళీ కార్యక్రమాల్ని నిర్మించుకోవడం నావల్ల కాలేదు. 60 సంవత్సరాల వయస్సులో సీ్పత నదికి దక్షిణ తీరాన దిగి నప్పుడు, నేను నిజంగా జీవచ్ఛంలా వున్నాను. నా ఆశయాలూ, ఆదర్శాలూ, ఆకాంక్షలూ అన్నీ నశించాయి. కేవలం శరీరం మాత్రం సజీవంగా ఉంది. నిరంతరం ఒక వూరి నుండి మరొక వూరికి, ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశానికి తిరుగుతూ ఉండేవాణ్ణి. ఎక్కడా ఒక చోట నిలిచే వాణ్ణి కాదు. నా కాళ్లు ఇక ఆజీవనం ఇలా నడుస్తూనే ఉంటాయి. అయితే, ఈ నడకకు ఓ ఆదర్శ మంటూ లేదు. గానుగ ఎద్దు నడకలాంటిది.

భారత దేశంలో లాగానే చీనా దేశంలోనూ ఉత్తర, దక్షిణాల భేదం ఉంది. ఉత్తర చీనా దేశానికి వ్యాపారార్థంగానీ, దోపిడీ చేయడానికి గానీ తిరుగుబోతులు సదా వస్తూ వుంటారు. అనేక శతాబ్దాల పాటు ఉత్తర చీనాను తిరుగుబోతులు పరిపాలించారు కూడాను. ఈ కారణంగా తిరుగుబోతుల అనేక లక్షణాలు ఉత్తర చీనాకు సంక్రమించడం సహజం. కనుకనే దక్షిణ చీనా ప్రజలు ఉత్తర చీనాను కొంచెం తక్కువ దృష్టితో చూస్తుంటారు.

దక్షిణ దేశపు మహానది (యాంగ్ జూ) ఒడ్డున గల ఓ సుందర మైన పట్నం నాన్‌కింగ్. ఈ మహానగరం సమస్త దక్షిణ చీనా దేశా

'యేహో' నగరాన్ని వదలి రెండు సంవత్సరా లయింది. యా(నంగ్ జూ) మహానది ఒడ్డునే వెళ్తున్నాను. ఈ నది వడ్డున ఓ నూతన మైన ప్రదేశాన్ని చూశాను. ఈ ప్రదేశంలో ప్రజల వేష భాషలు చీనీ ప్రజలకు భిన్నంగా వున్నాయి. ఇక్కడి స్త్రీ పురుషులు భారతీయుల్లా తల గుడ్డలు చుట్టుకున్నారు. వీళ్ళను చూడగానే చైతన్యగిరిలోని విగ్రహాలూ, బుద్ధిలుడి మాటలూ జ్ఞాపక మొచ్చాయి. ఒకప్పుడు భారత దేశంలోని స్త్రీలు కూడా ఇలాగే తలగుడ్డలు చుట్టుకునే వారన్న మాట! మరి ఈ ఆచారం భారతదేశాన్నుండి ఇక్కడికి ఎప్పుడు వచ్చిందో? వీళ్ళు తమది గాంధార దేశమని చెప్తారు. గాంధారం మా పొరుగు దేశం! గాంధార దేశపు పురుషపురం, తక్షశిలా మా కెంతో పవిత్రమైనవే కాక, బాగా పరిచయమైన పట్నాలు కూడాను. వీళ్ళు బుద్ధ భక్తులు. ఈ ప్రదేశంలో అడుగు పెట్టగానే నా మాతృదేశమైన భారతదేశం స్ఫురణ కొచ్చింది. అయినా, నేను ఇక్కడా నాలుగయిదు రోజులకు మించి ఎక్కువ వుండ లేదు.

సుదీర్ఘమైన ఈ యాత్రలో ఎన్నో నూతనమైన అనుభవాల్ని పొందాను. ఒకప్పుడు బుద్ధుడు భిక్షువుల్ని ఉద్దేశించి "ఖడ్గ విషాణంలా ఒంటరిగా యాత్రచేయం డన్నాడు. భిక్షుసంఘంతో కలహించి బుద్ధుడు కూడా కౌశాంబీ నుండి ఒంటరిగానే వెళ్ళాడు.

నేనూ నా సహచరులైన మిత్రుల్ని వదలి ఒంటరిగానే పయనిస్తు న్నాను. నేను దరిద్రుణ్ణి! నా భిక్షపాత్రలో కనీసం రేపటి కయినా ఆహారం వుండదు. నా చీవరం చివిగిపోయిన పాత గుడ్డలతో కుట్టు కున్నది. నాలాంటి అకించనుణ్ణి ఏ దొంగలూ దోచరు. ఒక వేళ, ఎవరి కైనా అనుమానం వేసి "ఈ భిక్షువుపైకిలా వేషం వేసుకున్నాడు. ఇతడి దగ్గిర బంగారం వుంది!" అనుకుని అడ్డు తగిలితే, చీవరాన్ని భిక్షా పాత్రనూ జోలెలోని బుద్ధిలుడు తన చేత్తో వ్రాసిన ప్రతినీ ముందు పడేసేవాణ్ణి! "వీటిలో మీకు ఏదైనా పనికి వస్తే తీసుకోండి!" అనే వాడిని. కానీ, ఇంత వరకూ ఎవరూ వాటిని తీసుకోలేదు. మధ్యాహ్న సమయాల్లో భోజనం అయ్యాక, బుద్ధిలుడు వ్రాసి ఇచ్చిన ప్రమాణ శాస్త్ర

గ్రంథాన్ని చదువుకుంటూ ఏ చెట్టు కిందో పడుకునే వాణ్ణి! బుద్ధిలుడు వ్రాసిన అందమైన అక్షరాలను చదువుతూ వుంటే అతడి ఆకారం కండ్లకు కట్టేది. మనస్సులోనే ఇలా అనుకునేవాణ్ణి: "మిత్రమా! నీ కోర్కెను సఫలం చేద్దామనే ఈ దేశం వచ్చాను. నీ దృష్టికి, అన్యుల దృష్టికి, నేను సఫలుడిగా కనుపించ వచ్చును. కానీ, నా వరకూ నేను సంతృప్తి పడలేకుంగా వున్నాను. అసలైన దుఃఖం అంటే ఏమిటో తెలుసుకున్నాను. ఈ దుఃఖాన్ని నివారించడానికి మార్గాన్ని కనుక్కో లేకుండావున్నాను. ఒకవేళ కనుక్కున్నా ఆ మార్గాన్ని అనుసరించలే నేమో! నువ్వూ నాకు చేదోడుగా వున్నట్టయితే, ఈ నూతన దుఃఖ నివారణకు మార్గాన్ని కనిపెట్టేవాళ్ళం! మనం కనిపెట్టిన మార్గాన ధైర్యంగా నడిచే వాళ్ళం!"

నేను (యాంగ్ జా) మహానదిని దాటి, దక్షిణంగా వున్న మహా సరోవరాన్ని చేరాను. సరోవర ప్రాంత ప్రకృతి మనోహరంగా వుంది. ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ ఇక్కడే కొద్ది రోజులు గడుపుదా మనుకున్నాను. సరోవరం సమీపంలోగల ఒక సంఘారామంలో వుండ సాగాను. బౌద్ధ భిక్షువులమీద ఘోరంగా అత్యాచారాల్ని జరిపిన చావూ వంశం అంతరించిందని నా కిక్కడే తెలిసింది. చావూ వంశపు మహా మంత్రి ఒకడు ఆ వంశాన్ని అంతంచేసి వేన్-తీ (క్రీ. శ. 581-605) అనే పేరుతో తానేస్వయంగా సింహాసనాన్ని అధిష్ఠించాడు. సు-ఈ అనే క్రొత్త రాజవంశాన్ని స్థాపించాడు. ఇతడి రాజధాని ఛాంగ్-ఆన్! చావూ వంశం అంతమైందని విని నేనూ, నాతోపాటు సంఘారామంలోని ఇతర భిక్షువులు కూడా ఆనందించారు. క్రొత్త రాజవంశం అధికారంలోకి వచ్చిందని వినగానే, తిరిగి ఉత్తరదేశం వెళ్ళి బహుజన హితం కోసం ఏమైనా చేద్దామన్న వూహలు కలుగ సాగాయి నాలో! నేను సరోవర ప్రాంతం నుండి వెనక్కి తిరిగి నదిని దాటాను. ఉత్తర దేశానికి అభిముఖంగా ప్రయాణం చేస్తున్నాను. వేన్ తీ చక్రవర్తి కేవలం చావూ వంశపు రాజ్యంతోనే తృప్తిపడలేదని ఉత్తర దక్షిణ దేశాల్ని ఏకఛత్రం క్రిందకు తీసుకు రావాలని సంకల్పించు కున్నాడనీ తెల్సింది.

ఇక నేను రహస్య జీవితాన్ని గడప నవసరం లేదు. నేను సు-ఈ వంశపు మహా సామ్రాజ్యానికి అభిముఖుడనై వెళ్ళిపోతున్నాను. ఈ లోపు వేన్ - తీ కి నా గురించిన సమాచారం అందింది. అతడు సింహాసనాన్ని అధిష్టించిన రెండవ సంవత్సరంలో నన్ను తన రాజధానికి రావలసిందని ఆహ్వానించాడు. నేను ఛాంగ్ - ఆన్ వైపు నడిచాను.

## 20 వ అధ్యాయం

# జీవన సంధ్య

(క్రీ. శ. 582-89)

ఛాంగ్ ఆన్ మహానగరాన్ని వెనక్కూడా ఒకటి రెండు మార్లు చూశాను. అయితే, ఈ మహానగరంలో నివసించాలనే ఉద్దేశంతో రావడము మాత్రం ఇదే మొదటిసారి! ఇక నీ జీవితం ఈ నగరంలో అంతమైపోతుందేమో! ఇప్పుడు నాకు 63 వ సంవత్సరం నడుస్తోంది. వయస్సు పెరిగిన కొలదీ యాత్రలు చేయాలనే ఆసక్తే నశిస్తోంది, నాలో! చీనా దేశంలో ప్రప్రథమంగా నిర్మింపబడిన విహారం పేరు శ్వేతాశ్వ విహారం. ఈ విహారం లోయాంగ్‌లో కట్టబడ్డది. మా అందరికీ మార్గదర్శకుడైన కాశ్యపమాతంగుడు ఈ విహారంలోనే చాలా రోజులు వున్నాడు. అనేక గ్రంథాలను అనువాదం చేశాడు. బౌద్ధమత ప్రచారానికి నాందీ వచనాన్ని వలికాడు. చీనా దేశంలో బౌద్ధమత ప్రచారం చేసిన ప్రప్రథమ భారతీయు డితడే! అయితే ఛాంగ్-ఆన్ నగరమూ లోయాంగ్ కంటే ఏ విధంగానూ తీసిపోదు. లోయాంగ్, ఛాంగ్-ఆన్, నాన్‌కింగ్-ఈ మూడు మహా పట్టణాలూ బౌద్ధమత ప్రచారానికి కేంద్రాలుగా ఉపయోగపడ్డాయి. సు-ఈ వంశపు యాంగ్ చక్రవర్తి దూరదృష్టి కలవాడు. రాజు ప్రజల ధార్మిక విశ్వాసాలను బలవంతాన అణచరాదని ఇతడికి తెలుసు. వెనుక పరిపాలించిన రాజ వంశాల పొరపాట్లను అర్థం చేసుకున్నాడు. పైగా, భారతదేశపు మహా చక్రవర్తులయిన, అశోకుణ్ణీ, కనిష్కుణ్ణీ ఆదర్శంగా పెట్టుకున్నాడు. పై ఇద్దరు భారతీయ చక్రవర్తులూ బౌద్ధ మతాభిమానులై యుండి కూడా అన్యమతాల్ని, అన్యమత విద్వాంసుల్ని ఆదరించారు. ఏ ఇతర మతంపట్లా ద్వేషాన్ని ప్రకటించలేదు. భారతీయ

సామ్రాట్టులను ఆదర్శంగా పెట్టుకోవడమే చీనీ చక్రవర్తుల అతిప్రధాన మైన కర్తవ్యమని భావించాడు. తను అలాగే ప్రవర్తించాడు.

బౌద్ధమతంపట్ల ద్వేషంగలవారు "ఈ మతం విదేశీయ మతం" అనవచ్చును. కానీ, బౌద్ధమతం దేశ కాలాల బంధనాలకు అతీతమైంది. ఏ ఒక్క దేశానికో సంబంధించింది కాదు. ఆ మత ఆదర్శం సమస్త మానవుల హితసాధన. అదీకాక, మే మెన్నడూ, చీనీ ప్రజలతో వాళ్ళ జాతీయతను, వ్యక్తిత్వాన్ని చంపుకుని భారతీయులు కండని చెప్పలేదు.

యాంగ్ చక్రవర్తి దూరదృష్టికలవాడని చెప్పాను. అతడు చావూ వంశాన్ని సమాప్తం చేయడంతో తన కర్తవ్యం తీరిందనుకోలేదు. దక్షిణ దేశాన్ని పాలిస్తూన్న హో-చూను పదభ్రష్టుణ్ణిచేసి ఉత్తర దక్షిణ దేశాలను ఏకం చేశాడు. అతడు ప్రజల నుద్దేశించి "రాజవంశాలు మార వచ్చును. కానీ, దేశం మారదు. తమ వంశపు స్వార్థంకోసం దేశాన్ని విభజించడం తప్పు. నా సు-ఈవంశం శాశ్వతంగా వుంటుందని నేనేమీ అనుకోవడం లేదు. అలా అనుకునే మూర్ఖుణ్ణి కూడా కాదు. నా తరువాత వాళ్లసమర్థులే అవుతారని ఎక్కడుంది? దుర్బలులూ, అసమర్థులూ కావ చ్చును. కనుక ఉత్తర దక్షిణా లనే విభేదం లేకుండా చీనా దేశమంతా ఏక ఖండంగా వుండాలని నా తలంపు" అనేవాడు.

యాంగ్ చక్రవర్తి ఊరక చెప్పడమే కాకుండా తన ఆలోచన లను కార్యరూపంలో పెట్టడానికి ఉత్తరదేశపు స్ఫీతనది నుంచీ, దక్షిణ దేశపు మహానది వరకూ కాలువను త్రవ్వించాడు. ఈ కాలువ పొడవు మూడు వేల లీలు. [1000 మైళ్ళు] ఈ కాలువను త్రవ్వడానికి మూడు లక్షలమంది దాకా పనిచేశారు. యాభై వేలమంది సైనికులు పర్యవేక్ష కులుగా వున్నారు. పదిహేను సంవత్సరాలు దాటిన ప్రతివారూ అని వార్యంగా పనిచేయాలని శాసించాడు. ప్రజలతో అతి నిరంకుశంగా పని చేయించాడు. ఈ నిరంకుశచర్య వలన ప్రజలు వర్ణనాతీతమైన బాధల్ని అనుభవించారు. ఎంతో మంది మృత్యువాత పడ్డారు. అయినా చక్రవర్తి తన పట్టుదలను వదల్లేదు. నిజంగానే, అనుకున్నదాని కంటే త్వరగా కాలువ తయారయింది.

కాలువ పూర్తిగా తయారయ్యాక, యాంగ్ చక్రవర్తి మహా వైభవంతో వేయి మైళ్ళ పొడవునా వూరేగాడు. రాజ ప్రసాదాల్లాంటి వైభవోపేతమైన నావలు యాభై దాకా పాల్గొన్నాయి. వీటిలో ప్రత్యేకం చక్రవర్తికో నౌక వుంది. ఈ ప్రత్యేక నౌక ముప్ఫై బారల ఎత్తూ, కొన్ని వేల బారల పొడవూ వుంది. ఇందులో రత్నాలతో అలంకరించిన గదులూ శాలలూ, ఎన్నో వున్నాయి. రాణీగారి నావకూడా ఇలాగే రత్నాలతో అతి సుందరంగా అలంకరించబడ్డది. నౌకర్లందరూ కూడా బంగారంతో. రత్నాభూషణాలతో అలంకరించుకున్నారు. భిక్షువులకు ఒక నౌకా, భిక్షిణులకు ఒక నౌకా ప్రత్యేకం వున్నాయి. నేను పరదేశీయులకు స్వాగతం ఇచ్చే ప్రముఖ పదవిలో వున్నాను. భిక్షువుల నావకు నేను పెద్దను. నాతోపాటు జినగుప్తుడు, గౌతమ ధర్మజ్ఞాని, వినీతరుచి (ఇతడు నా జన్మస్థానమైన ఉద్యానవాసి), యాభై నావలూ, విశాలమైన కాలువ మధ్యలో, రాజ ప్రసాదాల్లా అలంకరింపబడి, తేలుతూ వెడుతూన్నాయి. అనేక వేలమంది మెరిసిపోయే పట్టు వస్త్రాలను ధరించి, పట్టు తాళ్ళతో నావలను లాక్కు వెళ్తున్నారు. కనుచూపు మేరకు ఎటుచూసినా సుఖ సంతోషాలే దృష్టి గోచరం కావాలన్న ఉద్దేశంతో పట్టు వస్త్రాలను ధరించిన వేయిమంది సుందరీమణులను నియమించాడు. వీళ్ళ నావలు లాగే పురుషుల్తో పరిహాసాలాడుతూ పరిసరంలో ఆనందోత్సాహాలను నింపు తున్నారు. ఈ జలయాత్ర వేసవిలో జరుగుతుందని ముందే నిర్ణయం జరిగింది. అప్పుడు నావల్ని లాగే వారిని ఎండ బాధించ వచ్చును ? చక్రవర్తి కాలువకు రెండు ప్రక్కలా, మూడు వేల లీల పొడవునా వేరీ వృక్షాలను పెంచేట్లు చేశాడు. ఒక్కో వేరీ మొక్కను నాటిన వాళ్ళకు 26 గజాల పట్టు వస్త్రాన్నిస్తానని ప్రకటించాడు. ఒక్క సంవత్సరం లోపల స్పీత నది నుండి, దక్షిణపు మహానది వరకూ 3000 లీల పొడవునా వేరీ వృక్షాలు మొలుచుకు వచ్చాయి. నడి వేసవిలో, చల్లని వేరీ చెట్ల నీడన, మొట్ట మొదటి సారిగా, ఉత్తర చీనా నుండి దక్షిణ చీనాకు జల మార్గాన ప్రయాణం చేశాడు. ప్రయాణంలో సుగంధ ద్రవ్యాలను కూడా ప్రచురంగా వాడారు. నావలు వెళ్ళిన తరువాత కొన్ని ఘడియల వరకూ

సువాసన పరిసరంలో అలముకుని వుండేది। ఈ అద్భుతమైన జల యాత్రను చూడ్డానికి ప్రజలు ఇసుక వేస్తే రాలకుండా వచ్చేవారు. యాంగ్ మహారాజు కాలువకు రెండు వైపులా అక్కడక్కడా ప్రాసాదాలను కూడా నిర్మించాడు,

ఈ మహా వైభవోపేతమైన అద్భుత జలయాత్రను నేను నా కండ్లతో చూస్తున్నాను. కానీ, ఆనందించ లేక పోతున్నాను. ఒకే ఒక ప్రశ్న నా బుర్రలో మారు మ్రోగుతోంది. "ఈ కాలువను త్రవ్వి ఈ విభవాన్ని సృష్టించిన మానవులకు ఈ జల యాత్ర వల్ల ఏమైనా ప్రయోజనం కలిగిందా? వారి దుఃఖం ఏమాత్రమైనా శమించిందా?"

నేను ఛాంగ్-అన్‌కు వచ్చిన మూడు సంవత్సరాలకు జిన గుప్తుడు కూడా ఛాంగ్-అన్‌కు వచ్చాడు. అన్ని విషయాలలోనూ మా ఇద్దరి భావాలూ కలుస్తుంటాయి. ఈ అతి వైభవం అతడి మనస్సునూ బాధించింది. జ్ఞాన గుప్తుడికి ఈ ఆడంబరం నచ్చలేదు. ఎవరికి నచ్చినా నచ్చక పోయినా ఉత్తర దక్షిణ దేశాలను ఏకం చేయాలని పట్టుపట్టిన యాంగ్ చక్రవర్తిని ఎవరు ఆపగలరు? ఏమైనప్పటికీ చావూ వంశపు ఘోర అత్యాచారాలకు గురియైన బౌద్ధ మతానికి తిరిగి ప్రాణ ప్రతిష్ట చేశాడు యాంగ్ చక్రవర్తి.

జినగుప్తుడు నేను పుట్టిన పది సంవత్సరాలకు పురుషపురంలో జన్మించాడు. వయస్సులో నా కంటె చిన్నవాడు కావడం వల్ల నన్ను సొంత అన్నగారిలా భావించేవాడు. నేను మాత్రం అతణ్ణి విద్యా జ్యేష్ఠుడనుకునే వాడిని. అతడి తండ్రి రాజోద్యోగి. బుద్ధ భక్తుడు కావడం వల్ల కొడుకును ఏడవ ఏటనే మహావన విహారంలో శ్రమణుడిగా చేర్పించాడు. వయస్సు వచ్చాక జిన యశుడు ఉపాధ్యాయుడుగా, జ్ఞానభద్రుడు ఆచార్యుడుగా భిక్షు దీక్షను స్వీకరించాడు జినగుప్తుడు. త్రిపిటకాలనూ పఠించాడు. కవిత్వ అభిరుచి కూడా బాగానే వుంది. 27 సంవత్సరాల

వయసొచ్చాక మత ప్రచారార్థం విదేశ యాత్రల్ని ప్రారంభించాడు. మొదట గాంధార దేశాన్నుండి కపిషాకు వెళ్ళాడు. అక్కణ్ణుంచి హిమాలయాన్ని దాటి కాంశ్య దేశంమీదుగా చీనాదేశానికి రావాలని సంకల్పించుకున్నాడు. సంకల్పాన్ని కార్యరూపంలో పెట్టాడుకూడాను. మొత్తం పదిమంది ఈ యాత్రలో పాల్గొన్నారు. కానీ, ఛాన్ చావూ వరకు వచ్చేసరికి నలుగురు మాత్రమే మిగిలారు. ఆరుగురు చనిపోయారు. జినగుప్తుడు మూడు సంవత్సరాలపాటు ఈ ఛాన్ చావూలో వున్నాడు. తరువాత చావూవంశపు చక్రవర్తి మింగ్ పరిపాలిస్తున్న సమయంలో ఛాంగ్ అన్‌కు వచ్చి, చావూ-యాంగ్ విహారంలో దిగాడు. మొదట్లో సుఖంగా గడిచినా, తరువాత చీనాదేశాన్ని వీడి వెళ్ళవలసిన వాడయ్యాడు. (క్రీ. శ. 572-82లో) త్యోర్కు-రాజ్యం గుండా మాతృదేశానికి ప్రయాణం చేశాడు. త్యోర్కు-మహారాజు యిన తోపాఖాన్ జినగుప్తుణ్ణి తన రాజ్యంలో వుండి ధర్మప్రచారం చేయవలసిందని ప్రార్థించాడు. జినగుప్తుడు తన అనుచరులైన జినభద్ర, జినయశులతో త్యోర్కు-రాజ్యంలో పదిసంవత్సరాలు వున్నాడు. ఇంతలో చావూ వంశం పతనమైందనీ,సు-ఈ వంశం అధికారాన్ని చేపట్టిందని తెల్సింది. మళ్ళీ వెనక్కు తిరిగి చీనాదేశానికి వచ్చాడు. వెనుక యీ దేశంలో వున్నప్పుడు మూడు వేల శ్లోకాలుగల నాలుగు గ్రంథాలను అనువాదం చేశాడు. ఈ మాటు కూడా జినగుప్తుడు తన సమయాన్నంతా అనువాదంకోసమే వినియోగించాడు. జినగుప్తుడు గొప్పపండితుడు. చీనీ, తుర్కీ-రెండు భాషల్లోనూ అతడు అపారంగా జ్ఞానాన్ని సంపాయించాడు. నేను మొత్తం 15 గ్రంథాలను అనువాదం చేశాను వాటి మొత్తం శ్లోకాలు సంఖ్య 50 వేలుంటుంది. జినగుప్తుడు 175 లక్షల 50 వేల శ్లోకాలను అనువాదం చేశాడు. అశ్వఘోషుడి బుద్ధ చరితాన్ని అతిసుందరంగా అనువాదం చేశాడు. పాఠకులకు మూలగ్రంథాన్ని చదువుతూన్న అనుభూతి కలుగుతుంది. "సద్ధర్మ పుండరీకం" లాంటి సూత్రాలను కూడా ఎన్నిటినో అనువాదం చేశాడు. నేనీ మాటు ఛాంగ్-అన్‌కు వచ్చాక అనువాదాల్ని చేయలేదు. వెనుక

చేసినవే 45 వేల శ్లోకాలుగల ఎనిమిది గ్రంథా లున్నాయి. వాటితోనే సంతృప్తిపడి వూరుకున్నాను. *

ఒక్క జినగుప్తుడూ, నేనే కాదు వేల సంఖ్యలో భారతీయ బౌద్ధ భిక్షువులు చీనా దేశానికి వచ్చారు. మత ప్రచారాన్ని చేశారు. ఇన్ని వేల మంది అనువాదాలే చేయలేదు. కొందరు వైద్యులుగా పరులకు సేవచేస్తూ జీవితాన్ని గడిపారు. కొందరు అధ్యాపక కార్యాన్ని నిర్వహించారు. మరి కొందరు కేవలం ఉపన్యాసాల నిస్తూ ధర్మ ప్రచారానికి సహకరించారు. గ్రంథానువాదాల్ని చేయకపోయిన మాత్రాన వీరిని మర్చిపోవడం తగదు. మేము అనువాదం చేసిన గ్రంథాల్లో ఏవైనా భవిష్యత్తరాల వారికి లభించి, చీనా దేశంలో జరిగిన బౌద్ధమతప్రచారం సందర్భంగా మమ్మల్ని జ్ఞాపకం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడ్డప్పుడు, అనామకులుగా, అసంఖ్యాకులుగా వున్న పై భిక్షువుల్ని కూడా జ్ఞప్తికి తెచ్చుకోవడం ఉచితమూ, న్యాయమూ అనుకుంటున్నాను.

* * * *

---

*జినగుప్తుడు అనువాదం చేసిన గ్రంథాల్లో ఇప్పటికీ నిలిచివున్న గ్రంథాలు: 1, 'సద్ధర్మ పుండరీక' 2. 'నానా సంయుక్త మంత్రసూత్ర'. నరేంద్ర యశుడు అనువాదం చేసిన గ్రంథాలు: 1. సూర్య సూత్రం, 2. మంజుశ్రీ విక్రీడిత సూత్రం, 3. మహామేఘసూత్రం, శ్రీగుప్తసూత్రం, 5. బల వ్యూహ సూత్రం, 6. శతబుద్ధసూత్రం, 7 స్థిరమతి సూత్రం.

# ఉపసంహారం

నరేంద్రుడిక లేడు. ఇహ జీవన యాత్రను చాలించాడు. వేన్-తీ రాజ్యానికి వచ్చిన ఎనిమిదవ సంవత్సరంలో (క్రీ. శ. 589) ఒకనాడు సహజంగా కూర్చున్నవాడు కూర్చున్నట్టు కన్ను మూశాడు. ఏ జబ్బూ లేదు. పండు పండి రాలినట్టయింది. నా పేరు జినగుప్తుడు. నా మీదవుండే ప్రేమ వల్ల నరేంద్రుడు నా గురించి పొగుడుతూ వ్రాశాడు. అతడిచే పొగడ్తల్ని పడసే యోగ్యత నా కేవిధంగానూ లేదని అనుకుంటున్నాను. అతడు చేసిన మహాయాత్రలముందు నా యాత్ర ఎంత? నేను పడ్డబాధలు మాత్రం ఏమున్నాయి? ఇక గ్రంథానువాదాలంటారా? అతడు తలచుకుంటే నాకంటె కూడా ఎక్కువ శ్లోకాలను అనువాదం చేసేవాడు. నరేంద్రుడు అవలోకితేశ్వరుడి లాగానే (క్వాన్-యిన్) దయాసముద్రుడు. అతడు తన యాత్రానుభవాల్ని, భవిష్యత్తరాలవారి ఉపయోగార్థం గ్రంథస్థం చేశాడు.

నరేంద్రుడు 'అజాత శత్రువు' అనతగినవాడు. నేను గాంధార దేశంలో పుట్టాను. నరేంద్రుడు ఉద్యానదేశవాసి. గాంధారం, ఉద్యానం రెండూ ఇరుగు పొరుగు దేశాలు. కనుకనే మా స్నేహం ఇంత ప్రగాఢమైంది. నరేంద్రుడి స్నేహాన్ని, వాత్సల్యాన్ని పొందటానికి అందరూ సమానులే. మానవుల పట్లేకాకుండా, సమస్త జీవరాసులపట్లా అతడు అపారమైన దయను ప్రదర్శిస్తుండేవాడు. కానీ అతడు నా పట్ల తన పొరుగు దేశస్థుడన్న ప్రత్యేకమైన శ్రద్ధనూ, అభిమానాన్నీ ప్రదర్శిస్తూండేవాడు. సమదర్శి, దయామయుడూ అయిన నరేంద్రుని గురించి పై వాక్యాన్ని వ్రాసినందుకూ, వ్రాయవలసి వచ్చినందుకూ చాలా బాధపడుతున్నాను అయినా, చంద్రుడిలోని మచ్చలా అతడి మహోన్నత వ్యక్తిత్వపు సౌందర్యాన్ని పై వాక్యం ఇనుమడింప చేస్తుందే గాని, హీనపరచదని అనుకుంటున్నాను.

నరేంద్రుడు చనిపోయాడన్న వార్త క్షణంలో రాజధానిలో వ్యాపించింది. రాజధానిలో ప్రజలందరూ శవయాత్రలో పాల్గొన్నారు. ఖిన్న వదనులై, సాశ్రునేత్రాలతో అందరూ శవం వెంట నడిచారు.

శవయాత్రలో పాల్గొన్న వాళ్ళల్లో వివిధ వర్గాలకూ, వృత్తులకూ, చెందిన వారే కాక, వివిధ దేశాల ప్రజలు కూడా వున్నారు. తోయ్యరుక్రా, కూచీ కుస్తన్, తుఖార్ మొదలుగా గల అనేక దేశాల ప్రజలు కన్నీరు కారుస్తూ శవయాత్రలో పాల్గొన్నారు. నరేంద్రుడి శవానికి యథావిధిగా దహనక్రియలు జరిపాము. అతడి అస్తి ధాతువు:తో స్తూపాన్నొక దాన్ని నిర్మించాము. అతడి జ్ఞాపకాలను శాశ్వతం చేయడానికి అవసరమైన జాగ్రత్తలను తీసుకున్నాము. నరేంద్రుడు లేడుకనుక సరిపోయింది. అతడుంటే మమ్మల్నిలా చేయనిచ్చే వాడుకాదు. అతడికి శాశ్వతత్వం మీద నమ్మకం లేదు. క్షణికవాది. సర్వప్రాణులూ సుఖంగా వుండాలన్నదినరేంద్రుని మహోన్నత ఆదర్శం.

